శ్రీరామ

# కంబరామాయణము

## (ప్రథమ సంపుటము)



శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి

శ్రీరామ

# కంబరామాయణము

(ఆంధ్రానువాదము)

ప్రథమ సంపుటము

(బాలకాండము నుండి కిష్కిందాకాండము వఱకు)

గ్రంధకర్త :

పూతలపట్టు శ్రీరాములు రెడ్డి



మహాకవి ఆంధ్రకంబర్

సాహిత్యరత్నాకర విద్వత్ కవికుల తిలక

# శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు

జననము 05-04-1892 మరణము 08-11-1971



పూతలపట్టులో ఏర్పాటు చేయబడిన శ్రీ పూతలపట్టు
శ్రీరాములు రెడ్డిగారి కాంస్య విగ్రహ ఆవిష్కరణోత్సవము.

# అక్షరాంజలి

సరస్వతీపుత్ర, మహాసహస్రావధానస్థాపనాచార్య
**డా॥మేడసాని మోహన్,**
డైరెక్టర్, అన్నమాచార్య ప్రాజెక్ట్, టి టి డి

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.

హైందవ సంస్కృతిని మహత్తరంగా ప్రభావితం చేసిన మహేతిహాసం రామాయణం. అన్ని భారతీయ భాషలలోను రామాయణ మహా కావ్యాన్ని ఎందరో మహా కవులు రచించారు. తమిళ వాఙ్మయంలో కంబరామాయణానికి మంచి పేరు ప్రఖ్యాతులున్నాయి. పూతల పట్టు శ్రీరాములు రెడ్డిగారు కంబరామాయణాన్ని అనువాదం చేశారు. అనువాద కావ్యమైనా గాని కవితా శిల్పాన్ని సౌందర్య బంధురంగా ఆవిష్కరించడంలో సంపూర్ణ కృత కృత్యులైనారు. ఊహలపోహళింపులోనూ, శబ్ద సంయోజనంలోను, సన్నివేశ కల్పనంలోను, సర్వకవితాంగాలలోను శ్రీరాములు రెడ్డిగారి కవితా రూప తపస్సు లోకోపకారకమై వాసికెక్కింది. అయోధ్యా నగర వర్ణన సందర్భంలో ఈ క్రింది పద్యం ఎంత ప్రసన్నరమణీయంగా భాసిస్తూ ఉందో రసజ్ఞులు పరిశీలింపగలరు.

ధరణీదేవి ముఖాబ్జమో! తిలకమో! తన్నేత్రమో! దివ్యసుం
దర భద్రాయతమాత్రమో! కుచతటోదంచన్మణీ హారమో!
వరజీవస్థలమో! రమావసతియౌ పద్మంబొ! శ్రీ విష్ణుపే
రురమో! కౌస్తుభహేమ పేటికయొ! దేవౌకంబు పై లోకమో!

మూలంలోని భావాలకు తెలుగుదనాన్ని సంతరించి, ప్రాబంధిక శయ్యా విశేషంతో సొగసులు దిద్దారు. ప్రసన్నమై, ధారాళధారానిరూఢమై, రామాయణ కథా సన్నివేశానుకూలమైన శయ్యాపాక సౌభాగ్యాలతో పూతల పట్టు శ్రీరాములు రెడ్డిగారి కవితాశైలి రసజ్ఞులను రసానందాను భూతి కలిగిస్తుంది.

యాగపటలంలోని వామనచరిత్రలో వామనమూర్తి వర్ణన చూద్దాం
శ్యామల వర్ణుఁడున్ మహితీ సాత్త్వికుడైన రమేశుఁడంతఁద
త్త్యామలవేది మూడు సమయంబుల చర్య లెఱుంగువాఁడు, దై
త్యామర తాతకశ్యపున కర్మిలి పుత్త్రకుఁడై జనించి తా
వామనుఁడయ్యె నింత దలఁపన్ వట బీజము న్యాయమొప్పఁగన్

పద్య రచన ఒక మహత్తర కళ. పద్య విద్యా సంప్రదాయ నిష్ణాతులకే ఈ కళాదీప్తి వశమౌతుంది. ఈ శిల్పవిన్యాసంలో సారళ్యం, సౌకుమార్యం, ప్రసన్నత సాధించాలంటే వాఙ్మయ తపస్వికే సాధ్యం. పూతలపట్టు శ్రీరాములు రెడ్డి గారు వాఙ్మయ మహా తపస్వియనుట స్వభావోక్తి.

సీతారాముల పరస్పర వీక్షణ సన్నివేశంలో సీతాదేవి సౌందర్య సాక్షాత్కారం, ఆ దేవి జగన్మనోహన విన్యాస విభ్రమం – ఇత్యాదులను వర్ణించుటలో మృదుమధురములైన పదముల పొందిక, తలఁపుల మేళవింపు, ఝటితితాత్పర్య స్ఫురణం – ఎంత మనోజ్ఞంగా భాసింపజేశారో చూడండి.

పొగడఁడొడంగుచోఁబలుకు బోటి మగండగు బ్రహ్మయాదిగా
మిగిలిన సత్కవీంద్రులుపమించి వచించెడు లక్ష్మియే స్వయం
బుగ విజయంబు సేయఁదన పోణిమి బల్కఁగ నామె దక్కవే
ఱుగనుపమానమారసి యెఱుంగఁదరంబె! నుతింపసాధ్యమే!

★ ★ ★

గిరిజాద్యుత్తమ సాధ్వులున్ దలలు కేల్గీలించి మ్రొక్కంగ ద
గ్గరిహన్ సద్గుణరాశియౌ జనకరాట్కన్యావిలాసంబు ని
ర్జర వర్యుల్ దిలకించి సౌరు పొలిమేరంగాంచఁగాంక్షించియే
తెఱగంట్లైతిమి రెండు కన్నులును బ్రాతింగాన లేవంద్రు సూ

★ ★ ★

ఇమ్మగువ పంకజము నుండి యిలకు రాఁగ
ఘోరతపమాచరించిన వారు సురలొ?
జగమొ? విప్రులో? స్వర్గమో? తగవో? యెదియొ?
దీని నిజము నిజంబుగ దెలియలేము!

---

ప్రేమానందము గూర్చు నేత్రములకున్ వీక్షింపఁగాఁబండువై
యామోదంబును పెంపనెల్లరు జలేబౌక్షుల్గనం గౌతుకం
బీమాద్క్రం గలిగించుటన్ జెలులకేయింపౌ సుధం బోలు కాం
తామత్తల్లిక సీత రామునకు నేతాత్వర్యముం గూర్చునో!

★ ★ ★

ఊహ కరుదైన సౌందర్యమొందు సీత
యిట్లు నిలువ నిర్వురకన్ను లెనసి యొకట
గలిసి యిర్వుర తెలువులు కలఁకవాఱ
గాంచె రాముడు సీతయుఁగాంచె నతని.

★ ★ ★

వలపు వహించు చూపులను పాశముచే నిరు మానసంబులున్
బలముగ లోఁగి లాగఁబడ భానుకులాంబుధి సోము మానసం
బలజనకాత్మజాత యెదయందు వసించెను సీతమానసం
బల రఘురాము చంద్రునెదయందుఁదగుల్కొనెఁ జిత్రవైఖరిన్

''తేనె సోఁక నోరు తీయన యగు రీతి – తోడ నర్థమెల్లఁదోప .....''

అన్న కవయిత్రి మొల్ల పలుకునకు శ్రీరాములు రెడ్డిగారు ప్రతిపద్యం ఉదాహరణం అవుతుంది. ఆలంకారిక శిల్పబంధురమై, ప్రాబంధిక శయ్యా సౌభాగ్య సమన్వితమైన వీరి కవితా సౌందర్యం రామకథాంకితమై సార్థక్యమును సంతరించుకో గలిగింది. విశ్వ శ్రేయోదాయక దీక్షాదక్షమయిన వీరి పునీత వాక్కు ఒక్కొక్కటి ఒక్కొక్క రామ బాణం. రామ బాణం వంటి వేగంతో చదువరుల హృదయాంతరాళ రసజగత్తులకు దూసుకొని పోగలవు.

సంధ్యా సమయ వర్ణనలో ఈ క్రింది పద్యాన్ని ఎత హృద్యంగా మలిచారో చూడండి.

పైన ధ్వనించు పక్షుల రవంబులు వాద్యము-గాగ ఘోషముం
బూనిన అబ్ధియే యడుగు మువ్వలుగా నెఱమిన్నె రక్తపుం
బానము గాఁగఁజీఁకటియె ప్రబ్బిన కంచెల గాఁగ సంజయన్
చాన మహోద్ధతిన్ బరఁగు - శాకిని భూతము వోలె వర్ధిలెన్

★ ★ ★

ఈ విధంగా శ్రీరాములు రెడ్డిగారు తన మృదు జిహ్వాపై రవలు దాల్చిన నూగు నిగారపుంజిగుల్ చను కవితా సరస్వతిని రామాంకితం గావించి ధన్యులైనారు.

యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే
తావత్ రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి

- అన్న సూక్తిలోని రామాయణ శశ్వత్ ప్రాచుర్య లక్షణం పూతల పట్టు శ్రీరాములు రెడ్డిగారి రామాయణ కావ్యానికి కూడ వర్తిస్తుంది.

- మేడసాని మోహన్

# కవి ప్రశస్తి

శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు శ్రీరామనవమి నాడు 5-4-1892న చిత్తూరు జిల్లా పూతలపట్టు గ్రామములో జన్మించినారు. తల్లి లక్ష్మాంబ, తండ్రి పెద్ద బుచ్చిరెడ్డిగారు. శ్రీ బుచ్చిరెడ్డిగారు హరికథలు చెప్పేవారు. ఆ పుణ్యదంపతులకు జ్యేష్ఠ పుత్రుడుగా కవిగారు జన్మించినారు.

కవిగారికి నలుగురు కుమార్తెలు. వీరి కీర్తి వలె ఆంధ్ర, కర్ణాటక, తమిళ నాడులలో సంబంధ బాంధవ్యములు వ్యాపించినవి. వీరికి పాలకల రెడ్డివంశము తోడను, కట్టమంచి వారి తోడను రక్త సంబంధములు గలవు. నలగాంపల్లె నాయుడు గార్లు వీరి కవితను పోషించి యున్నారు.

వీరు ప్రాథమిక పాఠశాల వరకు చదివినను స్వయంకృషితో ఆంధ్ర, తమిళ సంస్కృత సాహిత్యములను ఒడిసి పట్టుకున్నారు. వీరు మద్రాసు విశ్వ విద్యాలయ విద్వత్ పరీక్షలో ఉత్తీర్ణులై ఆంధ్ర పండిత పదవిని పొంది బోధనలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పారు. తండ్రి హరికథలు చెప్పడం వల్ల వీరికి చిన్నప్పటి నుండి ప్రాచీన గ్రంధ పఠనంపై ఆసక్తి పెరిగింది. ఒకవైపు విద్యాబోధన మరోవైపు గ్రంధ రచనలను తపస్సుగా సాగించారు. విద్యార్థి వర్గములకు ఆంధ్ర బాషా సాహిత్యముల పట్ల అధికాసక్తి కల్గించుటయే కాక, అధ్యాపకుల యెడ గూడా అపార భక్తి తత్పరతలు కలిగించిన పండిత శేఖరులు వీరు. వారి సారస్వత వ్యవసాయం ఆత్మ సంతృప్తికోసమే. వారి రచనలలోని సద్విషయ ప్రస్తావన, ప్రవచనాల ప్రస్తారాలకు నిదర్శనంగా సౌశీల్యంలో రామ భక్తులైన పోతన్న, గోపన్నలను తలపించినారు. వీరు కొంతకాలం తాళ్ళూరి ఆర్ముగం పిళ్ళై గారితో కలసి ''తెనుగుతల్లి'' సాహిత్య మాస పత్రికకు సంపాదకత్వం వహించారు.

శ్రీరాములు రెడ్డిగారి విగ్రహము వలెనే వారి పాండిత్యము గంభీర మైనది. వారి హృదయము వలెనే కవిత్వము రసార్ద్రమైనది. వారి వర్తనము వలెనే రచనము సరళమైనది. తమిళ సారస్వత సాగరము నందలి రత్నములను

పై కార్యక్రమమునకు తోడు అదే దినము అవధాన చక్రవర్తి డాక్టర్ మేడసాని మోహన్ గారిచే అష్టావధాన కార్యక్రమము సాహితీ పిపాసులకు పండుగగా, వైభవంగా జరిగినది

మహాకవి పేరిట పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి స్మారక సంఘము ఏర్పాటు చేయబడినది తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహకారము రూ 40,000/-తో కంబరామాయణము పునర్ముద్రణ చేయు అవకాశము కలిగినది

మేము అడిగిన వెంటనే ఈ పుస్తకమునకు పీఠిక అందించిన అవధాన చక్రవర్తి, సరస్వతీపుత్ర డాక్టర్ మేడసాని మోహన్‌గారికి మా కృతజ్ఞతలు

పై కార్యక్రమములో సహకారాన్ని అందించిన శ్రీమతులు బి ఎన్ సుధీమణి నంజారెడ్డి, కె రుక్మిణి, బి ఎన్ ఉష, మరియు బి ఎన్ శ్రీవర్‌రెడ్డి దంపతులు (బెంగుళూరు), కె సుమతి రెడ్డి (యు ఎస్ ఎ ) శ్రీయుతులు పి విజయ శంకరరెడ్డి, టి టి డి ఇ ఓ శ్రీ ఐ వి సుబ్బారావు మరియు ట్రస్ట్ బోర్డు సభ్యులకు, సప్తగిరి ఎడిటర్ శ్రీ రామమూర్తి గారికి, న్యూట్రిన్ ఫ్యాక్టరీ యజమాన్యం, చిత్తూరు, శ్రీ డా॥ మన్నవ భాస్కరనాయుడు, ఎ జయచంద్రా రెడ్డి, డా॥ ఎ మునిరామరెడ్డి, తిరుపతి, పి కృష్ణమూర్తి, ఎం వ్యోమకేశవ రెడ్డి, ఎం డి నాయుడు చిత్తూరు, బి భీమేశ్వర రెడ్డి (వి ఎ ఓ ), టి చంద్ర శేఖర్ రెడ్డి (తలుపుల పల్లి బాబు), టి బాబురెడ్డి, జి శ్రీరాములు శెట్టి, కె హరిబాబు, కె చెంగల్రాయ నాయుడు, పి సర్వోత్తమ రెడ్డి, కె నారాయణ రెడ్డి, ఎన్ కుమారదేవరెడ్డి, పి శ్రీహరినాథ్, ఎ కె వెంకటరమణారెడ్డి గార్లకు మా కృతజ్ఞతలు

*ప్రతులకు, వివరాలకు*


**పూతలపట్టు నరోత్తమ రెడ్డి**

**సెక్రటరీ, శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి మెమోరియల్ ట్రస్ట్**

**పూతలపట్టు (గ్రామం మరియు మండలం)**

**చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్ - 517 124**

**ఫోన్స్ 08572- 70119, 26776**




పూతలపట్టులో ఏర్పాటు చేయబడిన శ్రీ పూతలపట్టు
శ్రీరాములు రెడ్డిగారి కాంస్య విగ్రహ ఆవిష్కరణోత్సవము.



6-12-1998న విగ్రహావిష్కరణ సందర్భంగా హాజరైన
శ్రీ డా॥ మేడసాని మోహన్‌గారు



విగ్రహావిష్కరణ సందర్భంగా హాజరైన శ్రీ బి.ఎన్ శ్రీవర్‌రెడ్డి,
శ్రీ బి.ఎన్ రవిచంద్రారెడ్డి మరియు డా॥ మేడసాని మోహన్ తదితరులు



విగ్రహావిష్కరణ సందర్భంగా హాజరైన శ్రీ పి. కృష్ణమూర్తి, శ్రీ టి. బాబు రెడ్డి, శ్రీ పి సుబ్బారెడ్డి, శ్రీ టి చంద్రశేఖర్‌రెడ్డి, శ్రీ పి విజయశంకరరెడ్డి, డా॥మన్నవ భాస్కరనాయుడు మరియు శ్రీ పి నరోత్తమ రెడ్డి తదితరులు



శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి కాంస్య విగ్రహ దాతలు,
శ్రీమతి బి ఎన్. సుధీమణి నంజారెడ్డి (మధ్యలోనివారు)
శ్రీమతి కె. రుక్మిణీ, శ్రీమతి ఉష మరియు శ్రీమతి సంతోషి తదితరులు




శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి
విగ్రహావిష్కరణ సభలో ప్రసంగిస్తున్న శ్రీ బి.ఎన్ శ్రీవర్ రెడ్డిగారు




శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి విగ్రహావిష్కరణ సందర్భంగా
ఏర్పాటు చేయబడిన డా॥మేడసాని మోహన్ గారి అష్టావధానము

శ్రీ ర స్తు.

# వి జ్ఞ ప్తి

## కం బ క వి చ రి త్రా ది క ము.

---

కంబకవి రాజనరేంద్రుని మునిమనుమఁడగు మూఁడవ కులోత్తుంగుని యాస్థానమున నుండి నతఁడు. ( ఈ కులోత్తుంగుఁడు విక్రమచోళుని కొడుకు. విక్రమచోళుఁడు రాజనరేంద్రుని కొడుకగు రెండవ కులోత్తుంగుని కుమారుఁడు. ) కులోత్తుంగుఁడు కంబకవి పాండిత్యమును కవితాచాతుర్యమును విని యతనిం దనయాస్థానమునకుఁ బిలిపించి కవిచక్రవర్తి బిరుద మొసంగి గౌరవించి విద్యాధికారిగా నుంచు కొనియెను. వీరిది క్రీ. పండ్రెండవ శతాబ్ది పూర్వభాగము. మొదటి కులోత్తుంగుని కాలమున_అనగా 9 శతాబ్ది తుదిని 10 శతాబ్ది మొదటను ఉండెనని కొందఱందురు. రాజునుగూర్చి కవి గ్రంథములందెచ్చటను ఒక వాక్యమైన కానరాకుండుట మిక్కిలి చిత్రము

కంబకవి తిరువళుందూరున పూజారి (ఉవచ్చ) పనిచేయుచుండిన అనంతుఁడను పుణ్యపురుషునకు జనించెను. వీరిది వేలాళ [కృషికజీవి] కులము. కాళిదాసాది మహాకవుల చరిత్రముల వలెనే కంబకవి చరిత్రమును విస్పష్టముగాఁ దెలియరాదు. పిన్ననాఁడే తలిదండ్రులు గతించుటచే తిరువెణ్ణెయ్ నల్లూర నుండిన శడైయప్పన్ [జటప్ప] అను నతఁడితనిం బెంచి పెద్దఁజేసి విద్యాబుద్ధులునేర్పి గొప్ప పండితునిగా కవిగా నొనరించెను కావునఁ దనపోషకుని నామము చిరస్థాయియగునట్లు లితఁడు తనరామాయణ మహాకావ్యము నందచ్చటచ్చటఁ జొప్పించెను. ఇతని కుమారుఁడగు అంబికాపతియు మహాకవి.

కంబకవి వాల్మీకి ననుసరించి తనరామాయణము వ్రాసెను. అది కథాను సరణమున్మాత్రమే కాని భాషాంతరీకరణము కాదు. వర్ణనలు సంభాషణములు కతపోకడలు సొంతములు ఇతఁడుపమల లోను వర్ణనా పద్ధతియందును కాళిదాసుని, శైలిని భక్తిని పోతనన్ను పోలఁపించును సంస్కృతాంధ్రములందు వాడుకలోలేని యత్యద్భుతోపమలు ప్రాపంచిక నిత్యవ్యవహారమున కానవచ్చునవి యిందు లెక్కడు మీఱి కలవు. ద్విత్రిచతుష్ప్రాసము లితనికి మిక్కిలి యిష్టములు. దశరథుని మిథిలాప్రయాణమును మూఁడు వందల వృత్తములతోఁ బెంచి నాయికా నాయకుల విహారశైలలు పుష్పాపచయము జలక్రీడ మధుపానము మున్నగు విషయముల కవకాశము గల్పించికొని వర్ణించెను. దీనింబట్టియే కాఁబోలు కంబరామాయణ మన నెడతెగని వర్ణనములతో దీర్ఘాతి దీర్ఘమైన దను లోకవ్యవహారము సిద్ధించి యుండనోపు.

ఇందెక్కువ భాగమితఁడు తిరువెణ్ణెయ్నల్లూరను కొంతభాగము తిరువత్రి యూరను వ్రాసెను. కంబకవివ్రాసిన దాఱు కాండములే. ఉత్తరకాండమును సాలెకులమునఁ బుట్టిన వాణిదాసుఁడను కవి రచించెను. కంబకవి రామాయణమును పూర్తిగావించిన పిదప శ్రీరంగమున కేగి ఓంకారవిమానమున యోగనిద్ర వహించు శ్రీరంగనాథస్వామిని దర్శించి నమ్మాళ్వారులపై నొక గ్రంథము వ్రాసి యటఁగల మహాపండిత సభలోఁ దన రామాయణమును వినిపించి సభవారి మెప్పువడసెను అందలి పండిత సభకు రంగమని పేరు. దానింబట్టియే లోకమున "రంగమున కెక్కెనా?" అను సామెత రూఢియైనది. సరస్వతి అంతాది [ముక్తపద గ్రస్తము] ఏరెళుపదు (కృషిపై డెబ్బది) అనుగ్రంథములు కూడ నితనివే యందురు.

ఇతని కవిత్వము సరసము లలితపదాలంకార యుక్తము అర్థగంభీరము పండిత పామరరంజకము భక్తిప్రబోధకము నైనది. శైలి గంగాప్రవాహము ననుకరించును. రసస్ఫోరకముగా వర్ణించుటలో నీతఁ డద్వితీయుఁడు. అందులకుం దగిన ఘట్టములు కొన్నింటి నితఁడు కథ పోకడకు ననువుగా క్రమవిరుద్ధము వినుగులేకుండ తీరునఁ గల్పించుకొని యున్నాఁడు. చూడుఁడు. రామలక్ష్మణులు కౌశికుని వెంబడించిపోవుచుఁ గాంచినట్లు మిథిలాపురము వర్ణింపఁబడినది. అరణ్యగమనక్రమము సీతకుఁ దోఁపకుండునట్లుగా వృక్షపక్షిమృగ నదీనదములు మనోహరముగా రామునిచే వర్ణింపఁబడినవి. హనుమంతుని సీతాన్వేషణ నెపమునను రాముఁడు లక్ష్మణునకుం జూపు నెపమునను లంకవర్ణింపఁబడినది. ఇట్టివే అటనట గొన్నికొన్ని కలవు.

## ముఖ్యములగు మార్పులు.

శ్రీరాముఁడు మిథిలా రాజవీథిలో తమ్మునితో మునితో నేగుచు మేడమీఁద నుండిన సీతం గాంచుట, సీతయు రాముంగాంచుట, అందుపై వారి యనంగ దశావర్ణనము, దశరథుఁడు దుఃఖావస్థయందు తనకౌర్ధ్వదైహికములు భరతుఁడు చేయ రాదనుటచేఁ బదపడి వసిష్ఠుఁడు శత్రుఘ్నుచే జేయించుట. సీతారామలక్ష్మణు లగస్త్యా శ్రమమునుండి పంచవటికేగుచు మార్గమధ్యమున జటాయువుంగాంచి సంభాషించుట, రావణుఁడు సీతను పర్ణశాలతోడ భూమిని పెల్లగించుకొని పోవుట, సుగ్రీవుఁడు తారను తల్లిగా భావించి గౌరవించుట, విభీషణుఁడు రావణునకు హిరణ్యకశిపు వధముఁదెలుపుట, యుద్ధరంగమున విభీషణ కుంభకర్ణుల సంభాషణము, రావణుఁడు రామలక్ష్మణ శిరోధనువులు గల్పించి చూపి సీతను బెదరించి లోఁగొన యత్నించుటకు మాఱుగా మాయజనకుని గల్పించి వానిచే భూజాతకు దుర్నీతులు చెప్పించుట లోనగునవి. ఈ కవి సుగ్రీవ విభీషణులకంటె వాలిని రావణుని కుంభకర్ణుని ఎక్కువగా గౌరవించెను.

## తెనిఁగింపు.

సంస్కృతకావ్యముల నాంధ్రీకరించుట సులభకార్యము. అందలి పదములు సమాసములు అట్లట్లే తుదిప్రత్యయములు చేర్చి యుపయోగించుకొనవచ్చును. అఱవమునుండి యట్లుచేయుటకు వీలు లేదు. తెనుఁగు సంస్కృతానుసారిణియైనది. అఱవమట్లుగాక స్వతంత్రించియే యున్నది. రెండును ఒక మాతృకగల ద్రవిడభాషలేయైనను నిత్యవ్యవహారమందుగల పెక్కుపదము లర్థరూప భేదములు లేక యున్నను ప్రకృతి ప్రత్యయ సంబంధమం దఱవమున స్వాతంత్ర్యమున్నది. మఱియు భాషాభివృద్ధి కవకాశమెక్కువగానున్నది. పదముల నిచ్చవచ్చినట్లనుకూలముగా సృష్టించుకొనవచ్చును. తెనుఁగున నట్టి పద్ధతులు విరివిగాలేవు. అఱవమందలి విశేషణ పద్ధతి వింతగాఁ గానవచ్చును. ఆపద్ధతి నా సహజ శైలినిగూడఁ జాలచోట్ల మార్చివైచినది.

“కంబకవియే పండితుఁడు; కంబకవి యింటి కట్టుకంబముగూడ కవిత్వము చెప్పును; అను నానుడులకుఁ గారకుఁడైన యిమ్మహాకవి కవిత్వమందలి గొప్పతనమును కొంతవఱకైన నాంధ్రులు గ్రహింపగలిగినచో నాపరిశ్రమ ము సఫలము కాఁగలదు. గ్రంథము గొప్పదిగావునఁ దెలిసియుఁ దెలియకయుఁ దొసఁగులు దొరలియుండవచ్చు అట్టివి తెలిసి తెలిపినవారికి వినయపూర్వక వందనము లర్పింతును.

ఇట్లు
సుజన విధేయుడు
శ్రీరాములురెడ్డి.

# అభినవ పోతనామాత్య, విద్వత్కవికుల తిలక

# సాహిత్య రత్నాకర, కవితా తపస్వి, మహాకవి

# శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు

చిత్తూరు మండలమునకుఁ జెందిన పూతలపట్టు గ్రామమున జన్మించి [ 5-4-1892 ] ప్రాథమిక పాఠశాలలో మాత్రమే పఠించినను స్వయంకృషిచే ఆంధ్ర, తమిళ, సంస్కృత సారస్వతములు స్వాయత్తము చేసికొని, విశ్వవిద్యాలయ విద్వత్పరీక్షలో నుత్తీర్ణులై, ఆంధ్ర పండిత పదవిని నిర్వహించి బహు పద్య, గద్య, కావ్య ప్రణేతలై, సెనేటు సభ్యులై, నిరంతర సారస్వత సేవ కావించుచు విద్యచే విజ్ఞానముచే వినయముచే విశ్రుతిచే సర్వాంధ్ర జనసంస్తుతి పాత్రులైన ప్రతిభాపాథోధులు శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు.

శ్రీ శ్రీరాములురెడ్డిగారు పాఠశాలలో ప్రైమరీవరకే పఠించినను స్వయంకృషిచే నాంధ్ర గీర్వాణ తమిళ సారస్వత సముద్రములు మథించి పాండితీపీయూషము కైవసము చేసికొనుటతో తృప్తిపడక, మదరాసు విశ్వవిద్యాలయ విద్వత్పరీక్షకుఁ గూర్చుండి యందు నుత్తీర్ణులైరి. తరువాత సుమారు ముప్పదియైదేండ్లు మాధ్యమికోన్నత పాఠశాలలో నాంధ్ర పండితపదవి నిర్వహించి, యసమానమైన బోధన పాటవము చేతనేకాక అప్రతిమాన శీలసంపదచేకూడ నంతేవాసుల కానందోపదేశములు చూఱలిచ్చిరి. విద్యార్థుల కన్యవిషయములకంటె నాంధ్రమున నధికాసక్తి యావహిల్లఁజేయుట వారి అనన్యసామాన్యమైన అధ్యాపన పాటవమునకుఁ దార్కాణము. విద్యార్థి వర్గములందు వారివలె భాష యెడనేకాక బోధకునియెడఁగూడ నపారభక్తి తత్పరతలు కలిగించు పండిత ప్రకాండులెందరో యుండరు.

చిత్తూరు నివాసము శ్రీ శ్రీరాములురెడ్డిగారి కాంధ్ర గీర్వాణములనే కాక తమిళమునుగూడ వాపోశనము పట్టుట కవకాశము కలిగించినది. అది వారికి కీర్తిసంపదను ఆంధ్రసరస్వతి కభినవాలంకార సౌభాగ్య సంపదను చేకూర్పఁజాలినది. వారఅవమునుండి కంబరామాయణమును, నాలఁడియారును, పెరియపురాణమును, శిలప్పదికారమును, మణిమేఖలను, భారతి కవివరేణ్యుని మధురకవితాఖండములను ఆంధ్రీకరించి ఆంధ్రసరస్వతికి వెలలేని వింతతొడవులు వెలయించిరి. సంస్కృతమునుండి వారను వదించిన కుమారసంభవమును, ప్రశ్నోత్తర రత్నావళియు వారి సంస్కృతభాషాపాండిత్యమును అనువాద నైపుణ్యమును చెప్పక చెప్పుచున్నవి. తెనుఁగు సందేశమందును, నీతిగుచ్ఛమునందును గల పద్యములు లలిత ప్రసన్నమైన వారి శైలికిని మృదుమధుర పదప్రయోగమునకును అనన్య సామాన్యమైన ప్రతిభాపాటవమునకును తార్కాణము.

శ్రీ రెడ్డిగారు రచించిన గద్య గ్రంథము లనేకములు. అందు విశ్వామిత్ర చరిత్ర, సురాభాండేశ్వర సుజ్ఞాన బోధినులు ముఖ్యములైనవి. వీనిలో నైదుభాగములుగా ప్రకటితమైన సుజ్ఞానబోధిని సరళసుందరమైన భాషలో సామాన్యులకుకూడ 'వివిధ విజ్ఞాన విషయము' లందించు సన్వర్థనామధేయమై యలరారుచున్నది. ఇవిగాక వారు పాఠశాలల యుపయోగార్థమై ప్రచురించిన వాచకోపవాచకములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. వారనవరత పరిశ్రమ కావించి మూడు నిఘంటువులను నిర్మించిరి. అందు రామచంద్ర విద్యార్థికోశము ప్రకటితమై బహుళ సంఖ్యాకులైన విద్యార్థులచే నుపయోగింపఁబడుచున్నది. శబ్దార్థ కల్పకమను సార్థక నామధేయమైన బృహన్నిఘంటువును, పురాణ పాత్ర చరిత్ర నిరూపకమగు అభిధాన దర్పణమును వెంటనే ప్రచురింపఁదగిన అపూర్వగ్రంథములు.

శ్రీ శ్రీరాములురెడ్డిగారి కవితాపాండితీ ప్రాగల్భ్యములను గుర్తించి ఆంధ్రదేశము వారి ననేకవిధముల నాదరపూర్వకముగా గౌరవించినది. 1948-వ సంవత్సరమున వారికి పలువురు విద్వాంసుల సమక్షమున "విద్వత్కవి కులతిలక" బిరుద మొసంగఁబడినది. చిత్తూరునందలి శారదాపీఠము వారికి "సాహిత్యరత్నాకర" సార్థక బిరుదము నొసంగి సత్కరించినది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారిని సెనేటుసభ్యులుగా నెన్నుకొని యుభయ ప్రతిష్ఠాకరమైన ఉత్తమ కార్య మాచరించినది.

శ్రీ శ్రీరాములురెడ్డిగారి విగ్రహమువలెనే వారి పాండితియు గంభీరమైనది వారి హృదయము వలెనే కవితయు రసార్ద్రమైనది. వారి వర్తనమువలెనే రచనయు సరళమైనది. తమిళ సారస్వత సాగరమునందలి రత్నములను సేకరించి సోదరాంధ్రులకు నెఱచూఱలిచ్చిన వదాన్యశేఖరులువారు. వారెంత కవులో అంత శిష్యవత్సలులు; ఎంత సహృదయులో అంత రసజ్ఞులు; బహుభాషా వేత్తలు; సంస్కార పరాయణులు; సర్వాంధ్రజన సంస్తుతి పాత్రులు.

డా॥ దివాకర్ల వేంకటావధాని,

[ ఎం.ఏ. [ఆనర్సు] పి. హెచ్. డి ]

శ్రీరామ

# పీఠిక

జాతిచేత తెనుఁగువారును అఱవవారును ఒక్కరయని శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. వీరిరువురకును ఎన్నియో తరముల క్రిందట సామాన్యమైన తెగ ఒక్కటి యుండెడిది. అయాదిమకాలములో దానిపేరెద్దియో అది యెంత విస్తీర్ణముగ మన దేశమందు వ్యాపించియుండెనో నిర్ధారణముగ నిప్పు దెఱుంగఁజాలము. సింధునదీ తీరమున మూడునాలుగుఁవేల యేండ్లక్రిందట ప్రసిద్ధిగ నుండినట్లు మొహెంజోదారో ఇత్యాదస్థలముల నిప్పుడు బహిరంగ పఱుపఁబడిన పురాతనవస్తు సామగ్రులు ఇత్యాది చిహ్నములచే ఇది దేశమంతట వ్యాపించియుండిన జాతియని యేర్పడియెడిని,దాక్షిణాత్యము మాత్రముకాదు. ఈ జనమునిప్పటివారు ద్రావిడులని పేర్కొనుచున్నారు. ఈ మహా వృక్షముయొక్క శాఖలో అనేకములు. ఎన్నియని ఎంతదూరము ఎన్ని దిక్కుల వ్యాపించినవని, యిప్పుడు నిర్ధారణచేయ వీలులేదు. అయిన, ఒక్కటి మాత్రము నిస్సంశయముగ నిజము. అనఁగా తెనుగువారు అఱవవారు నీశాఖలోనివారని.

ఇట్లు జాతిచేత అఱవవారితో ఐక్యము నెక్కువచెందిన వారయ్యును ఆంధ్రులకు విద్యాది నాగరకతా సంపర్కము ఆర్యులతోనే యధికము. ఆర్యుల అమోఘమైన నాగరకతను గుఱించి విస్తరించి యిటఁ జెప్పవలయుట అనావశ్యకము. వారిభాష, వారివేదములు, ఉపనిషత్తులు, భారత రామాయణాది వీరకావ్యములు, భాసకాళిదాస భవభూతి శూద్రకాది మహాకవుల నాటకములు, వారిసంఘ నిర్మాణము, ధరశాస్త్రములు మనదేశము నందితర నాగరకతల నంతర్ధానమందునట్లు నిజప్రకాశప్రభావములచే చేసినవి. ఇందున ఆశ్చర్యముగాని విషాదముగాని మనము చెందఁబనిలేదు. సంస్కృత భాషామాహాత్మ్యము దాని యందుద్భవించిన మాగధి మొదలగుభాషల మహనీయత లోకమంతయు నాకర్షించియున్నది. ఆర్యులయు వారియందుండి యుద్భవించి నూతనమార్గముల లోకప్రసిద్ధిని వ్యాప్తినిచెందిన బౌద్ధులయు జైనులయు వాఙ్మయము, నాగరకత, వర్ణము మతము మొదలైన భేదములచే అన్యజాతులనఁబడు పాశ్చాత్యులలో సైతము గౌరవాదరణములకు పాత్రములై యున్నవి. ఇంక సమీపస్థులమైన మనవిషయము చెప్పనేల? ఆర్యులలో సాయుజ్యమందిన జాతులలో ఆంధ్రులొక్కరు. మనదేశములో ఒక్క తమిళులు మాత్రమే తమ విశిష్టతను సంపూర్ణముగా కోలుపోక ఇంకను నిలుపుకొనియున్నారు.

ఆంధ్ర వాఙ్మయములోని రచనలలో ముక్కాలు మువ్వీసము సంస్కృతానుకరణములు, అనువాదములు. భారతము భాగవతము ప్రబంధము లనఁబడు మనువసుచరిత్రాదులు ఇతి వృత్తమునందు సంస్కృతము ననుకరణములు. స్వతంత్రించి వ్రాయఁబడిన గ్రంథములు మనలో చాల తక్కువ. ఒక్క గ్రంథములేకావు, తత్త్వములును ఆధ్యాత్మికాది విచారములును స్వయంభవములైనవి లేవు. ఈ మాటకు ఆపవర్గములైనవారు నాకుఁదెలిసి యిరువురు మాత్రమ. వేమన్న, పింగళి సూరనార్యుఁడు. అనగా వేమనపద్యములు, కళాపూర్ణోదయము తప్ప తక్కిన మన కృతులన్నియు ప్రతిబింబములు ప్రతిధ్వనులే. వేఱుకావు

తమిళులు తమ విశిష్టతను అనేకవిధముల నమోఘముగఁ బ్రదర్శించి యున్నారు కావ్యసృష్టిలో వారు అద్వితీయులైన ప్రతిభావంతులు తత్త్వశాస్త్రమున శైవసిద్ధాంతమును ప్రతిష్ఠించిన అధ్యాత్మిక ప్రభావులు నీతి బోధనమందు శ్రీవళ్లువరు వ్రాసిన కుఱళను గ్రంథమునకు మించినది ప్రపంచమున నెద్దియు లేదని చెప్పవచ్చును పై వీనికి నిదర్శనముగా కొన్నింటిని స్థాలీపులాక న్యాయముగా పేర్కొనియెదను

కావ్యములలో శిలప్పదికారము మణిమేఖల అను వీనికి మించినవి ఉండుట అరిది తెనుఁగున వానికి సమానమైనవియు లేవు శతాంశమైనను పోలునవి లేవని మొగమోటము లేక పలికినను సత్య వికల్పము కలుగనేరదు శైవ సిద్ధాంత గ్రంథములలో ముఖ్యములైనవి తేవారములు నేను చిత్తూరు హైస్కూలులో చదువుచున్నప్పుడు శ్రీరంగసామప్ప అను తమిళ విద్వాంసుని మొట్టమొదటి ద్రావిడోపాధ్యాయునిగా నియమించిరి వారికి మా తండ్రిగారు కట్టించిన మా యిండ్లలో నొకదాని నివాసమున కిచ్చిరి బాడుగ పుచ్చుకొనలేదు గాని వారివల్ల మాకుఁ గలిగిన ప్రయోజన మింతింత యని చెప్పఁజాలము వారు తేవారములు శ్రీఆండాళమ్మ పాశురములు పెరియ పురాణము మొదలగు గ్రంథములనుండి అప్పుడప్పుడు మాకు చదివి వినిపించెడువారు అదియ మొట్టమొదట నాకు తమిళు విశిష్టతను ఔన్నత్యమును గుర్తించుటకుఁ గలిగిన అవకాశము పిమ్మట కనకసభాపతిచే వ్రాయఁబడిన వేయేండ్ల క్రిందటి తమిళుల చరిత్రము కృష్ణస్వామయ్యంగారు మాధవయ్య దీక్షితులు మొదలగువారు పరివర్తించి తెలిపిన మణిమేఖల శిలప్పదికారము మున్నగు గ్రంథములవలన తమిళుల భావగాంభీర్యమును కొంతకు కొంత తెలిసికొనువాఁడనైతిని తంజావూరు పుస్తక భాండాగారములోనున్న ముద్దుపళనిచే తెనిఁగింపబడిన ఆండాళమ్మ పాశురములను కొన్నిటిని చదివి ఆనంద తన్మయత్వము చెంది ఆపాశురములన్నింటిని తెనిఁగింపవలయునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని ప్రార్థింపఁగా వారు అట్లే యొనర్చి ఆంధ్రులకు మహోపకారముతో మహానంద సిద్ధిని గలిగించిరి

ఆంధ్రుల చరిత్రములను విమర్శించి చూచినచో ఒక్క వైపరీత్యము గోచరింపకపోదు సంస్కృతమునుండి ఆర్యమత గ్రంథములను కావ్యములను నాటకములను అట్లు తెనిఁగించినవారు ద్రావిడ వాఙ్మయమునేల మనకు ప్రదర్శింపకపోయిరో కారణము మృగ్యము సంస్కృతమునుండి తెనిగించుటే కాదు తెనిగించిన వానిని పునః పునః తెనిగించుట రామాయణమునకు శాకుంతలమునకు తర్జుమాలెన్ని యున్నవో యోచింపుఁడు ఇంకను ఎన్నికానున్నవో! అరవమునుండి ఏ యీరీతిని తుదకు ఆ జగన్మోహన మూర్తియైన మణిమేఖలనైన తెనిఁగించి ప్రత్యక్షపఱుపక పోయిరో! రుచిలేకయా? స్మరింపలేక పోవుటచేతనా?

సంస్కృతమునుండి అట్లాంధ్రీకరించినవారు పాళి మున్నగు ప్రాకృతమునుండి బౌద్ధమత గ్రంథములను తెనిఁగింపరైరి తుదకు కాళిదాసునకు మార్గదర్శకుఁడైన అశ్వఘోషుని బుద్ధచరిత్రమును గూడ మనవారికి తెనుఁగుచేసి తెలుపరైరి కారణమేమియై యుండవచ్చును ఇట్టి నిరోధములకు?

నాకుం జూడ మతభేదమని తోఁచెడిని ఇది తప్పుగాదు దోషముగాదు పాపమునుగాదు మఱి సహజము ఒకేవిధముగఁ జూచిన సద్ధర్మము నైనయది హిందువులలో దృష్టిని బట్టి మత మేర్పడుట కంటె మతమును బట్టి దృష్టిపోవుట ఎక్కువగ వ్యాప్తము మతమును బట్టి దృష్టిపోవుట వ

లోను అందఱిలోను ఎక్కువ అలవాటు దృష్టినిబట్టి మతము పోవుట తక్కువ, మొత్తము మీఁద ఆంధ్ర వాఙ్మయము మంత్రము లట్లు బ్రాహ్మణాధీనము అందువలననేగదా వీరశైవ కవులైన నన్నెచోడుఁడు పాల్కురికి సోమనాథుఁడు మొదలగువారికి మనయందు వ్యాప్తి లేకపోవుట ఇటువంటిదే యేమో ద్రావిడ వాఙ్మయమును మనము అస్పృశ్యమని తలంపఁబోయినను స్పృశింపకుండుటకు హేతువు హేతువెట్లున్న నేమి? మనకుఁ గలిగిన విఫలత్వము చాల విషాదకరము తమిళులనుండి అన్నదములట్లు మనము హక్కుదారులైదాయభాగముగ ననుభవింపవలసిన శైవసిద్ధాంతము ఆళ్వారుల చరిత్రములు పెద్దపురాణము ఇత్యాది జ్ఞానభక్తిధనములను పోగొట్టుకొంటిమి మఱియు వీనికంటె ముఖ్యమైనది ఆనందము అనగా సాహిత్యానందము లయానందము ఏమేయముగఁ బ్రసాదింపఁగల మణిమేఖలాది మహోత్కృష్ట సాహిత్యానందము ననుభవింప నేరమైతిమి ఇయ్యది మన దురదృష్టము తమిళు లియ్యకపోవుటచేఁగాదు మనము గ్రహింపక పోవుటచే

సాహిత్యమునందు తెనుఁగుభాష ఇతర భాషలతోఁ బోల్చి చూచిన యెడల చాల వెనుకఁబడినదని చెప్పక తప్పదు ఈలోటు సంగీతమునందు నష్టపరిహారము సంపూర్ణముగా చెందియున్నది భాషావేత్తల నిర్ణయ ప్రకారము సంగీతమునకు ప్రశస్తముగ ఎత్తిన భాషలు రెండే అందొక్కటి తెనుఁగు, రెండవది ఇటాలియన్ ఈఫలసిద్ధికి హేతువులు నాలుగు

మొదటిది మనయందు సరళము లెక్కువగ నుండుట రెండవది అచ్చు లెక్కువగానుండుట మూడవది సంస్కృతమునకు నించుమించు సమానముగా ఏవోకొన్ని అపురూపములగు స్వరములకుఁ దక్కఁదక్కిన స్వరముల కన్నింటికిని విస్పష్టముగసూచింపఁగల సంజ్ఞలుండుట సంజ్ఞాపరిచ్ఛేదమునందు సంస్కృతమునకు రెండవది తెనుఁగు అటువ మధ్యానము నాల్గవది గురులఘువులకుండు భేదమును వ్రాయునప్పుడే విదితపఱచుట ఇంగ్లీషునందు చెప్పి నేర్చుకొనవలయునేగాని చూచి యుచ్చరించుట అసాధ్యము ఈ నాలుగు హేతువులవలనఁ గలిగిన ఫలము శ్రవణానందము దానినుండి కలుగునట్టిది ప్రాణసుఖము

తమిళ గ్రంథములు తెనిఁగించి మన విద్యావికాసమునకు దోహద మొనర్చిన వారిలో కాలక్రమమునుబట్టి చూచిన ఈ కంబరామాయణము ననువదించిన నామిత్రులు బంధువులునైన పూతలపట్టు శ్రీరాములురెడ్డి ప్రథముఁడుకాఁడు పూర్వులున్నారు అనఁగా ఇందు సంతతి పారంపర్యము కలదని కాదు నా యభిప్రాయము కొన్నియేండ్ల క్రిందటను విశాల దృష్టి విశాల హృదయముగల ఆంధ్రులు కొందఱు తమిళ భాషావిశారదులు కొద్ది తమిళ గ్రంథములు తెనుఁగునకు పరివర్తించి ప్రకటించియున్నారు మన దోషమో దురదృష్టమో వానికి మనయందు అర్హతకొలఁది ప్రాధాన్యము ప్రాబల్యము కుదురలేదు ఇఁక ముందైన మనము సంస్కృతముతోఁగూడ తమిళమును ఆక్రమించుకొని భాషా పరాక్రమశక్తిని ప్రకటింతుముగాక

ఇ(క ప్రకృతమునకు వత్తము పూతలపట్టు శ్రీరాములురెడ్డిలోని విశిష్టతయేమన ఒకటి వీర నేక ద్రవిడ గ్రంథములను చెని(గించియుండుట, వీరికి అఱవముతోడి సంధి బహుళము వీరాంధ్రులకు మనఃపుష్టికై యొస(గిన అఱవ నైవేద్యము లివ్వి

1 శ్రీవళ్లువరుగారి "కుఱళ్ ' అను నీతిబోధక గ్రంథములలో లోకఖ్యాతి గడించి ప్రాథమిక వర్గమునకు( జెందిన మహోత్కృష్ట సద్బోధక కావ్యము

2 నాలడియార్ (చతుష్పది) అను పేరెన్నిక గన్న కుఱళను పోలిన నీతిమాల ఇది వ్రాత లోను న్నది కాని యింకను అచ్చుపడలేదు

3 నన్నెఱి (సన్మార్గప్రబోధిని) ముఖ్యముగా బాలకుల కత్యంతోపయుక్తమైన పాఠ్యగ్రంథము

4 కొన్రైవేందన్ ఇందలి యితిహాస మేమన శివుడు తన జటాజూటమున చాల ప్రీతితో ధరింమకొను పూల(ట యివ్వి! విషయము నీతిబోధ ఈ అఱవ వారికి మనకు శృంగారమెట్లో, నీతిబోధ అట్లున్నదని తో(చెడిని దౌర్భాగ్యులు! లోక సుఖమునందు మనకుండుఆసక్తిలేనివారు పరధ్యానము లోకధ్యానము ఎక్కువ ఇదే కారణమెమో కొంతవఱకు వారు పొరుగువారైన ఆంధ్రులచె జయింప(బడు టకును మనవారు తంజావూరు మధుర మొదలగు స్థలములందు వారినేలియుండుటకును

5 కంబరామాయణము ఈ మహోన్నత గ్రంధము నఱవమున రచించిన కవి కంబుడు ఈయన వ్రాసిన గ్రంథము విషయమునందు లోకారాధ్యము శైలియందు లోకానందము అట్లుండియు శ్రీరంగములోని వైష్ణవోత్తములు దీని నంగీకరించుటకు సమ్మతింపలేద(ట! అప్పుడు వారిదాక్షిణ్యము సంపాదింప( గొన్ని వైష్ణవ గ్రంధము లితడు వ్రాసెన(ట! దానిపై వారు దీని నంగీకరించి కంబుని గౌరవించిరని జనవదంతి ఇది ఎంతమాత్రము నిజమో చెప్పలేము ఇట్టి కతలు అనేకుల గుఱించికట్టుట మన ఆగమ సంప్రదాయము సూత్ర మొక్కటి మెడలు మెండు

చిత్తూరుజిల్లాయందు కంబరామాయణము సామెత కెక్కినది 'ఏమిరా' కంబరామాయణము మాట్లాడుచున్నావు అని పరిహాసము చేసినచో దానియర్థ మిది విపరీతముల్తైనదీర్ఘ వర్ణనలు చేయుచున్నావేల? అందును అసంబద్ధములు కథాప్రవాహమున కడ్డునైనవానిని అన(గా కంబమహాకవి కొన్నికొన్నిచోట్ల విషయమునకంటె వర్ణనకే యెక్కువ ప్రాధాన్యమిచ్చినట్లు తో(ప(జేయు ఘట్టములు మితము మీఱి యున్నవని ఆరోపణ ఇదియెంతమాత్రము విమర్శకులు సమర్థింతురో చెప్పలేను నాకును ఈయారోపణలో కొంత సత్యమున్నట్లు తో(చెడిని ఇది నా పొరపాటు కావచ్చును. నా విభ్రాంతి కా(బోలు! తమిళులకేమో ప్రతి పద్యము ప్రతివాక్యము ఆనంద మొస(గుట నేను ప్రత్యక్షముగ( జూచియున్నాను నేను క్రిస్టియన్ కాలేజిలో చదువునప్పుడు రెండవ స్టూడెంటు హాస్టలులో నా నివాసము నాసహవాసులలో ననేకులు ద్రావిడులు అందొక్కరుడు కంబరామాయణ పారాయణ పరాయణుడు నాకర్థముకాదు వదలిపెట్టుమని బతిమాలినను విడువక 'మీ తెను(గునకు మించినది మా అఱవము" అని నాకు నిరూపింపటకై బలాత్కరించి కంబ రామాయణము చదివి ఇంగ్లీషున వివరించెడివా(డు ఆవర్ణనా ఘట్టములు నాకెంతవిసుగో వానికంత

సుఖము మహానందము. "లోకోభిన్నరుచిః భిన్నభావః" కంబుఁడు వ్రాసినది అరవలకు. ఆంధ్రులకుఁగాదు. వారికి సంపూర్ణముగ నచ్చినప్పుడు మనకేమి హక్కున్నది ఆక్షేపించుటకు? తమిళుల కంబరామాయణ మనఁగా సాహిత్యచక్రవర్తిత్వమునంది కిరీటము దాల్చిన మహత్తు.

శ్రీరాములురెడ్డి పరివర్తనము సంస్కృతమునుండి కావింపఁబడు పరివర్తనముకంటె చాల కష్టమైనది. సంస్కృతమునకు తెనుఁగు పురాకృతిముతో సరి సమాన మనదఁగు సమీప సంబంధముగల భాష. జాతిచే మనము ద్రావిడుల మయ్యును విద్యాది సంపర్కములచే అఱవలకంటె ఆర్యులకు సమీపస్థులము. కొన్నిగీతములు అక్కరలుసీసములు తక్కఁదక్కిన మనఛందస్సులన్నియు తత్సమములు. ఇఁక భాషయన్ననో అమేయముగా సంస్కృత ప్రతిబింబము. సంస్కృత వృత్తములును, అందలి పదములను మార్పు లేకయు కొంతమార్పుచేసియు మనసాహిత్యమునందు కవులు ప్రవేశ పెట్టుట సులభమైనపని "గమికర్మీకృతనైక నీవృతుఁడనై" ఇందు "డనై" మాత్ర మేగదా తెనుఁగు!

'అశ్రాంత శ్రుతి పాఠపూత రసనా విర్భూత భూరిస్తవా
జిహ్మ బ్రహ్మముఖౌఘవిఘ్నిత నవస్వర్గక్రియా కేళినా"

అను దానిని,

వేదాభ్యాస విశేషపూత రసనా విర్భూత భూరిస్తవా
సాద బ్రహ్మ ముఖౌఘ విఘ్నిత నవ స్వర్గక్రియాకేళిచే

అని తెనిఁగించుటలో కవిచేసినది యతి ప్రాసముల కొఱకైన యలంతి మార్పేగదా!

ఆదిని తెనుఁగునకును అరవమునకును సన్నిహిత సంబంధమెక్కువగ నుండియుండక తప్పదు. కాలక్రమమున మనజీవితముతో సాహిత్యమును ఉత్తర వాహినిగా మాఱినది. దక్షిణవాహినిగనుండి యుండిన రెండు విధములను లాభముచెందిన వారమైయుందుము. గతమునకు వగవనేల? అటుకాకపోయె. అఱవములో ఛందఃపద్ధతి భిన్నము. వారి సాహిత్యములోని భాషయు ప్రకృతి ప్రత్యయ సంబంధములును వేఱు. అట్లే ఎరవలితెచ్చి పెట్టుకొనుటకు సాధ్యము కాదు మనస్త్రీల కమ్మలు మలయాళస్త్రీల చెవులకు పనికి? ఇక్కడ నిజమైన పరివర్తన క్రియ ఆవశ్యకము. అట్లట్లే మార్పులేక వినియోగింపజాలము కాఁబట్టి ఇది నిజమైన భాషాంతరీకరణము. సుగమమైనపనికాదు. దుర్గమము దుస్తరము.

ఇట్టి యాక్లిష్టకళను ఎంత చక్కగా అనాయాసమని తోఁపించునట్లు శ్రీరాములురెడ్డి చేసియున్నాఁడు! అది ఉభయ భాషావేత్తలకుఁగాక యితరులకు సంపూర్ణముగా విదితము కాదు.

సాహిత్యములోను సంగీతమునందుంబలె మనకు వలసిన పరమార్థము సౌఖ్యము. ఆనందము. యాథార్థ్యమంతగఁగాదు. ఈతత్త్వము ప్రకారము చూచిన యెడల మా శ్రీరాములురెడ్డి కంబరామాయణము స్వతంత్రముగ రచించిన కృతి యట్లు ఐక్యమును వహించి ఏకధారగాఁ బ్రవహించి పాఠకులకు సంతసా

హ్లాదకారియై యున్నది. కంబుని స్మరణలేకయే దీనిని చదివి ఆనందింపవచ్చును. బింబమునకు ప్రతి బిం
మాయను విచారణ కవకాశమీయనట్టి ఆనందకరమైన కళ, దీనిని చదివినపుడు చూచినపుడు హృదయ
మిందే నిమగ్నమై లీనమై యుండుటయ దీని మాహాత్మ్యము. ఇదియే కవితా కళయొక్క సిద్ధియు ప
పూర్ణత్వమును.

శ్రీరాముఁడు సేతువును గట్టి లంకకు మనకు యాన సౌకర్యము గల్పించినాఁడు గాని యు
సంహారక్రియకై. ఈ శ్రీరాముఁడు ఈ భాషాసేతువును గట్టి తమిళులకు మనకు పరస్పర విద్యాజ్ఞా
వికాసములకై సౌకర్యము గల్గించి యున్నాఁడు. ఆ సేతువును సముద్రము ముంచి మ్రింగివైచినది. ఈ
వాఙ్మయసేతువు ఆచంద్రార్కము శాశ్వతముగ నిలిచి అరవలకు నాంధ్రులకు నాగరికతా సాంగత్యమున
పెంపొందించగలదు.

పద్మప్రభాస,
చిత్తూరు,
2-2-1951.

ఇట్లు,
క. రామలింగరెడ్డి

మహాకవివర్యులు శ్రీరాములురెడ్డిగారి దివ్యసమ్ముఖమునకు నమస్కార పూర్వకముగాఁజేయు విజ్ఞాపనము తాము పరమ కృపతోఁ బంపిన కంబరామాయణము చేరినది. తమ రామాయణము అఱవ కంబరామాయణము కంటె మిక్కిలి మనోహరముగా నున్నది. సరళమైన శైలియును ప్రసాద గుణమును యీగ్రంధమందు విశేషముగానున్నది. విహారపటలమున మూఁడవ పద్యమందు 'కాంతలార' మున్నగు సంబోధనములు మూలముకంటె మిక్కిలి మనోరమ్యములుగా నున్నవి. మూలగ్రంధముననున్న యభి ప్రాయముల నెంత మాత్రమును విడువక యీలాగున పరివర్తనము చేసినవారు నేనెఱిఁగినవఱకు వేఱె వరును లేరు ( ముల్లైయై కురింజియాక్కి ) అనెడి పద్యము మాత్రము తెలుఁగున నిట్టి భూ విభాగములు లేనందువలన మూలగ్రంథాభిప్రాయమునకు సరిగాలేదు. కొన్ని స్థలములందు మూల ముకంటె లెస్సగా నున్నది.

ఆంధ్రులును ద్రావిడులును దేవర వారిని కొనియాడవలయును. అట్లు చేయని యెడల వారు తమ కర్తవ్యమును చేయఁదప్పిన వారగుదురు. తామొనర్చియున్న మహత్తరమైన కార్యము నెప్పుడైన నెఱిఁగి కొనియాడఁ గలరు.

నమస్కారములు.

మదరాసు,
7—9—52.

దాసుఁడు

వే. వెంకటరాజులు.

అఱవము, తెలుగు మలయాళము. కన్నడములందు పండితులు
మదరాసు యూనివర్సిటీ ద్రావిడోపన్యాసకులు.

# నివేదన

—○○—

తమిళ దిగంతములను దన మాధురీ విలసనముచేఁ దన్మయత్వమున ముంచి యచటి మానవులను భక్తిభాజనులఁగావించి, ఆత్మోత్కృష్ట రస ప్రవిష్టిచేఁ బరిసర ప్రాంత రస పిపాసుల మనస్సులందు కాంక్షా పల్లవములను తలెత్తించి యువ్విళులూరఁ జేయుచున్న యీ కంబరామాయణమును కావేరీ ప్రపంతికిఁగాల్వలు దీర్చి మనయాంధ్ర పండిత దివ్యకర్షకుఁడు ఎడతెగని కృషితో నిజవాఙ్మయ క్షేత్రమునకుఁ బాఱించి యద్భుతమగు నొక యధునాతన కావ్యసస్యమును పండించినాడు సోదర మానవులకు దాని రుచిఁజూప సమారాధన గావింప మహత్తర యత్నము గావించు శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు భావివర్తమాన లోకమునఁ బసిఁడిపూలతో నభిమాన గంధముతో బ్రఖ్యాతియనెడు ధూప దీపములతో సౌహార్ద్రమనెడు నైవేద్యముతో నారాధింపఁదగిన ప్రణయ స్వరూపులు

అయ్యది కావేరీతోయము నవరస పరిపూర్ణకుల్యలతో మన క్షేత్రమునకుఁ బ్రవహించి యెఱుఁగదు మన యుర్వరయాంధ్ర క్షేత్రము అట్లయ్యు నయ్యది భాషా భావ రూపమున గీర్వాణమును శబ్ద ధ్వని రూపమున ద్రావిడమును సంగీతాది స్వరవిశిష్టతా రూపమున నన్యదేశ పదార్థములను సేకరించుకొన్నది మొత్తముగఁగాని యఖండ రూపముగఁగాని యనువదించుకొనలేదు అన్యభాషా కావ్యములను ఇది తనలోనికిఁ గేవల సంస్కృతమునుండియే కావ్యాది శాస్త్రములు గ్రహింపననువదింపననుకరింప గడఁగినది, గీర్వాణమునకు నాంధ్రమునకు వాసనా ప్రాబల్యమున నవినాభావ సంబంధమున్నది దీన నేమన్నను ఆదిమాతృభాషా నంస్కృతియే యగును ఇంచుమించు తెనుఁగున సంస్కృతమందు లేని క్రొత్తది కానరాదు ఆట్లేదేనియున్న రామరాజభూషణుని కవితా సాధనమే కథగాదు

ద్రవిడభాషలలో ముఖ్యముగఁ దమిళమునకొక ప్రత్యేకత యున్నది గీర్వాణ భాషా గంధము నది తనకు బట్టించుకొనక అభినవాభిజాత్యముతోఁ బురాతనాత్మాభిమానముతో సముచిత స్వతంత్ర ప్రతిభతోఁ దన సంస్కారమును విలక్షణముగ నెలకొల్పినదిట్లు ప్రకృత మాంధ్ర వాఙ్మయము అన్య సంస్కృతుల నవగాహన మొనర్చుకొనుటకు వివిధ భాషలనుండి జాతీయములను నానుడులను లోకోక్తులను సామెతలను న్యాయములను గేయములను అనివార్యములగు శబ్దజాలమును సంగ్రహించుకొని శ్రావ్య సౌభాగ్య సంగీత ధ్వని సౌకుమార్యము నన్నింటిని ప్రోగొనర్చికొని "ఎల్ల బాసలందు ఎఱుఁగవే బాసాడి-దేశ భాషలందు తెలుఁగు లెస్స" అని తన సహజ గర్వమును విశిష్ట దర్పమును దశ దిశల నెఱపి పలుకుం దీయందనమున నుచ్చారణ పటుత్వమున గమన గాంభీర్యమున, శైలీ సౌలభ్యమున, శ్రుతి మాధుర్యమున, సర్వజన శ్లాఘాపాత్రతచే నెఱజాణయై మనల నానందాబ్ధి నోలలాడించినది శ్రీరాములు రెడ్డిగారీ యుభయ భిన్న సంస్కృతులకు సమన్వయమును సాధించి, ద్రావిడ సంపత్తిని పరిసర ప్రాంతీయు లనుభవించు స్వత్వము గలదని నిరూపింప భగీరథ ప్రయత్న మొనర్చి నేటికి అనువాద రూపమున మనభాగమును మనకు బంచిపెట్టి-తామాంధ్రజాతి సంస్కృతికి దోహద మొనర్చిరి. అక్కటన

నిత్యగౌరవమును, భావ్యున్నత స్థానము నలంకరించిరి. ఏతన్నూత్న కృషియందు సఫలతను భజించిన యీ రామచంద్రునకుఁ గ్రావ్య జగద్ధాత్రికులగు రస పిపాసువులు, ముఖ్యముగఁ బశ్చిమాంధ్రులు ముత్యాల నివాళు లర్పింపకున్న కృతఘ్నులగుదురు. తమ ప్రాంతీయ పురాతన గౌరవమును గోల్పోదురు. అన్యభాషల నున్న యీ యభినవ సారస్వతమును దాని విలక్షణ వైభవమును దమ సాహితీ భండారమునఁ జేర్చుకొన్ననాఁడే గదా మానవ విజ్ఞాన సంపత్తి పెరిఁగి-సంకుచితతా దైన్యమును గోలుపోయి-మనో బలమును ప్రబల మొనర్చుకొను చేతనతా కిరణముల స్పర్శ నందఁగలదు.

సంస్కృతానువాదములు నేఁటిద్దనుక నధ్యయన మొనర్చుచున్న రసిక సమాజము మాతృకకున్న గౌరవము తెనుఁగున కొసఁగునది కాదు. భాషా సంస్కృతుల విషయమున తల్లి బిడ్డలుగ నున్న యీ యనువాద మాతృకలకే యంతటి విభిన్నత లున్నచో నిఁకఁ దన ప్రత్యేకతనే నిలఁబెట్టుకొన నుబలాటపడునట్టి తమిళ భాషనుండి తెలుఁగునకు దిగు సంస్కృతి తీరుతీయములు చెప్పవలయునా? హాస్యాస్పదము సుమా. అని ప్రప్రథమమున నేనీ గ్రంథనామమును విన్నతోడనే యూహాకల్పన మొనర్చితిని. అయ్యది బహుశః మానవ మనో దౌర్బల్యము కావచ్చును కాని సంప్రదాయముగా వచ్చు నాయాచారమును దానికలవాటు పడిన నేను కాదనఁ గలనా? కవియైనను కాదనఁ గలడా? ఇంట బుట్టినది. కాని యీ సతత ప్రథకు అపవాదము కూర్చినవారీ పూతలపట్టు శ్రీ రాములురెడ్డిగారు మాత్రమె దువ్వూరి రామిరెడ్డిగారు సైతమసదృశ ప్రతిభతోఁ బారసీక కావ్యమనువదించిరి గానియది త్రిశతికిమించని కావ్యము పానశాల: వీరొక మహాకావ్యమునే యనువదించి యసమ ప్రతిభ చూపిరి.

సర్వసాధారణముగ గీర్వాణవాఙ్మయ మనెడు మున్నీటినుండి యనువాద కుల్యలద్వారా ఆంధ్ర కేదారములకు రసములను పాఱించునపుడు అనివార్యముగ యతిప్రాస విశ్రాంతులనెడు మునుములలో విపరీతమగు (ధరణి - వావిరి - సలలిత - అరయఁగ సరవి - విలసిల్లు - ఇల-పదఁక-పృథివి-ధరాతలము - సరస) వ్యర్థపదములను దుబ్బుగడ్డి పెఱిగి కావ్య సస్యశోభకు చీలగునంత నష్టమునుగూర్చి యానందమను పంటను చెడఁగొట్టెడిది. ఈ కృషికుఁడు గడిదేటి, యనుభవమును సంపాదించి. నన్నుబోలు కృషికులనే యనంతముగా నిర్మింపఁగన్న మేధాబల సంపన్నుఁడు గాన మెలఁకువతో నాకలుపు మొలకలనే పెరుఁగనీయక, పాదములను మునుములను చెదరనీయక, వ్యాకరణచ్ఛందోమార్గ సాధన విశేషముల కాపువెట్టి యఖండమగు రామాయణ రాజనములను చక్కఁగఁ బండించినాఁడు. మచ్చునకని పరికించినను ఈ కాఁపు కళ్ళమునందూఁక గన్పట్టదు. ఇంతటి జాగరూకతకుఁ గారణమేమాయని గాఢముగ నాలోచించితిని. ఆచంద్రతారార్కము నిలుచునట్టి మహాకావ్య సృష్టియం దలఁతి యలంతి దోసము లుంట గని రసిక పాఠకలోకము తన్ను మధుర హాస్యము పాల్గావించునని యెఱింగిరి. కావున వీరు ప్రతిభా పారంగతులు.

శ్రీరాములురెడ్డి శిష్యకోటియె వ్యాకరణచ్ఛందోలంకారములకుఁ జక్కని వ్యాఖ్యానములు రచించి సమర్థులని ప్రసిద్ధివహించియుండ నిఁక వీరి పాండిత్యమునుగూర్చి వేఱుగా నడుగనేల? ఇదియొక యధునాతన తపస్సు. నూతనకృషి, ప్రాచీన సంస్కారము - సాంప్రదాయిక వ్యుత్పత్తి - మానసిక

ప్రతిభ — కాకున్నచో నిక్కాలమున నింతటి యఖండ గ్రంథము సిద్ధమై యాంధ్రజన సమక్షమునకు వచ్చుట సామాన్యముగాదు. నేఁటిదనుక నింతటి పెద్దపని నెవరును ఈ రూపమునఁ దలపెట్టలేదు. ఇఁకఁ గవిత్వమునుగూర్చి కొంత చర్చింప వలసియున్నది

అనువాదముల కవిత సలక్షణముగనుండునుగాని చెవికి నింపు గూర్పదు శాస్త్రములను పట్టించి యుందురుగాని మనసునకుఁ బట్టదు అర్థవల్లి భావతాత్పర్య సౌరభ్యములు రాజమార్గమున వ్యాపింపవు చదువుచున్న వికారమేదో మనోవీథిం బ్రవేశించినట్లుండును ఇది కొందఱియనువాదములలోని విలక్షణత. ఇక్కారణముననే యనువాదమును పరిత్యజించి కొంద అనుకరణముం బూనిరి ఏమయినను బిఱ్ఱగ నీలుగుకొని మూన్నాళ్ళనాఁడు చచ్చిన పీనుఁగువలె నీరసమై నిర్జీవమై భీభత్సశోభతో బ్రత్యక్షమగుట మనము చూచినది కొన్నియెడల యనువాదకుఁడు దిగివచ్చునంత వఱకు దాని యర్థము తెమలదు

ప్రకృత కంబరామాయణ కవిత ధారాపాతము నిర్దుష్టము దానికంటె సారళ్యమెక్కువ. అంతకంటె రసస్ఫోరకతలో సద్యయానంద ప్రదము అర్థగాంభీర్య సహితయయ్యు మధుర మధురస స్రవంతిక—పండితుల కలభ్యమగు విశిష్టశైలి యిక్కవి కయాచితముగ నలవడినది, ఇది సంపాద్యము కాదు సంస్కార జన్యము అటనట తమంతట తాము దొరలిన శబ్దాలంకారములు — రసము కొఱకై అప్రయత్నముగఁ గుదిరిన తెలుగు నుడికారములు ప్రతిభాసాధ్యములగు గీర్వాణ సమస్తపద గర్జనలు వింతవింత కూర్పులు ప్రమదావన సౌభాగ్యముం జాటుచున్నవి

ఇస్లామీయుఁడనగుట నాకుఁ గథయందును రామాయణ కావ్యమునందును విశ్వాసముగల్గి గాదుకాని అనువాదముపట్ల నుభయ సంస్కృతుల సమన్వయముపట్ల నిక్కవి యెంతటి కృషిసల్పి వ్యుత్పత్తి ప్రతిభలను చాటినాఁడాయని గట్టిగఁ బరికించితిని హనుమంతునియెదుట కుప్పిగంతులు సాగవనుకొంటిని. ఎచ్చటను జాతీయతను జాఱనీయక సంస్కృతిని మాఱనీయక యధునాతనయుగమున కొక నూతనాదర్శముం జూప నీ గ్రంథము ననువదించినాడు ఈ కవి యసమాన ప్రతిభ దాఁగియుండి యొక్కమాఱు వెలి కుబికినది కావుననే మా యాంధ్ర సారస్వతము చిరకాలమునుండి మనోలోకము మథనపడుచున్న కొఱంత దీర్చుకొన్నది

తెలుఁగున వివిధ రామాయణములు పుట్టినవి భాస్కర—రంగనాథ రామాయణములుతప్ప మిగిలినవి చర్విత చర్వణములు పౌనరుక్త్యములు పిష్టపేషణ సదృశములు—ఒకే ప్రవాహమునుండి యిన్ని కాల్వలు పిల్లకాల్వలు గుంటలు త్రవ్వితీయంబనిలేదు అనుట నా మనోభిప్రాయము కాని తరములనుండి కొనియాడఁబడుచున్న యీ తమిళ కంబరామాయణము మహిమాకందళము బీజాక్షర ఘటితము, ఆంధ్రులకొక ప్రత్యేక సౌభాగ్యమును సమకూర్చినది ప్రస్తుత యుగ సారస్వతమున వాంఛనీయ రసవృష్టి దీని నామహాకవికావ్యరసాస్వాదన కుతూహలురు మిక్కిలి యానందించి తత్సాహిత్యగత వైశిష్ట్యమును గ్రహించి రసాదిక మార్దవ ప్రకృతుల నవలోకించి హర్షించి గర్వింపఁగలరు ఇది యావశ్యకకృషి—అన్యభాషా సహజ సంస్కారమును మన సాంప్రదాయిక సంస్కృతితో సరిపోల్చిచూచి యౌచితిని గొని యనౌచితిని దిగవిడిచి, దానిని మనదానినిగఁజేసికొన్న యపుడేగదా జాతికి జాతీయవిజ్ఞా

నము పెరుగుఁను. అభినవ భావసౌరభము గుబాళించును, అన్య భాషావిశిష్టత సాకారతను భజించి
వాఙ్మయ మందిరమున శోభించును. అట్టిదే యారాధ్యము. ఇంతటి విశ్వగౌరవ ప్రయత్నమున
లుఁడగు నిక్కవికి నేను హస్తములు మోడ్తును

ద్రుత ప్రకృతిక విషయమునఁ గవిగారి నిర్ణయము శాస్త్ర సహజము. అజంతమగుతఱి దా
ద్రుతత్వనామముండిన నుండుంగాక, దానిమీది పరుషములు సరళములగుట వింతగనేయున్నది. భా
కారులుసైత మీవిషయమున నిదమిత్థమని నిర్ణయముచూపమి ప్రాచీనతా విస్మృతియనక తప్పదు.
విషయమున శ్రీ రాములురెడ్డిగారితో మనస్ఫూర్తిగ నేకీభవించుచున్నాను. వారి యభిప్రాయము నాహృద్గ
ధ్వనియే.

అనన్య సామాన్య ప్రతిభతో నిరంతర నిష్ఠాపూర్వక కృషితో విర్నిద్ర ప్రవచన సౌభాగ్యము
నీకావ్యము ననువదించి యాంధ్రుల మన్ననల గ్రహించు శ్రీయుత-పూతలపట్టు శ్రీరాములురెడ్డిగా
నేఁటియుగమున నద్వితీయులు. ఆకాశగంగ వడువున ఘుమంఘుమ ధ్వనులతో నాంధ్రభూమికి దుముకుచున
వీరి కవితలో ధారావాహికయేగాక శాస్త్రమర్యాదలు సంస్కృతి భూషలు సంస్కృత మర్యాదలు త్రిలిం
పద వివేక విశేషములు తఱచు తమ యునికిని ప్రతిబింబింపఁ జేయుచు నాకర్షించుచున్నవి. ఈ కవిగా
సిద్ధహస్తతకు నోపికకు మనోవైశాల్య విజ్ఞానములకు వేయిమార్లు నేను కృతజ్ఞత లర్పింతును.

ఇట్లు,

షేక్. దావూద్ సాహెబ్
హిందీ & తెలుఁగు పండితులు
ఉస్మానియా కళాశాల
కర్నూలు.

శ్రీ

# విషయసూచిక

## బాలకాండము.

## అయోధ్యాకాండము

## అ ర ణ్య కాం డ ము.

## కిష్కింధాకాండము

శ్రీ రా మ

# కంబరామాయణము

## బాలకాండము

శ్రీ రామాయణకావ్య సిద్ధి విధయే సంభావయేయం ముదా
వల్మీకోద్భవ కంబముఖ్య కవి వాక్పూనార్చితాంఘ్రిద్వయమ్.
మానుష్యాతిగ వీరకార్యఘటనా సంజ్ఞాపిత శ్రీపతిమ్
రామం శ్యామల కోమలాంగ సుభగం సీతామనోవల్లభమ్

### అవతారిక — 12

మ॥ అరుదైయూహల కందరానిక్రియ లో • కాళల్ విసృష్టించి యో
గిరముంగూర్చి తుదిన్ హరించుట మహా • క్రీడావినోదంబుగాఁ
బరఁగు న్నైజముగాఁగ నెవ్వనికి నా • బ్రహ్మాండ భాండోదరుం
బరమేశుం గరుణామయున్ మది సదా • ప్రార్థింతు నిష్ఠారినై.

ఉ॥ జ్ఞానులు నైత మెవ్వని వి • శాల మహామహిమంబు సుంతయుం
గానఁగలేర యట్టి కరు • ణామయు సద్గుణరాశి వర్ణనల్
పూనియొనర్ప నాతరమె? • పూతచరిత్రుని సర్వమంగళా
మాన గుణాబ్ధిలో మునిఁగి • యోలలొనర్తము రండు భక్తిమై.

మ॥ హరి ఓమ్మంచుఁదొలిందుదిం బలుకుచున్ • సాంగంబుగా వేదముల్
సరవిన్ నేర్చిన పెద్దలుం, బ్రథిత భా • స్వద్భోగ భాగ్యంబులన్
ధరణిం గ్రక్కున కూడుగాఁదలఁచు వి • ద్వాంసుల్, సదా నిత్యమో
క్ష రమాదాయక దివ్యపాదములఁ ద • క్కంజూడ రస్యంబులన్.

ఉ॥ బేల గుణంబుగల్గు నొక • పిల్లి ప్రయత్నముతోడ వేడ్కమైఁ
బాల సముద్రముం దటిసి • పట్టుగ నిందలి పాలు మొత్తముం
గ్రోలెదఁగాక యంచుఁబని • గొన్న వితంబున రామచంద్ర లీ
లా లలిత ప్రభావ విపు • లంబగు దీనిని వ్రాయఁబూనితిన్.

ఉ॥ శాపముచేతఁబోలెఁ దరు • సప్తకముం దొల చేసినట్టి యా
పాపవిదూరు సత్కథ న • పార మనోహరలీల వ్రాసె మున్

దాపసి లద్వవోఁ మృతముఁ • ద్రావిన యీ మునవారి కీర్తి నా
చాపల బుద్ధిచే నదియ • చప్పిడి మాటలఁ జెప్పఁబూనితిన్

తే॥ అపయశం బందఁగా లోకు • లపహసింపఁ గడఁక దీని వ్రాయఁ గతంబు • గలదె వేఱు
తపసి వాల్మీకి వాఙ్మహ • త్త్వమున పేర్మి యందడెఱుఁగంగ నగునను • నాసఁగాక

తే॥ బహుచతుర గతుల్ వాల్మీకి • పద్యతతులు వినిన చెవుల నొప్పించు నా • వెగటుకైత
వీణనాదంబు విని చాల • వేడ్కఁజెందు, *నళునపక్షి నెపస్వర • మలఁచినట్లు

తే॥ †త్రివిధ భాషావిశేషముల్ • తెలియు విబుధ, వరుల కొకమాట చెప్పెద • వసుధయందు
భక్తులును మూర్ఖులును పిచ్చి • వాంఢ్రు పలుకు పలుకులెల్ల విమర్శింప • భావ్యమగునె ?

తే॥ గదులుగా నాటపట్టులు • గాఁగ గీటు పదుచు గీఁతలఁగని కోప • పడునె శిల్పి
శాస్త్రవిజ్ఞాన మావంత • జాడలేని నాకవితఁగని విబుధులు • నవ్వువారె ?

తే॥ సంస్కృతమ్మున సీరామ • చరితఁదొలుత వ్రాసినట్టి ॥ మువ్వురియందు • ప్రణుతిఁగన్న
చతుర వాక్యుఁడౌ వాల్మీకి • సరణిఁబూని వ్రాయఁదొడఁగితి దీనిని • ద్రవిడభాష

తే॥ దశవిధావతారముం ను • త్తమ పదంబు నయచరిత్రంబు నుత్తమ • నాయకు కథ
నతనిదయచేత నుత్సాహ • యుతు డనగుచు వ్రాయఁదొడఁగితిఁ † బూతల • పట్టునందు

సీ॥ భూరిరాక్షససేన • బూదిగాఁ గావించి విజయమాలను దాల్చి • వెలయునట్టి
కోదండమను విల్లు • గొనబుగాఁ గరమున, విలసిల్లు శ్రీరాము • విక్రమములు
వినుతించు వారికి • విరివిగా వలసిన కోరికలెల్లఁ జే • కూరుచుండు
విజ్ఞాన కీర్తులు • విస్తరిల్లుచు నుండు భుక్తియు భక్తియు • ముక్తి దొరకు

తే॥ నతని యర్ధాంగి వికచ ప • ద్మాసనస్థ నిఖిల జగదేకమాత వ • హ్నిప్రపూత
సీత కరుణాకటాక్ష వి • శేషదృష్టి వారిపైఁ బ్రసరించు న • నారతమ్ము

## 1 నదీపటలము—20

చ॥ అతికలుష స్వభావ చప • లాంతములై చను నింద్రియాళియన్
శితివిశిఖంబులన్ మణివి • శేష విఘూర్ణ నాదమేదురాం
చిత కుచకుట్మలీక్షణ వి • చిత్రశరాళియు ధర్మమార్గ సం
గతిని చరించు కోసలము • నన్ సరయూనదిఁగూర్చి పల్కెదన్

* ఉస్వ్రంము విన్నవెంటనే వెలవెలపోయి ప్రాణముం విడుచునది అళునపక్షి
† ఇయల్ (సాహిత్యము) ఇశై (సంగీతము) నాటకము
॥ వాల్మీకి, వసిష్ఠుఁడు, బోధాయనుఁడు అని అబవవ్యాఖ్య
† జటప్ప వసించు తిరువెణ్ణెయ్ నెల్లూరున కంబకవి వ్రాయమొదలిడెను

చ॥ పరఁగ విభూతిధారియగు • భర్గుని దేహముఁబోలి మేఘమం
బరమునసేగి యంబుధిని • మానుగఁదోయముఁ ద్రావి చందనా
కిరికుచయైన లక్ష్మినెద • గాటపుఁబ్రేమను మచ్చయుంబలెన్
మెరువుగఁదాల్చు విష్ణువును • పోలి చరించును అత్పురోపరిన్

చ॥ కలఁచి తపింపఁజేసెఁ దని • గాదిలిమ్మామను సూర్యుఁడింకనే
జలకము లార్చి తాప ముప • శాంతి వహింప నొనర్తునంచు నా
జలధి తలంచియత్నమున • సాంద్రలరంబుగ నావరించె నీ
లలనననొప్పి యవ్వలిమ • లన్ జలదంబులు గప్పు నిచ్చలున్

ఉ॥ వారనిపేర్మి స్వర్ణమయ • భాసురకాంతి హిమాద్రియొప్పఁగా
నీరసమూని త్రవ్వుటకు • నెత్తిన రౌప్యపు గడ్డపారలన్
తీరునఁ జంచలార్థితతిఁ • దృప్తిని దానముసేయు గౌరవో
దారుని బోల్కి మేఘములు • ధారలవీడుచునుండు నచ్చటన్

ఉ॥ మానమునొంది ధర్మమును మన్ననచేయుచు నీతిమార్గముం
బూనిన రాజు కీర్తివలెఁ • బొల్పగు జ్ఞాన పథానుసారులై
మానుగవేదముల్ చదువు • మాన్యుల కిచ్చిన యోగివోలెఁబెం
పూనుచునుండు వెల్లువ ల • యోధ్యకు జేరిన దేశమంతటన్

క॥ తల నడుము కాళ్ళఁదడవుచు నిలుకడ లేకించుకంత • నిలుచుచు భూభృ
త్కుల సంపదఁగొల్లగొనుచు వెలచెలువలఁబోలి నడుచు • వెల్లువ లచటన్

తే॥ కనక మగురువు నెమిలి యీఁకలునుమణులు గంధపుంజెక్కలును గంధ • గజందాళఁ
గొంచుఁబోయెడి వెల్లువ • వెంచిచూడ వర్తకుఁబోలె నడచు న • వ్వసుధయందు

తే॥ పూలగుత్తులు పుప్పొడుల్ • పుష్పరసము కరుల మదజలమును హాట • కంబుఁగలిసి
పడిగఁబాఱెడు గొప్పఱ్ఱ • వాహవిభలి, యింద్ర ధనువులఁబోలియొ • ప్పెసఁగుచుండు

చ॥ కరువులఁగూల్చుచున్ గిరులఁ • దార్కొని చీల్చుచు నాకుఁగొమ్మలన్
విరువడిగాఁగ నారుకొని • పర్వులువాఱెడు వెల్లువల్ గనన్
గరుడుల వాలు సంభ్రమును • గట్టఁదొడంగిన నాఁటి మేటివా
నరుల కిడింది వెల్లువల • నాణెపుఁబద్ధతి తోఁచు నయ్యెడన్

తే॥ ఈఁగలును తేంట్లు ముసరఁగా • నెల్లమిటి, పొంగి నురుగులతో లోన • ముటికిపాటి
పడుచు లెచుచుఁ దీయని • వారితోడ, దొరలు వెల్లువల్ త్రాగుఁబో • తులనుపోలు

తే॥ తీఁగపడగలతో మద • నాగచయము, తోడఁ బటుకాల్బదలతోడఁ • దొలఁకు దొనుల
తోడఁ బఱతెంచు వెల్లువల్ • గుడుకు తోడఁ గదలితోడ ధీకొనవచ్చు • కరణిఁదోఁచు

## సరయూ మహిమము

మ॥ ఇనవంశోద్భవులైన రాజతతిచే • నెల్లప్పుడున్ మేటిపా
లనమం దెచ్చిరి ధర్మపద్ధతుల లీ • లంబూని వర్తిల్లి పం
బిన యావాహిని తల్లి పాలవలె నా • ప్పెన్ సర్వదా సర్వధా
వనజాతాసన సృష్టియందమరు జీ • వశ్రేణి కన్నింటికిన్

తే॥ కుంకుమము గందవొడి కోష్టు • గోఁగువేఁగి, పొన్న చందన మేలకుల్ • పునుఁగు వట్టి
వేరు చెంద్ర మగురు కురు • వేరు తేనె గలుగుటంజేసి నది యింపు • గాలివీచు

చ॥ నిలుకడనీఁగి వర్షమున • నెవ్వడిబోయతలెల్లఁగేఁ గా
డ్పులనెద బాఁదుకొంచుఁ బరు • వుల్గానిపొఱుచు విండ్ల నమ్మలన్
బిలపిలమూఁగి వారుకొను • వెంటల నారయ వెల్వలొప్పె మేల్
గెలుపును గొన్నయుబ్బునఁ ద • లిర్చెడి భూవిభు వెల్వలోయనన్

ఉ॥ పాలుపెరుంగునేయి కడ • వల్గల యుట్లను వారిమ్రింగి ప్రే
గోలల వల్వలం జవిరి • కొంచును మద్దుఁగూల్చుచేగు నా
లీలలఁగన్నఁగాళియ బి • లిష్ఠఫణావళి నాడినట్టి గో
పాలుని లీలంబలెనె • భాసిలుఁ దత్సరయూ ప్రవాహముల్

చ॥ కలకలమంచుఁ గాఁపులు క • కావికలై పరువెత్తుచుండ ము
న్వలన జలంబు నించి తల • వాకిళులం బడఁద్రోచి పైరులం
గలఁచుచుఁ దుమ్మెదల్ తొలుచు • గంట్ల మణీతతిరాలుచుండఁ గ్రే
వల నెసరేఁగుచుం గరము • పొఱు గజంబుఁబోరి వెల్లువల్

తే॥ పల్లమును మిట్టగా మిట్ట • పల్లమునుగ, సమము వాఁగుగా వాఁగును • సమముగాఁగ
సకలమును తారుమాఱుగా • సలుపుచుండు వెల్లువలు కర్మఫలములు • వీఁకఁదోఁచు

ఉ॥ కాల్వలయందు వెల్లువల • గర్జవినం బరువెత్తు కాఁపులా
కాల్వలఁజూడఁగా నెసఁగుఁ • గంబుకణంబులు పొన్నముత్తెముల్
వెల్వడ వీచికావితతి • వీఁగఁగ నొక్కటి పెక్కులౌచుఁబా
యల్వడి పొఱు వంశము మ • హాద్భుతవృద్ధి వహించు పోలికన్

మ॥ హిమవంతంబునఁ బుట్టి వెల్వడి సము • ద్రేశానుతోఁ బ్రేమ సం
గమముంజేయు ప్రవాహమెన్నఁగ మహా • గణ్యంబులై నట్టి వే
దములం దెల్పఁగలేని బ్రహ్మమనఁ దో • త్తన్ మూలమందొక్కటై
భ్రమచేఁ బెక్కుమతంబు లందిన బుధ • ప్రామాణ్యముం దోలెడిన్

మ॥ మకరందంబులు చిందు సద్వసములం • బద్మాకరశ్రేణిఁ జం
పక సౌగంధిక పుష్పవాటికల ర • మ్యంబైన గుంజాలతా
దిక వేలాయుత పూగ పుంజములఁబొం • దెన్ వెల్లువల్ జీవుఁడై
హిక కర్మాచరణంబునం దనువులె • న్నేఁజెందు చందంబునన్.

## 2-దేశపటలము. (61)

మ॥ సరసోక్తుల్ విరివారుచుండ విబుధుల్ • సమ్మోదముంబొంద మున్
వర మాధుర్య కవిత్వరీతిఁదెలిపెన్ • వాల్మీకి యెద్దాని న
వ్వరమోదారముఁ గోసలంబు నిపుడే • వర్ణింప మేకొంటిఁబ్రే
మ రసంబన్ మధువాని మూఁగ కడఁకన్ • మాటాడు చందంబునన్.

సీ॥ పొలముల గనిమలం • బొలుపారు ముత్యాలు, కాలువలందు శం • ఖములరాశి
కాలువ దరుల బం • గారు గడ్డలు నెను, ములు పొర్లు పల్లలఁ • గలువ వనులు
చదునైనచోట్లఁ బం • జములైన పగడముల్, వరిమళ్ళలో హంస • వరచయంబు
బీటినేలలఁదేనె • పెరల సమూహముల్, తోఁటల యందెల్లఁ • దేఁటి గములు

తే॥ ఇంపు సొంపార నారీతి • నెసఁగుచుండ, సంపదలపెంపు నిఁకనిట్టి • సరణిదంచు
వర్ణనముసేయ నరుదని • వాసికెక్కె, భాసురంబగు నమ్మహా • కోసలంబు.

సీ॥ పల్లంపునేలల • యెల్లలలో నేటి, వెల్లువల్ గావించు • పెనురవంబు
కాపులు చెఱకుల• గానుఁగ లాడంగ, నగు కిఱ్ఱు రొద లెల్ల • యదలుపులును
ఆగానుఁగలనుండి • యధికంబుగా వెలు, వడికడవలఁబడు • పాలరవము
నీటిదరులఁజేరి • నెఱయుచుఁదిరుగాడు, సంకు పుర్వుల కీఁచు • సందడియును

తే॥ నీటుగాఁగోడె లటనటఁ • బోటులాడు, ధ్వనులు లంకెల బెడిదంపు • నినదములును
జలములందెనుములు పడు • నులివుఁగలిసి, వింతఘోషంబునెగడు న • వ్వీటియందు

సీ॥ నందనంబును పోలు • సుందర వనముల, నమలులు పురివిచ్చి • నాట్యమాడ
జలము సమృద్ధిగా • వెలయు కొలంకుల, వెలిదమ్మి దివ్వెలు • వెలుఁగుచుండ
నీల ఘనాఘన • నికరంబు నిరుపమ, గ్రావ్యమృదంగ ని • స్వనముసేయ
విరివిగా నెడయక • తెరలుచు నుండెడి, కెరటాలు రంగుల • తెరలు దింప

తే॥ మకర వీణా నినాదంబు • మాడ్కిఁదేఁటు, లింబుగా నచ్చటచట గా • నంబుసేయ
మెచ్చి నల్లకల్వలు కనుఁ • ల్విచ్చిచూడఁ, దనిసి నిండు కొల్వుండుఁ గే • దారవిభుఁడు

సీ॥ ఇందిందిరంబులు • నింపు సెంపొందించు, నిందిరయును తమ్మ • లందు నిలుచు
వెలయాండ్రచూపులు • ఖరివింటితూపులు, కమన యువకుల వ • క్షముల నిలుచు

వారాశి దొంతు ప్ర • వాళమౌక్తికములు, మొగుళులయందును • మొనసినిలుచు
సత్యవాక్యంబును • శాస్త్రధర్మములును, జనములు నాల్కల • కొసల నిలుచు

తే॥ శాస్త్రవులయందు ప్రియులందు • సంచరించు, గోప మనియెడి యొకదొడ్డ కొడిమెగుణము
ఔర! ఎవరికే వర్ణింప • నలవి యగునె? కోసలంబందు చెలువంది • కొటిలులీరు

చ॥ జలముల శంఖముల్ తరుల • చాయల బట్టెలు, మాలలందు తేఁ
టులు జలజమ్ములన్ సిరి కు • డుంగమలం గమరమ్ముఁ లిండ్లవా
ముఁ దెలిపిట్టలున్, దరుల • ముత్తియముల్ వనులన్ మయూరముల్
పొలుపుగ గుంపుగుంపులయి • పొల్చును కోసల భూమి నెల్లెడన్

సీ॥ మడకలు దున్నఁగా • నెడనెడలేచు బం గారుపెళ్ళలును శం • ఖములు విడుచు
ముత్యాలరాసులు • మునుమిడి చదునైన, పొలముల రత్నరా • సులును వడ్ల
నిండఁగాఁ బచ్చనై • నెఱయువెన్నులు మీలు ఘనుగా రొదసేయు • మధుపవితతి
మృదుల పత్త్రములతో • మెఱయుచెఱకుతోఁట లల్లితామరలును • నల్ల గలువ

తే॥ లెల్ల విలసిల్లి యెచ్చట • నేని చూడఁ గాఁపు పడుచుల మొగముల • కాంతితోడఁ
గలిసి కనులకుఁ బండువు • గలుగఁజేయు సర్వజననుతమైన కో • సలమునందు

సీ॥ వినఁగ వీనుల కింపు • నెనయించు కుఱుచ వీ • ణియల వాయించు వై • ణికులు తేట
కలుద్రావి మెట్టుల • కిడనొక్కి యింపుగా, వాయించుపాటలు • ప్రతిదినంబు
వెండినాఁడెల్లనై • వెలయు సౌధములు లే, యెండలుగాయు ప • సిండి చప్ర
మంచములందు రి • మాకుమారుని సంగ, రించునఁబెనఁగి వి • భ్రాంతి గొన్న

తే॥ నీలనయనముల్ మెఱుఁగారు • నెమలి చాయ, కుందరదనముల్ పొలుచు న • క్కామరునెలఁత
లింపుగాఁగొన్న నిద్దుర • యెడయలేపు చుండును ప్రభాత మారుత • మొలయువేళ

సీ॥ చెఱకుగానుఁగ నోటఁ • జెదరి బయల్పడు, తేనియవంటి తీ • పైనరసము
టెంకాయ పాళలఁ • బొంకింబుగాఁగారి, వెల్లువలై బయ • ల్వెడలు రసము
ఉన్నతపనసముల • నొప్పారుతరువుల ఫలములు వ్రయ్యఁగాఁ • బాఱురసము
మానుగాఁబొడవగు • తేనెపెరలనుండి, మదిచవి గొనఁ బాఱు • మధురసంబు

తే॥ యువతులను యువకులు కాంక్ష • లూరఁదాల్చు పూలసరములనుండియు • బొలుచరసము
మెరమీటి వెల్లువలయి • వారిరాశిఁ, జొరఁగఁద్రావియందలి మీలు • చొక్కుచుండు

సీ॥ కలుద్రావుచోఁగాటి • కానంగనగు చొంగ, పొక్కులు వెలయు కొ • క్కులు కడంక
సంగీతమంబోలి • చవులూరఁజేయు ప, లుకులువఱుకు తమ వెలం • దుల విశాల
నయన వదన చర • ణ కరావె కంబుల, కుపమలై జగమున • మున్నతిగొని
యొప్పారు తమ్మిలు • నుత్పలాదికములు, దక్కఁదక్కినకల్లు • తనరకుంట

తే॥ యెఱిఁగి తీసివైవఁగవారి • యెదఁదయొప్ప, కట్టులిట్టు లూరక తిరు • గాడుచుండ్రు
యువకులోకయప్పు యువతుల • యొప్పుప్రేమఁ, బడసిరేనియు మఱిత్రోయ • విడువఁగలరె?

చ॥ కదలియుఁ గ్రొత్తనీట జల • కంబులుసేయు పద్మంతులొప్పుగా
జడలధరించు పూ లగురు • చందనగంధమె వీచునన్న న
క్కడి పలకాఁడు వాలు కడ • కన్నులఁజూడఁగరేఁపు తేనె ప
ల్కడరు మెఱుంగుఁబోండ్ల పొలు • పారెడి తీరుల నెన్న శక్యమే?

ఉ॥ ఆమనిఁ గామినుల్ జలక • మాడిన నీటి మహత్త్వమెన్నఁగా
నేమగుఁ? దోఁటలన్ బొలము • లెచ్చటఁజూచిన జిడ్డువాఱి యా
చామ లలందినట్టి మృదు • చందన పంకము పేరినట్టి త
ద్భూమిని తేంట్లు గుంపులయి • మూఁగును తేనియ నానునాసమై.

చ॥ పొలముల వాఁటగంటులను • పోలి చరించెడి రాజహంసలి
మ్ముల జలజంపుఁబానుపులఁ • బొల్పుగ నుంచిన పోతకమ్ము, లం
దులఁ జరియించు బక్షియలు • దూడల నెద్దఁదలంచి చేఁపఁ జా
కులు గొను పాలఁద్రావి వెల • లున్ మఱివైచుచుఁ గప్పగంతులన్.

చ॥ పికవితతుల్ వినోదముగఁ • బెండిలిసేయఁగఁ, గన్నుద్రిప్పుపొం
దిక గల స్త్రీల నర్తనపు • తీరులకంటె మయూరసంఘముల్
రకముగఁగొమ్మలం దలర, • రాజ మరాళము లబ్జశయ్యఁ గూ
రికివిడ, మేలుకొల్పులు ద్వి • రేఫములొప్పుగఁ బాడుచుండెడున్.

సీ॥ కులధర్మముల కను • గలుగు పడుచుల, వెదకి పెండిలి నెల • వేర్చువారు
గ్రద్దతో స్వచ్ఛాయ • గదలు కరణివచ్చు, పాటల సుఖములు • పడయువారు
దేవామృతము కంటెఁ • దీయనౌ సద్ధర్మ, విషయంబు లడుగుచు • వినెడువారు
అతిథుల మోముల • నరసి యన్నంబిడి, యత్యధికానంద • మందు వారు

తే॥ కినుకయూరక మదిగొని • కనులకంటెఁ, దామ్రమగు జుట్లఁజూపి యు • త్సాహమునను
పిరగుణగుప్తి నుసుతేని • పీడుకోళ్ళఁ, బోరరేఁచుచు గెలివిమైఁ • బొదలు వారు.

చ॥ పరువపుదున్న లొండొకటి • భగ్గునఁగోపము గొన్నపిడ్గులన్
పెరవునఁ దాఁకుచున్ బగయుఁ • బెచ్చు పెరుంగఁగ నెల్లచోటులన్
విరిసిన మబ్బు రెండగుచు • వింతగఁ బోరినయట్లు పోరు పో
రరసి ద్విరేఫముల్ నెగసి • యార్వ, ముదుల్విడ నార్చువారలున్.

చ॥ మొలచుచు నున్న తామరల • మొల్కలు నల్గఁ బసిండి ముత్తెముల్
తొలఁగఁగఁద్రోఁచి రత్నవిత • తుల్ చెదరం దెలిసంకుపుర్వులం

బలవరమొందఁగా గమర • వర్గము మోద్పుగొనంగఁ జాళ్ళఁజేఁ
పలు కదుఁద్రుళ్ళ దున్నలను • వార కదల్తురు కాఁపు లచ్చటన్

ఉ॥ పాడియెటింగి యాసవిడి • పద్ధతికోపమునూని కోరఁగాఁ
గూడిన వానిఁబొంది జన • కోటికి మేలొనరించి కీర్తి ప
ర్వాదెడు జేఁడు కావ బరు • వంతయు నీ గుచు నూర్చుభూమినా
నోడలు వస్తువుల్ విడిచి • యొందు విరామము నుప్పళంబులన్

ఉ॥ కోసినయోదె లాకసముఁ • గూడఁగ వాముఁనేసి పెద్దవా
ర్చేసిన బోధతో నుచిచి • చేరిచి కళ్ళపు బిచ్చగాంద్రకున్
వేసియుఁ దక్కువానిఁ దమ • విందుం తోడ భుజింప బండ్లకుం
బోసి ధరిత్రిక్రుంగఁ గొని • పోదురు కాఁపులు ధాన్య మిండ్లకున్

ఉ॥ తీఁగుఁగాచు కాయలును • తీయని వాసనగ్రమ్ము తోఁటఁన్
గాఁగల ఎండ్లు కందములు • కాయుం ధాన్యము మళ్ళనుండియున్
రాఁగుం ధాన్యముల్ నిలువ • రంబుగఁ బూవుం నిల్చి తుమ్మెదల్
తేఁగల తేనెపోల్కిఁదగఁ దెత్తురు • మెత్తఁగఁ గాఁపు లిండ్లకున్

సీ॥ ఎచ్చోటఁగాంచిన • నింపుసొంపారంగ, విప్రులు తమయిండ్ల • విందులుగను
బంధువులను గాఁగ • వచ్చినవారితో * ముత్తెఅంగుల పండ్లు • ముందు గొనుచు
బలువగలైనట్టి • పప్పులతో వాని నింపి వెల్లువ వోవు • నేతి తోడ
గడ్డపెరుంగుతోఁ • గండచక్కెరతోడ, నడుమ నడంగున • న్నంబు తోడ

తే॥ మృదుల ప్రియవాక్యములతోడ • ముదముతోడఁ, దనివిదీఱనిదేవాప్య • తంబుఁబోలె
భోజనము చేయుచప్పళ్ల • పూర్ణమగుచు నెప్పుడొప్పారు నప్పురి • చొప్ప గొప్ప

తే॥ కాఁపు చెలువల వదన పం • కజముఁందు వెలయు కాటుక విన్నుల • లలితరీతి
నొప్పునాఁడుఁదేంట్లని భ్రమ • గప్ప వలచి, కదఁకి మాగాణిఁ దిరుగాడు • గండుఁదేంట్లు

తే॥ కెరలు చూపుల మారుని • గెలిచినట్టి, పంట పడఁతుల గబ్బిగు • బ్బలు కిడింది
మగలఁగినిసి లోఁగొను, నట్టిమళ్ళప్రక్కఁ, బాళకలుద్రావి మదియించు • వాలుమీలు

తే॥ నేలవ్రాలిన మేఘంపు • నకరమనఁగఁ, జల్లనీటను దిరుగాడు • నల్లయెనుము
లెదలఁగ్రేపులఁదలఁపఁగాఁ • బొదుఁగుచేఁపి, పాలుగాఱ గోముగ వరి • పైరు పెరుఁగు

ఆ॥ నిండుబాసనములు • నినదింప వార్చిన, కిడుగునీటిచాళ్ల • క్రముక వనము
లందు చొచ్చియచట • నపరంగ నాటిన, యెట్టువల్లపైరు • నెలమిఁబెంచు

* అరఁటి పనస మామిడి

ఆ॥ తామ్రచూడములు ప • దంబులఁ జిదిఁగ్రొత్తో, యంగనైన కుప్ప • లందు మెఱయు
మణుల జీనువాలు • మిణుగుఱుఁబుర్వులం, చెంచి గూండ్లలోన • నించుచుండు.

ఉ॥ చేతుల సంకుగాజులను • చేరికఁ గవ్వములాడు సవ్వడుల్
చేతముఁ జల్లఁజేయఁగను • చెన్నగు కౌనులు వీఁగియాడఁగా
వ్రేతలు పెర్గు చిల్కుదురు • వేనలు యాడఁగ మైచెమర్పఁగన్
బ్రీతమనస్కలైన తమ • పిల్లలు నిద్దుర వీడి లేవఁగన్

చ॥ చిలుకల పిల్లలుం బలుకుఁ • జెన్నుగఁ బండిన కొబ్బిచేలలోఁ
బులుఁగుల పిల్లలుం బలుకు • భూజ నికుంజములన్ మనోజ్ఞతన్
గొలఁకుల తేఁటులుం బలుకు • గుమ్మని వాసన వీచు తమ్ములన్
గలకల సువ్విపాట లెస • కంబుగ దాతలయిండ్ల నిండెడున్.

క॥ కోసిన వక్కఁ నేరిచి, త్రోసినయవి దొంగ చూపు • తూఱని పడుచుల్
చేసిన యిండ్లకు మంచెలఁ, దోసిన తఱిఁజిందినవియు • ముత్తెములె చుమీ!

తే॥ కొదమ గొట్టెలు గాంచిన • బెదరులేని, గుండ్ర మెలికల కొమ్ములఁ • గొఱలుపగరు
లుఱుము కరణిని పిడుగుల • సరణి దాఁకు. ధ్వనులకంజి గిరుల నీర • దములు మెఱయు

ఉ॥ పిల్లలఁగన్న యేనుఁగుల • వీడి మదావళ రాజిఁ బట్టఁగాఁ
బల్లులు ద్రవ్విపెట్టి వన • భాగములన్ మలక్రిందినేలలం
దుల్లసిలంగ నున్న • ను • లొక్కటఁజేయు మహానినాదముల్
ఘొల్లఁ గొలంకులిం దిరుగు • మేటి మరాళములం గలంచెడున్.

చ॥ గెనసులు త్రవ్వచో నడుమఁ • గేలికిఁదొలు మణుల్ విదుర్పఁగా
మునుకొని వ్రేలు మావులను • ముట్టుడు నందలి తేనె తుంపురుల్
చినుకును బిందురూపమునఁ • జెన్నరు పుప్పొడి పైఁడిపోల్కఁబై
నెనసిన పొన్నమంజరుల • నింపుగఁ గూరుకు నంచగుంపుపై

ఉ॥ కాఁపుచెలుల్ కరంబుల ర • కంబుగఁగూర్చి వినోద లీలలన్
జూపుచుఁ బాడు పాటలు వి • శుద్ధిగ*రెండువిధాల వేణువుల్
చాఁపుచుఁబట్టు గొల్లమొగ • సాలలఁ గట్టిన యాలదూడలన్
జోఁపుచు లాలిపాటలలిఁ • జొప్పుగ నిద్దురపుచ్చు హాయిగాన్

తే॥ కొండక్రింది నేలల నుండు • కోమలులు వి, నోద రీతిని పాడు వి • నూత్న గాన
మలరఁ జిఱు ధాన్యములు పండు • నట్టి పొలము, గాచు నక్కఱలేకుండఁ • గా ధ్వనించు

ఉ॥ గాలికి వంశముల్ గదలి • గాఁడఁగఁ గొండలనుండి పెన్ ఫణుల్
వ్రేలిన రీతిఁ గ్రొమ్మధువు • వెల్లువ ధారలు పాఱ్ఱి చెందొవల్

* కట్టెలతోఁ జేయఁబడినవి, వెదురుతోఁజేయఁబడినవి.

గ్రాలు కొలంకుల న్నెఱసి • కొలువ తూములఁ జొచ్చి బైట రాఁ
గ్రోలి మొగమ్ము మ్రుచ్చుకొన్ని • ప్రుక్కను శంఖపుఁబుర్వు లయ్యెడన్

తే॥ నిడుద నల్లని కనులక్రొ • న్నెల స ౘళ్ళ, కలుకులకు విద్యయుఁజెదని • కలిమిగలుగ
నొచ్చివచ్చువారల కొర్కె • లచ్చటయును, అతిథిపూజయుఁబనిగాక • యన్యమేది ?

తే॥ వంచనములేని సత్రముల్ • వఱలుచోట్లఁ, గ్రొన్నెలంబోలు కొడవండ్లఁ • గోసి కుప్ప
గూర్చుకూరగాయలు పప్పు • కుప్పలు వెలి, ముత్తెముల వంటి బియ్యపు • మూటలమరు

తే॥ కలము లొసఁగుఁగాఁపులకుఁగా • వలయుధనము, భూమిదేవి యొసంగును • పూర్తి పంట
గనులొసంగును మేటియౌ • మణులసమితి, కుల మొసంగును మేలైన గొప్పనడత.

తే॥ దొసఁగులేమి నకాల మృ • త్యువులులేవు, మదిని మదిమదియుఁ జే • రదు చిరాకు
పూని చేయు ధర్మేతర • ములును లేమిఁ, గడకు దుర్గతి యన్న శం • కయును లేదు

తే॥ క్రమముదప్పి వెల్లువల య • క్కడఁజరించుఁ, గుంకుమాంకభుజంబులే • గుఱుతుదప్పఁ
జెలుల నడుములె యట సన్న • గిలుచునుండు, వాసనలు గలయవి కేశ • పాశతతులె.

క॥ అగురుపొగ బానసంబుల • పొగయుఁ జెఱకు పాలు కాఁగు • పొగయును వేల్మిం
బొగతోఁగలియుచుఁదత్పురి • మొగుళులవలె నెల్లయెడల • ముసరుచునుండున్.

తే॥ కలికిమైవాయఁబోలి కే • కులు చరించు, కలికి స్తనహారరుచివోలెఁ • గాయునెండ
కలికి నెటివేణి వోలె మే • ఘములు క్రమ్ము, కలికి చూపులవలె వాలు • గలునువెలయు

మ॥ కలఁగంబాటి జలంబు పొంగ నులియం • గం గౌను లీఁదాడు కాఁ
పుల పూఁబోఁడుల యెట్టనొ పెదవులం • బోలెన్ విరాజిల్లు చెం
గలువల్ విచ్చును మళ్ళలో; మడవలం గంజాతులంబోలి హం
సలు మెల్లన్నడతెంచు; వారిమొగమా • సన్ విచ్చు నీరేజముల్

శా॥ కేరున్నారుల యోరచూపు ప్రతులన్ • గ్రేడించి యాడించుచున్
గేరున్ వారినడల్ కరేణువుల చ • క్కంగాంచి యెంతేనియున్
గేరున్ నీరజకుట్మలంబుల పసం • గేల్పొచి వక్షోజముల్
కేరుం బూర్ణ శశాంకు నొప్పిదపు భం • గిన్ వారి ముగ్ధాస్యముల్

ఆ॥ చెదరియున్న మణులు • బెదరించునినుకాంతిఁ, గొబ్బెరలను గెలుచుఁ • గొమల చనులు
వారి వలువలెల్లఁ • బాలనురువు గెల్చు, వాద్యములు మొగుళ్ళ • ధ్వనుల నోర్చు.

తే॥ జలదములు పెద్దతోఁటల • చాయఁబోలుఁ, బొన్నమల యటఁగసవువా • ములనుపోలు
జలధు లచ్చటిపెనుకొలఁ • కులనుపోలు, స్వర్గపురి పలునిధుల కో • సలముఁబోలు.

ఉ॥ రాసుల వద్దు లేనియెడ • రాజిలు నచ్చపుటాణి ముత్తెపు
బ్రాసులు లేనిచో నుదక • రాశిని కూర్చిన తెల్ల యుప్పుపె

స్నానులు, లేనిచో నదులు • రాయిడి ద్రోయుచు జేర్చు పన్నిధు
ల్వాసిగ నవ్వి లేనియెడ • ఖాసిలు మౌక్తిక సైకతంబులున్

ఉ॥ చందనపున్ వనంబులొకొ? • సంపెఁగతోఁటలొ? చెప్పనౌనొకో?
కందుక కేళినల్పు కుల • కన్యలు కానఁగవచ్చు నిక్కువల్
సుందర నందనంబులొకొ? • చొక్కపుఁగుందవనంబులొక్కొ? యా
స్కందునిపోలు వారలెల • సంబున విద్దెల నేర్చు తానముల్

ఉ॥ చక్కెరఁబోలెఁదీయనయి • జానగుబాలల తొక్కుపల్కులం
జొక్కిపికాళినేర్చు బలు • సూటిగ; వారలనర్తనంబు లిం
పెక్కనెమిళ్ళనేర్చు: నల • యింతుల సొంపు రదాళిఁబోలు మేల్
చొక్కపు ముత్తియాలు విడు • చున్ రహిఁబర్వపుటాఁడు శంఖముల్.

తే॥ కల్లుగీతురమ్మెడివారి • పిల్లవాండ్రు, సేద్యమొనరింత్రు కాఁపుల • చిన్నవాండ్రు
వైణికుల పిల్లలును వీణఁ • బాడుమంద్రు, వాదకుల సుతుల్ భద్రర • వంబు నింత్రు

తే॥ మలయుహారముల్ సోనగా • మధువునొసఁగు, వలయుమణికనకంబులఁ • గలము లొసఁగుఁ
బొలయుమలయానిలంబె తం • పురుల నొసఁగుఁ. గలయఁ జెవిచవు లచ్చటి • గాథలొసఁగు

చ॥ వనములయందు వేదుకగ • వారిజనేత్రలు లోలవేణులున్
ఘనకుచ బంధనల్ నడవఁ • గాఁ దమి వారల పోల్కిఁగాంచి యిం
పెనయఁ గలాపిపాళి తమ • యింతులెకా! యని కోడెకాండ్రనె
మ్మనములఁబోలె గంధసుమ • మండనయుక్తల వెంబడించెడిన్.

తే॥ ఎఱుగఁరా దీనిమహిమ పే • దఱిమిలేమి, నరయరాదు శౌర్యమహిమ • యరులులేమిఁ
గనఁగరాదు సత్యమహిమ • కల్లలేమి, వెదఁగులేదు పెద్దలయొద్ద • వినమిలేమి.

తే॥ కొఱ్ఱ లుద్దులు పెసలు నూఁగులును జొన్న, లులవలును తవిదలు చామ లున్నబండ్లు
బురదనేలల నుప్పును • మోయు బండ్లు, త్వరితగతినేగ నొండొంటి • లొరయుచుండు

తే॥ సద్గతుఁనొంద సత్కర్మ • జరుపకుండు, నరులు వొందు పల్గతుల జన్మ • ములమాడ్కి
బెల్లమును తేనెచక్కెర • పెరుఁగుకల్లు, వినిమయంబుగ జరుగు న • వ్వీటియందు.

తే॥ వేణువులుపాటలు ధ్వనించు • వీథులందు, నదులు నదులును ఢీకొన్న • పదురుదోఁప
యజ్ఞముల కుత్సవములకు • నరుగుజనము, గుంపుగుంపులై యొండొంటి • గూడుచుండు

తే॥ ఊఁదునట్టి శంఖాదుల • యులివు మఱియుఁ, దట్టి వాయించు చర్మవా • ద్యముల ధ్వనులు
కట్టలంగొట్టు భేర్యాది • కముల రవము, నట్టల నదల్చు కాఁపు సం • దడుల నడఁగు.

తే॥ రశగల బొమ్మలంజొల్లు • రమణఁగాఱు, పిల్లలకున్న ముఁగుదుపు • తల్లు లమర
మఁదుచుకెంగేలు వెన్నెలన్ • ముడిఁగినట్టి, యెఱ్ఱదామరలంబోలి • యెసకమెసఁగు.

తే॥ పదిరెసందంబు తముఁబెంచి • గుణము వలన, అమఁపగునీచినిలిచె సౌర్యఁ వలన
వెలసె ధర్మంబు మగువల • ప్రేమవలనఁ, దనరెఁదబివాన క్రొత్తది • లసముఁలన

తే॥ పెక్కు వసములు చుట్టిన • పెద్దదేశ, మెటి గియెల్లల గని పల్కు • నెవరితరము?
ఒత్తువెల్లువల్గల సర•యూనది పలు, దారులం దారియుం గన • నేరిదయ్యె

తే॥ ప్రళయకాల వాయువులచే • వనధిరేఁగి, పొంగి వచ్చిన నాశంబుఁ • బొందనట్టి
కోసలంబుమహిమ యిట్లు • కొఁటలు నింక, సరయుదను నగరంబు తీ • రబుగ్వ వఱకు

## 3-నగర పటలము (75)

మ॥ లలి మాధుర్యము నర్థపుష్టి సరసా•లంకారరీతుల్ ధ్వనుల్
గలయంబల్కు మహాకవీంద్రులకు శ్లా • ఘ్యంబై యజాండస్థ జీ
వులు దుస్సాధ తపఃఫలాదికముచేఁ•బొందంగనై దివ్యమం
దలి జన్మంబున కాస సేయఁగ నయో•ధ్యాపట్టణంబొప్పెడిన్

మ॥ ధరణీదేవి ముఖాబ్జమో? తిలకమో? తన్నేత్రమో? దివ్యసుం
దరి భద్రాయల సూత్రమో? కుచతటో • దంచన్మణీ హారమో?
వర జీవస్థలమో? రమావసతి యో • పద్మంబో? శ్రీవిష్ణుపే
రురమో? కౌస్తుభ హేమ పేటికయొ? దే•వౌకంబుపై లోకమో?

మ॥ ఉపమానం బొకటేని నెమ్మనముఁలం • దూహించి యిన్నాళ్లుగా
త్రిపురద్వేషియు బ్రహ్మయున్ హరియు సా•ధింపంగలేరైరి య
య్యుపమంగాంచ నడంపరాని తమిలో • నుల్లంబు ప్రేరేఁపఁగా
నిపుడున్ జెప్పలు వాల్పకంతరమునం • దీక్షింత్రు చంద్రార్యముల్

మ॥ అమరాధీశ ధనేశ పత్తనముల • ధ్యాసంబుచేనైన య
ట్లమరం జేసిన బ్రహ్మ యావలనె య•త్యంతంబు వైశాల్య మం
దము పెంపారఁగ సృష్టిచేసిన యయో • ధ్యంగాంచి సంకల్ప శి
ల్పము దేవాసుర కారుపుల్ మఱచుచో • వర్ణింపఁగా శక్యమే?

ద్విపద॥ పుణ్యాత్ములకు స్వర్గ•మున సుఖంబనుట, గణ్యమౌ శ్రుతుల వా • క్యంబద్ది నిజమ
తపము ధర్మంబును•ధరణి ఫలింప, నుపకరించిన ప్రభుం • డొక్క రాముండు
తక్క మఱెవ్వరా • తామరసాక్షుఁ, డిక్కగాఁ గొనియేల•నెల్ల లోకముల
నన దీనికంటె సు • ఖానుభవమున,, దనువు తలంబు భూ•తలమునఁగలదె?

ఉ॥ తొరపు ధర్మమున్ గరుణ • తోడి జితేంద్రియతన్ భజించి పెం
పారు తపంబుచే నెఱుక • యబ్బిన వారలకున్ శరణ్యమౌ

శ్రీ రమణుండు పుట్టి యట ၊ జెల్వుగ నొప్పెను సీతతోడ నూ
బాఋల యేండ్లనంగ దివి ၊ నైనను దాని సమంబు గలునే?

చ॥ కలరట రాజులు న్నగలు ၊ గల్గను గల్గ నమూల్యరత్నముల్
కలవు మదేభముల్ హరులు ၊ కాంచనమున్ భువి గల్గ నన్నియుం
గలవు మునీంద్రయక్షసుర ၊ కాండము వచ్చుచు సంస్తుతించు న
న్నెలవున కొక్క మేలుపమ ၊ నెర్పునఁ దెల్పఁగ నుండినం గదా?

కోట గోడలు

చ॥ చదరము శాస్త్రసమ్మతియుఁ ၊ ఒక్కఁదనంబును పెద్దకొండలం
గుదురువు గాన నాపసిఁడి ၊ కోటలకున్ సరిరావు శాస్త్రముల్
చదివి ప్రయోజనంబు గల ၊ చాడ్పునఁ గట్టిన వానిచెల్వమే
పొదవు మహోన్నతంబుల మ ၊ హోన్నతమై పెనుతెల్వికై వడిన్

సీ॥ శిల్ప విజ్ఞానంబు ၊ చేఁ దుదిఁ గాంచమి వేదమ్ములంబోలె ၊ విస్తరిల్లు
భువిమీటి దివిఁజేరి ၊ పొలుపారు చుంటచే దేవతలంబోలె ၊ దేజరిల్లు
నతి బలిష్ఠంబులై ၊ యదరు నింద్రియముల నడచుటచే మునీం ၊ ద్రాళిఁబోలు
నెల్లప్పు డేమట ၊ కెసఁగి కావలి గాచు కిర్జంబుచే దుర్గ ၊ కరణి వెలయు

ఆ॥ శూలమును ధరించి ၊ శోభిల్లు చుంటచేఁ, గాళిఁబోలి భీతి ၊ గానిపించు
నమిత గౌరవమున ၊ నన్నింటఁ బోలు దు, ప్రాపమగుటచే దేవు၊ఖాతిఁబోలు

సీ॥ నెలవంకలంబోలి ၊ పొలుపారు నఖములు చెందామరలఁ బోలి ၊ చెలఁగుకాళ్ళు
అలరుఁ దీవియఁ బోలి ၊ యసియాడు మధ్యంబు లెడనీటి కాయల ၊ నెనయు చనులు
వంచిన వంగు లే ၊ మించు వెదురువోలె లావులై మృదువులౌ ၊ లలితభుజము
లింపుసొంపుగ రుచి ၊ యించుతేనియఁబోలు సరస సుశ్రావ్య వ ၊ చస్సు లమరు

తే॥ యువతులెల్లెదఁ గాంచిన ၊ నొప్పుమిగిలి నిండియున్న ప్రాకారంపు ၊ నెలపుగలుగు
నయ్యయోధ్యకంపెను సొగ ၊ సరయఁగలదే?, అమృతభుక్కులు వసియించు ၊ నమరపురిని

సీ॥ ప్రజలచేఁ గొలువంగఁ၊బరుటచే శత్రురా၊జ్యపటంబు లురలింపు၊మహిమచేత
శాస్త్రపద్ధతిఁ జను၊చక్కందనముచేతఁ దేఱి చూడఁగరాని၊దిటవుచేత
నధిక బలంబు పెం၊పారుచుండుటచేత నాయుధాభ్యసన వి၊ఖ్యాతిచేత
గురు అంత్ర యంత్రముల్၊కుదిరియుండుటచేత, జయపతాకా విలా ၊ సముచేత

తే॥ అమిత మహితోన్నతా శ ၊ యంబుచేత, రాజచక్రంబు నడపు న ၊ త్రక్కముమువెర
రాజరాజులకై విడిఁ၊దేజ గిను గల్గిన యచటి ప్రా ၊ కారచయము?

చ॥ అతి శిత ఖడ్గ తోమర శ ၊ రాస హూం గదాది సాధన
ప్రతతులు గగ్గె తార్క్ష్యుని ప్ర ၊ భంజన మల మాన పంబు నే

వితమునఁ జెంగనీయక వి • ఖ్యాతి మొనర్పఁగఁ జాలు యంత్రముల్
మితమును మించియుందునన • మిక్కిలి చెప్ప నిఁకేమి యుండెడున్?

చ॥ తొరవులకంచెఁ గిరితియై • దొడ్డగుణంబనియెంచి జీవకో
టులెవరలఁ నొందనీక జగ • తీశుల దండము నాధికార్యమున్
దదయక స్వర్గమున్ దిశల • దాఁటియుఁగాచును నుండఁ గోటలా
పుడమికి సౌరుఁగావెలయు • భూషణమాత్రమనం దొసంగొకో?

సీ॥ బంగారువెలగాఁగఁ • బడయువేశ్యలమది. వితములోఁతయి నీచ • వృత్తి యడరి
యల్పకవిత్వమ • ట్లమరి స్పష్టతలేక, లోని యర్థము దురా • లోకమగుచుఁ
గులకన్యకల వలెఁ • గోరి యెవ్వరి కంట. రాని యత్యధికమౌ • రక్ష గలిగి
చక్రవాళము ప్రక్క • సద్రంబు-మాడ్కిఁ బ్రా. కారంబుఁజుట్టియ • గడ్డ యెప్పు.

తే॥ మంచిత్రోవలఁ బోనీక • మార్చెడుగు, దారుణందోర్చు నింద్రియ • తతిని పోలి
యెడఁద కడలను గూర్చెడు • ఛెదిదములగు, క్రూరమకరముల్ మిక్కిలి • కొలలునందు

చ॥ తరలెడు గుంపుగల్గిన ప్ర • ధాన పయోదము మేరమేటి య
య్యురగ జగంబు లోఁతు విరి • వొప్పు నగడ్తను పోలఁ గాంచి ధీ
కరమగు నబ్ధియుంచుఁగడఁ • కన్ జనమానుచులేచి యుప్పరం
బొరసిన కోటఁగాంచి గిరి • యూహను వర్షమునించు దానిపై.

తే॥ పరిఖయందున జనియించి • విరిసె పరిసు, శంబు వీచు పంకేజ వ • నంబుచూడ
మున్నుమగువలనాగసుమో • ములకు నోడి, బలముచేర ముట్టడిగొన్న • వలను దోచు

ఉ॥ అరసిచేసినట్టి పలు • యంత్రచయంబుల తోడ నొప్పు ప్రా
కారముఁజుట్టి నిండిన య • గడ్త మునుంగుచు లేచుచున్ మహా
కారదనొప్పు నక్రములు • కంధిని మత్తగజేంద్ర సంఘముల్
కోరిక మీఱ వేడుకలఁ • గూడి చరించు విధానఁ దోఁచెడున్.

చ॥ క్రకచముఁబోలు వాలమును • ప్రక్కలకార్చుచు లేఁతచందురున్
వికటముసేయు కోఱగవ • వెల్వడి ఖాసిల నోరువిప్పి ని
ష్కృక లెనఁగన్నులందురలఁ • బోరొనరించు మొసళ్లు నెక్కుమై
జకచక రక్కసుల్ కసిమ • సంగి పెనంగెడు భంగి నొప్పెడున్.

సీ॥ ఈవల కావల • క్రీడను విహరించు, రాయంచ లాతప • త్రములుగాఁగ
వింతలౌ మొసళులు • వినువీధి గ్రహములు. తిరుగు మేరువుఁబోలు • కరులుగాఁగ
చలిత నాళములతో • వెలయు తమ్మిలకోడి, తరఁగల గుంపులు • తురగములుగఁ
గెరలుచుఁద్రుళ్లెడు • మెఱయుమత్స్యంబులు. ఖడాది బహువిధ • కరణములుగఁ

తే॥ జూడఁజూడ గంభీరమై • చూడ్కి కదలు, నించి తుదిమొదల్ నడుము గా • న్పింపకుండ
నల్లనల్లనఁ గదలు సై • న్యంబొ యనఁగ, నప్పురము చుట్టి యొప్పారు • గొప్ప పరిఖ.

తే॥ ఓరదిన్నెలు వెండిచే • నొప్పిలోని, పైఁడి తేకుల ప్రక్కనఁ • బటిక తాలు
పొదుగఁబడఁగ నగర్త నీ • రివి యటంచుఁ, దెలియఁ జూపుదు మనుట ది • వ్యలను సరిది

తే॥ పరవి లోఁతైన పరిఖయన్ • వనధిచుట్టు, బలసి బలిసిన యడవినాఁ • బరఁగు వనము
కదలకుండు నిరులగుంపు • పొదలె ననుచుఁ గోటకొక నల్లనగ యంచుఁ • జాటవచ్చు

## గోపురద్వారములు

మ॥ నలుదిగ్వీధుల నిల్కడన్నిరిచి యుం • టంజేసి నల్దిగ్గజం
బులఁబోలున్ హరి స్వర్గముం గొలుచుచోఁ • బొల్పారు పాదంబు క
న్నలలిన్ వర్ధిలి సర్వజీవులకు స • న్మార్గంబు తాఁజూపుటన్
నలువేదంబుల మూర్తి నొప్పు నగరిం • దద్గోపుర ద్వారముల్.

తే॥ పొలఁతిఁబిల్చియు రామి గో • పురము మీఁది, పెంటిచిత్రముఁజేర నా • ప్రియయుఁ గినుక
గూకిపైఁబూని తపసులు • కోరిచేరు, నమరపురిలోని నందన • ముందు డాఁగు

సీ॥ మరిచినటాల న • మర్చి ముందర స్ఫటి, కపురాలఁగట్టి పైఁ • గ్రాంతిగల్గు
బంగారు దూలముల్ • రంగారఁగా నిల్పి, పై వెండిదంతెలు • పరపి వాని
పైని వజ్రాల కం • బంబులు సవరించి, పచ్చలబోదెలు • పరఁగ నునిచి
రీతియౌ రత్నచి • త్రిత సింహముల మీఁదఁ, బసుపు రాళ్ళయ్యలఁ • బాదుకొలిపి

తే॥ యేడుజగముల వార్నిల్వ • నెంచినట్లు, పెద్దయంతస్తులేడు క • ల్పించు గోపు
రములు శిఖరాల నొప్పారు • రత్నకలశ, ములు ధరాదేవి శీర్షక • ములను పోలు

## మేడలు.

క॥ నల్లనిదె నెలయు ననఁదగి, వెల్లఁదనమునొంది సంకు • వెల్లయడరు నా
తెల్లనిమేడలు గాలిం, దల్లడపడు పాలవెల్లి • తరఁగలఁబోలున్.

క॥ సొగసగు పనిగల బంగరు, తగటి కొణిగలన్ విటంక • తండములు కడున్
నెగడినమేడలు కైలా, సగరిన్ లేయెండఁగాయు • సరణి వెలుంగున్.

క॥ పెరి మణి కంబంబులఁ పచ్చల బోదెలపైన శిల్ప • చతురిమ వెలయం
గలమేడలఁ గని తమరథ, ములె యని యమరులును భ్రమలఁ • బొందుదురచటన్

తే॥ పలుపుగా నెలతాలను • పఱపిపైన, చందన స్తంభములు వరు • సలుగ నిలిపి
పగడపుం బోదెలుంచి శి • ల్పంబమర్చు, మణుల బొమ్మలమేడలు • మలయుఁగోట్లు

తే॥ బెడఁగుపనినేర్పుగలతూండ్ల • యడుగు తమ్మి, రూపు పున్నాగయుక్తి సు • రూపగరిమ
దర్శనీయ శిల్పంబు మ • ధ్యంబు బయలు, పై తిళుకుల మేడలు పోలుఁ • బన్యాసతుల

ఉ॥ లోపలఁజొచ్చువారు రమ • లోచనయుగ్మము నార్పకుండి సం
దీపిత దేహులై సురల • తీరువహింపఁగ, దివ్యులెక్కి మేల్
తోఁపికతో విహారములఁ • దోఁచు విమానచయంబుఁబోలి యె
త్తై పరఁపైన మేడలు వి • యచ్చరలోకముసంటి భాసిలున్.

తే॥ కుందరదనలౌ చెలులు న • రిందములగు, వీరవరులు యాత్రలుచేయ • వెడలియున్నఁ
గనక రత్న గేహమ్ములఁ • గ్రమము చెడక, ప్రాఁతధర్మపద్ధతు రెడ • పడక నడచు

తే॥ మింటినంటఁబెరిఁగి మితి • మీఱుకలిమి, కలిగి యున్నతి కాంతియు • నలరుమేడ
లందనింద్య ధర్మప్రభు • లట్లువిభవ, యుక్తులగుచు నుదారులై • యుండ్రుజనులు

చ॥ ఝరములఁబోలి ముత్తెముల • జాలరు లొప్ప మొగుళ్ళ గుంపులన్
దొరసి ధ్వజాళియున్, మణుల • తోఁపురాసులు, హేమరాసులుం
బెరసి పయోరసంఘమన • మెత్తలు రాజిలుమేడ లారయన్
గిరివర సంచయంబనఁగఁ • గీరితికెక్కు మహోన్నతంబులై.

ధ్వ జ ము లు.

తే॥ అగురుచేఁ బొగచూరి పై • మొగుళులందుఁ, గలిసిపోయిన కేతనా • గ్రములనున్న
శూలసంతతి కాంతుల • జాలుకొనుచుఁ, బగటివూటనె మెఱుపుల • పగిదిమెఱయు

మ॥ స్తనభారంబును మోవలేనిపగిదిన్ • జవ్వాడు లేఁగౌనుతో
వనితల్ కాసలయందియల్ మొరయఁగా • పర్తించు తద్దేహకే
తనవస్త్రాంచల వాయు ఘర్షణ పత • త్కల్పప్రసూనవ్రజం
బనువందం గయిసేయు తోరణ విధం • బైయందు రాజిల్లెడిన్.

తే॥ గిరులఁ గనవచ్చు కదళికా • కీర్ణవనము, పగిది గ్రహమండలమునంటు • ధ్వజపటంబు
లొరయుటంజేసి ఛిన్నత్వ • మొందిక్రుంగి, ప్రతిదినంబును శశి కృశ • త్వంబుఁగొనెడి

సంకీర్ణము

చ॥ కలపటఁబైఁడి చప్రములె • కాక సుమంబుల మండపంబులున్
గలపటఁ గొల్వుకూటములె • కాక మహోన్నత మందిరంబులున్
గలపటఁ గృత్రిమాద్రి తలి • గాక మణీమయ కుట్టిమంబులున్
గలవట పట్టి ముంగిళులె • కాక సుమౌక్తిక కాయమానముల్.

తే॥ వన్నెమీఱిన బంగారు • పనితనంబు, లధికముగఁ గల్గి పేరొందు • న య్యయోధ్య
మెఱుపనఁగ దీపమన సూర్య • కిరణమనఁగ, దోకవెలుఁగ స్వర్గము హేమ • లోకమయ్యె

మ. హరికాంతుల్ తొలివేళఁ దక్కువయి మ • ధ్యాహ్నంబునందెక్కువై
చర మాహ్నంబునఁ గ్రుంగఁబాఱుటకు నా • చాంపేయ మాణిక్యసం

భరిత శ్రీపుర మోహనాంగి తనుశో • భం బొందు భేదంబులే
తిరమౌ కారణ మయ్యెనంచుఁదగ ను • త్ప్రేక్షింత్రు విద్వత్కవుల్.

ఉ॥ అందపు మేఖలల్ నడుము • లందు ధరించిన స్త్రీలు మేడలం
దొందఁగవేయు ధూపముల • నొద్దుగ లోఁగొను మేఘపంక్తి యొ
య్యందిగినట్టి యద్దియె మ • హాద్భుత వాసన గుప్పు నన్నచో
దందడి నచ్చటం గురియు • ధారల గంధము నేల చెప్పఁగన్?

ఉ॥ వేణురవంబుఁబోలు ముడి • వేయని కన్నెల తొక్కుపల్కులున్
వీణరవంబుఁబోలు నలి • వేణుల యింపగు ముగ్ధవాక్కులున్
జాణల ప్రౌఢ వాక్కులు ప • సందుగ మద్యఘు నమ్మ వాడలన్
గాణల నృత్యగీతయుత • క్రమ రవంబును పోలు నెల్లెడన్

తే॥ కనుల మిడుఁగుఱుల్ రాల్చెడు • కలభసమితి, నేలఁద్రవ్వఁగా నమవుగా • బాలురాడు
వంతలగుచుండు నటులాడు • వానియందు, వారియొడలి గంధపుఁబొడి • పడుచు నిండు

తే॥ తరుణు లొక్కటఁజెండ్లాట • తవిలి యాడ, రాలి ముత్యాలు చెదర వా • రలనుప్రోత్స
హించు చెలు లవ్వలికిఁ ద్రోయ • నించుకాంతి, చల్లనై వెన్నెలలు మీఱి • వెల్లివిరియు

చ॥ తరుణులు నృత్యశాలల ము • దంబున నాడుచు నుంద్రు వారి సుం
దర విచల త్కటాక్షశర • ధాటి విటాలి యెదం గరంచు నా
సరసుల ప్రాణముల్ చెలుల • సన్నని కౌనువలెం గృశించుఁ బైఁ
బెరిఁగెడి బాళి మాత్రమది • వీడదు వారి యురోజపద్ధతిన్.

తే॥ కొన్నివనములఁగ్రొందేనె • గురియుచుండు, మలయపవనంబునఖలొప్పు • మందగతుల
నందు విహరింప విరహతా • పాగ్నినుడుకు, వారి మైదీవలు కృశించి • వాడు వాలు

ఆ॥ మకర వీణరవము • మద్దెల నాదంబు, చెలుల గీతికలకుఁ • జెలువు నించుఁ
జెలుల తోడ నించు • పలుకాడు చిలుకలు, వినుచుఁ గనులు మూసి • కునుకుచుండు

తే॥ అరయ గసయంపునొసలు బిం • బాధరంబు, గలుగు కలుకులు ప్రణయంపు • టలుకనొంది
మృదుపపంబులఁ దన్నఁగా • మేటి వీర, వరుల భుజదండములు జాజు • వాఱుచుండు.

చ॥ పగలునురేయి వేఱుపడు • పద్ధతి గానమి సాటిలేని యా
నగరమునందు దీపము ల • నందగి వెల్గెడి పూజ్యురాంద్ర కాం
తిగల శరీరదీధితులఁ • ద్రిప్పనిచూడ్కులఁ జూడనేమొ ? వ్రా
యఁగఁబడు కుడ్య చిత్రములు • నయ్యరె! వ్రాల్పవు కంటిరెప్పలన్.

గీ॥ జలజ గృహాంతరస్థయు న • చంచల లీల వసించుమేడలం
జెలఁగుచుఁ గాంతు లీనుచును • చీఁకటులం దొలఁగించునట్టి వం

దుల గల నేతి దీపముల • తోరపుఁగాంతులు గావు రత్నదీ
ప్తుల నికరంబు; కానియెడఁ • బోల్తుల మేని మెఱుంగు-వన్నియల్.

ఉ॥ తాళ మృదంగ కీర్తన వి • తానముతోఁదగు శాస్త్రపద్ధతిన్
గాల జతు ల్గదించి నట • నం బొనరింతురు నూత్నయోవనల్
శీలన చేసి యాజతులఁ • జెల్వుగఁ జూపుచు నుండునట్టి వ
క్కాణుల మువ్వలందియలె • కావు హయంబుల కాళ్ల గజ్జెలున్

చ॥ చిఱు నగ పంకురించు నది • చెచ్చెర మిక్కిలి కామవేదనం
బఱుపును కాముకావళికిఁ • బాటలగంధుల కౌనులెప్పుడుం
దఱుఁగుచు నుండఁగా దటిఁగి • తాఱ నురోజము లుబ్బరించుచున్
మఱిమఱి హేమ తార మణి • మాలికలన్ ధరియించు బర్వగన్.

చ॥ నద బెడఁగైన లేవయసు • నల్వ గుణాలును వాలు మీలు సం
గదులగు గండుఁదేఁటులును • గంధ గజంబులె కావు తానమా
డెడు పువుఁబోండ్ల నేత్రముల • టెక్కగు చూడ్కులు నొత్తరించి యిం
పదర వెలుంగఁజేయు • జలజాకర సంతతులన్ రకంబుగన్.

చ॥ కనలున నెట్టినౌ కనులు • గల్గు మృగేంద్రము లొప్పు కందరల్
పనుపద నున్నశైలముల • వంటి మదేభనికాయముల్ బయల్
గొను మదధారలం గురియ • లోఁతుగ భూమిని పంకమేర్పడున్
గొనకొని వానిలోన ధ్వజ • కూటము రాజిలు తేర్లు పూఁడెడున్.

చ॥ పదఁతులు క్రొవ్విరుల్ ముడువఁ • బాఱఁగ నూడిచి పైచు ప్రాఁతపూ
వడములు వీధులం గునిసి • పాఱెడు మావుల కాళ్ళఁగట్టి యాఁ
పెడిని; పునారతంబుఁ దల • పెట్టు వెలందులు గబ్బిగుబ్బలం
దుడిచి విదుర్చు పంకములు • త్రోవను బోయెడి వారి జార్చెడున్.

తే॥ అశ్వములు గిట్ట లఱుగంగ • నవనిఁ ద్రవ్వ, వెడలు ధూళిలో రత్నముల్ • వెలుఁగకుండి
ధారణీశ్వర పుత్రులు • తాల్చు మేటి, విరిసరులతేనె చిందఁగా • వెలయు నపుడు.

ఉ॥ వీచును వేఁగిగంద మెడ • వీడక దంతి మద ప్రవాహముల్
వీచును కల్వగంద మెడ • వీడక చామల వక్త్రబింబముల్
వీచును మేటికాంతులెడ • వీడక బంగరు భూషణావళుల్
వీచును పూలగంద మెడ • వీడక క్రొవ్విరిఁబోండ్ల క్రొమ్ముడుల్.

చ॥ మునుపె మునీశ్వరుల్ తొడఁగి • మోక్షద పట్టన సప్తకంబునం
గొనని మహేంద్రపట్టణముఁ • గూర్చి వచింపఁ బనేమి యిచ్చటన్ ?

మొనసి సమస్తవస్తువులఁ • బూర్తిగఁ గల్గు నయోధ్యవీథులం
గనిన యనంతరంబ యల • కాపురి యొటమినొప్పెఁ బూర్తిగన్

ఉ॥ రాజకుమార మండలుల • రంజిల మ్రోఁగును వీరమద్దియల్
తేజముమీఱు ఖడ్గముఖ • దీధితు లెండలు గాయు సర్వదా
భ్రాజిలు రత్నభూషలును • వాసిలఁ గస్తురి తారహారముల్
రాజిలు మాలలన్ మధుక • రంబులు గాన మనూనమై చనున్

తే॥ శంఖకాహళ కిన్నరీ • స్వనము తోడ సుషిర వీణా మృదంగ వి • స్ఫురిత రవము
మఱియు బహువిధవాద్యముల్ • మట్టుమీఱి దంబుమై నద్ధి ఘోష మ • డంచుచుండు

సీ॥ మెప్పుగాఁ బరరాజు • లొప్పించు కప్పముల్ కానుకల్ లెక్కింపఁ • గడఁగు చోట్లు
హంసయానలు విలా • సార్థమై నృత్యంబు లలవాటు లొనరింపఁ • గలుగు చోట్లు
రాజ కుమార కు • లోజ నాయుధ విద్యఁ దెఱఁగుగా నభ్యాస • పఱచు చోట్లు
వేదముల్ నాలుగు • విడువక వల్లించు విప్రులచేఁ జాల • వెలయు చోట్లు

తే॥ చదివి తర్కించి మఱి విమ • ర్శనముచేసి యెఱుఁగఁదగిన శాస్త్రంబుల • నెఱుఁగుకొలకు
సనువుగాఁగ విద్వద్గోష్ఠి • లెనయుచొట్లు దండిగాఁ గల్గు నాయయో • ధ్యాపురమున

చ॥ పొలుచు జగామణుల్ తరచేఁ • బోలిప్రకాశము నొందు తోరణం
బులుగల రాజవీథులను • పొందికఁ బాఱఁగఁజూడ దిక్కులే
యలుపములై కనంబడును • హస్తి మదాంబుఝరుల్ గనన్ ఝరుల్
కొలఁదిగఁ దోఁచు గుబ్బముల • గుంపులకున్ జలధుల్ కొలందులౌ

చ॥ రమ శిఖరాలిచే మొగులు • దాఁకెడు తోరణ సౌధవీథులన్
రమణుల యాస్యబింబములు • రాజిలఁ దోఁచు వెలుంగు లీనువా
సుమహిత నేత్రపద్మములఁ • జూపుల తూపులు దోఁచు నవ్వి సిం
హములను పోలు వీరుల హృ • దంతరమందునఁ గ్రుచ్చిచొచ్చెడున్

ఉ॥ బంగరుతేరి నిస్వనము • వాజులగంటలు కింకిణీధ్వనుల్
ఓంగరు వీరిమదియల • రావముతో నెదురొడ్డిమ్రోఁగు హే
మాంగుల పాదనూపురము • లల్లన మ్రోయ గఁ గన్యకాళి ప్రే
మం గలఁగించు డిగ్గియల • మానుగ హంసలు మాఱు కూసెడున్

మ॥ సరసోక్తుల్ పచరించుటన్ గినియుటన్ • సాంగత్యముల్ సెయుటన్
బరిశుద్ధంబుగఁ బాడుటన్ వినుట మే • ల్పన్నీట నీరాడుటన్
తరువల్లి ఫల పుష్పవాటికల మో • దంబొప్పఁ గ్రీడించుటన్
విరులంగోయుటఁ దాల్చుటన్ దినములన్ • వెళ్ళింత్రు స్త్రీలచ్చటన్

తే॥ గిరులఁ బోలిన కరులపై • హరులపైన, స్యందనములపైఁ గ్రీడలు • సలుపుటందు
యాచకుల కష్టములు తీఱ • నరయుటందు, బ్రొద్దువోవుఁ గొందఱకు నా • పురమునందు

తే॥ కరులఁ గరులఁ బోరించుటన్, గార్ముకంబు, లభ్యసించుటఁ గ్రొత్తహ • యమ్ములెక్కి
తిరుగుటన్ బంతియాట మొ • గ్గరముఁ గూర్చి, చర్చచేఁ గొందఱకుఁ బ్రొద్దు • జరగునచట.

తే॥ విరులఁగోయుట హరిణుల • కరణిఁజేరి, ప్రియులతో నీఁదులాడుటఁ • బెదవియేఱుపు
వదల మధువు సేవించుటఁ • బగడసాలఁ, దరుణులకుఁ బ్రొద్దువోవుఁ బ • త్తనమునందు.

క॥ పరవిన మొగుళులు కదలిని, రఱుచుగ జలమానుక్రియ సు • ధాహర్మ్యములన్
జెరివిన ధ్వజపటములు తని, వఱ స్వర్గంగాజలంబు • నలలుఱఁ ద్రావున్.

చ॥ గొనబగు లోంబొల్గలుగు • గోపురముల్ మఱి పైఁడి కోటలున్
బొనుపుగ స్వర్గముం గడచి • పోవఁగఁ జోటలేక నిల్చెనా
నెనసి మహాపనీపతుల • యీఱమిపాఱిన కీర్తి రాశిఁ బో
లినవయి నిస్తరావళుల • లీలఁగ సిగ్గిలఁజేయుచుండెడున్.

చ॥ దొరువులు సానువుల్ దొనలు • తోఁటలు కొండలవాఁగు లంబుజా
కరములు శాద్వలంబులు న • గడ్తలు పంటలచేలు గొప్పయి
ప్పరిగలు మేటిముత్తెముల • పందిరు లొందికగల్గు తావులం
దరవిరి సానువుల్ తలిరు • టాకుల తల్పము లొప్పు మెప్పుగన్.

చ॥ కడలియుఁ దేటనీరుగల • కారుమొగుల్ దిగులొంద దుందుభుల్
జడియుచునుండు వీథుల వి • జంబుగ దొంగిలువారు లేమి నం
దడరిన ద్రవ్యరాసులకు • నద్దికమే కనరాదు దాతలు
గ్గడువుగఁ గీర్తికెక్కఁ రొనఁ • గం గొనువారలు లేకయుండుటన్

చ॥ చదువనివారు లేమి మఱి • చక్కఁగనేర్చితిమన్న వారలుం
బొదలరు చూడఁ బాండితిని • పొందనివారునులేరు సంపదల్
పొదుపుగ నన్నిమార్గములఁ • బొల్చుటచేతను బీదవారలున్
వెదకినఁ గానరారు పెను • విత్తముగల్గినవారు లేరటన్.

చ॥ చదువను విత్తు మొల్కఁగొని • శాస్త్రచయశ్రుతిపేరి శాఖలం
గదిరి తపంబులన్ ననలు • క్రమ్మితలిర్చుచుఁ బ్రేమ మొగ్గలం
బొదలి యపారధర్మమను • పూవులుపూచి సుమాళమన్ ఫలం
బొదవఁగఁ గొన్న యానగరి • యొప్పిన వైభవ మేమి చెప్పుదున్.

ఉ॥ తన్నగరేశ్వరుండు కడు • ధర్మముతోఁ బరిపాలనంబు స
ద్యన్నవలోక భూముల మ • హామహిమంబుగఁ జేసినాఁడు పె
న్మన్ననగొన్న యీకథకు • నాయక వీరుని గన్నతండ్రి పృ
థ్విన్నరనాథ నాథుఁడు వి • తీర్ణ సురారి చమూ సముద్రుఁడున్.

ఉ॥ సత్యము ధర్మమున్ దయయు • శాంతము తెల్వి పరాక్రమంబు సం
స్తుత్యబలంబు దానమును • తేరపు నీతియు నెంచ మంచి సాం
గత్యములేమిఁ బొచ్చెమయి • ఈనఁగనౌఁ బెరరాజులం దహో
నిత్యపథానువర్తులయి • నిల్చెను తన్నగరాధినేతకున్.

మ॥ చతురంభోధి పరీత భూతలమునన్ • సత్కీర్తిపాత్రంబుగా
నతులోదారుని స్వచ్ఛదాన సలిల • వ్యాప్తంబు గాకుండు హ
స్తతలంబె సహి వేదచోదితమహా • ధాత్రీంద్ర దుస్సాధ స
త్క్రతు సంతానములెల్ల నావిభుఁడు మున్ • గావించి యున్నట్టివే.

ఉ॥ ఆవిభుఁ డెల్లవారియెడ • నర్మిలిఁ బూనుటఁ దల్లిఁబోలు మే
లే విలసిల్లఁ జేయుటను • హెచ్చుతపంబునుబోలు ముఖ్యుఁడై
ఛాపుక సద్గతుర్ గలుగఁ • బాల్పడుచుండుటఁబుత్త్రిఁబోలు శి
క్షావిధినొధంబగును • జ్ఞానముఁబోలును ధర్మవిజ్ఞతన్.

సీ॥ అధికమై యుప్పొంగు • నర్థి పాథోరాశి నీవియన్ తెప్పచే • నీఁదినాఁడు
జ్ఞానార్ణవంబు నసంఖ్యాత సద్గ్రంథ తతియను నౌకచే • దాఁటినాఁడు
వీరశత్రూద్వేగ • భీకరాంభోరాశి, ఖడ్గమన్ నావచేఁ గడచినాఁడు
సంపల్లసిత మహా • సౌఖ్యసముద్రంబు, తనివియన్ కలముచే • దఱిసినాఁడు

తే॥ వెల్లువలి మృగములఁబక్షి • వితతిఁ బక్ష్యఁ, సతుల మనముల నొకరీతిఁ • జక్కనడపెఁ
జతురుదధివేష్టితావనీ • చక్రమందు, స్థిర యశుండగు దశరథ • క్షితివరుండు.

తే॥ చక్రవాళగిరిశ్రేణి • సాలములుగఁ, గడలి గంభీరమైన య • గడ్త గాఁగ
శైలములు రత్నరాసుల • సౌధములుగ, నొప్పు మేదిని యతనిక • యోధ్యఁబోలు

తే॥ రాజుచేతి ఖడ్గము త్రుప్పు • రాలిపోవ, వాఁడిగా సానఁబట్టుట • వలన నఱుగు
విభుల రత్నకిరీటాగ్ర • వితతి పడుట, మాత్ర నతని బంగరు పీఠ • మద్దె లఱుగు

తే॥ పృథివి సర్వమలమి జీవ • వితతికెల్లఁ, జల్లనీడనొసఁగ నిరుల్ • సాగఁదోలఁ
జక్రి గొడుగను జాబిల్లి – చాలియుండ, నాకసంబున శశియుండు • టధిక హ

తే॥ పఱ్ఱివచి సింహబలుండు • ప్రభుఁడు ప్రేమఁ, బ్రాణముంబోలె జీవుల • నరసికావ
భువిఁ జరాచరకోటికి • భూవిభుండు, ప్రాణములకు నిమ్మైన దే • హంబుఁబోలు.

చ॥ గిరినిభ పీన దీర్ఘభుజు • గెల్పునె పొందెడి యాజ్ఞ చక్రము
గ్రగురుచుల భాసుమండలము • కై వడిఁ గ్రాలుచు నున్నతస్థలిం
బొరయుచు నిల్చి నిల్చి యెన • పొందనిదై భువనంబులెల్ల సం
చరణముచేసి జీవులను • చల్లఁగఁ గాచు విశేషపద్ధతిన్.

ఉ॥ వెన్నని వీరముల్ పలికి • లీలగ యుద్ధముచేయు శాత్రవుల్
విమ్మనలేమిఁ దీఁట యడఁ • గింపఁగరాక యెలర్చుచున్ మృదం
గిమ్మను పోలు బాహువులు • గ్రాలుప్రభుండు సమస్తభూతలం
బిమ్ముగఁగాచెఁ జిన్నపొల • మేర్పడఁ గాచెడు బీదపోలికన్.

## 5 అ వ తా ర ప ట ల ము 125

ఉ॥ భూపరుఁ డొక్కనాఁ డజుని • బోలు వసిష్ఠుని గాంచి మ్రొక్కియో
దేవ! మదీయ సూర్యకుల • దీపకులౌ తొలివార లెల్లరున్
భావనచేసి మీచరణ • పంకజముల్ భజియించుచుంద్రు మా
దైవము మోక్షసాధన వి • ధానము ధర్మనిధాన మీరెకా!

తే॥ తెలియ మాపూర్వులనుకంపెఁ • గులము మిగుల, వెలుఁగ దుష్కీర్తి లేక పృ • థ్విని భరించి
రిపుడు మేరలేని ధరణి • నే భరించు, టెల్ల మీకరుణామృత • వృష్టిఁగాదె ?

తే॥ వెడలె నిండకు నఱువది • వేలయేండ్లు, శత్రుల నడంచి యేలితి • జగతినెల్ల
నాకు వెన్క నరాజక • మైకలంగు, నేమొ ? యనుచింత యొండెనా • యెదఁదఁగలిగె.

తే॥ వరతపోధనులును భూమి • సురులు దుఃఖ, మనుటయేలేక యున్నారు • మనినవారు
నావెనుకఁ గష్టములు వారి • నలఁచునేమొ?, యనెడి యొకచింతయేచాల • నలఁచుచున్న.

సీ॥ భేరులెల్లప్పుడు • విన్నంటమ్రోఁగెడు, నగరి వాకిలియు ర • త్నాలసరుల
వెనుకిరీటమ్మును • విలసిల్లు రాజిట్లు, పలికిన యంత నా • బ్రహ్మసుతుఁడు
క్షీరాబ్ధి నడుమను • శేషశయ్యపయిని, యోగ నిద్ర వహించు • యోగినుతుఁడు
హింసయే వృత్తిగా • నెసఁగు రక్కసుల యు, పద్రవంబులు నశిం • పఁగ నొనర్తు.

తే॥ ననుచు మితిమీఱి వెతగూర • నలఁగి దీన, వదనులై యున్న నిర్జర • వరుల క, నిన
పలుకులపు డాను పూర్విగాఁ • దలఁపునందు, దెచ్చుకొనియెను తన దివ్య • దృష్టివలన.

తే॥ అమరు లసురులవలనఁ గ • ష్టముల నొంది, యభవు పాదపద్మంబుల • నాశ్రయించి
తెలుప వారలఁజంప నా • వలన వీలు, కాదనుచు వారితోఁ దానుఁ • గదలి నడచి

తే॥ మేరుశిఖరి నడుమఁ దేట • మెఱుఁగులీను, రత్నమయ మండపముచేరి • బ్రహ్మకపుడు
వందనముచేసి దానవ•ప్రతతి సేయు, పిడుగు వంటిదు శ్చేష్టల•వినిచినారు.

ఆ॥ ఇంద్రుఁ గొనుచు లంక • కింద్రజిత్తేగిన, నాఁడు తాన యతని • వీడుచు కథ
పద్మజుండు చెప్పెఁ • బార్వతీశ్వరునకు, మొదటినుండి యాను • పూర్విగాఁగ.

క॥ తలలు పది చేతు లిరువది, గలిగి తెలివిచెడిన పంక్తి • కంఠుం జంపం
గల నేర్పు మన యెడను లే, దల విష్ణుఁడె వానిఁ దునుము • నవివారలతో.

తే॥ పాలకడలిఁ బరుండి దే • వత్వమొందు, మరకతాద్రిని బోలిన • మాధవునకు
గేలుమోడ్చి వినతిచేసి • కీర్తనంబు, సలుప, ముక్తి జ్ఞానులకిచ్చు • కలుషహారి.

చ॥ కమలవనంబు పూచి శశి • కంజవినోదుల రెండుప్రక్కలం
దమరికఁ జేర్చుకొంచు జిగి • యారిన బంగరు కోడెనెక్కిన
ల్లమొగులు వచ్చుపోలిక వి • లాసముతో సిరితోడఁ దార్క్ష్యునె
క్కిమధువిరోధి ప్రేమ తుల • కింపఁగవచ్చెఁ బ్రసన్నమూర్తియై.

ఆ॥ గరళకంధరుండుఁ • గమలాసనుండు నిం, ద్రాదులెల్ల సంభ్ర • మాదరముల
నిలిచి పొగడి పొగడి • నెగడు నానందాశ్రు, పూర్ణులగుచు హరికి • మ్రొక్కిరపుడు.

తే॥ తులసిమాలలుగల పాద • జలజములకు, మ్రొక్కి రక్కసు లప్పుడే • ముగిసి రనుచుఁ
గడఁక ప్రేమ మధువునాని • యొడలు మఱచి, పాడిరాడి రిట్టట్టులు • పరుగులిడిరి.

ఉ॥ బంగరు కొండనుండి దిగఁ • బాఱు పయోదమువోలె లోకమా
యంగడఁబాపువాఁడు వెల • యన్ మముగాచెడు తార్క్ష్యునుండి మిం
టం గొనదాఁకు మండపము • డాయుచు డిగ్గి మనోహరాకృతిన్
సింగపుఁ బైఁడి గద్దెపయి • చెన్నలరార వసించి నంతటన్.

ఆ॥ రాజమౌళి యబ్బ • రంబంది యుండ బ్ర, హ్మయు మునీంద్రు లమరు • లంతఁ గడిసి
పాపదైత్యులెల్లఁ • బనివడిగావించు, నెడరులెల్లఁ దెలుపఁ • దొడఁగినారు.

## వేల్పులు రాక్షసబాధల విష్ణువునకు విన్నవించుట.

తే॥ అధిప ! రావణుండును వాని • తమ్ములాది, గలుగు బలియురచేత స్వ • ర్గమును భువియుఁ
జలుపఁదగు తపంబులు చేయఁ • జాలకుండె, బ్రదుకు దెరువులేదని యూర్పు • వదలినారు

ఆ॥ అమరు లట్లు పలుక • నప్పుడు జాబిల్లి, రేలపూలు జడధ • రించు భవుఁడు
సంజ్ఞ చేసి వారిఁ • జాలింపుఁడని విష్ణు, వదన మట్టెచూచి • పలుకఁదొడఁగె.

తే॥ పద్మనేత్ర ! రక్కసులు మా • వరబలమున, మూఁడుజగముల హింసించి • ముంచినారు
ఇంకనైన వారల వధి • యింపకున్నఁ, జిటికలో జగద్ధ్వంసంబు • చేయఁగలరు.

క॥ అనిహరుఁడు విన్నవింపఁగ, వినతులగుచు నమరులెల్ల • వినుతింపఁగ న
వ్వనమాలి చింతపడకుం, డని వారల తలలఁద్రుంతు-నడలకుఁ డింకన్.

తే॥ అయిన నొకమాట చెప్పెద • నవధరింపుఁ, డమరులెల్లఁ గ్రోఁతులు గాఁగ • నడవులందుఁ
గొందలందునఁ బుట్టుఁడు • కూటములుగ, ననుచుఁ గరుణమో మలరఁగ • ననియెనిట్లు.

తే॥ దానవుల వరముల జీవి • తముల తోడ, మాఱులేని యస్త్రములచే • నీఱుచేయ
జలధిఁ బోలిన చతురంగ • బలము గలుగు, నాజికిం గుమారు డయిన • యవతరింతు.

తే॥ పలపురియుఁ జక్రమును బడ • బాగ్నినేని, మాడ్పువిసముతో విరివియౌ • మస్తకములు
గలుగు శేషుఁడు నాకుఁ ద • మ్ములుగఁబుట్టు, వారలాయయోధ్యాపుర • వరమునందు

క॥ అతఁడిట్లు పలుకఁగా వా, సిత తులసీమాలఁ దాల్చు • శ్రీవరుఁ డిపుడే
హితమగ మముగాచె ననుచు, గుతుకంబున నాడిపాడి • కునిసిరి వేల్పుల్.

ఉ॥ కష్టము వీడెనంచు సుర • కాంతుఁడు మిక్కిలి సంతసించె నా
స్రష్టయు శ్రీగళుండు నమ • ర ప్రకరంబు ముదంబుమీఱ మా
యిష్టముకూడె హీనదశ • లెల్లను నేఁడె తొలఁగె నంచు సం
తుష్టిని పొందెఁ దార్క్ష్యవడి • తో భువనోదరుఁడెక్కె లీలమై.

తే॥ మాప్రభుండట్లు వరమిచ్చి మరలు పిదప, జాంబవంతుఁడు భల్లూక • జంభభేది
పుట్టె నాయంశమున నట్టె • పొలుపుతోడఁ, బుట్టుఁ డనియె నిర్జరులకు • మొదటివేల్పు.

తే॥ అంగదుఁడు వాలి నావార • లనుచు వేల్పు, తేఁడనంగ నావాఁడు సు • గ్రీవుఁడనుచు
నర్కుఁడు వచించెనగ్నినా • యంశమనుచు, నీలుఁబేర్కొన నమ్మహా • నిలుఁడుచూచి.

తే॥ ఆంజనేయుఁడునాయంశ • మన్నయంత, హరుఁడు నాయంశమాతఁడే • యనియెంబిదపఁ
దక్కువారలు భువిఁబుట్టఁ • దలఁచినారు, వారిలెక్క యింతని యన • మేర కలదె ?

మ॥ కరుణావారిధి పంకజోదరుని వా • క్యంబుల్ దలం దాల్చి య
య్యరవిందాసన శంకరాదులు స్వకీ • యాంశంబులం దెల్పఁ భీ
కర కాంతార గిరీంద్ర కందరములం • గ్రవ్యాద నాశార్థమై
సురవర్గంబు జనింప నిచ్చగొనుచుం • జొచ్చెన్ వెసన్ నాకమున్.

తే॥ మునుపె నడచిన దీయంశ • మని వసిష్ఠ, ముని మనంబునఁ దలఁచి, భూ • పునకుఁబలికె
లోకములగాఁచు పుత్త్రిల నీకొసంగు, జన్మ మొనరింప మదిని క • ష్టంబు తొలఁగు.

తే॥ అని వసిష్ఠుఁడు పలుకఁగా • నవని విభుడు, కేలుమోడ్చి మునీంద్ర మీ • పాలఁబడిన
నాకు దుఃఖముల్గలవె ? జ • న్నమునకింక, వలయువానిఁడెల్లంబుగఁ • దెలుపుఁడనుమ.

సీ॥ శితికంఠుచేతను • స్తుతియింపఁదగువాఁడు, వేదశాస్త్రములందు • వినుతిగొన్న
జ్ఞానంబు శాంతంబు • సచ్చరిత్రము విన, యంబు మున్నగువాని • యందు విబుధ

విఖ్యాతుఁడగు తండ్రి • విధమునఁ జనువాఁడు, పరిశుద్ధులైన దే • వతలతోడ
దనుజదైత్యులఁగన్న • తండ్రికాశ్యపునకు, కొడుకు విభండ కా • ఖ్యుండు తనకు

తే॥ నతని దయనొంది పెరిఁగిన • యమలగుణుఁడు, సర్వశాస్త్రార్థవేత్త ని • శ్చలుఁడు బ్రహ్మ
సముఁడు లోక విజ్ఞానలే • శంబు లేని, వాఁడు హరిణ శృంగము తలన్ • వఱలువాఁడు.

సీ॥ శేషుని పడగలఁ • జెలువారు భూమిపై, మెలఁగు మనుష్యులు • మృగములెయను
బుద్ధిగలాఁడు త • పోధనుం డారయ నబ్జాసన బ్రిపు • రారి వినుత
శాంతాది సద్గుణ • సంయుతుండగు ఋశ్య. శృంగునిచే వేల్మి • యొనకమెనఁగఁ
బూర్తి గావించినం • బుత్త్రిలు నీకుఁ గ, లుగుదురని యమ్ముని సదయుఁడగుచుఁ

ఆ॥ బలుక నతని పాద • పద్మంబుల కెఱఁగి, యాతఁడిప్పుడెచట • నలరు? నితకు
నెట్లువచ్చుఁ గృత్య • మెయ్యది? యనిప్రభుఁ, డడుగ మౌనివర్యుఁ • డనియె నిట్లు.

ఉ॥ పూని ధరం భరింపఁదగు • పూజిత సత్త్వుఁడు ప్రేమ సత్కృపా
సూన పదాస్పదుండు సమ • యోచిత బుద్ధిగలాఁడజయ్యుఁడు
త్రాసపదాఖ్యుఁ డొప్పు మను • ధారణినాథు కులంబువాఁడు తా
మానిత రీతి రోమపదు • మాన్య వదాన్యుని గాంచెఁ బుత్త్రిఁగాన్.

తే॥ అతఁడు పాలించు నంగరా • జ్యంబునందు, చాలకాలము గాఁగ వ • ర్షంబులేమి
జనులు పలుకష్టముల నొంద • మనుజవరుఁడు, మునులఁబిలిచి కర్తవ్యంబు • విన(గఁగోరె

ఉ॥ వారలు ఋశ్యశృంగముని • వర్యుని దెచ్చితివేని వర్షముల్
మేరకు మీఱివచ్చునన • మేదినినాథుఁడు చింతనొంది యా
చారణి మానవావళి నె • దన్ మృగజన్మము లంచునెంచు పెం
పారు తపోధనాఢ్యు నిట • కక్కట యెవ్వరు తెచ్చువారనన్

సీ॥ అర్ధచంద్రాకృతి • నలరారు నొసళులు, నీలంబులౌ దీర్ఘ • నేత్రములును
అరుణాధరములు చం • ద్రాభమౌ వదనంబు, లాటి ముత్తెముల పొం • దమరుపండ్లు
బలిసిన బటువైన • వక్షోజ యుగళంబు, తనరు రోమావళిఁ గొం • దఱటఁ దెచ్చి
భూమీశ మేమా త • పోధనాఢ్యుని దెత్తు, మనిన వారల పల్కు • లాలకించి

తే॥ అంత కీరు తగరె హరి • ణాక్షులార! యంచు వస్త్ర భూషల వారి • నాదరించి
పొందు కృతకృత్యలై వేగ • రండటంచుఁ, బంపవారలు తేరెక్కి • బయలుదేఱి,

తే॥ వగల జిగిగుల్కు వెలయాండ్రు • పొగులుదూర, మేగి ఋశ్యశృంగుఁడు వసి • యించునెలవు
యోజనం బున్నదని యెంచి • యొక్క చోటఁ, బర్ణశాల యందుండ్రి తా • పసులఁబోలె

తే॥ అవల విభండకుఁడు లేని • యదను చూచి, ఋశ్యశృంగుఁజేరంగ నా • ఋషివరుండు
తన్నుపోలు మెకములంచుఁ • దలఁచి వారి, కుచితరీతిఁ బ్రియముమెఱ • నుపచరించె

తే॥ అర్ఘ్యపాద్యాదు లర్పించి • యాసనమిడి, విశ్రమింపు డనఁగ వారు • విశ్రమించి
క్రమ మృదులోపచార వా • క్యములు పలికి, వడిగ దమయాశ్రమమునకు • వెడలినారు.

తే॥ అపలఁ గొన్నినాళ్లేగఁగా • సరుగు డెంచి, ఘన మోహినులౌ వెల • పూవుఁబోణు
లప్పుర రుచికంటెఁ దీపైన, యరఁటి పనస, మావిపండ్లను దిననిచ్చి • మనసు గూర్చి.

క॥ మా యాశ్రమంబునకు వి, చ్చేయుండని ప్రార్థనంబు • సేయఁగ నతఁడున్
వాయెత్తి మాఱుపలుకక, రోయాంధ్రుర వెంబడిన్ మ • రుల్కొని చనియెన్.

చ॥ తప మదివోలె విభ్రమము • తద్దయుఁగూర్చ సమర్థురాంద్రు మో
దమున నిదే యిదే యనుచు • దారిని చూపుచు నేగుచుండ మే
లైమకము తోఁచ నమ్ముని వ • దాన్యుఁడు వెంబడిఁబోయి యంగదే
శము నట దాయమున్నె పదెఁ • జాలిన వర్షము భూమి శాంతిలన్.

చ॥ పరవలు పెక్కులై వఱలు • పట్టులు గల్గు కొలంకు లేఖలున్
శరధులఁబోలె నిండ గిరి • చాపుని కంఠమువంటి మేఘముల్
కురిసెను కుంభవృష్టి; యన • ఘుండగు దా జిదియేమి యంచు న
చ్చెరువునఁ జింతచేసి తెలి • సెన్ దగు హేతువు నెక్కసంబునన్.

సీ॥ పంకజాస్యములు బిం • బఫలోష్ఠములు ముత్తె, ములవంటి రదనముల్ • పొగను పోలు
నీలంపు నెటికురుల్ • నెగడారు జిగిదేలు, వెలచెలు లనువైన • వెరవుచూచి
మరపించి తేరఁగా • మక్రోధమోహర, హితుఁడైన యాఋశ్య • శృంగమౌని
నెనరున వచ్చెఁగా • యని యెంచి యొడలు పూ, రింప గా నయ్యంగ • నృపవరుండు.

ఆ॥ వేదవేత్తలైన • విప్రులతోఁ బరి, వారసమితి తన్ను • బలసిరాఁగ
వాద్యవితతి మ్రోఁగ • వైభవోపేతుఁడై, నడచె రెండు యోజ • నములు మున్ను

ఆ॥ ఇట్టులేగి తావి • యించు వేణులుగల, వారసతుల నడుమ • బలు తపంబు
రూపుగొన్న కొండ • రూపున నేతెంచు, ఋశ్యశృంగ మునిని • నృపుఁడు గాంచె.

మ॥ అమితానందము నొంది దెందమున నే • త్రాబ్జంబులన్ మోద బా
ష్పము లొక్కుమ్మడి వెల్లివాఱ మునికిన్ • సాష్టాంగ దండప్రణా
మము లర్పించి; మహాత్మ జీవములతో • మన్నారమంచున్ సుదుః
ఖములం దీర్చితి రంచు రోవెలఁదులన్ • క్ష్మానాథు డగ్గింపఁగన్.

మ॥ పనివారల్ మునివర్యులన్ బహుజనుల్ • పార్థివ్యతోఁజేరఁ గాం
చినయాతండిది వంచనంబనుచు యో • చింపన్ సుపర్వాణులున్
ముని కోపంబున కంజ, నొప్పె నతఁడ • బ్బూపమెఖ సంప్రార్థనన్
ఘనమర్యాద నతిక్రమింపని తరం • గ శ్రీయుతాంభోధి నాన్.

ఉ॥ తోలొఱయందు వజ్రనిభ • దుర్దమ ఖడ్గముఁదాల్చినట్టి భూ
పాలుఁ డనింద్య శీలుఁడగు • బ్రహ్మ సమున్ దగఁబెక్కుసార్లుగాఁ

గేలు మొగిడ్చి వేఁడి తమ • 'దు తొలంగిన ఁటరు తెల్పఁగా
జాలి మనంబునం దవులఁ • జయ్యన నమ్ముని శాంతఁదౌటయున్.

తే॥ మోహమడఁచిన సుజ్ఞాని • మునివరుండు, ఋశ్యశృంగుండు వేడ్కమై • నృపవరేణ్యుఁ
గరుణ దీవించి యుపదేశ • కర్తయైన, మునులతో రథమెక్కియ • ప్పురికి నేగె.

క॥ నగరము కయిసేసి జనులు, మొగి నెదురు కొనంగ రాజ • ముఖ్యుఁడు మునితో
నగరిం జేరి హిరణ్మయ, మగు సింహాసనము మీఁద • నాతని నునిచెన్.

తే॥ చెప్పఁదగిన దేదియు వేలు • చెలువు లేని, యట్లు తోఁపఁగ నర్ఘ్యపా • ద్యాదివిధుల
నర్చనముచేసి తనకూఁతు • నతుల శాంత, శాంత నొసఁగి వివాహంబు • సలిపివైచె.

ఆ॥ వఱపు దీఱ మేఘ • పంక్తివర్షింపఁగా, నంగదేశకష్ట • మంతరించె
శాంత యుపచరింప • నమ్మని తృప్తుఁడై, యొప్పుమీఱ నచట • నున్నవాఁడు.

సీ॥ నావుడు మునివరు • నకు వందనంబాచ, రించి నేఁడే వెళ్ళి • ఋశ్యశృంగుఁ
దోడితెత్తుననుచు • దొరకొని సామంత, నృపులు సుమంత్రాదు • లిష్టజనము
లైన పండిత వరుల్ • మానుగఁగొలిచిరా, దశరథేశ్వరుఁడు ర • థంబునెక్కి
దుఃఖసంతతి నేఁడె • తుదముట్టె నని సుర, వరులు పూవులవాన • కురియ నడచి

తే॥ కహళాపెక రావముల్, కడలికంటెఁ • జెలఁగి ఘోషింపఁ బెద్దలా • శీర్వదింపఁ
దలిరుఁబోఁడులు విజయగీ • తములు పాడ, నరుగుదెంచి తా నంగరా • జ్యంబుచేరె.

చ॥ స్తుతయశుఁడైన యాదశర • థుం డరుదెంచు టెఱింగి యంగభూ
పతి మది నుత్సుకుండగుచు • భ్రాజితభూషలు వంది మాగధుల్
నుతులొనరింప బాంధవ జ • నుల్ పరివారము గొల్చిరా, మహా
తత విభవాధికుండగుచు • దవ్వుగ నేగెను తా నెదుర్కొనన్.

ఉ॥ వచ్చిన రోమపాదుఁగని • వారని ప్రేమను కోసలేశ్వరుం
డచ్చుగ స్యందనంబు డిగ • నాతఁడు పజ్జలజంబుపైఁబడన్
హెచ్చుగఁగౌఁగిలించుకొని • యింపగు మాటల నాడుచుండఁ బె
న్మచ్చికతోడ నంగపతి • మానుగఁ జేతులు మోడ్చి యిట్లనున్.

చ॥ నిలుకడగాఁగ స్వర్గమును • నిల్పి యశంబునుగాంచు మిత్రమా!
తలఁపని యట్లు మీరిటక • దాటున వచ్చుట చూడ నాతపః
ఫల మొకొ? మాప్రజల్ సలుపు • భవ్య తపఃఫలమో? మఱేదియో?
తెలియఁగదయ్య యంచుఁ దన • తేరునఁదోడ్కొనిపోయె నింటికిన్.

ఉ॥ అంగవిభుండు హాటక మ • యంబగు నంతిపురంబు లోపలన్
రంగరు రత్నమండప వ • రంబున రాజిలు సింహపీఠిపై

సంగతి నుంచి మన్ననలు • సల్పుచు విందులు పెట్టి ప్రేమను
బొంగుచు పన్ను హేతువును • మోదముతో చెలువంగ గోరిసన్.

తే॥ తానువచ్చిన కార్యంబు • తగినరీతి, దశరథుఁడు దెల్ప, రోమ పా • ద ప్రభుఁడు
వినుతి శీలుని ఋశ్యశృం • గుని యచటికె, పిలుచుకొని వత్తునని రాజు • వెడలె మరలి

తే॥ వేదములు మూర్తిమంతమై • వెలసెననఁగ, నొప్పు మునిఁజేరి యంగరా • జొక్కవరము
వేఁడి, నిఁ దేదియో తెల్పు • తే డః యనఁగ, నాతఁ డిట్లని పలికె న • యంబు మీఱ.

ఉ॥ పావుర పిట్టనై కరుణ • పారము ముట్టఁగఁ ద్రాసునెక్కినే
భూవరుఁ డట్టి సత్కుల వి • భూషణుఁ డంచిత ధర్మమూర్తి దై
ర్యాపశి నాశిఁ దున్మి దివి • జాలయ మెప్పటి నిల్పె నా యయో
ధ్యావని నాథుఁ డేలు పురి • కర్మిలి మీఱఁగఁ బోయి రండసన్

ఉ॥ మంచిది తేరు తెమ్మనఁగ • మానవనాథుఁడు మిత్రు కోరికల్
మించి ఫలించె సంచు నెన • మీఱిన సంతసమంది తేరు తె
ప్పించిరి బాలచంద్రసమ • విస్తృత భాలురమాసమాన ప్రే
మాంచితమూర్తి శాంత యరు • దారఁగఁ దో సరుదేర లెండనన్.

తే॥ మనుజపతి కేలుమోడ్చి న • మస్కరింప, మునులు పెక్కండ్రు తనచుట్టు • మొనసి రాఁగ
శాంతతో ఋశ్యశృంగుడు • సంతసమున, రథమునెక్కి యయోధ్యకు • రాణనేగె

తే॥ తమ్ముఁగాల్చి హింసించెడు • దనుజవరుల, సడఁప విష్ణుండు భూమిపై • నవతరించు
ననుచు ధర్మదేవతయు నిం • ద్రాది సురలు, వాద్యములు మ్రోఁగ పంచిపూ • ల్వైచినారు

ఎ॥ దూత లయోధ్యాపురమున, కేతెంచి మునీంద్రురాక • యెఱిఁగించిన నా
భూతల నాథుఁడు మీఱిన, కౌతుకమను సాగరమ్ము • కడలులఁ దేలెన్.

క॥ అంచపము చొప్ప విరిసోనలు, గురిసెను; దుందుభులు పెల్లు • ఘోషించె; మునుల్
విరివిగ దీవనలొసఁగిరి, విరిసెను మొదలంటఁ బాప • వితతులు భూమిన్.

సీ॥ పుడమి యదరుపుట్ట • బెడిదంపు భేరుల, మ్రోఁతతో దశరథ • భూమివరుఁడు
తన మదింగుల దుఃఖ • మను పర్వతంబు ను, గ్గైనది యనియుబ్బి • మానితముగ
గొప్ప తపములెల్లఁ • గూటువలై యక, లంకరూపము దాల్చి • లలిపెలింగి
జింక తోలును నార • చీరయు ధరియించి, దివ్యుల కష్టముల్ దీఱయజ్ఞ

తే॥ కర్మము లొనర్చు నేర్పరి • రమగ వెలయు, వాని బ్రహ్మదండం బాత • పత్త్రిమును క
మండలువు గలవానిని • పండుతపము, గలుగువానిని కన్నులఁ • గాంచె విభుఁడు.

తే॥ రథము దిగి విభుఁడతని చ • రణ సరోజ, ములకు మ్రొక్కఁగఁ బ్రాఁజదు • వులను తీఁగ
లలమిఁ ప్రాఁక మాటాకు నా • వెలయునతఁడు, చెలఁగి యర్ఘ్యవద్వాక్యు భా • శీస్సులొసఁగె

ఉ॥ ఆ ఋషితోడ వచ్చిన మ • హర్షులు దీవన సేయఁ దోయ ము
గ్ధారలఁబోలు దానజల • ధారలఁదోఁగు కరంబుల న్నమ
స్కారముచేసి భూపుఁడు వి • శాల మనోహర నేత్రయుగ్మ మొ
ప్పారెడు శాంతతోడ రథ • మందునఁ దోడ్కొని వచ్చెనాతనిన్.

తే॥ రత్నమకుట విరాజచ్ఛి • రస్కుఁడంతఁ, గమలవదనలు విజయగీ • తములు చదువఁ
జెవులు వాద్యఘోషములచేఁ • జిల్లులువడు, నగరముం జేరెఁ దా ముని • నాథుతోడ

తే॥ పాపమూలంబులౌ చెడు • పనులుచేయు, దొంగలై దుగురం దుంప • దూల్చినట్టి
మునివరుఁడు వసిష్ఠుఁడువేద • మూర్తి ఋశ్య, శృంగుఁడును రాట్సభవెలుంగ • జేరినారు

క॥ ఇహమునఁ బ్రాఁజదుపులవలె, మహిమగలుగు ఋశ్యశృంగ • మౌనివరుని దా
బహుమాన పూర్వకంబుగ, మహిపతి యుపచారములఁ గ్ర • మంబుగఁ దేర్చెన్.

తే॥ ధర్మమును తపమ్మును మేను • దాల్చినట్లు, వెలయు పరిశుద్ధమూర్తి! మీ • లలితకరుణ
వలనఁ దరతర మెడలేక • వచ్చు రాజ్య, పాలనము నెలకొనెనాత • పము ఫలించె.

తే॥ అనుడు మునివరుఁ డిట్లను • ననఘ! నీవు, వరతపోధను సాయంబు • పడసినాఁడ
వమల కార్యంబులే చేయ • నరయువాఁడ, విట్టి నిను పోలుదురె రాజు • లెంచజేని ?

క॥ గిరి నిభ చాప భుజా! నను, కరమరుదుగఁ బిలువనంపు • కార్యము శ్రేయ
స్కరమగు హరిమేధమునకొ, మఱి దేనికొ చెప్పవయ్య • మనుజేంద్ర! యనన్.

క॥ కడగానని పెక్కేఁడులు, పుడమిని పాలించి విసుగుఁ • బొందితి సుతులన్.
బడయనయితి రాచతగపు, తడవి నడపు తనయు నాకు • దయచేయుము నాన్.

క॥ భువిమాత్రమె ? పదునాలుగు, భువనంబుల నేలఁజాలు • పుత్త్రుల నొసఁగం
దవు మఖము నిప్పుడే యిటఁ, దవిలి నడపు మనుచు ముని ము • దంబునఁ బలికెన్.

## పుత్త్రికామేష్టి

ఆ॥ జన్నమునకు వలయు సామగ్రు లన్నిటి, విరివిగాఁగ దెచ్చి • పేర్చినారు
చక్రవర్తి శుద్ధ జలమున నీరాడి, శాస్త్రయుక్తి నమరు • సాలఁజేరె.

తే॥ విధియుతముగ మూఁడగ్నులు • వేల్చియాహు, తులనొసంగుచుఁబంద్రెండు • నెలలుజరిప
దేవదుందుభుల్ మ్రోసెను • దివిజులెల్లఁ, బైనిలిచి తృప్తుల మనుచుఁ • బల్కినారు.

తే॥ వదనములు వికసింప దే • వతలు కల్ప, పుష్పముల దూసిచల్ల న • మ్ముని వరుండు
సుతుల నొసఁగంగఁ దగిన యా • హుతులవేల్చె, నగ్నికుండంబునందు శా • స్త్రానుసరణి

తే॥ అంతఁజుట్టి మండెడు వహ్ని • యనఁగనొప్పు, వెంద్రుకలు నెట్టని కనులు • వెలయు ఘాత
మొందు సుధఁబోలు నన్నంబు • నిండుగఁ గల, స్వర్ణపాత్రముతో నటఁ • బైకి లేచె.

తే॥ లేచి యాపాత్రమట నుంచి • లీలతోడ నందె మఱుఁగయి వోవన • యతివరుండు
దశరథుంగాంచి యీయమృ • తంబు నీదు, భార్యలకుఁ దగు రీతిగాఁ • బంచు మనియె

తే॥ అతని యాజ్ఞాప్రకారంబు • యవనివిభుఁడు పేశల వినీల గురుకేశ • పాశమును వె
లుంగు మోము బింబాధరిం • బంగుమీఱు చుండు కౌసల్య కొకభాగ • మొసఁగినాఁడు

తే॥ కొలఁకులును నదులును వన • ములును హంస, పిండుఁగల కోసలమునకు • విభుఁడు పిదప
మొదటి పట్టపునే చేతి • మొనయు దాన సగము కైకేయి కొసఁగె ని • ర్జరులు పొగడ

తే॥ శత్రు భీకర బాహుఁడు • చక్రవర్తి సగమొసఁగె సుమిత్రకుఁ దొంటి • చందమునను
శత్రువుల వశింపిరి యంచు • శచివిభుండు తన్నుపోలు దివ్యులతోడఁ • దవిలి యార్వ

క॥ ఎడమ మై శక్రుపిరితికిఁ గుడిభాగము చక్కఁ జేవ • కోటికి నదరన్
గడమయు మిత్రకే పద డి యొసఁగెఁ బ్రభుండు ప్రజయు • బరితోషింపన్

తే॥ తురగమేధ యజ్ఞంబుఁ బు • త్త్రీకుఁజేయు, జన్నమును సక్రమంబుగా • జరగు పిదప
జగములు నగామి ఎలశాలి • చక్రవర్తి, జనము స్తుతియింప నయ్యాగ • శాల విడిచె

ఉ॥ క్రమముగ శాస్త్రపద్ధతిని • కార్యకలాపము పూర్తికాఁగఁ గ
షముగఁ గలంగు ప్రాణులును • సంతసమందెను వాద్యఘోషముల్
లుముములగాఁ జెలంగె గుణ • ధుర్యుఁడు కోసల భూవిభుం డపా
రముగఁ గృపాతరంగముల • రాజిల నిచ్చెడు కొల్వుచేరఁగన్

ఉ॥ వేయఁగఁ దగ్గ పద్ధతుల • చెప్పెడు శాస్త్రవిధిన్ విరుద్ధముల్
దాయనిరీతిఁ జేయఁగ న • డంగి రమాపతికిన్ సురాళికిన్
వెయములౌ హవిస్సుల ను • దీర్ణత నిచ్చి మహీసురాళికిన్
పాయక హేమవర్షము న • పారముగాఁ గురియించె నిమ్ముగన్

తే॥ రాజులకుఁ గానుకము తోడ • రథ గజాశ్వ ధన విభూషణాంబరములు • తగినరీతి
నిచ్చి వాత్యం ప్రమోదతతో • నేగి సరయు నందు పెంపార నవభృథ • మాచరించె

సీ॥ భేరులు శ్రేణులై • విన్నంట మునుమ్రోఁగ బహువిధ వాద్య రా • వములు చెలఁగ
ముత్యాల గొడుగులు • ముదమొప్ప బైనిల్చి, నినుపారఁ జల్లని • నీడ నొసఁగ
పలువురు రాజులు • ఎలను నల్వంకలఁ, గొలువ వెలలి రాచ • కొలువు పెరి
ప్రామ్మయు నగ్గల • ప్రాఁజదువుంగని, యగు గురుపదములం • బుగ భజించి

తే॥ పవనంగొని గొప్పకీ • ర్తిని వహించు మునికి ఋశ్యశృంగునకుఁ గే • ల్మోగిచి దేవ!
మేఁ గృతార్థుడఁ నింక నా • కేమి వలయు? నంచు నింపుమాటల గౌర • వించి మఱియు

చ॥ పరమ తపోనిధీ! భవద • పారకృపా మహిమంబుచేత దు
స్తర గురు దుఃఖరాశి గడు • దవ్వులకేగెఁ గృతార్థుఁడైతి నం

చరమరలేక పల్కిన ధ • రాఢ్యున కపు వికాసమానసుం
డురు గుణుఁడౌ మునిప్రవరుఁ • డొప్పుగ దీవన లిచ్చెఁ బ్రీతిమై

ఉ॥ తక్కుమునీంద్ర సంతతి యు • దారగుణుండగు రాజు భక్తిమై
మ్రొక్కఁగ దీవనల్ సలిపి • మోదమునొందిరి ఋశ్యశృంగుతో
నొక్కటఁ గూడి పైనమయి • రొప్పుగ • భూపతి చాలదవ్వు పెం
పెక్కఁగఁబోయి వీడ్కొలుప • నేగె స్వదేశము ఋశ్యశృంగుఁడున్

తే॥ అవలఁ గొన్నినాళ్ళరుగంగ • సతిని సతులు, గర్భములు ధరియించి వి • క్లమము నొంద
మోములేకాక తక్కుంగ • ములును సొంపు, నూనఁ జంద్రసమానలై • కానఁబడిరి

* శ్రీ రా మ జ న న ము

సీ॥ ఉర్వికి రోమాంచ • మొదవఁ బునర్వసు కటకముల్ మిన్నంది • గంతు లిడఁగ
మాసరాజము చైత్ర • మాసంబుగాఁగ న, వమి తిథులన్ గౌర • వంబు నొంద
సౌమ్యవారము చాల • సార్థక్య మొందంగ, శుక్ల పక్షము మఱి • శుద్ధిగాంచ
గరుడ పన్నగ సిద్ధ • గంధర్వ కిన్నర • సాధ్య విద్యాధర • సముదయములు

తే॥ నిత్యసూరుల శ్రేణులై • నిలిచి యుత్స హించి కోలాహలముసేయ • నెడఁదలోని
కలఁకవిడి ధర్మదేవత • యఱరు మంద, జీవకోటి సంతసమునఁ • జెలఁగుచుండ

సీ॥ సకల సద్గుణఖని • సన్నుత చారిత్ర జననుల మేటి కౌ • సల్యగనియె
నొకకాలమునఁ దన • యుదరంబునందు భు, వనముల నణఁగించి • కొనెడివాని
నాల్గువేదములకు • నలువకు మునులకు మానుగా నెఱుఁగంగ • రానివానిఁ
గాటుక క్రొమ్మొగుల్ • నీటు చూపుచును తే జోరూపుఁడై వెల్గు • సొగసుకాని

తే॥ అఖిల శుభలక్షణంబుల • కాలవాలుఁ, దుదిమొదలు లేక యెఱుకకుఁ • దోచుశీలు
రాక్షస కులాంతకుని భక్త • రక్షణాఢ్యు ధర్మసంస్థాపకుని మహో • దార గుణుని

ఉ॥ మోదముతోడ నార్వసుర • ముఖ్యులు దిక్కుల మింటనిల్చి యిం
ద్రాది దిగీశులున్న మితు • లై యొగి దీవనలీయ వాయువా
మోదముతోడ వీవఁ బొర • పొచ్చెముగాంచని కైకపుష్యమిన్
గాదిలిసూను నొక్కరుని • గాంచెను లగ్నము మీనమొప్పఁగన్

మ॥ ఋతుధర్మోత్థిత వృక్షరాజయుత భూ • భృద్వార దుర్వార ప
క్షతులంద్రుంచిన యింద్ర ముఖ్యదివిజుల్ • కైవారముల్ సేయ భూ
పతి ప్రేమంపుఁ గనిష్ఠదేవి సుతు నా • ప్పంగాంచె నాశ్లేషతో
జత యయ్యెం గటకంబు పాటముగా • సంపూజ్యమానంబుగన్

* విళంబి చైత్రశుద్ధ [illegible] దినము

చ॥ పలుపడగల్ ధరించిన కృ • పాళుఁడు శేషుఁడు మోచు భూమియున్
చెలఁగి నటింప వేదములు • చెచ్చెర నాటకమాడ గీర్తిఁ రా
జిల హరితాళికిన్ మఖకు • శీలగుణాన్విత నీలనేత్ర పెం
పలరు సుమిత్రగాంచె సుగు • ణాకరుఁడౌ మఱియొక్క పుత్త్రకున్

ఉ॥ ఆడిరి మేనకాదు లను • రాగ వీక్ష నటంచు నుబ్బుచున్
పాడిరి కిన్నరుల్ మధుర • భావములన్ సుధఁబోలు పల్కులన్
దీఁడిరి పెక్కు వాద్యములు • దివ్యులు వ్యోమము బూరటిల్లఁగా
వేఁడిరి దైవమున్ భయము • వీడి చరించిరి దేవమానవుల్

చ॥ చెలువలు పాటివచ్చి ప్రభు • శేఖరుతో సుతజన్మ వృత్తముల్
పలికిరి సంభ్రమంబునను • పాడిరి యాడిరి బ్రాహ్మణోత్తముల్
పలికిరి జన్మలగ్నములఁ • దేరిన సత్ఫలముల్ జగంబునన్
గలిగిన కష్టసంతతులు • కష్టములొందెడి నంచు నుబ్బుచున్

తే॥ ధర్మ బాల పట్టముగల • దంతిఁబోలు, రాముజన్మంబు మేష చై • త్రంబు శుద్ధ
నవమితిథి పునర్వసువుల • గ్నంబు కటక మచ్చగతులు నల్వురు పదు • నొకటవారు

తే॥ తగిన పద్ధతిఁ బరికించి • తక్కువగుచు రీతి జాతకముల పైడి • తేకుంపయి
వ్రాసి దేవగురుండును • ప్రస్తుతింపఁ జదివినాఁడు అద్భుత • స్థానమందు

తే॥ చక్రవర్తి సంతసమున • సరయువునకు నరిగి స్నానంబుచేసి ధా • న్యంబు ధనము
నమితముగనిచ్చి భవ్య వా • గ్మియుతోడ గుడికిఁబోనేగి పూజించి • కొమరుఁగాంచె

సీ॥ కాంచియుపొంగి పొ • మ్మాంచునై మేదేఁడు ఉర్వికిఁ • బన్ను లేకుండుఁగాక
బొక్కసంబుల తెలు • పులు తీసివేయుఁడు యుద్ధంబు లింక లే • కుండుఁగాక
భూవిభుల్ తమదేశ • ములు వెగుడిరుగాక। ధర్మక్రియాప్రవృత్తి • తనరుఁగాక।
తిరునాళ్ళచే పెద • తృప్తి మొప్పెదుఁగాక। మూఁడువేళల పూజ • మొనయుఁగాక।
తే॥ అగ్రహారములు చదువుల • లాలయములు వేద్కావనములు క్రొత్తవి • వెలయుఁగాక।
అనుచుఁ జాటింపఁ జారుల • కాజ్ఞయొసగె నెల్లమీఱిన యెంమి ని • లేశ్వరుండు

తే॥ ప్రభువునాజ్ఞను గొని తల • వరులు మంచి యేనుఁగులనెక్కి తుడుములు • నీడ్చికొట్టి
దేశమందెల్లఁ జాటించి • తెలిపినారు, పురుషులును స్త్రీలు సంతోష • శరధి మునుఁగ

చ॥ క్రమముగఁ బ్రేమ మీఱఁగఁ బ • రంపరలై చెలరేఁగెఁ గేళిలా
క్కమొగిఁ జెమర్చి మేలు పుల • కంబులకుం గులకంబునయ్యె వృ
త్తము వినునెల్లవా రెదురుచ్చ్ధార్మికను వారి కొసంగి రెచ్చు గ్ర
వ్యము; భగవంతుఁడే జనన • మందుట వారియెదల్ గ్రహించెనో?

చ॥ విరిసిగ వీథులొప్పు నల • వీట వెలందులు చేటికల్ చెలుల్
తరుణులు పౌరులుం దమి యె • లర్పఁగ నూనెయుఁ జందనంబుఁ గ
స్తురియును నేయి గందవొడి • చొప్పడ వీథులఁ జల్లి ముగ్గులన్
మురువుగఁ దీర్చి పండుగలు • మోదముతోఁ గొనియాడి రత్తఱిన్.

తే॥ ఇట్లు పౌరులు మదినిండి • యెల్లమీఱి, వెల్లివిరియు మోదముతోడ , వీఁగి యుబ్బి
తనువు లెఱుఁగక పండ్రెండు • దినములుండ, శిశువులకుఁ బేరువెట్ట వ • సిష్ఠుఁ డెంచె.

## నామకరణము

తే॥ మొసలి పోరుటచే దప్సి • పూర్వ జన్మ, పుణ్యమునఁ గజేంద్రుం దాది • మూలః యనఁగ
వచ్చి యపుడె కాచిన నిత్య • వస్తువునకు, రాముఁడను పేరువెట్టె దూ • రంబు చూచి.

తే॥ వ్రతములందెల్ల వేదశా • స్త్రములయందు, నిత్యవస్తువు నటచేతి • నెల్లిఁబోలె
నెఱిఁగిన మునీంద్రుఁ డవ్వలి • చిఱుతవాని, కిడియె భరతుఁడన్ నామంబు • నెడఁదనెంచి.

తే॥ పుట్టినప్పుడె వంచకుల్ • పొలిసినారు, సురలు బ్రదికిరి దుఃఖంబు • ధరణి నీఁగె
ననుచుఁ గాంతి సొగసు బల • మమరు బుడుత, కమరిచెను లక్ష్మణాఖ్య సా • ర్థముగవెలయ

తే॥ ముత్తెములె యొకబిడ్డ రూ • పును వహింప, నందు చెందామరలు విరి • యంగ నొప్ప
సొబగు గల్గు నీజ్యోతిచే • స్రుక్కునెల్ల, పగలటంచు శత్రుఘ్నుఁడన్ • ప్రఖ్యయుంచె.

ఉ॥ పొల్లగు మార్గ మింతయును • పొందని పుణ్యుఁడు వేదపద్ధతిన్
బిల్లల పేరువెట్టఁ బృథి • వీపతి చేతులనుండి దానమన్
వెల్లువ లుప్పతిల్లి తగ • నిర్మల నిర్గుణ నిత్యతత్త్వముం
జల్లగఁ గాంచు మానస వి • శాల తరాబ్ధుల నించె నత్తఱిన్.

ఉ॥ నల్లని కల్వ లెత్తి నలి • నంబులు నోఁజ లిఖించు తీరునం
జెల్లుమనోజ్ఞతం దనరు • జ్యేష్ఠునియందె మహీశ్వరేశ్వరుం
డెల్లకు మీఱుప్రేమము వ • హించె శరీరము ప్రాణ మెప్పుడే
నొల్లవు వేఱువేఱుగ నొ • కొక్కటి నిల్వఁగ నన్న చెన్నునన్.

మ॥ అమృతం బొక్కెడు తొక్కుపల్కులు బెడం • గౌ తప్పుటడ్గుల్ క్రమం
బమరంగా నలవాటు గొంచుఁ దమి వా • యం బుట్టునాదిత్యు చం
దమునన్ శబ్దముచేతనే యెదుఁగు వే • ద ప్రక్రియన్ భూమి దే
వి మనస్సంకటముల్ నశింపఁగ వెసం • బెంపొంది రప్పుత్త్రికుల్

క॥ నెలతాల్పుఁ బోల్వసిష్ఠుం, డలరుచుఁ జౌలంబు నుపన • యనము జరపి యా
కొలఁది యనరాని నిలుకడ, గలుగు శ్రుతులు శాస్త్రములును • క్రమముగ నేర్పెన్.

సీ॥ హరుల నెక్కుటయును • కరుల నెక్కుటయును, తేరుల నెక్కుట • నారనేర్చి
తక్కిన విద్యలఁ • దగు పద్ధతుల నేర్చి, పగఱ జయింప వీ • లగు శరాస
నాది వివిధ సాధ • నాళిఁ బ్రయోగించు, పద్ధతు లలవాటు • పఱచుచుండ
నాదిదేవుని యంశ • మగు రాముఁడనుజుల, తోడ వర్ధిలుచుండఁ • దొడరి మునులు,

ఆ॥ భూమిదేవి సురలు • పురవాసులును తమ, వ్యథలు దొలఁగెఁ బుణ్య • పాపరూప
కర్మమెల్లఁ బొలిసెఁ • గడఁకతో నీ చోటు, వదల మనుచు నటకు • వచ్చుచుండ్రు

సీ॥ భూదేవి నోచిన • పుణ్య ఫలంబుల, నెల్లవారలు కాంచి • యెఱుఁగునట్లు
శ్రీరామలక్ష్మణుల్ • చిత్తముల్ రంజిల్లఁ, గ్రోవితంతువువోలెఁ • గూడిమాడి
నదులందు మేఘముల్ • నడయాడు వనముల, విహరించుచుందురు • వేడ్కమెయిని
భరత శత్రుఘ్నులు • వరమైత్రి జతగూడి, కడలేని విద్యలఁ • గఱచునపుడు

తే॥ స్యందనాశ్వగజారోహ • ణాదులందు, విహరణాములందు భుజించు • వేళలందు
నొక్కక్షణమైన నెడఁబాయ • కుండువారు, కదఁక మమ్మేలు రామల • క్ష్మణులఁబోలె

చ॥ పరిమళవాయువుల్ పరవు • ప్రాంత వనంబులకేగి చల్లనౌ
కరుణావసించు సమ్మనులఁ • గాంచి ప్రమోదమెసంగ సంజలన్
మరలుదు రాయయోధ్యకుఁ గు • మారులు నల్వురు వారిఁగాంచి త
త్పురజను లుల్లసిల్లుదురు • పొంగుచు వానను గాంచు పైరునన్.

చ॥ అబలలు వారి దొడ్డ చను • లట్లు వెలుంగు బలంబుగల్గు వీ
రబలులు, వారిచుట్టములు • రంజిలి వారి యెడందలందు ప్రే
మ బలియనుండు దైవముల • మాటికి వేఁడుచునుండ్రు రాఘవుల్
ప్రబల చిరాయు రున్నతుల • వర్ధిలఁగాఁ దలిదండ్రులంబలెన్.

చ॥ శ్రుతి నికరంబుచే నయినఁ • జూడఁగ దుర్లభుఁడైన రాఘవుం
డతనిని వెంట నంటి తిరు • గాడెడు లక్ష్మణుఁడున్ చరించుచో
రతనపుఁ దెంకియున్ మొగులు • రక్త కుశేశయ పంక్తిఁబూచి దే
వతల నగంబుతో నరుగు • వైనమ యచ్చముగాఁ గనంబడున్.

చ॥ నెనరున మమ్ముగాచు నవ • నీపతి రాముఁడు నవ్వుమోముతోఁ
దనకెదురైన పౌరుల ము • దంబునఁ గాంచుచుఁ గృత్యమేది? యొ
ప్పని చెడుగేదియున్ మదిని • బాధ యొనర్పదుగా? సతీమణుల్
వినయ గుణాఢ్యులౌ సుతులు • వేడ్కమెయిన్ సుఖులేకదా యనన్.

ఉ॥ మామక పుణ్యరూప! నిను • మాప్రభుగాఁ బడయం గొఱంత యొం
డేమియులేక యుండు టరు • దే? వచియింపఁగ నేల? మా యసు
స్తోమము నేడు దీవులుగఁ • జొప్పడు భూతలమెల్ల నేలు మా
స్వామివి సౌఖ్యదాయివయి • సమ్మతిఁబెక్కుగు బ్రహ్మకల్పముల్,

చ॥ అని యిటు తత్పరీజనము • లర్మిలి నాతని కీర్తి నిండఁ గీ
ర్తనములు సల్పఁ దమ్మిలు ప • దమ్మిల చాయ వసించి సంస్తుతుల్
పొనరుప సర్వలోకులకుఁ • బూజ్యులు నాయకులౌ త్రిమూర్తులన్
దనదగు నాజ్ఞనద్పు గుణ • ధాముఁడు రాముఁడు భూమి వర్ధిలెన్

తే॥ రాజరాజగు దశరథ • రాజమౌళి ధరణియెల్ల నేకాతప • త్త్రంబు నీడఁ
దనర జయభేరిమ్రోఁత రో • దసియునిండ మునులుపొగడ నానందాబ్ధి • మునుఁగుచుండ

6 అర్పణ పటలము 24

చ॥ సనలుతలిర్చు కల్పక వ • నప్రభ మించెడు స్వర్గ పత్తనం
బుని వసియించు నెల్లరును • పొందికఁ జేరెడు శంకఁగొల్పి నె
మ్మనమున కూహకందక య • మర్త్య జగంబునకంటె నున్నతిం
బొనరిన రత్నమండపము • పొల్పు వహింప నరేంద్రుఁడుండఁగన్

తే॥ అమల మార్దవ భూరి సిం • హాసనమున రమణ నుండు భూపతిని చా • రణులుగాంచి
యింద్రుఁడని తొట్టతొలి సంశ • యించి పిదప వేయికనులు లేవని శంక • వీడినారు

కౌశికుఁడు దశరథుని గాన వచ్చుట

చ॥ జగములఁ బ్రాణులన్ సురల • సారసగర్భునితోడ వేఱుగా
నెగడ సృజింప నెమ్మదిని • నిట్టలుకన్ మొనకట్టినట్టి ప
ద్దుగలుగువాఁడు బ్రహ్మఋషి • దుర్దమ సింహపరాక్రమాఢ్యుఁ బు
ణ్యగుణ విభూషణున్ దశర • థావని నాథుని గాన వచ్చినన్

చ॥ గురుమతిఁ బద్మసంభవుని • కూర్మి నెదుర్కొను నింద్రుపోల్కి భూ
వరుఁడురమందు దాల్చిన ప్ర • భా మణిహారము సూర్యుఁబోలెనం
బరమును కాంతిమంతముగ • మార్పఁగ వైళమలేచి య మ్మునీ
శ్వరు పద పంకజంబులకుఁ • జాఁగిలి మ్రొక్కె సభక్తికంబుగన్

ఉ॥ మ్రొక్కి యనామయం బడిగి • భూరిమణీమయ సింహపీఠిఁ బెం
పెక్కఁగనుంచి పాదముల • నిచ్చ భజించుచుఁ గేలుమోడ్పుతో
స్రుక్కె మదీయ పాపములు • శుద్ధ చరిత్రులు మీరు వచ్చుటన్
నిక్కము నేను ధన్యుఁడ ము • నిప్రవరా! సరివారిలోపలన్

ఉ॥ మోదముతోడ నే వలచి • మ్రొక్కుటకుం దగునట్లు మీర లెం
తో దయనిట్లు రాఁగతము • యోచనచేసిన దేశభాగ్యమా?
కాద మదీయసత్కృతులు • కారణమా? యనఁగాదు నాదు వం
శోదిత పూర్వభూవరుల • యుత్కట పుణ్యఫలంబె యయ్యెడున్

సీ॥ అసుమ భూవరుఁడు ప్రి • యంబు లాడిన గాధి, నందనుం డిట్లను • నయము మీఱ
శత్రు విమర్దన • శాత కృపాణ ద, క్షిణహస్త! నను పోలు • మునివరులను
త్రిదివవాసులు నొక • డెప్పరంబును పొంది, రేని నిక్కము వచి • యింతు వినుము
హసిత సమస్త మ • హాద్రి విలాసంబు, వెల్లని చల్లని • వెండికొండ

తే॥ పాల సంద్రంబు పద్మజు • పట్టణంబు, కల్పక వికాస భాసి స్వ • ర్గంపు నగరి
యింపు గులుకు మేడలుగల • యీ యయోధ్య, తక్క వారికి వేఱొక్క • దిక్కు గలదె

సీ॥ రాజ సిరోమణీ! • రమణీయ కిసలయ, ప్రచయ సుందర సుర • పారిజాత
వృక్షంబు గందంబు • వీచును మధుకరం, బులు బొట్లు బొట్లుగా • నొలుకుచుండఁ
జల్లనౌ నీడ వి • శ్రాంతిఁ జెందుట వీడి, నీ యెక్కటి గొడుగు • నీడఁజేరి
తపము కొలంతలఁ దెల్పి • తగు సాయ మర్థింపఁ, గులగిరి నిభభుజుఁ • గ్రూరచరితు

తే॥ శంబరాసురుఁ గులముతోఁ • జావఁ బొడిచి, వశము గావించుకొని నాఁడు • వాసవునకు
నీ వొసంగినదే కాదె • నేఁడుగూడ, నతఁడు పాలించుచున్నట్టి • యమరజగము.

## కౌశికుఁడు యజ్ఞరక్షణార్థము రాముని గోరుట

చ॥ నలువుగ భేరి వాద్యము ల • నారతముం జగడించుచుండు మో
సల గల భూవిభుండు ముని • చంద్రుని వాక్యము లాలకించి ము
జ్జలధి మునింగి పొంగి ఋషి • సత్తమ! రాజుగనుండి పొందు స
త్ఫలమును గంటి నింకఁ జలు • పందగు దాని విధింపుఁ డర్మిలిన్

చ॥ అనవుడు మౌని యిట్లను జ • నాధిప! నేనొనరించు జన్నమున్
బనివడి యోగి వర్యుల త • పంబున క య్యరిషట్కముం బలెన్
దనుజులు విఘ్నముల్ చలుపఁ • దార్కొను వారలు, దాని మాన్ప నీ
తనయులలోన జ్యేష్ఠుని ము • దంబున నా వెనువెంటఁ బంపుమా

సీ॥ అని ప్రాణమర్థించు • యమునికై వడి వేఁడి, తపియింపఁజేసిన • తపసి పలుకు
నెఱఁకు నాటఁగ నీఁటె • నెరవిన పుంటిలోఁ, గొఱవిఁదూర్చిన యట్లు • గ్రుచ్చి చెవులఁ
గాఁడినయంతన • కాలదండముఁ బోలు, నాయుధపాణియౌ • నవనిభర్త
మనసునఁ బొడమిన • పెనుచింత పట్టి వె, ల్పలికిఁ ద్రొబ్బఁగఁ • బ్రియ • ప్రాణ వితతి

ఆ॥ ఉదరి దోల కరణి • నూఁగగఁ జనుషాంధుఁ, డెడను నేత్రములను • పడసి మరల
నవియ నవసి కుములు • ననువున మిగుల సం, తాపమొంది కుందెఁ దల్లడిల్లె.

సీ॥ పెరయూరుక్రియఁ దేనె • కురియు సుగంధ మా, లిక ధరించిన ప్రభుఁ • డొక విధముగఁ
జింతను మది నడం • చి కొని కౌశికుఁ గాంచి, యిట్లను మునివర్య! • యితఁడు బాలుఁ
డకృతాస్త్రుఁ డిదియ మే • యాజ్ఞయేని వినుండు, గంగాధరుండును • కమలభవుఁడు
నిర్జరేశ్వరుఁడును • నిలిచి యొక్కొక్కరై, గుమి గూడియేనియుఁ • గూర్చునట్టి

ఆ॥ విఘ్నతతికి మాఱు విఘ్నంబుచేసి ని, ర్విఘ్నముగ నొనర్తు • వేల్మి మీకు
బాలు మాటమాని • బయలుదేఱుండు మీ, వెంట నిపుడ సేన • వెడల వత్తు.

సీ॥ పరమేష్ఠి సృష్టికిఁ • బ్రతిసృష్టి చేసిన, కౌశికుఁ డతని వా • క్యమ్ము వినుచుఁ
బెను కిన్కతో లేవ • విబుధులు ప్రళయ మం, చును కాదనుచు శంకఁ • జొచ్చినారు
రవి మండలం బంబ • రంబున మఱుఁగయ్యెఁ, గలఁత నొందినవి జ • గంబులెల్ల
దిక్కులఁ దిమిరంబు • నిక్కి కావులు గప్పెఁ, గుల పర్వతంబులు • చలనమొందె.

తే॥ మునికిఁ గనుబొమల్ నొసటిపై • ముడులుపడియెఁ, బెదవు లదరెను జేగుఱు • బెరసి కనుల
నిప్పుకలు రాలె సభయెల్ల • నిలుకడ చెడె, తోడనే నవ్వు సైతము • దోఁచెనంత,

తే॥ ఇంతయును వసిష్ఠుఁడుగాంచి • శాంతిఁబొందుఁ, డనుచుగాధేయువేఁడి జ • నాధ్యుతోడఁ
బలుకు సుతునకుఁ బొందింప • నలవికాని, మేళ్లువచ్చుకాలము నాఁప • మేరయగునె?

తే॥ వానకురియంగ వెల్లువల్ • పరువులెత్తి, యంబునిధిఁ జేరుచందాన • నలవిలేని
యఖిలవిద్యలు తమయంత • నరుగుదెంచి, నీకుమారుఁ జేరెడి వేళ • నేఁడు కలిగె.

తే॥ అనుడు కులగురు వాక్యంబు • లాలకించి, యాజి విజయశీలుండాజి • యరిగి రాముఁ
బిలువుఁడన భటు లేతెంచి పిలుచునంత, బుద్ధిమద్వర్యుఁ డరుదెంచి • పొంత నిలిచె,

## రామలక్ష్మణులు కౌశికువెంటఁజనుట

ఉ॥ తమ్మని తోడ వచ్చుగుణ • ధాముని రాముని చూపి మౌని ర
త్నమ్మ! మదీయ పుత్త్రులకుఁ • దండ్రివి మేలగు తల్లివీవె ప్రే
మమ్మున నొప్పగించితిని • మానుగఁగావుఁడు వీరిచేత మీ
కెమ్మెయి కార్యముల్ వలయు • నెల్లను గైకొనుఁ డంచు నిచ్చినన్.

చ॥ విమలచరిత్రుఁడైన ముని • వీరుఁడు భూవరుఁ డొప్పగించు నా
సుమతులఁగాంచి మున్ను మదిఁ • జొన్పిన కోపము వీడి ప్రేమతోఁ
దమిఁగొని దీవనల్ సలిపి • దగ్గఱి పుత్త్రకులార! మేటి జ
న్మము మన మూని పూరితి యొ • నర్తమ? యంచుఁ జనం దొడంగినన్.

చ॥ జగములఁగాచు రాముఁడు ని • శాత కృపాణము సవ్యపార్శ్వమం
దు గడఁకఁదాల్చి గొప్పమల • దోయిని పోలిన యున్నతంపు దో
ర్యుగమున సత్యధర్మముల • యొప్పు వహించి కొలంతకాని యా
శుగ యుత తూణముల్ చెరివి • సూటిగఁ దాల్చె జయిష్ణు చాపమున్.

తే॥ తన్నుపోలిన తమ్ముఁడుఁ • దాను జనకు, తీపిప్రాణముల్ వెలి బైలు • దేఱు కరణి
వియతుగాధేయు వెన్నంటు • నీడ వోలెఁ, గాంచనమయ దుర్గంబులఁ • గడచి చనియె.

చ॥ పరములు పెర్తివోవక ల • పం బొనరించెడు వారు చేరుని
ర్జర నగరంబులన్ సవతు • రాని పురంబును దాఁటి నృత్య మం
దిర పటు దంగనా పద వ • నేజ రట ద్వర కింకిణీ సమా
ఖ్యరు రుచ హంసయుక్త సర • యూనదిఁ జేరిరి వార లంతటన్.

సీ॥ చెలువుల గాలికి • నొరయఁ దగిలి పోఁక, మ్రాఁకులఁ గాటిన • మధురసంబు
గనిమలఁ బొరలు మో • గానులఁ దిరుగాడు, హరిణాక్షులనుకృతో • దరులునైన
పొలఁతులు పొలుపార • మునిచి యల్లిన చీక్షు, కుంతలములఁ బోలు • కొపరుఁ దేంట్లు
పసియింప నిరవైన • వనమొండు గని యందు, తడసి యారాతిరి • విడిసి యవలఁ

తే॥ వెను మొగుళ్ళరిండములు కొ • మ్మనను గలిగి, ముఖపటముగల దంతినా • మొనయు నుదయ
శిఖరి శిఖరంబు మీఁదికిఁ • జిలుకరంగు, వాజు లేడెక్క నదిదాఁటి • పయనమైరి.

చ॥ గిరుధుజు లెప్పు నాలువలఁ • గైకొను నాహుతి సేయ నిమ్మగాఁ
గ్రతుముఖమందు లేచు పొగ • క్రమ్మిన యొక్క వనంబుఁ గాంచి స
మ్మతిఁ బురుషోత్తమోత్తముఁడు • క్ష్మాపతి పుత్త్రుఁడు రామచంద్రుఁ డో
యతివర! యీవనం బెవరి • దర్మిలి నాకు నెఱుంగఁ జెప్పవే.

## 9 తాటకవధ పటలము 72

కవిరాజ విరాజితము.

అనవుడుఁ గౌశికుఁ డిట్లను పూరుఁ డొ, కప్పుడు మోహనబాణము నీ
శుని పయి నేయఁగ నాతని నిప్పులు • జొబ్బిలు నేత్రమునుండి మహా
శని క్రియ లేచిన యగ్నిదహింపఁగ • సొరగు వాని శరీరము మం
డిన యదికోలె ననంగుఁడె యయ్యెఁగ • డింది మగండగు కంతుఁ డిటన్.

తే॥ భవుఁడు మదనుని దహియింప • వానియొడలు, బూదియై యిటఁ జిందుటఁ • బొలిచె నిద్ది
యంగదేశంబనెడిపేర • సార్థకముగ, విశ్వవినుత సుగుణచయ! • వేదనిలయ!

ఉ॥ ఆశయుఁ బాశమున్ మొదలి • కంట నశింపఁగ జన్మదుఃఖముల్
నాశమునొంచఁ దత్త్వమున • నారత చింతన సేయు జ్ఞానులే
యీశు భజింతు రట్టి యగ • జేశుఁడె యిందు తపించె నన్న నీ
దేశ మహత్త్వసంపద ను • తింపఁగ నెవ్వరికేని శక్యమే?

చ॥ అని ముని పల్క నచ్చటికి • నచ్చెరువందుచు నేగి సంతసం
బున నెదురైన సచ్చరిత • ముఖ్యధనంబుగఁ గల్గు మౌనులన్
గని మది సంతసించి గుణ • గణ్యులతో నట నాఁడు వుచ్చి వే
యినుఁ డుదయాద్రి నెక్కుతటి • నేగి మరుస్థలిఁ జేరి రొక్కటన్.

## మరుభూమి వర్ణనము.

మానిని॥ భానుఁడు మేదిని సారము పూర్తిగ • బాగుగ లాగఁ దలంచి పనిం
బూని జయధ్వజమెత్తి చరించెడు • పోఁడిమి గ్రీష్మమె కాక మఱే
దేని ఋతుస్థితి లేమి నిటన్ జ్వలి • యించు హుతాశనుఁడే మొగి నా
హీన పరిస్థితిఁ గాంచ నెదం దపి • యించును నీర్విడుచుం గనులన్.

కవిరాజ॥ ఉడుకును జిహ్వయు నచ్చటి వేఁడిమి • నొయ్యనఁ బూర్తిగఁ జెప్పినచో
నుడుకును పర్విన చీఁకటి, యండము • లుప్పర మారట మొందును వే
యుడుకును సూర్యుఁడు పుట్టినచో మఱి • యుక్కను మించులు పిడుగులు పై
నుడుకు సమస్తము నన్ను మఱెయ్యది • యత్తల మందక యుండు మహిన్?

చ॥ కదనమునందు శౌర్యము స • ఖడ్గ శరాదిక సాధనంబులం
బొదలుచు బాణ వర్షమునఁ • బోరెడి నేరుపు లేని వంచకుల్
గదురుచు కుట్రచేఁ బరువు • గర్వముఁ గోల్పడు వీరవర్యు నె
మ్మది బలె దాప మాఱకయె • మండుచునుండు సతంబు నచ్చటన్

ఉ॥ అవ్వన భాగమం దరయ • నాకులు రాలి మొదళ్లు, భూతముల్
సవ్వడి నోరు విప్పుకొను • చాడ్పునఁ జీలిన వృక్షరాజముల్
చివ్వన వంశముల్ ప్రిదులఁ • జిందిన ముత్తెములన్ ఫణిస్ఫుటల్
నెవ్వడి ప్రేల నివ్వటిలి • నిండిన కెంపులు నుండు దండిగన్

మ॥ ధరణీదేవియుఁ బోవఁజాల దెటులున్ • దత్స్థానమున్ వీడుచుం
బరువుల్ వాఱ దరణ్యదేవత మహా • భంగంబులం బొందు నం
బర వీథిన్ రవితేరు పాఱ దటఁ ది • ర్యం జాలవున్ మేఘముల్
నెరయంజాలదు చల్లగాలియు ననం • జిత్రంబు కాదయ్యడన్

ఉ॥ ధారణి బీఁటవోఁ గనుల • దంష్ట్రలనుండి విషాగ్నిఁ గ్రక్కు శే
షోరగ శీర్ష రత్న కలి • కోత్థర కాంతులు బీఁటనుండి తొ
ల్కారు మెఱుంగు లట్లు వెడ • లం గనుపట్టె ధరిత్రి దేవికిం
దీఱని మేనిపుండ్ల వెలి • దేఱెడి యొబ్బని నీచుకై వడిన్

చ॥ అడఁపఁగరాని యాఁకట మ • హావ్యథనొందెడు పెద్దపాము తా
నెడముగ నోరువిప్పఁగ, ది • నేశుని తీక్ష్ణ మయూఖపాళిచే
నుడికిన దంతియొండు తల • నొక్కట దాఁచుకొనం దలంచి పే
రడలున గీఁకపెట్టుచుఁ ద • నంతఁ జొరంబడు నీడ యన్మతిన్

చ॥ లనుపమ తీక్ష్ణ మూర్తియగు • నగ్ని మహాశయుఁడేలు నయ్యెడా
రిని గల కాకముల్ కరుఁ • బ్రేలుచు నాశిలి నల్లబొగ్గులై

పొనుపడి యుండుటల్ గనఁగఁ • బోలు నభస్థ్సల మెల్లఁ బర్వి యే
ర్చిన బడబాగ్నిఁగాలి యిలఁ • ద్రెళ్లిన మబ్బుల తున్కలో యనన్

ఉ॥ అమ్మరుభూమి సంచరిలు • నట్టి మరీచిక గుంపు లారయన్
గ్రమ్మిన వేఁడి యందడరి • క్రాసి నభస్థ్సల మంటునేని స్వ
ర్గమ్మును మాఁడునంచు నను • కంప సురావళిపైఁ గదించి తా
నిమ్మగఁ బశ్చిమాధిపతి • యేపున డిగ్గిన రీతిఁగన్పడున్

ఉ॥ వేఁడిమి నుండి తోఁచి పెను • వీఁకను పర్విన యెండమావు లా
పాదరి మండుచున్న వన • పాలుఁడు వేసఁగిఁ గూరుచుంటకై
పోఁడిమిఁ జర్చచేసి వడిఁ • బూన్చిన బంగరు కోడు లెత్తుగాఁ
గూడిన స్ఫాటికాసనము • కోరిక నిల్పిన రేవ దోఁచెడున్.

చ॥ కడు వగ నింప హేతువగు • కర్మములం దిగఁద్రోచి యవ్వలం
గడవఁగరాని ముప్పగర • గండగు కోటలదాఁటి మోక్షముం
బడయఁగ నెంచువాని మది • భాతిఁ బసిండి పఱంబుఁ గోరు రో
పడఁతుల శూన్య మానసము • వైఖరి ధారణి సారహీనమౌ.

ఉ॥ ప్రేలిన పక్కటా శ్లైనసి • బీఁటలు వాఱిన యాయెడారి పా
తాళము దాఁకఁద్రోవవడి • తక్కక పెద్దగఁ గానవచ్చుటన్
వాలిన యెండఁ దాళకొన • భారము దోపఁగ రాగరత్న భో
గాలి చెలంగు శేష నిల • యంబు చొరం దగియుండు నెప్పుడున్.

ఆ॥ ఇట్లు సెగలులేచి • యెడరిచ్చు మరుభూమిఁ, జేరినంత మౌని • వీరు గొప్ప
శక్తిమంతు లయ్యు • సౌకుమార్యము గల, వారు గానఁ గష్ట • పడుదు రనుచు.

ఆ॥ ఎంచి వారిఁ గాంచ • నింగితజ్ఞులు ముని, యంఘ్రి పంకజముల • నాశ్రయింప
బ్రహ్మసృష్టియైన • పరమవిద్యలరెంటి, వారి కపుడు నేర్పె • వాంఛతోడ.

క॥ మనమున వానిని వారలు, మననం బొనరించు నంత • మరుభూమియుఁ జ
ల్లని తేటనీట నడచిన, యనువయ్యెను రాముఁడిట్టు • లను సన్మునితోన్.

ఉ॥ కౌశిక మౌనిచంద్రమ ! త్రి • కాల విదుండవు తెల్పుమయ్య యీ
దేశము రేల పూవులను • దివ్యనదిన్ జటఁ జుట్టినట్టి గౌ
రీశుని యగ్ని నేత్రమున • నిట్టులు పాడగునేమి ? దుష్ట భూ
మీశుని నేల కన్న నిది • యెక్కువ నాశిల హేతువేదొకో ?

## తాటక వృత్తాంతము.

ఉ॥ నావుడుఁ గౌశికుండు రఘు • నాథుని ప్రేమను గాంచి యిట్లనున్
భూవరపుత్త్రి ! సత్పురుష • ముఖ్యులఁ జంపి భుజించి వేయి నా

గావళి చేవగల్గి జము • కంటె భయంకర రూపమొంది దు
ర్భావముతోఁ జరించు నొక • పాపపు టింతి చరిత్ర చెప్పెదన్.

చ॥ జగములు వింతనొందు బల • శాలి కుబేరు కులంబువాఁడు మ
త్తగలుగ కుండువాఁడు గజ • దోర్బల యుక్తుఁడు వహ్నివంటి కి
న్కగలుగువాఁడు జంకు వయి • నం బనుకంప యొకింతయేని లో
నగపడకుండువాఁడు భువి • యందు సుకేతుఁడనం బ్రసిద్ధుఁడౌ.

ఆ॥ సంతులేని చింత • మంతనమ్మున సుకే, తునకు నలము కొనఁగ • మొనసి మూఁడు
మూర్తులందు మొదటి • మూర్తిఁ బద్మాసనుఁ, గూర్చి చేసెఁ దపము • కోరి తడవు

తే॥ శాస్త్రవిశ్రుత సంపన్నః • సజ్జనాభి, రామః ప్రాఁ జదువులగని • బ్రహ్మ యతని
యెదుటి కేతెంచి నీ కోర్కి • యేది యనినఁ, బుత్రహీన దుఃఖమును దీ • ర్పుమని వేఁడె.

చ॥ కొమరులు నీకుఁ గల్గరొక • కూతురు గల్గును లేఁతనెమ్మిమై
కొమరు వహించి లక్ష్మివలె • గోమున నొప్పుచు వేయి మత్తనా
గముల బలంబుగల్గి త్రిజ • గంబులఁ బేరు వహించు నంచు నా
కమలభవుం డొసంగి మఱుఁ • గం జనియెన్ దన యిమ్ము చేరఁగన్.

చ॥ వనజభవ ప్రసాదమున • వానికిఁ గల్గిన పుత్త్రి లక్ష్మిరే
వను క్రమరీతి గోముగను • వర్ధిలి పెండిలి యీడు నొంద నొ
ప్పిన వరుఁడెవ్వఁ డబ్బునని • పేరిమి నారసి తండ్రి, సుందుఁడన్
తనకులమందు మేటి గుణ • ధన్యున కచ్చెలిఁ బెండ్లిసేసినన్.

తే॥ మేటి రతి మన్మథులఁ బోలు • మిథున మిద్ది, యనఁగ సుందుఁడు మోహిని • నెనయుసుదతి
తాటకయు రేయుఁ బవలు మొ • దలు తుదియును, లేదనఁగఁ గూడి తేలిరి • మోద జలధి.

తే॥ చాల దినములు గడవ నా ః చామయంతఁ, గాంచె మారీచు బలుమాయ • కాని నవలఁ
బడసె గిరి నిభ బాహు సు • బాహు మల్లు, వీరు జగముల ప్రాణులు • భీతినొంద.

ఉ॥ వారలు మేటి మాయయును • వంచనయున్ దులలేని యుద్ధ సం
చార చణత్వమున్ గలిగి • చాతురిఁ దల్లికిఁ దొమ్మిదంతలై
మీఱినవారికే నెఱుఁగ • మేవడి చాలనిరీతి వర్ధిలన్
దేటిన మేటి సుందుఁడు మ • దించెను సంతసమంది యుబ్బుచున్.

చ॥ చెడుగులు మేరమీఱి వెసఁ • జేయు సురారుల యోర్వరాని దుం
దుడుకులు మూలమట్టుగను • దోరఁగ నంబుధి తోయమంతయుం
బుడిసిటఁ బట్టి త్రావిన త • పోధను నాశ్రమవాటిఁ జేరి య
క్కడి తరుజాలము ల్వెటికి • కాసట బీసట చేసి యంతటన్.

మ॥ రమణీయ స్థితి గూర్చి వాటికి మునీంద్ర ప్రేమకుం బూర్ణసా
ద్రముల్తై యొప్పెడు కృష్ణసార రురు సా • రంగాదులన్ సాధు జీ
వములం జంపి భుజించి సుందర తిరు • ప్రాప్తిం బు భంజింపఁ గో
పముగం గుంభజుఁడట్టి చూచ నలరం డున్ • భస్మంబయ్యె నాశిలెన్

తే॥ సుందుఁ డీఁటట యాతని • సుదతియైన, తాటక యెఱింగి యగ్ని వి • ధాన మండి
యమ్మునిని వినాశమొనరింతు • ననుచుసుతుల, బిలుచుకొంచు దదాశ్రమ • స్థలికిఁ జనియె

చ॥ పిడుగులతో లయాగ్నియును • భీకరవాయువు బెగడిల్లఁగా
వడఁకి సురాళి మోములును • వాడ రవీందులు త్రోవఁ దప్ప మిం
పడరు మొగుళ్ళు సంచలన • మంద ధమీ యని యంచగోళముల్
చెడియుచు బీఁటలెత్త పడిఁ • బేర్చుచు నార్చుచు డాయునంతటన్.

ఉ॥ ద్రావిడమన్ సముద్రము ను • దారమతిం దయచేసి నాతఁడా
పావక సన్నిభుండు నిడు • పాఱు త్రుధాగ్ని మిడుంగుఱుల్ వెసన్.
గ్రోవుల బోల్కి వెల్వడిని • క్రూరులు మీరలు దైత్యులై, చెడం
జావుఁ డటంచు వజ్రనిభ • శాప వచస్సుల నాడినంతటన్

ఉ॥ రాగి చిరంగి వెల్వడిన • రాజ బయల్వెడు కోపవహ్నితో
నేగి జగంబులం గలఁచి • యేర్చి సరాసురకోటిఁ గూల్చుచున్
సాగి సమస్తజీవులను • చంపి భుజించుచు ఘోరదుర్మలై
క్రాఁగి చరించు వీరలగు • రక్కసులైరి రయాన వంచ్వెదున్.

తే॥ అట్టులమ్మునిశాపంబు • నధిగమించి, క్రియకుఁ బ్రతియొనరింప శ • క్తియును లేమి
నేగి వారు సుమాలితో • నేము నీకుఁ, జెలిమి కొడుకులమని వారి • చేసికొనిరి

ఉ॥ తిప్పడు చెయ్యలం జలుపు • తాటకపుత్త్రులు వానితోడ, చెం
పొప్ప రసాతలంబునన • యుండి, దశాస్యుఁడు గాంచి కూరిమిం
గుప్పుచు మామ లంచు, దము • గొప్పగ మిక్కిలి గారవింప, వా
రెప్పటి హింసతోడ భ్రమి • యించిరి పెన్ సుడిగాలి పోలికన్

తే॥ గొప్ప బలపంపదగు కొడు • కులను వీడి, ముని కినుకనెంచి మండెడు • మనసుగలిగి
త్రోవలెల్ల జ్వాలాగ్నికి • రావులైన, యిప్పనముఁ జేరెఁ దాటకఁ • యేపుతోడ

సీ॥ ఇలయెల్లఁ గినుకతో • నెత్తంగ వలసిన, జలధి నీటిని చల్లి • వలసిన యెడఁ
గోరి స్వర్గముఁ జీలఁ • గొట్టంగవలసినఁ, జేసి ముగించు నా • చెడుగు జోటి
పన్న నలవిగాని • హింసలు ముద్దయై, యుదువొందెనన నొప్పు • నువిద మేను
రెండుకొండల తోడ • మండెడు విషముతోఁ, బిడుగుల మించు న • లుకడులతోడఁ

తే॥ ప్రళయ వహ్నితో నర్ధచం • ద్ర ద్వయంబు, నొంది సడలెంచు కదలి యొం • డుండు నేని
బెడిదముం గూర్చు నద్దాని • యొడలితీరు, కొంత యూహింపఁబోలు నీ • కువలయమున.

సీ॥ కాంచిన పురుషులం • గామినీత్వముఁ గోరు, భుజ సుందరత్వంబు • పొసఁగు రామ
బెడిదంపు శూలంబు • పెనుపాఁప కడియంబు, చేఁదాల్చియుండు నా • చెడుగుజోటి
యివ్వనంబున వసి • యించును నుండు నా, టకటొంకుపేరు తా • టక యటంచు
మనసున బంధ మీఁగని లోభమొక్కటి, మాత్రముండిన లెక్క • మాలినట్టి

తే॥ సద్గుణావళి నాశంబు • సలుపు కరణి, నలవి యిడరాని కొడిమ బు • ద్ధుల వలంతి
చెడని పంటలు గలుగు నీ • క్షేత్రభూమి, వట్టి మరుభూమిగా మార్చి • పాడుచేసె

తే॥ నీలమేఘ సుందరదేహ! నీరజాక్ష!, రాక్షసాజ్ఞచే నాచేయు • క్రతువు నెప్డు
పర్వత బలంబుతోవచ్చి • పాడుచేయు, నంగదేశ వంశంబు ల • డంగఁ దిరుగు.

చ॥ జగములఁ గాచి ధర్మమునఁ • జాఁగెడి జీవులఁ దన్ను బోలెఁ బెం
పుగఁ దలపోయు భూపసుత! • బూటక తాటకఁ గూర్చి నీకుఁ బె
క్కుగఁ బలుకంగ నేల? యిటు • కొన్ని దినంబులు సాఁగెనేని యీ
జగతి సమస్త జీవులను • చంపును నింపును పొట్టలోపలన్.

## తాటకవధ.

తే॥ ముని యిటులు పల్క విని శంఖ • మున్ ధరించి, చేత విల్లుదాల్చినవాఁడు • చిందు కేనె
గంద మంరు మాలిక సిగఁ • గదలుచుండ, నెట వసించు నయ్యది వచి • యింపుఁడనియె

చ॥ అనపుడు మౌనిమౌళివిభి • తాక్షముఁ డిట్లను హస్త యుగ్మముం
గొనిన గిరీంద్రమున్ వయను • కోడెను బోలిన రాముఁ గాంచి యీ
వనమగు దానికెల్లయని • పల్కియుఁ బల్కక మున్నె మండుచున్
దనుజయు నంజనాచల వి • ధంబున వచ్చె ధరిత్రి దద్దఱన్

ఉ॥ కొండలు గజ్జెలం జొనిపి • కూర్చిన కాళ్ళు ధరన్ దిగంబడన్
గండుగఁ ద్రొక్కులొక్కువడు • గాత్రములందు పయోధి తోయముల్
నిండఁగ నిప్పుకల్ చెరుగు • నేత్రములొప్పు జముండు భీతిమైఁ
గొండ గుహల్ చొరన్ గిరుల • కూటమి తన్నొయిదన్ గడున్ వడిన్.

చ॥ ఎలయుచు నిక్కి కొంత చలి • యించు బొమల్ నెలవంకఁ బోలు దం
ష్ట్రలు పెనుమూఁతగల్గు గుహ • చాడ్పున నొప్పిన బాకినోటితోఁ
బొలఁతుక నిండు సంద్రమునఁ • బొల్చిన వార్వపుటగ్గి రెండు పా
యలు గొని నిర్గమించు క్రియ • నగ్గి బయల్వడ విచ్చెఁ గన్నులన్.

ఉ॥ తోరపు మత్తదంతులను • తొండఘు తొండముతో ముడించి మేల్
పేరుగఁ దాల్చుటం గదలు • పెన్నడుముం గల దైత్య గట్టిగా
నాఱిచె నన్ని లోకములు • నన్ని దిశల్ మఱి యన్నిచోట్లు దా
ర్మ్రాఱయి కాదప్పడన్ బిడుగు • రావము సైతము పుల్లగిల్లఁగన్.

తే॥ పిడుగు వాసలఁ బోలిన • బెడిదురాలు, గర్జనముచేసి వారిని • గాంచి నగుచు
వాఁడి శూలమన్ కాలుని • పాఱఁజూచి, పండ్లు గీఁటుచు గుహఁబోలు • వాయిదెఱచి.

చ॥ ఎడిమి నజేయమౌ బలము • గల్గిన నా యురు రక్షణ స్థలిన్
గదఁక సమస్త జీవులను • గ్రచ్చఱఁ జంపితి నౌర! మీరలే
ఏదుకొని వచ్చినార లిటఁ • గమ్మని మాంసము నాకు లేమినో?
చెడువిధి త్రోవఁ జావనొకొ? • చెచ్చెర నం చదలించి నవ్వుచున్.

ఉ॥ అంబుద సంఘముల్ నుఱుము • లై పడఁ గన్నులు విచ్చి చూచి యు
ల్లంబును మండ గొప్పమల • లం బొడియై పడఁగాలఁ దన్నుచున్
దంబగు బాలచంద్రు మొన • డాల్గల కోఱలఁగీటు చార్చుచున్
బంబిన కిన్క తొమ్మలను • వ్రచ్చెద నంచుఁ ద్రిశూలముం గొనన్.

చ॥ అరిది తపోధికుండు ముని • కద్ది యభీష్టమయయ్యె సద్గుణా
కరుఁడగు రాముఁడా వనిత • కంఠముఁద్రుంచెదనంచు వింటవే
శరమును పూన్పఁడయ్యెఁ దము • చంపుటకే బెడిదంపుఁ జెయ్యలన్
జరుపుచునున్న దయ్యె నది • చానగదా యని యెంచె జాలిమై.

ఉ॥ వెల్లని పండ్లు నెట్టనగు • వెంద్రుకలుంగల తాటకాఖ్య త
న్నెల్ల విధంబులం బొడువ • నెంచి త్రిశూలముఁగొన్నఁ జంపఁగా
నొల్లకయున్న రాఘవుని • యుల్లము దిట్టమెఱింగి వేదవి
త్తల్లజుఁ డిట్లనున్ మదిని • తత్తఱ మందుచు రామచంద్రుతోన్.

చ॥ ఇలఁగల పాప సంఘముల • నెల్లనొనర్చి రసంబులేని ప్రా
ణుల మని నిశ్చయించి మము • నుగ్గుల నూచముచేసి మ్రింగఁగాఁ
దలకొనకుండ వీడినది • తా నొనరింపక వెత్తియై యిదే
కల దిఁక నేమనం గలదు • కామిని యే యన దీనిఁజెల్లునే?

మ॥ త్రపయే ముఖ్య గుణంబుగాఁగలుగు కాం • తా మాత్రముం జంపఁగా
నవహాస్యంబగుఁగాని వీర్యబల శౌ • ర్య స్థైర్య తేజోయుతుల్
విపరీతస్థితి నొందువా రతివ పే • ద్విన్నంత నే భీతులై,
చెవమా యెచ్చటఁ బౌరుషంబు నిలువం • జేకూడు నీమీఁదటన్?

తే॥ మఘువుఁ డోడె సైన్యంబులు • మడియ దేవ, దైత్యులోడిరి దీని దో • ర్దండయుగము
మందరముఁ బోలునన నిఁక • మగతనమున, మగలయందు దీనికి భేద • మగునయేమి?

క॥ ఇఁక నీకుఁ జెప్పవలసిన, దొకటిగలదు వినుము • రఘుకు • లోత్తంసమ! ము
న్నొక కాలంబున నడచిన, ప్రకటక్రమ మిద్దియనుచుఁ • బలికెన్ మరలన్.

చ॥ భృగుముని భార్య ఖ్యాతియను • పేర్గల వాలుగకంటి మానసం
బుఁ గరఁచు ప్రేమనూని దితి • పుత్త్రుల కొక్కెడ గొప్పసాయ మొ
ప్పుగ నొనరింపఁగా నెఱిఁగి • పూర్ణమతిం దన చక్రధారచేఁ
దెగఁ గొనె నామె ప్రాణములు • తెంపున దైత్యవిరోధి యయ్యెడన్.

తే॥ దేవభూలోకములఁగల • జీవసమితి, యెల్లఁ దనకు నోర్వంబని • యెంచు కుమతి
కుమతియనుపేరిదాని న • య్యమరవిభుఁడు, కులిశధారచేఁ దలఁద్రెంచి • కూలఁద్రోచె.

తే॥ అఖిల జగదభిరామ! క • ల్యాణధామ!, రామ! విష్ణువునకు దేవ • రాజునకును
వర్ణనీయమౌ కీర్తి • వచ్చెఁగాక, దాన నొకనింద గలిగెనే • తలఁచిచూడు.

ఉ॥ నీరజలోచనా! విమల • నీరజమిత్త్ర కులాబ్ధిచంద్రమా!
సారమతిన్ నిజంబుగ వి • చారణసేయ బుధాళితో మహా
వైరమునూని ప్రాణివధ • పాటిగఁ జేయుచు ధర్మనాశమున్
దారుచు దానికిన్ మగత • నంబును గావలెనే వచింపుమా?

చ॥ అరుఁకుఁ గాలుఁబోలు నసి • హస్తమునం గల వీర! బ్రాహ్మ యే
ర్పఱచిన యాయువుం దెలిసి • పాడి యెఱింగి సమీక్షతోఁ గృతం
బరయుచు జీవసంతతుల • నావలి లోకము చేర్చువాఁడుగా
కెఱచికి దీనిఁబోలెఁ బసి • యొయ్యనఁ జంపెడు కాలుఁడుండునే?

తే॥ పెక్కుప్రాణులఁ దనపొట్టఁ • బెట్టుకొనెడి, దుర్గుణముకంటెఁ జెడుగేది • దొకరుఁ గలదు
జడగలది మనలేనిది • మదఁతి యనుచు, దీనిఁ దలఁచుట యవివేక • మే నిజంబు.

ఉ॥ న్యూనత నాశముం గనని • యుద్ధృత ధర్మము చెప్పినాఁడ నే
దీని వయిం జలంబుగొని • తీరుగఁ జెప్పెడివాఁడఁగాను నీ
మానసమందు జాలిపని • మానుము చక్కటికాదు రక్కసిన్
మానిని నాక యింకఁ బరి • మార్పుమ యంచు మునీశ్వరుం డనన్.

చ॥ మునివచనంబు విన్న రఘు • ముఖ్యుఁడు వాకొను సత్యహాస మీ
మనమున సందియంబు లిఁక • మానుఁడు ధర్మ విరుద్ధ కృత్యమై
నను తగఁజేయ నాజ్ఞ యిడ • నర్మిలి మీ నుడి వేదమంచు మే
ల్మిని నొనరించుటేకద చ • లింపని ధర్మపథంబు మాకగున్.

ఉ॥ భూమిని రూపుఁదాల్చి దవ • వహ్నిని బోలిన తాటకాఖ్య గ్రం
గా మధురాంబు పావన జ • గంబగు కోసలదేశమేలు రాట్
సోముని పుత్త్రియత్నము క • దున్ మదిఁగైకొని కిన్కఁ గన్నులన్
గ్రామిడి దూఁకు మంటలును • రా జగఁగ శూలము ద్రిప్పివైచినన్

ఉ॥ క్రొత్త యముండనం దగిన • కొమ్మ మనం బెరియంగ వైవఁగా
నెత్తిన శూల నామమది • యాగ్ని కడంక మునీంద్రు నాజ్ఞచే
చిత్తము నిశ్చలత్వమునఁ • జెందఁగ నిల్చిన రామచంద్రుపై
నెత్తిన నిండు చంద్రుపయి • కేగెడు రాహువు పోల్కి నేగఁగన్.

చ॥ ఇనకులవీరుఁ డా యదన • నే శరమెత్తుట కూర్చుటల్ శరా
సనమున నారి లాగుటయుఁ • జయ్యనఁగాంచిన వారులేరు కా
లుని పదనుంచి లాగికొని • లోఁగక తాటక యేసినట్టి ము
మ్మొనలు గలట్టి వాలు పలు • ముక్కలఁ జూచిరి నేలపైఁ బడన్.

తే॥ ఇరులు మొగులును గలరంగు • పరఁగు పడఁతి, యొక్క పలుకాడు నంతలో నుదధినిండఁ
జేయు పెనురాలవాన వ • ర్షించె నదియు, రామకోదండముక్త వ • ర్షమున నడఁగె.

శా॥ నీలాంభోదనిభుండు రాముఁడు వడి • న్నిర్భిద్రతన్ ఘోర శా
పాలాపంబును బోలు శాతశర మే • యన్ వజ్రశైలాంతర
స్థూల ప్రస్తరరీతి నొప్పు చెలి వ • క్షోదేశముం జొచ్చి వెన్
హేలారీలను దుస్సె మూఢులకు జ్ఞా • నీంద్రోపదేశక్రియన్.

చ॥ వినుత నగేంద్ర ధీరుడగు • కార్ముకవీరు నిశాతసాయకం
బునఁబడి తాటకాఖ్య భువి • బ్రుంగుట దోఁచె యుగాంతకాల సం
జనిత మరుత్తతుల్ విసర • జంతు లయంబుగ నాకసంబు గ్ర
మ్మిన పెనుమేఘముల్ పిడుగు • మించులతో భువిఁ బడ్డకై వడిన్.

సీ॥ దుమ్మునిండిన యవ్వ • నమ్మెల్ల రక్త ప్ర, వాహమ్ము లతిశయిం • పంగఁ బడిన
మెఱుపులకైవడి • మెఱసెడి కోఱలుఁ, బోట నోరును గల • తాటకాఖ్య
భువన విజయుఁడయి • పొలుపొందు రాక్షసే, శ్వరునకు మొదటి దు • శ్శకున మగుచు
నా దినంబున భూమి • పైఁ దెగిపడ్డ సొం, పైన జయధ్వజ • మనఁగ నొప్పె

తే॥ అడవి మార్పడి కదలియా • నట్లురమున, శరముగాఁడి దూసిన త్రోవ • జాతి నల్ల
సంజ నెత్తురౌ మిన్నూఁత • జాతి యవనిఁ, బడినదియుఁ బోలె వనమెల్లఁ • బర్వెనపుడు.

సీ॥ కలికి క్రొవ్విరివమ్మి • గద్దెనెక్కిన వానిఁ, బోలు కౌశికునాజ్ఞఁ • బూని నడపు
రత్నకాంచన భూషి • రాముని కన్నె క, య్యమున సాయుధహస్తు • లైన దనుజ

కుటుంబవారల యనుఙుల నెన భయపడి, సిగ్గిలి మతి యాస • చిగురులెత్త
భ్రమయుచు నుండిన • జముఁడును నాఁడొక, మాత్ర చొక్కపుఁరుచి • మరఁగినాఁడు

తే॥ మానివాసంబులు మరల • మాకుఁదక్కె, క్రతువు నీకగు దివ్యాస్త్ర • వితతు లితని
కిమ్మనుచు మునితో వచి • యించి సురలు, దండి గురిసిరి విరులుకో • దండిపైని.

## 8 యాగపటలము 55

ఉ॥ తీరగు దీవనల్ సలిపి • దేవత లేగఁగఁ బుష్పవృష్టిచే
మీఱి ప్రశాంతమైన మరు • మేదిని దాఁటుచు లేమి మందనం
బేరు వహించు*దానగుణ • వీరు నమోఘ మహార్థయుక్తవా
గ్ధారకు దీటుగల్గు విశి • ఖంబు లొసంగెను మౌని వారికిన్

ఉ॥ శాంతుఁడు జ్ఞాని కౌశికుఁడు • సన్మతినిచ్చిన దివ్యబాణముల్
సంతత శుద్ధ మానసుఁడు • చక్కటిఁజేసిన సత్కృతంబు జ
న్మాంతరమందు రోసి తన • యంతట వానిని చేరునట్లు సు
స్వాంతుని రాఘవుంగదిసెఁ • జయ్యన వేడ్కమదించి పైకొనన్.

శా॥ వీరాగ్రేసరః నిన్నుచేరితిమి ని • న్నీవిధంగలే మెప్పుడున్
గారామార విధించు కార్యములు చ • క్కంజేసి నీయొద్దకే
చేరన్ వచ్చెదు నీదు తమ్ముని క్రియన్ • జేయంగ నూల్కొందు మం
చారం బల్కు మహాస్త్రసంతతుల శ్యా • మాంగుండు నెమ్మిం గొనెన్.

తే॥ అంతరెండామడలు వార • లరుగ నచట, గొప్ప శబ్దంబు వినబడ • గురు గుణుండు
రాముఁడిది యేమి యనఁగఁ గ • ర్మములు నీఁగఁ, దప మొనర్చిన మునిపల్కు • దానిఁగూర్చి

తే॥ మానసమునఁ బొడమి సర • యూనది యన, నొప్పి నిర్జరవినుతుల • నొందు దానఁ
గలియు గోమతి రవమని • పలికి యవలఁ, నడచి భవహారియగు నౌక • నదిని చేర.

## :-కౌశికీనది వృత్తాంతము:-

సీ॥ దేవతాస్తుత్యమై • తెలివొందు నీనది, వృత్తమేమని రఘు • వీరుఁడడుగఁ
గౌశికుం డిట్లనుఁ • గమలగర్భుఁడు తొల్లి, పొందిన గౌరవం • బును జయంబుఁ
గొనిన రారాజగు • కుశుఁడు స్వపత్నియం, దమరంగ నల్వురు • కొమరులఁగనె
వారు కుశాంబుఁడు • ప్రథితు డౌ కుశనాభుఁ, డా ధూర్తరజుఁడు వసు • వనెడువారు

తే॥ అందుకౌశాంబియందుకు • శాంబుఁడుండె; నమరెఁగుశనాభుఁడుమహోద • యంబునందు
అలరె నాధూర్తరజుండు ధ • ర్మాటవిని గి, రివ్రజంబున వసువు కో • రికను నిలిచె

సీ॥ ఆ భూపతులఁ గుశ • నాభునకుంగల్గి, రలరెడు లలితవా • క్కులు ప్రవాళ
సుందరాధరములు • పొందిన సద్గుణ, వతులు నూర్గురు ప్రియ • సుతలువారు

* తిరువెజ్ఞెయ్ నల్లూరి శడై యప్ప వాక్యములను పోలిన యస్త్రములను • లని మూలము

గోముగా వర్ధిల్లి • కొమరు ప్రాయమునొంది, యొకనాఁడు విహరించు • నుత్సుకతను
చెలులతోడ వనంబుఁ • జేరి క్రీడింప వా, యుపు వారిఁగని మోహ • మొంది పంచి

తే॥ మావి పిందె బోల్కన్నుల • మగువలారః, పరుని గుఱుసపడిన వింటి • మార్గణంబు
మదిని గాఁడి నొప్పించె నే • మఱుఁగు చుంటిఁ, బెండ్లి యాడుఁడి మిమ్ము నే • వేఁడుకొంటి

సీ॥ అని వేఁడఁగా వార • లా సమీరణుఁగాంచి, మాతండ్రి వేఁడుము • మమ్ముఁ దాను
దానపూర్వకముగా • దయచేసెనేని నీ, కోరిక యపుడొందుఁ • బోర మనఁగ
గంధవహుండంతఁ • గడఁకతో వారి వీఁ, పుల గూను గావించి • పోవుటయును
కర కంకణ స్ఫుట • కాంతులొలయ నడ, వఁగలేక వారలు • పడుచులేచి

తే॥ తండ్రికడకేగి యమ్మృతంబుఁ • దన్నునట్టి, గొనబు పలుకులతో నోరు • కొతుకువడఁగఁ
బోలఁజెప్పఁగ నోదార్చి • చూళి కొడుకు, బ్రహ్మదత్తున కిత్తఁడు వా • రల నొసంగె.

మ॥ చెలులన్ వేదిక బ్రహ్మదత్తుఁ డెలమిం • జేపట్ట నక్కన్నెకల్
లలితాకారము లూని రాతని తపో • లాభప్రభావంబునన్
జెలఁగన్ సూనుఁడు లేమికిన్నృపుఁ డెదం • జింతించి పుత్త్రేష్టి మా
నులచే వేల్వఁగ నందు గాధి కలిగెన్ • బ్రోద్యత్తరంగాళితో.

చ॥ నలువుగ రాజ్యమెల్లఁ గుశ • నాభుఁడు గాధికి నప్పగించి య
క్కులనిధి నాకలోకమున • కుం జన గాధి మహోదయంబు స
ద్బలయుతుఁడై ప్రపాలన ము • దారమతిన్ జరుపంగ గాధికిం
గలిగితి మంతఁ గౌశికియు • గాదిలి పుత్త్రుఁడు నేఁ గ్రమంబునన్.

తే॥ అవలమాతండ్రి భృగుపుత్త్రుఁ • డైన ఋచికు, నకుఁ బొసంగఁగుమారిఁగౌ • శికినొసంగఁ
గొన్ని యేండ్లు త్రివర్గముం • గోరి లనిసి, తపముచే సత్యలోకం బ • తండు చేరె

చ॥ పతి గగనంబు త్రోవ నడు • వన్ విరహంబు సహింపలేక త
త్సతి నదిరూపుఁగొంచు భువి • దారిని వెన్నవులంగఁ గాంచి త
త్పతి ఋచికుండు భూజనుల • బాధలఁ దోలుచునుండు మాపగా
కృతిఁగొని యంచు నాజ్ఞయిడి • యేగె విరించిపదంబు చేరఁగన్.

ఉ॥ సోదరి నిమ్నగాకృతి వ • సుంధరయందె వసించె నంచు న
త్యాదర మొప్పఁ గౌశిక మ • హాముని పల్కఁగ విస్మయంబు స
మ్మోదము సెంది రాఘవులు • ముచ్చటఁ గొంత పథంబుపోయి యం
భోదముఁ గ్రమ్మియుండు వన • ముం గని యెవ్వరి దంచు వారనన్.

## వామన చరిత్రము

సీ॥ మౌని యిట్లను భువి • లోన మానినులకుఁ, బతికంటె గొప్ప దై • వంబు లేద
యనెడు పతివ్రత • మనసుఁబోలిన పరి, శుద్ధ విషయమిది • శ్రద్ధవినుము

వేద సంతతికిని • విబుధుల బుద్ధికిఁ, దక్కినవారి కం • దకయె యుండుఁ
గమల నాభుఁడు కొంత • కాలంబు దుష్కర, తప మొనరించిన • తానమిద్ది

తే॥ అమరులను భూజనములు బం • ధములనీఁగ, వాని శ్రీనామమేనోటఁ • బలుకుచుండ్రు
వాని కపటనాటక మెన్న • వశముగాదు, అతని నుతియించు ఫలము శ • క్యంబె తెలియ.

తే॥ కడకఁ దపియించె నూఱు యు • గంబు లిచట, నాదినంబుల భూగోళ • మమరు దంత
ములనుగల పోత్రిఁబోలిన • బలియుఁడైన, బలి వశము చేసికొనియె ది • వంబు భువము

తే॥ శంక యొక్కింత మదిలేక • జరగు దాత, యురు తపశ్శాలి సురలకు • నరిదియైన
మఖము నెఱవేర్పఁబూని స • మస్తభూమి, నేల వేలుపులకు నీయ • నిశ్చయించె.

తే॥ జరుగుచున్నది యెఱిఁగి ని • ర్జరులు హరిని, గలిసి కేల్మోడ్చి ప్రార్థించి • బలి యొనర్చు
కొడిమెలం దొలఁగించి చే • కూర్చు సుఖము, శాంతి యన నతఁడటుచేయ • సమ్మతించె.

ఉ॥ శ్యామల వర్ణుఁడున్ మహిత • సాత్త్వికుఁడైన రమేశుఁ డంతఁ ద
త్త్వామలవేది మూఁడు సమ • యంబుల చర్య లెఱుంగువాఁడు దై
త్యామర తాత కశ్యపున • కర్మిలి పుత్త్రకుఁడై జనించి తా
వామనుఁడయ్యె వింత దలఁ • పన్ వటబీజము న్యాయ మొప్పఁగన్.

సీ॥ ఒప్పారుచేష్టలు • ముప్పురి జందెంబు, మొలయందు మౌంజియుఁ • గలుగువాఁడు
వేదముల్ విస్పష్ట • విధిఁ బల్కు నాల్కయుఁ, గరమునం దగ్నియుఁ • గలుగువాఁడు
జ్ఞానులకే యెఱుఁ • గం దగ్గ తనదు చి, ద్రూపాభమౌ నొక • రూపుఁదాల్చి
యరుదెంచు వామను • నాగమనంబును, త్రిభువన జేతయు • ధీరుఁడు బలి

తే॥ యెఱిఁగి యచ్చెరువంది ము • న్నెదురువచ్చి, కొంచుఁ బోయి పూజించి సద్గుణగరిష్ఠ!
నిన్ను బోల్విప్రులును లేరు • నన్ను బోలు, ధన్యులును భువిలేరని • తనియఁ బల్కె.

తే॥ అంత నమిత వివేకియై • యలరుగుజ్జు, యాచకులు కోరుకంటె న • త్యధిక మొసఁగు
దీర్ఘభుజ! నీకడకు నేగు • దెంచునట్టి, వారె భాగ్యయుక్తులు; రాని • వారు కారు.

తే॥ అనుచు పచియింప నలరి యా • దనుజరాజు, వలసినది యేది తెలియంగఁ • బలుకుఁడవిన
నెనరు కలదేని మయ్యడ్గు • నేల వలయు, ననినయంత నిచ్చితి నని • యనుట తోడ

చ॥ కవి కొడు కిట్లు పల్కనిది • కైతవవేషము నమ్మఁబోకు దా
నవ కుల చంద్ర! భూసురుఁడు • నల్లని మేఘముఁబోలు నొక్క మా
నవు డని గుజ్జురూపని య • నంజన దెల్ల యజాండ గోళముల్
తవిలి యొకప్పుతుండమునఁ • దాల్చిన యాతఁ డెఱుగుమా యనన్..

తరల॥ దనుజదేశిక! పత్కరంబది • తద్దయుం బయిఁ గ్రాలఁగాఁ
దనకు నొప్పనిరీతి ఓక్కలి • తాఱి యుండున దెన్నఁగా

నెన యెఱుంగని నీలవర్ణుని • యందిరేశుని శ్రీకరం
బనఁగ నాకిఁకే నంతకంటె మ • హాత్మ! మేలెది చూడుమా!

తే॥ వలయువారలు వలవని • వారటంచుఁ గనక నిర్ణయించిన యీవి • ఘనుల కొసఁగఁ
దగినదని ధర్మ తత్త్వవే • త్తలు వచింతు, రితవికి సమాను లధికు లెం • దేవిఁగలరొ?

ఉ॥ ఒత్తుగ మేన వెల్లఁదన • మొందిన వాఁడవు గాన నంటి వి
ట్టుత్తములైన దాతలకు • నొప్పుగ నీయఁగరాని వంచునే
వొత్తమునందు గల్గు నెవి! • బొందిని తీయని ప్రాణమైనఁ దా
నె త్తిడి వేఁడు చెగ్గ మఱి • యిచ్చుట లగ్గు తలంచి చూడుమా!

ఉ॥ చచ్చినవారు లోకమునఁ • జచ్చిన వారలుకారు ప్రాణముల్
నొచ్చి సగంబు చచ్చికయి • నూల్కొనఁ జాఁచుచు వేఁడువారలే
చచ్చినవారు నిక్కముగఁ • జచ్చినవారలు లేచిరారు పై
నిచ్చినవారు గాక యిల • నెవ్వరు సుస్థిరులో వచింపుమా

ఉ॥ పెచ్చు నిరాపనిందలను • పెంచెడువారలు కారు శాత్రవుల్
ఇచ్చెడు వారిఁజేరి తగ • నీయకుఁడీ యను వారెశాత్రవుల్
నిచ్చలునట్టిరే తమకె • నిక్కము చేటొనరింపు కొన్న వా
రిచ్చుట మాపుకంటె మఱి • హెచ్చగు పాపములేదు ధారణిన్

ఉ॥ పెద్దల వాక్యముం దలఁచి • పెచ్చుగ ద్రవ్యము చేత నుండఁగా
నెద్దడి నొచ్చువారలకు • నిచ్చియశంబు గడించి ధర్మముం
దద్దయు నాచరించి భవ • ధన్యతఁగాంచెడు వారిఁ జేరి పే
రొద్దిక లోభమున్ విడకుఁ • డో యను దుష్టులె దొడ్డశాత్రవుల్

తే॥ నయములేని యాచార్య! దా • నమును చెఱచు• కృపణ! యొక్కరొకరికెత్తి • యిచ్చుచుండ
భంగపఱచుట దగునె? నీ • బంధు సమితి, కూడు గుడ్డయులేక య • ల్లాడుఁగాక!

తే॥ అని పలికి మంత్రిదుర్గుణుఁ • డనుచు నెంచి, యాతనిని లెక్కగొనక యూఁ • దడుగులిలను
నీవె కొలుచుకొమ్మని చెప్పి • నీటిధార, బలి త్రివిక్రము చిన్నిచే • తులను విడిచె

చ॥ విమల సరో జలంబు బలి • వీడిన ధార బిరాన చిన్నిహ
స్తములను పద్మమాత్రఁ దలి • దంద్రులె నవ్వఁగఁదగ్గ గుజ్జు త
న్నమరఁగఁ జూచువారలు భ • యంబును విస్మయమున్ భజింప ను
త్తములకుఁ బ్రేమతో నొసఁగు • దాన ఫలంబు విధాన వర్ధిలెన్

ఉ॥ ఊనిన పాదమొందు విపు • లోర్విని నిండుచుఁ బిన్నదిద్దియం
చే నిజ మవ్వలం గడచి • యేగదు, మిన్ను సమస్త మొక్కటన్

బూని యదంచి స్వర్గ పద • ముం-గొని దానిని దాఁటి యవ్వలన్
మానిత రీతి నేగుటలు • మానెను సుంతయుఁ జోటు లేమిచేన్

ఉ॥ రెండు పదమ్ములన్ వెలువ • రించి సమస్త జగమ్ముఁ గొల్చి బ్ర
హ్మాండమునందు మూ డవ ప • దాశ్రయ మెచ్చట లేమి దానికిన్
నిండు ప్రియంబు గల్గ బలి • నెత్తి యె తావలమయ్యె వింపె కో
దండ ధరాగ్రణీః ప్రథిత • దైత్యవిరోధియుఁ బిన్నవాఁడెకా

ఉ॥ నల్లనిసామి యింద్రునకు • నల్వగుఁ గా కని యీ జగత్త్రియిఙా
జల్లఁగ మేటి యేలుబడి • నల్పనొసంగి జగంబుఁగొల్చి రా
జిల్లి శ్రమించు పాదములు • చేత రమాసతి తా కు రక్తమఙా
జెల్ల మహా గభీరిమము • చెందిన పాల్కడలిఙా బరుండెఁదాఙా

చ॥ అరుదగు కర్మపాశి మొద • లంట నశింప గఁజేయు రామ యీ
పరమ పవిత్రమౌ వనము • బాధ రతిం గను వారు జన్మదుః
ఖఁరహితులై చెలంగుదురు • కాంచుమ వేద వచోనుయుక్తి నా
ఙకిరవుగ యాగముం జలుప • నిద్దియె యిమ్మమతొందు లెదిఁకఙా

శా॥ ప్రారంభించెద జన్న మివ్వనమునన్ • రండంచు సిద్ధాశ్రమం
బారం జేరుచు విఘ్నముల్ దొలఁచి త • ద్యజ్ఞంబుఁ గాపాడఁగా
మారాకారుల రామలక్ష్మణులఁ బ్రే • మ న్నిల్పి యజ్ఞీయ సం
భారంబుల్ సమకూర్చి కొంచుఁ దొడఁగెఙా • మౌనీంద్రు డుద్భూతిమై

## యాగరక్షణము

ఆ॥ మన్నుమిన్నుఁగాచు • మన్నిని కొమరులు విన్నువారిఁగూర్చి • యెన్నఁజేయ
నరిదియైన వేల్మి • నాఱు నాళ్ళ రసిరి గన్నుగాచు జేప్ప • కింటేఁ గాచి

తే॥ తిరుగుచున్న నగంబుల • తెఱఁగుఁదెలుపు రాఘవులలోనఁ బెద్ద స • ర్వజ్ఞుఁడైన
గాదిజుం గాంచి యావిఘ్న • కారులైన యసుర లెప్పు డిటకు వత్తు రనుచు నడిగె

తే॥ మౌనియై జటి మాఱ దఁ • బూనఁడయ్యె వీరవరుఁడురాముఁడు మ్రొక్కి • వినతితోడ
వెనుదిరిగి మిన్నుచూడఁగఁ • బిడుగు మ్రోఁత, బిడియపడ వినవచ్చెను • వికటరవము

తే॥ గుప్పిరేసిరి విసరిరి • నిప్పునీరు, గురిసి రద్రులఁబెకలించి • దొరపవైచి
రఱచి రదలించి తిట్టిరి • మొఱకులపుడు పరశువులవైచి మాయచు • పఱపినారు

తే॥ ఏచి కోపించి యేయఁగా • నెఱచి నఱచు, కొనినయస్త్రాయుధములుకార్మొ • గుఱ్ఱగురియు
కరణి వనమెల్ల విర్థియరా • కాసు లంతఁ, గడలి మింటిఁగప్పెనెపఁగఁ • గ్రమ్మినారు

చ॥ మెఱసెడి కత్తులుం గదలు • మిక్కిలి వైచుచుఁ బెక్కువాద్యముల్
మొరయఁగఁ జేయుచున్ బిడుగు • మొత్తములంటిలెఁ గంటగింపుగా
నఱచుచు దైత్యులేచుట యు • గాంతమునన్ మహిముంచ నెంచి మి
న్నొరసి పగిల్చి కొంచుఁ దగు • నుద్ధతివచ్చు మొగుళ్ల నాఁదగెన్.

ఉ॥ కోఱల జంటలొప్ప మిడి • గ్రుడ్లను ద్రిప్పుచు రక్తరోమముల్
మీఱి వెలుంగ నోడు బిగి • మేకొన నిప్పులు గ్రక్కఁజూచుచున్
బాఱుచు వచ్చువారు ముని • వంద్యుఁడు పల్కిన వారె యంచు నా
మోఱకులన్ రఘూత్తముఁడు • మున్గొని తమ్ముని కొందఁ జూపఁగన్.

ఉ॥ కొంచిన లక్ష్మణుండు కడ • కన్నుల నిప్పులు రాల మింట ను
గ్రాంచిత రీతిఁజూచి తన • హస్త శరాసముఁ గాంచి రాఘవా!
ఓంచిన క్రూరరాక్షసుల • మేనుల కండల తుండ్లు గండ్లు గా
న్నింపఁగఁ గొండలై పగుట • నిక్కము చూచెదుగాక యియ్యెడన్.

తే. అనుడు నీటెలఁ బట్టిన • యసురవరులు, త్రెచు రక్తమాంసమ్ములు • పడఁగనీక
కొండముల నేసి పైకప్పు • గప్పివైచెఁ, నిందుగా రాముఁడా హోమ • కుండమునకు.

ఉ॥ హాలహాలంబు పొంగి జగ • మంతట మాపఁగ రేఁగునంతలోఁ
జాల వడంకి నిర్జరులు • చంద్రధరున్ శరణంబు నొందు నా
పోలిక మౌనులెల్ల భయ • మ్ముంగొని సద్గుణధాముఁజేరి యో
నీలశరీర! యెట్టులును • నీవె శరణ్యము వేఱు లేదనన్.

చ॥ మదిని కలంక నొందకుఁడు, మౌని జనోత్తములార? యిప్డెయి
య్యది తొలఁగింతు నంచభయ • హస్త మొసంగి గుణంబు కర్ణమున్
గదియఁగ లాగి రక్తమయ • కంధిగ భూమి నొనర్చి వీరతన్
గుదులుగఁ గూర్చి రాఘవుఁడు • కూల్చె నిశాచర మూర్ధశైలముల్,

తే॥ కమలనేత్రు దివ్యాస్త్రంబు • కఱకు బెడిదు, రాలు తాటకగన్న పు • త్త్రికులలోన
నొకని సంభోధిల్లోవైచె • నొకనిఁబట్టె, నిందుగాగఁ గాలాంతకు • వీటికనిపె.

మ॥ వనమాలా ధరుఁడైన రాముఁడు వడిన్ • బాణావలిన్ దక్కియు
న్న నరాశి ప్రకరంబుపై విడువనా • నారాచముల్ మిన్నుగ
ప్పినఁ గాకుత్థ్సులు పీను కొండలపయిన్ • వేయెక్కి చంపం గలా
రని చెల్లాచెదరయ్యె దైత్యబలముల్ • ప్రాణంబులం గాచుకోన్.

క॥ పిడుగుల వలె బెడిదములై, విడువక రామాస్త్రవితతి • వెన్నంటంగా
మిడియుచు మొండెము లాడెను, గడుకొనె గ్రద్దలు పిశాచ • గణము నుతించెన్.

ఉ॥ ప్రబ్బిన పుష్పవృష్టియట • గ్రద్దల పందిరిఁజీల్చు కొంచు బ
ల్గొబ్బున రాలెనంబునిధి • ఘోషణముంబలెఁ దూర్యరావముల్
మబ్బులు మ్రోఁగెఁ బాకబల • మర్దన ముఖ్యులు గుంపుగూడి పే
రుబ్బున వచ్చి రామునకు • నున్నతి నిచ్చిరి మేటి దీవనల్.

చ॥ పరమ పునీతులైన ముని • వర్యులు గంధ సుమాక్షతంబులన్
శిరములఁ జల్లి దీవనలు • చేసిరి తద్వన వృక్షజాలముల్
విరులను రాల్చె మౌని జన • వీరుఁడు కౌశికుఁ డంత యజ్ఞమున్
గురుతర శాస్త్రపద్ధతిని • గోరిక దీర ముగించి యిట్లనున్.

చ॥ అఖిల జగంబులన్ మొదట • నాదర మొప్ప సృజించి పిమ్మటన్
నిఖిలము కడ్పులోపలనె • నించుచుఁ బెంచెడు నీవు పూని యీ
మఖమును గాచు టెచ్చగునె? • మన్ననతో నిటకేగు దేర నా
సుఖతర భాగధేయ మది • చొక్కము గొప్పది యంచు నెంచితిన్.

చ॥ అనవుడుఁ బుష్పముల్ ఫలము • లందము గూర్పఁగ వృద్ధిఁ బొందు వృ
క్ష నికరముల్ చెలంగి కడుఁ • జల్లనయైన వనంబునన్ మహా
మునులను గూడియున్న గుణ • పూర్ణుఁడు రాముఁడు మౌని కౌశికుం
గని యిఁకఁ జేయఁగాఁ దగిన • కర్జము మాకెది తెల్పుఁడీ యనన్.

ఉ॥ నే నరుదన్న వే యయిన • నీ కరుదైనది యొండు భూమి లే
దైనను గొన్ని యున్న యవి • యావలఁ జూతము నీటియేర్వ మా
గానియె చూడ నెల్లెడలఁ • గ్రమ్మిన యమ్మిథిలా పురావ
జాని యజించువాఁ డతని • జన్నము చూతము రండు లెండనన్.

## 9. అహల్యా పటలము. (71)

సీ॥ మంచి దనఁగ వార • లంచిత గతి మువ్వు, రును మిథిలాపురి • త్రోవఁ జనుచు
సమల రత్నశ్రేణి • యగురు చందనము గం, దంబొప్పు పులిన త • లంబు లనెడి
వక్షోజములును లేఁ • బ్రబ్బరి తీఁగలన్, మధ్యంబు నూత్న సు • మప్రతాన
మనుమేఖలయు గొన • బగునల్ల యినుకయన్, కొమ్మ్మడి శైలంబుఁ • బ్రమ్మవచ్చు

తే॥ కాల్వలను గజ్జెల రొవలు • గలుగు కాళ్ళు, చెలఁగి చెలువంబుచేత న • చ్చెరువుఁగొలుపు
శోణనదియను తెఱవను • చూచివారు, మేరమీఱిన రహి దరిఁ • జేరినారు;

సీ॥ అంత భాస్కరుఁడుద • యాన నిచ్చిన చల్లఁ, దనము జగతి కిచ్చు • తలఁపు గలిగి
జీవులఁ దపియింపఁ • జేసెడి తనమేని, వేఁడిమి తగ్గించు • వాఁడపోలె
నరుణుని నయనం బు • లరుగుట కంటెను, ముందంజ వైచుచుఁ • బోవు హరులఁ
గట్టిన యొంటి చ • క్రపుఁ దేరితో నేగ్గి, పడమటి కడలిలో • పల మునింగెఁ.

తే॥ ఉల్లసగు నీటిపట్టుల • జలజగృహము, దళములను తలుపులు మూయఁ • దలరి గండుఁ
దేంట్లు పెంట్లతోఁగూడి యే • తేర ననువు, వెలయు నొక తావి వనమున • విడిసినారు

## ఇంద్రునకు దుర్వాస శాపము

తే॥ ఈ వనం బేరిదని రాముఁ • డెలమి నడుగఁ, గడఁగి గురు తపోఽనల దగ్ధ • కర్ముఁడనియె
మున్ను దితియను కశ్యపు • ముదిత యిచటఁ, దన కుమారులకై కుంది • తప మొనర్చె

శా॥ ఈ లోకంబుల కావలన్ వెలసి ప • మ్మింపారఁగా నేలు మా
లోలుం డున్నెడఁ జేరి సన్నియతిమై • లోలాక్షి విద్యాధర
స్త్రీలం దోర్తు భజింపఁగా నెలరుచున్ • శ్రీలక్ష్మి ప్రత్యక్షమై
రోలంబ ధ్వని యొప్పు పుష్పసరమా • ప్రోయాలి కిచ్చెన్ రహిన్.

ఉ॥ ఆ సుమమాల వీణియకు • నాదటఁ జుట్టి విరించి లోకముం
డాసినఁ గాంచి కట్టెదుట • దయ్యని కిన్కకుఁ దావలంబు దు
ర్వాసుఁడు లక్ష్మి సన్నిధిని • శ్రావ్యసుగీతము లాలపించు నం
చా సకి కంజలిం జలిపి • హర్షముతో వినుతింప నామెయున్.

ఉ॥ లోకములన్ సృజించి కృప • లోఁ గొని కాచుచు వెల్వరించు నా
శ్రీకరు వక్షమందున వ • సించి సమస్తముఁ గాంచు తల్లి య
స్తోక ముదంబునన్ జడను • చుట్టిన మాలిక నా లతాంగి వే
కై కొనుమంచు నామునికి • గారవ మార నొసంగి నంతటన్.

ఉ॥ వేడుక లోకమాత తన • వేణిని దాల్చిన మాలఁగాంచి నా
వోడిఁమి దొడ్డదంచుఁ గొని • మోదముచే గరుపాటు మేనితో
బోడ జటన్ ధరించి భవ • ముల్ వొనుఁగొంది విముక్తిఁ గాంచు మే
ల్జాడ యిదంచు వేడ్కమెయి • స్వర్గపురంబును డాయఁబోవుచో.

సీ॥ రజతమయంబయి • రాజిల్లు సుందర, నగముపైఁ గురియు కా • ర్మొగులు వెలసి
చెందామరలు వేయి • చెలువుగా వికసింప, నెఱ్ఱని వెలుగుఁల • నెనయు నినుని
కాంతి నొందినరీతిఁ గ్రాలుచుఁ బొలుపారు/తనువుతో నైరావ • తంబు నెక్కి
చెఱకు రుచిని నేని • చేదుగా నొనరించు, లలితవాక్కులుగల • లలనలైన

తే॥ రంభ మేనక మున్నగు • కుంభకుచలు, చిత్తజుని శరావళుల వ • ర్షించు తూణ
ముల నెనయు వదకిసల నూ • పురములులియ, నాడుచును పాడుచును మ్రోల • నరుగుచుండ

సీ॥ బలు నీలగిరి కిరు • వలకుఁల విలసిల్లు, జ్యోత్స్ననా నొప్పారు • సురఁటు లొలయ
జాబిల్లి దిగివచ్చి • జానొందె ననఁజెల్లు, ధవ శాతపత్త్రంబు • తనరుచుండ

పటహకాహళశంఖ • పణవాది రవములు, తఱచయి వంది గీ • తముల ముంప
వేద చతుష్టయ • నాద ముప్పొంగెడి, యంబుధి ఘోషంబు • ననుకరింప

తే॥ జగములను మ్రింగ వచ్చెడు • పగిదిఁదోఁచు, నుత్సవ ప్రాభవముఁగాంచి • యబ్బి యబ్బు
రంబు గొని తానుదెచ్చిన • ప్రసవమాల, కేలఁగొని హరికీయ నుం • కించునంత.

తే॥ దాని దోఁటితోఁ గొనుచుఁ జొ • దంతి మెడను, నగవిభేది వైచుడును పు • న్నాగమంతఁ
దాడిఁ బోలిన కరముతో • దాని లాగి, కాలితోఁ ద్రొక్కి పేఁడయౌ • కరణి నలఁచె.

ఉ॥ మున్నె కటూగ్రకోపి తన • ముందటనే యటు లౌటఁ గాంచి తాఁ
గన్నుల నిప్పుకల్ వెడలఁ • గ్రక్కి నజాండచయంబు బూదియై
చెన్నఱు నంచు విచ్చి వఱ • చెఁ సురసంఘము సూర్య చంద్రులుం
దెన్నులు దప్పఁ గప్పెఁ దమి • దిక్కులఁ దల్లడ మందె లోకముల్.

ఉ॥ ఊరుపులందునుండి పొగ • లొక్కట లేవఁ బురారి యట్ల హా
సారవ లీల నార్చి నగి, • యాననమందు బొమ లుమ్రదు ల్వదఁ
బారలుగాఁగ నాలుకలు • పర్వెడి యుజ్జ్వలితాగ్నిఁగ్రక్కు ను
ద్ఘోర కఠోర నేత్రముల • తోఁ బురుహూతుని గాంచి యిట్లనెన్.

శా॥ ఓరీ క్రూర! సురాధమా! తులువ! నీ • యుద్వైభవం బెంత? లో
కారాధ్యుండును లోకనాయకుఁడు లో • కాధారుఁడౌ విష్ణు వ
క్షోరంగంబుననుండు లక్ష్మి జడలో • సొంపొందు నిమ్మాల నే
నారం బొందితిఁ బూర్వ జన్మ గురు పు • ణ్యప్రాప్తి గర్వాంధుఁడా!

ఉ॥ నీ యురు వైభవంబుఁగని • నీకిది తగ్గది యంచు నేఁడు మో
దాయత బుద్ధినై యొసఁగ • నంత యలక్ష్యము చేసినాఁడవే
మాయురె! నీదు పెన్నిధులు • మంగళ సంపద లెల్ల నంబుధిన్
మాయును గాతఁ గుంది యిడు • మల్గడు నొందుదు గాక దుర్మతీ!

మ॥ అని దుర్వాసుఁడు శాప మిచ్చుడును రం • భాద్యప్సరోవర్గమున్
బెను లిబ్బుల్ వెలి మావు కామగవియున్ • వేగంటి చౌవంతి స్వ
ర్వన భూజాదికముల్ సమస్తమును సం • రంభంబుతోఁ జేరెఁ బో
ఘన విస్తార తరంగ ఘోష యుతమౌ • గంభీర వారాన్నిధిన్.

మ॥ కడు కిన్కం గల మౌనిశాపమున స్వ • ర్గంబాది లోకంబు ల
ట్లుడికెన్ లేవడి చీడ పట్టినటులై • యుగ్రత్వముం జూప న
ప్పుడు నాకౌకసు లద్రిజారమణు నం • భోజాసనుం గూడి పా
ల్కడలిం జేరిరి మాధవుం గని మొఱ • ల్గావింప దైన్యంబుతో.

తే॥ కమలజుండును త్రిదశులు • కరినుఁడైన మునిపలన నైన కష్టముల్ • వినిచి మాకు
నీ చరణములే శరణముల్ • నీరజాక్ష, యనుచు వేఁడఁ ద్రివిక్రముఁ • డనియె నిట్లు

## క్షీర సాగర మథనము

చ॥ కలఁగక మందరంబు తగు • కవ్వము వాసుకి త్రాడు నిండు జా
బిలి తరిగంబమై తనర • వేఱుగ వేఱుగ దేవ దానవా
వలి యిరు ప్రక్కల న్నిలిచి • పాఁకుడలిన్ జిలుకుండి యోషధుల్
దళముగ వైచి వెన్న పడు • దాఁకను పూనిక వీడకుండఁగన్

ఉ॥ మేమును వత్తు మచ్చటికి • మీరు బిరానఁ బదండి యంచు ల
క్ష్మీ మహిళా మనోహరుఁడు • మేకొని పల్కఁగ నింక నెవ్వ వే
యామడ లోడి పాఱెనని • యానిన నమ్మికచే ముదంబు నె
మ్మోములఁ దోఁప వేల్పులు • పోయిరి పాడుచు నాడుచున్ రహిన్

ఉ॥ లీలగ మందరంబుఁ బెక • లించిరి వాసుకిఁ జుట్టినారు చే
జేల పసాదము న్నిలువఁ • జేసిరి కంబముగా మహౌషధుల్
కేలను గెల్లగించి కడ • లిం బడవైచిరి చిల్కి రంబుధిన్
నేల చలించె శేషుఁడును • నెమ్మెయిఁ గుంచె సహించలేమిచే

చ॥ అరయఁగ ధర్మ హీన హృద • యంబులఁ జేరని కేశవుండు మం
దరమును వీఁపుపైఁ దిరుగఁ • దాల్చి బలిష్ఠ ధులీంద్ర రూపుడై
గిరి నిలువంగ మోచి వెయి • కేలుగడల్కొనఁ జేసి మౌని యొం
టరమునఁ బోయినట్టివి క • డంక ఫలింపఁగఁ జేసె నత్తఱిన్

చ॥ మఱిఁగిన సంపదల్ మరల • మమ్ము కృపామతి నేలువానిచే
దొరకెఁ బరస్పరంబు పగ • దోఁచె సురాసురకోటి కంత శ్రీ
వరుఁ డొక మోహినీ రమణి • వాలకి మూని సురారులన్ భ్రమం
పఱపుచు మోసపుచ్చె సుధ • వారకి మెక్కిరి వేల్పు లంతటన్

చ॥ బెడిదపు టాలమున్ శశిని • భీమునకున్ సురభూరుహంబుతో
బెడఁగగు వస్తువుల్ శిఖరి • భేదికిఁ దక్కిన సంపదల్ ప్రియం
బడర సురాళి కిచ్చి కమ • లాలయ లక్ష్మిని కౌస్తుభంబు మై
వడిఁ గయికొంచు మాధవుఁడు • పైనము చేసెను వైనతేయుపై

ఉ॥ అంత దురంత చింత దితి • యందుచు నెమ్మది లేక భర్తనే
కాంతమునందు గాంచి తన • హస్తములన్ ముకుళించి నా సుతుల్

వంతల నొంది కుంది వసి • వాడి నశించిరి దేవవంచనన్
బంతముతోడ వారిఁ జెఱు • పం దగు పుత్త్రుని నాకొసంగవే.

చ॥ అనవుడు కశ్యపుం డను ద • యామతి నీకొక సూనునిచ్చితిన్
బనిగొని భూమి కేగి వెయి • వత్సరముల్ తపమాచరింపు మ
ట్లొనరిచితేని నీదు వర • ముత్కటరీతి ఫలించునన్నఁ ది
త్యనుమతి నామె భూమిని మ • హా తపముం బొనరించె నిష్ఠమై.

చ॥ అది విని వాసవుం డడలి • యామెకు సేవ యొనర్ప నేగి వే
కుదిరి తదీయకార్యమునఁ • గొండొక దోసముఁగాంచి మెల్లఁగా
నుదరము చొచ్చి యాకరువు • హా యన "మారుద" యంచు నేడు తుం
డ్లడయఁ ద్రుంచి తుక్కలకు • నౌల మరుత్తు లనంగఁ జేరిదెన్.

తే॥ ఈ స్థలం బిట్టి దచట మ • హేశ్వరునకుఁ, బార్వతికిఁ గల్గి పావకు • వలన గంగ
వలన భరియింపఁగా రాని • బలియుఁడు గుహుఁ, డడరు రవణ మది యని•నుడువుచుండ

చ॥ యమ తను కాంతులం దెగడు • నచ్చపుఁ జీఁకటులం దొలంచి లో
కములను గాచు వేవెలుఁగు • కాంచనచేలుని నాభియందు మొ
ట్టమొదట బ్రహ్మ యుస్పతిల • డంబుగఁ బుట్టిన తమ్మిపోలె నం
దము గల తేరితో విలస • నంబుగ ( బుట్టెను నీల నీరధిన్.

సీ॥ పొసఁగఁ ద్రిమూర్తులఁ • బోలిన గాధిజ, రామలక్ష్మణు లంత • పయము మీఱఁ
గదలి యెట్టని కనుల్ • గల వృషభేశ్వరు, సెక్కిరింతగ మతి • పెక్కుమగను
పడసిన శంభుక • పర్దంబునుండి నిం, డిన మకరందంబు • చినుకు రేల
పూల నీడ్చుకొనుచుఁ • మోదుఁచు నిరుదరుల్, వృద్ధియొ కతనఁగా • వేరిఁ బోలి

తే॥ విమల జలపూర్ణమైన యా • విన్నువాఁకఁ, గాంచి దీని చరిత్ర సా • కల్యముగను
దెల్పవే యని రాముఁడ • ర్థించినంత, నిట్టులనియె విశ్వామిత్రుఁ • డింపు నింప.

## గంగా వృత్తాంతము.

సీ॥ మీ వంశమునఁ బుట్టి • మేదినిఁ బాలించి, తగ నయోధ్యా మహా • నగరమందు
నెగడు విజయశీలుఁ • డగు సగరునకు వై, దర్భియొ తొలి కళ • త్రంబునందు
జనియించు నసమంజ • సున కంశుమంతుండు, కలిగె రెండవభార్య • ఖగ కులేంద్ర
సోదరి సుమతి యన్ • సుదతికి నుదయించి, పఱువది వేవు ర • ర్భాధిక బలులు

తే॥ తండ్రి కొడుకుల కడిమికిఁ • దనిసి పూని, గొప్ప య శ్వమేధంబు దా • గొప్పఁ జేయఁ
గినిసి సుమనసుల్ దాని జి • ష్ణునకుఁ దెలుప, గపిలు వెనుక యాగాశ్వంబుఁ • గట్టెనతఁడు

లే॥ హయమువెంటఁ బోవుచు నున్న • యంశుమంతుఁ
డెదఁ గలఁగి యింద్రు మోసంబు • నెఱుఁగలేక

వెదకి భువి యెల్ల గాలించి • విసిగి మరలి
తాత కా సంభవము విశ • దముగఁ దెలిపె

తే॥ అతఁడు కొడుకులతోఁ జెప్పి • కుతిలపడఁగ, బాడబము చాడ్పున మండి పడుచువారు
తదయ కిలయెల్లఁ దరవి పా • తాళ జగము కాన బడు దాఁకఁ ద్రవ్విరి • కడఁక విడక.

చ॥ పొడవు వెదల్పు లోఁతు పరి • పూర్తిగ నామడ లొక్క మూఱు పెం
పెదలఁ ద్రవ్వి యీశు దెస • నేగి రసాతలమందు మౌనముం
దొడరి తపించు కర్దమ సు • తుం గని చెంగటఁ దేజి యుండుటన్
మిడుఁగుఱు లుర్లఁ జూచి కడు • మిట్టిరి తిట్టిరి చుట్టి రాతనిన్

చ॥ తఱుఁగని కిన్కతోడ ముని • తల్లజుఁ డుగ్రతరేక్షణంబులన్
జూఱుచుఁ జూడ మున్ను శశి • జూటుని క్రొంజిఱునవ్వుచేత నే
పురములు బూదియైన క్రియ • భూప కుమారులు బూదియై ధరం
దొరలిరి వేగు లంతఁ జని • దెంచి వచించిరి చక్రవర్తికిన్

క॥ విని కుమిలి చింత కంతము, గనక నృపతి యంశుమంతుఁ • గని జన్నంబున్
బొనరుచుటా? నిలుపుటయా?, యన నాతఁడుఁ జనియె యజ్ఞ • హయమును వెదకన్

క॥ చని కపిలు నాశ్రమమునకుఁ, గని జనకులు బూదియైన • గతికిఁ దలరి య
మ్మౌని వేఁడ వారివృత్తము, వినిచి యతఁడు హయముఁ గొనుచు • వే పొమ్మనియెన్

చ॥ అమలిన లేఖ్య కీర్తికర! • యట్టు లకల్మష చిత్తుఁడౌ ముని
ప్రముఖుఁడు దెల్ప మ్రొక్కి సగ • ర ప్రభు పౌత్త్రుఁడు వారువంబుఁ దే
ర ముఖము పూర్తి చేసి యమ • ర ప్రకరంబులకున్ హవి స్సొసం
గి మనుజ శేఖరుండు ధర • ణిం దన పౌత్త్రున కిచ్చి యవ్వలన్

తే॥ సగర సార్వభౌముం డేగె • స్వర్గమునకు, సాగరులు త్రవ్వుటంజేసి • సాగర మను
పేర నీరధి మహిమతో • వెలసె నంశు మంతుఁ డేలుచునుండె న • మ్మహి తలంబు

చ॥ అతని కులంబునందె విమ • లాయకీర్తి భగీరథుండు సం
స్తుతమతి పుట్టి రాజ్యమును • శోభిలు రీతుల నేలుచుండఁగా,
గతము వసిష్ఠమౌని పలు • కన్ విని కొందలమంది మేదినీ
పతి తిలకంబు చాఁగి గురు • వర్యునితో నొకమాట యిట్లనెన్

చ॥ కపిలుని కోప తాపమునఁ • గ్రాఁగిన మత్కుల పూర్వులెల్ల గన్

తే॥ ధరణివర! వార లొక్క స • ద్గతిని పొంద, నీవు కమలాసనుని గూర్చి • నిష్ఠ మెయిని
గొప్పతపము కావింపు చే • కుఱు ఫలంబు చింత వలదని యకలంక • శీలు డనియె

తే॥ ఉర్వియెల్ల సుమంత్రున • కొప్పగించి తలఁపునకు ననువగు హిమ • ధరణిధరముఁ
జేరి పదివేల యేండ్లు భ • గీరథుండు, తపము సేయ విరించి ప్ర • త్యక్ష మగుచు

చ॥ అరుదగు నీతపంబునకు • నందితి సంతస మింక సన్మనీ
శ్వరు కినుకన్ గడించి చెడు • చావును పొందిన నీ పితామహుల్
నరకము దాఁటి సద్గతి గ • నన్ దలఁపొందిన వారి యస్థులన్
ధరఁ బ్రవహించు దేవనదిఁ • దప్పక గల్గుము కోర్కి యయ్యెడున్

చ॥ సుర తటినీ ప్రవాహము వ • సుంధరపైఁ బడ దాని వేగమున్
గిరిశుఁ డొకండె సైఁచు నిఁక • గేకి మెడం గల చాయ నొప్పు భూ
ధరసుత నర్ధదేహమునఁ • దాల్చిన యంధకవైరిఁ గూర్చి నీ
వురు తప మాచరింపు • మని యొప్పుఁగఁ జెప్పి విధాత యేగినన్

తే॥ శివుని పదివేల యేండ్లు సు • స్థిర తపంబు, సల్పి మెప్పింప నతఁడు ప్ర • సన్నుఁ డగుచు
నిష్టముం దీర్తు నని పల్క • నృపుఁడు పిదప, గడపె నైదు వేలేండ్లు గం • గను నుతింప

ఉ॥ గంగ లతాంగి రూపమునఁ • గానఁగ వచ్చి మహీంద్ర! యీ తపం
బుం గయికొంటి వేల? వడిఁ • బొంగెడు గంగ ధరం దిగంబడన్
గ్రుంగక సైఁచువారెవరు? • రుద్రుఁడు పల్కిన దెక్కసక్కెమౌఁ
జెంగక ఘోరమౌ తపము • సేయుము నీవరముల్ ఫలించెడున్

సీ॥ అని పల్క యరుగఁగా • నా నరపాలుండు చింతించి తనపట్టు • చెదరనీక
రేల జిల్లేడు మా • రేడు సుమ్మెత్తయు నిండి పసిండి వ • న్నియ మెఱుంగు
జడ గల్గి నిర్మల జాత • వేదోజ్జ్వల, జ్వాలాకృతుండైన • శంభుఁగూర్చి
ధ్యానించి రెండువే • లైదు వందల యేండ్లు, కడు నుగ్రతపము పెం • పడరఁజేయ

తే॥ మెచ్చి కైలాసవాసుండు • వచ్చి యివ్వ యేది యన వినతుండయి • నృపవరుండు
గంగ పొంగుచుఁ బల్క వా • క్యముల నుడువ నగుచు నగధన్వియిట్లనె • నరవరునకు

సీ॥ ఇనవంశ్య! యొకచుక్క • యేని చిందఁగనీక పట్టికాచెద శంక • వలదు నీకు
నని కటాక్షించి తా • నరుగఁగ రెండు వే, లైదు వందల యేఁడు • లధిక ఘోర
తపము గావించి యం • తటఁ బత్రములును పు • వ్వొడి యోడిగిలు నీరు • కడకు గాలి
దినకరు కిరణముల్ • తిండిగాఁ దుదకది, నీడియు ముప్పది • వేల యేండ్లు

తే॥ కరుణచేత జగంబులు • కరఁగి సురుఁగ, గాఢ తప మొనరించె గం • గయును దిగియె
సత్యలోకంబు స్వర్గంబు • సంచలింప, మొరయుచు ధరిత్రి తల్లడం • బును వహింప

చ॥ హరుఁడును గాంచి మేటి జట • యందునఁ జిందఁగనీక చుట్టె న
వ్వర నది తచ్ఛిరోగ్రమున, వర్తిలె నొక్క తృణాగ్రమందునన్
మెఱసెడు వాఃకణంబు క్రియ • మిక్కిలి దిగ్భ్రమ నొంద శేఁడు, శం
కరుఁ డడలంగ నేల యని • రాఁగ జారెదె దప్పు భాగమున్

సీ॥ గంగ యయ్యంగంబు • రంగార భూఁజంగ, మునకు దిగుడు రాజు • ముందు నడచె
సమసిన సాగరుల్ • సద్గతి పడయుదు, రను సంతసంబున • నతి రయమున
నట ధ్యాన మగ్నుఁడై • యమరు జహ్నుని యాగ, శాల నవ్వంక ముం • చంగఁ గాంచి
నాల్కలు చాఁచుచు • నూల్కొనుకోపాగ్ని, చెంది యాతం డఱ • చేత వారి

తే॥ త్రావిపై చె గంగను శిష్య • తతులు చెలఁగ, రాజు ప్రణతుఁడై యాతనిఁ • బ్రస్తుతించి
జరుగువృత్తంబు వివరింపఁ • గరుణతోడఁ, గొనుచుఁ బొమ్మని చెవినుండి • మునియువదలె.

చ॥ సురనది దూఁకుచుం గదలి • చూఁడిన సాగర భూతిరాశిపైఁ
బరవఁగ దుర్గతుల్ దొలఁగె • వారికి, దివ్యులు భద్రరావముల్
మొరయఁగ సన్నుతించి లలిఁ • బువ్వుల సోనలు రాల్చి రమ్మహీ
వరుఁడు కృతార్థుఁడై మరలెఁ • బ్రబ్బిన మోదముతో నయోధ్యకున్.

చ॥ అలమిన యండగోళముల • కావలిదై కమలాక్షు లోకముల్
గొలిచిన కాలఁ బద్మజుఁడు • గొన్న శుభంకర పాదతీర్థమై
తెలిసి భగీరథుండు గొని • తేర హరుండు శిరంబునం గొనన్
బొలసి యిలాతలంబుఁ బరి • పూత మొనర్చెను గంగ యివ్విధిన్.

తే॥ కడఁగి సాగరులకు మేలి • గతులు గూర్పఁ, దపముసేసి భగీరథ • నృపుఁడు దేర
గంగ భాగీరథి యను నా • ఖ్యం దనర్చె, జహ్ను చెవినుండి రాఁ జనె • జాహ్నవియన

చ॥ అని ముని పల్క నచ్చెరువు • నందుచు వందన మాచరించి గం
గను తరియించి యవ్వల • ని గటుననేగ విశాల పట్టనం
బుని వసియించు ధర్మ పరి • పూత చరిత్రుఁడు పార్థివుండు క
న్గొని శుభవార్త లాడి తమ • కుం గురుపూజ లొనర్చి పంపఁగన్.

## విదేహదేశ వర్ణనము.

సీ॥ నిద్దుర విడిచి • నీరజంబులు గ్రాలు, పొలముల నారింజ • పులుఁగు లబ్బరి
కలుపులు దీసెడి • కలుకుల లికుకుల, బెళుకుల కనుల నీ • డలను గాంచి
బెడిసిన మీలంచు • వేగ వచ్చి పొడిచి, భ్రమ పాటునకు బిడె • పడుచు నుండు
నుదు విశాల క్షేత్ర • పరివేష్టితంబయి, యింబౌ విదేహదే • శంబు చేరి

తే॥ కలువుగా నూర్చు కలువలు • కంజములును, కన్నులం బోలె(గానరా( • గలుషులదరి
చూపులం ద్రిప్పికొన( బ్రియుల్ • సూచి విసుగు, చుండు పొలములు విలసిల్లు • చుంట(గాంచి

సీ॥ అందలి తో(టలం • దనకట్ట తూముల ధ్వనులు మృదంగ ని • స్వనము గా(గ
నరవిరి కంకేళి • విరు లంద మొప్పారు, బ్రవిమల లసిత దీ • పములు గా(గ
నరములం బోలి సో • నలు కాలు తేనియ, పర(గు పుష్పములె వి • పంచిగా(గ
విరి దమ్ములం • జెవి విందులుగా మధు, పము లొనర్చురొదలె • పాటగా(గ

తే॥ సతత ఝిల్లీ రవంబులు • శ్రుతులు గా(గ సకల పక్షులు గను సభా • సదులు గా(గ
నెగడ( బురి విప్పి నెమళులు • నృత్యలీల, సలుపుచుండుట(గాంచి య • వ్వలికి( జనుచు

సీ॥ కొల(కుల యందు మి • క్కిలి మన మలరించు నంచయానల నడ • యందము గని
ఠిమ చుట్ట లనుచు హం • సములు వెంబడి రా(గ( గలకంఠకంఠులు • జలములందు
పొంకంబుగా నాడ( • గుంకుమ పంకంబు రహి యొడళ్లంట( బ • రప్పటంబు
కలహించు ఖగముల( • గాంచి నదులయందు, నెనుముల పొమ(గుల • నెనయు రసము

తే॥ తరువులన్ మావిఫలములు • గురియు రసము చెఱకు గాను(గులందుండి • తొర(గురసము
తేనె పెరల( గాఱెడి తావి • సోన రసము, తక్క( దెలినీరు లేకుంట • చొక్కికనుచు

సీ॥ కొండకొమ్ముల( బోలు • గురు కుచమ్ముల ప్రే(గు మోవ • జాలక నూలి • పో(గుకంటె
సన్ననౌ నడుములు • చలియింప వక్షంబు, వంటి చూపు లొలయ(బడ( తులాడు
నాట్యశాలల మృదం • గ ధ్వని కులికిలే బిత్తలు మడుగుల( • బాఱి కల(ప
వాలుగల్ దరి(బో(క • పాళల కులుకుట, కఱకు చూపు కటారు • లొఱల నడ(గ

తే॥ మునిఁగి క్షీరాబ్ధిఁ దోఁచు ల • క్ష్మిని దలంపఁ జేసి నీటి పిట్టలతోడఁ • జేతి బిగువు
తెల్లగాజులు మొరయ మ • దించి నీట, నాడు తలిరుఁబోఁడుల జల • క్రీడఁ గాంచి

## అహల్యా శాపముక్తి

సీ॥ హర్ష మొందుచు విదే • హారామములఁ జూచి వెలి ప్రాకార సం • వేష్టితమగు
మిధిలా నగరికొక్క • మేటి యలంకార మైపొదవైన ధ్వ • జాళి వెలయు
బయట ప్రహరికి వె • ల్పల వచ్చి నిల్వ గా ర్హస్థ్యోచితము పతి • వ్రత గుణంబు
పదరి పాదొనరించి • భర్తృ శాపంబున రాయియై పడియున్న • రామ యపుడు

తే॥ రాము పదధూళి సోఁకఁ బూ • ర్వంబు మనసు, నలము నజ్ఞాన మత్తత • దొలఁగ నెఱుక
తేఱ రూపాంతరం బొంది • దేవు నెదుటఁ బొలుచు జని పోల్కిఁ దొలిరూపు • దొలఁక నిలిచె

ఉ॥ క్రిందికి గంగఁ దెచ్చిన భ • గీరథు వంశమునం జనించు నో
సుందర ! తృప్తిమై మెఱుపు • చొప్పునఁ గ్రేవ నొదింగి నిల్చు పీ

చెఱదొవకంటి యిష్టపడి • చెడ్డ యొనర్చిన పాకవైరికిన్
గ్రందుగ వేయి కన్ను లిడు • గౌతమ పత్ని యహల్య నాఁ జనున్

ఉ॥ వెంబడి యుల్లసిల్లు ముని • కేసరి యట్టులు పల్కఁ విన్న శ్రీ
రంజనివాసినీపతి విక • స్వర పద్మ దళాక్షుఁ డిట్లనున్
నెంజిలి యిట్టులౌట తన • నెక్కొను పూర్వ కృతాపరాధమా?
యంజక యుప్పు దొప్పిన స్వ • యంకృతమా? యెఱుఁగంగఁ బల్కవే,

చ॥ అన విని భూరి విజ్ఞుఁడగు • నమ్ముని యిట్లను సద్గుణాలయా!
విను మును వజ్రి యూర్ధ్వగత • వీర్యుఁడు గౌతముఁ డింట లేని వే
ళను హరిణాక్షి చంద్రముఖి • లాలిత లక్షణ లక్షితాంగి యా
వనిత యహల్యతోఁ గలయ • వాంచ వహించె మనంబులోపలన్

చ॥ తొలఁగ కహల్యఁ జూపులను • తూపులు మార నిశాత సాయకం
బులు మది గాఁడ విజ్ఞతయుఁ • బోవ మదిం గల యారటంబుచే
నలయుచునున్న యింద్రుఁ డొక • యప్పుడు సాహసవృత్తి నాగృహ
స్థులకు వియోగముంగొలిపి • చొచ్చెను గౌతమవేషియై యటన్

చ॥ ఇరువురు చేరి కామ మను • నింపగు నాసవ మానుచుండు నా
తఱి నితఁ డింద్రుఁ డంచెఱిఁగి • ధర్మ మధర్మము మానసంబునం
దరయక సమ్మతించి చెలి • యంగజ సౌఖ్యములందు దేలె న
త్తరుణమునన్ మునీశ్వరుఁడు • తత్తఱ వచ్చె గృహంబు చేరఁగన్

చ॥ విలు పని లేక మోఘముగఁ • బెంపలఁ దిట్ట వరంబులిచ్చి వె
ల్పుల నెకిమీనిఁ జేయఁగల • ప్రోడఁడు గౌతమ మౌని డాయ రాఁ
దలఁగక లోకి మెల్లెడ స • దా చెడకుండెడు నించఁ గొన్న య
వ్వేలఁది వడంకి నిల్చె బల • భేది చనం దొడఁగెన్ బిడాలమై

చ॥ అనుపమ నీలశాలి యగు • నమ్ముని కన్నుల నిప్పు లుర్లఁగాఁ
గని కత యంతయుం దెలిసి • కార్ముకవీర! భవ త్కరచ్యుతో
గ్ర నిశిత కాండముం జెనయు • ఖండిత వాక్కులలో శపించె వ
జ్రిని పది నూర్ల యోనుల శ • రీరము నొందుమ యంచు నత్తఱిన్

తే॥ క్షణములో శాప ఫల మొంది • జంభభేది యెల్లిదంబగు లజ్జతో • నేగు పిదపఁ
జెలువఁ గని వెలవెలఁది చే • ష్టలను బొంది నట్టి నీవును శిలవగు • మని శపించె

సీ॥ మౌని కాళ్లం బడి • మడఁతి యో మునినాథ! మన్నింపు మీ తప్పు • నన్నుఁ గావు
పిన్నల తప్పులఁ • బెద్దలు సైఁచుట, తగునని నీతివే • త్తలు వచింతు

రని వేఁద జ్వాలల కానార్చు రుద్రుని పోలెఁ, గ్రుద్ధుఁడై తను మునీ • ద్రుండు నరెత
సతియెడ దయతోఁ బ్ర • సన్నుఁడై వనమాలి, రాముని శ్రీపాద • రజము సోఁక

తే॥ నీయథారూపమొందుదో! • నెలఁతయనియె, నింద్రుఁగొని నిలింపులుముని • యెడకువచ్చి
వేఁడ నతని యోనుల మూర్చి • వేయి కనుఁ, నిచ్చి పంపె నహల్య రా • యిగను పడియె

సీ॥ ఇది గత వృత్తాంత • మిఁక లోకమున నెల్ల, ప్రాణులు సుఖముగా • బ్రతుకుఁ గాక
దుఃఖ కారణమును • దొరయునే? జగములు, నీవు చే దిల్లాని • నిలిచి యుంద
కర మహిమంబును • గంటి నచ్చట నంజ • నాద్రిఁబోల్ తాటక • నడఁచి నపుడు
శిల యౌచు దిక్కులే • కిలఁ బడిన యహల్యమనుప నిచ్చట నంఘ్రి • మహిమఁగంటి

తే॥ అనుచు నిర్మల గుణుఁడు ప • ల్కినది వినుచుఁ, దల్లి! పతి క్షరుణింప నా • తని భజింపు
గళముఁదలఁచిచింతింపక • బ్రతుకుమనుచు, నామెకైఁగెర్థాముఁడు వార • లవలఁదరలి.

సీ॥ ఘన తపోధనుఁడగు • గౌతము నాశ్రమ, స్థలిఁ జేరఁ దత్సాధ్వి • జ్ఞాని యంత
నతిధులఁ గని విక • సిత-మనస్కుండయి, యెదురేగి తెచ్చి స • మ్మర్ధముతోడఁ
గావింపఁ దగిన స • త్కారమ్ము లొసరింప గాధేయుఁ డాతని • గాంచి పలికె
నంజనాచల లీల • రంజిల్లు మైగల, శ్రీరాము పద రజ • శ్రీ వహించి

తే॥ మాలతీ లతఁ బోలిన • మధ్య మొప్ప, నా యహల్య పూర్వాకృతి • నందె నీవు
నెద దొసఁగు మాయసతిని గ్ర • హింపు మనఁగ, బమ్మఁ బోలిన యమ్మని • సమ్మతించె.

చ॥ తమి గొను సద్గుణాళియు ను • దారతయుం గల రాముఁ డంత గౌ
తముని పదాబ్జముల్ శిరము • దాఁకఁగ మ్రొక్కి ప్రదక్షిణించి యు
త్తమసతి నా యహల్య ముని • తల్లజు కైవసమ్ముం బొనర్చి మో
దమున యతీంద్రుతోడఁ దన • తమ్మునితో నటనుండి పోవఁగన్

## 10 మిథిలాదర్శన పటలము 144

ఉ॥ లక్షణ లక్ష్మ యైన కమ • లాసతి కంజము వీడి నా తపం
బక్షయమై ఫలింప నిట • కర్మిలి వచ్చి జనించెఁ గాంచు మో
రాక్షస వైరి! చేకొనఁగ • రమ్మని య మ్మిథిలా పురంధ్రి సం
శిక్షిత రీతిఁ జాఁచు తన చేతులనం బలియించెఁ దెక్కెముల్

చ॥ ఇతరు లనర్హు లంచుఁ దగ • వే తగుదౌత్యము సేయ లోక సం
స్తుత సుగుణాకరన్ భువన • సుందరి జానకిఁ బెండ్లియాడ నం
చిత తనుఁడైన రాము డిటు • చెచ్చెర వచ్చెడి నంచు నచ్చరల్
జతవడుచున్ నటించుక్రియ • సౌధములందు ధ్వజంబు లాడెడిన్

చ॥ హరి కిరణంబులున్ మఱుఁగు • లై గగనంబును క్షీరవార్ధి యన్
పరుసున గానరా నుపరి • భాగములందు పటంబు లొత్తుగాఁ

ఎగొలుచుఁ దెల్లనై మొగులు • గుంపులఁ దాఁకుచు నాని తేపయై
హరువగు ధూప సంతతుల • నాటుట వారలు గాంచి రయ్యెడన్

చ॥ అమృతముఁ గుంచె నద్దుకొని • యంగజుఁ డంగములన్ లిఖించు నే
ర్పమరగ చూచి చూచి భ్రమ • నందుట దక్కఁగ నెగ్గలేని సౌ
ధమరిన జానకిం బడసి • నందున లక్ష్మి వసించు తమ్మి చం
దమున వెలుంగు నమ్మిథిల • దాసిరి లోనికిఁ జొచ్చి రంతటన్,

చ॥ నుదువుల తీరెఱింగిన ఘ • నుండగు కుంభజుచేతఁ ద్రావఁగాఁ
బడిన మహాబ్ధి చందమున • భంబులు పర్వ నభంబు చాడ్పునన్
బెరఁగు శశాంకపాలలును • వీరులు వేసటఁ బాఱపైవఁగాఁ
గెడసిన భూషణాళి గల • గీములు వీదులఁ బోయి రంతటన్

చ॥ నడచిరి యంకుశంబునఁ క • ణంగని కొండలఁ బోలు నేనుఁగుల్
విరుచు మదాంబుధార లొక • వెల్లువయై తురగాల నుర్వుచే
వడి నొక మార్పు చెంది రథ • వర్గము లెప్పుడు సంచరింపఁగా
నడుసయి దుక్కియై బహూ ద • శాంతరము ల్గొను రాజ వీధులన్

చ॥ నడచిరి రెండు ప్రక్కల ఘ • నంబగు ప్రేమ మొకింత త్రెంపు లే
కడరి యనంగసంగరము • నందు పెనంగి యలంగు బోట్లకై
వడినె వియోగ బాధ గల • పల్లవపాణులు కిన్కఁ ద్రెంచు పూ
వడములఁ దేనె యోడిగిల • పంకము నొందిన రాచవీదులన్

సీ॥ కర పల్లవాంగుళు • లొరయ జనించిన వీణారవము చెవి • విందు సేయ
శ్రావ్యంబుగాఁ బాడు • సరసిజాక్షుల గీతి, కా భావములు మదిఁ • గరఁచు చుండ
గంభీరమగు మృదం • గ ధ్వనుల్ పొందికఁ, జెలఁగి మిక్కిలిగ ఘో • షించుచుండ
హస్తాభినయమును • కనువుగా నయనాభి నయము నయంబుగ • నడచుచుండ

తే॥ నయన నటన కుదిగను మ • నంబు పోవ, భావ గతులను వెన్వెంటఁ • బరుగులాడ
నున్నవో లెవో యను కౌను • లూఁగి యాడ లలన లాడెడు నాట్యశా • లలను గనిరి

సీ॥ పగడాలఁ బోలిన • జగడాలు గెలుచు మరకత ఛ్ఛాయలు • వటులు బోదె
లలరిన పోఁక ప్రాఁ • కులలోనఁ బొడవుగా వ్రేలాడుచుండు ను • య్యాలలందు
పాపజన్మముఁ బోలి • వచ్చుట పోవుట యెదతెగ కుండ గా • నడరు చుండఁ
బడతుల సన్నని • నడుములకో యన, భ్రమరముల్ ముసరుచుఁ • బరిలిపింప

తే॥ యువకుల మనస్సు లల్లెయు • ఱ్ఱూఁత లూఁగ నాకవనితలఁ గాల్దివ్వు • నయముదోఁప
మింటికింగాల్ల వాఁచుచు • మీఱి యెగసి, యూఁగు వారల బాగోగు • లోలిఁ గనిరి.

ఉ॥ మేరకు మీఱు రత్నములు • మేలి కడానియు నాణి ముత్తెముల్
వారణ దంతముల్ చమర • వాలము పీలియుఁ దావి కట్టెలున్
వారి కృషీవలుల్ గనిమ • వారక పోయు దరుల్ గలట్టి కా
వేరిని-బోలు నంగళులు • పెక్కులు గాంచిరి వారు ముందరిన్

ఉ॥ కామకరంబు కివ్వము ర • కంబునఁ గాఁడ నసూత్కరంబుఁ బోల్
ప్రేమ గట్టి కాముకుల • రీతిని భూమిధర ద్వయం బనఁ
సామజముల్ పరస్పరము • సంధిలి తొండము లెత్తి కిన్కతో
దీమస మొప్పఁ బోరుటలు • తేఁకువఁ గాంచిరి వార లంతటఁ

సీ॥ పదుచులు వాడి గో • ళ్ళదరు చిగురుఁ గేలు నొవులఁగ వీణియ • చెవుఁ బట్టి
యొడిసిన కల్లనా • నొప్పు కమ్మలు వాఁగఁ దంత్రుల శ్రుతి • చక్కఁ గూర్చి
హస్తాంగుళుల త్రావ • నజులు వావంగ నజుల దరి హృద • యములు చనఁగ
వెలిదంతముల కాంతి • వెలువడ శ్రవణాపే యంబుగఁ దేటభా • వంబుతోడఁ

తే॥ జిలికి గానామృతంబు వ • రించుచుండ వశము దప్పి యెదలు పర • వశత నొంద
గర్ణ పుటముల సంతృప్తిఁ • గనక త్రావి నడచి రమ్మువ్వురును రాచ • నగరి వీధి

సీ॥ కుమ్మరిచే వడి • నిమ్ముగాఁ దిరుగు చ క్రము వోలె గుండ్రన • గాఁగఁ దిరిగి
పెద్దలతోఁ జెయు • పేరిమి చెలిమి నా నడుమంతరంబునఁ • గడఁక విడక
జ్ఞానుల తలఁపుల • చందమ్ముగా గురు మతి నిశ్చలత్వ మే • మఱక గలిగి
బ్రహ్మంబుభాతి జ • ర్మంపుఁ జజువులకు నిటిటిదని సుంత • యెఱుఁగ రాక

తే॥ పైడి కల్లెముల్ మొగముల • పట్టు జీను పిగిలి కుచ్చులుమున్నగు • సొగసులొప్ప
నురుగు లొడ్చప్ప నెత్తెఁ • జరుగువాలు మెటివాడువములు గాంచి • మెచ్చిచనుచు

ఉ॥ తాచిన యా తెలున్ వలపు • రాయని విండ్లు శిలీముఖ ధ్వనుల్
మోచిన నీల కుంతలము • లుఁ నులి కౌనులు దాల్చి యెప్పుడుఁ
నైచిన చందు నీఁగి మడే • సౌధ గవాక్షముల్లందు సొంపుగాఁ
దోఁచిన చంద్ర బింబముల • చూకొని కాంచిరి వార లత్తఱిన్

కవిరాజ॥ దిరిపు గిన్నెలఁ బోసిన క్రొత్త సు • వాసఁ బీవెదు తేట కలన్
దిరుసుగఁ ద్రావి ఎయ్యపు నెవ్వరిఁ • దీరు లవంబులు లక్కలకొ
స్ఫుటముయి బాఁగని నెవ్యపు టక్కను • పొల్పుగఁ దెప్పెడి చూడ్కి వగల్
పటుపగు కైపు వెలార్చు జెడంగగు • పద్మనికాయముఁ గాంచి రొగిన్

మానిని॥ కాయ్య సుఖంబు సమంబుగఁ జెందియుఁ • గాముక పాళి విమోహితులన్
జేయుపఁ బైై వెలయుం గొను వేశ్యల • చిత్త మనన్ స్ఫటికం బనఁగా

నా యెలనాఁగల కౌటుక చూపుల • నచ్చము నల్లనివై కయిఁ గెం
జాయఁ దనర్చుచు రంగుల మార్పుల • జానగు బంతులఁ గాంచి రొగిన్.

కవిరాజ॥ కడియము లుంగరముల్ మణి చేరులు • కమ్మలు వీణలు వస్త్రములున్
బడలుగఁ బందెము లుంచి సువాసిత • పాళము లూఁగఁగఁ గుక్క మొగం
బడరెడు స్ఫాటిక శారులు రక్తిమ • నందఁ గరంబులఁ బట్టుచు ను
క్కడమగు నీఁటెలఁ బోలిన కన్నుక • కన్నెక లాడుటఁ గాంచి రొగిన్.

చ॥ నలినము లుత్పలంబులును • నాఁచును తీవియ లాకు లెట్టినౌ
ఫలములు సైకతంబులును • వాలుగ బేడిస మీలుఁ గోకముల్
వెలవెల వోవఁగా దమకు • వేఱుపమల్ తగలేని యంగముల్
గల చెలు లీఁదు డిగ్గియలఁ • గాంచిరి పెక్కులు వార లత్తఱిన్

చ॥ అతి చపల స్వభావమయి • యచ్చటి కిచ్చటి కీడ్చు నింద్రియ
ప్రతతికి లోఁగి పర్వులిడు • భావము భాతిఁ జలించి వింతలౌ
గతులఁ జరించి మై నలఁదు • గందపుఁ బూఁత రవంతయేని సం
చ్యుతి గననీక కత్తులను • వొందఁగఁ ద్రిప్పెడి వారిఁ గాంచుచున్.

చ॥ ఇన సమ తేజులన్ గౌతుక • కిచ్చెడి వారల భర్గు కంటి ని
ప్పునఁ బడి లక్కయై కరఁగి • పోవని మారుల విల్లు దాల్చు నౌ
ట్టని కరముల్ గలారి నుడు • రాజ నిభాస్యల యల్కఁ దీర్చు ప
ట్టునఁ గడు నెట్టినౌ తల ము • డుల్ గల వారలఁ గాంచి రంతటన్

ఉ॥ చక్కెర పాగుఁ బోలిన వ • చస్సులు చిల్కలతోడఁ బల్కుచున్
మిక్కిలి సిగ్గు నొంది దివి • మెల్తలు వెల్వెలఁ బాఱ సూనముల్
చక్కటిఁ గోయు కేకి మయి • చాయలతాంగుల కంచ లోడి లో
స్రుక్కఁగఁ జూచి తేఁటి గమి • క్రోల్చు వనంబులఁ గాంచి రొక్కెడన్

చ॥ అమరులకున్ వసింపఁ దగు • హారి హిరణ్మయ సౌధపాళి య
చ్చమరిన నీడలో దివము • నందము నచ్చటఁ జూపి గంగ చం
దమున గభీరమై యరి వి • దారుని యంతిపురంబు చుట్టు క
ద్యముఁ బరి గొన్న కందకము • నంతటఁ గాంచిరి వారు డాయుచున్

ఉ॥ పూవుల తావి మేల్ సవురు • పొన్ను మెఱుంగును తేనె తీపు సం
భావిత సత్కవిత్వ పరి • పక్వ రసం బుపమిల్లు రాజ క
న్యావలి యున్న యోవరుల • హంసలు గుంపులుగా నటింప సొం
పై విలసిల్లు ముంగిళుల • నంతటఁ గాంచిరి వారు డాయుచున్

## సీతారాముల పరస్పర వీక్షణము

చ॥ పొగడఁ దొడంగుచో బలుకు • బోటి మగండగు బ్రహ్మయాదిగా
మిగిలిన సత్కవీంద్రు లుప • మించి వచించెదు లక్ష్మియే స్వయం
బుగ విజయంబు చేయఁ దన • బోణిమిఁ బల్కఁగ నామె దక్క వే
ఱుగ నుపమాన మారసి యె • ఱుంగఁ దరంబె? నుతింప సాధ్యమే?

మ॥ గిరిజాద్యుత్తమ సాధ్వులున్ దలలు కే • ల్గీలించి మ్రొక్కంగఁ ద
గ్గ రహిన్ సద్గుణరాశియౌ జనక రా • ట్కన్యా విలాసంబు ని
ర్జర వర్యుల్దిలకించి సౌరు పొలిమే • రం గాంచఁగాంక్షించియే
తెఱగంట్లైతిమి రెండు కన్నులును బ్రాఁ • తిం గానలేవంద్రు సూ

సీ॥ హరిణంబుఁ గూల్చి పే • రందిన కుంతంబు, కౌశీ యలవాట్లైన • యలుఁగు వాలు
వెనుదీయ వాలుగల్ • వెఱగొందఁ జలియించు, కను లొందు జానకి • కవ్వపు మల
తిరుగఁ గో యని యార్చు • వర దుగ్ధ వార్ధిలోఁ, గాక యా శుద్ధాంత • కాంత లచటఁ
గాంచిన యమృతంబు • కరణి నొప్పినయది, యిక్కన్యఁ బోలు వే • ఱొక్క కన్య

తే॥ నొనరుపు మటంచు సురలు వేఁ • డినను బ్రహ్మ, వలన నిఁకన్నైన సృష్టింప వలనుపడునొ?
అమృతభుక్కులు బతిమాల • నబ్ధియేని, యిచ్చు సుధ దక్క వేఱెద్ది • యీయఁజాలు?

తే॥ వలచి వేల్పులు తడవు న • ప్సరస లెల్ల, సీత మేనియందముఁగాంచి • సిగ్గుపడుచుఁ
గంది కుందిరి వారి మొ • గంబు లనెడి, యబ్జ మండలములకు నె • ల్లపుడు పగలె

తే॥ ఇమ్మగువ పంకజమునుండి • యిలకు రాఁగ, ఘోర తపమాచరించిన • వారు సురలొ?
జగమొ? విప్రులో? స్వర్గమో? • తగవొ? యెదియొ?, దీని నిజము నిజంబుగ • దెలియలేము

చ॥ అరయఁగ వేఱు వేఱు పను • లందని సుందరు లండ నిల్చి యో
వర మృగనేత్ర! తల్లి! మధు • వా! యరుదౌ నమృతంబ! యంచు సం
బరమున దూరపుం బువులఁ • బజ్జను హర్వ్వగఁ జల్లి నిల్వన
వ్విరులపయిన్ గమించు నలి • వేణి సుఖంబుగ మెల్ల మెల్లనన్

చ॥ మృదులపదంబులన్ బసిఁడి • మించులు గజ్జెలు దాల్చి కౌనునన్
వదులుగ మేఖలన్ మెడను • నాఁడెపుఁజేరులు పూల మాలలున్
ముదితలు కూర్చి కాంచ మెఱు • ముల్ శతకోటులు సేవ సేయ నొ
ప్పిదముగ మించు రాణి ప్రభ • వించె ననం దగి సీత యొప్పెడున్

ఉ॥ చంపెడి కుంతమున్ శమనుఁ • జక్కఁగఁ గెల్చును గెల్చునంచు బీ
రంపు నుడుల్ వచింపఁ దగు • రాణ వెలింగెడి కన్నులొందె వ
ర్ణింపఁగ వీలు కాని వవి • నిల్వనఁ గాంచిన పర్వతంబులున్
బెంపగు గుండ్లు గోడలును • పిల్లఁ గరంగి ద్రవంబుగా నగున్

దమకుచుఁ గాల్వవంటి కను • దమ్ముల త్రోవను లోనికేగి ప
ర్వైను మరుబాధ దుర్గమున • వీడిన చేమిరి పర్వు కై వడిన్

ఉ॥ నొచ్చును రానురాను గడు • నూల్కొని వర్ధిలు కామవేదనం
బచ్చుగఁ జెప్పలేక యెద • యందెయడంచి కలంగ, మారుఁడున్
హెచ్చుగ మండు కుండమున • నింధనముల్ మఱి వైచు పోలికన్
గ్రుచ్చెను వాఁడి పూవులు • కుల్ ధరజాత మనంబు గాఁడఁగన్.

తే॥ నేయి పూయక నిప్పున • నేయకుండు, వాఁడి యీఁటెను బోలి శ్ర • వములఁ దాఁకు
కనులు గల సీత కురులతో • మనసు జాఱ, వహ్నిఁ బడిన పూలతవోలె • వాడిపోయె

తే॥ ఉలియు మేఖలను ధృతిని • వలయములను, వాడు మనసును తెలివిని • వపువు వన్నెఁ
దొరఁగి జానకి, వేల్పులు • తరవఁగలిమి, విడిచినట్టి కడలిఁ బోలి • పేద యయ్యె

చ॥ నగలనువీడ నాణెమగు • నానయుగూడ నొయార మందముం
దొగడుగఁ బూఁడ మారు విరి • తూపు స్తనాంతర ముందుగాఁడఁ దీ
పగు నసువుల్ తపించి యురి • యాడ మొగంబును వాడఁ గాంచి వే
మగువలు జానకిం గొని శ్ర • మంపడి లోనికి నేగి రంతటన్

ఉ॥ కమ్మలఁ బట్టి మ్రింగు గమ • కంబున వచ్చిన మీలఁ బోలు నే
త్రమ్ములు గల్గు జానకి ప • దమ్ములఁ గేలను పో ల్చివుళ్ళ మొ
త్తమ్ముల నొత్తుగాఁ బఱపి • దండిగ గొజ్జఁగి నీరు చల్లి శై
త్య మ్మెకదొట్టు పానుపున • నల్లనఁజేరిచి రంత మైథిలిన్

చ॥ గిరిపెనఁ బోలి మంచునకుఁ • గీడ్పడు తూండ్లు గలట్టి క్రొత్త తా
మర కొలఁకున్, గటారి కెన • మాఱని రాహువు మ్రింగినట్టి చం
దురు సరి పోల్పఁగాఁ దగిన • తోయలి మైథిలి తావి విచ్చు క్రొ
వ్విరి తలిమంబునం దొడలు • వేసటఁ జేర్చెను వెచ్చ నూర్పుచున్

చ॥ చినుకులు పర్వతాగ్రమునఁ • జిందిన సంచునఁ జూచుకద్వయిన్
గనుఁగవనుండి ముత్తెముల • కై వడి బొట్లుగ నశ్రు బిందువుల్
చినికెను; వింటి కోపు లలిఁ • జెన్నగు నెన్నుదుటన్ జెమర్చి క్రాఁ
గు నెసటినుండి లేచు పొగ • కోపగు నూర్పుల మాసెఁ బిమ్మటన్

చ॥ నిలుకడయై బలిష్ఠమగు • నెమ్మది గల్గియు వేఁటకాని తూ
పుల నిలఁ గూలు నమ్మిలిని పోలిన యాయమ క్రాఁగుచున్న లో
పలి మదనాగ్నిమండి పొగ • వాఱఁగ మిక్కిలి వాడి వత్తలై
మలఁగెడు పూ లతంబలె శ్ర • మంబునఁగ్రుంగి యొఱుంగెఁ బాన్పుపైఁ

పాంకరముల్ మహోష్మమని • యవ్వలఁ ద్రోయుచు రత్న దీపముల్
పొంకముగా నిసిం బవలు • పోలికగా నొనరించి రా నఖుల్.

## చంద్రోదయము.

చ॥ వలమగు మందరంబు ఫణి • పాశమునన్ బిగియించి సంద్రమున్
జిలుకఁగ లేచు రత్నములు • చిన్కులా రిక్కలకంటె మిక్కిలిన్
వెలుఁగ సురాసురుల్ తరచు • వేళ సుధామయ హేమ పాత్ర వే
వెలలిన లీలఁ దోఁచెఁ గడు • వెల్లని జాబిలి నల్లయంబుధిన్

చ॥ అజుఁ దొక తేఁటియై చదువు • లంగముతోఁ బరియింప విచ్చె నం
బుజ మొకఁ దద్ది మున్ను వట • భూజ దళంబున బండి యాఁకటన్
గజిబిజి గొన్న కైవడి జ • గంబుల లోఁగొను వాని నాభియం
దు జనన మందె నంచుఁ బగఁ • దోయధి యబ్జుని గాంచె నాఁదగెన్

ఉ॥ చుక్కల గుర్తు లుంచు క్రియఁ • జుక్కలు మిక్కిలి పిక్కటిల్లె న
ద్దిక్కులఁ గ్రమ్మ నిర్లఁ గబ • శించిన వెన్నెల గుంపు లప్డు తొ
ల్చుక్క నెసంగు వెండి కల • శంబున ప్రక్కను పోఁక పాళ నా
నిక్కెను సీత కియ్యదియు • నెంజిలి నెంతగఁ గూర్చునో కదా?

తే॥ రక్తిగల నంజ యను చేయి • రమణ జూఁచి, యిరుల మ్రింగివెన్నెలలెల్ల • యెదలఁ బర్వె
*దళిత పాపుఁడై నిరతాన్న • దాతయైన, విభుని విలసిత సత్కీర్తి • విధము నంది

చ॥ కడలి తరంగలం బొడము • కల్వల తేఁ డను శిల్పి వెల్గులన్
పొడవగు కేలు సాఁచి మును • పోషణ చేసెడు వెన్నునాభిలోఁ
బొడమిన యండగోళములు • పోయెను ప్రాఁతగ నంచు జ్యోత్స్న యన్
దడమగు వెల్ల వేయు క్రియఁ • దార్కొనె నెల్లెడఁ గౌముదీ తతుల్

చ॥ విడక వసించు లక్ష్మియును • పే రులివుం గల తేంట్లు వీడఁగా
ముడిఁగెను వాడి తేకులును • మూఁత వడంగ సరోజ షండముల్
విడిగెఁ దొగల్ మహా ప్రభువు • పృధ్వి నయంబుగ నేలి స్వర్గముం
బడసిన యంత నల్ప నర • పాలకు లౌదల లెత్తుకై వడిన్.

తే॥ ఇరులుగా వచ్చి లోకంబు • లెల్ల మ్రింగి, వఱలు నల్ల నిప్పున లేచు • బాడబంబ!
మాయియగు వనమాలి మై • చాయకోడి, యడలు కడలికి నాకును • చెడుగవై తే?

తే॥ కడలిలోఁ బుట్టితివి చెడు • గరివి కావ, అంబుజాలయతో నమ్మ • తంబు తోడ
జనన మొందితి వెవరిని • చంపకుండి, నన్ను కాల్తువే యని సోలె • నలిననేత్ర.

---

* తిరు వెణ్ణెయ్ నల్లూరి జటప్ప కీర్తింబోలె అని మూలము.

తే॥ వెన్నె లనెడి సమ్మెట నీల • వేణిచనులు, పైఁబడఁగ వేఁడి నిప్పునఁ • బడిన హంసి
వోలె నోర్వక చెందమ్మి • పూల పాన్పు, మీఁదఁ బడి పొరలుచు నుండె • మోదము చెడి

తే॥ దొండదిగఁ గ్రమ్మ వెన్నెలల్ • తూఱి తాఁకఁ, దల్లడిల్లి యుడికి సొమ్మ • సిల్లెఁ బాన్పు
వాడి చెందమ్మి రేకులు • మాఁడిపోయెఁ, గిరవాణి దేహము చాల • మాఱిపోయె.

తే॥ చెలులు చలి కలపంబు పైఁ • జేర్చునంత, సీత మఱి యింత యుడుకుచుఁ • జీఁదఱ గొనె
వీవ వీవఁ గుచంబుల • వేఁడి యెక్కె; మదిని మదన వేదన కేది • మందు మహివిఁ?.

తే॥ ఒడలి నుడికించి కామాగ్ని • యుబుకుచుండఁ, గిసలయములు పుప్పొడి చిందు •
వేసివాడఁగా వానిని • డీసివైచి, మార్చుచుండిరి తల్లి ప్రే • మంపుఁ జెలులు, [ప్రసవములను

తే॥ సుందరంబైన శుద్ధాంత • మందు విరుల, శయ్యపై సీత యారీతి • శ్రమల నొందఁ
గలికి మించు మైసంచును • గాంచినట్టి, రాముఁడెటులుండెఁజూత్ము • రండుపోదము

తే॥ అటువారు ముప్వురు చని • యధిపుఁగాంచ, నతఁడు సత్కృతు లొనరించి • యమరనాథు
సదనముం బోలు చాంపేయ • సౌధమందు, విడిది చూపఁగ మదముతో • విడిసిరచట

తే॥ అచటి కేతెంచె నతి బలుఁ • డైన రాము, పాదధూళిచేఁ దొలిరూపు • వడసి నట్టి
మడఁతుక యహల్యకొడుకున • మస్త తపము, లొక్కరూపొందెనని చెప్ప • నొప్పువాఁడు

ఆ॥ కానిపించు మునిని • గని మహోదారుండు, మ్రొక్క సుగుణధనుఁడు • పెక్కుశుభము
లొనరన్ దీవనలు స • మున్నతిఁగావించి, గాధిజునకు నెఱిఁగి • గారవమున.

క॥ గౌతమ పుత్త్రుఁడు కౌశికుఁ, గౌతుకమునఁ గాంచి మీరు • కడఁక నిటకు
నే తపము చేసె నీపురి, నా తరమా తెలుప మౌని • నాథా! యనఁగన్,

క॥ చల్లని పద్మాసనమున, నుల్లసిలు పితామహుండె • యుపమకుఁ దగి రా
జిల్లు తానందుని ముని, తల్ల జుఁడగు కౌశికుఁడు ము • దంబునఁ బలికెన్,

క॥ ధీరచరిత! వినుము • మహో, దారుండీ దారకుండె • తాటక యసుఁబుల్
పేరుగ నా యాగము పెం, పారఁగ నీతల్లి శాప • మరిదిగఁ దీర్చెన్.

క॥ అరసి యిటు పల్కు కౌశికు, నరసి శతానందుఁడిట్టు • లను మునిచంద్రా!
అరుదగు నీ దయ గలుగఁగ, నరు దెయ్యది విజయ శీలుఁ • డగు రామునకున్.

తే॥ కదలి నీలంబు మబ్బుల • గమియు వల్ల, గలువ లుపమగా నొప్పిన • కప్పుటొడలు
గలుగు రాముని వదన మం • డలముఁగాంచి, యిట్టులను నహల్యా పుత్త్రుఁ • డింపునింప.

## విశ్వామిత్ర చరిత్రము.

క॥ వనమాలీ! యిమ్మని మును. జనపాలుండగుచు పెక్కు • సంవత్సరముల్
మును నీతి దప్ప కేలెను, దస కెదు రెద్దియును లేని • తాత్పర్యమునన్.

చ॥ పొటుకునఁ బాస్పు క్రొమ్మిరులు బొండిని గ్రుచ్చుకొనెం జుఱుక్కనన్
జిటపటఁ దత్కలాపమును • చిట్లి మిథునంగుళు బట్లు రాలె ను
త్కట మదనాగ్నిచే సరుల • దారము తాజీ తెగెం బటాలునన్
బొటపొట నక్రువుల్ చెదర • బొగులె యయ్యెఁ బ్రసూన దామములు.

తే॥ దాదులును తల్లులును చెలుల్ • సోదరులును మిగులఁ జింతించి మనసులు • నొగుల నేమి
వేంద్ర మిది యని తెలియక • విరి వసంత, మునస్సుదృష్టి తీసిరి మీఁదు, మొనసి కట్టి.

క॥ ఆలావణ్యమున విసర్లు, గాలియు గ్రామ్యాగ్ని వృద్ధి • గావింపఁగ నిభూ
షాలి విరిసరుల్లు మ్రాత్రగ, బాలికయుం గరఁగు పైడి • ప్రతిమం బోలెన్

చ॥ ఖిరిప్రపక్షమున్ ధరించి విరి • విం గొను చీఁకటి కాన యెుక్కో? సుం
దరతర మైన స్తంభములొ? తద్భుజ యుగ్మమొ? కాకయున్న పెన్
మరకత పర్వతంబులొకొ? మంజుల పద్మయుగంబొ? కన్నులో?
యురువు వహించి విల్లు గొని • యుర్వికి డిగ్గిన మేఘమో? యనున్

ఆ॥ మదిని చొచ్చి దిటవు • మానినీత్వంబును, కరఁచి జీవమ్ములను • గలఁచు వాని
మలల మాఱు మసలఁ గల • భుజంబున నొప్పు, విల్లు చూడఁ జెఱకు • విల్లుకాదు

ఆ॥ స్త్రీ స్వభావమైన • సిగ్గు నందంబు న్యా, మనసులోని తెలివి • మఱిఁగి పోయెఁ
గాళ్లు నొవ్వ నేలఁ • గదలిన య్యాతఁడు, కనుల త్రోవఁ జొచ్చు • కన్నగాఁడు

తే॥ ఇంద్రనీలంబులంబోలి • యిరులు గ్రమ్మ, కురులు నాజానుబాహువుల్ కొమ్మరు మోము
కప్పు తాల భుజమ్ములే • కావు స్మితము, మొనసి నాజీవముల లాగి • కొనుచుఁ బోయె

తే॥ చూచు వారల యసుఱులఁ • జూఱలాడు, పరపువక్షమ్ము నడుగుఁదా • మరలెకావు,
మదపు టేన్గు వోలెఁ జనిన • మంద గతులె; నాయెదఁదఁ జొచ్చినెలవు కొ • న్నవి నిజంబు

తే॥ అరసి పలుకుచో ననిమేషుఁ • డతఁడు కాఁడు, విరియుచెందమ్మి కన్నులు • కిఱుకువాఁడు
కట్లు గల విల్లు దాల్చిన • ఘన భుజుండు, జన్మిదమ్మునందే నిజము రా • జన్యసుతుఁడె.

తే॥ సహజ సద్గుణములుదీమ • సంబుదృఢత, యంత్రములుగాఁగఁ దిరుగు క • స్యాత్వమనెడి
ప్రహరిఁబడఁ గూల్చుసుందర • బాహువులను, మరలజీవముల్ విడుమన్నె • యరయఁ

## సూర్యాస్తమయము.

తే॥ అనుచు నిటువంటి వేపెక్కు • అనుచునిదిగొ, యెదుటఁదోఁ తెంచెవదిగొ వో • యెనెయటంచు
ఉడుకు మదిని వలపుచేత • నొకటిగాక, పెక్కుదలఁచుమ్ము మలయుచు • వేఁగుచుండ.

ఆ॥ హంసయాన కైన • యంగజ తాపాగ్ని, తన్ను గాల్ప నోర్వ • దలఁచు కరణి
పొడవు కరము లడఁగ • ముడిచి వేఁడి వెలుంగు • పరుగువాఱి మునిఁగెఁ • బశ్చిమాబ్ధి

చ॥ విరిసిన పూలపైఁ బడుచు • వీచెడు పయ్యరత్రాడు. సంజయం
బరమును నెట్టి వెంట్రుకలు • మైకము రేఁపు స్మరాగ్నిలోపలన్
బెరుఁగఁగఁ జేయు మబ్బనెడి • పేరిన నల్పుమెయిన్ వహించి యు
ద్ధురగతి రాత్రియన్ జముఁడు తోఁచె విదేహ నృపాల కన్యకున్

ఉ॥ పైని ధ్వనించు పక్షుల ర • వంబులు వాద్యముగాఁగ ఘోషముం
బూనిన యబ్ధియే యడుగు • మువ్వలుగా నెఱ మిన్నె రక్తపుం
బానముగాఁగఁ జీఁకటియె • ప్రబ్బిన కంచెలగాఁగ సంజ యన్
చాన మహోద్ధతిం బరఁగు • శాకిని భూతము వోలె వర్ధిలెన్

సీ॥ కొలఁకు లనెడి యగ్ని • కుండంబులంబడి, విరియు పువ్వులనుండి • విసము గొనుచుఁ
బచరించు దక్షిణ • పవనుండు మారుండు ప్రయ్యనేయఁగ నైన • వ్రణములందు
తూటి లో నేగఁగా • దూపిల్లు తెలివియు, మెలైన స్త్రీత్వంబు • నేలఁ గలియ
సంభ్రమించెడు సీత • సంజను గని యిది యాః మన్నిగొన వచ్చు • యముని రూపు!

తే॥ కదలియో! కాలమేఘమో! కప్పు మలయొ యెదరు గలిగించి కన్నెల • నేడిపించి
యావిదీయు మతేదియో • యనుచునామె మంయ నసురవన్నియ ముని • మూపువచ్చె

సీ॥ గగన నీలిమయు బు • షములు విషదంష్ట్రి, బుసలు తెమ్మెరను నూర్పు యను విశాల
మగు జేవు తాకస • మను విషధృతి యొప్పు జగ నోరు గలిగిన • సంజ పాము!
నాలుకతో లాగి • జాలిఁ బూన్చుట యేల? అమ్మేయు నించు వి • ల్లమరువాఁడు
కొంచెమైనను చేయి • క్రిందికి దింపఁడ ఉన్నది నా కొక్క • యుసుతె సుమ్ము

తే॥ తప్పిబ్రదుకఁగ నేనుండ • గొప్పరట్టు, పూన్చి యిట్టుల నన్నాడి • పోసికొనఁగ
నేమి యపరాధ మొదవె నా • యెడ? ని దేల షెర భావంబు నన్నలవంత పఱుప?

ఉ॥ క్రమ్మిన మబ్బురూపు నిటు • గైకొని హాలహలంబు పొంగెనో
యిమ్మెయి నబ్ధిపొంగెనొ? ర • మేశ్వరు మేని హారంగు నెల్ల వా
రిమ్ముగ నెంచుమంట నది • యే యిటుపర్వెనొ? కాలువల్పు తో
రమ్ముగఁ గాటుకన్ మెడిఫి • రాచిరొ మింటికి మంటి కెవ్వరేన్

చ॥ అరుదుగఁ గానవచ్చి నతఁ • డా మఱుఁగై చనె నడ్డు పెట్టి నొ
క్కరును గనంగ లేర యొక • కన్నెక యెల్లిద మైన దంచు లో
నెరయక మబ్బు నిలిచి • యమ్మలనేయు ననంగుఁ డిట్లు నీ
కిరవుగ నేర్పెనో? యిదియు • నే నొనరించిన పాప రూపమో?

ఉ॥ అంకిలి నొంది సీత యిటు • లంగదఁ గ్రుంగుచు వెమ్మఁ గాంచ న
భ్రంకష సౌధమందు నెల • జూ జగ తిన్నెయు-చుట్టు నాజ్య దీ-

తే॥ ధర్మ మార్గానుసారియై • ధరణి నేలు, చుండి యొకనాఁడు వేఁటాడ • నుల్ల మందు
కదఁర జనియింప దట్టంపు • టడవి కేగి, పూజ్యమగు వసిష్ఠాశ్రమ • మునకుఁ జనియె

సీ॥ అమ్మౌని యంత న • త్యధికాదరంబున నాతిథ్య మొసఁగి జ • నాధినాథ!
ఇచట నేఁటికి వసి • యింపు మనఁగ నీతఁ, డట్లే యనుడు నాతఁ • డలరి సురభిఁ
బిలిచి యిప్పుడు రాచ • వీరుల కింపైన, యమృతముం బోలు నా • హార వస్తు
నిచయంబుఁ బిదుకుము • నివన నయయుంం, నదయి నవ్వారిగా • నేపుడ ఖరి

తే॥ షడ్రుచులతోడి యోరెంబు • సైన్య సమితి
తోడఁ దృప్తిమైఁ గొనుము మ • హీశ! యనిన
నదఁడు భుజించి విరిసరుల్ • చందనంబు
తమ్ములముఁగొని శ్రమదీఱి • తనిసియుండ

సీ॥ కౌశికుండు వసిష్ఠుఁ • గాంచి యిట్లను ముని, జనగణ్య! నీవు లే • చినది లేద
యీ ధేనువే మాకు • నెల్ల సైన్యములకు, నిష్ట మృష్టాన్నంబు • లిచ్చు కతన
కలుష దూరులు శాస్త్ర • కర్తలు మును 'రత్న • హారీతు పార్థివ' • యనుట కతన
నీ కామధేనువు • నీకుఁ దగ్గది కాదు, నా కిమ్మనపుడు మౌ • నంబుఁ గొనుచు

తే॥ క్షణము సేపుండి యమ్మౌని • చంద్రుఁడనియె, దారుణ కృపాణ దీక్ష మహా • స్త్రా! తపస్వి
వల్కలిని పేద నే నీయ • వలఁతిఁ గాను ఈవ కొనిపొమ్ము వచ్చు న • ట్లేని దీని

తే॥ అనినఁ గౌశికుఁ డట్టులే • యనుచు లేచి పసిని బంధించి యీడ్వ • న ప్పశువు కట్లు
త్రెంచికొని మునిఁ జేరి న • న్నృపవరునకు, నిచ్చినాఁడవే యన నతఁ • డిట్టు లనియె

సీ॥ నేన యొసంగలే • దీ నరపతి జయ చ్ఛత్రంబు గలవాఁడు • సరభసమున
బలిమిమైఁ గొనిపోవు • వా డన నందిని, యిఁక నిబలంబు నే • నిపుడ చెఱతు
నని కోపమున దేహ • మల్లార్ప రోమ కూ, పంబుల బోయలు • బర్బరులును
చీనులు జోనకుల్ • వేనవేలుగఁ బుట్టి జననాథు బలము నా • శంబు సేయ

తే॥ రాజపుత్త్రులు మునిరాజుఁ • గ్రమ్మి కినుకఁ, బశుబలమ్ము గాదిది వీని • వంచనమ్మె
పొడువుఁడని యూర్వనాబుషి • పుంగవుండు, నుఱిమిచూడ వారలు మండి • యుర్విఁబడిరి

మ॥ తన పుత్త్రుల్ మడియంగఁ గౌశికుఁడు క్రు • ద్ధస్ఫూర్తి దుర్వీక్ష్యుఁడై
ధనువుం గొంచు గుణంబుఁ గూర్చి శరముల్ • దంభోళి దోస్సారతన్
మునిపై నేయ వసిష్ఠమౌనియును వే • భూపాలుపై వైచెఁ జే
తను దాఁ దాల్చిన బ్రహ్మదండమును త • ద్ధాత్రీశుఁడు న్నవ్వఁగన్

మ॥ వర దివ్యాస్త్రచయంబుఁ దొట్టి తప య • భ్యాస ప్రపుష్టంబు లౌ
శరముల్ వీడుచునుండ దండము మహా • శ్చర్యక్రియన్ మ్రింగ భూ

వరుఁడంతం గనకాద్రి ధ్వనివిఘధిం • బ్రార్థింగా మెచ్చి యా
స్మరశత్రుం-దొసఁగెన్ నరేంద్రునకసా • మాన్యంబులౌ నస్త్రముల్

చ॥ అతఁడవి యేసె నప్పుడమృ • తాంధసు లవ్వడి సూచి లోకముల్
హుతవహు నోటఁ బడ్డవని • యుత్తలమందె వడంకి రెవ్వటిన్
యతిపతి హుమ్మటం చతని • యస్త్రము లెల్లను మ్రింగి యుగ్ర తే
జిత తనుఁడయ్యె నిట్లు శశి • శేఖరు నస్త్రము లెల్ల వమ్ముగాన్

చ॥ కుశికసుతుండు కాంచుచు న • కుంఠితతేజము సత్తపస్వికే
వశమగుఁగాని తక్కుఁగల • వారికి నుండుట కల్ల లోకముల్
యశమున నేలు శక్తి యది • యచ్చపు సత్త్వము గాద యంచుఁ దొ
ల్దిశకుఁ జనెన్ మహా తపము • లేఁకువఁ జల్ప వినిశ్చితాత్ముఁడై

ఉ॥ రాజగు కౌశికుండు ముని • రాజు వసిష్ఠు జయంబు తీరు త్రా
నోజఁ దలంచి యంతఁ గడు • నుగ్రముగాఁ దపియించి నిష్ఠమై
రాజిత శక్తి నొందఁ సమ • రావతి నాధుఁ డెదన్ భయంబునన్
*దేజు దొలంగి యచ్చులఁ దేలు • తిలోత్తమ నంపెఁ బెంపునన్

చ॥ నృపతి తిలోత్తమాతను వి • నిర్మల సౌష్ఠవ మొప్పఁ గాంచి తాఁ
జపల మనస్కుఁడై మరుని • సాయకముకల్ హృదయానఁ గాఁడఁగాఁ
దపము కృశింపఁ జొచ్చెలికిఁ • దద్ద వశుండయి చాలకాల మ
ట్లు పలవ మేలెఱిఁగి వెగ • టుం గొని నవ్వె మనంబులోపలన్

తే॥ ఇంద్రు వంచన మిదియని • యెఱిఁగి కినుక, నవని మానిసివై పుట్టు • మనుచు దానిఁ
దిట్టి యచ్చోటు వీడుచు • దిగధిపతుల, సత్త్వవంతుఁడౌ జముదెస • సరగఁజేరె

తే॥ ఇచ్చమెయి నటఁ దపము వ • హించుచుండ, శక్తిమ దయోధ్యయందు త్రి శంకువనెడు
ప్రభువు పాలించుచుండి త • ద్వంశ గురుని ముని వసిష్ఠుని గాంచి యి • ట్లనుచు నడిగె

మ॥ మయితో స్వర్గముఁజేరఁ గాంక్ష హొదమెఁ • మన్నించి యిక్కార్యమె
మ్మెయి నైనం బొనరింపఁ జన్న నెదఁదన్ • మేకోమియుం గాంచి యా
పయి నేనెవ్వరిచేతనైన నొనరిం • పం జాలు నన్నంతనే
నయమా! పాకపచారమంచు దలఁచి యా • చార్యుం బరుం డెత్తువే?

ఉ॥ అలము చేసియిట్లు మరి • యాదఁదొలంగితి గాన నీవు చం
డాలుఁడవౌదు వంచు ముని • నాధుఁడు తిట్టుడు సూర్యుఁడుం బ్రకా
శాల్ధి రహింప హేతువగు • నట్టి నృపాలక తేజ మ్మాలఁగా
గేగి యొనర్పఁగాఁ దగిన • కీడ్పడు రూపము తేనికేర్పడెన్

---

* తిలోత్తమ యని మూలము

ఉ॥ హారములుం గిరీటమును • హారి విభూషలు లోహభూషలై
జారు పటంబులున్ మెడను • జందెము తోఁగ మాఱి దేహమున్
పేరిన నల్లనై చెడఁగ • వీడని చింత నృపాలుఁ డింటికిన్
జేరఁగ నెల్లవా రచట • సీయని రోయఁగఁ బోయెఁ గానకున్

తే॥ ఒక్కనాఁడు విశ్వామిత్రుఁ • డురు తపంబొ, నర్చు వనమున కేగఁ జం • డాలుఁడవగు
నీవెవండ విటకువచ్చి • తేఁయన్న మునికిఁ దన వృత్తమెల్ల భూ • పుఁడు వచించె

చ॥ అదివిని గాధిపుత్త్రుఁ డిది • యా కథః యంచు హసించి యజ్ఞమున్
వదలక చేసి పంపెదను • స్వర్భువికంచు వచించి మౌనులన్
ముదమునఁ బిల్వనంప భయ • ముంగొని వచ్చిరి వారలెల్లరున్
బదరి వసిష్ఠ సూను లిటు • పల్కిరి గర్వము కంధళింపఁగన్.

ఉ॥ మాలఁడు యజ్వయంటః మఱి • మాల పురోహితుఁడంట రాజుః చా
ల్చాలును సమ్మతింప మన • సమ్మవి కౌశికుఁ డంత నుగ్రుఁడై
యాలముచేయు కట్టిఁడి దు • రాత్ములు నీచపథానువర్తులై
మాలుదు రంచు శాపమిడి • మానక యాగము పూర్తి చేయుచున్

ఉ॥ వేలుపు లారః రండనుచుఁ • బిల్వఁగ వారలు మింట నిల్చి యీ
మాలని కగ్ని కార్యము క్ర • మంబుగఁజేయుచు మమ్మ పిల్చునీ
శీలము వోలదంచుఁ బ్రహ • సింపఁగ నమ్ముని కిన్కనూని దా
మేలితపంబుచే నిమర • మేదినిఁ జేరుమ యంచుఁ బంపఁగన్

చ॥ మనుజవిభుండు వే చని వి • మానమునన్ దివి జేర నిర్జరుల్
చను మిటరాకు మాలఁడవు • చక్కటియే యిది యంచుఁద్రోవ, నో
మునివరః కావుకావు మని • భూపుఁ డథోముఖుఁడై పడంగ రా
ముని నిలునిల్వుమం చశనిఁ • బోలె నొనర్చె మహాట్టహాసమున్

సీ॥ నన్ను లెక్కింప కి • ట్లున్నత గర్వులై, యవమతి గావించు • నమరవరుల
పెనువైభవముకంటెఁ • బేరిమిగాఁగ రెం, డవ త్రిదివంబు క • దంగి యిపుడ
కావింతుఁ గమలాప్త • కమలారుఁడును ఋక్ష తతియును గ్రహములు • తవిలి పొడపు
వలదెస యందును • వడకడఁ గ్రుంకును గలిగి సంచారంబు • గాంచుఁగాక

తే॥ అనుచు నానతి యొసఁగి తా • నంతఁబోక, సురల దిక్పతులను చరా • చర వితాన
ములను సృష్టింపఁ బూనె ని • మ్మునివరుండు భువన సముదయములు భీతిఁ • బొందివడఁ

సీ॥ కల్పకవనమునఁ • గాంక్షమై విహరించు నెలదంట నలువయు • నీలగళుఁడు
తక్కనిలింపులు • తండంబులైవచ్చి శాంతింపు మునివరాః సైఁపు మిపుడు

శరణ మందినవానిఁ • గరము వీడక కాచు, తగవు నీకమరుట • మిగుల లెస్స
ఈ త్రిశంకుండు న • క్షత్రసంఘము తోడ, నుప్పరంబునఁ గూడి • యుండుఁ గాక

తే॥ ఐదురిక్కలు వెలఁదెస • యందు నిలిచి, నీమహా మహిమను చాటి • నెగడుచుండు
నీవు రాజర్షివై యొప్పు • దిది మొదలుగ, ననుచు వారలు నెలవుల • కరుగు సంత

## శునశ్శేపుని వృత్తాంతము

సీ॥ కడలి రాయని దెస • నడరు సదవికేగి, కౌశికముని సల్పె • ఘనతపంబు
ఆకాలమునఁ బతు • రంగ బలాధిపు, డంబరీషుండను • నవని విభుఁడు
ప్రాణివర్గములకుఁ • బ్రాణసమానుండు సుధఁ బోలు పలుకుల • జొప్పువాఁడు
కొలచేసి జన్నంబు • సలిపెడు నరమేధ, మొనరింపఁ బిన్నవాఁ • డొనరకునికి

తే॥ నరయుచుం బోయి ఋచికుని • యాశ్రమంబు, వొచ్చి యడుగంగ ముబ్బురు • సుతులలోనఁ
బిన్న నీఁజాల ననియెను • కన్నతల్లి, తనకు జ్యేష్ఠుండు కూర్చువాఁ • డనియెఁ దండ్రి.

తే॥ మధ్యముఁడు నవ్వి విభుఁ గాంచి • మాకు వేఁడ్క, ప్రేమఁగని యెత్తి పెంచిన • పితరులొందు
పేదఱికముఁ బోవ ద్రవ్యమ్ము • చేయుమింత, యమ్మనుచు వారలకు మ్రొక్కి • యెక్కెఁ దేరు.

తే॥ ఇనుఁడు నడుమింటి కెక్కంగ • మనుజనాథు డొక్కచోట మాధ్యాహ్నిక • మొనరుపంగ
నిలువ నా శునశ్శేపుఁడు • నియత కృత్యములను దీర్పఁగ మఱియొక • కెలని కరిగి

ఉ॥ అచ్చట సన్మునీంద్రుఁ గుశి • కాత్మజుఁ గాంచి యడల్ గడల్కొనన్
బెచ్చెర పాదపద్మముల • శీర్షముఁ జేరిచి మ్రొక్కి యేడ్వఁగా
ముచ్చట నక్కుమారుఁ గని • మూఁడిన యాపద చెప్పుమన్న వాఁ
డచ్చముగాఁగఁ జెప్పెఁ దన • యమ్మయు నయ్యయుఁ జేయు కార్యమున్.

తే॥ అక్కయును బావయును సుతు • నమ్మికొనుట, వెఱసి చింతించి యతఁడు చిం • తింపవలదు
నీదు ప్రాణముల్ గాచెద • నే నటంచుఁ, దన కుమారుల నతనికై • చనఁగఁ బనుప

చ॥ కొడుకులు సమ్మతింపమికిఁ • గోపము సంగను లెత్తఁ జేసి దుం
దుడుకున రోమకూపముల • దూఁకఁగఁ బ్రస్ఫుట విస్ఫులింగముల్
వెడమతులారా! నా పలుకు • వెడ్డటికంబుగ మీరినారు మీ
రడవులలోఁ బులిందులయి • యాకట మందుఁడి యంచుఁ దిట్టుచున్

చ॥ మునుపు వసిష్ఠ కోపమునఁ • బొంగని నల్వురు శాపయుక్తులై
చనఁ దనయల్లునే పిలిచి • చక్కన నేరిపి రెండు మంత్రముల్
మొనసి పఠించితేనియుఁ ద్రి • మూర్తులు వేల్పులు వచ్చి జన్నమున్
మనుతురు నిన్ను గాతురని • మన్ననతోడుత నంపె నాతనిన్.

చ॥ ముని వచియించిన ట్లతఁడు • మున్కొని మంత్రములం బఠింపఁగా
వనజజ విష్ణుశంభులు సు • పర్వులతో నటకేగి యక్కుమా
రుని యనువుల్, విధిక్రమత • రూఢిగఁజల్పిన రాజువేలిమిన్
గొనకొనఁ గాచి రంతఁ జనెఁ • గోరిక గాధిసుతుం డుదీచికిన్.

సీ॥ అచట విశ్వామిత్రుఁ • డధిక నిష్ఠను హస్త, పద్మాంగుళుల ముక్కు • పైని నిలిపి
ఇడను పింగళతోడ • నెనయించి మనమునఁ, బ్రణవజపము బహు • వత్సరములు
నియతిమై నొనరించి • నిశ్చలుఁడై నిల్వ, మూలాగ్నివలనఁ గ • పాల మంత
భేదిల్లి తమసంబు • విరిసిన యనువున, ధూమంబు లోకముల్ • తూలునట్లు

తే॥ త్రిపురదహనుండు గజము వ • ధించితోలు, గప్పుకొన్న చెన్నున మొగుల్ • క్రమ్మరహిని
జగములం బర్వ భానుతే • జంబు మాసె, దిగిభ దిక్పాల నేత్రముల్ • మొగిచికొనియె

తే॥ మొగులు నిండు గగనమెల్లఁ • బొగలునిండ, జంగమ స్థావరంబులు • సంచలించె
దిక్కు లెల్లెడఁ గావులు • తివిరి కప్పె, దివ్యులును వెఱగందిరి • తేఱిచూడ.

తే॥ పద్మజుఁడు పద్మనేత్రుండు • పద్మబాణ, వైరి కులిశియుఁ దక్కు గీ • ర్వాణసమితి
యచ్చటికి వేలు వేలుగా • వచ్చిచేరి, ఘన తపోధనుఁ గౌశికుఁ • గలిసికొనిరి.

తే॥ చంద్రమౌళియు వనమాలి • జలజభవుఁడు, గాధిజుం గాంచి పరమ త • పోధనాఢ్య!
వేదపారగుల్ నిను మించి • వేఱు లేర, అని వచించిరి యెద సంది • యమ్ము లేక.

తే॥ అన్నుడువుల వీనులువిచ్చి • విన్న యతఁడు, శిరమువంచి కేల్ మొగిచివాం • ఛితఫలమ్ము
లొనరె నేఁటికి నేను ధ • న్యుండనైతి, ననుడు వారు స్వస్థలముల • కరిగినారు.

క॥ గతమైన చరిత్రంబిది, యితనికి సములైన తపసు • లిలలేరు మహో
న్నత నియతుఁ డితని కనికర, మతులితముగఁ బడయు మీకు • నరిదియుఁ గలదే?

క॥ అని గౌతమ పుత్త్రుఁడు చె, ప్పిన రాఘవు లచ్చెరవును • వేడ్కయుఁ గొని య
మ్మునికిం బ్రణమిల్లఁగ దీ, వనలిడి మరలెన్ స్వకీయ • భవనంబునకున్,

క॥ మునియుం దమ్ముఁడుఁ దమతమ, కనువగు సెజ్జలఁ బరుండి • రంత నిరులు పం
డును వోలు రాముఁడును రే, యును శశియును దాను సీత • యునుగా నొప్పెన్.

క॥ జీమూతంబును వీడిన, యామెఱపే యిట్లు నెలఁత • యంగముఁ గొనెనో?
యేమో? యెఱుగఁగఁ రాదిది, నామదిఁ గన్నులనుదాని • నవురే తోఁచెన్.

క॥ విమలౌదార్య కరాబ్జము, లమరిన వెన్నుఁడు పరుండు • నబ్ధి నెనయు నే
త్రములు గల రమణి నాహ్వా, త్కమలంబున నిలిచెఁగానఁ • గమలయె యగునో

చ॥ నెన రెద లేని దయ్యుఁ దమి • నెక్కొనఁగా గడుబేడిదంపు వే
దన మిడు నంజుగల్గు కను • దమ్ములచే నను లోఁగొనంగ నా

కనులకుఁ గానవచ్చెడు జ • గంబునఁ గల్గు చరాచరంబు లె
ల్లను వనితా సువర్ణమయ • లాలిత సుందర రూపమే గొనెన్.

చ॥ పరవి నగల్ చలింపఁదగు • బంగరుకుండలు పేర్మిలేని నా
యురమున నాటకుండినను • జ్యోత్స్న నుపోలిన మందహాసమున్
బొరపఱు మోవి దొండయును • భూషలుగాఁ బెనుపొందు నా మనో
హరి ముఖచంద్రమండలము • నారయ నింకొకసారి గల్గునే ?

ఉ॥ అంచిత మేఖలంగలుగు • స్యందనమొక్కటి వాలుఁబోలు నే
త్రాంచల యుగ్మమున్ గనుల • కబ్బని పీనకుచద్వయంబు లోఁ
గ్రుంచెడు మందహాసము న • కుంఠితరీతి వహించుచుండు లె
క్కించఁగ నిన్నికావలయు • నే సమవర్తికి నాయుధావళుల్ ?

తే॥ తావిగల పైఁడిబొమ్మయౌ • తలిరుఁబోడిఁ, దలఁచు మాత్ర నాపైనించు • విలుతుఁడిట్లు
బాణవర్షంబుఁ గురియించి • పఱిచె ననఁగ, బలమనెడి యాగుణంబేరి • వలన నిలుచు ?

తే॥ పుడమిఁ గొల్లవెట్టుటకయి • పొంగిలేచు, పాలకడలి వెల్లువవోలెఁ • బరవు చంద్ర
కాంతి నాయుసుఖులఁ దీయఁ • గడఁగు కతనఁ, దెలి విసంబొందు కదలను • తీరుదోఁచు.

క॥ చరియింపఁదగని త్రోవను, జరుగదు నామనము నిజము • చక్కెర పలుకుల్
పరఁగునది పడుచెయగునని, పరితాపం బగ్గలముగఁ • బడుచుండు నెడన్.

తే॥ చెల్లఁ గాలంబు రేపేని • తెల్లగొడుగు, పడుటఁబోలెఁ బశ్చిమ దిశా • వనిత నొసల
నడరు గుంద్రని పతకంబు • వడిన లీలఁ, జంద్రమండల మంత న • స్తమయ మందె

తే॥ ప్రేమపతి చంద్రుఁడేగ నా • శామృగాక్షి, లెల్ల వల్లభుఁ దలఁదిన • తెల్లకలప
మునుమనోవ్యధఁదుడిచిరో • యనఁగ మున్ను, పరవియుండిన వెన్నెలల్ • మఱుఁగుపడియె

సీ॥ పొడవైన తోమాల • పొలుపుగాఁ దాల్చిన, రాముఁ డివ్విధమునఁ • గామబాధ
నివ్వటిలఁగ నొచ్చి • నిద్దుర లేకయె, సంతాప మొందుచు • జరపె రాత్రి
చెదరిన మదిలోనఁ • జింతించు చెందామ, రలను చెల్వాల మొగ • మ్ములు చెలంగ
విరివిగాఁ దఱుచుగాఁ • బరవిన యిరులును, గుహలకుఁ జేరి మై • కుదుచుకొనఁగ

తే॥ ఎఱ్ఱచుక్కల మొగమొప్పు • నేన్గుచర్మ, మొనరఁగప్పిన యుదయాద్రి • యనెడురుద్రు
నొసటిపై నగ్నిమయమయి • యెసక మెసఁగు, మూఁడవదియగు కన్ను నా • మొలచె నినుఁడు

సీ॥ వడియు సత్త్వముగల్గు • పచ్చనిగుఱాల, గిట్టల తాఁకునఁ • గెరలుధూళి
విప్రుల యర్ఘ్యంపు • విరులఁగూడిన నీటి, చేదెమ్మగాఁ బూవ్వ • శిఖరి మీఁదఁ
బూర్వదిగ్దంతి మో • మున నుంచు సిందూర, తిలకంబు నా నొప్పె • జలజహితుఁడు
వచ్చువేళఁదెలిపి • పగఱపై నేగిన, ప్రియులు తేరెక్కి రాఁ • బ్రీతిఁగాంచు

చ॥ కదనమునందు గెల్చి యొఱఁ • గాంచెడి ఖడ్గముఁదాల్చుభూపః యొ
ప్పిదముగ మూఁడులోకములు • వీరత నేలిన సద్గుణాకరుల్
పొదలిన వీరవంశమున • భూపుఁడె జింకలు బెబ్బులుల్ పగల్
వదలుచు నొక్క రేవుననె • పానము సేయఁగ నేలె నొక్కటన్

చ॥ అరి నరపాల పూజిత ప • దాబ్జః సురాసురు లొక్క యపు సం
గరి మొనరింప నాకులకు • ఖడ్గము విల్లును దాల్చి పాడి దే
వరవలె బాసటై నిలిచి • పట్టుగ రక్కసున్ జయించి యా
సురపురిఁ గాచినాఁ డతఁడె • సూ ముచికుందు డు వీరవంశ్యుఁడే

చ॥ మెఱపును నవ్వు కాంతిగల • మేటి నరాజిని దాల్చురాజః కా
శ్లాఱసెడు వీరిమద్దియల • నూనిన సూర్యకులంబువారు పెన్
దెఱకువ జీవరాసులకుఁ • దియ్యని జీవమువోలె నేలి ర
త్తెఱఁగు శిబీంద్రుఁ డండజముఁ • దేఁకువఁ గావ శరీర మీయఁడే?

చ॥ రిపుల శరీరఘుల్ దొలువ • రేఁగు కరాసి ధరించుభూపః యీ
విపులకులంబువారు పృధి • వీధరముల్ కొనకాలఁద్రోయు చి
ప్పపగిది దొర్లఁజేసి మఖ • వాజికినై జలరాశిఁద్రవ్వి ర
స్నపు డిఁకఁ జెప్పఁగావలెనె • యానృపవర్యుల వీర్యసంపదల్

చ॥ పగఱ దశల్ గ్రహించు కర • వాలము గల్గినతే డః శేషుఁడే
తగ వివరింపలే డన్కఁ బ • దంపడి నేఁ బలుకన్ వలంతినే ?
సిగముడి రేలపూల నెలఁ • జేర్చిన శంభునిపొందు నిర్జరా
పగ నిల కానయించిన నృ • పాలుఁడు వీరల వంశజుండెకా!

ఉ॥ కుందెటి మచ్చలేని నెల • కున్ సరివచ్చెడి యెల్లి గల్గు రా
జేందుఁడః వీరిపూర్వుఁడొకఁ • డేడ్తెఱ వార్థిపరీత భూతలం
బంది జయేందిరన్ గరత • లామలకంబుగఁ జేసికొంచుఁ బే
రొందఁగ నశ్వమేధ శత • మూని యొనర్చె సురేంద్రుఁ డంజఁగన్

ఉ॥ చందురు గెల్చి నాతఁడును • శర్వు జయించినవాఁడు దూపుచే
దుందువుఁ గూల్చి నాతఁడును • తోచిన భాస్కర వంశమందె పు
ట్టొంది రఘుండు దేవవిభు • నోరిచి యెన్మిది దిక్కులన్ జయం
బంది యనర్గళంబగు ప • రాక్రమ మొప్పఁగ నేలె లోకమున్

చ॥ ధనువను మందరంబుఁగొని • దర్పిత శాత్రవ రాజులన్ సుధా
వననిధిఁ ద్రచ్చి జ్యోతి మయ • బంధుర సుందర మందహాసముల్

ననుచుచు నుండు నిందుమతి • నాఁజను నిందిరఁగాంచి పద్మనా
భునిబలెఁ దద్భుజాళి నజ • భూపతి భూషగఁ దాల్చెఁ బెంపుమైఁ.

చ॥ మంగళ రావముల్ సతము • మానుగ మ్రోఁగు నజార మొప్పు భూ
పాంగః జగంబునన్ దశర • థావని నాథు నెఱుంగకుండు వా
రుంగలరేమిః వారి కామ • రుల్ గుణవీరులు వీరి నేరు పా
రంగ వచింప నల్వకుఁ ద • రంబెః యెఱింగిన యంత పల్కెదన్.

చ॥ సిరుగులు లేక ప్రాణి తతి • శ్రేయము లొంది భువిన్ సుఖింప వే
వెలుఁ గివమంబలెన్ విమత • వీరులఁదూల్చి జగంబుఁ గాచు వాఁ
డిల మనువు న్నయంబున జ • యించినవాఁడు ధనుస్సహాయుఁడు
జ్వలిత సుధర్మవర్మఁ దజు • పట్టి కుమారులు లేని చింత చే.

సీ॥ వింటికోపుల వంటి • వెడఁద నొసళ్ళును, తొక్కుపల్కులఁ బోలి • నిక్కునుడులు
వింటైన లింబాధ • రంబులు నీలవి, కాల నేత్రంబులు • సంకుమెడలు
నులియు మధ్యంబులు • వెలకిచ్చు భోగంబు, లలరు పణ్యస్త్రీల • సరసి కుచము
లను కొమ్ములను గల్గు • నడవిమెకంబులు, గానెంచి వారితోఁ • గదలివచ్చు

తే॥ బుళ్ళకృంగునిచే చింత • లీఁగఁదలచిఁ, దుర్భగుఁడ నాకుఁగొమరులు • దోఁవరైరి
నేల మొత్తము నావెన్క • నేలఁదగిన, తనయుల నొసంగుమనుచు నా • తనికిమ్రొక్కె.

తే॥ మ్రొక్కనమ్ముని యుత్సాహ • మున వచించె, భూమిమాత్ర మే యననేల • భువనమెల్ల
నేలుపుత్త్రుల నీకిత్తు • వేలిమికిని, వలయు వానిని సమకూర్పు • పార్థివేంద్రః

తే॥ అనుదు వస్తువుల్ సమకూర్ప • ననఘుఁడంతఁబుత్త్రకామేష్టి సాగించి • పూర్తిచేసెఁ
గనక కలశంబునన్ సుధా • కల్పమైన, యన్నముంగొని భూతమొం • దందు వెడలె

తే॥ అన్నముం గొని మునివరు • ననుమతమున, తన్నుతాఁబోలు దశరథ • ధరణీధవుఁడు
ముప్ప రర్ధేందు నిటలల • మదముతోడఁ, బిలిచి నాలుగుపాళ్ళు గా • వించి యిచ్చె.

శా॥ పండంబాఱి పగుళ్ళు పుట్టిన మహా • పాపక్రియాసిద్ధిచే
నిండంబాఱిన వేదచోదిత లస • న్నీతిక్రియాసిద్ధిచే
దొండంబోలిన నోరుగల్గిన సదా తుష్టాత్మ కౌసల్య యా
దండ న్నిల్చు నలేఖ్యసుందరు జగ • త్కల్యాణ దాయిం గనెన్.

చ॥ త్రోయఁగరాని నీతులను • తోరపు చేటులు వచ్చిచేర లోఁ
తై యలరారు సద్గుణచ • యంబను నద్ది ననింద్య సత్తమా
మేయ మనోహరత్వములు • మేలుగ నీతనిఁబోలు పుత్త్రుఁగై
కేయి గనెన్ మహామృదుల • కీర్తి రతున్ భరతున్ సుధీహితున్.

చ॥ అరుదగు దేవచే గెలుపు • నందుచు ధర్మము పాడొనర్చు నే
ర్పరులగు దానవేంద్రుల ఖ • రంబగు భీతిని ముంచు శూరులన్
వరధనువుల్ ధరించి విలు • గనకాద్రిని రౌప్యశైలమున్
స్ఫురణకుఁదెచ్చువారి నిరు • బొట్టెలఁగాంచె దగన్ సుమిత్రయున్.

మానిని॥ నాలుగువేదములంబలె నొప్పిన • నల్వురుపుత్త్రులు సూక్ష్మమతిన్
జాలి సరస్వతికిం బయివారయి • చక్కటినాలవ వేదమొగిన్
దాశక లొంగిన శాత్రవుకైవడి • దాస్యముసేయఁగఁ బూర్ణ నిశా
పాలుఁడుపుట్ట ధ్వనించుచుఁ బొంగెడు • వార్ధులకైవడి వర్ధిలఁగాన్

సీ॥ ఒడిలోనె నిద్రించు • చుండెడు ఖడ్గంబు, గల మిథిలాధీశ! • తెలియ వినుము
కాన్కలతోఁ గూడఁ • కదఁగి రాజన్యులు, వచ్చిమ్రొక్కులిడఁగఁ • బాత్రమగుచు
వీరమద్దియలచే • వెలుగొందు పాద ప, ద్మంబు లొప్పారిన • దశరథేశు
కొడుకు లనెడు పేరొ • కొందు మాత్రమె యువ, నయనంబుగావించి • నయమునేర్పి

తే॥ శ్రుతులు చదివించి శాస్త్రసం • తతులఁదెలిపి, యెల్ల కర్జంబు లెల్లప్పు • డెల్లవిధుల
జరపిపోషించి నాతఁడు • గురుతపస్వి, చూశిబ్రహ్మనిభుఁడు వసి • ష్ఠుండె చుమ్మ.

ఉ॥ ఏనొనరించు జన్నము స • హింపక పాడొనరించు క్రూరులన్
బూనికతో వధించు తలఁ • పుం గొని యీసుకుమార పాదులన్
దోనదపించుకొంచు గుణ • తోయధి! నావనమందు చేరితిన్
బూనితిఁ బూనిపూనకయె • ముందుగఁ దాటక మమ్మ దార్కొనెన్

చ॥ జడనిధిఁబోలు రాఘవుని • శౌర్యము సుస్థిర శీల మందమై
పొదవగు దోర్యుగంబు బల • మున్ గనఁ జాలెదుగాకఁ యమ్మొకం
డదరుచు మండుకన్నుగవ • నార్చెదు తాటకతొమ్మఁదొల్చి వెన్
దొదరి మహీధ్రముల్ తరులు • దొల్చుచుఁ దూతెను భూమిలోపలన్.

చ॥ ఎఱుపగు మిన్ను తన్నెయయి • మేరుపుఁబోలిన కేశమూర్ధముల్
గుజికొని గుప్పతిప్పలుగఁ • గూలె నొకమ్మనఁ గాలుప్రోలికిన్
బఱచె సుబాహు, వింకొకఁడు • పడ్డసలం బె యెఱుంగ వేలిమిం
గొఱఁతలులేక చేసికొని • కూరిమితో నిటకేగుదెంచితిన్.

చ॥ నృపవర! బ్రహ్మయేనెఱుఁగ • నేరని రాము మహత్త్వ సత్త్వమీ
విపుడె గ్రహించితుగాక! జగ • మెల్లను కాలిచి బాధిసేయు నే
రుపుఁగలతూపులన్ మునుపు • రూఢతపంబునఁ బొందియిచ్చు నేఁ
డ్రపగొన నయ్యవీతనికి • దాస్యముచేయుచునుండె నిచ్చలున్.

ఉ॥ ఈతని వీరమద్దెలు వ • హించిన పాదసరోజధూళియే
గౌతముపత్నికిన్ మొదలి • కాంతిని రూపము నిచ్చెఁ బ్రేమ సం
గాతము మెండు ప్రాణముల • కంటెను రాముని యందు నాకు ను
ర్వీతలనాథః యంచతని • వృత్తము వీనుల విందుచేయఁగన్.

## 12. కార్ముకపటలము. (52)

చ॥ ఉరుతర చిత్ర కార్ముకము • నుంకువ చేయుటచేఁ దలంపు పెం
పొరయ ఫలింప కుండఁగ మ • తొండు వచింపఁగ నేమి యుండు? నీ
వరగుణుఁ డీశు చాపమును • వారక యెక్కిడి లాగెనేని నా
వరము ఫలించు జానకి త • పంబు ఫలంబు కరంబు నింబగుకా.

శివధనువును గని పలువురు పలువిధములఁ దలఁచుట

క॥ అనిపలికి మునియు నీకొన • జనకుఁడు తన భటులఁగాంచి • శంకరు ధనువున్
గొని తెండు వేగ పొండన • ధను ర్గృహము చొచ్చివారు • దానిం గనుచున్,

చ॥ కలభముఁ బోలు దొడ్డ దృఢ • కాయులు కొండలఁ బోలు బాహువుల్
వెలి మెలి వడ్డ వా రయిదు • వేల జనంబులు మధ్య మధ్య దం
డెల నెలకొల్పి క్రిందుగ వ • డిన్ భుజ మూర్ధము లాన్చి మోచి పా
టల గతి తప్ప కడ్గులు త • డంబడకుండగఁ దెచ్చుచుండఁగన్.

సీ॥ విపులయౌ ధర తన • వీఁపు నొప్పిని మాన, మేరువు లజ్జను • మించి పూన
వచ్చుచుండఁగ వార్ధి • వంటి విశాలమౌ, పురమున జనులు గుం • పులుగఁ గూడి
కలకలమంచు లో • కంబున వారలుచోటు లేదన వచ్చి • చొచ్చి చూచి
శంఖ చక్రమ్ములు • జానుగఁ దాలిచి, మగ సింగముం బోలు • మాధవుండు

తే॥ గాక వేతెవ్వరీ వింటిఁ • దాఁకు వారుః, నేఁడు రాముఁడీ ధనువు గు • ణీకృతంబు
చేసెనేని శుభాంతమై • సీతపెండ్లి, పొనరు నని యొక రొకరితో • ననెడివారు

సీ॥ కార్ముకం బనుటెల్లఁ • గైతవమే యగుఁ, గనకపర్వత మిది • యనెడివారు
ధాత చేతుల తోడఁ • దాఁకి చేయఁగలేదు, ఘన తపోబలముచే • ననెడివారు
మును దీని నెక్కిడి • తన కుపయోగించు, కొనినవాఁ డెట్టిఁడో • యనెడువారు
మేరువునే యిట్లు • మెదిపి చేసిరొ వార్ధి, మునుచిల్కు కొండయో • యనెడువారు.

తే॥ చిలువఱేఁ డిది యంచు వ • చించువారు; వారిదమునుండి యింద్ర చా • పంబు జారి
పడెనొ మేదిని పయి నని • పలుకువారు, పడుచు చూచెనే యిదియని • నొడువువారు.

సీ॥ పెను వింటి నిటకుఁ దె • ప్పింపుఁ డనుచుఁ బ్రభుఁ, డాజ్ఞ యెందులకిచ్చె • ననెడివారు
మఱి చెడి వచ్చిన • మన్నీం ద్రెవం డ్రే , కలరె యింవని వగఁ • బలుకువారు

పూర్వ తపఃఫలం • బున నైన నొకవేళ, కూడదో? యనుచు వా • క్రుచ్చువారు
ఏత ద్ధనుర్విము • క్తేషువునకు లక్ష్య, మై యమరున దేదొ • యనెడువారు

తే॥ సీత పెండ్లి కై దీనిని • చేసిరనుచుఁ, జక్రిఁ బోలిన రాముఁడు • చారు తనుఁడు
పీఁగ కెక్కిఁడునే యని • విధివిధించు, చెడుగులిట్టివే యని జనుల్ • నొడువుచుండ

తే॥ భటులు హరువిల్లుగొనిపోయి • ప్రభునియెదుటఁ, బుడమి వీఁపు నెటుక్కున • నడఁగి పల్ల
మడర నుంచి రా చాపంబు • నరసి నృపులు, తెచ్చిరే యని కేలు వి • దిర్చి కొనిరి.

చ॥ కలభముఁ బోలు రాఘవుని • కాయము నందము గాంచి వేదనన్
గొలిపెడు వింటిఁ గాంచి తన • కూఁతు నదృష్ట మెదందఁ గాంచు రా
ట్తిలకునిగాంచి గౌతమ జ • టి ప్రభు పుత్త్రిఁడు మండపంబునం
గల నృపరాజిఁ గాంచి నయ • గారపుఁ బల్కుల మించి యిట్లనున్.

సీ॥ మేరువు విల్లుగా • మెఱయు శంభుఁడు తన, సామేన వసియించు • సతికిఁ దండ్రి
యవమతి యొనరించె • నను కారణమున ను, ప్పొంగి లేచెడు కిన్కఁ • బూని యప్పు
డీ విల్లు గొని వెస • నేగి దక్షుని యాగ, శాలఁ జేరంగ న • చ్చటఁ గలట్టి
కొందఱ పండ్లూడె • గొందఱ కరములు, విఱిగె వేలుపులును • విచ్చి పాఱి

తే॥ పోవరానిచోటుల కెల్లఁ • బోయి డాఁగి, రగ్నులనశించె ముక్కంటి • యలుకతొలఁగఁ
దనదు విల్లిచ్చె నీవంశ • మున జనించు, దేవరాతున కమ్మహా • దేవుఁడపుడు

తే॥ నేను శివ ధనుర్బలము వ • ర్ణింప వలెనె?, చంద్రమౌళిఁ బోలిన ముని • చంద్ర! నీవ
తెలియఁ దగు వాఁడ వింక నీ • కలికి సీత, జనన వృత్తాంతమును విను • సాంగముగను

## సీ త వృ త్తాం త ము.

సీ॥ ఇనుముఁ బోలిన దీర్ఘ • శృంగముల్ బలితంపు, టఱ్ఱులు గలకోడె • లమరఁ బూన్చి
బంగారు మడకకు • వజ్రంపుఁగఱ్ఱును, రత్నాల నొగయును • రంజిలంగ
స్ఫటికంపుఁ గాఁడి యొ • ప్పఁగఁ గూర్చి జన్నంబు, నకు సమసఱుపంగ • నొకపొలంబు
మును దున్నఁగాఁ గఱ్ఱు • మొననుండి బాలభా, స్కరుఁ బోలు కాంతులు • గలిగిభూమి

తే॥ దేవి వెలువడె నన నొప్పి • తేజరిల్లి, పాల కడలిలో సుధతోడఁ • దేలినట్టి
సిరియు దీనయ్యె యెదుఁగు మే • ల్చెలువు గలుగు, కలుకులకు రాణి యీ సీత • గానిపించె

సీ॥ రమణి గుణంబుల • రమణ యేమన నగు•! నవియ తమంతఁ ద • న్వంగిఁ జేరి
మేలుపడఁగఁగోరి • మీఁదుమీఁదుగఁ ద్రోచి, కొనివచ్చియొండొండు • పెనఁగుచుండుఁ
జెలువు నెలవు గోరి • బలు తపంబొనరించి, పూఁబోఁడి నెమ్మేని • బొందినయది
బటువు కమ్మల కొమ్మ • ప్రభవించినది మొదల్, మిగిలిన మగువలు • మేల్మి తఱిఁగి

తే॥ వేల్పుచే బుప్పరమునుండి • పృధివిఁజేరఁ, దక్కు నదులెల్లఁ బెంపునఁ • దఱిఁగినట్టు
లైరనఁగఁ జాలదే యెక్కు • వైతి యగునె, మౌని నక్షత్రగణరాజ! మహిత తేజ!

తే॥ విమల కర్తవ్య విజ్ఞత • విధి కృతంబు, వేఱుగా నుండ లక్ష్మిని • వేల్పులెల్లఁ
గోరినట్లు సీతను నృపుల్ • గోరినారు, దీనిఁ బోలిన చిత్రమెం• దేని గలదె?

చ॥ గురు మద దంతిఁబోల్ నృపులు • ఘోషముఁగొల్పు చమూ సముద్రులై
యురవడి వచ్చి పెండ్లి పలు • కొప్పుగఁ బల్కిన యెల్లవారి కీ
సరణి వచించి నార మల • శర్వుఁడు పోరున నెత్తు వింటి నే
పురుషుఁడు వంచువాఁ డతఁడె • పో వరుఁ డయ్యెడు సీత కియ్యెడన్.

ఉ॥ శాప శరంబుచే జగముఁ • జక్కఁగఁ జేయ వలంతి యైన యో
తాపసవర్య! యీధనువుఁ • దాఁకఁగ లేక ప్రసూన సాయకం
బోపఁగలేక పర్వత స • మున్నత చాపముతోడ వచ్చు సీ
తా పరిశుద్ధ మూర్తిఁ గని • తత్పరతన్ నృపరాజి పోరఁగన్.

తే॥ అలరుకీర్తిఁ గోరుసుదారు • కలిమి పోల్కి. జనకు సైన్యంబు తఱిఁగియుఁ • బెనుపుమిగిలె
భ్రమరయుతసుమవేణిపై • భ్రమవహించు, ప్రభుల సైన్యంబుతమ యాస • వలెనెవిఱిగె

చ॥ విమల పథాను వర్తులగు • వేల్పులు సత్త్వవరిష్ఠుఁ డుగ్ర చా
పము తన పట్టి కుంకువగఁ • బల్కుటచే నగు పోరఁ గ్రుంగుచుం
ట మదిఁ దలంచి సేనల రు • టంబుగ నంపుట గాంచి రేయి ఘూ
కముఁ గని పాఱు కాకముల • కై వడిఁ బాఱిరి సేనతో నరుల్.

ఉ॥ అప్పటినుండి నేఁటివఱ • కప్పుడు పాఱిన వారలేని వే
ఱెప్పుడమీఱులేనియు ను • మేశుని చాపము డాసినారు కా
రెప్పటికేని పెండ్లి యగు • టేర్పడదా? యని యుంటి మీతఁ డిం
పొప్పఁగ నెక్కు వెట్టిన న • హో విత చెందదు సీత యందముల్.

ఉ॥ అమ్మని పల్కువార్త మది • నారసి కెంజడ లారఁ గౌశికుం
డిమ్మగ మూర్ధ మూఁచి యని • కేత్తెఱఁ బూనెడు కోడె మాడ్కి బీ
రమ్మునఁ గానవచ్చు రఘు రాముని మోమును గాంచెఁ జిత్ర రూ
పమ్మను బోలు మేను గల • పార్థివ పుత్త్రుఁడు గాంచె సింగిణిన్.

## రాముఁడు శివధనువు కడ కేగుట.

తే॥ నేయి పోయఁగ నట నుండి • నింగి నంటఁ, బొంగి లేచెడు జ్వలితాగ్నిఁ • బోలె లేచె
విఱిగె హర ధను వని వేల్పు • లఱచినారు, విజితకామాది రిపులు దీ • వించినారు.

తే॥ విమల సత్త్వబోధనునిచేఁ • బ్రేరితుఁ డగు, రాముఁ డా వింటినారిఁగూ • ర్పంగమున్నె
సుందరుల మనముల నేయ • సూన బాణుఁ, డెక్కు వెట్టెను పూన్కిమైఁ • బెక్కువిండ్లు

సీ॥ కనఁబడు పెనువిల్లు • కాలి బలిమిఁబోలు, నని యగ్గ లికఁ బల్కు • లాడువారు
సిగ్గరియౌ సీత • చెలువంపుఁ గెంగేలు, రాము కెంగేలుఁగూ • ర్పఁబడదేని
పుట్టువుల్ సఫలతఁ • బొందవనెడివారు, నినకులుఁ డిప్పు డె • క్కిడఁడయేని
అలివేణి సీతతో • నలఁత లేక మనము, నగ్నిఁ బ్రవేశింత • మనెడివారు

తే॥ దాతయౌ మిథిలేశుండు • సీత పెండ్లి, చేయఁ గోరుచోఁ గొను మని • యీయకుండ
భవుని విలు దెచ్చి యీపిన్న • వానిముందు, నునుచు టెంతయు సవివేక • మనెడివారు

తే॥ మునికి లజ్జ లేదనువారు • జనకుకంటెఁ, గ్రూరుఁ డొక్కఁడు లేఁడను • వారు రాముఁ
డీ ధనువు వంప లేఁడేని • యింతి జీవి, తంబు ధరణిపైఁ జాల వ్య • ర్థ మనువారు.

తే॥ నెమలి మైచాయ మగువ లీ • రమణఁ బలుక, సాధువులు వొంగ విబుధులు • సంతసింపఁ
బైఁడికొండ యేనుఁగు పెను • కోడె సిగ్గు, వడఁగ రామచంద్రుఁడు వింటి • కడకు నడచె.

తే॥ కనక కంకణములు సంకు • గాజు లొప్పి, పొంద నరుదైన రత్నంబుఁ • బోని సీత
మెడను వైవ నెత్తిన విరి • వద మనంగ, నెత్తె రాముఁడు మేరువు • నెనయు విల్లు.

ఉ॥ తోరపు విఘ్నముల్ సలుపు • తొంగలి ఱెప్పల వాల్పకే సభా
స్తారులు చూచుచుండినను • సభ్యుల నొక్కఁడునేని చాపమున్
వారక కాలఁద్రొక్కుటయు • నారి తగుల్చుటఁ గానరైరి చే
నారఁగఁ జూచి రంత విని • రారవ మా విలు తున్గి కూలుటల్.

చ॥ అమరు లజాండ గోళమెర • యంబున ప్రీలె నిఁకేరి మర్వు చొ
త్తమని వడంకినా రనఁగ • ధారణి వాసుల ఱీతు చెప్ప వ్య
ర్థమ యగుఁ దల్లిపేరువలె • ధాత్రిని మోయుచునున్న శేష నా
గము తన నెత్తిపైఁ బిడుగు • గాటముగాఁ బడె నంచుఁ బెల్కుఱెన్.

చ॥ గురు భయ దాసిచే జయముఁ • గొన్న విదేహ మహీశు పుణ్య మి
ప్పరుసునఁ బండె నంచు విరి • వాన సురల్ గురియించి రంబుధుల్
గురిసెను రత్నముల్ మిగుల ఘోషము సేయుచు నంబుదంబులున్
గురిసెఁ బసిండి వాన ముని • కూటము దీవన లిచ్చెఁ బ్రేమమై.

సీ॥ అమృతంబుకంటె నిం • పైన వివిధ వాద్య, ములునిండి యెల్లెడ • మ్రోఁగుచుండ
విరుల సరంబు లా • భరణముల్ చందన,మును గంధపొడియును • పునుఁగు కదలి
ముత్తెముల్ రత్నముల్ • పొన్నును సన్నని, వలువ లొండొరులపై • పైచికొనఁగ
నగరంబు పర్వంబు • నన్ వారిరాశి ఘో, షించుట వోలె ఘో • షించు చుండె

తే॥ మేఘములఁ గని పొంగు నె • మిళ్ళ మాడ్కి, నలరి తరుణులు మకర వీ ణలనుపూని
యులిపు తేనెలు గురియఁ గుం • దలములూఁగ, నగలుతళతళమెఱయంగ • నెగడిరపుఁ

ఉ॥ బమ్మెరఁగొల్ప నాసవము • పానము చేసినవారిఁ బోలె నే
త్రమ్ముల కెంపు గల్గు పని • తామణు లంగద నీఁగి భర్తలం
గ్రమ్మి కవుఁగిలించి రల • కంధి జలంబును ద్రావు మబ్బు నా
నిమ్ముగ వారుకొంచుఁ జని రెద్దడి • బీదలు రాజు ద్రవ్యమున్.

తే॥ వైణికులయు నట్టువయు • వైణుకులయు, మధుర గీతంబుఁలను చెవి • మాఁగ వినిన
దేవ మనుజ దేహము లొక్క • తీరుఁగాఁగఁ, జిత్ర సమముగ నిలిచె వి • చిత్ర గతిని.

ఉ॥ రామ ధను ర్విఖండన వి • రావము విన్న సుపర్వ భామినుల్
ప్రేమను తద్భుజంబులను • వీక్షణ సేయఁగఁ గోరి వచ్చి భూ
భామల రూప చేష్టలను • పాటల నాటల భిన్నతల్ గనం
గామిని కౌఁగిలించుకొని • కన్నుల నార్ప భ్రమించి రవ్వేలన్.

సీ॥ దశరథ పుత్త్రుఁ డి • తం డను వారును, కమలాక్షుఁ డనువారు • కారు మేఘ
మనువారు పువువంటి • తను వను వారును, మనుజుఁ డీతండు కాఁ • డనెడువారు
చౌఱుమీలు దిరుగాడు • వర కలశాబ్ధిలోఁ, బండు విష్ణుండని • పలుకు వారు
మనుజ దేహం దంట • మరులెపో యనువారు, నవని తపము చేసె • ననెడువారు

తే॥ మేని యందముఁ గనుఁగొన • మెలఁత కింక, వేయి గన్నులు వలయు న • బ్జాయతాక్షి
సౌరుఁగన నాతనికి నల్లె • వీరి నిటకుఁ, దెచ్చు మునికి మ్రొక్కుండని • తెలుపువారు.

తే॥ అతనిఁ గన్నట్లెయాతని • యనుజుఁ గాంచుఁ, దనుచు నుండ నచ్చట సీత • యవలఁజూడ
గోరు నాసచే నుసులులు • కొంత నిలువఁ, బొరలుచుండెను పరితాప • మునఁ బగంట.

## సీత చింతనము

సీ॥ ఉబ్బుఁత లూఁగెడు • నుసులులతో వసి, వాటిన పానుపు • వీడి చెలులు
ప్రమ్మిరాఁ బద్మాక • రము దరి స్ఫటిక హ, ర్మ్యంబున నెలతాల • యరుగుమీఁదఁ
బన్నీరు చల్లిన • పానుపుఁ జేరి యీ, తెఱఁగున ననుఁ దమ్మి • తీఁగలారా!
అబల కిటులు గల్గె • నని యెంచి దయయుంచి, తన మేనివన్నె ప • త్రములఁ జూప

తే॥ మ్లానతను వీడు చుంటిఁ బ • ల్లవముఁబోలు, నా యొదలి రంగు గొనిపోవు • నంటుకాని
కనుల రంగు మీ విరులచేఁ • గానఁ జేసి, నాదు ప్రాణముల్ దీయఁ బూ • నంగఁదగునె ?

సీ॥ తన భుజంబులఁ గాంచి • తా ఱి సిగ్గిలు మేరు, వును బోలు విలుదాల్చి • గొనముతదవు
దోస్తంభ యుగ్మంబు • తూణంబు వెన్నెల, పగిది జన్నిదమును • వైజయంతి

పోరలెడు వక్షంబు • మరలఁ గాంతునయేని, కాన నోపుదు నాదు • ప్రాణములను
గగన సంచారి యో • తొగల రాయని తోడ. మధుపముల్ రొద సేయు • మాలలుగల

తే॥ క్రొమ్ముడియుఁ గల్గి పెనువిల్లు గూడఁ దాల్చి, రెండుకన్నులు గల మబ్బొ • కండు నాదు
ప్రాణ జీవనముల ముంచి • త్రావివైచె. నది యెడఁద నిపుడున్న దె • ల్లపుడు నుండు

ఉ॥ తుంటరి మన్మధుండు నను • దూదిని గాల్చెడు నగ్నివోలె తొ
మ్మంటగ వేఁడి తూపుల ర • యంబునఁ గాల్పఁగఁ జంచలించు నా
వంటి సుకానికిన్ బ్రదుకు • పద్ధతి వచ్చి "భయంబు మాను నే
నుంటి" నటంచు దాపు గన • నొప్పని దెవ్విధి పౌరుషంబొకో?

మ॥ అడఁగంబాఱని యో పయోధరము లా • రా! పైపయిం బొంగి యి
వ్వడువై యేమి యొనర్చి నార లిఁక నే • పాటైన వే పొంది యె
క్కుడఁగా రాని ధనుస్సుఁ దాలిచిన ధా • త్రీశాను వక్షంబు నే
ర్పడ నాటం గయికూడు నేని తప మొ • ప్పం జేయుఁడీ వేఁడెదన్

చ॥ అదరును నామదిం గు య • నంగుఁడు వైచిన సాయకంబుచేఁ
బొడమిన చింత పర్విలుచుఁ • బోసె నురోజ యుగంబుపై విసం
బెడపక యీతఁ దెవ్వఁ డిటు • లేఁచెడు రాత్రులఁ బీడ సేయు చం
ద్రు డొ? నడుమం గలంకమును • తోఁపదు వీఁడెట నుండి వచ్చెనో?

మ॥ మనమా! భావజుఁ డెత్తి వచ్చి యెద దన్ • మాఁడించి నాటించు తూ
పను నంజెంతో కలంపఁ గ్రాఁగక యెటో • య్యాపై బయల్దేఱి న
ల్లని మత్తేభముఁ బోలు వాని పదముల్ • పట్టింపుగాఁ బట్టి యా
తని వెన్నాడిన ప్రాణముల్ మరలి వం • తం గుండ రా నేలొకో?

ఉ॥ మింటను తోఁచు పెన్మొగులు • మించులతో దిగి వచ్చె నన్న తీ
రొంటిన తొమ్మునన్ మెఱయ • నొప్పెడు ముప్పిరి నూలితోడ మా
యింటిని దాయు రాకొమరుఁ • డెవ్వఁ డటంచు బెఱుఁగంగ నైతినా
కంటఁ జరించు నప్పుడును • కారణ మేమొ యెఱుంగనయ్యెదన్

ఉ॥ పెక్కు లొసంగి దాత యని • పేరు వహించిన పాలవెల్లిలోఁ
జొక్కముగాఁ జనించి యొక • చో మఱి పుట్టని మందు పొందినన్
జిక్కిన హేమకుంభమును • చేకొనకుండెడు మూఢభంగినా
చక్కనివానిఁ జేవిడిచి • జాలిని పొందెద మాట లేటికిన్.

చ॥ మనసునఁ దూలి తూలి యిటు • మానిని కుందుచు వెచ్చ నూర్పుచున్
వసరుచు నుండఁ జల్లని స్వ • భావము నల్లని కన్ను లొప్పు బా

మిని యొక చేతి రాట్పటను • మేరు నిభంబగు విల్లు త్రుస్సటల్
గని తినలోని పేడ్కనద • కంబుగ నుంచ గలేక చెచ్చెరన్

— మాలిని యను సఖి సీతకు హర ధనుర్భంగ వృత్తాంతము తెలుపుట —

తే॥ కలువరింటి మాలిని యను • కాంత తనదు హారములు కుండలంబు లిం • ద్రాయుధంబు
వోలె వెలుఁగంగ • వస్త్రముల్ మాలికలును చెదర మెఱపుతీఁగియ వలెఁ • బరిపాతె

తే॥ మొగసి వచ్చి మైథిలి కట • మ్రొక్కకుండ, నలవి మీఱిన కుతుకాన • నాడుచుండ
నేమి హేతువే దీనికి • నెఱుఁగఁ బలుకు మనిన సీతకుఁ జెలి యిట్టు • లనియెఁ దుదకు

సీ॥ చతురంగ బలములు • చాలఁ గలుగువాఁడు, సర్వ విద్యావేది • చతుర గుణుఁడు
మొగులు నాఁ గురిసెడు • పొడవు చేతులవాఁడు, దశరథుఁ డనెడు భూ • దారవరుఁడు
త త్తనయుండు • మదను కంటె సుభగుండు, నీలమేఘచ్ఛాయ • నెగడు వాఁడు
వైకుంఠుఁ డనుశంక వదలనీయనివాఁడు శ్రీరాముఁ డనుపేరఁ • జెలఁగువాఁడు

తే॥ తమ్ముతోడఁ గౌశికుఁడను • తపసితోడ మనపురికి శివ ధనువును • గనఁగ వచ్చి
యమ్మునీంద్రు నానతిని చా • పమ్ము దాసి తేలికగ నెత్తె నాతఁడు • లీల మెయిని

చ॥ క్షణమున వింటి నొక్కకొనఁ • గాలను ద్రొక్కఁ జివుక్కుమంచు సిం
గిణి యటు లేవఁ బట్టికొని • కేలను ము న్నలవాటుపడ్డ దీ
త్రిణయను చాప మంచచటి • ప్రేక్షకు లాశఁగ నెక్కు వెట్టి త
ద్గుణమును లాగుడున్ విఱిగెఁ • దోరపుఁ జాపము ధాత్రి దద్దఱన్

చ॥ అనిమిషు లెల్ల రుం బొగడి • రాడిరి పూవులు చల్లినార లో
జనకజ! యంచుఁ బల్కు విని • సన్నని వెంబడు మేఘమంచుఁ దొ
ల్త నెవలఁ బంకజాక్షిఁ దనఁ • దాపముఁ గూర్చిన వాఁడె యంచుఁ గా
మిని మది శంక వీడెఁ జెగె • మేఖలయున్ జఘనంబు లుబ్బ గన్

చ॥ కలదని లేదటంచుఁ బలు • కం దగు కౌనును గోమలంబులై
బలియు పిఱుందులుం గలుగు • బంధుర దేహము బూరటిల్ల నా
లలనయుఁ జేటి చెప్పిన వి • లక్షణముల్ గమనించి నిక్కమా
లలితుఁడె కానిచో నసువు • లం దొలగించెద నంచు నెంచుచున్

తే॥ జానకి తపించుచుండ నా • జనకరాజు వేల్పు శిల్పి నిర్మించిన • విల్లు విఱుగు
నులివు విని మేర మీఱిన • యుబ్బు గలిగి కౌశికునితోడ నొక్కవా • క్యంబు పలికె.

ఉ॥ ఓమునివర్య! ప్రేమ చిగు • రొత్తఁగ నీ వెనువెంట వచ్చు శ్రీ
రాముని పెండ్లి యిప్పుడె త్వ • రన్ నెఱవేర్చుట మీకు నిష్టమా?

యీ మహిఁ జాటి యా దశర • థేశునకున్ వినిపించి యందఱున్
బ్రేమను గూడి చేయుదమ? • పే వివరింపవె యన్న నాతఁడున్

తే॥ దశరథుఁడు వచ్చి చేరుట • తగు నటంచుఁ, దెలుప జనకుండు నానంద • జలధి మునిఁగి
నడచు వృత్తాంత మెల్లఁ దె • ల్పుఁడి యటంచు, దూతలం బంపె శుభలేఖ • తోడనపుడు

13 ప్రయాణ పటలము. 78

చ॥ పతిఁ జనఁజాలు దూతలును • పాద బలంబున గాలి పోలికన్
నడచి మృదంగ కాహళ ని • నాదము రెచ్చు నయోధ్యఁ జేరి య
ప్పుడమి నృపాలు దర్శనము • పొందక రాణ్మకుటంబు లెల్ల రా
పిడి పడుచుండు తన్నగరి • వీధులఁ గాంచుచుఁ బోయి యయ్యెడన్

చ॥ ధరణిపు నాజ్ఞ నొంది యుచి • తం బగు రీతిని లోనఁ జొచ్చి భూ
వరు పద వారిజంబులకు • వారని భక్తిని మ్రొక్కి రాజశే
ఖర! భవదీయ పుత్త్రకులు • కౌశికు వెంటను బోవు టాదిగా
జరిగిన వృత్త మిద్ది యని • సంతస మారఁగఁ బల్కి యవ్వలన్

తే॥ అమిత సుగుణ భూషణ! యిది • యదియ యనుచుఁ
జదువ నియమింపఁబడిన వి • ద్వ దవతంసు
చేతి కొసఁగంగ లేఖఁ బు • చ్చికొని యతఁడు
చదివె నెల్లరు విన రాజు • ముదల నొంది

ఉ॥ వీనుల నగ్ర పుత్త్రవిలు • విద్దె సమర్థత యన్ సుధారసం
బానిన యంత రాజునకు • నంగదముల్ వదనంబు విచ్చి బీఁ
టూని ధరిత్రి వ్రాలు క్రియ • నున్నత వజ్ర భుజంబు లుబ్బె ము
న్నూనిన యాగ సత్ఫలము • పూర్తి భుజించు తెఱంగు దోఁపఁగన్

తే॥ ఖండపరశువు దక్షయా • గంబు వేళ, నేడు లోకాల వారి జ • యించినట్టి
బలితపు న్విల్లు రాముచే • భగ్నమైన ధ్వనియకా నెంతు మన మప్డు • వినిన రవము.

తే॥ ఎప్పు డెప్పు డెట్టెట్టుల • నెసఁగె ననుచు, నడుగుచుండు వసిష్ఠాదు • లరయఁ బలుకు
దూతలకుఁ గయికొండని • దోర్బలుండు, నగలు నుడుపులు మఱీ మఱీ • తగ నొసఁగె

చ॥ మునుపటి సూర్య వంశజుల • పుణ్యఫలంబునఁ బుట్టినట్టి య
మ్మనసిజమూర్తి యున్న పురి • మార్గముఁ బట్టి దళంబు రాజులున్
మను నడవుండు బంధు హిత • ముఖ్యుల రండని యేన్గు నెక్కి ప
త్తనమునఁ జాటఁ జేయుఁడని • ధారణీ నాథుఁ డనుజ్ఞ చేయఁగన్

చ॥ జగముల నెల్లఁ గొల్వ మును • చక్రి త్రివిక్రముఁ డైనవేళ నీ
జగతికిఁ దద్విధం బరయ • శంభుఁడు దెల్పిన యట్లు వారువం
పు గమి కదళ్ళ గల్గు పుర • భూమి సుధాంబుధి చుట్టి వార లే
నుఁగుల పయి న్నగారుల ధ్వజముల్ చెలఁగన్ పడిఁ దాటి రంతటన్.

క॥ చాటింపు వినక మున్నే, పాటించి కుమారపతి, ప్ర • భంజనుఁడు పడిన్
దాటించిన జలనిధి విధ, తాటం బగునట్లు పురము • తడఁబడఁ దిరిగెన్.

తే॥ అవనిఁ జోటు రవంతలే • దనగఁ నిండి, వృషభ గంభీర యానుని • వీర సమితి
విలయ వాయువు వీవఁగా • జలధికలఁగి, పొంగి పొరలిన చందానఁ • బొలిచి నడచె

తే॥ జగము చిన్నదె యనఁదగి • స్యందనములు, వెలిఁగెఁ బ్రభలచే భానులఁ • గెలువ బోలె
రత్నముఖ పట కాంతి ద్వి • రద చయంబు, వెలసె నింద్ర ధనుర్యుక్త • జలద భాతి.

ఉ॥ అంచలు పాలవంటి తమ • యచ్చపు టెక్కెల విచ్చి విన్ను పై
నించిన చందమై విరిసి • నిండెను కాఁడలతోడి చుట్టువుల్
మించిన కేతనావళియు • మిన్ను సమస్తము చర్మ మొల్వఁ గా
న్పించిన సంచునన్ వెలసి • నిండె నభస్స్థల మెల్లఁ బర్వమున్.

తే॥ దానధారలు గాఱు మా • తంగములను, కడలి యని యెంచి యెల్లెడఁ • గప్పి నీరు
త్రావ దిగు శరన్మేఘ సం • తతులఁ బోలెఁ, బరవి చలియించెఁ దెల్లని • ధ్వజపటములు.

చ॥ తొడుగులు దాల్చియుండునెడ • దోరని వెన్నెల గాయు వెన్నెలల్
గొడుగుల నీడలం జెలఁచి • గుబ్బటిల్లున్ మఱి యభ్రి మేఘపుం
బెడఁగు చెడంగఁ బై విరిసి • పేరిమి నెల్లెడ నిండు, మబ్బులన్
విడివడి పోవ దుందుభుల • భీకర రావము మిఱి మ్రోఁగెడున్.

చ॥ గరితల మోచికొంచు జను • గజ్జెల గుజ్జము లంచపిండులన్
వెరవున మోచు నాపగల • విన్నను పొందుఁ; బసిండి సొమ్ములన్
బిరుసు కుచంబు లల్లికల • వేణులు గల్గిన స్త్రీలు మించనన్
ఎఱలఁగ వారి మోచు మద • వారణముల్ జలదాళి నాఁ జనున్.

తే॥ పడుచు లేచుచు నిఱుకుట • వలన రాలు, సఖుల వక్షోజ కుంకుమ • సంకుమదము
యువకు లలఁదిన చందన • మొరసి రాలి, నడచు త్రోవయు మెత్తని • పడకఁ బోలె.

చ॥ మృదు మధురోక్తు లొప్పెసఁగు • మెత్తల పైఁటలలో మఱింగి క్రొ
వ్విదమయి మిత్తిఁ బోలెఁ జెడు • వేదనఁగూర్చెడు చన్నుదోయిపైఁ
బొచలెడు తారహారములు • పొల్పుగ వెన్నెల గాయుఁ రత్నముల్
పొదిఁగిన భూషణంబులు స • మున్నతి వీచును లేఁత యెండలన్.

ఉ॥ దోసములేని మానిసులు • దొడ్డ భుజంబులు గల్గువారు సం
వాసిలు క్రొమ్మెడుల్ గలుగు • వారలు ధన్వులు ఖడ్గధారులై
భాసిలు రాట్కుమారకులు • భార్యల వెంబడిఁ బోవుచుండ్రి సం
తోసము తోడుతం బిడుల • తోఁ జను గంధ గజాళి కై వడిన్.

చ॥ మలసిన తావి క్రొవ్విరులు • మబ్బులలో ధరియించినట్లు కొ
ప్పులఁ దగిలించు కామినుల • ముద్దుల మోములు కానవచ్చుటన్
బెలుచనఁ బూర్ణ చంద్రములు • పెక్కురు వోవు విమానసంఘముం
బలెఁ జెలు వెక్కు పల్లకులు • భాసిలువలనఁ బోయె నత్తఱిన్.

చ॥ పరవి మదంబు కాఱ నొగు • పంకమునం గయిసేఁత గల్గి పెన్
ద్విరదము లంబుధిం బరె రు • తిం బొసరించెడు నాసికాగ్రముల్
పరఁగు కరంబు లెత్తికొని • పట్టుగఁ బోవుట చూడ నొప్పె ది
క్కరుల మదంబుచే నెదురఁ • గా జతసంబునఁ బోవు కై వడిన్.

ఉ॥ పింబెడి కింకిణీ రుతికి • బ్రావ పడన్ లయ దప్పకుండఁ బా
దంబులు వైచుచున్ ధరణిఁ • దాఁకియుఁ దా కక రోవెలంది చి
త్రంబు గతిన్ సుపర్వుల వి • ధంబున మింటన వోవుచుండె వా
ర్వంబులు గ్రద్దనన్ గనిన • వారలు దేవ హయంబులో యనన్.

తే॥ ప్రణయకోపంబుగల ప్రియ • రమణు లొకటఁ, జూచిచూడక బొమముడి • చూపువిడక
యూర్చుచలరులు క్రొవ్వేద • నుంచుకొనక, ప్రియులయుసుఋలెయనడాసి • వెలలుచుండ్రి

మ॥ ఝర సంకాశ మదప్రవాహ తటముల్ • సద్య స్సృణీ నామ సం
స్మరణామర్షకముల్ మదావళ తతుల్ • స్పర్ధిత్వ చింతారతిన్
దరులన్ మోది మహా తరూత్కరములన్ • దాటించుచున్ గూల్చుచున్
విఱుగం ద్రోయుచుఁ బోవుచుండెఁ దటినీ • వేగోద్ధుర ప్రక్రియన్

చ॥ అనదల కూతఁయో నినకు • లాఢ్యుఁడు కాలు గదల్పఁ దంతలో
నన నువుగింజ వైవ ధువ • నంబునఁ జోటు గనంగ లేనహో
మునుచను సైన్యమందు గల • ముందఱి భాగము పోయి చేరె నా
జనకుని కేతనాంచిత వి • శాల విదేహ పురంబు చేరుపన్.

తే॥ పలు వగల నలంకృతమ్మై • పెలయు బండ్లు, చూచు వారల మనముఁ • జూఱలాడు
నీలవేణుల ముఖముల • లీలచేత, నడచు చెంపమ్మి కొలఁకులు • నాఁగ నొప్పె

తే॥ శకట మెక్కిన యొక బోటి • చనపు వలన, వెంటఁబడు సంటుకానిఁ గ్రీఁ • గంటఁ జూ
నా కటాక్షంబునంచలి • యంజనంబె, యతని కమృతంబు వోలె సౌ • ఖ్యంబుఁ గూర్చె

కం॥ హరిణాక్షిం బెదరంబాసిన, తరుణిం దోకం దేగుచుండు • దారిం బద్మా
కరమున పేర్కం దిరిగెడి, పవటా మిధునమ్ముం గాంచి • వనటం బడియెన్

క॥ చిందములు భేరు లద్దము. చందమ్మన నులియ భేరయు • చామరములచే
తం దెలి గొడుగులచేతన్. మందాకినిం బోలె దండు • మలసిన తలముల్

కం॥ ఇంపు పలు కాదు వారు ని. లింప సతులం బోలు వారు • లికుచ కుచలు చూ
పంపలుం బురుషుల యెద నొ, ప్పింపంగ నది సమరభూమి • విధమై తోంచెన్.

తే॥ నెరసె స్తంభంబులంబోలు • నెటి భుజములు, మెఱసె నాయుధ కాంతులు • మెఱపులట్లు
విరిసెం బాప సంతతులు తా • మరల కరణి, బెరసెం గాల్బల మచటం గే • సరులపరణి

కం॥ చెలువ పయోధరములపైం, గొలిపిన కను లల్లె యుండ • గ్రుడ్డియ పోలెన్
జెలువుం దొరండు చని చని యొక, కలభము డీకొనియె జనులు • కలకల నవ్వన్.

క॥ ఎర జారి తురంగ ముకటం, గెరలి పఱవ నిలువలేక • క్రిందం బడెడు తా
మరసాక్షి నొరయు చేతుల, ధర దింపక బెదర కనుచుం దడవుచు నిలిచెన్.

తే॥ పద్మ యుగళంబు నొవ్వ వెం • బడిన వచ్చి, కంటి తూపుల నొప్పించు • కలువకంటిం
గూర్చి పీన సుందర కుచ • కుంభిం గట్టం, దనకుం దగిన స్థలంబు లే • దనియె నొకండు

తే॥ తుఱుముక్రొమ్ముదిమధుపంబు • లటుచుండ, నడకమదపుటేనుంగుబోలు • నంటొకండు
వనితకన్నులంగనిబాల • వాండిగలవి, యనుచుం దన యీంటె నొకకంటం • గనుచునుండె.

చ॥ అలలను బోలు వంకరలు • నందము దీర్ఘములైన కేశముల్
జలజముం బోలు పాదములు • జాణగంగుంతముం బోలు చూపులున్
గిర చెలిం గాంచి యొక్కరుండు • కమ్ర పయోధరలార! మీరు మీ
యులిసెడు కౌనులన్ మఱచి • యుంచితి రెచ్చటం జెప్పరే యనెన్.

తే॥ తీక్ష్ణ దృష్టులం ఎక్కువా • తెఱం గదల్చి, పలుక కేగెడి షడంతితోం • బలుకు నొకరుం
డింతి! బిగి యుంచ యున్న ని న్నేటిసీటం, జేతులం బట్టి దాంటించు • శీలి యెవండో?

తే॥ దింపంగా రాని బరువు నె • త్తికొని పోవు, నొంటె యింపగు చివుళులం • దింట వీడి
వేంప ముప్పుగు వానిని • వెదక సాగెం, బాలు విడిచి కల్తాగ్రివు న • ప్రాజ్ఞు సట్లు.

తే॥ ఎట్టని రసులు నల్లని • యిరులం బోలు, మేను లొప్ప బర్బరులు స • మ్మెటలు పాఱు
లూని క్రోపలుసమముచే • యుచునుమూంపు, లందుగావళ్ళ మోయుచు • నరుగుచుండ్రి.

తే॥ పిచ్చి పట్టిన యేను గు • పెనంగి కరిణి, పైని తుండ మూనంగ దాని • పైని తరుణు
లదరి రసు మూయం జేతుల • కణంగకుంట, మనసు క్రుంగ దుఃఖంబున • మఱింగిరపుడు

తే॥ రత్నమేఖలా యుతలైన • రమణులకెదం, జారుసద్య దుత్ఫుల్లకం • బవనమందు
కమరములమీంది గోందురు • కప్ప లనగం, హస్తినులపైన కుఱుచవాం • డ్రరిగినారు

తే॥ మద గజము వెంబడింపంగ • మావొకండు, పాదములు వంచి పవన జ • వంబుతోడఁ
బాఱుచుంటఁ జూడఁగ నీమె • పాకవైరి కర్ణురాలని కొనిపోవు • నట్లు దోఁచె

తే॥ తండ్రి శ్రీరామునే శివ • ధనువు దునిఁగె ననుచుజనులాడవినిన తో • యలులు పరుగు
లిడిరి జడల విరులురాల • ముడుచుకొనక తెగిన మొలనూలుచిందఁగాఁ • దెలిసికొనక

తే॥ కుండికలు గొడుగులు చేతఁ • గూర్చి పట్టి ముక్కుమూసిన వ్రేళ్ళపై • మొగిడియుండఁ
గరుఁతోఁ గామినులతోడ • జరుగ నిష్ట పడని మునివరుల్ మెల్లన • నడచినారు

తే॥ తావి పూవులు తుఱిమిన • తరుణులు తమ కనుల నశ్రువు లురల న • ల్కఁ గొనిచన్న
ప్రియులు గానరా వచ్చుట • వేడ్కయేని వచ్చి తేరెక్కఁడని సన్న • లిచ్చువారు

తే॥ అంగమైన శతాంగ మా • తంగముల తు రంగముల మురజాదుల • రావ మెల్ల
యెదల నిండి పర్వఁగ నట • నెవ్వరేది నుడువ వినలేక మూఁకయై • నడచె జనము

తే॥ సాలె పురుగులు నేసిన • నూలు నేఁత, వంటి యన్నని వలువలఁ • బడఁతు లుడిచి
యందుకారావములతోడ • నరుగుతుటుము కలకలంగూయు పులుఁగుఁ • గొలఁకుఁబోలె

క॥ కెరటములు తెరలు కలశాం బురాశి జనియించు లక్ష్మిఁ • బోలు మృగాక్షుల్
తేఁటీఁనుండి చూడఁగఁ బురుషుల కను లుల్లసిల్లి • పొలుపుగ నార్చున్

క॥ నెఱఁకులఁ దాఁకఁగ నాసెడు కఱి కన్నుల సకుల యందు • కంబులు మంద్ర
స్వరము ధ్వనించుం దోడుగ ఖురవుల సకిలింత లొప్పు • ఘన గర్జ లలిన్

క॥ ధర పులకరింప నరిగెడు తరుణుల కాంతి గల మోము • దమ్ములు నిందిం
దిరము లనఁ బ్రియుల చూడుకు లిరవుకొనియెఁ గాఁచి సురుఁడు • నెద ముదమందన్

తే॥ అగపడని కౌను పగడంబు • పసిడి నోరు [illegible] వంటి పలుకులు • గలుగుచెలుల
కోల యెలనీటికాయలఁ • బోలు చనుల నుం[illegible]రాలు గందవొడియె • యుర్వినెఱసె

క॥ తలఁపె నరుదైన చిత్రం బులు గల యరదములనెక్కి • పురుషులు స్త్రీలున్
బలువురు దారి నెరసి పే రులిపునఁ జనుదెంచుచుండి • రొప్పారంగన్

తే॥ వారువంబులు తేరులు • వీరపరులు నేల నదవఁగ నెగసిన • ధూళి నెరసి
మొగులునీరు వెల్వడు ధ్వార • ములనుగప్పె గప్పె దిగ్గజ దాన మా • ర్గములఁగూడ

సీ॥ కాలియందెలు ఘల్లు • ఘల్లున నద తెంచు చిలుకల కొలుకుఁ • జెలువు గనుచు
డాలు దాలిచియున్న • దాకేల వాఁడియై తళ తళలాడు • కత్తుల ధరించి
రత్న కంకణములు • రాజిల్లు వలకేలఁ, దరుణులు మృదువుగాఁ • దవిలిపట్టి
మదగజ ధారల • పదనుచేఁ దడిసి పం, కంబైన యాత్రోవఁ • గడవలేక

తే॥ చేల యొక్కింత పైకొనఁ • గేలఁబట్టి, నడచుచుఁ తమవారి మెల్లన, నడపు కొనుచుఁ
బెండ్లి నడకల నప్పుడే • వేడ్కఁజూపు, కరణి జతలుగాఁ బురుషులు • కదలు చుండ్రి.

తే॥ పొలములందు మడుఁగులందు • కొలఁకులందు విఁయు రకరకములగు తా • మరల తొవలు
పదన కర నయనాదుల • పదురు చూపఁ, గోపి యిండని కొండబు • కోరినారు

ఉ॥ చూపుల కొప్పు గుజ్జముల • జోటులు దిగ్గునునుండి కుంజరం
బేపున దాపెనంచు నగ • లెల్లెడ రాలఁగఁ గేశపాశముల్
వీఁపున నేల వస్త్రములు • ప్రీలఁగఁ బ్రాణము మానమేఁచఁగా
దాపలి కేలఁ బట్టికొని • తాఁటిరి పాఱిరి కేకలంబలెన్.

చ॥ గొడుగులు నేనుఁగుల్ పికిలి • కుచ్చులుఁ డెక్కెపు గుంపు లొత్తుగం
దొదరికఁ బర్వి యెల్లయెడఁ • దోరపుఁ జీఁకటి నిండఁజేయఁగాఁ
దొదవుల నాయుధంబులను • దోఁచిన యూఱపు టెండ గాయ న
య్యెడ నొకవేళ యందొకట • నేర్పడె వింతగ రేయియుం బవల్.

తే॥ పచని కింజంబులందున్న • వాఁడియలుఁగు లెడఁదఁజొచ్చి యుచ్చునొలంగు • డెడగనను చ
దొలఁగ కేతెంచు కుంభ స్త • ములకుఁదొలఁగి, తాఱుదురు సూర్యతేజులౌ శూరవరులె.

సీ॥ తొలఁగ శక్యముకాని • త్రోవలో నిఱుకుచేఁ, జిక్కితునిఁగి ప్రకా • శించుచుండు
రత్నముల్ ముత్తెముల్ • రాలిగ్రుచ్చుకొని చా, లఁగ బాధపెట్టఁగ • లావములను
దాలిచి నట్టి సుం • దరుల పాదంబుల, యందెలు దురపిల్ల • నట్టు లులియఁ
దదఁబడి కోమలు • లడుగిడలేక యం, దంద నిలుచుచుండి • రవలఁబోక

తే॥ ఉత్కటంబుగ వాద్యంబు • లులియ నులికి, బండ్లమెడ్లు హానలుపాఱఁ • బరుగులిడుచు
భారములు పాశములు వీడి • పడుచునుండ, మౌనులంబోలె నవియు క్ర • మంబు నీఁగె.

చ॥ కొలఁకులగన్న యేనుఁగులు • కూరిమితో దిగి మావటీంద్ర యుం
దల గణియింప కంగనల • దంబగు గుబ్బలఁబోలు కుంభముల్
బలుపు రదంబులుం దెలియ • బాల సముద్రమునం జనించు నా
వెలిగవురుంబలె న్నిలిచె • వేతట మెక్కిక నీటిలోపలన్.

తే॥ సొరుమీఱిన గాయనీ • జనముతోడ, వైణికులు మావులెక్కి శ్రా • వ్యముగ మేఘ
రంజితంబు పాడుచు నను • రాగమెసఁగఁ, దరలి నారలు కిన్నర • దంపతు లన.

చ॥ నిమిరిన యంకుశంబునకు • నిష్ఠురశైలముఁబోలు నేనుఁగుల్
క్రమముతొలంగి పర్విడఁగఁ • గాతరులై జనముల్ తొలంగ నీ
లిమగల ఱెక్కలొప్పు మధు • లిట్టులు తత్సలినుండి లేచి స్త్రీ
ల ముడులఁ జేరి యొలఁ బిడు • లంబడి పోవుచునుండె వింతగన్.

## రాజపత్నుల ప్రయాణము.

ఉ॥ పున్నమ చందమామ తగఁ • బుట్టఁగ మ్రోఁగు సముద్రమట్టు లు
ద్యన్నయవాద్యముల్ మొరయ • దారి శతాంగ తురంగముల్ కరుల్
మున్నుగ నేగ రక్తకణ • ముల్ గల కుంతముఁ బోలు కన్నులో
ప్పన్నవలల్ చనంగ గరు • వంబున లేచిరి రాట్కళత్రముల్

తే॥ అరయ విరిదమ్మి కొలఁకున • హంసి యనఁగఁ, గైక వేవురు వెలయాండ్రు • గలిసికొలువ
వేల్పుటిల్లాండ్రు సిగ్గిల • వెడలసాగె, చెన్నుమీఱిన రత్నాల • శిబికనెక్కి.

సీ॥ కారణ రహితమై • కనులెఱ్ఱగల చెలుల్, కంచుకులును వేత్ర • కరులు గూడి
యాశ్వికులై నేల • నరుగువారయి తడఁ, బడు నొడువులుగల • వారలగుచుఁ
బట్టంపు దేవుల • పాదము ల్గొలుచుచు, వినయ ముట్టిపడఁగ • వెడలుచుండ
వేసడంబులనెక్కి • విరిబోండ్లు పలువురు, కొలిచిరాఁ గవల పి • ల్లలను గన్న

తే॥ యలసుమిత్ర కార్మొయిలున • వెలయు మెఱుపు, నాఁగ నీలముల్ చెక్కిన • నాణెమైన
శిబికయందు గూర్చుండి వి • శిష్టమైన, వీణగానంబు చెవులార • వినుచువెడలె.

తే॥ సప్తసాగర వేష్టిత జగతియందు, నవల లిఁకలే రనఁగఁజెలుల్ • నెమలి హంస
చిలుక గొరవంక ప్రతిమలు • చేధరించి, చామరలు వీచు చంచల • జరుగుచుండ్రి.

చ॥ తెలి రదనాళితోఁ గళలఁ • దేఱిన మోమును గాంచి చంద్రుఁడం
చెలమిని ఋషసంఘములు • సేవలు సేయఁగఁ జేరెనన్న చె
న్నలరిన రత్నసంఘటిత • మౌ శిబికన్ రఘురాముతల్లి వే
ల్పులు నుతియింపఁగా వెడలెఁ • బొల్పుగ గాణలు పాడుచుం జనన్.

తే॥ గూనుముట్టి కాళులవారు • కుఱుచవారు, మగువలెక్కిన తెల్లని • మావు లపుడు
హంసలం బోలి నడవఁగ • సలరుఁబోఁడు, లోలి నిరుదెసఁ బిడినడఁ • బోలి చనిరి.

తే॥ మొగ్గ చనుగుబ్బ లదరిన • ముగుద లజ్జనిలయకంచెను సుందరుల్ • నీటుగాఁగ
పలు వగల మణుల్ పొదిఁగిన • బండ్లనెక్కి, ప్రతిమలం బోలి కౌసల్య • బలసి చనిరి.

సీ॥ బ్రహ్మకే నొచ్చెంబు • పలుకఁజాలిన వారు, బహుళ శాస్త్రామృత • పాయులైన
వారు త్రివిష్టప • వాసులు జిహ్వాల, తోఁ గొను హవ్యముల్ • తుష్టిగాఁగఁ
జేతులతో మంత్ర • పూతంబుగా నిచ్చు, విప్రోత్తములు కొన్ని • వేలమంది
తనచుట్టుఁ గొలిచిరా • ముని పరివేష్టిత, బ్రహ్మ గౌరవమునఁ • బరిఢవిల్లి

తే॥ నెలవెలుఁగాయు గొడుగుల • నీడలోనఁ, గొటలు ముత్యాల శిబికలోఁ • గూరుచుండి
వేదపార రవంబులు • వేడ్కవినుచు, సతి యరుంధతితో వసి • ష్ఠముని కదలె

సీ॥ మెండొడ్డి పోరాడు • ఖండాల యూథముల్, వాయువేగంబొప్పు • వారువములు
దేవ విమాన దీ • ధితులొప్పు తేరులు, వీరమద్దెల దాల్చు • వీరవరులు
సాగరం బొకమహా • శైలంబుఁజుట్టిన, వడువునఁ దము చుట్టి • వచ్చుచుండ
జయలక్ష్మి నిలుచు వ • క్షంబులు గలవారు, దివ్యాంబకంబులు • దివ్యధనువు

తే॥ లమరు కరములుగలవార • లతిరథులగు, భరత శత్రుఘ్ను లమ్మని • వరు వసిష్ఠు
వెంటఁజనిరి విశ్వామిత్రు • వెంటఁజన్న, రామలక్ష్మణులంబోలు , రాణయొప్ప

సీ॥ ముత్యాల రత్నాల • భూషలొప్పిన రాజు, నిత్యకృత్యంబులు • నియతిఁదీర్చి
నారాయణునిపాద • నలినంబులకు మ్రొక్కి, విప్రోత్తములకు సం • ప్రీతితోడ
భూరి హిరణ్య గో • భూ రత్న దానమ్ము, లొనరించి భవ్యము • హూర్తమందు
బ్రాహ్మణుల్ రత్నకుం • భములఁజేఁదాల్చి ప్రాఁ, బలుకులు చదివి దీ • వన లొనర్చి

తే॥ గటికతో నీరుప్రోక్షింప • గరిమమ్రొక్కి, రత్నమేఖలల్ దాల్చిన • రమణులింపు
పల్కులను వంశగీతముల్ • పాడుచుండఁ, బ్రభుఁడు దశరథనృపమౌళి • బయలుదేఱె

సీ॥ మురజ శంఖాదులు • మ్రోఁగుచుండెడినంచుఁ, బ్రస్థాన భేరీ ర • వంబటంచు
భూజానివెడలెఁ గాఁ • బోలు నన్ వారలై, బలసిన రాజులు • ప్రబ్బివచ్చి
మముచూడలేదని • మముగాంచె నంచును, కుండలంబులు జాఱి • క్రుంగె ననుచు
నీఁకరాజుడాయుట • యెట్లొకోయనుచు నొం, డొరుఁ ద్రోసికొనుచు ముం • దరకు జరగి

తే॥ గెలుపు నొందిన ఖడ్గముల్ • వెలయుచుండు, భూపకరములన్ కెందమ్మి • మొగ్గలెల్ల
మొగుడ మణుల తేరెక్కియా • భూవిభుండు, ప్రభల రెండవయినుఁడునా • బయలువెడలె

తే॥ పైఁడిగాజుల చెలు లెక్కు • పసిఁడిగజ్జె, లులియు తేజులు చుట్టును • బలసికదల
జలజములు వికసించిన • జలధియలల, తోడఁగదలిన చందంబు • దోఁచెనపుడు

తే॥ దుమ్ము మినుదాఁకె దిక్కులఁ • దూఱిమూసెఁ, గన్నులగపడకుండఁగఁ • గ్రమ్మె నంతఁ
బొక సాగరవైరంబు • పూనె ననఁగ, కడలిలోఁజొచ్చి జలముల • నడుసుచేసె

సీ॥ పణవ కాహళ శంఖ • పటహ భేరీ మహా, రావంబు లశని వ • ర్షముల నడఁప
నాలవట్టంబులు • పీలి జాలరులు ఛ, త్రంబు లాదిత్యుని • ప్రభలఁ గప్ప
ధవళాతపత్త్రింబు • తనరుటఁగాంచి జ, క్కవగొంగ సిగ్గిలి • యవలికరుగ
నమరుల యెదలు ది • గ్భ్రమనొంద దేవేంద్ర, విభవుండు దశరథ • విభుఁడు విప్ర

తే॥ సామ గానంబు లాశీర్వ • చన రవంబు, వంది మాగధకీర్తనల్ • వరుస మీఱ
వేత్రహస్తుల సందడుల్ • విరియ గీఁక, హేషలును దెసల్నిండఁగా • నేగుదెంచె.

తే॥ తాను గాంచు దిక్కులనెల్లఁ • దన్నెకాంచు, నరవరులు విరికేలు దా • మరల మోడ్పఁ
బొంగి యొండొండొరయు చతు • రంగబలము, నెగచ రజమున మిన్నుమ • న్నుగనొనర్చె

ఉ॥ తేరులు వీరులుం గరులు • తేజులు నిండిన సేన నిల్వఁగాఁ
దీరగు చోటులేద మఱి • తెల్పగ వేఱొక భూమి లేదుతత్
ధారణి వీఁపువంగి దిట • ద్రప్పి నెటుక్కుమనెన్ నృపాలు చే
ధారణి భారమీఁగెనవి • తథ్యముగా వచియింప నెట్లగున్?

చ॥ ఇనుఁ డటు రెండు యోజనము • లేగి పథమ్మునఁ జంద్రశైలముౘ
గని గిరిక్రిందఁ దా విడిసెఁ • గంతుని దంతియుఁ బూలతూపులున్
వనితల గబ్బిగుబ్బలును • బాలసమీరము చందనంబు భూ
పుని పెనుసేనయుం దిగియెఁ • బ్రొద్దును పోయెను పశ్చిమాద్రికిౘ.

## 14. చంద్రశైల పటలము 68

సీ॥ మేరువు నోడంగ • మెండొడ్డి నిలుచున, వునుఱులఁ దీయంగ • నుసలు నవియు
మరునకు నిరవుగా • నెరయునవియు ముత్తె, ముల సరుల్ గలవియౌ • మొగ్గచనులు
గొరవంక పల్కులు • కొమరొందు నబలలు, ప్రియుల భుజంబులఁ • బెనఁగవైవ
నుప్పరం బందుచు • నుండెడు వటశాఖ, లిలను విఱిగికూల • నిలుచునవియు

తే॥ సరసులం గోరు నవియు మేల్ • చాప ధరులఁ, గంతుఁ గేరెడు వీరులఁ • గలవియైన
దంతు లట దేవదారు చం • దన ప్రమహీజ, ములకుఁ గట్టంగఁబడియె శృం • ఖలల తోడ

ఉ॥ పేర్చి యడంపరాని యరి • వీరుని నీతిబలంబుచేతఁ బెం
పార్చి జయింప నౌనను న • రాధిపు యోచన వోలె నేనుఁగొం
డార్చుచు మేఘమండలము • నంటిన రెమ్మలతోడ సాలముం
జేర్చి యగల్చికొంచు నడ • చెన్ వడి నొక్క గిరీంద్రముంబలెన్.

చ॥ బటువగు కాండముల్ బలుపు • వాఱిన కొమ్మలుగల్గు ముద్దు లొ
క్కట మొదలంటఁ గూల పెను • కం బడి దొర్లుచు వచ్చు ఱోటితోఁ
దటపటఁదోఁగు కృష్ణక్రియ • దంతి యొకం డిరు దేవ దారువుల్
కటపెటఁ గూల మధ్యఁజనెఁ • గట్టిన గూటము ప్రీలి వెంటరాన్.

తే॥ కినుక యడఁగ మచ్చిక బుజ్జ • గించివళము, పఱచుకొనఁజూచు పరికాఁడు • ప్రగడఁబోలె
మంత్రి హితముపదేశింప • మదినిగొనక, స్వేచ్ఛవర్తించు నృపుఁబోలె • నిభమొకండు

చ॥ పగఁగని నట్లు గొప్ప విర • వం బొనరించుచు మేఘముం బలెన్
నెగడు మదేభ మొక్కఁడు సృ • ణిం గణియింప కరణ్య హస్తిముం
దుగఁజను త్రోవ వెంబడిని • దొమ్మిగ గ్రద్దలు వో మరుద్గతిన్
దెగటునఁబోయె మున్నుచను • తెన్నున వెల్లువ వోవుకైవడిౘ

చ॥ కరిఘటలొక్క చోటుననె • గట్టఁగ లేచు మదంపు వాసనల్
పొరయఁగ నొక్క దంతి సిడి • పో టసి వోవఁగ మీఱిరేఁగి యా

తెరువునఁ బాటి యొక్కఁ పడిఁ • ద్రెంచుచు ముందటి కాళ్ళ రాముచున్
సురుముగఁజేసి వైచె నొక • సుందరసాలము పాల వృక్షమున్.

ఉ॥ లెక్కఁ యిడంగరాక యవ • లేపము నొందిన వాలటంబులుం
జిక్కని చెంద్రము న్నదుటఁ • జేరిచి దిద్దిన హస్తినీ తతుల్
మిక్కిలి గున్నలున్ గలిగి • మీఱిన తద్వనయూథమట్లు పెం
పెక్కఁ దదీయ చంద్రగిరి • యేపగు యూథపుఁబోలె నయ్యెడన్.

తే॥ పెద్దలగువారు పిన్నల • యొద్దఁజేర, వారి చెడుపద్ధతులు మార్చు • వారలనుట
నిజము రథముల బంగారు • నేమి దొరలి, నల్లఱాళ్ళకు తనదు వర్ణంబు నొసఁగె.

తే॥ ఇంద్ర గోపంబులను కవ్వి • యెలయుననుచు, దొండపండుఁబోల్ నోళ్ళను • తొడరిచూచి
హరిణ నేత్రల మైయంద • మరయు పూన్కి, భ్రమయుచందానఁదిరిగెను • నెమళులచట.

తే॥ అశ్వముల నుండి దిగి చెలుల్ • హంస లట్లు, నడచి లేఁజెట్ల నీడకు • బడలి చేర
వారినగలప్డు తళతళ • ల్వాఱుచుండ, పూచి యున్న లతలఁబోలి • పోలిచి రచట.

తే॥ మాలికల నున్న తేంట్లు తా • మరలటంచు, కలికిపదముల మొగములఁ • గ్రమ్మకొనఁగ
సఖులు నిక్కంపు టొడలికై • శంక నొందఁ, బటిక బండలపై వారు • పండినారు.

చ॥ మెఱుములతోడి మేఘములు • మేదినిఁ జేరఁగ నున్నవంచుఁ జూ
పఱు దలఁపంగ హస్తిమల • పైఁగల రాములు డిగ్గి థక్కనా
నిఱు కగు మధ్య ముల్ చెలఁగ • నిందిర తామర వీడి భూమిపై
వఱలిన మాడ్కి నూపుర ర • వంబు చెలంగఁగఁ గూడి రచ్చటన్

చ॥ పలు విషయంబులందు గొనఁ • బడ్డవి వన్నెలు చిన్నెలొప్పి పే
రలుకను గూర్చు హేషలు గ • లట్టివియున్ గయి సేతయున్ మహా
బలము జవంబు పొల్పెసఁగు • వార్వములం దగు మేఁత పెట్టి భూ
లలన యురః కలాపమన • లాయము గట్టిరి పంక్తి పంక్తిగాన్.

చ॥ ఎరఁగల విల్లు పొల్పునను • దండడిగాఁ దెరలెత్తి కట్టి రా
శరధులఁ గూర్చు మచ్చునఁ బ • సారపు పీదు లమర్చి నారు పెన్
కరద చయంబు చేర్చులలి • సామజ పంక్తులఁ దీర్చినార ౨
క్కరువలి బారు నిల్పు వహిఁ • గ త్తళలన్ రహినిల్పి ర త్తటిః

తే॥ నటన మొనరుచు నెమిళు ల • నంగఁ దగిన, హరిణ నేత్రలు వీరులు • నట్టు నిట్టు
లరసి ధ్వజములవలన భ • ద్రారవముల, వలన నెఱిఁగి డాసిరి తమ • ప్రభుల విడిది.

తే॥ పాలనురుఁగుబోలినసన్న • పలువలఁగొని, యుపకులొడలినంటిన దుమ్ము • నూడ్చితుదువఁ
జిత్రకారుండు చిత్రముల్ • చికిలిచేసి, యుంచుక్రియ నుల్లసిల్లిరి • యువతు లచట

తే॥ రా కుమారులు లున్నత శిఖ • రస్థ హరులు, మొగిని దిగినట్లు దంతుల • దిగి విరిసిన
పాళలంబోలు చామరల్ • పరవ నేగి, చేరి రందమై వెలసిన • శిబిరములను.

తే॥ చెక్కుములుగల తెల్లకు • టీరములను, పద్మ గంధుల మొగములు • పరిఢవిల్లె
విమల చంద్ర బింబము లల • లలరు తేట, నీటఁదోచిన క్రైవడి • నీటుగాఁగ.

తే॥ పొరలి లేచి నల్లని ధూళి • యురల దులిపి, తెల్ల తావిరజం బొక్క • దెసను దాల్చి
కాళి సామేన ధరియించు • కాలకంరు, మాడ్కి నొప్పారె నటనొక • మదగజంబు

తే॥ దుష్ట జనులతో స్నేహించు • శిష్ట జనులు, వారి స్థితిఁగాంచి పిమ్మట • వదలు నట్లు
తురగములు సన్న దుమ్మునఁ • బొరలిలేచి, చెదర విదలించి కొనుచు ని • ల్చినవి పిదప

## తరుణీతరుణుల విహారము.

సీ॥ అన్నాన మన్నాన • పౌన్నాస, యనియేడు, ముప్పూరి త్రాటిని • మొదలఁద్రెంచి
ధ్యానబలంచేఁ • దమ్మ తామెఱిఁగి యి, య్యిలఁగాంచి కర్తవ్య • మెఱుక పడఁగ
సత్పథంబునఁ జను • సాధుల చందానఁ, దత్తడుల్ ముప్పూరి • త్రాటిఁద్రెంచి
చేష్టాబలంబుచేఁ • జేఁతలఁ దెలిసి య, నంతర మిలఁగాంచి • యడఁగి మరలె

తే॥ కలదిదాఁచక యొసఁగు దా • తలనుబోలి, నదులు వెల్లువ లడఁగియు • వదలకొసఁగెఁ
దోఁడఁగాఁ దోఁడఁగా లోనఁ • దోఁచుతేట, నీరు కొంచెకొంచెమ్ముగ • వారికొదవ.

తే॥ మంచుఁబోలిన తెరలు చ • లించునపుడు, లోన నచ్చనగండ్లాడు • చానల కను
లరయ సరసుల యలలలోఁ • బొరలు వాలు, మీలనఁగ నొప్పి మినమిన • మినుకుచుండు

చ॥ నెఱయు శిరోజముల్ విరిసి • నిప్పులతో మెఱపుల్ చరించు న
ట్లురమున రత్నహారముల • నొప్పిన పీరులు క్రొత్తవాసనల్
పరవు గుడారులందు చొరఁ • బాఱిరి ధీరత సింగముల్ గుహాం
తరమునఁ జొచ్చులీల సము • దగ్రభుజోన్నతి వెల్లడించుచున్.

సీ॥ మత్తసారంగముల్ • మావటీంద్రు తెలుపు, సూచనల్ గ్రహించు • చొప్పువీడి
చుట్టుపట్టులనున్న • చుట్టంపు టేనుఁగుల్, చేరఁగఁ దీరంటు • చేరఁబోక
పెద్దలు చెప్పిన • బుద్ధివినక చుట్ట, పక్కంబు లదలింప • లెక్కగొనక
వెలయాంఢ్ర కలయిక • కలువాటుపడిన ముం, డల మార్గఁబోలె వి • దంబనమున

తే॥ నెట్టవెంట్రుకల్ కోఱలు • నెట్టి నొసలు, నీఁటెలును గంటరొదలొప్ప • నిభచయంబు
వెల్లువలఁ గాడుపఱిచె మున్ • విడక కలశి, జలధిఁ గలఁచిన మధుకైట • భులను పోలి.

తే॥ స్త్రీలు పురుషులు రవికాంతి • తెలియరాక, ప్రొవుల నుంచు నగురుకట్ట • పొగలుగ్రమ్మ
గర్జనములేని మొగుళులు • కడఁకదిగిన, పఱపుకడలివి పోలె నా • బయలిచోటు.

ఉ॥ భూధర కందరంబులకు • భూషణ లీల వసించుచున్న వి
ద్యాధరులెల్లఁ దమ్ముఁదమ • యక్కము పక్కము విస్మరించి క్షో
ణీధవు వర్గముంగనుచు • నిశ్చలులై రది దేవలోకమే
యీధరఁ దప్పిదారి వసి • యించె ననందగె వైభవోన్నతిన్.

చ॥ రమణులు మున్నుగానె దిగి • రంజిలు తత్ప్రియపాళియొద్ద బిం
కము సవు రింపు నింపు నలు • కన్ బికముంగని ముచ్చటించుమన్
బ్రమదముతోఁ బ్రతిధ్వనులు • వల్కెడి కొండలతోడఁ బల్కుచున్
నెమిళుల లీలఁ గ్రుమ్మరిరి • నెమ్మెయి చాయల నెల్లఁ గప్పుచున్.

చ॥ పురుషులు, వీరమద్దియలు • మ్రోయఁగ మాలికలందు తుమ్మెదల్
విరుతమొనర్ప ఖడ్గరుచి • వింతగఁ గ్రేవ వెలుంగ నంగద
స్ఫురదురురత్నకాంతి మెఱు • పుల్ మెఱయన్ దమ కేలవంటి య
గ్గిరిగల యొప్పిదంబుఁ బరి • కించిరి సింగములట్లు లేగుచున్.

తే॥ వనధి మేరువుఁ గవియఁ జు • ట్టినవిధమున, క్షోణిధవుసేన శైలంబుఁ • జుట్టివిడిసె
భూపులును రాణులును వారి • పుత్త్రకులును, నెఱయఁ జంద్రశైలము దర్శ • నీయమయ్యె

తే॥ తేంట్లు గ్రమ్మిన కల్పక • దీర్ఘ శాఖి, కలను తాటిప్రమాఁకుంబోలు • కరము సాఁచి
చివుళులం ద్రుంచి ప్రాణంబు • పవిదినుండు, కరిణుల నందియిచ్చెను • కరిచయంబు.

తే॥ క్ష్మామరు గల్గిన యచ్చటి • కొలవతలకుఁ, జెలువుగాఁ బురోహితవృత్తి • చేయు వేఁగి
పూల విసుగొందు భ్రమరముల్ • పొన్నగుత్తు, లనుచు రిక్కలపై వ్రాలు • నప్పుడప్పుడు.

సీ॥ బుశంబు లనెడి క • రేణువులం గూడి, వఱలు రేరాజను • వారణంబు
వంపైన క్రొన్నెల • వంకయన్ దంతాగ్ర, మున మిన్ను గ్రుమ్మఁగా • పొదలిపాలు
తేనియ మడవలఁ • ద్రిప్పి మాఱిచికట్టి, కొఱ్ఱచేల్గాచెదు • కొలవ లపుడు
చదలేటి నీరు వి • చ్చలవిడి పాటించి. ఎరిపైరు పెంతు ర • వ్వారిగాఁగ

ఆ॥ తొలఁగి పోవలేక • నిలిచిన చందురు, నొక్కప్రక్క నచటి • యువతులు గని
తమ యలంకృతులను • దగదిద్దికొంద్రు రం, భాదు లవలిప్రక్క • నల్లైకొంద్రు.

తే॥ కొలిమిఁ బడక నేయి చిలుము • గొనకయుసులు, లూడ్చు బల్లెంబ నెడికను • లొప్పుచెలుల
నొసళులం గూర్చియద్దెందుఁ • బొసఁగఁ గొలిచి, పోలికంగనుఁ గొందుసు • పురుషులచట.

తే॥ సింగపుంబిల్ల లేన్గు ని • సుంగు లచటి, ముంగిళులఁ జెఱలాడును , మృదముమీఱ
వంకగలిగిన లేనెల • వాంఛతోడఁ, గొఱవ పిల్లలతోఁ గూడి • తిరుగులాడు.

మ॥ వర నీలద్యుతులుల్లసిల్లు శిఖర • ప్రాంతములన్ గిన్నెరే
[illegible]

గరియూథంబులఁ జంపు సింహవితతుల్ • గాళ్లించు నంకంబులన్
దరుణీ లక్తక యుక్త సిక్త పదచి • హ్నాంబుల్ ప్రకాశించెడున్

సీ॥ వాలుగలంబోలు • వాలిక కన్నులు, చెవులవఱకునేగి • చిందుగొనక
వెలిదంత కాంతులు • వెన్నెలకాయక గ్రొమ్మోడుల్ విడి యొదల్ • గ్రమ్మకొనక
రంగారు కనుబొమల్ • రాణించి విక్కక కరరవమును కంఠ • వర రవంబు
పరఁగనొక్కటిచేసి • నరములమీటి య మృతమూర రమణులు • కృతులుపాడ

తే॥ వినిన కిన్నర పక్షులే • వెఱఁగుపడును, వారి కుంకుమ పంకమొ • ప్పారు పటిక
దొనలు కల్లునించిన కెంపు • మణులగన్న లట్లు విలసిల్లుచుండు నం • దన్నియెడల

చ॥ పొలయలుకన్ వహించు పువుఁ • బోణులు కాటుకతోడికన్నులన్
నలుముచు నంటు కాంద్రురు మ • నోవ్యథ హెచ్చఁగ దత్తఱింపఁగన్
వెలలుచుఁ గ్రొవ్వెదల్ తిగిచి • విచ్చి చెదర్పఁగ రాలినట్టి పూ
వులు వసివాడకుండ మధు • వున్ విడకొప్పెడి నచ్చటచ్చటన్

ఉ॥ మావిచివుళ్ళ రంగడరి • మై మెఱుఁగెక్కిన చెంచుకన్నెకల్
పూవడముల్ ధరించి తమ • పోలికచూతురు వేల్పుటాంద్రతో
దేవసఖీమణుల్ మణుల • దీధితు లొప్పి న గాజులూడ్చి మేల్
తావులుగల్గు మాలికలఁ • దాలిచి పోలికగాంత్రు వారితో

ఉ॥ అమ్మగలట్టి వింటి నెన • యంగల కంటిబొమల్ నటింప గా
నమ్మలు వీణతోఁ జలిం • నమ్మలతోఁ దగ నాట్యమాడి స్వ
ర్గమ్మన మేనకాదు లటఁ • గ్లాంతిని వీడిన హారసంచయం
బిమ్మగ వానరాలి ధరి • యింప ముదంపడు నాఁడుకోఁతులున్

ఉ॥ చందనవృక్షముల్ పెరుఁగు • సానువులం గల కావిఱాల రా
పుం దగఁగొన్న హస్తినులు • పోలను కుంకుమ లిప్త దేహలన్
పొందికఁ బద్మరాగ రుచి • పూరిము గప్పఁగ నాకసంబు కెం
పుందనమంది సంజయను • పొందిక నొప్పను సర్వకాలమున్

తే॥ భూమిదేవికిఁ దొడవగు • ముత్తియములు చెదరి హరుమీదఁ బడు విధ • న్నదిని పోల
హేమముంజేరి పడుసెల • యేళ్ళ వరుప యలత్రివిక్రము నుత్తరీ • యంబుఁబోలు

ఉ॥ పొన్న లవంగ పూవుం స • మున్నతిఁగూరిచి తాల్చువారలుం
గ్రన్నన దేంట్లఁదోలి మక • రందము పొందికఁద్రావు వారలై
కిన్నరపక్షులందు దిగి • కిన్నరవోలె రహించి పాడఁగాఁ
గిన్నరు లుక్కడీటి తమ • కించి చరింపుట గాంచి రయ్యెడన్

చ॥ యువతుల కొమ్మ తాఁకెడు ప • యోధర యుగ్మముఁ బోలు కర్ణికా
రవితతి చెంతఁ గౌనుల తె • ఱంగున నూఁగెడు కొమ్మలందునం
దవిలి వసించు పెంట్లు తమ • దట్టపుఁ గ్రొమ్ముడిఁ గండుఁ దేటులన్
గవగొని క్రొత్తపెండ్లి పని • గాంచుట గాంచిరి వార లయ్యెడన్

చ॥ పటికి దొనల్ గనంబడఁగ • బండలె యంచు భ్రమించి సుందరుల్
తటుకునఁ బోవ వస్త్రములు • దావణులుం దడియంగ రత్నయు
క్తకటకములొప్పు హస్తముల • గట్టిగఁ దట్టుచు పీరమద్దియల్
బటువుగఁ గాళ్ళఁ దాల్చు నెఱ • బంటులు నవ్విరి కేకవెట్టుచున్

సీ॥ చూచిరి పెక్కింటి • సొంపుపూఁబొన్నల • బంగరు సరుల నా • రంగఁ గనిరి
గాంచిరి విరహాగ్నిఁ • గ్రాఁగి మాఁడిన కిస, లయములు గలుగు త • ల్పములు కొన్ని
కని రింద్రగోపంబు • లనుబోలు తంబల బారాతి యంటిన • పటికతాలఁ
జిదిమి సరులుగూర్చి • చెదరవైచిన వాని నొరపిడిచేఁ దావి • పొరయు తఱుఁ

తే॥ బసయె లేదని వెలయాండ్రు, వదలువిటులఁ, బోలె సుందరుల్ మితిమీఱి • పుష్పరసము
ద్రావి పాటవైవఁగఁ బడి • ద్రాలుచుండు కద్ర మధుపాత్రములు పెక్కు • గాంచిరచట

సీ॥ కలువలఁబోలు క • న్నులు మిక్కిలిచలింపఁ బగడంపు నోటఁ జి • ర్నగవు తొలఁక
కనుదోయి కింపైన • చనుదోయిపైఁ దార హారముల్ లేచుచుఁ • దారుచుండ
ముఖచంద్రుఁ గబళింప • మొనయు రాహువనంగ, వేణియు వెన్నంటి • వ్రీఁగియాడఁ
గుండల యుగళముల్ • గునిసియాడఁగ వేల్పు గరిత లుయ్యాల లూఁ • గంగఁ గనిరి

తే॥ నిసులు పగలుగ మార్చెడి • నేర్పు గలుగు, పటిక బండలపై మరు • పనులు పూని
బడలి నిర్జరకాంతలు • విడిచినట్టి కల్పమాలికల్ తొడవులు, గాంచి రచట

సీ॥ కరతలంబు ఎలె వి • కాస మొందెడు కుట్మ, లాంగ మలరు నాగ • లింగముఁ గని
పడగపామని భ్రమ • పడి శూలములబోలు, కనులనుముకుళించు • కొనెడువారు
మగబాలకో నీడఁ • దగఁ గానవగు పూలఁ గోసియుండని ప్రేమఁ • గొసరువారు
కంగేలి చిగురులఁ • గెంగేల గోళులఁ జిదిమి వక్షముల నుం • చికొనువారు

తే॥ విరులఁ దమకించి కోయంగఁ • బఱచువారు, వివిధ వర్ణముల్ సవరల్న • విరతి వలన
నదరు మలయందు మఱయుచు • నంపలట్లు మొనసి దొడ్డదొనలలోన • మునుఁగువారు

ఉ॥ కాంత! చలింపవెగ్గు సహ • కార సువర్ణదళంబు లన్నియుం
గాంతి చలింపవెగ్గు సహ • కార సువర్ణదళంబులే యగున్
సంతత మంజులప్రసవ • సౌరభ సీమలె కొమ్మలయ్యెడన్
సంతత మంజులప్రసవ • సౌరభ సీమలె కొమ్మ లయ్యెడన్

క॥ శుకవాణీ కలకంఠీ, నికరధ్వని విని భుజంగ • నివహము లేవన్
శుకవాణీ కలకంఠీ, నికరధ్వని విని భుజంగ • నివహము లేచున్

క॥ తావుల గోరంట కొమలు, తావుల గోరంట కొమలు • తనివి చెలంగన్
మావుల మురువైన పరువు, మావుల మురువైన పరువు • మన్నించి రొగిఁ.

తే॥ రాజ ముఖ దర్శనంబునఁ • దేజు మాసి, పుండరీక చయంబుల • పొలుపు లడఁగ
రాజముఖ దర్శనంబునఁ దేజు మాసి, పుండరీక చయంబుల • పొలుపు లడఁగె

క॥ తిన్నని యామోద మలరఁ, బున్నాగ చయంబు లచటఁ • బొలుపుగ వెలయన్
దిన్నని యామోద మలరఁ బున్నాగ చయంబు లచటఁ • పొలుపుగ వెలసెన్.

ఉ॥ శ్రీరమణీయ నీతి మహి • షీయుతి • స్యందన వాహి నీంద్ర భూ
దార విహార భాసుర ము • దసితి చామర ఖడ్గభాతి వం
శీరుతి యూధ సంహతి వి • శేషక ధాతు పరాగరక్తి సొం
పారు ద్విజన్మరీతిఁ గన • నవ్వని పోల్చె నృపాలు వీడునాన్.

క॥ విలసిత గణికాతతి సర, సుల సుమనో మోద గరిమ • సురుచిర మయ్యెన్
విలసిత గణికాతతి • సర, సులసుమనోమోద గరిమ • సురుచిర మయ్యెన్.

క॥ భోగి హరి నాగ సద్ద్విజ, పూగమ్ముల నొప్పు రాజ • భూభృద్వరుఁడున్
భోగి హరి నాగ సద్ద్విజ, పూగమ్ముల నొప్పె రాజ • భూభృద్వరమున్

తే॥ భవ్యసురసాలములు వర • ఫలములొసఁగు, కతన నందన సరణిఁ బ • ర్వతమువెలయు
శీత లాంబుశీకర ఝురీ • శీకరంబు, నగుచు హారకపర్దమువోలె • నందమొందు.

తే॥ పొంగుచున్న తేనెనుద్రావఁ • బువులలోన, ముసరు మధుపంబులంబోలి • మూఁగి స్త్రీలు
పురుషులుంగూడి యా గిరి • చరియలందు, వీడ మదిరాక క్రీడించి • రాడిపాడి

తే॥ దిగుట దలఁచిన గొప్ప పీ • డగను దోఁప, దాని మాని యా గిరి వీడి • తరలవైరి
స్వర్గ సుఖమును గోరు స • జ్జనులవలెఁ ద, దేక మానసులై వీడి • వెరర చింత.

తే॥ మొగుళులొప్పునస్త్రాద్రి యే • నుఁగునుపోలెఁ, గమలమిత్రుండుదుముకుపిం • గమునుపోలె
గజవిరోధి క్రుమ్మటచేతఁ గాఱునెత్రు, కరణి నాకసమెఱ్ఱనై కానిపించె.

తే॥ మావి బ్రూఁకులెఱ్ఱని కాంతి • మలయనొప్పెఁ, గొఱఁతలేక క్రౌంచిగుహలు • కొఱలుసరణి
తన యొడలు మొత్తమా కాంతి • తనరకతన, రత్నఖచితమౌరహిని • ర్వచిముమెఱసె

తే॥ కనుల పండువౌతద్దృశ్యా • కాంతివలన, వెలుఁగు శిఖరముల్ పెక్కులు • కలిగియుంటఁ
జందనం బురంబు పయి న • లంది నట్టి, వెన్ను చందాన నమ్మల • వెలసె నప్డు

"కాంతః చలింప" అను పద్యమునుండి ఎనిమిది పద్యములు మూలమునను కేవల శబ్దాలం
ధానములై యుండుటంజేసి అనువదింపఁబడక స్వతంత్రించినవి.

తే॥ ఒదలు ప్రాణంబులట్టు లొం • దొరలు ప్రేమ, గలుగువారలు సింగముల్ • గజములేణ
ములును తమతమ పెంటులఁ • గలిసి నెడలు, విధమునన్ వచ్చి మలక్రింద • విడిసిరంత.

ఉ॥ వేఁడి మయూఖ జాలమను • విస్తృత కేసరముల్ జ్వలింపఁగాఁ
బోఁడిమి నొప్పు క్రుద్ధ హరి • ముఖ్యుఁ డు నాఁ జను నొంటికల్లు తే
రేడు గుబాల జోదు పగ • రేలిక క్రుంకుడుగట్టు చేర నా
జాడ యెఱింగి దంతులన • సాగి బయల్వడె మబ్బు తెట్టువల్

సీ॥ మందారమును మించు మకరంద గంధంబు, పరవు దామముఁదాల్చు • ప్రభువ రేణ్యు
వాహిని యను పెను • వారాశి యందెల్లఁ, జెందామరలు పూచు • చంద మొంది
దీపముల్ వెలిఁగె నిం • పే పార జనముల, మనముల రంజించు • గౌనము తోడ
యచ్చంపు టిసుకలో • నాణిముత్తె మురీని, శంఖంబు చరియించు • సరణి నమరి

తే॥ శీతలాబ్ధిలో బిందువుల్ • చెదరఁజేయు, నలల నడుమను వెలువడి • చలువజోతి
వేల్పుమూఁకల విందు వి • స్వీదిఁదోఁచెఁ, జుక్క లెల్లను గొలుచుచుఁ • జుట్టియుండ.

తే॥ పొలసునీచు వీచెడినల్ల • జలధి తెల్ల, చంద్రుఁ గాంచఁగ నది యోర్వఁ • జాలనట్టు
భూపవాహిని మానినీ • ముఖములనెడి, విమల చంద్రులఁ గాంచెను • వేలకొలఁది

చ॥ వెడలిచి రత్నహారముల • వేడుకఁదాలిచి తారహారముల్
సడలిచి కేశపాశములు • చక్కనితావి పొగల్ దగిల్చి మున్
ముడిచిన చల్లఁదేనెగల • మొల్లసరంబుల నిచ్చలేమిచే
గిడిచి మృగాక్షులంతఁ దమ • వేణులఁ దాల్చిరి జాజిమాలికల్

సీ॥ నటకులు నటియించు • నర్తన స్థలముల, వెలలు మృదంగ గుం • డిల రవమ్ము
నతివల పాటల • నలరు స్వరంబును, బిగినరంబులఁ దోఁచు • విమల రవము
లయవైచు కరతాళ • లలితనినాదమ్ము, పిల్లనగ్రోవి పొం • పిరి రుతమ్ము
క్రొత్తగాఁ బదములు • గూర్చి పాడెడుధ్వను, లమరులు వెఱఁగంద • నతిశయిల్లె

తే॥ త్రావు వారల తొట్రు శ • బ్దములు సతుల, కమరు రొదలును కరులగీఁ • కలును హరుల
హేషలును గూడి యేదియు • నెఱుఁగరాక, కలకలంబు లా గుంపులఁ • గలయఁ బర్వె.

సీ॥ పొలుపుగాఁ బూర్వంబు • భుజియింపఁ బడని సు, ధంబోలు మదనశా • స్త్రవిషయంబు
లనుభవ విజ్ఞాన • మొనరుట చేతను, దొరకక దొరకక • దొరకినట్టి
యమృతంబుఁబోలు ల • తాంగుల హృదయంబు, నం బుట్టు ప్రణయకో • పంబు వోవఁ
బలు పాట్లుపడి యూఱ • డిలఁజేయు చేఁతలన్, గ్రొత్తమట్టులఁగొని • కూర్చుపదము

తే॥ పాడుఁ దనుమ వెలందులో • వేఁడికొనుచు, వారు పాడఁగఁ జెవి చవు • లార వినుచుఁ
దత్త్వము గ్రహించి కనుల న • ర్తనముచేసి, రంజిలుటచేతఁ దెలియక • రాత్రి కడచె

## 15 పుష్పాపచయ పటలము 38

చ॥ రిక్కలు పండ్లుగాఁ జెలఁగు • రేయను రాక్షసరాజుఁ గూల్పఁగా
వెక్కసమైన వెల్గులను • వేయికరంబులు మీఱఁ జాఁచి ప్రా
గ్దిక్కుధరం బనం జను న • దీర్ఘ కహోరమునందు దోఁచెఁ బెం
పెక్కఁగ భాను డన్ నర మృ • గేంద్రుఁడు సర్వజగంబు మేల్కనన్

మ॥ ఇని రాజన్య విశిష్టుఁడౌ దశరథుం • డింపారఁ గాల్యంబులన్
బొనరం దీరిచి తిన్న చుట్టి జనముల్ • భూపాలురుం గొల్వ స్యం
దనమం దెక్కి వనంబులం దొరువులం • దన్వొందఁగా నొప్పుశో
ణనదిం జేరె దినేశ్వరుండు నడు మిం • టన్ జేరె నవ్వేళకున్

తే॥ రాజులును రాకుమారులు • రాణులయును తమ వరాంగులతోఁ గూడి • తనియఁ దిరిగి
సుమములం గోయ మనములు • త్సుకత నొంద సొంపుపెంపారు వనములఁ • జొచ్చి రంత

చ॥ బొమలు శరాసనంబులుగఁ • బూనిచి చూపుల తూపు లేసి గా
యము లొనరింతు రింపుఁ జను • నంగమునం • జనె బర్హి సంఘముల్
ప్రమదల పల్కులన్ విని త్ర • పం గొని చిల్క లొదింగెఁ గాన్నడన్
భ్రమసి బిడెంబు నొందు క్రియఁ • బాఱుచు నుండె మరాళ సంఘముల్

తే॥ కుండలంబులు మెఱయంగ • నిండ ముసరు తుమ్మెదలు రొద సేయ నీఁ • దుటలు చూచి
హితులు ? తులు లత్రాంగులు • లతలనుండి యెఱుఁగలేక మిణకరించి • రెంతొ సేపు

ఉ॥ కోయిల లయ్యెడన్ మఱలు • గూర్చిన ఘాషణముల్ ధరించి రా
గాయిత వాక్పమత్కృతుల • నందిన యక్కలకంఠ లుబ్బుచున్
కోయని యార్వ బెగ్గడిలి • కూయక యుండఁగ లేదు సిగ్గుచే
వాయి గదల్ప వల్పులు సు • వక్త్రల సన్నిధి వా మెదల్తురే

తరువోజ॥ విసముకం టెను మించు • వెడఁది కన్గవం వేడ్క నమృతమనఁ • బ్రేమించి చూచి
మొనరుల్ కెంద్దమ్మి • నొందఁగ వం నున్నతంబులయి పూ • లొప్పిన లటల
కుసుమ కోమలములౌ • కొమ్మ పాదములఁ గూరిమిఁ బువ్వులు • గురిసియడంగెఁ
గొసరక సుమలతాం • గులకిడ సుదివి భ్రుంగ సమ్రాటుగాక • కొఱలు వారెవరొ

ఉ॥ ఇందిరఁ బోలు నిందుముఖు • లిమ్ముగఁ దాఁకఁగఁ గేలు దమ్ములన్
సుందర పీన వక్షములు • శోభిలు విక్రమ సింహ దోర్గిరుల్
చెందిన యున్నతిం గుదిసి • చిక్కి వినమ్రము లౌచు నుండ స
న్నందన మొందు పూలతిట • నమ్రము లౌటఁ దలంప నబ్రమే?

చ॥ సరసులలోనఁ బూవని ప్ర • శస్త పనేజ కువాలయంబులన్
దిరపడిఁ జంద్రవంకి గల • తీ లు పూఁగఁ గాంచి తుమ్మెదల్

వెరవున వచ్చి మూఁగి నుఱి • వేసరి తోలినఁ బోవకుండెఁ గ్రొ
త్త రుచులఁ గోరువా రొకట • దక్కఁగ వానిని వీడువారలే ?

చ॥ శిలలనఁజెల్లి చేవమెయిఁ • జెన్నలరారు భుజంబు లొప్పు వీ
రుల కదఁ జేరు కేకి సవు • రుం గల చామలఁబోలెఁ గొన్ని పు
ష్పలతలు కోమలంబులయి • పంగి యడంకువ నొప్పెఁ గొన్ని తీ
వలు మఱి చేతికందవును • వంగవు కిన్వడు వారికై వడిన్.

ఉ॥ పూవులు కోయఁగా లతలు • పోఁడిమి మాయుటఁ గాంచి బొమ్మలన్
కై వడి నొప్పు కప్పురపు • గందులు కాంతుల కివ్వి యెవ్విధిన్
మైవడిఁ గూర్చునంచు మఱి • మండనముల్ కయిసేసి సన్ననౌ
ఠీవలఁ గాంచుచుండి రటఁ • దేఁకువఁ జల్లని తూపు చూపులన్.

ఉత్సాహ॥ అలరు విరులఁ దేనెఁద్రావు • నళులు వికచ పుష్ప మా
లలను వదలి వట్టి వగు వె • లందుల జడఁ జేరి మున్
వలచు పువులఁ దలఁప • వయ్యెఁ బ్రాజ్ఞ వరులు సంగడం
బులు పొసంగు చోట సుఖము • పొందువారలే గదా ?

ఉ॥ అందముచేత నిందిరకు • నాభరణం బని చెప్ప నొప్పు రా
కేందు నిభాస్య కంజము క • యిం గదియించి పలుంగు బండ నీ
డం దన బింబముం గని యె • డంద తడంబడ నీరు గార్చె నీ
చందనగంధి నా ప్రియు ని • జంబుగ లోఁగొనె నంచు నెంచుచున్

చ॥ పొలుపుగఁ దాల్చియున్న విరి పూసరముం గొని యొక్క భూపుఁ డి
మ్ములఁ బ్రియురాలి కంఠమునఁ • బూన్పఁగఁ గాంచిన చెల్వ యొర్తు పే
రలుకను మోము వాడ్చె నయ • నాశ్రులు ముత్తెము లట్లు గబ్బి గు
బ్బల పయిఁ జింద నేడ్చెను; స • పత్నుల ప్రేలిమి నోర్తురే చెలుల్ ?

చ॥ ప్రియుఁడగు నొక్క రాజు తన • ప్రేముడి కాంత మయూర లీలల న్
గయికొని రాఁగ నామె మదిఁ • గానఁగ నొక్క లతా నికుంజముం
బయికొని డాఁగ రామ చొరఁ • బాఱి మనోహరుఁ గానలేమికిన్
మయి తన ప్రాణమున్ వెదకు • మాడ్కి మఱింగె నురింగెఁ జెంగటన్.

ఉత్సాహ॥ కాటుక గల కఱ్ఱి కనులఁ • గావి రంగు గానరా
మీటి యీఁటెఁ దాల్చి యున్న • మేటి పైని యీసునన్
జోటి యొకతె యందకుండు • సుమముఁ గాంచి కోయుమా
మాటి కొందు ననుచుఁ గేలు • మడిచి వేఁడెఁ గోకిలన్.

తే॥ పెద్ద యెడ నీటి కాయను • ప్రియుఁడు గాంచి, పడఁతి గుబ్బలఁ బోలు నీ • ఫల మనంగ
నే పడఁతి గుబ్బలని మది • యెరియ నేడ్చె, వెక్కి వెలవెల పోయెను • వెలఁది యొకతె.

తే॥ ఆల మన్నంతఁ బెల్లుబ్బు • నద్రి భుజుని, పుష్పములఁగోయు స్మరనిభుఁ • బూవుఁబోణి
నీలవేణి కోకిలవాణి • కేల గనులు, మూసి, యెవరన నిట్టూర్చె • మోము వాడ్చి.

తే॥ బురదఁ బుట్టని తమ్ములఁ • బోలు కేలు, చాఁచి పూలు గోరిన తన • సకులఁ గాంచి
ననల నొసఁగక యొక్కఁడు • నడుమ నిలిచె, దాఁప కీయకుండెడు లోభి • దంభియట్లు.

తే॥ ప్రియుఁడు పొరపడి వేతొక • పేఁరఁ బిలువ, నూడఁ దీసిన చురియ నా • నుజ్జిమిచూచి
పరువు తలవంపఁ బూవుతో • వైచెనొకతె, అదియు నిట్టూర్పుచే నల్ల • నయ్యె మాఁడి.

తే॥ కులసతులు విరిదమ్మిమో • ముల వెలుంగు, కటికనులఁ గాంచి కాంక్షలోఁ • గలయఁ దిరుగ
మదజలముద్రావమధుపముల్ • మలయఁ దిరుగు, మదపుటేనుఁగుఁ బోలెను • మన్నెఁడొకఁడు.

ఉ॥ పొచ్చెము లేని హౌసు గల • భూవరుఁ డొక్కఁడు సంజఁ దోఁచు రే
నెచ్చెలి వంక వంటి నయ • నెన్నుదు రొప్పు లతాంగికిన్ మదిన్
మెచ్చొనరించు వేఱు చెలి • మిన్నకు సాముగఁ బంచు పువ్వులన్
జెచ్చెరఁ జిమ్మి పోయి రటఁ • జీ దఱతోడఁ గలాపహాశితో.

సీ॥ నైజ గంధమునొంది • నలువుగా విరిసిన, తుఱుము నెప్పటి యట్ల • తుఱుముకొనక
జాఱిన పయ్యంట • సవదరింపక ప్రోవఁ, జెదరిన ముత్యాల • చింతఁ గొనక
తాను వెదకునది • తనలోని ప్రాణమో?, యేదో? యనఁగ నెల్ల • యెడలఁ దిరిగి
మకరంద బిందువుల్ • రకముగఁ జిందు క్రొం, దలిరుల వెదకె సుం • దరి యొకర్తు

తే॥ ప్రియుఁడు ముదమున వచ్చుచో • బిఱ్ఱబిగిసి, పలుక కాతఁడు వేసరి • తొలఁగు పిదపఁ
దహతహంపడి దయితుని • దారి నిలుపఁ, జిలుక నంపి తానును వెంట • వెలసె నొర్తు.

తే॥ విరుల సరములుదాల్చిన • పేరురమున, విరుల శరములు విరివిగా • విచ్చి తూఱఁ
గృత్యమెఱుఁగక మాధవీ! యీయఁగలవె?, మంచిమందారసుమమని • మసలెనొకఁడు

తే॥ అగడు కల్పించుకొని కోప • మూఱ కేడ్చి, వెదకి చేర్చి కూర్చిన తావి • విరి సరంబుఁ
దాల్చి యద్దంబు గని భర్త • తపసి యుఱ్కి, కడలుగొని చిడిముడిపడె • మడఁతె యొకతె

చ॥ యమునకు నోరె మిచ్చు గుణ • మందిన కుంతముఁ దాల్చు నాప్రియుం
డమిత ముదంబు నందు నని • నాసను దాల్పఁగలే దలంకృతుల్
తమి గొని యీ శరీరమున • దాల్పను జీవము లందు భూషలన్
గ్రమమున నూడ్చియిచ్చె నొక • కామిని కోర్తి వియోగ వేదనన్.

ఉ॥ చెంగటి యీఱమందు తన • చిల్క యడంగుట గాంచి కంచెలన్
లొంగక బూరటిల్లిన వ • లుంద చనుంగవ మోవలేమికిం

గ్రుంగి వడంకు నెన్నడుము • కూడని నొవ్వివహింపఁ జెచ్చెరన్
బంగరు గిన్నెఁ బట్టికొని • పర్విడు నొక్కవరాంగి కుందుచున్.

ఉ॥ అంచను గాంచి దాని నడ • యందముఁ గాంచి సహాయ లీల నే
తెంచుటఁగాంచి మైత్రి కరు • దెంచె నటంచుఁ తలంచెఁ దోడు గా
నెంచెను నిన్ను గాంచు జను • లెంచరె యందము లేని దంచు నీ
కించెడి భూష లిత్తు ధరి • యింపుమ యంచొక ముద్దరా లనెన్

చ॥ విమల శిరోమణిం గదిసి • వ్రేలెడి కీల్జడఁ గాంచి పెన్ భుజం
గమ మని కాటి నెమ్మి వెను • కం బొడువం గని సుందరాంగి యో
ర్తమిత భయంబునం బఱచి • యప్పటి కుండిన కిన్క పీడి మో
దము వలకొని కెచ్చిరిలఁ • దాఁజె ననుంగు నొడిం దటాలునన్.

చ॥ అసదృశ సుందరాంగి యొక • యర్మిలి కొంతను పైఁడిబొమ్మ! యిం
పెసఁగు మరందమా! ప్రియస • ఖీ! నను గన్గొను మంచుఁ గన్నులన్
బొసఁగఁ గమూసి కోయఁదగు • పుష్పలతా నికటంబు చేరి యో
హొసపరి! రోసి కొంచు మని • యుబ్బున నవ్వెను గేలి గొట్టుచున్.

తే॥ వింటి నారి లవంగ తీ • వియలఁ జుట్టి, పంకజముఁ దాల్చి యువక ద • ర్పకుఁ డొకండు
వీలవేణుల వదన వ • నేజములకు, నుదయ రాగ భాస్కరుఁ బోలె • నొప్పు మిగిలె.

తే॥ చెఱకువిలుకాఁడుసిగ్గిలు • చెలువ మమరు, మగలు కొందఱు తరితీపు • లెగయఁగొలుపు
చెలుల కలికి పల్కులకు వి • శేష ఫణితి, శాస్త్రములకు వలెన్ వ్యాఖ్య • సలుపువారు

తే॥ భ్రమర గీతముల్ వంశ ర • వమ్ముగాఁగ, నసమ శరుఁడనుప్రేఁదు ల • క్ష్యమ్ముచూపఁ
గదుపు నడుమను కోడెలు • గదలు కరణిఁ, గలువ కంటులు చుట్టిరాఁ • గదలువారు

తే॥ మదిఁ గడంకచే మునులు చు • న్మధుని వింటి, గెలుతు రనుకొంట పట్టి మా • టలె నిజంబు
చిన్నిలతలఁ బ్రసూనముల్ • చిదుము నీమె, కనుబొమలెవారిలొంగింపఁ • గలవుచూడు.

క॥ పొన్న తరు వెక్కిన ప్రియుని, యెన్నికలో నెక్కి నిలిచె • నిందువదనయే
యెన్నఁదగు జ్ఞానులేనిం, దిన్నగ గురు కుచల గెలిచి • తిరుగం గంరే

తే॥ దేవతలచేత నేని చి • త్రింపరాని, సుషమ యంద ఁ లంపును • చూపు నిలిపి
పుష్పశాఖపై నుండిన • పురుషుఁ డొకడు, మొగ్గలును చిగురులుగోసి • ముగుదకొసఁగె

తే॥ గదను బోలిన భుజములు • గల యొకండు, ప్రియసఖిని గాంచె నాయలి • వేణి బింబ
ఫలముఁబోలునోటదుడుకు • పలుకువలుకఁ, గనలు గొనె నని మదిజాలఁ • గలఁతనొందె

క॥ అను నిట్టి చెయ్వులం గల, వనితలు పురుషులును గూడి • వనమున విరులన్
దనియఁగఁ గోసిరి వేసట, గొన జలముల నాడ నిచ్చ • గొనిరి మనములన్.

## 19. జలక్రీడా పటలము 31

చ॥ లలితులు దివ్యమూర్తు లక • లంకులు దేవ గణంబు సిగ్గిలన్
బొలసి శిలీముఖంబులు ప్ర • ఫుల్ల సరస్సులనుండి ఝంకృతుల్
సలుపుచు మూఁగి లేవ విల • స ద్వనవాటులనుండి పెంటులం
గలిసి మదేభముల్ చను ర • కంబున నేగిరి స్త్రీలతో డుతన్.

తే॥ కొలకులం దిగి క్రీడింప • వెలయు లీల, మునుపు దుర్వాసుఁ డింద్రుని • గనలి తిట్ట
నలని సంపద యప్సర • స్సతులతోడ, గడలిఁ జేరిన దృశ్య మ • య్యెడలఁ దోఁచె.

చ॥ కలుకుల కన్నులం బలెనె • కల్వలు పూచెను కల్వలంబలెన్
జెలువల కన్నుదోయి విక • సించెను కోకనదంబులెల్ల న
వ్వెలఁదుల మోముదమ్మి వలె • విచ్చె వరాంగుల మోములెల్ల నా
జలజము లుల్ల సిల్లు క్రియ • జానుగఁ బొందె వికాస సంపదన్.

ఉ॥ ఇందిరఁ బోలి కొందఱు ని • జేశుల తొమ్ములఁ జేరినారు వే
కొందఱు వారి కేలు జత • గూర్చి జయేందిర నాఁగ సుంద్రి పైఁ
గొందఱు పాశ విచ్చుక్రియ • గొట్టములం గొని నీరు చిమ్మ రం
దందుల మీలు త్రుళ్ళ భయ • మందిరి చేరిరి వారి కౌఁగిలిన్

తే॥ గందవొడినొండొరులచల్లఁ • గడఁగువారు, విమలజలమునోళులఁ బట్టి • యుమియువారు
అంజలులఁ దోయములు చల్లు • లాడువారు, కుచములంటవిరులు పడఁ • గుందువారు.

తే॥ మెఱుపుఁబోలిన మధ్యముల్ • మెఱయువారు, వెదురుఁ బోలినభుజముల • వెలయువారు
విరియు కేశముల్ మొగముల • మఱుఁగుపఱుపఁ జేరి క్రీడింప నంచలఁ • జీరువారు.

సీ॥ పగడంబు దంబు బిం • బంబు రాగంబు ప, ద్మంబు నింబారు మొ • గంబు లలర
కువలయ నయనముల్ • చవులించు నింపు సం, చున మించు మించిన • సుందరాంగు
లదరి జడమ్ముల • నడుమను నడయాడు, వాలుగ మీలను • లీలఁ గనుచు
నీ తటాకంబుల • కెల్లను కన్నులు, కలవె యంచు హితులఁ • బలుకువారు

తే॥ తమిని విభుల భుజంబులఁ • దడవు పూన్కిఁ, దరుల నున్న మయూరముల్ • పరిసిపాఱఁ
గుందనపుఁ గుండలమ్ములు • గునిసి యాడ, దరులఁ జేరువారలు నైరి • తరుణు లప్డు

తే॥ నిర్జరాంగనఁ బోలిన • నెలఁత యొకత, నీటఁ బ్రతిబింబితం బైన • నీడఁ గాంచి
నేను నవ్వ నవ్వునది నా • నెచ్చెలి యని, గవ్వి గుబ్బల సర మీయఁ • గడఁగెఁ బ్రీతి.

తే॥ అచటఁ బొసఁగిన దొసఁగేహొ • యరయరాదు, మీలఁబోలియెఱ్ఱనిచాలు • వాలుకనుల
నెఱ్ఱఁజేసి పంకజములం • డిఁడి నిలుపఁ, జెలువమొగమేర్పఱుప శంక • చెందెఁ బ్రియుఁడు.

చ॥ తలిరులవంటి హస్తములఁ • దాల్చిన కంకణముల్ శిలీముఖం
బుల రొదతోడ నార్వ జల • పూరమునం జొరఁబాఱు హేమమే
ఖలలు తునింగి కాళ్ళఁ బెనఁ • గన్ భుజగంబులు చుట్టె నంచు వె
ల్వెల గొని కంప మొందిరి వి • భీత మృగాక్షులు కొంద ఱత్తఱిన్.

చ॥ తొలి కిలశాబ్ధిఁ ద్రచ్చునెడ • దుర్ఘటమౌ సుధతోడఁ దోఁచు పే
ర్వ్రాల జపరాంద్రు చుట్టుకొనఁ • బొల్పగు మందరపట్టు లంగదం
బులు కడియంబులున్ వెలయు • పుష్ట భుజుండగు నొక్క రాజు తన్
గలుకులు చుట్టి నిల్వ జల • కంబుల నాడుచునుండె వేడ్కమై

ఉ॥ కంకణముల్ ధరించు కర • కంజములన్ జిఱునవ్వు కవ్వ రా
గాంకితమైన మోవులు ధ్వ • జాంచలలీలఁ జలించు మధ్యముల్
బొంకముగాఁగ నొప్పు పువుఁ • బోఁడులలోనఁ జెలంగు రాజ మీ
నాంకుఁడు తోఁచె నిర్ఘ శిశి • హస్తినులం గల హస్తికైవడిన్.

ఉ॥ కారు నెమిళ్ళ క్రొవ్వు లకఁ • గం దగు చాయలు గల్గి మబ్బులం
గేరిన కేశ పాశములు • గీల్కొను చిక్కుల కొల్కి కూటముం
జేరిన యొక్క తేఁడు విల • సిల్లె సురాపగ తీరమందు పెం
పారిన ఋక్ష సంచయ స • మాశ్రిత పూర్ణ శశాంకుకైవడిన్

చ॥ అడుదగు తుంట వింటి యస • మాస్త్రుసకున్ వల పొందె కాక యం
పఱయు నొసంగు దృష్టి గల • మానిని యోర్తు సఖీ జనం బలం
కరణము గూర్పఁ బెల్వల స • కాయమునన్ వెలసెన్ మనోజ్ఞయై
విరుల తటాకమందు కదుఁ • బెద్ద జలేజము విచ్చు మచ్చునన్

తే॥ చెలులు పలువురు తన చుట్టు • నిలిచియుండఁ, బ్రమద యొక్కర్తు వితిసిన • ప్రసవనికర
వల్లి లొకకొన్ని యొలయఁగాఁ • బాల వెల్గిఁ, బొడమినట్టి కల్పకవల్లి, పొడవు సూపె.

సీ॥ గుదు [illegible] ముండి • కొన్న సరంబముల్, కొబ్బరి మ్రాకులఁ • గొన్న కుచము
లేరి యొదను గాఁ • నేరసి యనవద్య, సౌందర్య మొప్పారు • సన్ను తాంగి
కంచెంలోప బి • గించిన వక్షోజ, ములును వెలికి దూఁక • మునిఁగినంత
విమల [illegible] • వెలుఁగు రాకా చంద్రు, ప్రతిబింబ మన మోము • పరిఢవిల్లె

తే॥ పలుఁచ [illegible] వలువల • వెలికి [illegible], నుఱిదిపిఱుఁదులుకుంభప • యోధరమ్ము
లొండొకటి మీఁది క్రమ్ముచు • నుంటఁ జేసి, వెల్లువలు తటముల మీఁది • విరియఁబాఱె

తే॥ ఎఱ్ఱ నోరు తెల్లఁగ గను • లెఱ్ఱగాఁగఁ, దావి గంధము తొలఁగ వ • స్త్రములు నలఁగ
జలజ వదనలు మునిఁగిన • కొలఁకు చూడఁ, బ్రేమ మీఱఁగఁ గవిసిన • ప్రియునిపోలె.

తే॥ మాన్యులంగూడితిరుగు సా • మాన్యులేని మాన్యులౌట యుక్తమకదా? • మత్స్యములును
దరుణుల యొడళ్ళ తావులఁ • బరిమళించెఁ, బెర సిదట్టిన మిఁక దీని • కరియ వలెనె?

క॥ ఉరుణుల చందనములతోఁ, దరుణుల కుంకుమము గలిసి • తగ నిండిన యా
సరసి నొకచోటు నీలపు, శరదమ్మున నెట్టి మొగులు • చంద మ్మయ్యెన్.

క॥ అలఁదిన యొదలి యగురుతోఁ. గలిసిన కలపంబు నీటఁ • గడుగం బడఁగాఁ
దులకించు మెఱుఁగుఁబోఁడులు, విలసిల్లిరి సానఁ దేఱు • పెను మణు లనఁగన్.

క॥ చెలువుని భుజమున నంగన, చెలువుగ గందమున వ్రాయు • చిత్రము సరసీ
జలములఁ దుడువ బడు ట తాఁ, దెలియక కను లెఱ్ఱ జేసి • తీక్ష్ణతఁ జూచెన్.

తే॥ వలఁద పిఱుదుఁలు దర్పక • జ్వరము కలుగు, నతివ యొక్కతె కలపంబు • లలరుఁ దేనె
క్రొవ్విరులు పుప్పొడియుఁ గొలఁ • కున జలంబు, తోడ సలసలనుడికెను • ధూమ మెగయ

క॥ వనజ నివాసిని బ్రాఁతిని, దన కరమున జలక మార్చు • దంతిం బోలెన్
వనమాలా భుజుఁ డొక్కఁడు, తన కరముల నీర మెత్తి • తరుణిం దడిపెన్.

తే॥ మెల్లని నడక నోడింప • మెలఁత లంచు, మృదు పదములఁ బోలిన వన • నెదలఁ గనలి
త్రొక్కులాడుచున్నవియనఁ • దొట్రుకొనియె, నలినములమీఁదియంచపి • ల్లలు నయారె

తే॥ చందనము వోవఁ దేటయై • సొరు గొనుచు, హేమ కుంభంబులంబోలి • యెసకమెసఁగు
గబ్బి గుబ్బలఁ గని దర్ప • క జ్వరమున, నడలు కాముకు లెందఱో • నుడువఁదరమె?

క॥ ఏలిక విరిసిన తామరఁ, బోలిన కేల్సాఁచి జాడ • పొలపము దెలుపన్
లోలాక్షి చేటి కన్నుల • మూలముగఁ గటాక్ష సంజ్ఞఁ • బోఁడిమిఁ జేసెన్.

తే॥ అలలు ద్రోయుచుఁ బరువిడి • యలముకొనఁగ, నురలు నీట మునుంగు ర • క్తోత్పలములు
హరిణనేత్రల మోమంద • మందలేమి, మదిని సిగ్గిలి డాఁగిన • మాడ్కి నొప్పె.

క॥ ఈరీతిం గ్రీడించిన, వీరులు మానినులు సరసి • వీడుచు దరులం
జేరుచు దువ్వలువ లలం, కారంబులు దాల్చి యెల్లఁ • గాంచిన తనివిన్

ఉ॥ కోరిన వట్టు నీరములఁ • గ్రుంకి పదంపడి వీడినట్టి కా
సారము లొప్పె రిక్కలును • చంద్రుఁడు వీడిన మిన్నువోలె నిం
డారఁగ విచ్చియున్న జల • జావళి యెల్లఁ దొలంగి దోపు వో
గారము దక్కి కుంది మదిఁ • గంది యలందురు పేద చందమై

క॥ హరిణాక్షులతోఁ బురుషులు, బెరసి జలము లాడుచుంట • వీక్షించిన యా
తరణి యట్టులాడఁ గోరిన, కరణిం జని చాయతోడఁ • గడలిఁ గ్రుంకెన్.

క॥ భక్షహీనుఁ డనుచు నోడియుఁ, జలమున మఱి యరుల పైకిఁ • జను నృపుఁ బోలెన్
వెలఁదుల మొగముల కోడిన, నెలయు మరలఁ బైకి నెక్కె • నెలకొని కడిమిన్

## మధుపానపటలము 67

ఉ॥ తెల్లని కల్లు వెల్లువనఁ • దేటగు పాటలు రూపుతో నిటుల్
చెల్లె ననంగ నుల్ల మునఁ • జిక్కని మోహము నిండిపొర్లి యా
వెల్లవ యయ్యె నా వెలసి • పెల్లుగ వెన్నెల లెల్ల నేత్రముల్
చల్లన గాఁగ నెల్లెడల • సాంద్రముగాఁ బరవెన్ జగంబునన్

చ॥ కలిసినవారి చేఁతలకుఁ • గల్లునుబోలి వియోగ మొందు వా
రల యుసు జాను దుర్విష వ • రంబయి నెయ్యపు టల్కఁ బూను క
ల్కులకును గూర్చు దూతియయి • గొప్పగ విప్పగ వెన్నెలల్ జగం
బులఁ బరవెన్ మరుండు తన • పూన్కికి బాసట గోర వచ్చె నాన్

ఆ॥ నదులు గంగలయ్యె • నుదధులు పాల సం దరములయ్యెఁ బర్వ • తంబులెల్ల
వెండి కొండలయ్యె వెన్నెల పెల్లిద మంగవించు టేమ • నంగవచ్చు?

ఉ॥ ఎల్లరు నెల్ల దిఙ్నిచయ • మెల్ల పదార్థము లుల్లసిల్లి క్రొం
దెల్లని పొటచేత జగ • తీ తల మెల్ల వెలింగెఁ దొల్లి యు
త్ఫుల్ల సరోజ బాణుఁడిలఁ • బుట్టిన నాఁడు రమా సుమాంగి లో
వెల్లిగఁ బాలు సమ్ముదము • పేరిమిఁ గప్పిన వెల్ల యొల్లె నాన్

మ॥ పొలఁతుల్ చేరిరి చుక్కలల్లెసఁగు మే • ల్మెత్యాల పందిళ్ళనీ
డల సంచార పయోదముల్ దిగెడు ద • ట్టంబౌ వనాంతంబులన్
జెలమం దేటిన నీరువోలు స్ఫటిక • స్ఫీత స్ఫుర ద్వేదికా
స్థలులం బుష్పిత కాయమానముల ని • ష్టాగోష్ఠిఁ గ్రీడింపఁగన్

తే॥ పుష్పవేణులతోఁ గూడి • పూల సెజ్జ లందు కాలంబు పుచ్చెడు • నాసఁ బురుషు
లమృతముంబోలి తేటయై • యలరు మధువు, హైమచషకంబులం గొని • యానిరపుడు.

తే॥ అమర గంధర్వ విద్యాధ • రాద్యముఖులఁ గేరు సౌష్ఠవ మొప్పు న • క్కిరవాణు
లలరులం దేంట్లు తేనియ • లాను లీలఁ, జప్పరించి రాసవమును • చవులు వాఱ

తే॥ చంద్రికను పాలఁబోలిన • చషక మూను, చేతికాంతిచేఁ జెలువారి • జేగులయ్యె
సుదతి యానిన సుర రాగ • సుధను బోలె, నింతి కనుఁగవ యప్పుడ • యెఱ్ఱఁబాఱె

తే॥ అగురుపొగగ్రమ్మ క్రొమ్ముడి • యవఘళించు మగువ త్రావిన తెల్లని • మధువువహ్ని
కుండమున నెయివోసిన • కుదురుదాల్చి యుల్లమున నున్న కామాగ్ని • నొలుకఁజేసె

చ॥ వికసిత ఫాల యైన యలి • వేణి యొకర్తుక పైఁడిగిన్నెలో
పలఁ దన నీడఁ గాంచి చెలు వా! మధు వానుదు రమ్మ యంచు వే

పిలిచె, విసంబుఁ బో ల్కనుల • వేఁడిమి వాక్కుల నద్ధి వెన్నయున్
వెలయు మనోజ్ఞురాంధ్ర యవి • వేకపు దీటు మఱొండు గల్గవే.

చ॥ అలుకఁగఁ దగ్గ కౌను గల • యంగన యాసవ పాత్ర మందు వే
నలియును కెంపు మోవి చిఱు • నవ్వు విష స్ఫురితాగ్ర కుంత వీ
క్షలు గల నీడఁ గాంచి వెఱ • చానరొ యేమి యొనర్తు వద్ది యెం
గిలి యిదిక్రొత్త త్రావు మని • కేరెను కుట్మల దంత కాంతితో

ఉ॥ నూత్న విధంపు హింసలను • నూల్కొనఁ జేసెడి చూపులాఁడి మేల్
రత్నపు గిన్నెఁ గౌముది చొ • రంబడఁ గల్లని సంభ్రమించి వే
యత్నముతోడ నానునెడ • నంగన లెల్లరు కేరి కామినీ
రత్నముఁ గాంచి నవ్వ నల • రామయు శీర్షము వంచి సిగ్గిలెన్.

ఉ॥ వీణకుఁ బిల్లఁగ్రోవి కొరద • వించెను శ్రావ్యత యీమె యంచు వి
న్నాణముగా వచింపఁదగు • నారి యొకర్తుక కల్వ తావి కల్
నాణెపుఁ బాత్రఁ బట్టి నయ • నంబుల నీడను గాంచి యంత సిం
గాణి బొమల్ వెలుంగఁ దొలఁ • గన్ వతి నూఁదె ద్విరేఫమన్ భ్రమన్

తే॥ కైపు మిక్కిల ఘూర్ణిల్లు • కనులతోడఁ, గల్లునం దిందు బింబంబుఁ • గాంచి యొకతె
యీవురాహూభయంబున • నిచటడాఁగి యుంటె? యడలకు మభయంబు • నొసఁగితినను

క॥ సుడియే యనఁదగు పొక్కిలి, యడరు పడఁతి పూల పంది • రందలి జ్యోత్స్నన్
సుడియు మతిచేత మధువని, తొడిఁబడి గిన్నియకుఁ బట్టఁ • దొడఁగెం దోడ్తోన్

తే॥ మించు సంచునఁ జలియించు • నించుఁబోఁడి సుధను పోలిన పలుకుల • చొప్పుచెడఁగ
రశన మూడిచి విరుల స • రంబు చుట్టె శిరసునం గట్టె బంగారు • సరిగ చీర

తే॥ కల్లుపాత్రలోఁ దనమోముఁ • గాంచి యొకతె నిందుఁ డానఁగ వచ్చెనం • చెదఁ దలంచి
చంద్ర! పొలయల్క వేళలఁ • జల్ల నగుదు వేని యీ కల్లునీ కిపు • డిత్తు ననియె

తే॥ ఒక్క తిలనాస ముంజేయి • త్రొక్కులాడ నాననముపయి నొలికించి • యాసవంబు
మైకమున నెఱుఁగక మఱి • మధువు నాన గిండి కెమ్మోవిపై బోర • గించె మరల

చ॥ పిసిని ధనంబుకై యరిగి • వేచిన యాచకు లట్లు తుమ్మెదల్
ముసరి రవాళి సేయ నొక • ముగ్ధ ముఖాబ్జము విచ్చి యాసవం
బెసరఁగ నాన నానగొని • యింబుగఁ గోరను నానవైచు నా
బిసమున జుట్టసాగె నలి • వేణులు వింతగఁ గాంచుచుండఁగన్

ఉ॥ వాలుగ మీలు బెట్టు చెడి • పాఱ నొఱఁగా వెలివాలు కత్తి నా
వాలికలైన కన్నులను • వాల్జడయుఁగా మద బర్హి చాయయున్

గ్రాలు లరాంత కోమల యొ • కర్తు ప్రియుండు సురన్ గ్రహింప(డ౯
మేలి గుణంబుతో నదియు • మేకొన దాన(గ నుత్సహింపదున్‌

తే॥ ఒకతె కోపాధినయ మూను • నొలపు దో(ప(, గన్ను లెఱుపొందనోసలు వ • క్రలఘజింప
బండ్లు గొఱుకుచు సులలిల • పల్లవముల, తిము డిడ(చు కర తలముల( ద్రిప్పుచుండె

చ॥ చలనమునొందు మోవియను • జానగు నెఱ్ఱని దొండపంటిపై(
దెలి నెల కాతులంగినిసి • తేటిన తెల్లని పండ్ల నొక్కుచున్
దొర(కుచు శత్రు రక్తమున( • దో(గిన ప్రాసము( బోలు కన్నులన్
జిలుకర చూచు చెల్వ మయి( • జెమ్మట గ్రమ్మెను విందు కల్లనాన్

ఉ॥ పండిన మోవి దొండపయి • భాసిలు రక్తిమ రెండుకన్నులన్
నిండ(, దలంచు టొక్కటియు • నేర్పున( బల్కుట యొక్కటైన యా
యండజయాన మో మనెడి • యద్దములో( గల కన్నుబొమ్మ కో
దండము వంగె( గంపనము • దాల్చె( జెమర్చెను భాలచంద్రు(డున్

ఉ॥ బూరుగపూవు రీవి గల • మోవి మెఱుంగునుపీడ( బండ్లయం
దూరిన నీరు తేనెవలె • నొల్క(గ, తొమ్మన తైకతోడుతన్
జీరయు జాఱ, వేనలియు( • జిక్కయి జీరుకులాడ గేలి న
వ్వార( బ్రియాభిషంగమము • నాసవ సేవయు నొప్పె సామ్యమై

తే॥ అసమశరునిచే వలవంత • నందుచున్న, యొర్తి ప్రియు( దేర( జేటిక • నొగిని పంప
నెంచియోచెలీ! నీవునా • యెద(దవలెనె,.యచటనేయుందొ? మరలుదొ? యనుచు(బలి

క॥ హరిణాక్షి యొకతె తనప్రియ, వరు( బిలువగ( జెలులనెల్ల • వరుసగ(బంపెన్
దరువాత వారివెంటనె • తరలె నొకర్తుకయె తాను • దయితుని కడకున్

క॥ వలచు విరి సెజ్జపై దరి, దెలియని మోహాబ్ధి మును(గు • తెలవ యొకతె తీ
పొలయు(గ వల్లభు పేరుల, బలుకు చిలుక( గౌ(గిలించె( బ్రాంతి • తొలంకన్

క॥ వనజాక్షి యొకతి శయ్యను, దన తోడగు చిలుక నలమి • దయితు( బిలువ కే
మనియెదు? జక్కవతో నీ, వును తాపము గూర్తె? యనుచు • బోరున నేడ్చెన్

క॥ తన సవతి పేర దయితు(డు, తను పిలువ(గ నవ్వు వచ్చె( • దరలాక్షికి వెం
టనె కినుకనుండి పలపల, మని బాష్పకణంబు లురలె • వలుకయు( దొల(కన్.

తే॥ మునుపు దొస(గుచేయుప్రియుండు • నెనరుదో(ప(, బిఱు(దుమొలనూలిపై( గేలు • వెట్టి
దరుణీకన్నులనక్రుము • క్తములునేల, జింద(దెగుమేఖలామణుల్ చెదరుమున్నె

చ॥ అలుగుదునా ప్రియుం డిటకు • నచ్చిక బుచ్చిక సేయ వచ్చినన్
కలియుదునా యెదం గలుగు • కంతుని వంత తొలంగు నట్లుగా

పలుకుదునా మనోహరు స్వ • భావ విశిష్టత వీణ మీటుచున్
దెలుపుదునా మనోవ్యథను • తేటగ నంచొక యింతి చింతిలెన్

క॥ ఒకరిత తన ప్రొలయల్కను, సకులకుఁ దెలుపకయె వీణ • చయ్యనఁగొని హ
స్తకమల మెట్టిన యగునటు, సుకముగఁ దన మదిని గలది • చొక్కఁగఁ బాడెన్

క॥ కొంచును శకునం బొకసతి, కాంచిన యపు డెల్ల ననువు • గానని వగచే
నించు విలుతు నేటుల నుసు, అంచితముగ వెడలఁ బాఱు • నన నిట్టూర్చున్.

తే॥ కందుకమున కందం బిడు • సుందర కర, ప్రియుని పిలువఁగా జోటినం • పినది యంత
లోన వచ్చె నన్నంతఁ ద • ల్పులను మూసె, నామె తలఁపేమొ యెఱుఁగళ • క్యంబుగాదు

క॥ అమరిచిన పానుపునఁ జెలి, యమరముఁ దొలంచు త్రోవ • యరయని దయితున్
విమలాంగి కల్ల సోమరి, తిమురున నీలుగుచు నడిగెఁ • దిన్నగ గడియల్

క॥ పదరి యొకతె లత్తుక గల, పదమునఁ దాఁపఁగను నిండు • వపువను చేనన్
వెద వేయఁగ వల మొలకలు, పొదలె ననన్ గగురుపాటు • పుట్టెఁ బ్రియునకున్

తే॥ పగలు నోరిచి మరలిన • బంటొకండు, సుందరీ స్తనములు కృశిం • చుటను గాంచి
పొంగి తన్ను మించిన ము • దంబున మొగంబు, తేటనొంద భుజంబులు • మీటనిలిచె

తే॥ లలిత సుందరుఁ డొకఁడు త • ల్పంబుఁ జేరి, కంతు నంపలు యెల్లెడఁ • గప్పి యున్న
పగదినొప్పు పానుపు మీఁది • పల్లవములు, మాఁడుటం గంటఁగని దిగ్భ్ర • మంబునొందె.

తే॥ కలప ముడుకు తాపము గల • కదనవిజయ, వరునకుం బ్రియురాలిబొం • గరపుఁజనులు
తనకు నభిషేక మొనరింప • ఘనులు నిలుపు, కనకపూర్ణకుంభములను • గరిమఁగాంచె

ఆ॥ కనక లతిక ప్రియుని • కడఁజేర నుంకించి గజ్జియలును రశన • కంకణములు
దొలఁగఁజేసి పొరపు • గల చందురుని మదిఁ, గనలి యుఱిమి చూచి • కడఁక మానె.

క॥ నవ మదనున కొక్కరుత్తుక, తవిలి పువులు కోసి చుట్టి • తార్చిన సరికిన్
బవి భుజ యుగళము లొంగెను, బువు సరము బలంబు నేము • పొగడం దరమే?

తే॥ కుటిలకుంతల తనలోని • కుములు దెలుప, మన్మధుని గాంచి తన చెలిన్ • మరలఁగాంచె
నింతియుద్దేశమునుగ్రహి • యించిసఖియు, సుందరుఁడుచను త్రోవను • చూడఁదొడఁగె

తే॥ రాజవీరుని కడ కొక • రమణి వెళ్లె, నాతిఁబిలిచిన దూత మ • నంబుఁ గలఁచు
మధువా? మాకుత మో? మావొ? మరుఁడొ? యేమొ? అరసిపలుకంగసేరికి • నయితిగాదు

తే॥ పొంగినట్టి మోహమునకు • లొంగి వాన, వంటి చల్లని కనులబా • ష్పములు రాల్ప
నేమి మాఁడెనె యని హితుం • డెదుర నవ్వ, నవ్వి సిగ్గు వీడిన దెల • నాఁగయోర్తు.

తే॥ లేమి నెలవగు కటిగల • లేమ కనలు, ప్రబలఁ దడవిన చేతి న • వ్వలికిఁ ద్రోచెఁ
ద్రో చునాచేష్టయాప్రియు • తొమ్మనందు, కుంతముం గ్రుచ్చుటంబోలెఁ • గుములఁజేసె

ఆ॥ చెలిమి కలిమి గలుగు • చెలి చేయి దడవుచుఁ, జెలువు బిలువుమంచుఁ • జెప్పఁబూను
దన యెడంద సిగ్గు • తలయెత్తఁ జెప్పకో, రంతఁ బ్రొద్దు నిలిచి • యలమటించు

ఆ॥ సుడిసి వలపు పైకిఁ • బొడుచుచుండ నొకర్తు. బయలి ప్రాణమైన • వలపుకాని
చేష్టలెల్ల సఖికిఁ • జెప్పంగ సంకించి, బిడియమంది వేలు • నుడువులాడె.

తే॥ ఒక చెయుల్లముల్ ప్రాణము • లొకటెనిందు, ప్రేమయొకపాటి దేయైన • ప్రియుడుఁ బ్రియము
నొడళు లొకటి చేయఁగఁ బోలు • నొత్తి బిగియఁ, గౌఁగిలించికొనిరివారు • కాంక్ష లూఱ

క॥ సుందరుఁ డెదురగుడు మనసు, ముందేగె మనంబుఁ బోలు • మొగమును ద్రొక్కన్
సుందరునకు నది క్రొత్తగు, చందముగా సిగ్గు పూచెఁ • జానకుఁ బోలెన్.

చ॥ పొలఁతియలుకం జనించు వల • పుం గొని దత్ప్రల మూహ సేయు చా
పలమతి యొర్తి కొంటిమెయి • వల్లభుఁ దేరక రేయివోలెఁ గ
ర్వలివలెఁ జేటి చేరఁజని • బంధుర దేహ! యిదేటి తీరు? పైఁ
జాలుకఁ దనమ్ముగాదె? యని • సూక్తులు పల్కెను తల్లి పోలికన్.

తే॥ సంజదయ్యము దాఁకిన • సరణి నొప్పు, వలపరి యొకర్తు తల యెత్తి • నిలుచుఁ జూచుఁ
బలుకునదియేమొ యెఱుఁగదు • చెలువుఁ బిలువఁ, బంపుదూతితోఁ దనతెల్వి • నంపెనేమొ?

తే॥ జననమరణచక్రమువోలె • సంచలించు, మనసుతో మొయిలునఁ దోఁచి • మరలమఱుఁగు
మించువలె బయటికి వచ్చి • కాంచుఁ బిదప, నేగుచుండు లోనికినొక • యించుఁబోణి.

తే॥ మకరికాయోగ్యమౌ చను • మలల మీఁద, కంతుతూపులు తొలిచిన • గాయములను
కేల నదుము నేడుచు నవ్వుఁ • గినుకఁ జింత, వెల్లడించుఁ బొమ్మని చూతి • వేఁడు నొకతె

తే॥ సంభవము నార్తినెఱిఁగిన • జనులయొద్ద,, చెప్పికొనుటలు వృధయని • చెమ్మరించి
యుడికి కృశియించి పడకపైఁ • బడుచు నొర్తు, ప్రక్కనిలిచిన చేటిని • పాఱఁ జూచె.

తే॥ లికుచకుచలగు కన్యకా • లికిని మించి, భ్రమయుచున్నాడు మదులందు • పచ్చెకాని
కరణి జొచ్చివారలుద్రావు • కల్లుకేటఁ, ద్రావెఁగాఁబోలుఁబూన్కిఁగం • దర్పుఁడిపుడు.

తే॥ తరుబులం గూడ రసన లం • బరముబూచ్చి, తొలఁగఁజేసిరి వల్లభుల్ • తుడుమువంటి
వారలేనియు పెలి వఱు • పంగఁదగని, చెయ్యులొప్పార దగ్గఱఁ • జేరఁదగునె?

తే॥ బయలి మేఖలల్ వలువలు • వదలఁజేయు, టద్భుతమే? యొర్తు బిడియంబు నవలఁద్రోచె
నాప పలంబు గలుగు సన్న్యాసి వలెనె, తన్ను సన్న్యసించుటయు ని • త్తఱిని గలదు

తే॥ తరుణుఁడొకండొక తరుణి కం • దర్పకదన, ఘుంద సముల్లైరి పెచ్చుత • గ్గరయరాఁక
యిరువుర తలంపులూపిరు • లేక మయ్యె, నన్నచో నెవ్వరందు గె • ల్పందువారు

తే॥ ఒక్కరుఁడుకరమునఁదన • యురముమూయ, నెదనువసియించుప్రాణనా • యికకుఁబోటు
గలుగు నని వంచనమ్మనఁ • గరతలమున, ఘూయుచున్నావనుచు నొక • ముదిత కసరె.

తే॥ పగడపు మ్మోవి వక్షోజ • పర్వతములు, మృదుల హస్తముల్ భల్లంబు • నెనయుకనులు
గలుగు సతియోర్తు వలపుల • కడలియైన, ప్రియున కట రంభవలె మేటి • ప్రేమ నొసఁగె.

తే॥ వలపు కాని యసత్య వా • క్కులఁ దలంచి, మేరలేని కోపముగొని • మూర కదన
మందు మగపోఁడిమింజేసి • యడఁగి యున్న, యాసయేగెల్వ నొకచామ • యతిశయిల్లె

తే॥ హింస్ర సాధనములు రూప • మెనసినట్లు, మెఱయు కన్నుల చెలి తన • యొఱపుకాని
నలమి గుబ్బలి గెలుచు గు • బ్బలు కడింది, విభు నురము దూపి చనెనని • వీఁపుచూచె.

చ॥ చెలువల క్రొత్త వలపులను, వలకాంద్రు భజింప గంధ • పంక మురలె వే
నలు లూడె గాజులందెఱ, గలగల మనే సంచలించెఁ • గటి సూత్రంబుల్.

క॥ కలువల దాయ యివము వలె, వలపు కినుకఁ దోల నొకితె • పడి నొడికముతో
బలు కల్ల నిద్దురం గొని, కల సాకున నోరిమకానిఁ • గౌఁగిటఁ జేర్చెన్.

తే॥ ఇందు బింబాస్యయును తన • హితుఁడుజేరు, తరుణమబ్బుఁటచేదానిఁ • దలఁగఁ ద్రోవ
కొడలి నొడలితోఁ బెనవైచి • యెడయిక నెద, నరయరైరి యువయమౌట • యరయరై

ఆ॥ కాంక్షిలూఱునుత్సు • కత వరులకు, వక్ర, కుంతలలకు రతులఁ • గూర్చ రేయి
వలుఁద చనుల మోయు • బలిమిఁ గాంచని మధ్య, ములను పోలి కార్శ్య • మునుభజించె

ఉ॥ పున్నెపుఁ గర్జముల్ తొడఁగి • పూర్తి యొనర్పని వారి సంపదల్
చెన్నుగ మధ్య వచ్చుచు న • శించెడు రీతి విధుండు క్రుంకెఁ బై
వెన్నుని తొమ్మనం బరిథ • విల్లెడి కౌస్తుభ రత్న లీల వా
రాన్నిధియందు దోఁచె గ్రహ • రాజు జగంబులు తెల్వినొందఁగన్

## 18 ఎదురుకోలు పటలము. 31

సీ॥ చెడు నీతి త్రోవలఁ • జెల్లక ధర్మ శా, స్త్రానుగుణ్యంబుగ • నరుగు నెఱుక
నయము దప్పని పాల • నము గల్గు దశరథ, చక్రవర్తియు గొప్ప • సామజముల
మద జల ధారల • నదులు పాఱుచునున్న, సేనా సముద్రంబు • చేరి కొలువ
నాగలోకంబును • బాగుగాఁ గనఁబడు, పరిశుద్ధ సైకత • ప్రభలు గలుగు

తే॥ త్రిపథగం జేరఁగా నాయు • ధీయమైన, సైన్య వారాశి తజ్జల • సమితిఁ గ్రోలె
దానిఁ గాంచిన యుప్పు సం • ద్రంబు గూడఁ, దేట నీరు ద్రావెడు నాస • దీటుకొనఁగ

తే॥ పృథుల కేదార వేష్టిత • మిథిలఁ జేరు, నంత దశరథు రాకకు • నలరి జనక
వల్లభుఁడు మహోదారుండు • వార్ధి వలెనె, పొంగి యెదురుకోల్వచ్చెవి • భుత వెలుంగ

మ॥ ప్రబలోత్సాహము చెంగలింప మద నా • రం గంబులున్ దేరులున్
విబుధశ్రేణి తురంగపాళి బలయన్ • వీరావళుల్ గొల్వ న
వ్విబుధేంద్ర ప్రతిమానుఁ గోసల విభున్ • వీక్షించి తోడ్తేర ధీ
ర బలుండౌ జనకుండు వోయె రవిఁ జే • రం బోవు చంద్రుండు నాన్.

శా॥ గంగా ప్లావిత భూ విభూత్తము చమూ • కాండంబు షడ్వారిధుల్
తుంగోద్వీచుల శంఖ నాదములతోఁ • దోతేర శ్రీ లక్ష్మి నా
ఒంగం గాంచు సుధాబ్ధి సంతసమునన్ • బ్రత్యుద్గమింపై న జో
కం గన్యామణి సీతఁ గాంచు జనక • క్ష్మాపాలుఁ దేగెన్ వడిన్.

తే॥ పరఁగ నశ్వత్థ దళ రూప • భల్ల సమితి, యడరు దశరథు సేనకు • నబ్ధి సప్త
కంబు చతురంగ బల రూప • గరిమ నొంది, జగము పరపంగ నదియ పో • సాటియగును

తే॥ జాలరులు జాలువారు ము • త్యాల గొడుగు, లోలి పీలి కుచ్చులు గప్ప • నుప్పరంబుఁ
బగలు మఱఁగి యిరులు గ్రమ్మఁ • బ్రభుని పేన, రంగు పూవుల పద్మాక • రంబుఁబోలె

మ॥ కమలాదేవికిఁ గాణయాచి విపుల • క్ష్మాపాలు పెక్కెంబొ ? వ
క్షమొ ? కోటీరమొ? నిస్తులీ కృత వళ • క్ష చ్ఛత్రమో ? సత్కుల
క్రమ సంపాదిత రాజ్యమో? బహుళ సం • ఖ్యం బొల్చు సైన్యంబొ? బల్
శ్రమలం జెందియు నిర్ణయించి పలుకన్ • శక్యంబె యెవ్వారికిన్ ?

సీ॥ కంచు కాపూర్ణకు • చాంచితోరస్కుల, నీలవేణికలందు • నిండుతేంట్ల
ధ్వనులనే పోలు నా • దస్వర సప్తస్వ, రారావములు బహు • వ్యాప్తి గనియె
రథనేమి రవము వా • రాశి ఘోషముఁ బోలె, గజ ఘీంకృతులు మేఘ • గర్జఁ బోలె
జగతి పరిఖయైన • జలధి మెరకగాఁగఁ, బెంధూళి నిండి యా • పిదపఁ బైని

లే॥ యేడు లోకంబులను ముంచి • యెసఁక, మొసఁగె, ననుట తేలిక మాటయౌ • నసుర వైరి
జగములం గొల్చు పాదము • చన్న త్రోవ, నేగి యావలి లోకంబు • లెల్లఁ బ్రాకె.

తే॥ పరవు గొడుగులవరుసలు • ప్పరముగప్పఁ, గలుగునిరులఁ దొలంచుట • సులభమె యగు
మణి విభూషలు వెన్నెల • మరపుదెచ్చుఁ, గొరడువైచునెండయుఁగాయు • మెఱుపుమెఱయు

తే॥ కోసలేశుండు రా జన • కుండు గరిమ, నెదురు పచ్చు పథము లెల్ల • హేమరజము
గందవొడియుఁ బుప్పొడి పచ్చ • కప్పురంబు, పెక్కు వగల తావుల ధూళి • బెరసియుండె

తే॥ పునుఁగు కస్తురి కుంకుమ • పువ్వునగురు, కలిపి చల్లఁగా నైన పం • కంబుతోడఁ
గరుల మద జలధారలు • గలిసి పాఱ, నైన బురదలే వీధుల • యందు నిండె.

తే॥ నీడ లన్నియుఁ బరిమళ • నీల కచల, కనక రత్న భూషల కాంతిఁ • గలుగు నవియు
విజయ చిహ్న పతాకలు • విరియు మేలు, కట్లు గొడుగులు గప్పఁగాఁ • గలుగునవియు.

॥ దశరథుని సేనతోడ ను • త్కంఠమెయిని. జనకు సేనయుఁ గలిసె ఘో • షణమునిండ
ఘన తరంగాకులారావ • కంధియందు. నదులు చేరఁగా జరుగు వి • న్నాణమొప్ప.

॥ జనకుఁ డుత్సాహమున లోక • జనకుఁ డనఁగఁ, దగిన దశరథు రథమును • దాయవచ్చె
రథికవరులతోఁ దన మనో • రథమువంటి. రథముపై నాసఁ బోలిన • రయము మెఱయ

॥ డాసి తేరు డిగ్గి, మీసరంబగు సేన. వెనుక నిలువ మున్ను • వెడలు నతని
దశరథుండు కేలు • తగఁ జాఁచి యరథ మె. క్కించికొనియెఁ గౌఁగి • లించికొనియె

॥ పులియెదుటి సింగముం బోలి • పురుషవరుఁడు, చెలిమి బంధు మిత్రాదుల • సేమమడిగి
ముందు జరుగ నిమ్మన ముద • మంది యెల్ల, వారు మిధిలాపురంబును • చేరినారు.

॥ ఇట్టులింపుపెంప • నిరువు రేగుచునుండ, తన్ను దాన పోలు • ధన్య గుణుఁడు
శివుని ధనువు విఱుచు • శ్రీరామచంద్రుండు. జనకు జనకు నెదురు • కొనఁగ వచ్చె

। విబుధ మనుజ నాగ • వినుతుండు రాముండు, బలసి వీరవరులు • గొలిచి రాఁగఁ
దమ్ముతోడఁ దాను • తపనీయ రథమెక్కి. వచ్చిచేరెఁ దండ్రి • వాంఛవోలె

। దశరథేశు నెదుర్కొనఁ • దరలుసేన, లోన నేనుఁగులో? పిడు • లో? హయములొ?
లెక్కపెట్టంగ మానంబు లేకయున్న. యా సమృద్ధిని పలుక శ • క్యంబె తెలిసి?

నీలోత్పలమ్ముఁ ద • మాల పుష్పముఁ బోలి. చిత్రసౌందర్యంబు • చెడఁగ నొప్పి
యమర వినుతమైన • యడుగుఁదమ్ములు గల• పిన్నవాఁడగు రామ • విభుఁడు మున్ను
వదలిన ముఖ్య జీ • వమ్ము పిదప వచ్చి. చేరిన కరణిని • చేరి యంతఁ
దక్కు వారు తనకు • మ్రొక్కుచుండఁగఁ దన. కన్న జనకు పాద • కమలములకు

వినతుఁ డగుచు లేవ • మనువనఁ దగు దశ. రథుఁడు గాఢముగ ను • రమ్ముఁ జేర్చి
యలమికొనియెరుద్రు • విలుద్రుంప మున్నెగు. మహితబాహు గిరులు • మఱుఁగుపడఁగ

తొలఁగ వీలుకాని • దుఃఖమ్ము మొత్తమ్ము. మాయ మైన యంత • క్ష్మావిభుండు
లలిత రీతి మ్రొక్కు • లక్ష్మణుఁ గ్రుచ్చిక. వుంగిలించికొనెఁగ • రంగుప్రేమ.

భవుని ధనువు ద్రుంచు • నవ మన్మధుండంత, మరలి తల్లులకు న • మస్కరించె
వారి యెడఁదఁ బొడమి • పారమ్ముమీఱిన. సంతసంబు దెలుప • శక్తు లెవరు?

మేటి భక్తి యతిశయించి • తేట యైన. కరణిఁ గన్నీటి కణముల • నరము లురల
మ్రొక్కు భరతుని తను తండ్రి • మున్నుతడవు. పగిదినురమున. జేర్చె జీ • వములఁబోలె.

శా॥ శ్యామాకారునితోడ వచ్చు ఘనుఁడౌ • సౌమిత్రియున్ విస్ఫుర
త్ప్రేమాకారునితోడ వచ్చు గుణవ • ద్వీరుండు శత్రుఘ్నుఁడున్
ప్రేమ శ్యామల రూప భూషణములై • పెంపారు పాదాబ్జముల్
మోముల్ చేరిచి మ్రొక్కఁ జేర్చుకొని రా • మోదంబుతో వక్షముల్

తే॥ నీతికరుణలే విభుని వి • ఖ్యాత ధనము, లని యెఱింగిన తమ తండ్రి • ననుగమించి
యనుప మాగమోక్త క్రమ • మనుసరించు, సుతులునలువురుచూపఱు • చూడ్కిగొనిరి

ఆ॥ సాక్షి యనఁగఁ దగ్గ • సత్పరిపాలన, మడరఁ దల్లి బోలె • నమరువాఁడు
దశరథుండు పిదపఁ • దనయుని వీక్షించి, వైభవంబుతోడఁ • బదమ యనియె

తే॥ కరులఁ బోరిన యవ్వీర • వరుల ప్రేమ, మెంతదో? వారికౌతుక • మెంత పొడవొ?
కనఁగలేము కుమారులు • కదలుసంతఁ, బరిజ నోత్సాహ మాతండ్రి • పగిదిఁ బోలె.

తే॥ ప్రేమమయులగు తమ్ములు • క్రేవలందు, సమ్ములై వేడ్కతోఁ దురం • గములమీఁద
రాఁగ నున్నత రథమ్మున • రాముఁ డేగె, భేరి మున్నగు వాద్యముల్ • బోరు కొనఁగ

తే॥ పడవి యభ్రంక షోత్తుంగ • భర్మ హర్మ్య, ములను చిత్రాకృతులఁబోలు • పొలఁతిగముల
విసము నిండిన ట్లుండిన • వీక్షణములు, పుష్ప వర్ష మ యన నొప్పఁ • బురము సొచ్చె.

సీ॥ అందంపు మేడల • యందెల్ల కర కంక, ణంబులు మొరయ వే • నలులు విరియఁ
జెందమ్మి పాదమ్మ • లం దాల్చు నందె లా, గమ పద్ధతుల తాళ • గతులు దెలుప
కుంభి కుంభంబుల • దంభంబు చెడ దంబు, నింబారు వక్షోరు • హంబు లొప్ప
సన్నుతాంగులు గల • సౌధంబు లెల్లను, నర్త శాల లే • నాఁడుఁ గావు

తే॥ దేవదేవుండు శ్రీరామ • భూవరుండు, దరియ నా బాలికా ప్రౌఢ • మరసిమరుఁడు
ప్రేరణము సేయ వారు గా • వించు చేఁత, లెఱమి నవధరింపఁగ, గుతూ • హలులుగండు.

## 19 విహార పటలము. 48

సీ॥ పూలచేఁ దరియు క్రొ • మ్మెరు లొప్పు పడఁతుల, జింకలగుంపులు • చేరు పగిది
బర్హి సంఘంబులు • భ్రమియించుటం బోలి. ఋక్ష బృందము తేజ • రిల్లు కరణి
మెఱుపుల రాసులు • మెఱసిన కైవడిఁ, దుమ్మెదల్ జుమ్మని • క్రమ్మ యార్వ
జాఱిన క్రొమ్ముడుల్ • సవరించుకొనకయు, మొఱనూలు తెగుటయు • దెలియకుండ

తే॥ పైఁటలంజాఱసవదరిం • పకయుఁగొను, లులియలెక్కింపకయుడాసి • తొలఁగుతొలఁగుఁ
డనుచు మధువు గ్రోలఁగ వచ్చు • నళులయట్లు, సరభసంబున ముసరి రు • త్సాహ గరిమ

సీ॥ కనుఁతోనే ప్రేమ • యను వస్తు రూపంబు, గాంతము గాక యో • కాంతలార!
ఈ నాతి జన్మంబు • చే నొందఁ దగు ఫలం, బీ నాఁడె కందమో • యింతులార!
రాతికిఁ దొలిరూపు • రమణఁ గావించిన, పదములఁ జూతమో • పడఁతులార!
కను బరువైన శ్రీ • కంఠు విల్విఱిచిన, కరము లీక్షింతమో • కలికులార!

తే॥ అనుచు నీటి యెద్దడి నొచ్చు • హరిణ చయము, విమల జల పూరముం గన్న • విధినివల్ల
మునకుఁ బాఱు జలముఁ బోలి • మనసు పఱవఁ, బట్టఁ బరుగిడు చందానఁ • బరుగు లిడిరి.

ఉ॥ మానుగఁ దేరిపై నగర • మార్గమునం జను రాముఁ డప్పు డ
న్నే నయనంబు లార్పక ర • హించి కనుంగొనుచున్న యట్టి కాం
తా నికరంబు కన్నులనె • దప్పు కెఱుంగఁగ జేసె నుత్తమ
జానులు తన్ను కృష్ణుఁ డను • నామమునం గల యర్థ మంతియున్

చ॥ తలఁపును మించి యాతని ర • థంబు రయంబునఁ బోవ కిచ్చటన్
నిలుచునుగాక యంచుఁ దరుఁ • ణీ మణు లెల్లఁ దపించుచుండఁగా
నిలను దిపంబుఁ గొల్చిన ర • మేశుని రాఘవు నెప్పు గంటి తె
ప్పల కటు దాఁటనీక సలు • పం దగు మానిని యెంత ధన్యయో ?

చ॥ వలఁతి యొకర్తు స్త్రీత్వమను • వల్వయుఁ జిన్నెలు భూషణంబులున్
దెలివి తెఱంగు తేటయును • తేజము లజ్జయు మానసంబు స
త్కులము బలంబు గౌరవము • గోలతనంబును గాత్రమున్ స్వజీ
వ లవము చక్కఁ దక్కనవి • పాయఁగ నిల్చెను పుత్రికాకృతిన్

తే॥ కమ్మలందాఁటి వెలుగొందు • కనులయందు మబ్బువోలె నీరొడియంగ • మరుశరమ్ము
లెడము లేకెద గాడఁగ • వడఁకె నొకతె మొగులు లేని మించనఁదగు, మొలనుపోలి

మ॥ అలినీలాలక లెల్ల జెప్ప లిడకా • శ్యామాంగు మై యందమున్
గలయం గాంచుటఁజేసి నీలిమము నా • కన్నుల్ తగం బొందెనో
కలుకుల్ కాటుక కన్నులన్ విరిసి యు • త్కంఠన్ విలోకించుటన్
నలుపై యొప్పునొ రాము మేను తెలియం • గా రాదు సుంతేనియున్

మ॥ చిగురుం బోఁడులు రాముపై విరులు వ • ర్షింపంగఁ గందర్పుఁడా
ఒగిదిన్ వారలమీఁదఁ బుష్ప శరముల్ • వర్షింప నొక్కర్తు నున్
జగతీనాధుని చంద శానము ని • శ్యామాంగు చిత్తోన్నతిన్
దగవు న్నేలక భీత నేత్రలకు బా • ధం గూర్చు వీఁ డెవ్వడే

చ॥ లలిత పరాంగి యొక్కతె య • లంకరణంబులు వీడి రాలఁగా
పలువ యొకండు మాత్రి పెర • పల్లవ మందున జిక్కఁబట్టుచున్
మల గుమ నిల్చె శిల్పకు డు • మాటలఁ బ్రేమల దాటి సల్పు పెన్
వలపునె ముద్దచేసి చెలు • వంబుగఁ దీర్చిన చిత్రమో యనన్

ఆ॥ గెలుపు హింస గలుగు • క్రీఁగంటి చూపుల చెలువ యొర్తు కొనలు • చెమ్మరింప
మనసు సొక్క నిలిచి • మతి యొందు గానక రాము దొంటి యున్నె • చామః యనియె

ఆ॥ మనసు కరఁగి యున్న • మగువ యొక్కర్తు యా వంచకుం దెడంద • వచ్చి చొచ్చె
వెనుక కేగకుండఁ • గను త్రోవ మూసితి సైగ గదికిఁ బోదు చేటిః యనియె

ఆ॥ చిలుకఁబోలు నతివ • రతిపతి శరములు గుచ్చిన గొనక చికిన • కంచుకంబు
బ్రీల పచ్చి నిలిచి • ప్రేమమైరాము మై, యొప్పుగాంచు వారి • మతిమి చూచె.

తే॥ ఉత్సుకతతోడ నేతెంచి • యువతి యొకతె, దీర్ఘచపల నేత్రంబులఁ • దేటిచూచి
తృప్తివడి ప్రేమగొని యెడ • తెఱపి లేని, లోని సంతాప మడరంగ • లోనికేగె.

ఉ॥ తోఁచిపుఁ గేశపాశములు • దొడ్డకుచంబులు బల్ పిఱుందులున్
దూఱఁగనీక దట్టమయి • లోఁపఁగఁ గన్నులఁ జూడలేక య
ప్వీరుని సౌరు గాంచు లమి • ప్రేరణ సేయ శుభాంగి యొర్తి యిం
పారఁగ వారి కొనుల బ • యల్లనె వంగుచుఁ గాంచె నత్తఱిన్.

చ॥ మదనుని సూన బాణములు • మానసముల్ గలఁపంగ వీధులం
జెదరిన భూషణావళులు • చిందిన గందము జాఱు మేఖలల్
కొదరిన తాకహారములు • క్రొమ్ముడి జాఱిన పూసరంబులున్
బొదలిన చోట్లు దక్క మఱి • పుట్టదు వేలుగు తా వొకింతయున్.

సీ॥ భుజములఁ గనువారు • భుజములే కాంచిరి, పదములఁ గనువారు • పదులె గనిరి
ఆజాను బాహుల • యందంబు గనువారు, వానినే తెప్పవా • ల్పకయె కనిరి
వాఁడి కన్నులు గల • వారిలో రూపంబు, పూర్తిగాఁ గాంచిన • పుణ్యు లెవరొ?
తమ మతానుష్ఠాన • ధర్మంబు చొప్పునఁ జెప్పంగఁ బడు మహా • చిద్విలాసు

తే॥ పెక్కురూపులతోఁ పనొ • క్కొక్క రూప, మొనరసద్భక్తిఁగాంచునొ • క్కొక్క మతము
వారిఁ బోలిరి వీక్షించు • వారలెల్లఁ, జారుతరమూర్తి రామ వి • హారవేళ

క॥ తనుమధ్య యొకతె బ్రతుకుట, కనువుగా నతఁడామె యెడఁద - నడఁగె జగములన్
వన కుక్షి నడంగించిన, ఘనాఘన విభాంగుకంటె • ఘనులెవ్వారల్?

క॥ చెలి యొకతె తేర్చి తొడినవి, గలగల మనఁ బూవు రెమ్మ • కరణి నెరిగి యా
ఎల వలపల నేడ్చుచుఁజె, ల్వలచేతులోన మరలె • భవనంబునకున్

క॥ గిరి విభ ధనువును విఱిచిన, కరణిఁ జెఱకు విల్లు విఱిచిన • కావఁగఁ దగదే?
పరివీరః దాసినవియెన్, విరుసు మనము గల యొకర్తు • బింకము చెడఁగన్.

క॥ చెలి యొకతుక యనియెఁ దపః, ఫల మనఁదగు రాఘవుండు • బండిం దిగి క
న్నుల యెదుట విఱుకు త్రోవ, న్నిలిచిన యీచేఁత కలయొః • నిజమొః • కపటమోః

క॥ కనకాంగి యొకత మదినే, తవ దూతిగఁ గొనుచు నుసులు • తలరెడి చింతన్
వనజాక్షి జనకవందిని, మును ఘన తపములను చేసెఁ • బూవిక వనియెన్.

క॥ పొచ్చెంబు లేని చిత్రపు, టచ్చునఁదగు పడఁతి యొకతి • యడలి బడలుచున్
విచ్చెలిః యీదృశ్యము మరుఁ, దచ్చముగా వ్రాసి యుంచ • నగునేః యనియెన్

క॥ హరిణాక్షి యొర్తు యారయ నరునకు నీ లక్షణములు • నెటుపొందునె? శ్రీ
పురుఁ డితఁడు నిక్కమియ్యది యరయఁగలరు కన్నులారఁ • ననియెఁ జెలులతో

క॥ పంకజాక్షి తొదవు లూడఁగ మనసు కరఁగ వాడి యితఁడు • మన పుణ్యమునకుం
జనుదెంచుట తొలిఁ జేసిన జనకు తపఃఫలమె యంచుఁ • జక్కఁగఁ బలికెన్

క॥ కను లశ్రులు రాల్ప నొకతె తన యెడ లోడికింబు వీడఁ • దపియించి యితం
డనుఁగులు మునులును విడివడ వనట దొలఁగఁ గలనునేని • వచ్చునె? యనియెన్

క॥ జలదమ్ముఁ గాంచిమురియు నె మలిబోలెం గనకలతిక • మది వెలదాఁచం
దిలఁచె నది మారుఁ దెఱఁగెను తలఁపుల మది దాఁచినట్లు • దాఁచునె మోమున్

ఆ॥ వాలుగంటి యొకతె • పూల పానుపుఁ జేరి పిడుగుఁ మోఁత విన్న • పడగదారి
చాడ్పు మిట్టి యిఱుకు • చన్నులు చెమరింప బుద్ధి చెడఁగ నూర్పు • పుచ్చుచుండె

తే॥ చెంగలువఁ బోలి యమృతంబు • చెంగలించు నధరబింబ లిట్టులు లోన • నలయుచుండ్రి
సీత చేసిన వ్రతములు • చేయకుండు వార లెటు లుండఁగ నరార్తి • నడయకుండ

తే॥ ఒడలు చెమరించి ప్రాణంబు • లుడుకు నొకతె విమల దగురాముఁడింతేని • ప్రేమతోడ
నొకరిఁ జూడఁడ తలఁపడ • యుబ్బు గొనఁడ పలపుసుంతేని మదివేని • వాఁడొ? యనియె

చ॥ పురమునఁ గల్గు పైదలులొ • పూర్తిగ లెక్కకు మించినారు దా
శరథి శరీర సౌష్ఠవము • చాఁగురె! యెల్లయె లేనిదయ్యె చె
చ్చెరి చిరి రౌతు మాత్ర మిఁకఁ • జేయునదేమి? కరంబునందు పూ
శరములు వట్టిపో వయిచెఁ • జయ్యన మొగ్గ కటారి దూయుచున్

తే॥ భువిని వెలఁదులకె గాక • దివిని గలుగు నారులకుఁ గూడఁ గలిగెను • మారు పోరు
లిచట నుండిన మన మద్ది • మెఱుఁగ లేము ఇచట విడిచిపో [illegible] • యటఁ దాఁకె

తే॥ మోహమునఁ జిక్కి భ్రమియించు • ముగుదలింద ఱుండనొకతెనేని గొంకు • [illegible]
ఇతఁడు సన్న్యాసియో? కాఁడు • సతులపాలి చెడుగుకొలవాఁడనుమనొక • చెలువపలికె

తే॥ మఱుఁగు తాపము గల తను • మధ్య యొకతె కాలు చేతులు తూలఁగా • సోలి పడియె
కనిన వార లయ్యో పాప • మనుచు బ్రదుకుఁ గాదు యనిపదింపరి యెత్తి • తాఁకెననుచు

తే॥ యువతియొక్కతెయయ్యేల • యూఁక పోలెఁ గాఱు కాయలుగాయ [illegible]
వెంటఁబడి కొంత దవ్వేగి • ఎదపములి చేరె నింటి కెవ్వరు • [illegible]

తే॥ ఉత్కటంపు మనోభ్రమ • [illegible] యెఱిమొక గోల చెరపియచట
నా మనముఁ గూడఁ గాంచిలే • నాతి యనివెపుడు [illegible] • నిలుచునెపు

క॥ ఇన కులము వారు శరణం బనఁ గాచిన వారు లొసఁగి • యపుడెనెనిన్
వనితల యుసుఱులఁ గొనుటీ తని కెట్లబ్బె ననియొక్క • [illegible] పించెన్

ఆ॥ సిగ్గుచేత నెలవు • చెడిన చంద్రానన, హరుని ధనువునితఁడు • విఱుచుచెన్న
పీఠకొలఁకుఁ గాదు , చేపదు విలువిద్దె, వలఁతి తనము చూప • వలచి యనియె

ఆ॥ మేలి ప్రాణ వితతి • తూలునొక్కర్తుకి ఘోర ధనువు దాల్చు • వీరు నెదుట
మారుఁడిట్లు మమ్ము • మారాము సేసెడి, నెంత బల్లిదుండె • యీతఁడనియె

ఆ॥ వనిత లెల్ల రిట్లు • వలవంత పొలుఁగా విమల మానసుండు • వినుతి గుణుఁడు
చేరెఁ గౌశికుఁడు వ • సిష్ఠుఁడు నృపవరుల్, కూడియున్న కొలువు • కూటమందు

ఆ॥ రాముఁడంత మెఱపు • భ్రమియించు తీరున హార వితతి చలన • మందు చుండ
కాలమేఘ మొండు • నేల వ్రాలు కరణి, చాఁగి శిరము వంచె • సన్మునులకు

తే॥ ధర్మమును గావఁ బుట్టిన • తాటకారి, మ్రొక్కదీవించి వారుకూ • ర్చుండు మనఁగఁ
బుష్పశిల్పంబు గల యొక • పొన్ను గద్దెఁ, దమ్ము లిరుగడ నిల్వమ • ధ్యమున నొప్పె

క॥ నక్షత్రములు భజింపఁగ, ఋక్షేశుఁడు మిన్ను వెలుఁగ • నేతెంచు క్రియన్
బక్షముల విభులు గొలువ న, పేక్షన్ మండపము దశర • థేశుఁడు చేరెన్

ఉ॥ చేరి మునుల పదంబులు • కోరి మ్రొక్కి భూసురాశీఃపదములతోఁ • బుష్పవృష్టి
గురియ నుచితాసనంబునఁ • గూరుచుండె, నగవిభేదియు సిగ్గిలి • మొగము వ్రాల్ప

సీ॥ గంగరాజులును కా , శింగులు వంగులు, నంగభూపులును కు • శింగవరులుఁ
బాండ్యులు చోళు లా • వంతికుల్ చేరులు మాళవుల్ మాత్స్యులు • మాగధులును
శకులు కొంకణులు సో • మకులుచినులుపుళిం దులుతురుష్కులును చై • ద్యులునుపౌర
వులు కళినాటిన్య • పులు తెల్గుదొరలును యాదవుల్ నేపాలు • రాదిగాఁగ

తే॥ నాదిభూతంబుచేఁ గవి • యంగఁబడిన కడపటిది యగు పృధివిపైఁ • గల సమస్త
రాజు లెల్లఁ గిరీటవి • భ్రాజమాను లగుచు వచ్చిరి పెండిలి • కలవి లేక

ఉ॥ చక్కరబోండ్లు వీచు వెలి • చామరముల్ భువనంబు లెల్లెడన్
నిక్కిన కీర్తి వృక్షమున • నెక్కొను పల్లవ పంక్తియో యనన్
మిక్కిలియు న్వెలింగె బహు • మేదుర వంశ రుతంబుఁ బోలి పెం
పెక్కిన వంశగీతు లెల • యించిరి ముగ్ధలు తత్ప్రభాస్థలిన్

క॥ తన వంశంబునఁబుట్టిన జనకజ పెండిలిని సంత • సంబునఁ గాంచం
జనుదెంచు చంద్రుఁడో యనఁ, దనరెన్ దశరంధుని గొడుగు • ధవళిమ మీఱన్

ఆ॥ ఉన్నచోటనుండి • యొదుగంగ స్థలము లే కునికిఁ జేసె గొప్ప • యుదధిఁ బోలి
జనము చేరి నిలువ • జనకు రాజ్యంబొక్క పట్టనంబె యైన • పగిది నొప్పె

ఁనకరాజు కౌతుకమున • సంపదలను, చల్లి సంతసించిన ప్రేమ • జానకి యెద
ాముసేడ బీదలందును • రాజులందు, యశమునందును సమముగా • వ్యాప్తి నొందె.

## 20 అలంకారపటలము. 41

చ॥ ప్రతిమలు ప్రాణముం గొనిన • పాటిగఁ గ్రేవల రాణు లొప్ప నా
తత విభవేంద్రుఁడౌ దశర • థ క్షితిపాలుఁడు సంతసించు నా
తతిని వసిష్ఠుఁ డారసి సు • ధా మధురోక్తుల నిట్లు వల్కె నీ
సుత నిఁకఁ బిల్వనంపుము య • శోనయశౌర్యధనాఢ్య! మైథిలా!

నవుడుఁ బ్రియ మానందము, తొనఁకఁగ జనకుండు చెలుల • తోఁ బృథ్వీజం
ాని తెండన వారలు వడి, జని దాదుల కత్తెలంగు • జానుగఁ దెలుపన్.

ఉ॥ ఆరుచు తెప్ప లక్షలకు • నందము గూర్ప నొనర్పఁబడ్డ యా
తీరున భూషణంబు లవి • తేటగు రూపముఁ గప్పునంచుఁ దా
మారయలేక తీయఁదన • మంబుధి వెన్నకుఁ గూర్చు కై వడిఁ
సొరుకు సొరు గూర్చిరి; వ • సుంధర యజ్ఞత గొన్నదే కదా!

ామచంద్రుని మై వన్నె • రామ యెదఁద, నెరసి తీఁగలువాటి పై • విరిసె ననఁగ
ాప్పు కప్పుఁ గొప్పునఁ బూవు • లొందఁ జెరివి, రంబుదంబున మందురా • యందమంద,

ెక్కు లెల్లను తొగతేనిఁ • జుట్టినట్లు, నెత్తి నిండఁ బాపటబొట్టు • నెత్తి కట్టి
ుజ్జుఁ దనుక్రేపుఁగన్నమ • బ్బనెడిపళువు, చాఁచునాల్కనాఁగఁ దురాయి • సనదరించి

మ॥ హర కోదండ విఖండనుం డయిన వీ • రాగ్రేసరుం డౌనె? ము
న్నరవౌ ప్రాణములన్ దపింప వలచే • నుట్టూట లూరించి నా
తరుణీత్వంబు గ్రహించువాఁడని యెడం • దం జింత గావించు సుం
దరికిం దాల్చిరి యూఁగునట్టి మది చం • దం బందు తాటంకముల్.

మ॥ జలజాతాక్షుల కెల్ల భవ్యమగు ల • జ్జం గల్గు కంఠంబులం
దిలకంబై తగు నీమె కంఠమునకున్ • దీప్త ప్రభా భూషలుం
గలవే? మాపతి దాల్చు శంఖమె యిటం • గల్యాణ రూపంబుతో
నలరె న్నాఁ జను కంఠమం దిడి రమూ • ల్యంబైన హారావళుల్

ఉ॥ పన్నుగ మింటి రిక్కలను • ప్రావగఁ గూర్చిన కోవ యందమా ?
వెన్నెల తేనిఁ జీల్చి తజి • వెట్టి కుదిర్చిన మాల యందమా ?
చెన్నగు లజ్జతో నెసఁగు • చిర్నవు వెన్నెల పర్వె నందమా ?
యెన్నఁగ దారహారము న • యించిన పొందిక నేమనందుమో?

ఉ॥ చిన్ని పదంబులన్ మెఱుఁగు • చేరిన లమ్మికి రాగ మిచ్చె నా
యన్నులమిన్న మేనఁగల • యందము చందము పొందు మీఱి పే
రెన్నికఁ గన్న చన్నులప • యిం దగు హారము దాల్చినంతనే
మున్ను పవిత్రమై పరఁగు • ముత్తెము లెట్టని యయ్యె నయ్యెడన్

తే॥ అంగదంబులు దాల్చిన • హస్తములకు జెప్పలల్లొప్ప మిఱుకుట్లు • గప్పు పద్మ
రాగములు ముత్తెములు గూర్చఁ • గ్రాలునట్టి వెదురు గట్టిన సమితి నా • ప్ప కొంపెచ్చె

ఉ॥ రాగపుఁ గేలుఁదమ్మి రఘు • రాము భుజంబులఁ దాఁకి నోచి త
ద్రాగము నొందఁ బాత్రమయి • రాత్రులలో ముకుళింపవెంచు బా
గోగులు నెంచి చంద్రముఖి • కొందగ మానికముల్ ఖచించుటన్
జేగురు మీఱు గాజులను • చెల్వుగఁ దాల్చిరి సీత కంతటన్

చ॥ నెలఁత కుచద్వయం బనెడి • నీలమణుల్ గల కుందనంపుఁ గుం
దల పయిఁ బుష్పవల్లి రీతి • నాయకు చాపము నేరనాళి సం
కలితముగా లిఖించి కడఁ • కం బరమార్థముఁబోలె వంకచే
గలదవి లేదనం దగిన • కౌనును నొవ్వఁగఁ జేసి రెల్లరున్

తే॥ రంగు లీనెడు పట్టుప • ట్టంబు గట్టి రత్న ఝల్లరుల్ గల మొలనూ • త్రాడు చుట్టి
వివిధ కాంతు లొడలి నుండి • వీచుచుండ, చెలులె భ్రమియించి వలచి రీ • క్షింపలేక.

తే॥ ఉక్తి కవు లేకయే రాగ • లహరి వీచు పదములు శిరీషములకంటె • మృదువులగును
వాని యందిడునందెలు • వరుసమ్రోయు మృదువులే మృదువులె మఱి • మృదువులె యవి

చ॥ సౌరిది విషంబు మధ్యమునఁ • జుట్టు సుధం గొని చిత్తమూలముల్
దోఁచియు పంచచిత్వమును • దొంగతికంబును లేక గోముగాఁ
బెరిఁగిన కన్నుదోయి నలి • వేణులు నించిన యంజనంబొ శ్రీ
పరుఁ డిడు రాము మేని మను • వన్నెయొ కాంచఁగలేము నల్లనన్.

సీ॥ అందమై విరిసిన • పెందమ్మలోని విం, దీపరద్వయ ముప్పు • తిల్లునేని
దానిపైఁ గ్రొవ్వెల • పంక నిల్చునయేని, తన్మధ్యమునఁ జిక్కు • తనరునేని
మిన యగు నని పచి • యింపంగఁ జెన్నారి త్రిభువన కన్యకా • తిలకమైన
జనకి సుస్థిర నుదుట • జానైన కస్తూరి తిలకంబు దిద్దిరా • తెలవ లంత

తే॥ వివిధ మధు పాళి మూఁగిన • వివిధ వర్ణ కుసుమ నిచయంబు మాలికల్ • గూర్చియుంచి
బసిమి పెరివిరి మెత్తురి • మెరుపుగాఁగ, జొన్న పుష్పైదిఁ బోలిన • పొన్ను ఝాఁ.

తె॥ నేతి దీపంబు లెట్టి ప • న్నీరు పువులు, బల్లికల దేవతల మ్రొక్కి • తెల్ల యావ
పాపి కోసట నుంచి యారతి • బడసి పెవి లక్ష్మి కిటిరి పిలువ • రాజ ముఖులు.

తే॥ చిల్కలకుఁ బల్కులను నేర్పు • సీత చెలువ, మఱలవలె, నాని చెలువలే • వలపుగొనిరి
ఏమి చెప్పుదు నావింత • యెంచి చూడ, యువతులకు యువకుల కుల్ల • మొండె కాదె?

చ॥ చెలువలు జానకీ రమణి • చెల్వును పున్నమ చంద్రునట్లు క
న్నులఁ గని సొక్కి సోలిరి జ • నుల్ పరికింపఁగ వాంఛ నీయమై
పొలఁతుల కొక్కొక్కకంగమె ప్ర • పూర్ణ మనోహర రీతి నొప్ప నా
చెలువములెల్ల నొక్క యెడఁ • జేరఁగఁ గాంచి భరింప శక్యమే?

ఉ॥ సంకు ధరించియున్ గమల • సద్మము నొందియు నెల్లవారి హృ
త్పంకజమందు చిత్రగతిఁ • బర్వి తలంచిన యెల్ల చోటులం
బొంకముగాఁగఁ గానఁబడి • పూరుష వర్యుని రాముఁ బోలె నా
సొంకవగంధి సీత యిఁకఁ • జక్కఁగ వర్ణన చేయు టెట్లగున్?

చ॥ పరవిన మేఖలల్ పసిఁడి • పాఁప పటంబు మొగంపు టందియల్
కరములఁ గంకణంబులు ర • కంబుగ మ్రోగఁగఁ గీరవాణు ల
ప్సరసలఁ బోలు సుందరులు • సారసగంధులు పెక్కుమంది ని
ర్భర కుతుకంబు తో జనక • రాజ కుమారిని గొల్చి చుట్టి రాన్

తే॥ గుజ్జులును గూనివారు స • ఖులును బలయ, మణుల మేల్కట్టునీడ నా • మగువమిన్న
చుక్కలందునఁ జందురు • సొంపు దాల్చి నవయకుండు జోతిం బోలె • నడవసాఁగె

తే॥ తన్ను గన్న భూదేవి యా • తన్వి మృదుల, పాదములు నొచ్చునని నేలఁ • బఱచినట్టి
ననలు నా నొప్పు తన మేటి • నగల డాలు, ముందు పరవఁగ సీత జా • నొంద నడచె.

తే॥ వినుతి కెక్కిన తన యాన • మునకు నోడి, పడుచు లేచుచుఁ జను తెలి • పక్షుల వలె
నిరు గెలంకుల వెల్ల చా • మరము లొలయ, బర్హి కాంతితోఁ జను బర్హి • భాతి నడచె

తే॥ ఎల్ల లోకంబులందలి • యిగురుఁ బోండ్ల కంటి పాపయై యొప్పు నీ • కన్య హవుసు
చూడ రామ వంశాద్యుండు • సూర్యుఁడె దిగె నాఁగఁజనువితానము నీడ • నడచివచ్చె

తే॥ మణి కలాపంబు చుట్టును • మలసి వెలుఁగ, నడుమ దేహకాంతి మిగుల • నొరుచూప
మండలాకృతి వెలయంగఁ • గుండలములు, కౌను చలియింప నడచె న • క్కలికి మిన్న

తే॥ విరుల తావియు బంగారు • మెఱుపు కాంతి చందనపుఁ జల్లఁదనమును • పొందియంచ
లచ్చరలు సుధ సిగ్గిల • నవని పతులు వఱలు రత్న ఖచిత మండ • పమునఁ జొచ్చె

తే॥ కల్పనాకర్త లేని యా • గమ మనంగఁ దగిన వలఁద పాలిండ్లొప్పు • మగువఁ గాంచి
స్త్రీలు పురుష లెల్లరు వట్టి • చిత్రములను పోలి రార్పక యూర్పక • తూల వోక

తే॥ ఆమెయో? కాదొ? యని శంక • నందుచున్న ఇనకులేశ నందను డామె • నెదుటఁగాంచె
విసము పుట్ట నిర్వేదించి • వెనుక నమృత, ముద్భ విల్ల హర్షిలు పుర • హూతు రీతి

తే॥ ముదురు చవి సుధఁ బెరిఁగిన • పక్వఫలమె నాఁగఁ దగిన బింబాధర • నా యెడంద
యందికాంతి వెల్పలను పెం • పొంద నున్న యదియొ! యని తలపోసె ని • లాద్దతనుఁడు

తే॥ ఎలమి మా చేయు గురు తపః • ఫలము వలన మహిని రాముఁడై పుట్టెను మాధవుండు
అతని ప్రేముడి పత్నియౌ • నబ్జనిలయ సీత యని వసిష్ఠుఁడు సంత • సించె మదిని

తే॥ కోసలేశుండు జానకి • కొమరు గాంచి యేడు దీవుల నేలిన • వాఁడ నైన
నేఁడు తెల్పిల రూపంబు • నియతితోడ దైవ మొసఁగెనం చమిత మో • దంబునొందె

ఉ॥ నైపళవీణఁ బోలు బలు • నాణెపుఁ బల్కులు గల్గు సీత యా
త్రోవను పోవఁగా దశర • థుండు మహర్షులు తక్కఁ దక్క వా
రా వనితామణిం గనిన • యంతన మ్రొక్కిరి వారి డెందముల్
దైవమ యంచు నెంచెఁ దను • ధర్మ మెడందకు లోఁకువే కదా!

చ॥ విసివి సరోజమున్ విడిచి • వేడ్క విదేహ గృహంబుచేరు నా
వసుమతి పుత్రి మౌనులకు • భక్తిని వందన మాచరించి పెం
పెసఁగఁగఁ గోసలేంద్రునకు • నిచ్చను మ్రొక్కి యనంతరంబు సం
తసమున బాష్పముల్ వదలు • తండ్రికడన్ వసియించె గద్దియన్

తే॥ ఈమె లక్ష్మియే యగు నిజ • మితఁడు గిరిశు వర శరాసన మననేల ? వలయునేని
యేడు కొండల విఱువంగ • లేఁడె యనుచు నిరశు వంటి వసిష్ఠ ము • నీంద్రుఁడెంచె

ఉ॥ వేదుక వింటి నెక్కిడుట • విర్చుట చెప్పఁగ నాలకించియున్
బోఁడిమి యందె సందియము పొందిన సుందరి శంక వీడి లో
వీడని రూపమున్ గనుచు • వెల్పలి రూపము కంకణంబులన్
వాడుకచేఁ గుదిర్చెదు నె • పంబునఁ గాంచెఁ గటాక్షవీక్షలన్

తే॥ లీలఁ గ్రేగంటి చూపుల • డాలు వోయి ప్రాఁతి రాముఁడన్ జలధి జీ • వనముగొనియె
దక్కసుధ పూర్తిగాఁ దానె • త్రావినట్టు లొడలుపొంగారె మెల్లన • నూర్పువెడలె

చ॥ తన మది నున్న వంచకుఁడె • తథ్యము చాపముఁ ద్రుంచె నంచు నా
జనకజ లోని దుఃఖమును • చయ్యన వీడెను జన్మ దుఃఖ కా
రణ మగు మాయఁ దోలితగు • జ్ఞానముచేఁ దనలోనఁ దన్నుఁగాం
చిన జని ముక్తినొందు క్రియఁ • జెందె నొకానొక ముక్తి నామెయున్

తే॥ విమలకీర్తి యౌ దశరథ • విభుఁడు వేఁడి విదుని కౌశికుఁ గాంచి యో • వినుతచరిత
జానకీ రామునకుఁ బెండ్లి • జరుగఁదగిన శుభ ముహూర్త మదెప్పుడో • చూడుఁడనఁగ

సీ॥ వాలుగల్ విడియుచుఁ • బాఱఁ గ్రుమ్మటచేత శిఖరి మత్స్యంబులు • చేరి దుముక
నెనుముల మెదడును • ష్ఠముల్ క్రీలంగ కొఱమీలు పాళలు • విరియ దుముక

చుండు సుక్షేత్రముల్ • దండిగా, గలిగిన కోసల జననాథు కొఱఁతలేని
శుభ ముహూర్తము రేపె • సొంపారు నని గాధి తనయుండు పల్కఁగాఁ • దగు నటంచు

తే॥ ఱేడు లెల్లరు మ్రొక్కఁగాఁ • వీడుకొలిపి భూరి వాద్య ధ్వనులు భువి • బోరు కొలుప
మునులకున్ మ్రొక్కి వారల • యనుమతిఁ గొని, దశరథుఁడు లేచి విడిదికిఁ • దరలెనంత

ఆ॥ అంచయాన సీత • యరుదుగా నెదఁబాయ హేమ సౌధమునకు • రాముఁడరిగె
విభులు మునులు వారి • విడుదుం కెగిరి మేరువున మఱింగె • సూరుఁడంత

## 21 కల్యాణపటలము 97

క॥ స్థిరయశు డు మిథిల నాయకుఁ డరు దారఁగ నుపచరింప • నాబాల ధరా
వర మొదలితోడ నిర్జర, పురిఁ జేరిన భాతి మోద • ముం బొందె నటన్

### సీత తహతహ

క॥ భరియింపరానివెరవున విరివిగ దగ గొన్నవారు • వెదకి జలేజా
కరము గని త్రోవ లేమిన్ సురుఁగు దశం బొందె సీత • సుడివడు మదితోన్

క॥ కొలమీఱు రాతిరీ! యబ లల వంచన నేఁచు వారి • లం గలరొక్కో
తెలవాఱఁ బ్రియుఁడు రాఁడో! తెలవాఱుము దుఃఖ జలధిఁ • దేర్చుము నన్నున్

క॥ మునితోడఁగూడి చను రా మువితోడింబోయి మరలఁ • బొడగానవ యా
తనితో వత్తువె మనమా! మనుతోడున్ వదలియుంట • మరియాదయొకో

క॥ తాడిపయి చక్రవాకీ! యేడు సముద్రముంఁ బోలు • నీరాతిరి నా
కీడునఁ జనదే! యాఱడిఁ గూడుదువే యొంటిఁ బఱచి • కొఱమాలి యయో!

క॥ వాఁడిమి కొడిమల పోఁడిమి వేఁడిమితో నగ్గలించు • వెన్నెలః దొనఁగే
నాఁడు గన కార్తిచే నా నాఁడుం గృశియించు వారి • నలఁచుట తగవే?

క॥ తావికిఁ జల్లఁదనమునకుఁ దావలమగు మలయ గుహను • తారు పయిర యన్
మూవన్నె మెకమ యెరకై వే వచ్చితె? కోఱ లనెడి • వెన్నెల విరియన్

క॥ తెరువునఁ దిరుగుచు నొకరుఁడు నెరవిన పెను కాల మెఘ • నిభ దేహుఁడు నన్
బఱిచె నిసి పగలు వీడక వర వంశ్యులు కన్నెల కడ • వఱలుట తగవే?

క॥ ఎడ నమ్మఁదగని పనులన్ దుడుకఁడు నిర్దయుఁడు వాని • దోర్యుగళంబున్
దడవఁ జనఁ దగదు నల్లని కదలి యపారంబు రాత్రి • కడచను నొక్కో?

తే॥ పాటులా తగ్గుటయె లెదు • పగలు రాదు కూరుకా లేదు నిసి వోదు • కోర్కివిడదు
నల్లమునవొవ్విపదలదు • నుసుఱుచనదు నిట్లు కుందుట విధియేమొ • యెఱుఁగరాదు

తే॥ అమలజలధీ! నీవును కంక • ణములు జాఱఁ, బడుచు లేచుచుఁ గార్శ్యంబు • వడసియెల్ల
వేళలందు నిద్దుర లేక • వేఁగుచుందు, కన్యవో నీవు ? మరునివేఁ • గలఁగినావొ ?

## రాముని యుత్కంఠ

క॥ అని యీ విధమగు పలవర, మున నొగులుచు సొమ్మసిలుచు • మగుడ యటుందన్
ఘన విభుఁడగు రాముఁడు తన, మనమునఁ దలపోసె నిట్లు • మల్లడి గొనుచున్.

తే॥ మున్నె కాంచి పీడక రెండు • కన్నులనెడి, వ్రాఁత కలములు నామదిన్ • వ్రాసె; మరఁ
గనియు సుషమాంబునిధి దరి • గానన్నైతి, మించుఁగనువారు మఱియొండు • గాంచుటెట్లు?

తే॥ జానకీ ముఖమే యైన • చలువ ఱేఁడ!, కామ బీజంబుఁ బండించు • కలువ ఱేఁడ!
యేమి యీకార్య పద్ధతి? • యింత యెఱుఁగ, వేల? నాయెడ బంధువై • యెసఁగరాదొ?

తే॥ ప్రాణముల వెలువడ నీడ్చు • రామ కనుల, కరణి నిరులను పరవెను • కొఱఁతపడక
విభుఁడు రణభూమి మరణింప • విఱిగి పాఱు, వీరవరుని యపఖ్యాతి • విధము దోపఁ.

చ॥ వన హరిణంబుఁ బోలు వర • వర్ణినితోఁ జను మానసంబ! పో
యిన యదె పోక యంచుఁజని • యెంచవదేలొకొ? దారిదప్పొ? మ
న్నన గల చోట నిల్చుటలు • న్యాయమె కాని యనాదరంబు గాం
చిన యెడ నిల్చు టెల్లిదము • చెల్లునె నన్నట విస్మరించుటల్.

ఉ॥ కన్నులనుండి నిప్పుకలు • గ్రక్కు భుజంగము కోఱలన్ విషం
బెన్నఁగ నుంట నిక్కమది • యెల్లెడఁ దెల్లమ మున్నె యిప్డొ నా
కన్నుల చూపులందు నెస • కంబుగ మానసమందుఁ బర్వి నన్
బన్నుగ నేఁచుచుండునది • భామిని కన్నుల చూపులోనిదే.

శా॥ లీలోద్యానములున్ బ్రకల్పిత గిరుల్ • క్రీడా విరామ స్థలుల్
కేళాకూళులు చంద్రశాలలును లె • క్కింపంగఁ బెంపారి హే
లా లోలాక్షి చరింప నుండినను వా • ల్లభ్యంబుతో నామదిన్
వాలాయంబు వసించుచున్నది మఱే • వస్త్వంబు నిచ్ఛింపదున్.

తే॥ రాముఁ డిట్టు లుల్లమున వి • రాళిఁ గొనుచు, నుండ సీతా వివాహమ • హోత్సవంబు
రేపె నగరమెల్ల నలంక • రింపుఁ దనుచు, రీవి భేరీ రవములఁ జా • టింపఁ బడియె.

## పురాలంకరణము.

ఆ॥ ఘోషణంబు వినుచు • గుములయి పెద్దలు, పిన్నవారు స్త్రీలు • వేగిరపడి
పఱుగువాఱువారు • పనిచేయువారునై, యపుడు పురము కదలి • యనుకరించె

ఆ॥ రామవిభుఁడు జనక • రాజపుత్త్రిని పెండ్లి, యాడు టెఱిఁగి చూడ • సరుగుదెంచె
ననఁగ నిరుల తెరను • మొనసి గెంటుచు నినుం, డేకచక్ర రథము • నెక్కి వచ్చె.

సీ॥ తోరణ స్తంభముల్ • తొంటి నాటువారును. వానికిఁ గై సేయఁ • బూనువారు
మంగళ పూర్ణ కుం • భంబు లెల్లెడ నిల్పి, ఎలువలు సవరించి • యలరువారు
మందిరాంగణములఁ • జందనాదులు చల్లి, కవచముల్ కై సేయఁ • దివురువారు
విప్ర దీనానాథ • వితతికిఁ బెట్టంగఁ, జెలఁగుచు వంటలు • సేయువారు

తే॥ ముత్తెములభూషలనుదాల్చి • మురియువారు, మణులతొడవులధరియించి • మలయువారు
పైఁడి సొమ్ముల వహియించు • పడుచువారు, పూలచే నలంకారముల్ • పూనువారు.

సీ॥ చందనంబు నగురు • గందంబు వీధులఁ, జల్లుచు నంచంద • జరుగువారు
విరులఁ జల్లుచు వేడ్కఁ • దిరిగెడువారును, సాంబ్రాణి పొగవేయ • సాగువారు
ముత్యాల జాలరుల్ • ముంగిళ్లఁగట్టువా, రనఁటి మ్రాకులఁ గట్ట • నలరువారు
వివిధ వాద్యంబులు • విననగ మూఁగెడువారు, మణిదీపములఁ గాంచ • మలయువారు

తే॥ తిన్నియల రత్నపాలికలు • దిద్దువారు, రిక్కలట్లు పందిట మణుల్ • చెక్కువారు
మించుఁ బోలు దీపంబుల • నుంచువారు, దీపములకు గై సేయంగఁ • దివురువారు.

ఆ॥ వజ్రమణులు వెలుఁగు • పచ్చల మేడలఁ, దెక్కెములను వెలయఁ • జెక్కువారు
బండ్లపైన విరులు • పల్లవంబులు పండ్లు, నిండఁ గొంచుఁ దెచ్చి • నింపువారు

సీ॥ కలపంబులను మేన • నలఁదుకొనెడువారు, విలువయౌ వలువల • వెదకువారు
తుఱుములందు విరులు • తుఱుముకొనెడివారు, తిలకముల్ నొసళుల • దిద్దువారు
మాలికల్ మెడలందు • తాలుచువారలు. సదరంబులకుఁ గావి • యద్దువారు
కనులకు సొగసుగాఁ • గాటుక యిడువారు, లత్తుక పదముల • కద్దువారు

తే॥ కుందలము లెండగాయఁగా • గొంటివ యాట, లాడువారును కై సేయు • నపుడుఁ బ్రియ
కోపముం గొను వేళలఁ • గొదరి విద్రుచు, వానిఁగొని వీధులం బాఱ • వైచువారు.

తే॥ ఏనుగులకుఁ గై సేయంగ • నెలయువారు, తేజులకు బాగు సేయంగఁ • దివురువారు
స్యందనంబుల కందంబు • సలుపువారు, బిరుద చిహ్నంబులం దాల్చి • తిరుగువారు.

తే॥ వైభవంబులతో నృపుల్ • వఱలువారు, వేద ఘోషల విప్రులు • వెలయువారు
వైణికుల గాన సుధఁ గ్రోల • శ్రేణులైన, వార వెల వెలందుల యాట • గోరువారు

తే॥ రాజ మకుట ఖచిత రత్న • రాజులొరసి, కంఠ తారహారంబులు • గదిసి రాలు
మణుల పొంధూళి యచ్చటి • మండపముల, నగరి వాకిటఁ గుప్పలై • నెగడుచుండె.

ఆ॥ అరిగ లెండగాయ • నసులు వెన్నెల గాయ, ద్విరదములను పోలి • తిరుగువారు
చెలులు నటన లభ్య • సించువార్చిలునవ్వు, చేత జీవములను • చిద్రుచువారు.

తే॥ అమిత కాంతుల నగపడు • నవియుఁగానఁ, బడక ప్రతిఫలించుటఁజేసి • పుడమిజనులు
నమరులుంగూడసురపురి • యదియొ యిదియె ,యనుచు భ్రమగొని దిక్కుల • నరయువారు

ఉ॥ తేరుఁమీఁద బండ్లపయిఁ • దేజులపై మణి దీప్తు లొప్పునం
దారుల లోనఁ గాల్నడను • బల్లకులందు జనింబు లెక్కకున్
మీఱి సరోజనేత్రలు స • మృద్ధ సుధాధరలున్ సుమధ్యలున్
సారవచోవిలాసులు • సామజ యానలు చేరి రొక్కెడన్

తే॥ తారహారముల్ ధరియించు • వారు రత్న హారముల్ విచ్చివిసరెడు • వారు పూలు
పెక్కు వగల జడలఁగ్రుచ్చి • పెక్కువగల చీరలం గట్టు వారలు • సైరి స్త్రీలు

తే॥ మిథిల నిండిన సంపద • మేదినిపయి నొక్కచోఁ గాంచ గా నిట్టు • లొప్పుటరిది
పాకశాసను నట్టాభి • షేక వేళ, నమరపురిఁ బోలె నొప్పారె • నప్పురంబు

## దశరథాదులు వివాహ మండపము చేరుట

తే॥ ఎల్లయెఱుఁగంగ నరుదలు • హిమగిరివలె సున్నతంబయి మైథిలి • యుద్వహమున
కెల్ల సామగ్రి నిండిన • హేమ రత్న రచిత మండపంబును దశ • రథుఁడు చేరె

తే॥ నిండి తెల్లని గొడుగు వె • న్నెలలు గాసె, నింపు మించు నగల రాసు • లెండగాసెఁ
దేంట్లగములు గీతమ్ములు • తివిరి పాడెఁ దురగ ఖురధూళి యెగసి యం • బరము గప్పె

తే॥ నీరదమువోలె మంగళ • భేరు లులిసె శంఖములు మ్రోసెఁ గాహళ • సమితి మొరసెఁ
బ్రాఁజదువుల ఘోషణములు • రాత్రివేళఁ, గొఱలుచుండు పారావార • ఘోషమీతె

తే॥ కరి తురంగ రథ నికరముల్ • వరుసదీరి, నడచుచుండఁగ సామంతు • లెడములేక
నిరతముం గొల్చువారలు • నియతి నరుగ నింద్రుసేవించు వేల్పుల • యెసక మెనసె

తే॥ అట్లు చేరవచ్చిన కోస • లాధిపుండు రత్నమయ హేమ పీఠిపై • రమణ నొప్పె
మునులు నృపులు గూర్చుండిరి • జనకుఁడపుడు బంధు వర్గంబుతో మంట • పంబుచేరె

క॥ నృపులును మునివరులును వే లుపులు జనులు- హంసయాన • లును నెఱయంగా
నెపుడా పెండిలికూటము విపులంబగు మేరుశైల • విధమున నొప్పెన్

తే॥ మేఘములుగ్రహతారకల్ • మెఱుములుఱుము లోకటమండలయుగళంబు • నొప్పుమిగిలి
బమ్మచేసిన యండగో • శమ్ము నెనసె మయవినిర్మిత తన్మణి • మండపమ్ము

క॥ మునులును నృపులును విబుధులు జనములు నడఁగంగ నచటి • సభ బ్రహ్మాండం
బును లోఁగొని యడఁచిన వి ష్ణుని నల్లని కడుపువోలెఁ • జూడఁగ నొప్పెన్

క॥ జగములె ప్రేరేఁపఁగ నిం బుగఁ జేరె జనంబు లనఁగఁ • బొగడఁగ నగునే?
జగములు వేఁడుటవలన భు జగ శయనము వీడు నతని • చరితము వినుఁడీ

## రాముఁ డలంకరించు కొనుట

తే॥ సప్తసాగరములనుండి • సప్తనదుల నుండి తెచ్చిన నీట శా • స్త్రోక్త విధిని
మంగళ స్నాన మొనరించి • మహిత రీతిఁ బీత చీన వస్త్రము రామ • విభుఁడు తాల్చె

తే॥ అజుఁడు మొదలుగఁ దృణముప • ర్యంతమెల్ల జీవులు దవులు పెన్మాయఁ • జీల్చియవల
మరిలిరాకుండుపరమమ్ము • దొరయఁజేయు తనదుతిరునామమునుదుటఁ • దానుఁదాల్చె

క॥ యతివరులకు నాకర్ణా యతనేత్రల నొసఁగి పెండ్లి • యమరిచి తపముల్
స్తుతమతిఁజేసిన యినకుల పతులు గొలుచు మొదటి వెలుఁగు • భక్తిన్ మ్రొక్కెన్

క॥ పొనుఁగువడు తపము ధర్మము పున రుద్ధరణమ్ము సేయఁ • బొదమిన కరుణా
తను దు తన మేని జలదము నెనసిన వెన్నెలనఁ కంప • మింపుగ నల దెన్

తే॥ కదలి మంగళ కర పూర్ణ • కళలు గలుగు తొగలతేనిఁ బూచిన దనఁ • దగిన పగిది
సిగను క్రొవ్విరుల్ చుట్టిప • సిండి సరులు, పూలమాలిక లెనకంబు • పొసఁగఁబెట్టె

క॥ రేయిం బగటం బడు మరు దాయము గని యిందుఁడిను డు • దౌత్యము గొని యా
తోయలి తోయము చెవులం బోయి తెలుపు చెలువు నెనయు • పోఁగులఁ దాల్చెన్

తె॥ శ్రీగఖుఁడు పెనుజడయందు • చిన్నచంద్ర కలనుధరియించె నదియేటి • కార్యమనుచు
పూర్ణ దివ్యకాంతిసమితి • పొలుపు మిగుల దిద్దెనన పీరపట్టంబు • తిలకమూనె

తే॥ చక్రమును వెను దవిలిన • శంఖ మనఁగఁ దగిన కంఠమునందు ము • త్యాల సరుల్
సీత మందహాస రుచులు , చేరి మదివి వెలికి నుబికిన వన నొప్పి • వెలయుచుండె

తే॥ వజ్రములు మచ్చ లట్టులు • వఱలుచుండ, పద్మరాగ దీప్తులు వహ్ని • వలె వెలుంగ
నంగదంబులు మును మంద • రాద్రిఁ జుట్టి కవ్వపుఁ దరిత్రాటి • ననుకరించె

తే॥ ఆణి ముత్యాల ముప్పేట • హారమొప్పె జగము రక్షించు దీర్ఘభు • జముల నడుమ
ముజ్జగంబుల కితఁ దాది • మూర్తియనుట కొప్పినట్టి యభిజ్ఞాన • ముంచురీతి

తే॥ వచ్చి వేఁడిన వారికి • నిచ్చుకొఱకు గల్పకంబు కాంచన రత్న • కంకణములఁ
బూవుఁ గొమ్మల నుంచిన • పొందు దోఁచి దర్శనీయములైన హ • స్తములు వెలిఁగె

తే॥ కమల నిలయ లచ్చి • కాణాచియగు నురోం, తరమునందు మెఱయు • సరులవయము
మెఱుము లదర గొప్పు • మేఘంబు నడుమను దోఁచు నింద్ర ధనువు • తోయమందె

ఉ॥ చేరుటకుం దొలంగుటకుఁ • జెల్లిన విజ్ఞుల తెల్వి పోల్కిఁ బైఁ
జేరిన యుత్తరీయ మెదఁ • జెందు దయాకృతి కంఠమందు సొం
పారిన తారహార నిభ • మంది వెలార్చిన కాంతిఁ బోలి వి
స్తారముగాఁగ లక్ష్మికి వ • శంబగు తొమ్మునఁ దోఁచెఁ బేరిమిన్

తే॥ చెనయరాని ప్రభాకరు • చెన్నుదాల్చి యున్న తొమ్మున ముప్పేటఁ • జన్నిదంబు
త్రిదశులును దెల్పలేని మూ • ర్తిత్రయంబు రూపమిదియెఱుఁగుండని • తోఁపనొప్పె

ఉ॥ అక్కమ పక్కముస్ ఋగుం • నంగగు బంగరు రంగు లీనఁగా
నక్కటి రత్న బంధనము • నందలి మేరువు ప్రజ్వలించె వే
ఱొక్క జగంబు దాని కజుఁ • డొక్కఁడు వెల్వడ నాభియందు స
మ్యక్కనికాంబుజంబు పొలు • పందఁగఁ బూచిన దన్న సంచునన్

ఆ॥ అలవి దెలుపఁ గాక • యమిత గంభీరమౌ నీల వారి రాశిఁ • గేలు సాఁచి
పాల కడలి యలమి • పట్టిన విధమునఁ దెల్ల పట్టు వలువ • తెలియఁ గప్పె

తే॥ ముత్తెముల నీలముల కాంతి • మురువుసూపఁ, బసిఁడికాసియిలోఁగత్తి • పరఁగఁజెక్కి
ముత్తెసరముల గుత్తులు • కత్తిప్రక్క, బాల భాను కాంతుల నీన • వ్రేల విడిచె

తే॥ రత్నకాంతులు కాంచు నే • త్రముల కాంతి నిండఁగ, నసూనశిల్పము • నెరయుమకర
ముఖముగల దంతపుంబిడి • మొనసిమెఱుపు, లలినిమెఱసిదిక్కులయెల్లఁ • గొలిచిచూపె

చ॥ పరవిన రూపముం గలిగి • పద్మజు నందము గొల్చు టింక నె
ట్లురవగు నంచు నొక్కొకటి • యుం దగ విఘ్నము గూర్చు పోలికఁ
మొరయుచు నేరు నారసి క • నుంగొన శక్యము గాని శిల్పముం
బొరసిన వీరమద్దియలు • పొందగు నందెలు కాళ్ళ శోభిలెన్

తె॥ వేయి మాణిక్యదీపముల్ • వెలు గు భుజగ రాజు సెజ్జను యోగని • ద్రను సురాళి
వేఁడ వీడిన రాముఁ డి • వ్విధము తన్నె, వాలు నొక యలంకారంబు • పూనె నవుడు

మ॥ అరవిందాసన ముఖ్య మూర్తులకు నా • ద్యంబై మునీంద్రాళికిం
బరమ ప్రాపకమై జగజ్జనకమై • భవ్యంబు సేవ్యంబునై
నిరతా నంద మయంబునై యెసఁగు నా • నిత్యాత్మయే వచ్చి యీ
నర రూపంబునలంకరించి కొన న • న్నా! తెల్ప శక్యంబొకో ?

తే॥ అమిత గో భూ హిరణ్య దా • నాదికములు సజ్జనులకు బీదలకును • సరసులకును
విరివిగా నొనరించుచు • వేద ధనులు వినుతి సేయ రాఘవుఁడు స్యం • దనమునెక్కె

తె॥ గుండు బంగరు టిరుసును • వెండి చక్ర ములును వజ్ర మయంబులై • వెలయునడిమి
భాగమును చుట్టు రత్నముల్ • ప్రజ్వలింప రాము రథము మార్తండుని • రథముఁబోలె

తే॥ మంచి లక్షణములు సూక్ష్మ • మతిని తెలియఁ దగుజవంబుబలంబునం • దముమెఱుంకు
వాఁడయఁబురుషార్థములఁబోలి • వెలయుతురగ ములు జగత్ప్రభుశేరికిఁ • బూన్పఁబడియె

తే॥ అరుణ కై వడి నొగలపై • భరతుఁ డెక్కి, మోద బాష్పంబుమిశ్రిత • ముఖముతోడ
కళను చేకొని రథ చోద • కత్వ మూనె నిరు దెసల నిల్చి శవలు చా • మరలు వీవ

చ॥ అమరిన పొందికంగటుగు • నందముచే నటు లయ్యెనేమొ ? శాం
త మనసుచేఁ దలంచుటను • తప్పక యప్పుదు రొప్పె నేమొ ? స

త్యము నెఱుఁగంగ లేము తగి • నట్టుల యయ్యెడు గాక! యయ్యెడం
దమి గొని చూడ నెల్లరు స • దా యనిమేషత దాల్చిఁ రిమ్ముగన్.

తే॥ జగములను హింస సేసి నా • శంబు గనక, యున్నపొల సుదిండులపాటు • లొబ్బిడయ్యె
నేఁడె యని వేల్పు కూటంబు • నిండు వేడ్క, నచ్చరలఁ గూడినటియించె • నిచ్చకొలఁది

తే॥ పుర పురంధ్రులు విరులను • గురిసినారు, పసిఁడి వలువలు రత్నముల్ • విసరినారు
రామ చెలువంపు సుధఁ బ్రేమఁ • ద్రావిరేమొ? వారి చేఁతకు వేఱేది • కారణంబు?

ఆ॥ తమకుఁ గల వొసంగి • తాల్చినవియు నిచ్చి, వారి తీరుగాను • దారుఁగన్న
నారు లమిత మొసఁగి • నార లందపు మేనఁ, గలుగు సొమ్ములూడ • నిలిచినారు.

ఆ॥ నృపులు మద కరీంద్ర • నిచయంబువలెఁ జుట్టి, నిలువ దశరథుండు • నెలవుకొన్న
కూటమందు చేరెఁ • గోదండపాణి మే, రువును చేరు సూర్య • రూపుదోఁప.

చ॥ వరదుఁడు తేరినుండి దిగి • ప్రక్కలలో నిరుగేలు ప్రేమమై
భరతుఁడు లక్ష్మణుండు దయి • వాఱఁగొనన్ సముదీర్ణులౌ మునీ
శ్వరుల కెఱంగి తండ్రి పద • పంకజముల్ దల సోక మ్రొక్కి యం
దఱకును మేని యందము సు • దారత విందులు సేయుచుండఁగన్.

సీ॥ పై నొక్క ధనువును • వాలుగలను క్రిందఁ, గలిగి పూర్ణేందు మం • డలముఁ దాల్చు
నెట్టని సుమలత • యింపైస్తనకుట్మ, లములతోఁ దరిపై • నమరి తూర్పు
దెసఁ బుట్టినదివోలెఁ • దేజరిల్లెడు సిత, తొల్త సుధాంబుధిఁ • దోఁచి మరల
ధరణి నవతరించి • తరువాత నొకమల, యొద్దఁ బుట్టిన దన • నొప్పి పెండ్లి

తే॥ మండపము చేర వేల్పులు • మగువఁ గాంచి, మరల రాముని గని సుధా • మథన వేళఁ
బొడము లక్ష్మి వెన్నుని మెడఁ • బూల మాల, వైచునాఁటికంటెనుసొంపు • వఱలె ననిరి

తే॥ జగతి జనములకంటె ని • ర్జరులకంటె, నాగలోక వాసులకంటె • నాణె మొంది
వెలుఁగు జానకి పెండిలి • విభవ మెల్ల, వాత్పతికినైన వర్ణింప • వలను పడునె?

తే॥ ఇంద్రుఁ డింద్రాణితో మింటి • కేగుదెంచె, భవుఁడు చనుదెంచెఁ దవిలి • భవానితోడ
బ్రహ్మయేతెంచె బ్రాహ్మితోఁ • బ్రమదమంది, జానకీ రాముల వివాహ • సరణిచూడ

క॥ వడుగులు వైదికులును పెను, కదలి కరణిఁ జుట్టి రాఁగఁ • గార్యంబును ప్రా
వడువున నడప వసిష్ఠుఁడు, వడి నుపకరణములతోడ • వచ్చె ముదమునన్.

ఆ॥ తండులములు పఱపి • దర్భల నుంచి స్థా, నమును శాస్త్రవిధుల • నమరఁ జేసి
పుష్పములను చల్లి • పూజంచి హోమాగ్ని, నిరవురొల్పి కార్య • మెల్ల జరపె.

ఆ॥ పెండ్లి వేదియందు • ప్రేమంపుఁ దోడగు, భూమిజాతతోడ • రామ విభుఁడు
కూరుచుండ వారు • కొమరొందఁ గలిసిన, భోగ యోగములను • పోలియుండ్రి

తే॥ శ్రీవరుఁడు లక్ష్మితోఁ బోలెఁ • జెలఁగి నీవు సీతతోఁ గూడి భువి చిరం • జీవి వగుచు
సమ సుఖంబు లనుభవిం • పుమ యటంచు జనకరాజు రాముని చేత • జలము విడిచె

క॥ విప్రాశీరావములు వ రప్రమదా విజయ గీత • రవములు రాజేం
ద్రప్రవరవంద్యులగు విబు ధప్రకరాశీస్స్వనోద • దరములు మొరసెన్

తే॥ వేలుపులు కురియించిన • పూలవాన పుడమిపతులు చల్లిన పైఁడి • పూలవాన
తక్కువారలు విసరు ము • త్యాలవాన గలిసి యాభూమి గగనంబు • కరణి దోఁచె

తే॥ రాముఁ డప్పుడు శ్రద్ధ మం • త్రము పఠించి యగ్ని కాహుతిగాఁగ నా • జ్యంబు విడిచి
జానకీ మృదు కిసల హ • స్తంబు తనదు దీర్ఘబాహువు చాఁచి మో • దించి పట్టె

తే॥ తివిరి హోమకార్యము దీర్చు • దీర్ఘ భుజుని వెంట నగ్నిని వలగొను • వేళ గోల
సీత మఱు పుట్టువునయందు • జీవమును శ రీర మనుగమించిన యట్టి • క్రియను దోఁచె

చ॥ మురువగు కంకణంబు క్రియ • ముప్పురి రక్ష ధరించి యున్న య
గ్గిరి భుజుఁడున్ విదేహ జన • కీర్తిత కన్యయు హోమకార్యముల్
హరువుగఁ దీర్చి జానకి న • యంబుగఁ ద్రొక్కుచు సన్నెకంటి నం
దిరవుగఁ బూజలం గొని రి • హించు నరుంధతిఁ గాంచె మ్రొక్కుచున్

తే॥ చేయఁదగువానిఁ బూర్తిగాఁ • జేసి సంత సంబు నొందిన మునులకుఁ • జాఁగి తెలచి
దశరథుని పదంబులకు స • ద్భక్తి మ్రొక్కి సీతతోడ శ్రీరాముఁడు • చేరె మేడ

తే॥ చిందములు మ్రోసె, భేరులు • చెలఁగె వేద గోష్ఠి వెలసె శాస్త్రములు పె • క్కులు పఠింప
బడియె వందిమాగధనుతి • బలిసె సురల కలకలంబులుమిన్నందెఁ • గడలి పొంగె

తే॥ కన్నతల్లి ప్రేమముకంటెఁ • గడు ప్రియమునఁ దన్నుఁగాంచు కైకేయి పా • దముల కెఱఁగి
జనని చరణంబుల శిరంబు • చాఁచి మ్రొక్కి విమలమతి సుమిత్రకడను • వినతుఁడైన

తే॥ మగువ పాద పద్మంబులు • మూర్ధమునకు భూషణంబులుగా సీత • మ్రొక్కునంత
వారిఁ గని వార లబ్బి రీ • వారిజాస్య రామునకు మేటి తోడవుగాఁ • గ్రాలు ననుచు

క॥ కొమిరెను గౌఁగిలి గొనితమ కొమరునకుం దగిన దార • కువలయమున నీ
యమ దక్కఁ గలదె యనుచుం దమ మనముల కనులు దనియఁ • దడవిరి ప్రేమన్

క॥ అలవి యెఱ నిష్కములు వల వలు దాసిజనము నగలు • వర దేశంబుల్
వెలఁదుల దేవత యగు నీ యలికేశిని పొందుఁగాక • యని యిచ్చి రొగిన్

శా॥ నీలాంభోనిధిఁ బోలు నొక్క కరుణో • న్నిద్రాద్రి శాస్త్రాంబుధిన్
వేలం గాంచిన విజ్ఞ వాక్క్రమమునన్ • బ్రేమాంబుధిన్ గొంచు నా
శ్రీలక్ష్మిం గల పూర్వపుం గలశవా • ర్ధిన్ శేషశయ్యాభమౌ
లీలా తల్ప గృహంబు చేరెఁ బెను బా • హిన్ సంభ్ర మోత్కంఠతోన్

తే॥ మీ మాసంబునం దుత్త • రానుషంగ దినమునందు సహస్రాక్షి • దేయ సింహు
పెండ్లి నడప వసిష్ఠుండు • వేద విధిని మంగళంబు వర్ధిల్ల హో • మంబు చేసె

తే॥ నెంమలేని విజయశీలి • నృపవరుండు నాదు తమ్ముని బిడ్డల • మోద మరల
రాము తమ్ముల కిత్తు మా • రాములేక యనుచు నడిగినప్పుడ నిశ్చ • యంబుచేసె

తే॥ జనకుఁడు కుశధ్వజుఁడు ప్రేమ • మున నొసంగ *లక్ష్మణాఖ్యుఁడూర్మిళను కె • ల్వడైభర
దుద్వహం బాడె మాండవి • నుత్సహించి కొనియె శ్రుతకీర్తి శత్రుఘ్నుఁడను • గుణముగ

తే॥ అన్ని పెండ్లిండ్లు జరిగిన • యవల దశర థుండు కూర్చియుంచిన కీర్తి • యొండువక్క
దక్క రూపవస్తువులెల్ల • ధారవోసెఁ గోరువారు కోరిన వానిఁ • గోరినంత

చ॥ నరపతి యిట్లు దానము లొ • నర్చి యమేయ ముదబ్ధి మున్గి యే
ర్పఱచిన శాస్త్ర విశ్రుతియు • బాధతపంబును గల్గు సన్మునీ
శ్వరులఁ గుమారులం గలిసి • బాంధవ ధర్మముతోడ నుండె న
ప్పురమున మెల్ల మెల్లఁగనె • పోయెను గొన్ని దినంబు లచ్చటన్

## 22 పలశురామ పటలము 50

తే॥ సీతయునురాముఁడును సము • చితసుఖంబు లొందుచుండఁ గౌశికముని • డెంద మలరఁ
గని యమోఘ వాక్యముల దీ • వన లొసంగి కృత మనోరథుఁడై హిమ • గిరిని చేరె

క॥ ఒకనాఁడు దశరథుఁడు కౌ తుకమునఁ బురి కేగఁదలఁచి • తోడనె సేనా
నికరమున కాజ్ఞ యిడి రా జకులము సేవింప బయలు • సాగె రథమునన్

చ॥ బలియుఁడు కోసలేశ్వరుఁడు • బంధుర బాహు చతుష్టయంబు నా
నలువురు పుత్రులుం దమ జ • నంబుతోఁ బరివార సంఘముల్
గొలుచుచు రా విదేహ జన • కూటము ప్రాణము వీడు దేహముం
బలె ఘన దుఃఖవార్ధిఁ బడు • మార్గము వట్టెఁ గుతూహలంబుతో

తే॥ తండ్రి ముందేగ జనుఁ డెం • దంబు లెల్లఁ దన్ను వెన్నంట నడుమను • తన్ను పోలు
ననుజులుం జేరి రా మించు • నంద మొందు జానకిం గూడి రాముఁడు • చనుచునుండె

చ॥ నడవఁగ నెమ్మి మున్నగు వ • న ద్విజముల్ కుడిప్రక్క వచ్చె న
ట్లడమను ముందుగాఁ జనుచు • వెడ్డము వచ్చెను వాయసాదు ల
వ్వడువు గ్రహించి దారి నొక • పాటి నిరోధము గల్గునంచు భూ
పుఁడు తన యున్నతంపు రథ • ము న్నిలువన్ సెలవిచ్చి యత్తఱిన్

తే॥ ఒక్క దైవజ్ఞురావించి • యున్న రూపు నొత్తి పలుకు మనంగ నై • మిత్తికుండు
భూవరేణ్య నట్టొక కొండ • వోలె వచ్చి మంచువలె వీడి శుభమగు • నంచుఁ బలికె

---

* ఊర్మిళాదులు మువ్వురును కుశధ్వజుని కూఁతులని మూలము

చ॥ ఇరులను పాఱఁదోలు జిగి • నెఱ్ఱ జడల్ గలవాఁడు గొడలిన్
గరములఁ గల్గువాఁడు నడ • కల్ గల మేరువుఁ బోలువాఁడు చి
ప్పిరిలు కను ల్గలాఁ డశని • యొప్పగు పల్కులవాఁడు మేలి బం
గరు మయమైన వింటి నెస • కంబుగ మూఁపునఁ గల్గు నాతఁడున్

తే॥ ఉదధిలోఁ బ్రభంజన హతి • నురలు కలము, పగిది జగములు గడగడ • వడఁక దిగ్గ
జమ్ము లట్టులే స్తంభించి • పొమ్మసిల్ల, జలధి లోలో నుడికి పొంగి • నిలుక దప్ప.

చ॥ సురలు కకావికల్ వడ వ • సుంధర నింగికిఁ బైన నిల్పునో?
ధరణి సమస్త జీవులను • దండధ రాననమందు చొన్పనో?
ధురుసున నింగిఁ గూల్పనొకొ? • దొడ్డ వ్రణంబు ముఖంబు వ్రీల నె
త్తురు క్రియఁ గన్నులం గనలు • దోఁచి వెలింబడ హేతు వేమొకో?

చ॥ సమరమె ముఖ్యవృత్తిగ భు • జస్థలిఁ గ్రాలు పరశ్వథాగ్రధూ
మము వినుగప్ప భాస్కరు డు • మార్గమెఱుంగక రిచ్చవోవ సం
భ్రమునఁ గలట్టి బాడబ ము • దగ్రత మప్పర మంట లేచి లో
కములను బూది సేయు గమ • కంబున వేఁడి వెలుంగు పర్వఁగన్.

ఉ॥ జానువు లంటు బాహువులు • చాఁగి దిశ ల్గొలువన్ వలంకులం
దాని తులంగలించెడు జ • టాగ్రము మిన్నున చెంగలింప స
చ్ఛో నెలయున్ గనంబడ వ • సుంధర తో యము వహ్నిగాలి వి
న్నానములై నశింపఁ బ్రళ • యోద్ధత రుద్రుని భంగిఁ బొంగుచున్.

మ॥ చతురంభోధి పరీత భూతల మహా • సామ్రాజ్య ధౌరేయుఁడౌ
కృతవీర్యాత్మజుఁ డవ్ పృథూత్కట తరు • శ్రేష్ఠం బుదంచద్భుజా
యత సాహస్ర సుశాఖమున్ విదళన • వ్యాపారముం జేయు నా
తత విఖ్యాత కుఠారమున్ గురు భుజ • స్తంభంబునం బూనుచున్.

తే॥ నింద నొందిన భూలోక • నృపకులంబు, నిరువదొకమాఱు ఖండించి • నియతిఁ బాడి
పొలమునందలి కలుపును • డొలఁచి రక్త, నదుల నొంటిమై మును గుబె • ట్టిదపుజెట్టి

ఉ॥ ఓరుపు రూపుగొన్న క్రియ • నొప్పు తపంబును మండు నగ్ని నా
నీరస గల్గువాఁడు తన • యెట్టెదురన్ బయిలోడి ప్రక్కకున్
దాఱు కుమారుపైఁ గనలి • దర్పితుఁడై విహగాళి యుమ్మగాఁ
దూఱెడు నట్లు కొంచమలఁ • దొల్చిన ముల్కులెఱింగి నట్టిఁడున్.

తే॥ ధరణీధరములు క్రుంగ సం • భ్రమములు పొంగఁ, జేయు వలఁతి భార్గవుఁ డటఁ • జేరునంత
నరుదుగా రాముఁ గన్న య • న్నరవరుండు, కఠిను రాకకుఁ గత మెఱుం గక తపించె.

తే॥ సేన భయపడి తడఁబడి • చెదరి పఱవ, బొమలు ముడివడఁ గనుల ని • ప్పుకలు రాలఁ
బిడుగువోలె గర్జించి గం • భీరుఁ డైన రాము చెంతకు వచ్చె భా • ర్గవుఁడు కడఁక.

చ॥ అతులిత భక్తి సంభ్రమ న • యంబులు తొల్కఁగ జామదగ్న్య నా
క్షితిపతి యాతిథేయము ర • చింపఁగ డాసి తదీయ పాద సం
గతముగ శీర్షమాన్చినది • గంబడ కుగ్ర లయాగ్నిఁ గ్రక్కుచున్
దత భయద స్థితిన్ సుగుణ • ధాముని రాముని గాంచి యిట్లనున్.

చ॥ ఎఱుఁగుదు భగ్నమైన గిరి • జేశుని చాప బలంబు పూర్వమే;
యెఱుఁగఁగఁ గోరి వచ్చితి మ • హేశ్వరపుత్ర క! యంగదంబులన్
మెఱసెడు నీ భుజంబు బలి • మిన్ మనుక్షత్రియ కంఠనాళముల్
తఱిఁగిన మద్భుజంబులఁ దొ • లంగదు తీఁటయు రాఁ గతం బిదే.

చ॥ అనవుడు భూపుఁ డిట్లను భ • యంబున నుల్లము గ్రుంగ ధారణిన్
మునుమిడి గెల్చి తెచ్చితివి • పొందుగఁ గశ్యపమౌని కో మహా
మునివర! నీకు లెక్క యె త్రి • మూర్తులుఁ మర్త్యులనంగ నెంత ? ఈ
తనయుఁడు నాదు జీవములు • దప్పక ని న్నభయంబు వేఁడెదున్.

చ॥ చెడుమతిఁ బాపకర్మములు • చేసిన దుష్టులు వధ్య లౌదు రీ
బుడుత ముదాతిరేకమున • బుద్ధి చెడం గొఱగామి చేసెనే?
పుడమి బలిష్ఠుతోఁ దవిలి • పోరినఁ గీర్తి లభించుఁ గాక యీ
బుడుగులతోడఁ బోర బల • వంతుల చేవ ఫలంబు గాంచునే?.

ఉ॥ కొమ్మని భూమి కశ్యపున • కుం దయచేసి జగత్త్రపాలక
త్వమ్ము భరింప వీడిన కృ • పాకర! వీడుమ యిట్టిచేఁత నే
మమ్మన మానవావళిని • మానుగఁ గాచెడు తేండ్లపట్లఁ గో
పమ్మను మాని తీవు పిద • పన్ వహియించుట పాడి యౌనొకో?.

చ॥ పలువురు గేలిసేయ నొక • పక్షము నూని గురుత్వ మొందు నా
బలము ఫలం బొసంగునొకొ? పాడియె యయ్యది? ధర్మపద్ధతిన్
నిలిచి వహించు నయ్యశమె • నిర్మల సత్త్వ మనంగ నొప్పు, కూ
రు లనఁగఁ దగ్గ వార లొక • రున్ బల మ ఁదురె దీని నెయ్యెడన్?

చ॥ వగతుఁడు కాఁడు వీఁ డితని • ప్రాణము వోయినఁ జుట్ట పక్కముల్
వగగొని పౌరులున్ మిగుల • వందురి యెల్లరు వెంబడింప నె
నెగులున జీవముల్ విడుతు • నిక్కముకింకరు నన్ను నాకులం
బగులక కావు మార్యవర! , యంజలితో శరణంబు వేఁడెదన్

చ॥ అని యిటు వేఁడు కోసల జ • నాధిపు పల్కులు లెక్క సేయకే
కనుల మిడుంగుఱుల్ చెదరఁ • గట్టలుకన్ వడిఁదేఁజీ చూచి రా
ముని కడ కేగఁ బ్రాణములు • మొత్తము రావులు దప్ప మించుఁ గాం
చిన భుజగమ్ము రేవఁ బతి • చేయుస దెయ్యది లేక యుండఁగన్.

తే॥ మాని యగు దశరథుఁ డిట్లు • మతిచెదరంగఁ, పనకు నాగతి పానుంట • దలఁప లేక
హర ధనువు బలహీనత • నందు చరిత, పల్కఁబొఁగె రామునితోడ భార్గవుండు.

తే॥ మేరు సారంబు దినకరుఁ • గేరు కాంతి, పాటవము ధైర్యమును విఱు • వంగరాని
చేవ గల రెండు విండ్లను • చేసె మున్ను, తేర్చి విశ్వకర్మ యనెడు • దేవ శిల్పి.

తే॥ ఒక్కచాప ముమాపతి • యొగి గ్రహించె, రెండవది త్రివిక్రముఁడు వ • రించికొనియె
నేయ దా రెంట మిగుల బ • లీయ మనుచుఁ, గ్రిదశులందఱు చేరి వి • రించి నడుగ

క॥ జలజాసనుఁడును వేల్పుల, తలఁపు ఘనంబనుచుఁ దలఁచి • తగ వొక్కటి వా
రలకుఁ బొడమించి యాధను, వులఁ గొని కడు నలుకఁ బెద్ద • పోరఁగఁ జేసెన్.

తే॥ ఇరువురును రెండు చాపంబు • లెక్కు వెట్టి, జగములెల్ల నిలుక దప్పి • బెగడుగుడువ
బవర మొనరించుచుండఁ గ • పర్ది విల్లు, చేవ చెడుటయుఁ గని మది • శివుఁడు కినుక.

తే॥ మరలఁ గలనికిఁ గడఁగ ని • ర్జరులు నడుమ, నిలిచి వారించి రంతట • నీలగళుఁడు
తన శరాసన మింద్రు హ • స్తమున నునిచె, ఋచిక ముని కిచ్చెఁ దనవిల్లు • శ్రీవరుండు

తే॥ ఋచికుఁ డొసఁగె మా తండ్రికి • ప్రియముతోడ, నతఁడు నాకిచ్చె నీవింటి • నమర నీవు
వంచితేని నీ సదృశు లె • వ్వరును లేర, నేను నీతోడి యుద్ధంబు • మాను వాఁడ.

చ॥ మొదటనె చేవ వో యినది • మూలను పడ్డది త్రువ్వు పట్టి ప
ట్టు దొలఁగి యున్న దానిని పు • టుక్కున ద్రుంచుట దొడ్డ చేఁతయే?
పదరక దీని నెక్కిడుము • పాయదు ప్రాఁత చలంబు నామదిన్
మదిమది నున్న శాంతనిధి • మజ్జనకుం బొరిమాల్చు దుష్కృతిన్.

చ॥ ఇరువది యొక్క మాఱులు మ • హీతల మెల్లను చుట్టి రాజులఁ
దరమిడి గొట్టట న్నటకి • తద్రుధిరమ్మున శాస్త్ర పద్ధతిన్
జరపి పితృక్రియల్ పిదప • శాంతి వహించితి నీడ్చి కొల్వ మా
యురె పిడి దక్కు వౌదు, మది • నుత్తల పెట్టితి విట్లు బాలకా!

చ॥ కలఁకుల గెల్చి యిమ్మహిని • కశ్యపమౌని కొసంగితిన్ విరో
ధుల కుల మార్చితిన్ గొలఁది • దోఁపని పెంపు మాచరించితిన్
బలువిడి శూలి చాపమును • భగ్న మొనర్చిన ప్రోఁత నా శ్రవం
బులఁ జొరఁ గిన్క వచ్చితిని • పోటరివే నిది పంచపోరెదన్.

చ॥ అనుటయు మందహాస రుచు • లానన మందొక శోభఁ గూర్ప న
య్యినకుల వీరుఁ డిమ్మనుచు • శ్రీశివ ధర్మముఁ గొంచు జామద
గ్న్యుని హృదయంబు భీతిమెయిఁ • గ్రుంగ స్వదోర్బల మొప్ప వంచి కో
పనుఁ దగు మౌనిఁగాంచుచు న • పార కృపారస ధాముఁడిట్లనున్

ఉ॥ రాచకులంబు మాలిచిన • ఒక్కసి వైనను మేటి బోడకుం
దోఁచి తపస్వి వేషమును • దొడ్గితి గాన వధింపఁబూన నా
రాచము నాకరంబునఁ దొ • ఒంగిన నూరక పోవ దింక నీ
వే చెపుమా బిరాన గుఱి • యెయ్యది దీనికిఁ జూపుమా యనన్

చ॥ ఎఱుఁగ కొనర్చు దోషము స • హింపుము కావుము దేవదేవుఁడం
చెఱిఁగితి నెల్లప్రాణులకు • నీశుడ వాది వనాదివైన నీ
కుఱవుఁగ నిందుమౌళి ధను • వుంకువ సెయఁగ నెత్తునంతలో
విఱుగుట యబ్బురంబె? యది • వేడుకఁ బట్టుట కేని చాలనే ?

తే॥ పురుష మోహన! నీవిటు • భువన రక్ష, బొంచె నవతరించుకతనఁ • బొందె జగము
నెమ్మదిని నే నొసంగిన • నీదు విల్లు నీ బలంబున కుఱవు గా • నిదియె సుమ్ము

తే॥ కూర్చు నాకుగమ్మునకు నా • గొప్ప తపము నాహుతిగ నొసంగితి నన • నపుడుచేయి
వదులు విడువ నస్త్రం బేగి • పరశురాము తపముపూర్తి వారుకొని య • త్తఱిన మరలె

తే॥ నీల జీమూత నిభ గాత్ర • నిగమ వినుత పాత్ర! పరిశుద్ధ సుగుణ చ • రిత్ర! నీవు
ఏలఁచు కార్యంబు నొనఁగూడఁ • గలవునాకు సెంవెయనిభార్గవుఁడు మ్రొక్కి తలఁగెనచటు

తే॥ అంత రాముండు పంచేంద్రి • యక్రియాలి తొఱఁగి సోలిన తన తండ్రిఁ • దఱిసి తడవి
మ్రొక్కి దుఃఖ సాగరమున • మునిఁగియున్న యతనికిం జూపె సమ్మోద • మనెడు వేల

ఆ॥ తెలిసి తేఱి వంత • దొలఁగ నిబ్బరమగు నుబ్బు గలిగి లేచి • యుర్విభుఁడు
అరిది దుఃఖ జలధి • దరి జేరి దరిచేని మోద వార్ధిలోన • మునిఁగిపోయె

ఆ॥ కటికి పంకురాము • కార్ముకంబును గొని యతని నోర్చి నిలుచు • నఘ విరాము
రాము నంపెకొని శి • బంబు జూర్కొని యమ్మ దాశ కుంభ వారి • నాడఁ జేసె

చ॥ నయమునఁ బిన్ననాఁటనె యొ • సర్చిన యద్భుత పౌరుషోచిత
క్రియల జగత్త్రయం బొకటి • రిం గమకించినఁ జేయఁగూడునే •
అయమునయంబులం జలుపు • ప్రాణులకుం దగినట్లు లీతఁడి
మ్మయి మఱుమై యొసంగెడు ర • మాపతియే యని యెంచె నెమ్మదిన్

తే॥ విరుల వానతో వచ్చిన • విబుధులఁదు వరుణు గని క్రూర ఘోర వ • పంబుగాఁచు
చుండుమని యిచ్చి తన వార • లుత్సహించి బలయ రాముఁ డయోధ్యకు • వచ్చిపేరే

తే॥ చేర ప్రేమంబుతోడ వ • సించుచుండ, దశరధుం డొకనాఁడు మో • దమున భరతుఁ
గాంచి దైవవశమున ఘ • టించినట్టి, విషయ మొక్కటి దాఁ దెలి • పింపఁదొడఁగె.

తే॥ తనయ! నీ తాత కేకయ • ధరణిధవుఁడు, నిన్ను చూడఁ గోరినవాడు • నెమ్మితోడ
పోయి రమ్మని యానతి • సేయ నతఁడు, మంచిదని తండ్రి చరణ ప • ద్మముల కెఱఁగి.

తే॥ మొనసి రాము పాదములకు • మ్రొక్కి యతని, కన్న వేఱు ప్రాణంబు లే • కున్నకతన
ప్రాణముల వీడి గాత్ర మ • వ్వలికిఁ బోవు, విధిని భరతుండు రాముని • వీడిచనియె

తే॥ మేనమామతో భరతుఁడు • మేనితోడి, నీడవంటి శత్రుఘ్నుండు • తోడ రాఁగ
స్యందనం బెక్కి యేడు వా • సరము లరిగి, యరయ సొంపైన కేకయ • పురము చేరె.

చ॥ భరతుఁడు చన్న పిమ్మట నృ • పాలుఁడు ధర్మపథంబునన్ జనుల్
జరుగఁగ దగ్గ పద్ధతిని • సత్పరిపాలన సల్పుచుండఁగా
సురల మహా తపః ఫలము • చోద్యము గావున మిక్కుటంబుగా
జరిగిన దెల్లఁ దెల్పెదము • శ్రద్ధమెయిన్ వినుఁడీ మహాత్మకుల్.

బాలకాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.



# అయోధ్యాకాండము.

## 1. మంత్ర పటలము 93.

సీ॥ రాజు రెండవ భార్య, రాముని పినతల్లి, కుబ్జయౌ మంధర • కొడిమ సేయ
రాజ్యంబు వీడి య • రణ్యంబు సేరి స, ముద్రంబు దాఁటి స • న్మని సురేంద్ర
మానవావళి యిడు • మలు తీర్చు శ్రీపాద, ములు గల శ్రీరామ • భూవరుండె
మూలప్రకృతిఁ దోఁచి • భువనంబులందు వ్యా, ప్తింబొందు పాంచభౌ • తికములైన

తే॥ జంగమ స్థావర పదార్థ • సమితి యందు, మేను ప్రాణముల్ ప్రాణవి • జ్ఞానములును
గూడియున్నట్లులోవెలిఁ • గూడియుండు, నాత్మయనిపల్కుచుంద్రు మ • హాత్ములెపుడు

తే॥ రాజవర! నీవు భూమి పు • త్త్రికున కొసఁగి, దుష్కరతపంబుసేయంగఁ • దొడఁగఁదగిన
కాల మిదియని చెవిఁజేరి • లీలఁ దెలుపు, కరణి జెవిమూలమున నర • గాన నయ్యె.

తే॥ ప్రాణికంటకుఁడైన రా • వణుఁడు సేయు, పాపఫల మప్డు పలితమై • వచ్చిచేరె
ననఁగ నరసిన నరపు న • రాధివరుఁడు, ముకుర మందున నొకనాఁడు • మొనసికాంచె

ఆ॥ శంఖ కాహళాది • శబ్దంబులంభోద, లీల మొరయఁ జామ • రాలు బెరయ
మానవేశ్వరుండు • మంత్రాంగ సభ కేగె, మనము సంచలించి • మలఁగుచుండ.

ఆ॥ ఏఁగి పిదప నృపుల • నెనలేని చుట్టాల, సంగడీంద్రఁ బ్రేమ • సాగనంపి
యొనర జగముఁగావ • యోగనిద్రవహించు, విష్ణువనఁగ నొంటి • వెలసియుండె.

ఆ॥ పూర్ణచంద్రుఁబోలు • ముక్తాతపత్ర మా • కసమునంట విభుతఁ • గ్రాలుభూపుఁ
దమర గురునిబోలు • నసదృశ మంత్ర వృ • ద్ధులను సభకునంతఁ • బిలువఁబనిచె.

తే॥ అవని విభునకు రక్షచే • నాజ్ఞ చేత, దైవమనుచు భావింపంగఁ • దగిన వాఁడు
మూర్తులందున నాలవ • మూర్తియనఁగఁ, దగు వసిష్ఠుఁడు రాజ స • దస్సుచేరె.

సీ॥ వంశమూలంబైన • ప్రాఁతదనంబును, విద్యానవద్యత • వెలయువారు
కార్యఫలంబును • కడు చెడు గొనరిన, మాధ్యస్థవృత్తి నే • మఱనివారు
కోసాదులం దెగఁ • గోసి కడిందియౌ, సద్ధర్మ పద్ధతి • జరగు వారు
జరిగిన యదిగొని • జరిగెడు దాని నూ, హము సేయఁజాలు కు • శాగ్ర మతులు

తే॥ అదియుఁ గర్మానుగుణముగా • నైనదైన, మార్పుఁదగు పట్టుదలగల • మాన్యగుణులు
కులమునకు ననురూపమౌ • గుణముగలరు, *చమరమృగమును బోలుమా • నముగలారు.

* ఒక వెండ్రుకయూడినను ప్రాణము విడుచునది చమరమృగము.

సీ॥ తరుణంబు స్థలము సా • ధనమును చదివిన, మన్నైనీతి యెఱింగి • మసలు వారు
దైవాను కూల్యంబు • తగు సూక్ష్మమతిచేత, నెఱిఁగి ధర్మంపు వృద్ధి • పరచు వారు
సత్స్వభావంబు య • శస్కరకార్యంబు, గలిగి రాడ్భాగంబుఁ • దెలుపు వారు
రాజు కోపించినఁ • బ్రాణంబునకుఁ దెగి, కష్టమోరిచి నీతిఁ • గఱపువారు

తే॥ సత్పథంబు తొలంగని • స్వచ్ఛగుణులు, తెలియఁ దగ్గ త్రికాలముల్ • తెలియువారు
నాయకునకు మేల్కొడుల • పాయలరసి, వైద్యుఁబోలె హితంబునే • పలుచువారు.

తే॥ మించినెంజిలి ప్రభు సంక్ర • మించినపుడు, మొదలి పుణ్యఫలముఁబోలి • యొదవువారు
వేలకొలఁది వారైనను • విభుని హితము, పట్లనైకమత్యంబునఁ • బరఁగు వారు.

తే॥ మాటయెన్నఁడుఁ దప్పని • మహిత మతులు, తొలఁకుచుండు సంపద్వృద్ధి • కలుగువారు
మీరలుచుండు నలలు గల • శరధివోలె, వచ్చి చేరిరి మంత్రాంగ • భవనమునకు.

తే॥ చేరి విమల విజ్ఞాని వ • సిష్ఠ మునికి, జోతయొనరించి తమ భూభు • జునకు మ్రొక్కి
తగిన గద్దెలపై గ్రమం • బుగ వసించి, యుచిత వాక్యజ్ఞు కనికర • మొంది రంత

ఆ॥ ఆజి వారి మోము • లనువొంద నీక్షించి, చెప్పఁదలఁచు నరిది • చెయిది గలదు
నాదు బుద్ధిఁబోలు • నయగుణ విదులార! వినుఁడిసావధాన • మున నొకింత.

ఆ॥ ఇన కులంబు వారి • యింపైన నడవడి, నించుకేని కొఱఁత • గాంచకుండ
మీసహాయశక్తి • మేదిని నఱువది, వేలయేండ్లు మెఱసి • యేలినాఁడ

తే॥ కొమిరెలకు నెల్లఁ దొడవగు • క్రొత్తడి తన, మమరఁబ్రేమ యొప్పార ధ • ర్మము దలిర్ప
జీవకోటికి హితమునే • చేయుచుంటి, నింక నా జన్మమున కిత • వెంచినాఁడ.

ఉ॥ కోరితంబుకై తెరువుఁ • గూరుచు ముప్పును గన్నయేను భూ
భారము సర్వరాజ కుల • పర్వత దిగ్గజముల్ విరామ మిం
పారఁగ నొంద మోచితి న • యంబున నవ్విధి మూవఁజాల మా
వారలు వోయినట్టి పెను • బాటనె వోయెద మోక్షమందఁగన్.

చ॥ అమల మనస్కులై జగతి • నంతయు నేలిన మాకులంబు దీ
పములగు పెద్ద లిప్పుడమి • భారము పుత్త్రులు మోవ వీడి దు
ర్గమ విష యేషణంబులు తొ • లంగి నశింపఁగ ముక్తినొంది రా
క్రమమునే యేను పూనుకొనఁ • గాఁ దలపెట్టితి నిక్కువంబుగాన్.

తే॥ త్రిజగములఁ గల యరుల దో • రిచినయేను, దొంగలం బలె దాఁగి యొ • దుంగు కామ
ముఖ మనశ్శత్రువులకు నీ • ముదిమి యందు, వెఱచి నడ పీన్గు కరణి జీ • వింపఁగలనే?

తే॥ అరుణ కిసలయ మృదుపద • యైనకైక, కొలగొన దశాసుర • రధికులను కూల్చు
నాకు మానస భూతంబు • నడపునైదు, తేరులను గెల్చుటన దొడ్డ • దియే తలంప?

మ॥ చతురంగ ప్రతివీర సైన్యమనిలోఁ • జక్కాడుచుం జావరే
నతుల జ్ఞానము నొందరే నఖిల సౌ • ఖ్యంబుల్ విచారింప శా
శ్వతముల్ గావని వీడరే నమల వి • ద్వద్భానులం జేరి సం
సృతి విధ్వాంతము ఁ టరేని యగునే • చేరంగఁ గైవల్యమున్?

తే॥ ఎన్న 'జాతస్య హిధ్రువో • మృత్యు' వనెడి నుడిని మఱచుట కంటెను • చెడుగు గలదె?
యొనర సన్న్యాస మనుతెప్ప • యొప్పదేని, జననమను మహాంబుధి దాఁట • శక్యమగునె?

తే॥ మహిత సన్న్యాసము తదీయ • మార్గమందు బంధువగు నెఱుకయు నను • పక్షయుగము
దొరయునేని జనన మను • దొడ్డచెఱను కడచు కంటె నింపగుగొప్ప • కార్యమేది

చ॥ అరుదగు మేలనం దొదరి • యవ్వల నెవ్వగ నించు నింద్రియా
వరణ సుఖంబులైన నయ • వంచక శాత్రవవర్గ దుష్కృతుల్
వెరవున నీఁగి మోక్ష రమఁ • బెంపునఁ బొందఁగఁ దృష్ణఁజేసి తొం
దరపడు డెందమందున హి • తం బగునే యిల నెందమావులున్?

ఉ॥ ఏలితి మీరు తోడుపడ • నిద్ధరఁ బద్ధతితోడ సత్కృతుల్
బోలఁగఁ జేసితిన్ యశముఁ • బొందితి నీజననంబునందు నా
కీ లలి సాయపడ్డ సుహృ • దీశులు మీరలు భావి జన్మసౌ
ఖ్యాలికి నిట్టులే తగ స • హాయులు గండిదె మిము ్వేఁడెదన్

చ॥ నెగడిన పాపముల్ తొలఁగ • నీఁగు తలం పనుకంప నింపు పెం
పగు తపమొప్పుగాఁ జలుప • నయ్యెడునేని యమర్చియుంచు తీ
పగు నమృతంబు వీడి విస • మర్మిలిఁ ద్రావుట వోలు నొక్కొ? బల్
వెగటుగఁ దోఁచె నాకుఁబృథి • వీభర సౌఖ్యము లుల్లమందునన్

తే॥ భద్ర గజము మీఁదఁ • బరవు చికిలి పీలి కుచ్చు లమరు వెల్ల • గొడుగు నీడ
సతము గాదనంగ •' సహియించునే చాల కాల మనుభవించి • క్రిక్కుకూడు

తే॥ చిర మపుత్త్రిక చింతము • చ్చిరుచునుంటి రాముఁడాచింత దొలఁగించె • బ్రాఁతి నించి
యింక నాతండు కష్టింప • నేను జీవ యాత్రఁగడతేర్చుకొనుమార్గ • మరయువాఁడ

తే॥ రణమునన్ మరణింపఁడు • రాము తండ్రి వార్ధకం బొందియును ధర్మ • పథమునుండి
సన్న్యసింపఁడన్ వార్తసం • జనన మొందు పిదపఁ బుట్టలే దనుకంటె • వేఱెయగునె?

చ॥ ఇరవుగ జ్యేష్ఠపుత్త్రుఁ డుద • యించెను జానకి యన్ రమా సతీ
వరణము కన్నులారఁ గని • బంధుర మోదము నొందినట్టి యే
నరవుగ మానినీత్వమున • నొప్పిన భూ వనితా వివాహముం
జరపి మదంతరంగమున • సంతసమెంతయు నొంద నెంచితిన్

తే॥ భూమిదేవియు శ్రీదేవి • ప్రేమతోడఁ జేరఁ గోరు నాయకుని వి • శిష్టమైన
ప్రాణముఁ బోలెఁ బొందు త • పః ఫలంబుఁ దామసింపఁ జేయుట నాకుఁ • దగవుకాదు

ఉ॥ కాన సమస్త రాజ్యమును • గ్రచ్ఛలి రామున కొప్పగించి య
జ్ఞానము వీడమిన్ విడని • జన్మ పరంపర వీడఁగోరి నేఁ
గానకుఁ బోఁదలంచితిని • గాఢ తపం బొనరింప నింక మీ
మానిత భావముల్ దెలుప • మక్కువతోడ వినంగఁ గోరెదన్

తే॥ దశరథుం డిట్లు వల్కఁ జి • త్తముల నుండి పొంగి పొరలిన యుత్సాహ • పూర్ణులయ్యు
మంత్రు లవనిపు నెడఁబాటు • మదిఁ గలంపఁ గ్రేపు జంట కడలు గోవు • క్రియ నలంగి

తే॥ అట్లు కుంది వేపేదియు • నధిపు హితము లేమి భూమిఁ బ్రాణితతికి • రాముఁ బోలు
నుత్తములు లేమి విధి బలం • బుల్లములను వంచ నెట్టకేలకు సమ్మ • తించినారు

తే॥ నలువ కొడుకు వసిష్ఠుండు • కుల హితుండు, సచివుల తలంపు పుత్త్ర వి • శ్వాసము గల
తండ్రి తలఁపును లోక హి • తంబుఁదలఁచి, తాఁదటస్థుడై యిట్లని • తనియఁ బలికె

ఉ॥ తొల్లిటి నీదువంశ గుణ • ధూర్వహు లందున రామువంటి స
త్తల్లజుఁ గన్నవారెవరు ? • తద్జ్ఞుఁడ నీకిది యుక్తకార్యమే
యుల్లమునందు మిక్కిలిగ • యోచన చేసియె నిశ్చయించి తీ
వెల్ల విధంబులం దలఁప • నియ్యది చేయఁగఁ దగ్గ దియ్యెడన్

ఉ॥ పున్నెముఁ గూర్చు జన్మములు • పూర్తిగఁ జేసిన రాజచంద్రమా!
యెన్నఁ దపంబు సేయఁదగు • దేత్తెఱ నీవిఁక నీదు పుత్త్రుఁడున్
నిన్ను దొలంగఁ గాంచి ధర • ణీ తరుణీ మణి యంధురాలు కా
దన్న తెఱంగునన్ బృథివి • నంతయు నేల సమర్థుఁడే చుమీ

చ॥ తగవొక రూపుదాల్చి యవ • తారము నొందిన దంటకంటె వే
ఱుగ నొకయర్థమెత్తి యను • రూపముగా వచియింపఁ గల్గునే ?
పొగడిత కెక్కు నీవిజయ • భూషణుఁడెల్ల సృజించి కాచి త్రుం
గఁగ నొనరించు నమ్మగుర • కార్యములన్ సరిదిద్దు వాఁడగున్

చ॥ స్థిరగుణ ధీర! లక్ష్మియగు • సీతయు భూమియు నింక నీతఁడే
యుఱవగు ప్రాణపంచకము • నొప్పిన తోడని యెంచు రాఘవుం
డిఱవుగ స్వీయ జీవముల • కిష్టుఁడ యంట వృథా ప్రలాప మె
ల్లిఱకుఁ బ్రియుండు తన్నుగని • లాలన చేసిన నీకునుం బలెన్

ఉ॥ రాజవరేణ్య! రాముని తి • రంబగు నామము ప్రాణికోటికిన్
దేజముఁ గూర్చి దుఃఖములఁ • దీర్చుకతంబున విప్రులాదిగా

భూజనముల్ దలంత్రు తమ • పొందిన ధర్మబలంబ యంచు వి
భ్రాజిత కీర్తిశాలివయి • భ్రాతిని గూరిచి యేల చెప్పఁగన్?

సీ॥ కీర్తిమీఱిన జాన • కీ దేవి యంటి మా, భూదేవి కంటెను • పొదువుగలది
కలుముల జవరాలి • కంటెఁ గాత్యాయని, కంటె సరస్వతి • కంటె దొడ్డ
శ్రీరాముఁ డంటిమా • సీతా కటాక్ష వీ, క్షణముల కంటెను • కాంతపరుఁడు
నేర్చిన వారలు • నేర్వని వారు త్రా, వెడు నీటికంటె జీ • వితము కంటె

తే॥ మించి నీజ్యేష్ఠ సుతునె ప్రే • మించు వారు, నర సురాదుల యిడుమ ల • ణంచి కాచు
వారు రాముకంటెను గొప్ప • వారు లేరు, కాన నీకుఁ దపముగాక • కలదె వేఱు?

తే॥ అనుమునీంద్రు పల్కులు విని • నంతఁ దండ్రి, కన్న నాఁటికంటె భవుని • కార్ముకంబు
విఱుచు నాఁటి కంటెను భృగు • వీరు గెలుచు, నాఁటి కంటెను గొప్పయా • నంద మొందె

సీ॥ అట్టి సంతోషంబు • నందిన నరపతి, కనుల నానందాశ్రు • కణము లొలుక
నమ్మని పాద ప • ద్మమ్ముల కెఱఁగి మౌ, నీంద్ర యింపుగ వచి • యించితయ్య
మీదయచేతనే • యీదాసుఁ డీభూమిఁ, దాల్చె రామున కది • తగకయున్నె?
యుత్సాహమున హిత • ముపదేశ మొనరింప, మద్వంశ్యులగు పూర్వ • మనుజపతులు

తే॥ అఖిల కకుబంత విశ్రాంత • యశముఁగనిరి, వేలుములు లెక్కకును మీఱి • వేల్చినారు
గురుతరంబగు తమదయ • గొంటి మింటి, మింటినంటితి ధన్యతఁ • గంటి ననియె.

తే॥ అంత నెంతయు నంతయు • మంతు సలుపఁ, జాలు మంతులు మొగముల • జాడ వ్రాసి
చూప నింగితజ్ఞుండు రా • జునకుఁ దగు సు, మంత్రుఁ డిట్లని పలికె న • మస్కరించి.

ఆ॥ రాముఁడొందె రాజ్య • రమ యను ముదము మీ, సన్న్యసించు వార్త • సమయఁజేసెఁ
దలఁగఁ దగదు పూర్వ • ధర్మ పద్ధతు లిఁకఁ, దగవు కంటెఁ జెపుగు • ధరణిఁ గలదె?

ఆ॥ పోరులకును రాజ • వరులకు మునులకుఁ, మంత్రులకును భేరి • మది ధ్వనింప
జ్యేష్ఠ పుత్రురాజుఁ • జేసి నీమలు జన్మ, హితము చూచికొనుము • నృపశశాంక!

తే॥ అను సుమంత్రుని పలుకుల • కతఁడు మెచ్చి, రామ పట్టాభిషేకపూ • ర్వకము గాఁగఁ
దక్కనవి యొనరింపుఁడీ • తరుణ మంద, యీవ వడినేగి రాఘవు • నిటకుఁ దెమ్ము.

క॥ అని దశరథుఁ డాడఁగ నా, తని పదముల కెఱఁగి విమల • తత్పరుఁడై యా
తని మదిబోలెన్ వైశమ, కనక రథముఁ గొనుచు రాము కడ ం జనియెన్.

శా॥ లోకంబుల్ వశమైన చందమునఁ బొ • ల్పొం గాంచి యుప్పొంగి య
స్తోకామోదముతో సుమంత్రుడు వడిన్ • జొత్తెంచి సౌధంబునన్
భూకన్యా మణితోఁ బ్రియానుజునితోఁ • బొంగార భాషించు రా
మాకారామృత మానె నేత్రములతోఁ • నానంద సంపూర్ణుఁడై.

మ॥ విని కై మోడ్చి రఘూత్తమా! కలదు వే • గం గార్య మొక్కండు ర
మ్మని మీతండ్రి ముదంబుతోఁ బిలువ న • న్నంపంగ నేతెంచితిన్
అనుచెండంచు వచింప రాముఁడు వడిన్ • సద్భక్తిమై లేచి స్యం
దన మెక్కెన్ వెను మేను మొందు కుధరేం • ద్రం బెక్కు చందంబునన్

చ॥ తొడరిరి దుందుభు ల్మొరయఁ • దోయజ నేత్రల కంకణంబులున్
సదరి ధ్వనింప గోరికలు • సాగె నటంచు సుపర్వు లార్వఁ బూ
ముడిఁ గల చంచరీకములు • మూఁగుచు సందడి సేయఁ దేరిపై
వడివడి నేగె రాఘవుఁడు • వారనిప్రేమము తొల్కరింపఁగన్

ఉ॥ నిండెను వాద్య ఘోషములు • నిండెను మంగళ గేయ నాదముల్
నిండెను మారు తూపులును • నిండెను శింజిని మ్రోఁత పెల్లుగా
నిండెఁ దలంపుల న్నదులు • నిబ్బరపున్మది యానకట్టగా
నిండెను సిగ్గు వీడి హరి • ణీ తతి నాఁ దరుణీ విశానముల్

ఉ॥ కుండల కాంతితో విరియు • క్రొవ్వెద తోడుతఁ జంద్రశాలలున్
మండిత గేహళీ తతులు • మానిత రీతిని పూచెఁ దామరల్
గండెలు రక్తసిక్తమగు • కత్తులు కుంతములున్ ద్విరేఫముల్
నిండి భ్రమించి నిల్వ జిగి • నెక్కొనఁ బూచె గవాక్ష పంక్తులున్

తే॥ నిండు జాబిల్లి వెలుఁగొందు • నీరదంబు వంటి రాముతొమ్మన విరి • పదమునందు
విద్రుమోష్ఠుల సైర్యంబు • విడెముతోద వాలుగలు మధుపములతో • ఎరుసఁ బొరలె.

ఉ॥ చిందెను కొన్ని పూవులు శ • శిప్రభ తోడ మొయిళ్ల జాఱుటన్
చిందెను కొన్ని ముత్తెములఁ • జెందొవఁబోలినవౌ కటాక్షముల్
చిందెను కొన్ని చందనముఁ • జిక్కని చన్నులు వేఁడిఁ దాల్చుటన్
చిందెను కొన్ని పుష్పముల • శ్రీ కర మందిర చంద్రశాలలున్

చ॥ తొలుక యొఱన్ దిగన్విడిచి • తుంపెసలాడు నరాజి వంటియూ
జలజవిరోధి మోచికొని • చంచల మందెడి పైఁడితీవలం
గల యెల నీటి కాయలధి • కంబుగ సన్నని మంచు మొగ్గలన్
నులియఁగ రాల్చు నొక్కయెడ • నువ్వుల పేలలవంటి పొంబొడిన్

తే॥ తెరువునం జేష్ట లట్లుగాఁ • బురుషు లెల్లఁ దల్లిఁ దలఁచు క్రేపుల వలెఁ • దమిని నిలువ
విమలుఁడగు తమ్మతో రామ • విభుఁడు కడచి చేరెన్నృపతి యతనిఁ బ్రతీ • క్షించు నెడకు

తే॥ తొలుతఁ దమ కులగురునకుఁ • దెలచి పిదపఁ దండ్రి చరణాబ్జములకు వం • దన మొనర్చ
రాజ్యలక్ష్మికి నిరవైన • రాము నురము నలము కొనియె భూవరుడు ను • దగ్రులొలుక

చ॥ తనయుని కౌఁగిలించె నని • తక్కువగా వచియింప నేల? మే
దిని వహియింపఁగాఁ దగు స్థి • తిన్ గ్రహియింపఁ దలంచి దోర్యుగం
బును వనమాలకున్ సిరికి • ముఖ్య గృహంబు విశాల వక్షమున్
దన భుజవక్షముల్ పఱపి • ధారణి నాథుఁడు కౌల్చె నేర్పడన్

ఉ॥ అంత మహా ముదంబున హృ • దబ్జ మెలర్పఁగఁ జెంత నుంచి కొం
చెంతయుఁ బ్రేమ నిల్లను న • హీనకురారక రాము కీర్తి య
త్యంతము బ్రుంగఁజేసిన మ • హాభుజః నిన్ గని పెంచినట్టి యే
నింతగ వేఁడి పొందదఁగ • యేర్పడె నొక్కటి విన్ము పల్కెదన్

తే॥ కష్ట మొందితి ముదిమియుఁ • గదిరె నొదల మోవఁగాలేక దుఃఖించు • భూమిభార
మనెడి చెఱవీడి సత్పధ • మునఁ జనంగ నెంచి నీదగు సాయ మ • ర్థించువాఁడ

చ॥ స్పృహ గొని పుత్రులం గనుట • చెందిన దుర్దమ దుఃఖ మీఁగఁగా
నిహపరసౌఖ్యముల్ వడయ • నే యని చెప్పుట పెద్దవారికిన్
సహజము ధర్మదేవత య • నం దగు నిన్గని యిట్లులంగు టి
మ్మహిఁదగవే? యొడంబడుమ • మానుగ నేఁ గడతేఱ నిష్టమేన్

చ॥ మన మహిమాన్వవాయమున • మానవ నాథులు పూర్వులెందఱో
తనయులు భూమి భారమును • తాల్పఁగ నింద్రియ పంచకంబుచే
మొనసెడి దొడ్డ ముప్పుగము • మూలము ముట్టఁగఁ ద్రుంచి నిష్ఠమైఁ
జనఁ దమ జీవితంబులఁ బ్ర • శాంతముగాఁ గడతేర్చి రిద్ధరన్

ఉ॥ తొల్లిటి జన్మ పుణ్యముల • దొడ్డ ఫలంబున నీభవంబునన్
గొల్లఁగఁజేయు యాగములఁ • గూడిన భాగ్యముచేతఁ బేర్మి రం
జిల్లఁగ నిన్ను గాంచియును • చెందిన లాభమదేది? ముప్పునన్
జెల్లని రాజ్యచింతను ము • నింగి యలందురుచుంటి నేనియున్

మ॥ ఒక పక్షంబునఁ గుంటి వేఱుదెస యం • దుద్దండమౌ జర్వ నో
పక యల్లాడు వృషంబు భంగి నలఁచెన్ • వార్ధక్యమున్ రాజ్యమున్
వికటించెన్ భువి భోగముల్ మనమునన్ • వేపారితిన్ మోక్ష రూ
పక సామ్రాజ్య సుఖంబుఁగోరితిని త్రో • వన్ దోడుగా వేఁడెదన్

చ॥ మును మనవారు సద్గతులు • పొందు దశల్ చెడి క్రుంగ వారికిన్
మనుమఁడు వంశదైవమగు • మాధవు పజ్జుజంబు నుండి పు
ట్టిన యమరాపగన్ బలు క • డింది తపంబునఁదెచ్చి యవ్వలన్
జననము లేని మోక్షమును • చక్కనఁ గూర్పఁడె యాపితాళ్ళకున్ ?

ఉ॥ వారక పీఁటఁదగ్గ పెను • వంతల వీడిన వారు రాజులా
కారు సుధాంశు భోజనులు • కారు సురేంద్రుని పోలు వారలా
కారు తపోధనాఢ్యులును • కారు వ్రతంబులు చేయువారలా
కా రెవరన్న మాట వినఁ • గాంచిన పుత్రులఁ గన్నవారలే

తే॥ ఐన జనకుఁడు వంచించి • యార్త్రిధరముఁ గూర్చె నాపయి నని కయి • కొనఁగ వఁదు
రత్న మకుటంబుఁ దాల్చి ధ • ర్మమును కావు తండ్రి నీ యెడఁ బొందఁగఁ • దగిన

మ॥ జనకుం డివ్విధిఁ బల్కి రాముఁడెద ఽ • ష్టం బింత లేకున్న మా
అని వాఁడై విధియంచుఁ దండ్రి మది నా • రం జూచి బొధించు నా
పని యేదై నను మాఱుపల్కకొనరిం • పం బూనుచే నీతి పు
త్రుని కంచూహముచేసి యొప్పికొన • ను దోఁగించె వల్లే యనెన్

ఉ॥ రాము తలం పెఱింగిన ధ • రావరుఁ డాదట నావరంబు నీ
వోమితె యంచుఁ బ్రాణముల • నొంటఁగఁ జేరిచి వేదసన్నిభుల్
ప్రేముడి మంత్రిపుంగవులు • వెంబడిరా విభవాను భావుఁడై
హేమ మహీధరోన్నత మ • హీశ్వరసౌధముఁ జేరె వేడుకన్

ఉ॥ ఉత్తమ విప్రులున్ విభవ • యుక్తులు రాజులు స్త్రీలు పూరుషుల్
చిత్తము రంజిలఁగ వెనుకఁ జేరి ప్రమోద భరంబు తోడ రా
నొత్తి మెలుల్ వహించి పెను • పొందిన సుందర దోర్యుగుండు తే
రెత్తన నెక్కి యేగెఁ దన • మేడకు భేరులు బోరు కొల్పఁగన్

సీ॥ జయ శీలురగు నృప • జనములు రండని బంగారు తేకు౦ • పైనిఁవ్రాసి
గరుడ ముద్రను వైచి • గరువంబుతోఁబంపు, కుఱుగురు నీక్షించి • కువలయేశుఁ
డానిక నను భగ • వానుఁడాః మకుటాభి షేక సామగ్రిని • సేకరింపఁ
దగు నన నతఁడును • తపసికూటముతోడ వెడలుడు సామంత • విభులఁగాంచి

తే॥ రాజ ధర్మాను సారంబు • రామ విభున కిమ్మహీతల మొసఁగంగ • నియ్యకొంటి
ననిన యవ్వాక్య మైరేయ • మాని క్రమము దప్పి మోదాబ్ధిమునిఁగిరా • ధరణిపతులు

చ॥ ఎడఁగల కౌతుకం బుబికి • యేపున రోమ బింబులందు వె
ల్వడఁ దమిఁబొంది తోడుతనె • స్వర్గముఁ జేరినవారిఁబోలి యొ
క్కెడఁద గలారలై తమకె • యియ్యల దక్కిన యట్టులుబ్బి య
ప్పుడమి పరేణ్యు భక్తి మెయి • మ్రొక్కివచించిరి వార లివ్విధిన్

ఉ॥ ఇర్వదియొక్క మాఱు చరి • యించి నృపాలుర యన్వవాయముల్
గుర్వగ గొడ్డట న్నలికి • కూల్చిన యెక్కటి జామదగ్న్యు దు

గర్వమడంచి మాకులముఁ • గాచిన యాజగదేక వీరుఁడీ
యుర్వర నేలఁగాఁ దగును • యుక్తమ నీవొనరించినాఁడవున్

ఆ॥ మాఱువడక నృపకు • మారు నావిధిఁ బల్క విన్న విభుఁడు మదిని • వేడ్కనడఁచి
కొనుచు మఱియు నొక్క • గురు హేతు భూతమౌ వాక్యమిట్లుపల్కె • వారితోడ

ఆ॥ పుత్రమోహమును • బుద్ధి నణంచని వ్వార్త నుడువ మీరు • పలికి నట్టి
పలుకు మనసునిండఁ • బలికినవో? లేక నన్నె యనుసరించఁ • బన్నినదియొ?

ఆ॥ అనుచుఁ బ్రశ్నసేయ • నాసభ రాజులు, నిండు గుణముగలుగు • నీదుతనయు
పైనిగలుగు ప్రేమ • బహుదేశవాసుల పలుకు లివ్వి యనుచుఁ • బలికినారు

ఉ॥ దానము ధర్మముం దగవు • తద్‌జ్ఞుల శీలము నభ్యసించు వి
జ్ఞానము లోకమందుగల • సద్గుణ పుంజములెల్ల నిండె స
మ్మానిత రీతి రాజ్యరమ • మన్నన లొందఁగఁ జేరఁదగ్గ నీ
సూనుని ధైర్యశౌర్యములు • చొప్పడఁ బాయకయుండు ఎచ్చలున్

క॥ ఉపయుక్తాచరణాదఁగ నుపయోగ ఋజంబు పండ • నొగి మొగిళుల వా
న పడంగ మళ్ళ వెల్లువ, లు ఎటవ నడ్డుకొను వార • లుం గలరొక్కో ?

క॥ భూమీశ! నిన్ను మిక్కిలి ప్రేమించెడు ప్రజలపట్లఁ • బ్రియ మెట్లుండున్
రామునకు నట్టిప్రేమయె, రామునియెడ నుండు నిజము • ప్రజ కెల్లపుడున్

క॥ అని పలుకఁ గోసలేశుఁడు మనమున నానందవార్ధి • మగ్నుం డగుచున్
దనిసెను చింతల వీఁగెను, కనుల ముదశ్రువులు రాలఁ • గడ కిట్లనియెన్

క॥ నడియునికి తగవు చెడుగుల యెడఁ గరినత గలుగు శీల • నృపులారా! యీ
తఁడు నాకొడుకెట్లగు మీ కొడుకగు నిల్లడగ వీనిఁ • గొనుఁడం చవలన్

క॥ రాజసభనంపి కోసల రాజన్యుఁడు శుభదినమున • రాజిలు లగ్నం
బోజఁ గన జోస్యులంగొని యోజింపఁగ నొక్కచవిక • కొందగఁ జనియెన్

క॥ మదఁతులు నలువురుప్రేముడి దొదఁకఁ బిగులు ఛన్నుకట్టు • గలిగిన వారల్
పొదవు జడ గలిగి సన్నని నడుములు గలవారు పరుగు • నం జనువారల్

క॥ ఆడుచు నొడలి వివశతం బాడుచుఁ జేడియల మీదఁ • బడుచుఁ బ్రియమునం
గూడుచు వారలకుం గై మోడుమచుం బఱచి డాయఁ • బోయిరి వడిగాన్

తే॥ కాలజీమూత దేహుని • కన్నతల్లి వారి చేష్టలఁ గని చంద్ర • వదనలార!
పట్టరానట్టి సంతోష • వార్తయొంతు గలిగినటు దోఁచెఁ గలదేని • ఎలుకుఁడనఁగ

తే॥ ధరణిపులు వీరకటక పా • దములుగొలువ నింపుమైభూమిఁ జిరము పా • లింపుమనుచు
నీదు జ్యేష్ఠ పుత్రునకు భూ • నేత ప్రాఁత మకుటముం గూర్పనున్నాడు • మస్తకమున

తే॥ రామునకు రాజ్యసంపద • గ్రాలె ననుచు, మునమునం దోచు నానంద • వనధి గురుత
నవనిపుఁడు సన్న్యసించెడు • ననెడి భయము, బాడబముఁ బోలె పట్టి పో • వంగఁ జేసె

ఆ॥ అట్టిదయ్యు నామె • యరుదైన మణిహార, వితతి ద్రవ్యరాశి • వేడ్క నొసఁగి
మైత్రి పాత్రమగు సు • మిత్రతో నేతెంచెఁ, బక్రపాణి యమరు • సదనమునకు.

ఆ॥ చేరి భక్తిమ్రొక్కి • శ్రీదేవి భూదేవి, తో సనాదియగుచుఁ • దోఁచి యమర
వరులకెల్ల మేటి • ప్రాణంబు జ్ఞానంబు, నగు ముకుందు శ్రీప • దాబ్జములకు.

తే॥ లోకముల గొప్పయుదరంబు • లోనదంచు, కొన్న విశ్వేశ! వరద! నా • కొడుకుఁగాచు
టెల్ల నీయధీనంబని • యుల్లమంద, యడఁగు తపమొప్పు కౌసల్య • యర్థిఁ బలికె.

తే॥ షోడశోపచారంబుగ • శ్రుతి హితముగ, నాదిదేవు నారాధన • మాచరించి
యచటనున్న తపస్సుల • నాదరించి, వత్సయుత ధేను వితతుల • వారి కొసఁగె.

ఆ॥ భూసురులకు మణులు • భూములు కన్యకల్, చందనంబు పసిఁడి • సన్న వలువ
లన్నమును విభూష • లరుదైన గేహముల్, విరివి గొఁగ నొసఁగె • వేడ్క యెసఁగ

తే॥ ఒసఁగి శ్రీవరు పదముల • కొనర నెఱఁగి, పొగడి సేవించి వలగొని • నగరి కరిగి
ప్రాఁత వ్రతముల నన్నింటి • నూఁత గొనియె, రామునకు మంగళంబులు • రాజిలంగ

## 2 మంథర బోధని పటలము. 86

క॥ భూమీశుఁడు జ్యౌతిషికుల, మోములు వికసింపఁ గాంచి • ముదితుండై శ్రీ
రామాభిషేక మఖల, కామెతగాఁ దగిన లగ్న • మరయుఁడి యనినన్.

తే॥ భవ్య లగ్నంబు రేపె రే • పకడ నున్న, దనుచు మౌహూర్తికులు పల్కి • మనుజవిభుఁడు
విని యనింద్య తపో గ్రణి • విమల సుగుణ. గణ్యుఁడు వసిష్ఠుఁ డిటువచ్చుఁ • గాకయనియె

తే॥ దేవపీయూష మట్లరు • దెంచు మౌనిఁ, గాంచి శుభ ముహూర్తము రేపె • గాన మీరు
శ్రేయములు గూర్చు విధు లాచ • రించి రాఘ, వునకు వలయు నీతులను తె • ల్పుఁడియనం!

తే॥ తమియుఁదానుగా ముందేగి • తపసి వరుఁడు, రాము సుందరోన్నతమంది • రంబుఁదఱియ
మౌని రాకయెఱింగి సం • భ్రమము దొలఁక, నెదురు వచ్చి లోనికిఁగొని • యేగె నతఁడు

క॥ నేరువఁ దగు శాస్త్రంబులఁ, గూరిమి విని తనివినొందు • కొమరుని గని యో
వీరాగ్రగణ్య! రేపే, భూరమణుఁడు నీకుఁ బట్ట • ముం గట్టుఁ జుమీ

క॥ ఉన్నవి నుదువఁగఁ దగినవి, మన్నీనికి సావధాన • మతివై విను మీ
విన్నవి మఱువక మనమున, నెన్నికఁ గొని యటు నడవు • మిద్ధ చరిత్రా!

# అయోధ్యాకాండము

క॥ హరి హర ధాతల కంటెను ధరాది భూతముః కంటెఁ • దధ్యము కంటెన్
స్థిర విబుధు లున్నతులు త, త్పర మతివై సలుపు తత్స • పర్యలు వత్సా!

క॥ అలిగి చెఱుపఁ గరుణించియుఁ గలిమి నిలుపఁ గందువంబు గల వారలు వే
ల్పులె నొచ్చి విచ్చిరన నా ర్యుల మహిమం గొలుచు బద్ధ • యున్నదె? వత్సా!

క॥ క్రూర గుణములకు మిక్కిలి దూరుం చరణములు శిరము • తొట్టఁ దెలిచి యిం
పారఁగ మాటాడుము నుడి వారల దూషణము సేఁత • వదలుము వవత్సా!

క॥ పొదలను ప్రిదులను వారల ముదలఁ గొనియె విధియు నడచు • మొగి నన నిఁక నె
య్యది గలదు పూజ్య పూజకు సదృశం బిరు మెయికి నెరయఁ • జను నిడి వత్సా!

క॥ పలుకు నుడివాలు శూలము గలిగి వలఁతులైన ముగురు • కర్తలకును ని
శ్చలత దయ తగవు లేదే, నలవడునే మేల్మి యించు • కంతయు వత్సా!

క॥ వసుధఁ జెలి యాపి సప్త వ్యసనంబులు నీకు లేని • వగు నైన నవే
కసటుల కెల్లను కుదురులు కసెము లనుచు హృదయమందు • కాంచుము వత్సా!

క॥ సమరస భావము గలిగిన సమరమ్ములు గలుగ వసము • స్రగ్గదు సేనల్
సమయవు తత్సుకృతస్థితి యమరినఁ జెడఁగోర వలెనె? యరులను వత్సా!

క॥ తనియఁగ నింద్రియములు కలి మిని నిత్యము పెనిచి పాడి • మిగులంగ దిటం
బున నేలున దేల్పడి య, ప్పని యసిధారా వ్రతంబు • పాటిది వత్సా!

క॥ హరి హర హిరణ్య గర్భులు, పొరసిన భుజ బలము పెంపు • పొందిన యేవిన్
నఁ వరులు సచివ బల మును సరించుట బలీయమైన • చుక్కటి వత్సా!

క॥ నరుల కమరులకు బలితపు టరుఁగు నక్షముల నిగ్ర • హము-చేయుటచేఁ
బెరుగునె సంపద జగముల నరుదగు ప్రేమంబు మిగుల • నడరక వత్సా!

క॥ జనములె జీవముగాఁ దాఁ దనువుగ నొప్పారు ధరణి • ధవునకుఁ దగవుర్
గెసరును సచ్చలముగ ని ల్చినచో జన్నంబు లేల • చేయఁగ? వత్సా!

క॥ ప్రియ వాక్యజ్ఞత యాగియు జయము విమల గుణము శుద్ధి • జతసము తిగవున్
దయయుఁ బరామర్శము గల నయ విదుఁం జేటు లలమి • నలఁచునె? వత్సా!

క॥ సిలు గులఁ దొలఁచుచుఁ బ్రాసున ములు పగిదిఁ దటస్థుఁడైన • భూవరునకు మం
త్రుల లక్ష్య సమీక్ష యొనరఁ గల కాలము గాక కనులు • గలవే? వత్సా!

క॥ ధర ధూమకేతు లనఁదగు తరుణుల వలలోనఁ జిక్కి • తపియింపఁదయేన్
రెగను పేరును గలుగదు నరకంబును లేదతనికి • నమ్ముము వత్సా!

తే॥ తగ విమర్శింప నెడలేని • తగవుపనులు, కోటగాఁగల ప్రాజ్ఞవా • క్కులకు లొంగి
తెరువు దప్పని విధియు వ • ర్తించు వారి, కరుణ పడయ నడియ మేటి • తెరువు వల్సె॥

తే॥ తత్త్వవిదుఁడిట్లు పెక్కు ఏ • ధాల నయము, భువన గర్భున కుపదేశ • మ్ముం బొనర్చి
యరయికను వెలిఁగించి స • హస్ర శీర్షు, నాలయంబున కెతెంచె • నతని తోడ

తే॥ శేష శయనుఁ డౌ లక్ష్మీశుఁ • జేరికొలిచి, వేద పూజ జలంబుచే • వేగ జల
మార్చి సద్విధుల్ చక్కఁగాఁ • దీర్చి తెల్ల, దప్పులఁ బఱపి రామునా • స్థలిని నిలిపి

ఆ॥ రామచంద్రుఁ డందు • రంజిల్ల నుపవసిం, పఁగ వశిష్ఠుఁ డేగి • ప్రభున కద్ది
తెలుప నతఁడు సేవ • కులకు నాజ్ఞాపించె, లలిత రీతిఁ బురమ • లంకరింప

తే॥ రామచంద్రుండు రేపు భూ • రమణుఁడగుచుఁ, బట్టముం గట్టుకొన నుండెఁ • బౌరులార!
పురముఁగై సేయుఁడని తల • వరులు పూన్కి, భేరులన్ మొరయించిరి • వేల్పులలర.

ఆ॥ గేయమాన విమల • కీర్తిరాముఁడురేపె, ప్రాభవంబు తోడ • రత్న ముకుట
మును ధరించు నన్న • మోదవాక్కులు వారి, కమృత మద్బి నట్టు • లయ్యెవినఁగ.

క॥ జనములు కోలాహలముగ, ధ్వని చేసిరి తనిసి రాడి • పాడిరి పులకల్
తనరఁగఁ బూరించిరి తే, నిని పొగడిరి తలవరులకు • నినిచి రుపదలన్.

ఆ॥ ప్రేమతోడఁ బ్రజయు • వేవెలుంగును కౌస్తు, భమును సానవట్టు • పగిదిఁ బొప్పి
మునుపె యంద మగుచు • మొనసిన నగరంబు, సంచుగా నలంక • రించి నారు.

క॥ పలు రంగుల వెలయు పతా, కలు చూడన్ రాము కలిమిఁ • గాంచెడు వేడ్కన్
బలు వన్నెల పులుఁగులు పరు, సలుగానప్పురము చేరు • సరణిం దోఁచెన్.

చ॥ వనితల నిద్దమౌ తొడల • వంటి యనంటులు వారి గొంతులం
జెనసిన పోఁక మ్రాఁకులును • చెన్నగు వారి పదాళిఁబోలు సం
తనగల తారహారములు • తత్కుచ సామ్య మహిష్ఠ తప్త కాం
చన కలశంబులున్ నగరి • జానుగఁ గానఁగ నయ్యె నెల్లెడన్.

ఉ॥ అంబుధి సంభవుం దగులు • నట్టి వినూతన తోరణంపుఁ గం
బంబులు వెల్లు గోపురపు • ద్వారము లందలి వాలు సుప్రభా
తాంబుజ మిత్రుకాంతి వడ • నగ్గలికంబుగఁ గ్రొత్త చంద మం
దంబుగ నొందియొప్పెఁ గను • దమ్ములకున్ మిఱుమిట్లు గొల్పుచున్

తే॥ ధవళ కవచ రత్న స్తంభ • తతులు భూతి, గలుగు నరనారీశ్వరు • కైపు దోఁచె
విద్రుమ స్తంభములుమంచు • విరియమఱిఁగి, యలరుమార్తాండురూపంబు • ననుకరించె.

ఉ॥ ముత్తియముల్ మనోహరతఁ • బూర్ణశశాంకుని కాంతి వీవ సం
పత్తమ పద్మరాగమును • ప్రాగుదయార్క గభస్తి లీవ న

త్యుత్తమ నీల రత్న తతు • లుత్కట గాఢ తమంబు నింపఁగాఁ
గ్రొత్తగు వీధు లొప్పె గణ • కుట్టెలిపించు దినంబులం బలెన్.

ఉ॥ నృత్యము సేయు రథ్యముల • నేరిచి కట్టిన తేరు లొప్పె సాం
గత్యము సేయ భూజగముఁ • గాన నెరంగు విమాన పంక్తి నా
నిత్య లలాట పట్టములు • సచ్చలు శోభిలు దంతు లొప్పెనా
దిత్యునితోడ నాస నరు • దెంచెడు పూర్వదిగద్రులో యనన్.

తే॥ పటిక గోడలఁ జేరిన • వరుసలందు, సందు కెంపులు చీఁకట్లు • నీఁగఁ జేయ
నచట నేనాఁడు నెడఁబాటు • నరయ కుండ, జక్కవలు మది నెమ్మది • సంతసిల్లు.

తే॥ పూలజడి నీటిజడి గంధ • పొడుల జడియు, నాణి ముత్యాల జడి యొర • యంగరాలు
నగల ఙ్గ గరుజడి చేరి • నెగడి జడిగఁ, దుఱఁగలించె మిక్కిలి యాత్ర • తోఁకలను

తే॥ గంధగజములు కవచులు • కటకసదులు, నైన వీరులకై వడి • నరుగు చుండె
వ్రేలు రశనా నితంబముల్ • వెలయు సకుల, క్రియను కరిణులు నడచెఁ గిం • కిణులతోడ

ఉ॥ పైపయి వృద్ధినొందు విభ • వంబు సుఖంబు మనోజ్ఞరత్వమున్
లోపము లేమిఁ గాంచి యిహ • లోకముఁజేరిన వేల్పు లేమియుం
దోఁప కయోధ్యఁ జేరియును • దూరము వచ్చియు స్వర్గలోకమం
దే పరిగొంచు నుంటి మని • యెంతయుఁ జింతిలుచుండి రచ్చటన్.

మ॥ వడిఁగై సేసిన యప్సరోత్తమము భ • వ్యంబై సురౌకంబుకై
వడి నొప్పార దశాననుం బలె నౌన • ర్పంగా నసాధ్యంబులౌ
కొడిమల్ పూనిచరించు మంథర పురిన్ • గోలాహల ధ్వానముల్
కడు వేధింపఁగ వీధి జేరి కనియెన్ • గార్యంబులున్ హేతువున్,

సీ॥ కాంచి మంథర తగు • కారణం బూహించి, తత్తఱమందు చి • త్తంబు తోడ
వేదనతోఁ గోప • వీక్షణంబుల తోడి, వడిచేతఁ దడఁబడు • నుడులతోడ
ద్రిజగంబులకు నస • దృశ పీడ యొనరించు, కడఁకతోఁ దొల్లి రా • వణుని వలన
కార్ముక ముక్తమృ • త్కణ బాధితాంగయౌ, కతముఁదలఁచి పెను • కసలు తోడ

తే॥ మణులతోఁ గూడి విరియు తా • మరలు గల్గు, పాల కడలి వీచికలఁ బ్రి • వాళ లతిక
నాఁగ టాక్షముల్ పరవ మం • చమునఁ బండి, యున్న కైకేయి కడకేగె • నుగ్రగతిని

తే॥ మృదుల నికచపద్మములు నో • డిన వ్రతముల, వఱల నుపమానతం బొంది • వెలయున
కైక బంగరు పదముల • కడ వసించి, తడవె మెల్లనఁ గూరుకు • తలఁగునట్లు.

తే॥ తడవ నుత్తమ సతి కైక • తన విశాల, నేత్రముల నుండి పూర్తిగా • నిద్ర విడమిఁ
గాంచి కట్టాదడిం బొందు • కలుచ రేఁచఁ, బలికె నిట్టులు నిర్బంధ • ఫణితిఁ గుబ్జ

తే॥ చెదుగుసేయువాలునుపోలి • చిలుముగలుగు రాహుకబళించువఱకుమా • అనిమృగాంక
బింబముంబలె వెల్లివి • విధినిరెచ్చు దుఃఖములు సమీపింప ని • ద్దుర వహింతే?

ఆ॥ కొడిమ విసముఁ బోలు • చెదుగరి గుజ్జులు పలుకఁగైక వాప • పాఱు లగుచు
నాకుమార వరులు • నలి నున్న వారు ధ ర్మంబు దలఁగరెట్లు • మలయుఁగీడు?

ఆ॥ పొగడఁ దగిన సుతులఁ • బొందిన జనములు కీడ దొలఁగి పోసు • ఖింత్రు నిజము
శ్రుతులఁ బోలు రాము • సొంపారఁగను నాకు నాపదయును కలదె • యువని యందు?

తే॥ గారమను నద్ది మునిఁగిన • కైక యిట్లు పలుక వంకిరపాపంబు • పగిది నొప్పు
కుబ్జయనుఁ దూలె మేలిమి • కూలె సిరియు నేర్పు చేతఁ గౌసల్య య • న్నియు గడించె

తే॥ అనుడుఁగైకయిట్లనుభర్త • యధిపుఁడగుడు పొగడఁదగుగుణీభరతుండు • పుత్త్రిఁడగుడు
నింత కంటెను కౌస్ల్య • కేమి కోరఁ దగిన సుఖ జీవితం బింక • ధరణిఁ గలదు?

తే॥ వీరులు హసింప మగపాడిం • దూఱుపడఁగఁ దాటకంజంపురాముఁడు • త్రాహియగుచు
నేల్లి రాజ్యాభిషేకంబు • నెనయఁగలఁడు • కడకుఁ గౌసల్యగాంచు సు • ఖంబు నిదియ

తే॥ అనుచు మంథర యవ్వార్త • వినుచు నంతఁ గైక కౌసల్యల యెడంద • లేకమగుచు
భేదముంబొందకుండె భూ • విభుఁడుదశర థుండుకైకేయిమదిఁజొచ్చి • యుండఁబోలు

చ॥ కలిగిన గొప్ప ప్రేమ గను • కంధి విరావము తోడనుబ్బఁగాఁ
గలఁరని నిండు చందురుని • కైవడి నొప్పు మొగంబు తేటయై
వెలయఁగఁ గైక యుల్లమున • వేడుక యెల్లను మీట మూఁడు వ
హ్నులకు శిరో విభూష యన • నొప్పిన రత్న సరం బొసంగఁగన్

ఉ॥ వంచక దాసి నేత్రములు • వహ్ని కణంబులు రాఁ జూచె గాం
డ్రించె నదల్చెఁ దిట్టె బెద • రించె రదంబులు గీఁటె భూషలం
ద్రెంచెను నెత్తి గొట్టు కొనెఁ • ద్రెళ్లెను బోరున నేడ్చె వెక్కఁ గో
పించెను రత్నహారమును • వ్రేసెను మేదిని పల్లమేర్పడన్

ఉ॥ వేసటఁ జూచి చూచి యవి • వేకిని వింత యెఱుంగలేవు పె
న్మోసము లేమి నింకఁజెడి • పోయెదు పుత్రుస తోడ నీవు నా
కోసలరాజ పుత్త్రి తన • కోరిక నొందెను నీ సపత్నికిన్
దాసుం కింక నేఁ జిరము • దాస్యము సేయఁగఁ జాల నోర్పుమై

తే॥ అవనిజయు రాఘవుఁడు నున్న • తాసనముఁ గ్రాల నీపట్టి యట నిల్చి • కేలు మోడ్చి
పనుపు సేయ నీవొందు సం • బర మదేది? దీనఁ బొందిన నీమన • స్సిరత యెద్ది?

మ॥ తన మేలున్ మది నెన్నఁడున్ మఱవ దా • తంత్రజ్ఞ కౌసల్య త
త్తనయుండో తన తండ్రి రాజ్య రమఁ దాఁ • దక్కించు కొన్నాఁడు నీ

తనయుం డెల్లను నీఁగెఁ జచ్చి నతఁడౌఁ • దక్కోమియుం గాఁద, యే
మని నీదుఃఖముఁదీర్చి కొందు భరతున్ • హా! నీవు కన్నావాకో!

చ॥ ధరణిని రాముఁడే యతని • తమ్ముఁడు లక్ష్మణు తోడ నేలుచో
భరతుఁడు వాని తమ్ముఁడును • భారపు జీవిత కాల మంతయున్
దొరలఁగ రాజ్యము న్విడిచి • దుర్గమ కానన సీమలందు దు
ష్కర తపముల్ వ్రతంబులును • చప్పఁగఁ బంపుట మేలు చూడఁగన్

తే॥ రథ గజాదులఁ గల్గి భూ • రమణి వలచు నంత సుందరుఁడై రాజు • లందు లెక్క
పెట్టఁ దగినట్లు భరతుండు • పుట్ట లేదు కాన గిట్టుటయే మేలు • కాదె తలఁప

తే॥ పుణ్యహీనుని భడుని • మున్నె తండ్రి యాజ్ఞ యొసఁగి కారడవి ద • వ్వరుగు నట్లు
వడిగఁ బంపిన హేతు వి • ప్పట్ల నాకుఁ దెల్ల మయ్యెఁ బట్ట పగట • దీప మేల?

తే॥ భేద బుద్ధి మనంబునఁ • బెట్టి యిట్టు రాజ్య మాతని కీచ్చు కా • రణము వలన
తండ్రి క్రూరుండు తల్లియు • దైత్యురాలు చిన్ని భరత! నీవే మిఁకఁ • జేయు దయ్య

ఉ॥ రాజ కులంబునం బొడమి • రాజ గృహంబుననే పెరింగి పై
రాజ గృహంబు సొచ్చి మఱి • రాజ కళత్రమ వైతి వయ్యు నీ
వోజను వేల గాననిమ • హోగ్ర విపజ్జల రాశిలోఁ బడం
గాఁ జనుచుంటి చెప్పినను • కానవు నీకును లేదు బుద్ధియున్

ఉ॥ విద్యయు యౌవనంబు నల • వింగనరాని బలంబు మేల్ ధను
ర్విద్యయుఁ బేర్మి యందమును • వీర్యము శీలము సద్గుణంబులున్
హృద్యముగాఁగ నీసుతున • కేర్పడి యుండుట శాద్వలంబుపై
నుద్యమ మొప్ప దేవ సుధ • పొల్కఁగఁ జేసిన చందమయ్యెగా!

తే॥ నాల్క చేదగు నట్లుమం • ధర వచించు చెడుగు పలుకులు మందెడు • చిచ్చునందు
ప్రాజ్యముం బోసినట్లు కో • పంబుఁ బెంపఁ గనులు కెంపుగదురఁ బల్కెఁ • గైకయిట్లు

చ॥ దినమణి యాదిగాఁగఁ గుల • ధీరులు ప్రాణ ధనంబు లూడిసన్
దపరిన నీతి మార్గమును • తప్పరు కేకయ వంశ విక్రముల్
మనుకుల మాఱు దూఱువడు • మార్గము దెల్పెదె? క్రూరురాల యే
మని వచింయించి తిట్టులిఁక • నాడకు జీవము లింత తీపమేన్

చ॥ తనియఁ నాకు మేల్సలు పు • దానవు కావిఁక నాదు పటికం
జనవున శ్రేయముం బొసరఁ • జల్పెడు దానవు కావు రావ పా
డిని గమనింప నీకును ఘ • టించుదుర్గు వివేకహీన నిన్
గొసి కలుషంబు దుర్విధియుఁ • గోరిక నార్పఁగ వాడి తివ్విధిన్

ఉ॥ పుట్టిన గిట్టిన న్నరులు • పొందుట విడుటకీర్తియే యనం
జుట్టలు వీడినన్ గుణము • చూఁడిన నీతి విపర్యయ స్థితిం
బట్టిన వీఁక దప్పినను • పాడి తపంబులు మాఱు పొందినం
బుట్టిన వంశ ధర్మమును • బో విడువం దగునే నరాశినీ!

చ॥ నిలువక పొమ్ము నాయెదుట • నిల్చి దుష్టపము లల్పవాక్యముల్
పలికిన నీదు నాలుకను • పచ్చడి సేయక యోర్చి మానితిన్
బలుకకు మిద్ది యొద్దు విన • బాప ఫలంబును తప్ప కొందెదో
పలువ! దురాత్మురాల! యిట • వాగకు మూయుము నోరి వింకనేన్

చ॥ విసమును తీసి వైచినను • వీడక ప్రాణిని కష్టపెట్టున
ట్లెనఁగి తిదియవాక్యముల • కించుక జంకక కుబ్జ యోర్పు మై
గుసుమంతా మదాగ్రయమ • కొంచక వెక్కసమైన నీకు మే
లొసఁగు హితోక్తులన్ విడువ • నోప నటంచును పల్కెఁ బాదముల్

తే॥ జ్యేష్ఠునకె రాజ్యభారంబు • చెల్లునన్నఁ దండ్రి కంటె రాముఁడు పిన్న • తండె కాఁడె
తేఁడె దీనికి నంగీక • రించె ననఁగ భరతుఁనకు నీయ సక్రమ • భంగ మగునె?

ఉ॥ ధర్మము నిండు ప్రేమగల • తాపస వర్యులకైన రాత్రమా
శర్మము నొందు నాపిదపఁ • జయ్యన మాఱు స్వభావ మల్లన
త్కర్ములె యయ్యు నింతవడి • కష్టము గూర్పని వారు మీఁద దు
ష్కర్మవు లాచరింత్రు మదిఁ • గాఱియ సెందుమఁ గ్రుంగునట్లుగన్

తే॥ సూనుఁ డేలికయైనన • సూయ యెదఁదఁ గలుగు కౌసల్య కిత్యంత • బలము గలుగు
నీకు నీకొడుకున కామె • నెనరు చేసి యిచ్చు నెప్పంబు గాక వే • తేమి గలదు?

ఉ॥ ప్రేరణ సేయు కష్టమును • బీదఱికంబును దొట్టి నిల్వ ని
న్గోరిన వారికిన్ సవతిఁ • గోరి యొసంగెదొ? సిగ్గు నొందెదో?
మాఱని సంకటంబునను • మాఁడెదొ? యూరక పొమ్మటందువో?
యేరిహి జీవితంబు భరి • యించెదొ? కుందెదొ? క్రుంగికూలెదో?

ఉ॥ ఏమి యొనర్ప నీయెదఁద • నెంచితి వింకను కొన్ని నాళ్ళ లో
లేమిని దీనతన్ మది చ • లింపఁగ నిన్నను తల్లి దండ్రులో
ప్రేముడి చుట్ట పక్కములొ • వేఁడగ వచ్చినవారొ కాంచటల్
నీమహిమ మెమ్మొ? నీసవతి • నిక్కపు సంపదయో వచింపుమా?

చ॥ చరి వును చూపు నీపతికి • జంకియె నిక్కము సుమ్ము జానకీ
జనకుఁడు రాము మామ చని • జక్కఁగఁ జేయ గలేకపోయె నీ

జనకుని యింక నాతనికి • సౌఖ్యమయంబగు జీవితంబు గ
ల్గునె? నినువోలె నాఱడిని • కుందఁగఁబుట్టిరె యేరు వీఁటిఁడీ!

తే॥ క్రూర శాత్రవుల్ తండ్రి మా • ర్కొనినవేళ, వీర లెంతమాత్రముతోడు • గారుగాన
జయ మదెట్లబ్బు? నీవు నీ • జనుల తోడఁ, జెడఁగ దుఃఖాబ్ధిఁబడ సాహ • సించి తిట్లు

క॥ నీ ముద్దు కొమరుఁ జెఱచితి, వీ మహి తొలుదొల్త నబ్బ • నెవని కతని గా
రాము సుతుల కయ్యెడు నా, పై మాఱక యట్లె వారి • వారికి నబ్బున్.

ఆ॥ పలువ దాసి యిట్లు • పలుక దివ్యుల మాయ, వలన వారు పొందు • వరబలమున
ఘనులు చేయు తపము • కతమునఁ గై కేయి, విమల మనము మాఱి • వెడఁగునొందె

తే॥ సురవిరోధుల క్రౌర్యంబు • సురల తపము, పండి ప్రేరేఁపఁగ మధుర • వాణి కరుణ
వీడుటన్ గదా రాముని • వినుత కీర్తి, సుధను ద్రావుచున్నారలు • సుజన వరులు

తే॥ అట్టి కై కేయి మంధర • నలరఁ జూచి, నన్ను ప్రేమించి నా పుత్రు • నకు నయంబు
సేయుదానవు ముకుటాభి • షేకమతఁడు, పొందువిధమది పొసఁగఁదె,• ల్పుమ యటన్న

తే॥ దాసి యిట్లను కై మోడ్చి • దైన్యమింక, నీకుఁగల్గునె? నావాక్య • నియతి విడక
జరుగు దే నయోధ్యయెకాదు • జగముల్లెల్ల, సంతరింతు నీసుతునకుఁ • జదురు రాల!

తే॥ అరసి చెరిఁగి గాలించి వా • క్యం బొకటడు, పలికెదను విను మున్ను శం • బరుని కలన
గెలుచు నాఁడొసఁగిన వర • ములను రెంటి, నిపుడు పడయుము విడక ప్రా • ణేశునొద్ద

తే॥ ఒకట మేదినిఁగొని మఱి • యొకట సవతి, కొడుకు రాష్ట్రంబు త్యయించి • ఘోరకాన
నముల నలయ నంపుముసమ • స్తముఫలించు, నని యెనొడలియట్లెడవంక • యమరుకుబ్జ.

తే॥ దాసియారీతిఁబల్కనం తసమునొంది, యలమికొనుచుఁగై కయమూల్య • హారమమిత
ధనమొసంగి నాసుతునకు • ధరణియెల్ల, నిచ్చితిఁక రాజమాతవు • నీవ సుమ్మ.

తే॥ మంచి వెరవు బోధించితి • వంచితముగఁ, బొట్టివారికి బుట్టెఁడు • బుద్ధులనుట
నిజము; నేఁడు నాకోరికల్ • నెగ్గుటొ పతి, కడన జీవముల్ వదలుటొ • గలుగుఁ బొమ్మ

మ॥ అనుచుం దాసిని సాగనంపి సుమశ • య్యం డిగ్గి నీలంపుఁ గొ
ప్పును విప్పెన్ విరులన్ విదిర్చెను శిరో • భూషల్ త్యజించెన్ మహా
ఘన జీమూతమునన్ మఱింగిన సన • క్షత్రు న్నిశానాధు బై
లునకుం దీసిన లీలఁ దేనియ కళు • ల్మాఁగన్ రొదల్సేయుచున్.

చ॥ పెరిఁగెడు కీర్తి వల్లికను • వేరులతోఁదెగఁద్రుంచె నాఁగ బం
ధుర లసదంగమౌ రశనఁ • ద్రుంచి విదుర్చుచుఁ గాలి యందెలన్
వర కటకంబులం దిగిచి • వైచి శశాంకు కలంకుఁదుద్దు వై
ఖరి నుదుటన్ రహించు తిల • కంబును వోఁదుడిచెం దటుక్కనన్.

చ॥ తొడవుల నొక్కొకిందుగను • త్రుంచి చెదర్చి ధరాతలంబుపైఁ
బొడవగు వెంద్రుకల్ వలపు • పొంపిరి వోవఁగ విప్పి కన్నులం
డిడివిన యంజనంబు ఎడి • ధారలుగాఁ గరఁగింగ నేర్చుచుం
బుడమిని పొర్లుచుండె నటఁ • బువ్వులు రాలిన తీఁగపోలికన్

ఉ॥ పెచ్చగు రాఎమొంది పృధి • వింబడు జింకను పోలి నృత్యమున్
మిచ్చిరిఁ జేయు నెమ్మి పురి • మడ్చి యడంగిన భాతి సీత యన్
లచ్చి యయోధ్య వీడుటఁ ద • లంచి ముదంబున నామె యక్కయం
దిచ్చిగఁ జేరినట్లు పడి • యాఱట నొందుచు నుండెఁగైక దాన్

3 కైకేయీ పటలము 96

తే॥ అర్ధరాత్ర మరుగునంత • నవని విభుడు కార్యనిర్వాహకులగు భూ • కాంతు లెల్లఁ
గొలువ వీణాధ్వనియులోనఁ • గుందఁదగిన మధురవాణి కైకేయి వే • శ్మమునకరిగె

ఆ॥ వెంట వచ్చిన రాజులు • వినతులగుచు వాకిటను నిల్వ దశరధ • పార్థివుండు
పరిజనంబులతోడ లో • పలికి నేగి పడక వీడిన కైకేయి • కడకు నరిగి

తే॥ కాంచి చలియించి కలఁగిన • కత మదేది యనుచుఁ జింతించి పిడియేనుఁ • గునవహించు
వనగజంబట్లు కైకను • తన కరములఁ గ్రుచ్చి లేవంగ నెత్తెన • కూర్మితేఁడు

తే॥ కాంతు ప్రాణములం బోలు • కైక తన్ను తడవియెత్తిన దీర్ఘహ • స్తములఁద్రోచి
వైచి చలియించు మించు నా • వలలి నేలఁ, బడి పలుకకుండ నూర్పులు • విడువసాగె

చ॥ అదిగని రాజు బిట్టులికి • యంగద యెయ్యది సంఘటించె? నీ
యెదకుఁ గలంకఁగూర్చు జను • లేడు జగంబుల నున్నఁ జావు వొం
దుదు రెటువంటి వారయినఁ • దోయలి! యొందిన దేదో తెల్పి యా
పిదప గ్రహింతుగాక పృధి • వీపతి కార్యము లంచుఁ బల్కఁగన్

తే॥ విభుఁడు పలికిన పలుకులు • విన్నకైక మొగులుఁ బోలు కనుల బాష్ప • ములు తొనంకి
స్తన గిరులు నిండ నాయెడ • నెనరు గలుగు నేని నాఁడిచ్చు వాని నేఁ • డిమ్మనంగ

తే॥ ఆమెయుద్దేశమెఱుఁగని • యవనివిభుఁడు మెఱపుతెఁఱగున నవ్వియో • మెలఁత వినుము
నీ కుమారుఁడు శ్రీరాము • ని పయి నాన వరము లిత్తు నింపుకయు లో • పంబు సేయ

తే॥ అని పలుకఁగైక నామది • నదరు చింతఁ దీర్తువేని వేల్పులె సాక్షి • తేట పడఁగ
నాఁడు రణ రంగమున మెచ్చి • నాకొసంగు రెండు వరముల నేఁడు గోరెద ఫలింప

తే॥ దృఢమనక్కయా కైకేయి యెదఁదఁగనక వరముగొన నింతతరఁబాటు • వనటవలదు
నాబరువు తగ్గనిత్తు నీ • నాఁడెకోనుము తెలుపుమదియేదో యనీ రాజ • తిఎకుఁడనమె

ఉ॥ క్రూరుల లోనఁ గ్రూర తని • కోరిన రెండిట నొక్కదానిచే
ధారణి నాథనూజునకుఁ • దప్పక పట్టము గట్ట నొక్కటన్
నారలు గట్టి దుర్గమ వ • నంబులోఁ బదు నాలు గేండ్లు పి
తారమణుండు చేర నని • ధైర్యము మీఱ వచించె రాజుతోన్

తే॥ నాగముం బోలు కైకేయి • నాల్కనుండి తాప కర వాగ్విషంబు తన్ • దాఁకునంత
వడఁకి యొడలెల్ల నుడుక భూ • వరుఁడు సోలి పొగ రడంగు నేనుఁగు వలె • భూమిఁగూలె

తే॥ ఉర్విపైఁబడి పొరలిన • సార్వభౌము నధిక దుఃఖముఁ జెప్ప సమర్థు • లెవరు?
ఉమ్మలిక వడి మదురంగ • నుడికి యుడికి కొలిమి నిప్పుఁ బోలె నూ • ర్పులను విడిచె

ఉ॥ నాలుక వాడి యెండెను మ • నంబు చలించెను కుంది ప్రాణము
య్యాలల నూఁగె నేత్రయుగ • మచ్చుగ రక్తము లొల్కె నక్షముల్
తూలెను చేయఁదగ్గిపియె • తోఁచక చంచలతన్ భజించె మూ
ర్ఛాలసతన్ సమస్తము ర • యంబున లేనిద యయ్యె నంతలో

తే॥ పదరి జీవముల్ తపియింపఁ • బార్థివుం డొకింత తెలివొందుఁ గుములఁగ • నేడ్చు నిల్వ
యత్న మొనరించి మఱి కూలు • నావి యడఁగఁ జిత్రముం బోలెఁ జూచును • చేష్టదక్క

ఉ॥ పాపినిఁబట్టి కొట్ట మది • భావన సేయు మడంతి యంచు రా
నోపిన సింధకున్ బిడియ • మొందు వ్రణంబున బల్లెముం జొరం
జోపిన నొచ్చి కూలు కరి • చొప్పునఁ దల్లడ మందు లోని పెం
దాపముతోడ నూర్చు కను • దమ్ములు పోయిన యట్లు దూపిలున్

ఉ॥ స్తంభమునందు గట్టుపడు • సామజముం బలె భూవరుండు సం
రంభము దక్కి దూపటిలి • ప్రజ్ఞవొలంగి యలంగుచుండఁగా
జంభ విరోధి ముఖ్యులును • జంకి వడంకిరి లోక విప్లవా
రంభము దోఁచె నైనను క • రంగదు కైక మనంబు సుంతయున్

తే॥ భర్త చింతను గని భయ • పడఁగ లేదు మనసు కరఁగదు బిడియంబు • గొనదటంచుఁ
బలుక సిగ్గుఁ బెద్దలు • వంచనంబె యువిద జన్మమందురు దాని • కూఁత యసరు
తే॥ అట్టిస్థితి నున్న కైకేయి • నట్టెమాచి నీవు భ్రమసితివా? లేక • నేర్చినట్టి
వంచకుల బోధ కలదొ? నా • పైని యాన నిజము వచియింపుమని పల్కె • నృపవరుండు

క॥ నాథా! నే భ్రమియింపను బోధించిన దింతలేదు • ముణ్ణొసఁగిన వే
సాధింతు నీయవేనిన్ వేధింపఁగ నింద నిన్ను • విడుతు నసువులన్

తే॥ రాముఁడే ప్రాణమగు దశ • రథ విభుండు, వెలఁది పల్కుసగము విని • వినక మున్నె
చూఁడు బొబ్బపై బల్లెంబు • గాఁడి నట్టు లైనఁ దపియించి యఱచచ్చి • యవనిఁ వ్రాలె

చ॥ త్రిజగము లందు గెల్పుగొని • తేఱిన ధీరుఁడు, కాలకూటమా•
భుజగమః మృత్యువాః యనుచు • మూలుగు మూలుగు విహ్వలించు మై
గజగజలాడ నేలఁబడుఁ • గ్రమ్మఱ లేచును సత్యవాక్యమే
నిజముగ నన్ను చంపెనను • నెంజిలి ధర్మమె చెడ్డదౌననున్

తే॥ వీరవరుల వీర్యంబులు • బీఱు వోవఁ, జెనకి నాతఁడు జగమున • శ్రీకముగను
వాఁడి వాలున ఖండించి • వైచియేను, వధము లొందు దుర్గతిఁగొందు • ననుచుఁగనలు

తే॥ సత్యకీర్తియౌ దశరథ • చక్రవర్తి, కేలు మోఁదు నొడుగొలుకుఁ • గీడెయయ్యె
సత్యమున నను గంపించు • సంతపించు, నిప్పుపై ఘృతమట్లు గుం • డెయుఁగరంగ

సీ॥ సత్యవాక్యంబుర • క్షణము త్యజించి శి, క్షించినఁ జెడుగె యి • చ్చినను చెడుగె
కలదని యోర్చుట • కంటెనుతన పట్టు, వదలని పాపినీ • వధముకంటె
యాచించుటే కార్య • మని లేచి కట్టుగం, బముల లాగెడు మద • వారణముల
బలము గలట్టి రా • జులు ముందు తొడరి పూ, జించెడు చరణ రా • జీవ యుగళ

తే॥ మమరు దశరథుఁ డంత దో • సములఁ ద్రోవఁదలఁచు వారలఁ బోలి రాఁ • గలుగుమేలు
కలదయేని శాంతము కావఁ • గలదె యంచుఁ, దలఁచి భూపతి కైక పా • దములఁబ్రాలె.

క॥ నీకొడుకు రాజ్య సంపద, గైకొనఁ డటు కొనిన జగము • కైకొనదెపుడున్
లోకమునఁ గేర్తినిలువదు, నీ కగునది నింద యొకటె • నిక్కము పడఁతీ!

సీ॥ త్రిదశులు నంగీక • రింపరు మర్త్యులు, ప్రాణము ల్విడుతురు • పంకజాక్షీ!
తక్కువారల కథ, తడవంగనేల? నీ, వెవ్వరిఁ గొనిరాజ్య • మేలు దాన
వేను చిల్కుట వల్ల • నే సమ్మతించిన, రాముండు నీదు పు • త్రకున కటులె
తప్పక యొసఁగు; వ • దాన్య కేకయుని పు, త్రీ! నాదు కన్నుల • ర్థింతువేని

తే॥ యిపుడ యొసఁగెద జీవంబు • లింతువేని, నీవశము కావె వరము లే • నియును ధరణి
మాత్రముగొనుముపేతొండు • మఱవుమబల!, నాపయిం దయయింతైనఁ • జూపఁదగవె?

సీ॥ ఇచ్చితి ననిపల్కి • యిఁకఁ దప్పఁగాఁజాలఁ, బెను వగముంచి త • పింపఁజేసి
నొంచకు మిట్లు యా • చించినఁ గ్రూర పి, శాచ మేనియుఁ దల్లి • చాయనిచ్చు
నిన్ను మిక్కిలి వేఁడు • నీ మగనికి దీని, నొసఁగిన దొసఁగులు • పొసఁగు నేమి?
యని భర్తను వేఁడఁ • దనసాటి తానెయై, పిడుగుల ముద్దయౌ • చెడుగుకైక

తే॥ మున్నెవరము లొసఁగి యిప్డు • పొక్కియోట, గొనఁగ నేముండు? నిఁకసత్య • మునుభరింప
నెపపు గల వారలోభువి • నెఱుఁగనైతి, ననుచు మది సుంత కరఁగని • దైవచించె.

సీ॥ కల్లలాడుట యెఱుం • గని నిత్యశీలిభూ, పాలుఁడా వాక్యంబు • నాలకించి
జీవంబు లుడుక మూర్ఛిల్లుచు నోర్పుమై, నీవనితారూప • మెంచిచూడఁ

జియమును చిప్పను • గలిపి చేసినయది. యనుచు లజ్జించుచు • నావిలేని
మనుజు వైఖరి నుండి • మరల నిట్టూర్పులు. విడిచి దీనత దోఁప • వేఁడికొనుచు

తే॥ నీకొడుకె రాజ్యమేలును • గాక నీవు, స్వేచ్ఛనధికారమును జర • పింతు గాక
యింత వశమగుఁగాక పా • లింతుగాక. యొసఁగితిని తప్పి దానికై • విసుగనేను.

సీ॥ నాప్రాణములను నా • నయనంబులంబోలి. భువిఁబ్రాణి తతికెల్లఁ • బుత్త్రుఁ బోలి
నడఁచు నాకొమరుఁ డీ • పుడమి పీడక యుండు. మాత్రంబు కరుణింపు • మకురువిడుము
చెలియ సత్యమె వేరు • తెగఁగోయు కాఁ ;మౌ. టకు నిట్లు వందువాఁ • డను మృగాక్షి
నాల్కపిడుచగట్టె • నాకుమారుఁడు కన్ను• మఱుఁగగునేని నే • మఱిఁగి చత్తు

తె॥ నాదు జీవముల్ నిను శర • ణంబు వేఁడు. చున్న వని యామె పదముల • నొఱఁగఁ గైక
యిచ్చి యడుగడు మనుట నీ • కెట్లు పాడి. యనుచుఁ ద్రోపాడె నిందయు • నగడుఁగొనక

తే॥ కఠిన పాషాణహృదయ యౌ • కైకయట్లు. పలుకఁగొమరుండు కానకు • వెలుమున్నె
నేను జీవముల్ నీఁగుట • నిజమటంచుఁ. బిడుగుపడు కొండవలెరాజు • పృథివిఁద్రెళ్లె

తే॥ త్రెళ్లి క్రూర దుఃఖాంబుధి • దిగిమునింగె. మునిఁగి దరి గానకావ్యాళ • ముఖి కఠోర
వాక్కు గుండెల నగలింపఁ • బాపచరిత నీచతకు సహింపక పడి • నేలఁ బొరలె.

చ॥ సతులిల జీవితేశ్వరులు • చావక మున్నె సుఖంబు రోయుచున్
బ్రతుకు త్యజించి రా యశము • బ్రాఁతిగఁ గోరక యింతదాఁక ద
త్పతుల వధించు నారులను • ధారణిఁ గానము వంశ నాశినీ!
పతి నిటు నీకరంబులనె • పాపపుఁ జిత్రవధం బొనర్తువే?

ఉ॥ పాపము లెక్కలేదు కుల • పద్ధతి మార్చితి ధర్మ మెంచవున్
దాపము నొందవున్ గరుణఁ • దాల్కొని చంపితి వాక్శరాగ్నిచే
వేఁపుచుఁ దీపి ప్రాణముల • వెంపర లాడి వధించి తింక నే
పాప మెఱుంగ కుండు ప్రజ • ప్రాణములం గొన నాస చేసితే?

చ॥ ముగుదతనంబు జంకు బిడె • మున్ నెఱి భూషలుగాఁ గలారలే
మగువలు; కీర్తికై బిడెము • మన్నన సేయుట లోక ధర్మమా
తగవు గణింపలేని వని • తల్ మగవారల లోనఁ జేరఁగాఁ
దగుఁ జెలి రూపుఁబట్టి వని • తాతతిఁ జేర్చుట యెట్లు పొందగున్?.

క॥ బలమున బుద్ధిని రాజుల. గెలిచితి దేశవలవఱకు • గీమున నొక స్త్రీ
వలఁదవిలి చెడితి ననియెదు. బలు నిందం బొంద నిపుడు • పాలైతిఁ గదే!

ఉ॥ మేరుగిరి వేఱు మేరువు,తో రాజిలు కరణి వెలయు • దోర్యుగళుండౌ
భూరమఱుఁ డగలుఁ బొగులున్, దూఱుఁ బొరలు లేచుఁ జూచు • దూపిల్లు వెతన్.

ఆ॥ ఒఱలి యొఱలి ధూళి • నెఱయఁ బొరలు రాజ, వరుని గాంచి కైక • పదరి పలికె
వరము లిత్తువాః భ • వ త్పన్నిధినె యిప్డు, ప్రాణములఁ ద్యజింతు • నాః వచింపు

ఆ॥ విరిసి యెరిసి జీవ • వితతిఁ ద్రావెడు వహ్ని, వంటి కైక మఱియుఁ • బలుకు నిట్లు
ఒక్కరాజు సత్య • మొగిఁ గావ నొడలిని, కోసియీఁడెః యిచ్చి • కుంద ఫలమె ?

ఉ॥ చచ్చునదే యటంచు మఱి • చచ్చియు స్త్రీ కొల చుట్టునంచు తేఁ
దిచ్చితి నిచ్చితిం గొమరుఁ • డేలఁగ దుర్గమ కాననంబు నేఁ
జచ్చి దివంబు నేలుదును • చావక నెత్తి ని గట్టు కొంచు నీ
విచ్చను రాజ్యమన్ జలధి • నీఁది దరిం గనలేక క్రుంగుమా.

చ॥ పలుఁక దొడంగు మున్నెనగ • పాలు కొలన్ మగియించు కత్తి నాఁ.
జెలఁగు మనో వ్యథం గుదురు • చెందని వాఁడయి చేష్ట దక్కితేఁ
డిలఁ బడి యట్లుపల్కె మది • నెంచిన దట్లు గడించి కైక పే
రలరున లోన నుబ్బుచు ర • యంబున సెజ్జకుఁ జేరె నెమ్మదిన్.

చ॥ అతిశయమైన నాళ్ళనొక • ప్రాణముఁ బోలిన మేటి కార్య సం
తతు లొనరించి వెండి పరి • తాపమునొందిన భర్తఁగాంచి యీ
యతివ రవంతయైన నడ • లందదు నవ్వేడి దీనిఁగాంచి యే
గతిఁ దలయెత్తనౌనని వ • గన్ జనెఁ జల్లని రేవెలందియున్.

తే॥ కైకవలనఁ దద్వరునకుఁ • గలుగు చెడుగు, గని కలఁగి తెక్కలనియెడు • కరములఁ గొని
కడుపు మోఁది కొనుచు నేడ్చు • కరణిఁ దోఁచె, కొక్రొకోయనుకడజాము • కోళ్ళకూఁత.

తే॥ మదవతులకాలియందెల • రొదలఁబోలి, కొలఁకులందుమ్రాఁకులయందుఁ • గూడికూయు
పక్షిరుతంబు కైకేయి • పరుసుగాంచి, మంది లోలోనఁ దిట్టెడు • మాడ్కి నుండె.

తే॥ మఱవఁ జాలని భద్ర నా • మంబు గలుగు, రాముఁ డడవికి జానకీ • రమణి తోడఁ
బోవ నేము దేశము వీడి • పోదు మనుచు, లేచు కరణి శాలలనుండి • లేచెఁ గరులు.

చ॥ ప్రభగల పద్మనేత్రుఁడగు • రాము బలిష్ఠ మదేభహస్త స
న్నిభ కరమందు కంకణము • నిండఁగఁ గట్టకమున్నె చల్లనౌ
నభమున రిక్క కూటువలు • నాళిలి తెల్లన యయ్యె నీడగాఁ
గ భువికి పైచు పందిరి య • గల్ప బటాబయలైన కైవడిన్.

ఉ॥ పూవిలు పోరు గల్గునిసి • పోయెను వచ్చెను వచ్చె నేఁటికిఁ
శ్రీవరుఁ గొల్చు పండువని • చెల్వగ లేపుచు మ్రోఁగె భేరులా
రావము కొండపై జలధ • రంబుల మ్రోఁతను పోలఁగా మయూ
రావళిఁబోలి లేచిరి ము • ఖాంబుజముల్ వికసింప నంగనల్

ఉ॥ కొందఱు పెక్కులౌ విరుల • గుత్తులపైఁ బడి మందచారియౌ
గంధవహుండు మేఖలలఁ • గాంచన వస్త్రములన్ జెదర్పఁగాఁ
గుందిరి తాపముల్ సురుఁగ • గొందఱు వల్లభులన్ ముదంబునన్
సందిటఁ గొన్న కైతవపు • స్వప్నము లాఱ నలంగి రొక్కెడన్

చ॥ ఇలువడి సున్న చేసి కుల • మెగ్గుం బొగ్గుఱుగా నొనర్చి ని
శ్చలమగు నింద చేకొని య • శంబును చూఱలు వుచ్చి సిగ్గఱన్
నిలిచిన కైక చేష్టలను • నివ్వెఱఁ గ్రొత్తడు లెల్లఁ గాంచి మో
ముం ముకుళించి రిట్లనఁగ • మోడ్చెఁ గవాలయముల్ మొగంబులన్

చ॥ కుతుకము నిండ నాలుకలు • గ్రోసెడు మారుని వాఁడితూపులన్
మతికరి మందమారుతము • మాడ్చెడు వెన్నెల మేనిఁ గోయ జీ
వితముల రోయుచున్న యు • రుభీతమృగాక్షుం కద్దు మేలు కొ
ల్పు తెఱఁగు త్రాఁచుఁ బాము చెవి • లోఁ జొరఁబాఱిన చందమేర్పడెన్

సీ॥ చక్రియౌ శ్రీరామ • చంద్రుని పట్టాభి షేకంబునకు నెడ • సేయు చెడుగు
రాత్రి యుగాంత స • రణిఁ బెద్దదై యుండు చేలాకోయని పంక • జాలయమును
భూతవితతితోడ • మాతోడఁ దపము చే సిన నయనంబులు • చిత్తములును
సఫలత్వ మొందంగ • సమయ మిదేయని మేలుకనిరి యాగి • మేలువారు

తే॥ కనులు తెఱచి పండువుగరా • ఘవుఁడుమకుట ధారియగుచునూరేగఁగాం • తమయటంచు
విరుల పాన్పుల నుసలి లె • చిరి కడంక నలరుఁదేటుఱు తోడ భ • మ్మనుచు లేవ

తే॥ కుసుమకోమయల్ దిటంపుఁ • గోపమొంది యుదయదుందుభుల్ మ్రోఁగంగ • నులికినఁ
చెదర నడుము లల్లుం నాదఁ • జింత గొన్న చెలువు లింపొందఁగాఁ గటా • క్షింపరైరి

ఉ॥ క్రాలెను పీలి గుచ్ఛములు • క్రాలె వికాసిత పుష్పమాలికల్
క్రాలెను దుందుభుల్ నగలు • గ్రాలెను పక్షులు క్రాలె వీణియల్
క్రాలె మదేభముల్ హరులు గ్రాలె రధంబులు క్రాలెఁ జిత్తముల్
క్రాలెను ముక్తమాలికలు • క్రాలెను క్రాలె ముదాళు లెల్లెడన్

ఉ॥ ఏడు జగాంతోడ మఱి • యేడు జగంబులు జీవ పాళితోఁ
గూడ విహాయితంబు లోనఁ • గూర్చిన భూవర మౌళి చింతచే
వేడుక దక్కి యంగములు • వెల్వెల వోయి కృశించి నటి మై
చాడుపునన్ వికాసములు • స్రగ్గి మినుక్కనుచుండె దీపముల్

ఉ॥ మ్రోఁగెను కహళాది రవ • ముల్ మధుపాళి నినాద వైఖరిన్
మేఁగెను దీవనల్ మఱియు మీఱెను మేలగు మేలుకొల్పులుఁ

వాఁగెను వాద్యరావములు • వ్రబ్బె దర ప్రకరాపి లవంబులున్
రేఁగెను క్రోవి నాదములు • రెచ్చె హితంబుగ సామ గీతముల్.

ఉ॥ ధూపమువోలికన్ ముదురు • దొడ్డ తమంబను వైరి ఫీతిలన్
దీపము లెల్లఁ దేజములు • దీలుపడం దన వంశజుండు సం
తాపము నొంది క్రుంగ దురి • తం బొనరించిన క్రూర కైకపైఁ
గోపము నొందె నాఁగఁ దొలి • కొండను భానుఁడు దోఁచె నెఱ్ఱనై

తే॥ మూఁడు మూర్తులై వారికి • మొదలు నైన, విశ్వరూపుని విశ్వేశు • విల్లు విఱుచు
వాని యభిషేకముం గను • వాంఛ నున్న. మగువల మొగంబులట్లు ప • ద్మములువిరిసె

ఉ॥ ఆ సమయంబునందు గల • యంబుధు లొక్కట లేచె నాఁ బురీ
వాసులు నేఁడు రామునకుఁ • బట్ట మహోత్సవ మంచుఁ గాంత మం
చాసను లేచు కలక • లారవ వైఖరిఁ దెల్ప నేరి కూ
హా సముదీర్ణతల్ గలుగు? • నంచుఁ దలంచి రొకొక్క రయ్యెడన్

తే॥ వీరుల మనస్సులను లాగు • వెలఁదుఁ, లెల్లఁ, బాదములకు లత్తుక యిడు • వారు సంకు
గాజు లిడువారు కన్నులం • కాటు కిడెదు, వారు క్రొవ్విరుల్ తుఱిమెదు • వారు నైరి

తే॥ మోద భాష్ప ధారలు గల • మోము లందు, కల్లుద్రావువాలుగఁబోలు • కనులచెలుల
గంద పంకంబు బొమ్మలఁ • గలుగువారు. పొదలు నుబ్బున లక్ష్మణు • బోలెనైరి

తే॥ సతులు కౌసల్యఁ బోలిరి • జన్ని గట్టు. లల వసిష్ఠుఁ బోలిరి తక్క • లలన లెల్ల
సీతఁ బోలిరి జానకి • సిరిని పోలెఁ, బ్రభుని దశరథుఁ బోలిరి • పౌరు లెల్ల

ఉ॥ రాముఁడు గద్దె నెక్కనని • రాజ సమూహము వచ్చి చేరె న
య్యామనిఁ గాంచ వేడ్క హృద • యంబులఁ బ్రేరణ సేయ మున్నె యెం
తో మది నాసరేఁప విబు • ధుల్ సుధకై గుమి గూడు లాగునన్
భూమి నయోధ్య తక్కఁ బెర • భూములు శూన్యము లయ్యెనో యనన్.

సీ॥ చక్కెరఁ బోణులు • సైకత శ్రోణులు, విద్రుమాధరలును • పీన కుచలు
గుములయి పురుషుల • గుంపులతోఁ గూడి, నడవుఁడు నడవుఁడు • నడవుఁడనుచుఁ
బలుమరు పలుకుచుఁ • దొలి నున్న చోటనె, నిలుతురు వెడలెడు • తలఁపు విడరు
ప్రభువుల కూటమే • ప్రబల మనెడు వారు, యౌవతంబే పెద్ద • దనెడు వారు

తే॥ యోధ వారమే గొప్పది • యువక సమితి, దొడ్డదను వారు వచ్చిన • స్తోమ మెక్క
డనెడువారు వచ్చెడుగుంపె • యధిక మనెడు, వారు మొత్తము నెఱిఁగిన వార • లెవరుం

తే॥ అనుచు నీలోత్పలంబుల • యంద చంద, మీఁటెల దొసంగులం జేర్చి • కాటుక యను
విసము చంద్రు నందుంచిన • ట్లెసఁగు కనులు, గలుగు సుందరుల్ నెపుళుల • .. జనిరి

తే॥ చాల వాసించు నవ వన • మాలికాళి, రాముఁడగు రాముఁడటరాజ్య • రమనుపొందు
భాగ్యమునుచూడరాకుండు • వారులంకఁ, గలుగువారును గిరులు ది • క్కరులెయగును

తే॥ ఇంద్రుఁబోలిన రాజులు • చంద్రులనఁగ, నొప్పు ముక్తాతపత్త్రిము • లుప్పరమున
కప్పు నంచల గమి యన • విప్పు గలుగు, చామరల తోడ వచ్చిరి • చవిక కడకు.

తే॥ విమల తపమున ఫలమొందు • వేదవిదులు, తాము కనిపెంచు ముద్దుల • తనయు పెండ్లి
నడపు లలి వచ్చిచేరి రా • నందమునను, రాద్రమా రామ కల్యాణ • రంగమునకు

క॥ నించిరి సుర లంబరమును, నించిరి దిక్కులను మేది • నిం గల జనముల్
నించెఁ బసిఁడి జడి జలధుల • నించెఁ జెవుల బహుళభద్ర • నినదావభటుల్.

ఉ॥ దీపపుఁ గాంతి మించిన యు • దీర్ణనృపాల కిరీట కాంతు లు
ద్దీపిత భాను మండలము • తేజముఁగప్పె వరాంగనా విభూ
షాపృథుకాంతులొప్పె భువిఁ • జయ్యన గెల్చితి మింక నాకమి
ట్లేపున గెల్తమన్ వహి సు • రేశులకున్ మిఱుమిట్లు గొల్పుచున్.

తే॥ వలయుపరికరములు వస్తువులనుగొనుచు, మునులు శ్రుతులుపఠించుచు • మొనసిరాగ
ద్వార్స్థితులు సంభ్రమంబున • దారి దొలఁగఁ, గులగురుండు వసిష్ఠుచా • స్థలికి వచ్చె

తే॥ అమర వాహిని మొదలు క • న్యాకుమారి, వఱకుఁ గల తీర్థములు వార్ధి • వారియుంచె
వేల్మివస్తువులను సింహ • పీఠితోడ, వలయు నన్నింటి నట సిద్ధ • పఱచియుంచె.

తే॥ జ్యౌతిషికులు లగ్నము డాసె • నని వచింప, జ్ఞాన దగ్ధ కర్ముఁడు వసి • ష్ఠముని యాజ్ఞ
శిరమునం దాల్చి రాజేంద్రు • శీఘ్ర గతిని, తోడి తేర నెమ్మిని సుమం త్రుండు చనియె

సీ॥ అభ్రంకషం బగు • నంతఃపురీ సౌధ, మున సార్వభౌముని • గనక యచటి
వారి విచారించి • వడిఁగైకమందిర, ద్వారంబు చేరి కాం • తా జనంబుఁ
గాంచి కార్యము దెల్పఁ • గా వడివడిఁ జని, చేటికల్ కైకకుఁ • జెప్పనంత
యముఁ బోలు నయ్యమ • యాతనిఁగని రాము, వఁడికోడితెమ్మని • పనుపునంత

తే॥ బొంగి బంగరు మండప • ములు చెలంగు, వీధులం జని తనలోన • వేడ్కతోడ
దన్నుదాఁ దలఁచుచునున్న • దనుజరిపుని, మ్రొక్కి యిట్లను వదనంబు • మూసికొనుచు

చ॥ ధరణిపులున్ మునీంద్రులును • తక్క జగంబున వారు తండ్రి తీ
రరితి వహించి నిల్చి రర • యం బినతల్లియు మిమ్ము దోడితే
నిరవుగ నన్ను పంపె వడి • నెక్కు శతాంగము బొమ్మిడీకమున్
శిరమునఁ దాల్తు గాక యనఁ • జెచ్చెర నప్పుడ లేచె నాతఁడున్

శా॥ ధీరోదాత్తుఁడుదారుఁ డుత్తమ గుణ • స్తోమందు వారాశి గం
భీరుం డంత సహస్ర శీర్షునకుఁ గే • ల్వేమోడ్చి సామంత భూ

దార శ్రేణులు చుట్టిరా విబుధ బృం • దంబుల్ సుగీతంబు లిం
పారం బాడ విలాసినుల్ గన శతాం • గారూఢుఁ డయ్యెన్.

చ॥ బొమిడికమున్ ధరించుటకుఁ బోయెడి నం చుబలాట మొంది జీ
వము లటనెల్ల వారికొక • వైఖరినై రథమెక్కి యేగు రా
ము మొగము గన్నవారివలెఁ • బొందికఁ జూడనివారుగూడ మో
దము దయివాఱ గొప్ప నిన • దంబున మ్రోఁగిరి రెండు ప్రక్కలన్

చ॥ పెడిదపుఁ గైకవాక్యమున • వీరుఁడు పట్టము భూమి మాని కా
ఱడవుల కేగు మున్నె హరి • భాషిత హస్తములన్ కరీరముల్
నిడుపగు వాలుచూపులను • నేఱము లెల్లెడ నిండి యున్న పే
ఱడవిని చొచ్చె భాస్కర కు • లాంబుధి సోముఁడు రాముఁ డత్తరిన్.

సీ॥ గందంబు పుష్పముల్ • చందనంబు పరంజి, తొడవులు చెదరంగఁ • దొందర వడి
గాజులు రాల మే • ఖలలు ప్రీలంగ నా, లీలను లజ్జను • కోలుపోయి
కందర్ప శరములు • గాఁడి గాయంబయి, యుబ్బిన పీన ప • యోధరములఁ
గామాగ్నిచే వెచ్చఁ • గ్రాఁగిన కన్నీటఁ గలుకులు కొందఱు • కడుగువారు

తే॥ జాలి లేని యీతఁడు నేల • నేలఁ దగిన, యతఁడె? యనువారు పుండరీ • కాక్షములను
నెల్లయెడలను స్యందనం • బెల్లయెడల, నరయఁ బడె రాము లెందఱో • యనెడు వారు

సీ॥ అంగన లెల్ల ని • ట్లాడుచుఁ గూటువ, లైనిండఁ బౌరులు • మౌని వరులు
యువకులు రాముని • యొప్పుఁ గాంచుచుఁ బ్రేమ, కెల్లనుగానక హృదయమందు
నీలోక మిఁక సుఖి • యించు ననెడి వారు, జన్మముల్ క్రమముగా • జరుగు ననెడి
వారు మా యాయువుఁ • బడసి చిరాయువు, గలిగి వెలయు మంచుఁ • బలుకువారు

తే॥ ఇంద్రియము లైదిటిని గృశి • యింపఁ జేసి, పొందిన తపః ఫలంబు ని • న్నొందుఁ గాక
యనెడు వారు మాపుణ్య ఫ • లాతిశయము, నీకె లభియించుఁ గాకని • నిలుచువారు

సీ॥ కరుణ యేపారిన • కన్నులఁ బోలంగ, నబ్జంబు లేమి పు • ణ్యం బొనర్చె
మేని రంగును పోల • మేఘము ల్మన్నెట్టి, నోము నోచెనొయంచు • నుడువువారు
బహు తపంబులు సేసి • భాగ్య దేవతఁ బోలు, రామునిచ్చిన దశ • రథుఁ నకంపయ
నీడుగాఁ బ్రత్యుప • కృతియేది చేయంగ, ననువగునని ప్రేమ • ననెడు వారు

తే॥ రాము ననుకంప వారణ • రాజుఁగాచు, హరికరుణఁ బోలు నంచుఁ బ • ల్కాడువారు
ప్రత్యతీతు నుత్తము మేని • సొబగుఁ గాంచి, కారణములేక ముద్వారిఁ • గార్చు వారు

సీ॥ నీల మేఘశ్యాము • నిందు బుద్ధియు శీల, మొరుల కెవ్వరి కేని • యరయఁ గలదె?
ఘన తపంబులు పెద్ద • కాల మొనర్చియు, గణుతింప రానట్టి • ప్రణవమూర్తి

యమరులలో నొక్కఁ • డెగునెయట్లని యంత, వఱకుఁ జెడితి మని • పలుకువారు
జలధిఁ ద్రవ్విన సాగ • రులకు స్వర్గంగను, నేలకుఁ దెచ్చిన • నిపుణులకును

తే॥ సురల కొఱకు దైత్యులఁ ద్రుంచు • శూరులకును, పేరుగల వన్నెతోడి వి • స్తారకీర్తి
నిశ్చలం బౌట యీతని • నెఱి భుజములు, కూర్చు కీర్తిచే ననుచు వా • క్రుచ్చువారు.

సీ॥ ఇదె చందనపుగంద • మిదె చెందిరం బియ్య, దియె మంచి యాణిము • ముత్తెముల రాశి
ఇయ్యవె మణిభూష • లియ్యవె మదకరు, లియ్యవె హరులివ్వి • హేమ సమితి
ద్రవ్యంబు లేని పే • దల కొసంగుమ యని, చేతి కందిక గాఁగఁ • జేర్చువారు
తన దూడ దుముకు చు • త్సాహంబుతో రాఁగఁ, గూర్మిఁ గరఁగి కాంచు • గోవుకరణి

తే॥ మెఱపుఁ బోలిన తేరిపై • మెఱసి వచ్చు, రాము మనసారఁగని శరీ • రంబు కరఁగి
మనసు నీరుగాఁ బ్రవహింప • మచ్చిక మెయి, చిత్రరూపంబు కైవడిఁ • జెలఁగువారు

ఉ॥ ఛత్రము చల్వనీడ నిడ • సైన్యము తో బహు శస్త్ర సంతతుల్
చిత్రముగా వెలుంగ నెదఁ • జిందెడు నెమ్మిని దాత్రి మేల్మికిం
బాత్రము గాఁగ నేలు నర • పాలురు రాఘవుఁగాంచి యర్మిలిన్
బుత్రులఁగాంచు టింక సరి • పోలదు పో యని నిల్చు వారలున్,

తే॥ కారుమొగులు సౌదామినిఁ • జేరు నట్లు, రాముఁడీ త్రోవ వడివడి • రథము మీఁద
నేగునేమొ యీ వీథిని • హేమ రత్న, సమితి బ్రోగు పోయుఁడి యని • చల్లువారు.

చ॥ పెరుఁగఁడు తల్లి చేతులను • పెద్దగ రాముఁడు కైక చేతులం
బెరిఁగెఁ దపః ఫలాధికతఁ • బెంచిన యయ్యమ మోద మంది యీ
ధరణి నొసంగ నెంచినది • తానుగ నాతని కామె సంతసం
బిరవుగఁ జెప్ప శక్యమగు • నే యని లోన నుతించు వారలున్.

సీ॥ పాప సందోహము • ల్బహుజన్మ దుఃఖముల్, మొదలంటఁ దెగునని • మురియువారు
భూమండలము నేఁడు • రామునకే కాద, యెల్లర కొనని • యెలయు వారు
భువనకంటకులైన • దివిజవిరోధులఁ, బరిమార్చు నితఁడని • పలుకు వారు
రాము నాజ్ఞలఁ దీర్చు • రాజు లేతపమొన, రించిరో యని సంత • సించు వారు

తే॥ పలు విధంబుల నీలీలఁ • బలుకుచుండ• జవన తురగ ప్రకీర్ణక • స్యందనమున
సౌధపాళులు విలసిల్లు • వీథిఁగడచి, రాచ నగరు ప్రవేశించె • రామవిభుఁడు.

తే॥ మందయానలు చేరి చా • మరలు వీవఁ• గ్రొత్త యానంద మంది ర • ఘు ప్రవీరుఁ
డతిశయ ప్రేమ నచ్చట • నరసి తండ్రి, గద్దెపైఁ గొలు వుండుట • గాన లేమి.

చ॥ శ్రుతులు సమస్తశాస్త్రములు • చొప్పడ నారసి తేఱు యోగి హృ
ద్గత మయి పూచు *రూపములఁ • గాంచిన రాముఁడు మౌనులు న్మహీ
పతులును మోదమందఁ బొల • పం బయి నిత్యయశో విశేష సం
గత మగు కూటముం గడచి • కైక గృహంబును చొచ్చె నెమ్మిమై.

చ॥ అటు చనుచుండు రాముఁగని • యందఱు నీతఁడు యుక్తకార్యమే
పటుతర రీతిఁ జేసెఁ దగు • పద్ధతితోఁ దన తండ్రి పాదముల్
నిటలము సోక మ్రొక్కి యవ • నీపతి యీయ దినేశు నుండి వి
స్ఫుట గతి వచ్చు సీసకము • పొందిక నొందఁ దలంచినాఁడహో.

చ॥ అనుచు వచించుచుండ సుగు • ణాలయుఁ డచ్చట సొమ్మసిల్లి తే
లని స్థితి నున్న తండ్రిఁ గన • రాఁ బృథివీ పతి దీని నోటితో
వినుచుటకుం దెగింపఁ డిది • విన్నెద నేనని, కన్న తల్లిగా
మనమున నెంచు రాముఁ గనె • మారణ దేవతఁ బోలు కైకయున్.

తే॥ జేపి పిడఁదల్లి జేరిన • క్రేపుఁ బోలు, రాముఁ డామె పాదములకుఁ • బ్రణతి సేసి
మ్రొక్కి చేఁబ్రావాళాస్యంబు • నొనర మూసి, యొక్కచే వల్వసవరించు • చొదిఁగినిలిచె

చ॥ యముఁడను పేరులేక యమ • యాతన గూర్చెడు లోహ మానసం
బమరిన కైక యట్లు విన • యంబున నిల్చిన పుత్త్రుఁగాంచి యు
త్తమ గుణరత్నమా! సువిశ • దంబుగ నీ జనకుండు నీకు ని
క్కముగ వచింపఁ గోరినది • కద్దది కోరెద నేని తెల్పెదన్.

చ॥ అనవుడు రాముఁ డామెఁ గని • యమ్మరొ! తండ్రి విధింపఁ దల్లి నీ
పనిగల దొండు గల్గినఁ గృ • తార్థుఁడనైతిఁ దపంబు పండె నా
జననము ధన్యమయ్యెఁ గెల • సంబు పవిత్రతఁ గాంచె నింత కం
టెను మఱి గల్గునే పలుకుఁ • డీ తలమోచి యొనర్తు నేననన్.

చ॥ భరతుఁడు రాజ్యమేలఁగ ద • పస్వి వలెన్ జడలూని వల్కలాం
బరములు పూని పాలనము • మాని భయంకర కాననంబులన్
బొరిఁ బదునాలుగేండ్లు చనఁ • బుచ్చి పదంపడి రమ్ము నేఁడె యీ
పురమును వీడి పొమ్మనుచు • భూపతి యాజ్ఞ యొసంగె నావుడున్.

చ॥ వినుతి యొనర్ప నాలుకకు • వీలుపొసంగని మేరలేని మే
ల్గొనముల ప్రోకయైన రఘు • కుంజరు చెన్నగు మోము నన్ను పో

---

*ఆ రూపము లైదు-పరత్వము, వ్యూహము, విభవము, అంతర్యామిత్వము, అర్చావతారము. త్వము = వైకుంఠ వాసుఁడై యుండుట. వ్యూహము = పాలకడలిని శేషశయనముపై యోగనిద్ర. వము = శ్రీరామాద్యవతారములు. అంతర్యామిత్వము = భక్తహృదయకమలమందుండుట అర్చావము = దేవాలయములందు వేంచేపియుండుట.

గన వెడఁగుల్ ఏచింప మొద • లే యను వొందదు, మున్ను కంజమున్
జెనయు మొగంబు పూర్తి విక • సించిన పద్మము గెల్చె నయ్యెడన్

చ॥ అమల మనస్కుఁడైన ప్రభు • నాజ్ఞను మీఱఁగ యజ్ఞ లో
కమును భరించి కావఁగొను • కిష్టము యుగ్యము కాఁడిక్రింది కే
గు మెయిని సమ్మతించి యన • ఘుండొకఁ డవ్వలఁ గాఁడి విప్ప మో
దమునఁ దొలంగిపోయిన వి • ధంబున వీడెను రాముఁ డత్తటిన్

ఉ॥ అమ్మరో! తండ్రియేల? భవ • దాజ్ఞను నెనొనరింప నందునె?
తమ్ముఁడు పొందు భాగ్యమది • లభ్యము నాయది కాదె? యింత కం
టెమ్మఱి యేది నాకొనరు • రేవ? భవద్వచనమ్ము నాదు శీ
ర్షమ్మునఁ దాల్చితిన్ సెలవె? • చయ్యన పెళ్లెద నేఁడె కానకున్

## 4 సర్గ 5 పిమ్మట్టి పటలము 211

తే॥ జానకీజాని యీరీతి • చనవు తోడఁ బలికి తల్లి పాదములకుఁ • బ్రణతి సేసి
తండ్రి యున్న దిక్కునకు వం • దన మొనర్చి సరగ వెడలెను కౌసల్య • సదనమునఁ

చ॥ మొగుళులు గప్పియున్న నగ • ముంబలె నొప్పిన రాఘవుండు మే
లిగి గల బొమ్మిడీకమును • శీర్షమునం ధరియించి రాచ రీ
వి గలిగి వచ్చు నంచు మది • వేడ్క వహించిన తల్లియొద్దకున్
వగ విధి ముందు గాఁగఁ దన • ధర్మము వెన్కఁగ వచ్చె హొంచి మై

చ॥ బొమిడికఁ దాల్పలేదు బహు • పుణ్యజలంబుల చేత సార్ద్రి శీ
ర్షము గనరాదు చిత్రమని • శంక యొనర్చెడు తల్లికిం బ్రమో
దమున నమస్కరించు గుణ • ధాముని దీవన చేసి యామె ప
ట్టమునకు నడ్డపాటెదియు • డాయమిగా యని ప్రశ్నచేయ గన్

క॥ మాతా! నీప్రియ తనయుఁడు నాతమ్ముఁడు నిర్మలుండు • నయగుణచరితుం
డాతతమతి భరతుండీ భూతల మిఁకనేలు నను చుఁ • బుత్రుం డనుడున్

చ॥ నలువుర నిష్కలంక మగు • సర్మిలిఁ జూచుటయందు ఘపమ్మం
దెలియని కోసలేంద్రసుత • ధీపస కిట్లను రాజ నీతికిన్
వెలితి యొకండు గాక గుణ • విశ్రుతుఁడౌ భరతుండు నీకు నే
వలనునఁ దీసిపోఁడు భువి • భారము పూనఁగ నర్హుడే సుమీ

చ॥ మఱియొక టాలకింపుము కు • మారక! భూవిభు నాజ్ఞ యిప్పెడన్
నెఱ సెనొ లేదొ యంచు గమ • నింపక యొప్పుట నీకు ధర్మమౌఁ

బెరిమను నీదు తమ్మునకుఁ • బృథ్వి నొసంగి పొసంగి వానితోఁ
జిరతరి భోగ భాగ్యములఁ • జెందుచునుండుము దీర్ఘకాలమున్

చ॥ అనుటయుఁ బూతమానసము • నం దకలంక ముదంబు నొందు న
త్తనయుఁడు తల్లి కిట్లనుఁ • దండిరి సత్ప్రథితుండు నాకు ని
చ్చిన దొకయాజ్ఞ యున్నదటు • చెప్పెఁ నే బదునాలుగేఁడు కా
ననముల సంచరించి తద • నంతర మిచ్చటి కేగుదెంచెదన్

తే॥ అనుచు రాముఁడాడిన వార్త • యనెడి చిచ్చు చెవులఁబడియు బడకమున్నె • చింతచేఁగృ
శించె భ్రమియించెఁ గుందె శో • షిల్లెఁ బరితపించెఁ బలవించెఁ గౌసల్య • పృథివిఁగూలె

సీ॥ తనయ నీవీ భూమి • స్తంభము వలె నిల్చి కాతుగా కను మాట • కైతవంబొ?
అంత ర్విషమొ? నాదు • ప్రాణముల్ చలియించె బ్రదుకంగఁ జాల దు • ర్భరమటంచుఁ
జేతిని చేతితోఁ • జేరిచి నలఁచును వట కిసలయమున • వఱలు తనయు
నుదరంబుఁ గరమున • నూరక తడవుఁ బొగలు లేవ నూర్చు లోఁ • గలఁత నొందు

తే॥ చక్రవర్తి కరుణ చాల • సౌమ్య మయ్యె ననుచు నవ్వ నాయన యొప్ప • డడవి కేగు
దనుచు లేమ నేనును వత్తుఁ • జనుద మంచు మించి పలవించు రోదించు • మిగుల నొచ్చు

క॥ మరణాంత వేళ యాతన బెరసిన గతిఁ దల్లడిల్లు • విడిముడి జాఱన్
నిరుపేద వంచి మొగమును కరమునఁ గప్పికొని యేడ్చు • కరణిని వగచున్

ఉ॥ హాయను ధర్మమింకఁ గల • దా యను దైవమ యిట్టి పాటు లా
నే యను దప్పొకండు గల • దే యను నెక్కరణిన్ భరింప నౌ
నో యను పూర్వ కర్మఫల • మో యను నుత్తమ పుణ్యకర్మ శీ
లా! యను నక్కటా యను న • హా యను లోకము లేనిదే యనున్

శా॥ క్రేపుం బాసి తపించు ధేనువు క్రియన్ • గీడ్పాటు మైఁ జింత త
న్నేఁపన్ మూర్ఛిలి నేల వ్రాలు జననిన్ • హృద్యంబులున్ ధర్మ్యముల్
చే పట్టందగు వాక్య సంతతులచే • శ్రీరామ చంద్రుండు సం
తాపం బాడ్చి దిటంబుఁగొల్ప మదిఁ జిం • తంజేసి తానిట్లనున్

శా॥ తల్లీ! మేటి సతీమతల్లి వయి సా • ధారణ్య కాంతం బలెన్
జెల్లం బోలునె? చిత్తమందు తగవుం • జింతింపు మీయాజ్ఞ నే
నుల్లంఘింపఁగఁ బోలునమ్మ! విభు స • త్యోద్ధారుగాఁ జేయఁగా
నొల్లంబాటు వహింతువే? యిదియు నీ • యుల్లంబునం దోఁపదే?

శా॥ నాకంబెం గడు నుత్తముండు సుగుణా • నందుండు తమ్ముండు తా
నీకుం గాదిలి పట్టియౌ భరతుఁడీ • నేలం బ్రపాలింపఁగాఁ

గీ కారణ్యములన్ ఏచించి పితృ వాక్ • క్షేత్రంబుఁ బండించు నా
యీకార్యంబునకంటెఁ బుత్త్రునకు మే • లేదీ ప్రపంచంబునన్?

తే॥ మిన్ను మన్ను సముద్రముల్ • మిగులుపంచ భూతములు సమస్తంబును • పొలియుఁగాక
తండ్రియాజ్ఞను జవదాఁటఁ • దగునె తల్లి! దీనికై నీవు చింతింపఁ • దేఁకు వగునె?

తే॥ అనుడునామెయిట్లనుఁగుమా • రా! యదైన జనకునాజ్ఞదాటఁగఁ బల్కు • సాహసింప
నిన్ను విడిచి యీజీవముల్ • నిలుపఁజాల నన్నునీతోడఁగొనిపొమ్మ • న్యాయ్యమనిన

చ॥ తనయుఁడు రాజ్యము న్నడపఁ • దండ్రి తపం బొనరింప నేగుచో
వనముల కేగి భర్త నెడఁ • బాయక నోములు నోతుగాకిటన్
నను విడనాడి కుందు జన • నాథున కూఱటఁగూర్ప కిట్లు నా
వెనుబడి రాఁదలంపఁ దగ • వే? మది ధర్మపథంబు నెంచవే?

ఆ॥ ఎద కలంగ హేతు • వెయ్యది? సురలును మహిత తపము వలన • మహిమఁ గనిరి
వనులఁ దనయుఁడుండ • వలసిన దినములు పదియు నాలుగంచుఁ • బదిల పడుము

ఆ॥ మునుపు గాధి తనయు • కనికరమునఁగొన్న విద్య యవలఁ గల్గు • విభవమెల్ల
వీడె నేమి? వారు • విధియించుకార్యమ్ము లొనరఁజేతఁ మేల్మి • యొదవు కొఱకె

చ॥ మునులకు సేవ చేసి గురు • బోధము గైకొని కడు లేని వి
ద్యను గొని వారి దీవనల • నంతము లేని బలంబు నొంది పెం
పెనయఁగ దేవతాహితము • నిచ్చను చేయుచు వారి వీడుకోల్
గొని యిట కేగు దేరఁ బెను • కూరిమిఁ గాంతువు గాక తల్లిరో!

క॥ ధాత్రిం ద్రవ్విన సగరుని పుత్త్రులు తమ తండ్రియాజ్ఞ • పొసఁగించుటకై
గాత్రములు వీడు కతమునఁ బాత్రములై యొప్పె నుతికి • వారల కీర్తుల్

క॥ శివు గద ధరియించిన భా ర్గవు డు జనకు నాజ్ఞ దాఁట • కయ తన తల్లిన్
దివిరి తెగనేసె మనకున్ ధవు నాజ్ఞం దాఁటుటెన్నఁ • దగునే? తల్లీ!

క॥ అని యిట్లు పలు విధంబులఁ దనతల్లిని యూఱడించు • తనయుని పలుకుల్
విని యితఁడెట్లును రాజ్యం బును విడుమన యనుచు నిట్లు • మొగి నూహించెన్

తే॥ భరతునకె రాజ్యపాలన • పరఁగుఁ గాక రాష్ట్రమును వీడి దుర్గమా • రణ్యముఁకుఁ
దపము సేయ రాముని పోక • ఆడయొనర్ప నవని విభువేఁడియే తీర్తు • ననుచు వెడలె

తే॥ వెడలుచున్న కౌసల్యకు • వినతి చేసి తల్లినూరార్చి వసరెడు • తండ్రిఁ దేఁప్పఁ
దగినది సుమిత్రయేయని • తలఁచి యామె సౌధమునకు శ్రీరాము డు • సరగనడచె

తే॥ నడచి కౌసల్యకైకేయి • నగరు సొచ్చి, వివశతం బడి యున్నట్టి • విభుని గాంచి
దేహికిం బ్రాణములు బయ • ల్దేఱువేళఁ, దనువు కూలు నట్టులు తెల్వి • దప్పిపడియె

సీ॥ చాలసేపటి కొక్క • చందానఁ దెలివొంది, హానాథ! యనును పా • యంగఁ దగని
వారల నెడఁబాయఁ • గాఁజ మేమను, నిదినీతియే? యను • హితమె? యనును
సేవకు రాంద్రమా • స్థితి దలంపవె యనుఁ, బాడియే యిది మహీ • పాల! యనును
అనదల భాగదేయమ! యనుఁ గంటివే, యను మదియాశ్రయ • మా! నృపాల

తే॥ నాథ నాథా! యనును లోఁత • నయవిశాల!, కర్జమే యను లెమ్మనుఁ • గష్టమనును
అవని నాజీవితం బిఁక • వ్యర్థమనును, ఇట్టు లొఁటకుఁ గారణ • మెమొ యనును.

చ॥ ఇరులను పోవఁ దోలెడు ది • నేశునకున్ సమమైన యానతిన్
జరపుటచేత నెమ్మదిగ • సాగుచునున్న జగంబు కీడు పా
టొరసి లయంబు నొందు నటు • లుల్లమునం దలపోసితో యిటుల్
కరుణ లొలంగి యుండుటకుఁ • గారణమయ్యె జగచ్ఛరణ్యమా!

ఉ॥ వారిధి మేఖలా సుజన • భవ్యతపః ఫల సంభవా! మహా
వీర! దయాసముద్ర! నయ • విశ్రుత! వేద శిరోర్థ సన్నిభా!
శ్రీరమకున్ విశేషరసు • చేర్చునుదార! యెదల్ ద్రవింప నీ
తీరునఁ గుందుచున్న మము • దేర్పక యూరక యుంట పాడియే?

చ॥ నిలుకడ చెందు మించువలె • నీటగు దేహము దేహి లేఁ దనఁ
దలఁపగ రాని దుఃఖమునఁ • దద్దయు మున్గి నరేశ్వరుండు చే
ష్టలు విడి తెల్వి దప్పె నిది • చక్కటి నాఁ దివమిత్థమంచు నూ
హల కెఱుఁగంగరాదు తన • యా! నిభుదుస్థితిఁ జూడ రమ్మిఁకన్.

చ॥ ఇటు పలవించు రామ జన • యిత్రి కలధ్వని విన్న రాజులున్
జటిలు లమంగళంబు వినఁ • జాలము దీనికి హేతు వెద్దియో
తటుకునఁ గాంచి రండనుచుఁ • దత్తరతోడ వసిష్ఠుఁడేగి సం
కటపడి జేని దుస్థితిని • గాంచి సమాప్తి యెదంచుఁ జింతిలెన్

సీ॥ మనుజుల శీలంబు • మార్పడు విధములు, పరులకు నెఱుఁగ సు • కరముగాదు
నృప వరుఁడో పుర • జించి నాతఁడు కాఁడు, కాఁడన్న బ్రతికెడు • వాఁడుఁగాఁడు
కౌసల్యయో వగఁ • గ్రాఁగి క్రుంగుచు నుండె, నడిగినఁ జూడదు • నుడువఁబోదు
పతి వివశుండయి • పడియుండ నింపుక, యేని చింతింపద • యెడఁర పదిల

తే॥ మూనె నియ్యమ దెల్పునం • చూహసేసి, యెదుటఁగేలుమోడుపుఘటి • యించినిలుచు
కైకఁగని యిది యేమనఁ • గడచువృత్త, మెల్ల వివరించె నద్దేవి • పల్లటిలక

సీ॥ పలికిన కైకేయి • పలుకు చుండంగ వ, సిష్ఠుండు దశరథుఁ • జేయి సాఁచి
లేవంగనెత్తియో • భూవర నీ విట్టు, లజ్ఞాని కైవడి • నడల నగునె?

కైకేయి గుణ మీవు • కానని దొక్కా ? యా, యచయె రామునకు రా • జ్యంబొసంగు
నిది యెట్టి కార్యంబు • మది చింత వీడి లే లెమ్మంచుఁ దాళ వృం • తమ్మ తోడ

తే॥ విసరి పన్నీరు చల్లి దు • ర్విషముఁ బోలు వెలఁది వాక్యాల మించుక • వెనుక సడల
రామ రామ యటంచు నా • క్రందనంబు సేయు ధరణీశు ప్రాణముల్ • చెలఁగి కాంచె

సీ॥ కాంచి రాజేంద్ర' నీ • కటు దుఃఖమును మాను పురుషోత్తముండెయ్యె ఘాఁమిఁగాచు
దానికి విఘ్నముల్ • తనరారు నెమి ? స మంజస మందని • యట్టి పలుకు
లాడు కైకేయియే • యవని నొసంగును, నీల దేహుఁడె నేల • నేల కుండ
వనుల కేగెన యేని • మన మిట నుందుమే యను వసిష్ఠుని పల్కు • లాలకించి

తే॥ గురు వరేణ్య! యీస్థితి నేను • కూలు మున్నె పట్టముం గట్టి రాము డు • వనులకేగు
తలఁపు మాన్పి నావాక్యముల్ • దబ్బుగాక యుండరక్షింపవేయని • యొడయఁడనుడు

చ॥ మొనసిన పాప రూపమగు • మూర్ఖ మొగంబును గాంచి శ్రీరమన్
జెనసిన దానవమ్మ యిటఁ • జెప్పఁగ నెయ్యది గల్గు నీకు? నీ
తనయున కీ ధరాస్థలి ము • దంబున నిచ్చి భవ న్మనోహరుం
దనుపుమ ప్రాణమిచ్చి విశ • దంబగు కీర్తి భరింపు మీవిధిన్

చ॥ పొలుపగు ద్వంద్వ కర్మముల • మూఁడము ముట్ట నడంచి యున్నతుం
డలఘుఁడు నైన వంశ గురుఁ డవ్విధిఁ బల్కుచునుండఁ గైక భూ
తలపతి సత్య వాక్యమును • తప్పిన నేనుసుఖుల్ దొలంతు నా
పలుకులు నేడె నిక్క పఱు • పం గఁ నంబునే యేద్చె వెక్కుచున్

చ॥ పతి గతియించు నంచు జన • వారము సమ్మతి సేయ దంచు నిం
దిత మగునంచుఁ బాపమును • దెప్పరముం గలదంచు డెంద మం
దతివ తలంపదున్ జల మొ • కంతయు వీడదు నే వచింపఁగా
హిత మెది గల్గు నంచు మది • నెంచి వసిష్ఠుఁడు పాడి గాదనెన్

మ॥ తగు మోమోటమి లేక కుంది పతి యం • తంబొందు నంచెంచకే
లగులుం గానక పుంటిలోఁ జొనుపు దు • ర్దాహాగ్నియో? నంజొ? నాఁ
దగి వాత్రుమ్పుచు నున్న నీవు చెలివో? దావాగ్నివో! భూత మో?
మగ డింకేటికి నీకు? రట్టొ? పలదో? • మన్నించు నిన్నిందుపై

చ॥ నరపతి నోటితో సుతు వ • నంబుల కంపఁగఁ బల్కు మున్నె ని
బ్బరమునఁ బల్కితీవ రఘు • వర్యుఁడొ దుర్గమ కాననంబులన్
దిరుగుటొ పొందుటో విడఁడు • దీపిత కీర్త్యసువుల్ దహించు నో
శరనిధి బాడబంబ! మఱి • సాటి యెసంగరు నీకు భూస్థలిన్

తే॥ నిష్కలంకుఁడమ్మనియిట్లు నియతినుడువ, నృపుఁడువినినాల్కవిసమున్న • నెలఁతఁగాంచి
పాపినీ! వనములకు నా • ప్రాణములను, నీవపంపితివే? యతఁ • దేగినాఁడె?

శా॥ నీ యుద్దేశము బాగుగా నెఱిఁగితిన్ • నీజిహ్వికా దుర్విషం
బే యెంతో కుడిపించి త్రిప్పుదసువుల్ • హేలం గొనం జూతుకై
కేయీ! శాకినీ! నిన్ను వహ్నియెదుటం • గేల్వట్టఁగా లేదు నా
యాయుర్వ్రాతముఁదీయ మృత్యువునె యి • ల్లాలంచుఁ జేపట్టితిన్

సీ॥ కొడుకు గాకొక దృష్టి • పదయని నాకన్నుఁ, బొడిచెదవేల యో • పొలసు దిండి!
అతఁడు గాకొక ప్రాణ • మరయంగలేని నన్, జంపంగ నెంచితే • ఱంపెలాడి!
సుతుఁడు గాకొక నాల్క • హితపద కుండునా, జిహ్వను కాల్చెదే • చిచ్చు పిడుగ!
వంశాంకురంబును • వనులలోఁ గ్రాఁగింప, నెంచితే రవివంశ • మృత్యుమూర్తి!

తే॥ హృద్విదారిణీ! సిగ్గిఁడి! • హెచ్చు లేల ?, నీమెడం గట్టు సూత్రంబు • నీసుతునకు
భరతునకుఁ బట్టముం గట్టు • పట్టునందు, ననవు గాఁగ రక్షబంధ • మగునుగాక.

చ॥ ముని కుల చంద్ర! యాచెడుగు • భూతము నాసతిగాదు నేఁడె దీ
నిని మనసార వీడితిని • నిక్క మయోధ్యకు భర్త దీని కిం
దనయుఁడు నాకు కుమారకుఁడె • తక్కఁగుమారుకుఁడౌనె యాతఁడో
జను మఱి యౌర్ధ్వదైహికము • సల్పఁగ నర్హుఁడు కాఁడు సుమ్మిఁకన్.

చ॥ అని మఱి కోసలేంద్ర తన • యం గని ప్రాణపదంబు నన్నిటన్
గనని విధాన నిన్నునటఁ • గానకయే వనవాటి కేగెనే?
యని పలవింప నయ్యమయు • నచ్చటనైన విధం బెఱింగి వ
చ్చిన తలఁపున్ మనంబుననె • చెచ్చెర వీడుచు వ్రాలె నేలపై.

మ॥ ఇది కైకేయి కుచేష్టితం బనియు భూ • మీశుండు కైకేయికిన్
ముద మందన్ వరమిచ్చి తత్ఫలముగా • మూర్ఛిల్లి సంతాపమున్
మదిఁ గొన్నాఁడని లోన నూరడిలి రా • మా! తండ్రి వాక్యంబు నె
ల్లిదముం జేయక కాన కేగుమని ప • ల్కెన్ లేచి కౌసల్య తాన్.

సీ॥ పతి పలవింపంగఁ • బలవించు నందింప, నందించు నద్దేవి • నాధుఁగాంచి
యో మహనీయ? యి • ట్లుడుకంగ నేల? స, త్యంబునయందు సు • స్థైర్యమతివి
అకలంకమైన నీ • యౌదార్యమున కిప్పు, డించుక కలఁకఁ గ • ల్పించెదేని
సుస్థిరగుణి యగు • సుతునెడఁ గల్గు వ్యా, మోహంబుచే వగఁ • బొగిలెదేని

తే॥ జగము వార లీపద్ధతి • సమ్మతింప, రట్లుగావునఁ బుత్రుపై • నడరుప్రేమ
నడఁచి యడవుల కాసుతు • నంపి సత్య, వాక్యుఁడవు గమ్మయశముఁగా • పాడుకొనుము.

ఉ॥ నందనుఁ దేగకుండఁ డిఁక • నాథుఁడొ జీవము నిల్పఁడంచుఁ దా
దెందమునందు కుంది వగ • డిందును భర్తృ యశంబుకై దపిం
చుం దనయుం గృపాళుతను • చూడుమ యంచును వేఁడఁబోవఁ దా
చందనగంధి యెట్టి చెడు • సంకటపాటునఁ జిక్కె దైవమా!

చ॥ సతి యటులాడు వార్తవిని • సత్యయశస్కుఁడు భూమిభర్త నా
సుతుఁడిఁక మేదినిం గొనఁడు • సూటిగ సింహ మదేభ భల్ల సం
తతులు చరించు కానలకె • దప్పక యేగున యంచెఱింగి సం
తత పరితాప మంది వసు • ధం బడె రాఘవ! యంచు సోలుచున్.

మ॥ తనయా! కన్నులు నీరుగాఁగ నసువుల్ • స్థానంబులం దప్పఁ జా
వనె యున్నాఁడను విప్రులగ్ని యెదుటన్ • భవ్యాభిషేకంబు నీ
కొనరింపం గొని యుంచు తోయముల నా • కూర్ధ్వక్రియ ల్సల్పి కా
ననముం జేరు మనంతరంబు నను గా • నం జాల వా మీఁదటన్.

ఉ॥ రాజులఁ బెక్కుమారులు ప • రశ్వధముం గొని సంహరించు వి
భ్రాజిత సత్త్వశాలియగు • భార్గవరాముని వింటి చేత ను
త్తేజ మడఁచు ధీర! కుల • దీపక! సంతతి వారికెల్లఁ బే
రోజను వచ్చు శీర్షకము • నుంచెద నంచని యిచ్చితిన్ జటల్,

ఉ॥ నీల వలాహ కాభ శుభ • నిర్మలదేహ! మనోవచః క్రియా
శీల! కృపాల వాల! శశి • శేఖర చాప విభంజనా! సుధీ
శాలి హృదబ్జరంజనకృ • శత్వము నొందెదు నొంటి వృద్ధుని
ట్లీల పరిత్యజించి తిఁక • నేనును నిల్వఁగ నోప భూమిపై,

సీ॥ అపరంజి కపరంజి • ఖ్యాతికివిఖ్యాతి, నీగుణంబులును నీ • నియత చరిత
సత్యంబులకు నిత్య • సత్యరూపంబు! నా, కంటెను ముందీవు • కాన కేగ
నేఁ బసివాఁడనే? • నీకంటె ముందుగా, దేవలోకముఁ జేరఁ • దివురువాఁడఁ
బ్రేమచేఁ గరఁగెడు • పెనుపారు హృదయంబు, ప్రేమచేఁబ్రాణము • ల్విడుచు నొదలు

తే॥ విడసి యున్ననే నీవంటి • వాడఁగాను, పరమ పావని సీతఁ జే • పట్టివచ్చు
నిన్నుగాంచిన యీకంట • నీవువనులఁ, జేర వీక్షింపజాల వీ • క్షింపజాల.

సీ॥ జగము నీ విరహంబు • సహియించు నేనియు. దేవతావళియుఁ జిం • తింప దేని
నాతండ్రి! నాయన్న! • నా జీవితంపు స, ర్వ స్వమా! నిను గన్న • వాఁడ నైన
యే నెఱుంగుదు నీ మ • హిమ నాస్థితిం గూర్చి. యేమని వచియింతు • నిహము నొల్ల
నాల్గు వారిధులకు • నడిమి భూతలమును, తఱుఁగక యెలరారు • ద్రవ్యసమితి

తే॥ రథగజాదికములు రత్న • రాజి తోడఁ, గీర్తికాముఁడ వగుచుఁ గై • కేయి కొసఁగు
నీ యుదారత యే నిట్ట • నిలువుగాఁగ, నాదు ప్రాణంబులం దీసె • నయ గుణాఢ్య!

చ॥ నర సుర నాగ యక్ష కుల • నాథుల యందును నిన్ను వోలు శ్రీ
వరగుణశాలి విశ్రుతుఁ డొ • కండు గలాఁడొకొ? ముద్దుకూన! యా
పరశువు చేతఁ బట్టు బల • వంతుఁడు గర్వముచే నెదుర్ప నా
నిక్కరువుఁడ నిల్చి మార్కొను మ • గందు జగంబునఁ గల్గ నేర్చునే?

చ॥ అడవుల కీవుపోవ విని • ప్రాణము తోదుత నుండినంగదా
పుడమి జనంబు లెల్ల నను • ప్రువ్వఁగఁ దిట్టెడువార లిట్లు నీ
వడవుల నుండఁగాఁ గొడిమె • లాఁడి గృహంబునఁ దీపి దేహ మే
నెడపక యుంటినేని బ్రదు • కెల్లిదమౌఁ గద? సద్గుణాకరా!

చ॥ స్థిర తప మాచరించి భవ • దీయ బలిష్ఠ విశాల వక్షమున్
మురువుగఁ గౌఁగిలించికొనఁ • బూనిన లక్ష్మియు భూమి దేవియున్
ధర మనఁజాల రంతియ క • దా? మఱి యేనును నిన్నుపాసి యు
ర్వ్వరఁ దగ నుండుచోఁ గయిక • వంటి దురాత్ముఁడనే నిజంబుగన్.

ఉ॥ కొంతులు గుల్కు భూషలు జ • గా మకుటంబు పసిండి గద్దె ము
క్త్రాంతరితాతపత్త్ర ముర • మందున లక్ష్మి వెలుంగఁ జూతఁగాఁ
జింతిలుచుండు నే ముదుక • చీర మృగాజినమున్ ధరించు టా
వంతయుఁ జూచు మున్నె మృతి • నందుట యెన్న సుకర్మమే కదా?

ఉ॥ పుత్ర విమోహ మిట్లు మదిఁ • బొంగఁగ జాలు కరంగనేడ్చు రా
జేంద్రుఁడు ప్రాణముల్త్తరల • నీఁగు స్థితిన్ గృశతన్ భజింప లో
కత్రయ పూజ్యుఁడైన ముని • కొంతుఁడు భూపతిఁగాంచి రాముఁడీ
ధాత్రిని వీడకే నిలిపె • దన్ ధృతిఁ బూనుమ యోర్చుమా యనన్

ఉ॥ పావనుఁడైన మౌని యిటు • వల్కఁగ వేదన నొందుచున్న పృ
థ్వీవరుఁ డీమహాత్మకుఁడు • వెళ్ళి వచించిన రామచంద్రుఁడుం
బోవక నిల్చునంచుఁ దల • పోసి యొకించుక తేఱి వెండి చిం
తావిల మానసుండగుచు • నందఱు హాయనఁగూలె ధారణిన్

చ॥ తలఁపున ప్రాణముల్ మఱచె • ధారణి నాథుఁ డటఱచు దెందముం
గలఁగఁగ రాముతల్లి, కొడు • కా! యిట రాజ్యముతోడ మమ్మిటుల్
దొలఁచితె? యంచు, నాథ! పెను • దుఃఖమున న్మము వీడి మీరలుం
దొలఁగుట ధర్మమా? యనుచుఁ • దూలుచు సోలుచుఁ గూలె వెక్కుచున్.

తే॥ మనసు నిలుపక, మీరిట్లు • మలఁగుచుండ, లోకమెల్లను పెను చింత • లో మునుంగు
వచ్చినను ముని తోడి రా • వచ్చుఁ గొడుకు, తెరలకుండని పతిసేద • దేర్పఁ బూని,

తే॥ పతి మొగంబును మేనిని • పాద యుగము, తన మృదుల హస్తయుగళానఁ • దడవుచుండఁ
దెలివి దప్పిన నరపతి • తేఱి మెల్ల, వచ్చునే వచ్చునే యని • వార కనియె.

ఉ॥ కుటిల మనస్కయైక తన • కుబ్జ కుబోధముచే వరంబులన్
దటుకున నాదు ప్రాణములఁ • దప్పక తీయఁగ లోన నిశ్చయిం
చుటయును గాక యామె ప్రియ • సూనుఁడు భూతల మెల్ల నేలఁగ
ల్గుటయును గాక రాము వని • లోఁ జొరఁ బొమ్మని చెప్పెఁగా! కటా!

## దశరథుఁడు కౌసల్యకుఁ దనపూర్వ శాపముం దెల్పుట.

మ॥ వనితా! రాముఁడు కాన కేగుటలు ద • ప్పం బోఁడు నా ప్రాణముల్
మును మున్నేచను చెంతయు న్నిజము నేఁ • బూర్వంబు నందొక్క ప
న్ముని శాపంబును బొందినాఁడ నది యం • భోజాక్షి! చూడంగ నేఁ
డను భావ్యంబగు నట్టులుండె వినుమా • యాద్యంత మాగాథయున్.

మ॥ మృగయా కౌతుక మొక్కనాఁడు మదిలో • మేంద్రింప సైన్యంబుతోఁ
దగురీతిన్ వన భూములం దిరిగి భూ • దార ద్విప శ్రేణులన్
మృగ రాజాదులఁ గూల్చుచుం గడచుచుం • దృప్తిం గనం బోక యా
పగ తీరంబునఁ బొంచి యుంటి విధి నన్ • బాధింపఁ బెన్జీఁకటిన్.

మ॥ ఒక జాత్యంధుఁడు భార్యతోడ సుతుఁడే • యొప్పారు పెన్మూఁతగా
నికటంబందు తపంబు సేయు నెడలన్ • నీరంబు గొంపోవ దా
రకుఁడా యేటికి వచ్చి కుండికను నీ • రం బందు ముంపంగ నే
నిక రావంబని యేయఁగా శరము వా • నిం గూల్చెఁ దీరంబునన్.

మ॥ ఉదకం బాను మదేభ శబ్దమని యే • నూహించి యాత్రోవనే
ప్రదరం బేసితి శబ్దవేధిఁగొని త • ర్వాతం బ్రలాపింప న
య్యది మానుష్య రవంబ యం చులికి య • త్యావేగమున్ దుఃఖమున్
గదురం బాఱితి విప్ర బాలు కడకున్ • గాఢాంధకారంబునన్.

ఉ॥ కుండికతోఁ గరంబు తెగి • కూల ధరం బడి పొర్లుచున్న యా
కొండికఁ గాంచి లోకములె • కూలిన యట్లు దలంచి చేతి కో
దండము జాఱ మై వివశ • తన్మహిఁ గూలి తపించి కుబ్బ! యె
వ్వండవు తెల్పుమా యన న • బద్ధ మెఱుంగని యాతఁ డిట్లనెన్.

తే॥ మత్స్యమూర్తి యౌ శ్రీరమా • మహిళ భర్త, నాభిఁ బుట్టిన పరమేష్ఠి • నాల్గువేద
ములను పల్కిన నాలు జా • తులను మొదటి, జాతిలో మమ్ము పుట్టించె • జగతియందు

తే॥ అజుని పుత్త్రుండు కశ్యపుఁ • డతని సూనుఁ, డవని వృత్తిశుఁ డనఁ జను • నతనికొడుకు
వైదికుఁడు జలధోటి నాఁ • బరఁగు మౌని, యతని పట్టి సురోచనుఁ • డనెదు వాఁడ.

మత్త॥ దల్లిదండ్రులు పుట్టు గ్రుడ్డులు • త్రావ నీరముఁ దెమ్మనన్
వల్లె యంచిటు వచ్చి యిచ్చట • బాణ విద్ధుఁడనైతి నా
తొల్లి కర్మఫలాన దీనికి • దుఃఖ మందకు మేనుఁగం
చుల్లమందు దలంచి యేసితి • వొంద దియ్యెడ దోసమున్.

మత్త॥ దప్పిచేఁ దపియించు నా తలి • దండ్రు లాన జలంబులన్
గొప్ప బుద్ధి నొసంగి యవ్వలఁ • గూర్మిపట్టి గతించుటల్
చెప్పి స్వర్గముఁ జేర నంజలి • చేసె నంచు వచింపు మా
యప్ప! యంచు దివంబు చేరె సు • రాళి వేడ్క నెదుర్కొనన్.

చ॥ తనయుని రాకకై యెదలఁ • దత్తఱ మందెదు వారి చోటి కా
తనయుని తోడ నీరుఁగొని • దాయఁగ వారు కుమార! యింత సే
పెనయమికిన్ విచారపడి • యెయ్యదొ ముప్పెనఁ గూడెనంచు మా
మనము తపించుచుండె నిఁక • మమ్ము కవుంగిలి సేయ రమ్మనన్.

చ॥ మునిజనవంద్య! కోసల వి • భుండను వేఁటకు వచ్చి సామజం
బును పడి నేయ వ్రేటు గొని • పోయిన దానికిఁ బొంచి యేటి గ
ట్టున మొగి నుండి యీతఁడు బు • డుంగునఁ గుండిక ముంచు చప్పుడున్
విని కరియంచు నేసితిని • వీక్షణ సేయను దొడ్డ చీఁకటిన్.

చ॥ శరి మొగిఁ దాఁకఁ గూయిడిన • శబ్దముచేఁ గరి కాదటంచు నేఁ
బరుగిడి కాంచి నీవెవరి • బాలుఁడ వన్న నతండు సర్వమున్
దెఱఁగు పడంగఁ జెప్పి వెస • దివ్యపదంబున కేగెనంత నే
నురవడి బాలకుం జలము • నొయ్యనఁ దెచ్చితిఁ దాపసోత్తమా!.

చ॥ కొడుకును చంపు క్రూరుఁడని • కోపము సేయక చూడుఁడీ కృపన్
బుర బురమన్న శబ్దమున • బుద్ధి కలంగి యొనర్చి నాఁడ మీ
కొడుకు బలెన్ సమస్తమును • కూర్చెద సేవ యొనర్చెదన్ సదా
విడువక యుండెదన్ వనట • వీడుఁడి యంచు వచించు నంతటన్.

సీ॥ పడిరి మూర్ఛిల్లిరి • పనవిరి పొరలిరి, వగచిరి తపియించి • వనరినారు
పల్లటిల్లిరి తల్ల • డిల్లిరి కుమిలిరి, కుందిరి కృశియించి • కూలినారు
నేఁడె మా కన్నులు • నీఁగిరి మనిరి మా, మనసుఁ బగిల్చితే • యనిరి నీవు
స్వర్గమందుండ ని • చ్చట మేము వసియింప, మిదె వత్తు మీమీఁద • బ్రదుకమనిరి

తే॥ కంటి పాపను పోలు మా • కందుఁగోలు, పోయి యైహిక సుఖములఁ • బొందుచుంటి
మేని లోకు లాఱడి వెట్ట • రే కుమార! నిన్ననుసరింతు మని వెండి • నన్నుఁగాంచి

తే॥ అభయమంటివి క్షమియింపు • మంటిగానఁ, బొమ్మనకె నిన్ను పాసిన • పుత్త్రకొఱకు
నేడ్చి మావలె సురపురి • కేగుదనుచుఁ, జెప్పి వారలు త్రిదివంబుఁ • జేరినారు.

ఉ॥ నెవ్వగ యించు కే మది గ • ణింపక పుత్త్రులు లేని నాకు వీ
రి వ్వర మిచ్చి రంచు ముద • మేర్తె్తఱ నొంది పురంబు చేరితిన్
గ్రొవ్విరిఁబోఁణి! యా పలుకు • గూడెను రాముఁ దరణ్య మేగుటల్
నెవ్వడి నేను కుంది మర • ణించుట యెట్టులుఁ దప్ప దిత్తఱిన్.

తే॥ భూమి పతి యిట్లు పల్కఁ స • తీ మతల్లి, రాము తల్లి వినుచు నేల • వ్రాలెఁ గలఁగి
అల వసిష్ఠుఁడు విధి బలీ • యం బటంచు, నెడ తెగని దుఃఖములఁ గని • యెద తపింప

తే॥ భువన విశ్రుత కీర్తియౌ • భూప మేడ, ముందు మంగళ వాద్యముల్ • బోరు కొనఁగ
రాము నభిషేకముం జూడ • రాజ చయము, మూఁగి యున్న సభంజేరె • మునివరుండు

క॥ వచ్చిన ముని మొగముం గని, చెచ్చెరఁ బ్రత్యూహ మేమి • చేకుఱె దుఃఖం
బచ్చటఁ బుట్టం గారణ, మచ్చుపడం దెలుపుఁ డనుచు • నవనిపు లడుగన్:

ఉ॥ శంబరు తోడ భూవరుఁడు • సంగరముం బొనరించు నాఁడు నే
మంబునఁ గైక గైకొనియె • మానుగ రెండు వరాలు, మౌని వే
షంబున రాముఁ దుగ్ర వన • సంచరణం బొనరించు నట్టు లా
యంబసుతుండు రాజ్య భర • ణార్హుఁడు గా వరియించె నిత్తఱిన్.

తే॥ సత్యవాక్యుఁ డౌముని పల్కఁ • శ్రవణములను, చేరి చేరక మున్నె యా • శేష జనము
స్త్రీలు పురుషులు హా! యని • చెడితి మంచు, దశరథుం బోలె విలపించి • ధరణిఁ బడిరి.

చ॥ వ్రణమున నిప్పు చొన్పు క్రియ • వారని వేదన నొంది కుంది ధా
రణిఁబడి యెల్ల దేహములు • రంజన దక్కఁచుఁ బొర్లె నేత్రవాః
కణములు కాఱి కాల్వలయి • కంధిని పోలిన దట్టిచో నవా
రణమగు రోదన ధ్వని భ • రంబయి నాకము నంటెఁ జెల్లగన్.

సీ॥ సుడి గాలి వడి వీవ • సుడిసెడు సుమలతఁ, బోలిన కోమలుల్ • బేల లగుచు
వెలలేని భూషణ • వితతులు రాలంగ, మంగళ హారముల్ • త్రుంగి పడఁగ
కొప్పులు వీడంగఁ • గుచ కుట్మలములపై, వేఁడి బాష్పంబులు • వెల్లి గొనఁగ
వెక్కుచుఁ బురపురఁ • బొక్కుచు సురసుర, స్రుక్కుచు నేలపై • సోలినారు.

తే॥ అక్కటా! ఱేఁడు కరుణ లేఁ • డయ్యెనేమి?, ధర్మమిఁక వదలితి మని • తఁరి నృపులు
గాలిఁగూలిన తరువులఁ • బోలి పడిరి, కడుపు చేవెట్టి కలఁచిన • కరణి గాఁగ.

ఉ॥ భూరి వదాన్యుఁడైన రఘు • పుంగవుఁ డేగునె యంచు శారికా
కీరము లేడ్వసాగె నట • గీములలో వసియించుచుండు మా
రారము లేడ్చె రామ విభు • చందమెఱుంగని హానలేడ్చె సం
సారము లేడ్చె నేడ్చెనవి • సౌధము లార్యులఁ జెప్ప నేలొకో?

ఉ॥ బింబము వంటి నోట బలు • వెల్లని మొల్లలఁ బోలు పండ్లు గా
నంబరఁ జన్నుదోయి పయి • నాణెపు ముత్తెపు నాను త్రెవ్వి చిం
దం బడు చందమొప్పఁ గను • దమ్ముల నశ్రు కణంబు లుర్లగా
టంబుగఁ దొక్కి పల్కిల ప • దంతులు రోదన సేసి రయ్యెడన్.

ఉ॥ ఏడ్చెను తల్లిఁబోలెఁ బశు • బృందము క్రేపులు నేడ్చె వారణా
లేడ్చెను తేరులేడ్చె హరు • లేడ్చెను గూఁడుల నున్న పక్షి గుం
పేడ్చెను నాఁడు పూచు పువు • లేడ్చెను తేనియఁగార్చు నందనా
ళేడ్చెను వీధులేడ్చె మఱి • యేడ్వక యుండిన దెద్ది యప్పురిన్?

చ॥ బ్రదుకఁడు నాథుఁడంచు మది • భావన సేయక రాముఁగాన కం
గద గొని-పోవునట్లడగు • కైకయుఁ గ్రూర చరిత్రయైన యా
ముదుసలి కుబ్జ దక్క మఱి • ప్రోలున నేడ్వకయుండు వార లె
ప్పదురున వారు? నీరె యయి • పాఱఁ దొడంగిన వెల్ల దేహముల్.

తే॥ తోరములగు తేరులు పాఱు • ధూళిదుక్కి, యైన వీధు లశ్రు ప్రవా • హంబులయ్యె
వారలుచ్చావచంబుగ • వనరు చున్న, వారి యెదలు భిన్నంబులై • పరఁగ కుండె

సీ॥ భూదేవి చేసిన • పూర్వపాపపు రాశి, బలుదొడ్డదగునంచుఁ • బలుకువారు
శ్రీదేవి యొనరించు • చెడుగులంతకు మించి, పొడవైనవే యని • నుడువువారు
జగము వారల కనుల్ • సలిపిన పాపంబు, వనధి కంటెను గొప్ప • దనెడువారు
దుర్విధి మన యెదల్ • దొలిచి పుండుగఁ జేసె, గోడుగా ననుచు వా • క్రుచ్చువారు

తే॥ భరతుఁడిల యేలునే యని • వనరు వారు, మరలఁదో రాముఁడిఁక నని మ • ఱుఁగువా
పట్టమే మన యముఁడని • పనవువారు, విధి బలీయమనుచు నెంచి • వెగచువారు.

సీ॥ అతివ పై మోహాన • మతిచెడి వరముల, నిచ్చె రాజని లోన • నొచ్చువారు
ఇంత వినియుఁ జావ • కిల నున్న మనకంటెఁ, గఠిను లెవ్వారని • కలఁగు వారు
మనము రాముని తోడ • వనుల కేగుదము కా, దే నగ్గిఁజొత్తమం • చెన్నువారు
ధరణి హస్తంబులఁ • దడవుచు వెల్లియౌ, కన్నీటి తోడను • కలుపువారు

ధరణి హస్తంబులఁ • దడవుచు వెల్లియౌ, కన్నీటి తోడను • కలువువారి
తండ్రి మరణించునే యని • తలరువారు, కైకయే సాఁకె గదెయని • కసరువారు.

చ॥ కొడుకునకున్ మహీతలము • గోరెనరే రఘురాముఁ గానకుం
'గడపఁగ హేతువెయ్యదియుఁ • గానమ నిందను గొంట దక్క నా
గడుసరి వేఁ గావలయుఁ • గావుననే మదిఁ బ్రేమలేక యి
టొడికముతో వలన్విసరి • యుర్వర లాగె వరంబు సాకునన్.

చ॥ స్థిర తపమాచరించి మృతిఁ • జెందుటకో? జగమందు జీవులన్
దరమిడి చంపఁ జూచుటకొ? • ధారణి నాథుఁడు పూని యిచ్చె నీ
వరముల మేలు మేలు ధర • వారలె యేలఁగ నిమ్ము కాన కె
ల్లరమును పోవ మయ్యదక • లంక పురంబగుఁ గొన్నినాళ్లలో.

చ॥ అసదృశుఁడైన జేష్ఠ సుతు • నందఱ ముందరఁ బిల్చి రాజవై
వసుమతి నేలుమా యని స • భా స్థలిలో వచియించి కైకకై
వసమయి యామెపుత్త్రునకుఁ • బట్టము నిచ్చిన సత్యమెంతయున్
బొసఁగునె? యింత యేల? పతి • బుద్ధి విపర్యయ మయ్యెఁజెల్లరే!

తే॥ రామునకు నొసంగిన ధరా • రమణినొకరు, వలవఁగా రాదు సీత యీ • వసుధ వీడ
నామె తోడనె వెళ్లక • బూమెలాఁడి, తనయు నంగీకరించి ని • ల్చునొకొ లక్ష్మి?

॥ నేయి పోయక యెగసన • ద్రోయకుండ, గాలిచే నాడు దీపంబుఁ • బోలి స్త్రీలు
పుండరీకాక్షు నందంపు • మురువు చూపు, పొలయ కున్న నేగతియని • యలయుచుండ

## లక్ష్మణుని కోపము.

తే॥ ఔర! కైకేయి క్రౌర్య మ • త్యధికరింప, వసుధఁ గైకొనెఁ బతి నుండి • వర నిభమున
నన్న కడవుల నొసఁగె ని • ట్లగునె యనుచు. లక్ష్మణుఁడు లయ కాలాగ్ని • లలిని లేచె

చ॥ కడు బెడిదంపు టూరుపులు • గ్రాల నొడల్ చెమటన్ మునుంగఁగాఁ
గడ కనులన్ మిడుంగుఱులు • గ్రాయ బొమ ల్ముడివొందఁ జంద భా
నుఁడు నడలూన నొదదర • నూల్కొను కోపము తోడ లక్ష్మణుం
డదరె స్వకీయమైన తొలి • యాకృతి నప్పుడు గొన్నకై వడిన్

హరి కిశోరంబునకు నిడు • నామిషంబు, నొక్క ముక్కిడి కుక్కకు , నొసఁగఁగోరె
మెలఁత తెలి విద్ది మేల్మేలు • మెచ్చవచ్చు, ననుచుఁ గేల్దట్టి వికటాట్ట • హాసమొదవ

పఁణులు చెక్కిన కత్తి • మధ్యంబునన్ వ్రేలఁ, గరమునఁ బెను కార్ముక • కంబు గ్రాల
న్నములఁ గల పాము • పుట్టలఁ బోలిన, తూణీరములు వెన్కఁ , దూఁగి యాడ
ంగారు కవచముల్ • రంగారు భుజముల, నెఱవైన యురమును • మఱుఁగు పఱుప
దంబులందలి • పైఁడి యందుకములు, కడలి బిడియమందఁ • గా ధ్వనింప

తే॥ నారి టంకృతి లోక వి • నాశ కాల, మందు సప్త సముద్ర తో • యములఁ ద్రావి
బెడిదపుం బిడుగులతోడ • నదరు కాల, జడద రావముకంబె ము • మ్మడుఁగు మ్రోఁగ

సీ॥ అంతంబు లేని భూ • మ్యాకాశములు మొద, లగు భూతములు తమ • యనువు దప్పి
త్రెళ్లె నేమో యని • దిగు లూని తాను న, న్నయుఁ దక్క సర్వ జ • నంబు బెదర
నాయోధనమునకు • నాయితం బగు వారి, జగతి భారము నీ గఁ • జంపు వాఁడఁ
జంపి వారల దేహ • సమితి లోకము నిండ, గుట్టలుగాఁ గుప్ప • గూర్చు వాఁడఁ

ఆ॥ బ్రకటితముగ నేఁడె • మకుటాభిషేకంబు, చేయఁ బూని నాఁడ • జ్యేష్ఠుఁడైన
రామవిభున కడు • రాఁదలచిన వార, లున్న రండు వాంఛ • లుబ్బ గొనఁగ

చ॥ నర సుర యక్ష కింపురుష • నాగ నభశ్చర సిద్ధ సాధ్యులన్
హరి హర భర్మ గర్భ లోక • ులైనను మార్కొని పోరిరేనియున్
ధర నిఁక శ్రీ తలంపులకుఁ • దావు నొసంగ నటంచు రేఁగి మం
దరము సుధాబ్ధిఁ జొట్టిన వి • ధంబునఁ జొచ్చె నయోధ్య మధ్యమున్.

ఉ॥ పాపమునన్ విశేషవిధి • భాసిలుకైక యొనర్చు కీడుచేఁ
దాపము నొంది కుందు పిన • తల్లి సుమిత్ర గృహంబు చేరు సీ
తాపతి యాలకించెఁ దన • తమ్ముని కార్ముక మేఘ మండముల్
ప్రేపున బీఁట వాఱు గుణ • భీకర నిర్గత వజ్ర నాదమున్.

ఉ॥ మేటి విభూషణా వళులు • మిక్కిలి రాజిలఁ దారహారముల్
పాటిగ మించులీనఁ బెను • వాయువుచే నెసరేఁగు పావకున్
నీటుగ నార్చు నొక్కకటి • నీరదముం బలె రాఘవుండు శ్రీం
గాటక మందు చేరెఁ గడుఁ • గమ్మని పల్కుల సోన చిందఁగన్.

చ॥ మెఱపును బోలు కోపమున • మించిన బంగరు మేను మేఘముం
దఱచుగ మీఱు కేలుగల • తమ్ముని గాంచి యిదేమి నాయనా!
యొరయ వాకింత యల్క మును • పొక్కపు డిప్పుడు విల్లుపూని పే
రఱపున సంగరంబునకు • నాయితమైతి కతంబుఁ దెల్పుమా?

చ॥ నావుడు సత్యనాశము నొ • నర్చి భవత్పరిపాలనార్హమౌ
భూవిభుతం దొలంచిన స • ముద్ధత కాటుక కంటె నల్లనౌ
కావలురాలి మ్రోల నొగిఁ • గట్టెదఁ బట్టము నీకు నేఁడె వి
ఘ్న వలి సేయువారు సుర • లైనను కాల్చెద దూది నగ్నినాన్.

చ॥ ఘనమగు విల్లుచేఁ గలుగఁ • గా నృప లేమి సురాళులైన నొ
ప్పనిదని సాహసింప రటు • వచ్చిన మచ్చరదావవహ్ని కిం

ధనముగఁ జేసి నీకుఁ బదు • నాల్గు జగంబుల రాజలోకముం
గొనకాని కాముకార్యము న • కుంఠిత రీతిని కొమ్మొసంగెదన్

ఉ॥ తమ్ముఁడిటు ల్వచింప గుణ • ధాముఁడు రాముఁడు మెల్లనిట్లనున్
సమ్మతి నీతి మార్గమున • సాగుచు నుండును నీమనమ్మునేఁ
డమ్మెయి దప్పి కోపమున • కాకర మీయని నీయెడంద ధ
ర్మమ్మడుగంట మాడ్చెడు తె • ఱంగునఁ గిన్కయదెట్లు పుట్టెనో?

చ॥ లలిత మృదూక్తి నిట్టులన • లక్ష్మణుఁడుం జెఱు నవ్వు నవ్వి రా
ఘ్ఘతిలకుఁడు నీది రాజ్యమనఁ • దేఁకువ దానికి సమ్మతించి శ
త్రుల వలనన్ సమస్తమును • దోపిడి పోవఁగఁ గాన కేగుచో
వలవని కోపమింక మఱి • వచ్చుట యెప్పుడొ చెప్పుమా వెసన్

ఉ॥ నేఁ గను చుండఁగా నవని • నీకు నొసంగిన తండ్రి వెండి స్త్రీ
లోఁ గొన లేదు లేదనెడు • లోభిని బోలె భవద్విమాత నీ
పైఁ గడు నీసు పూని పెను • వంచనఁ గానకు నంపె నింకిటన్
వేఁగుచు నెట్టులుందు నర • పీనుఁగునై జగ మీసడింపఁగన్

ఉ॥ తమ్ముఁడు కోపముం గొను క • తమ్మటు దెల్పుచు నుండఁ గ్రేపుఁ బ్రే
మమ్మునఁ గాంచు ధేనువు క్ర • మమ్మునఁ గాంచుచు భూమిఁబుట్టు ప్రా
ణమ్ములఁ గొచు నాజ్ఞయు ఘ , నమ్మగు కార్ముక మూను పుష్టి హ
స్తమ్ములు మేటియోమను య • శమ్మును గల్గిన రాముఁడిట్లనున్

ఉ॥ చిచ్చును భాస్కరున్ మెదిపి • చేసిన కైవడి దోఁచి మించుఁ బై
పెచ్చుగ గెల్చు వాఁడుగల • వీరః నృపాలుఁడు కొమ్మనంగ ము—
వచ్చెడు కీడు గాన కొడఁ • బద్ధ నెపం బది నాది గాక యిం
దచ్చుగఁ దండ్రికిం గలదె • యాఁడిః యింత యెఱుంగ వేలొకో?

తే॥ నీరు వట్టి పోక నదికి • నిందకాదు తల్లి దండ్రుల కిది యట్లె • తప్పుగాదు
భరతు దోషమింతయులేదు • వత్సః దైవ కృతము దీనికై నీకింత • కినుక యేల?

ఉ॥ ఊఁదిన కొల్మి మంటవలె • నూర్చుచు మందెడు లక్ష్మణుం దనున్
భేదము గూర్చుకైక మతి • కిన్ మతిఁగూర్చి త్రిమూర్తు లేనియున్
భేదిలి దాఁటలేని విధి • పేర్మిని సైతము గెల్చు నాదు వి
ల్లాదటఁ జేయు కృత్యము ర • వంత యెఱింగెదు గాక రాఘవాః

ఉ॥ నావుడు రాముడిట్టులను • నాయనః నీతులు నేర్చు నోటితో
నీవిటులాడఁగాఁ దగునెః • యీ పని యార్యుల సమ్ముఖంబునన్

మేపడ నిల్వనేర్చునొకో? • మేదురబుద్ధిఁ దలంచి చూడుమా?
దావము పోలె మండి తలి • దండ్రుల నొంచుట యెట్టి కార్యమో?

ఉ॥ వారక రుద్రమూర్తి క్రియ • వర్ధిలు లక్ష్మణుఁ డంత నో మహో
దార! గురుండు నీవ మఱి • తల్లియుఁ దండ్రియు నీవ దైవమున్
ధీర గుణాఢ్య! నీవ తగు • తెన్నును నీవ యితః పరంబు నే
నేరనటంచు నెత్తెఁ గర • నీరజముల్ ముకుళించి భక్తిమై

ఉ॥ రాఘవుఁడంత నిట్లను వ • రంబులు గైకొను తల్లి రాజ్యమున్
దా ఘటియించు కొంట యది • ధర్మమయో జనయిత్రి పల్కులన్
మోఘము సెయకా భరత • పుత్త్రుఁడు గొంట సమంజసంబ నా
కీ ఘనవృత్తికంబెఁగన • నెయ్యది మేలగు నీవచెప్పుమా?

చ॥ కనఁగ నొకింత కందు మదిఁ • గానక సత్పథమంద యెప్పుడున్
జనఁ గల తోడు నీడ నను • జన్మని చంపి జగంబు సన్నుతిం
చిన సుహనీయుఁ దండ్రి నృప • శేఖరుఁ జట్టలు చీఱి యవ్వలఁ
జననిని చంపియే కినుక • శాంతి వహించునొ యేమొ? తమ్ముఁడా!

చ॥ అనువగు పల్కులన్ వలఁతి • యౌ తన యన్నను గాంచి తమ్ముఁ డి
ట్లనుఁ బగఱు న్నుతించు యశ • మందివ యేను వినిష్ఫలంబుగా
ఘన గిరులంబలెన్ భుజయు • గంబు ధరించి శరంబు విల్లు మో
చి నిబవఁ బుట్టితిన్; బెదవి • చేటెకదా భువిఁ బేద కోపమున్?

తే॥ ద్రవిడ సంస్కృత శరధి పా • రగుఁడు రాఘ వుండు పల్కును మురిపంబు • పొదలనేఁటి
దనుకఁ గాచు తండ్రిని మీఱఁ • దగదునాకు, నట్టె నామాట దాఁట నీ • కగునదేమి?

తే॥ వేదముల కడుపట్కని • విధిని లక్ష్మ. ణుండు జ్యేష్ఠున కడ్డంబు • నుడువ జంకి
కదలి చెలియలి కట్టను • గడవకుండు, రహి నడంగి యూఱటఁ గాంచె • రామునాజ్ఞ

తే॥ పూని తుది మొదల్ గనరాని • తానుశివుని, గౌఁగిలించిన కరణి ల • క్ష్మణుని చేర్చి
పిదప వాక్యజ్ఞ రాలగు • పిన్నతల్లి, గీము సొచ్చె రాముఁ దనుజా • కేలువట్టి.

చ॥ వనముల కేగ సిద్ధపడు • వారలు కన్నులఁ బోలు వారలున్
మునుకొని రాగఁ జూచి మది • పుండయి దుఃఖ మహాబ్ధి తీరమున్
గనక తపించు తల్లిపద • కంజములన్ శిరమూన మ్రొక్కి నొ
వ్వనియెడు శల్యమూడ్చి యెద • కాదట గొల్పఁగ రాముఁ డిట్లనున్.

చ॥ జనకుని సత్యవాక్యునిగఁ • జల్పుటకేఁ బదునాలుగేండ్లు కా
ననముల కేగి నెమ్మది న • నంతర మిచటి కేగుదెంచెద

వనములె కేగినన్ విపుల • వారిధిఁ జొచ్చిన స్వర్గమేగినన్
నను నొకఁ డేపఁగాఁ గలఁడె? • నాకు సమస్తమయోధ్యయే యగున్.

చ॥ ఒడలు చలింపఁ బ్రాణములు • నుల్లల నాద వివేకమున్ జెడన్
ముడుఁగకు మమ్మరో! యనుచు • ముచ్చిరు తల్లిని విప్పు నార్పు న
వ్వడువునఁ దేర్చుచుండ నట • వచ్చిరి తెచ్చిరి చెల్వ లెప్పుడుం
జెడని కళంకు నొంది వగఁ • జెందని కైక యొసంగు నారలన్.

శా॥ కాలాంభోదముఁ బోలు రాముఁ గనుచోఁ • గన్నీరు మున్నీరుగా
జాలవ్రాలుట కంచె మున్ను మనముల్ • స్తంభించి తాల్మాలులై
సోలంగాఁ బరదుఃఖముల్ గనియు న • స్త్రీల్ రాని కైకేయి మా
కేలం బంపిన నార చీర లివిగో • క్షేమంకరా! కొమ్మనన్.

ఉ॥ సుందరు లీయ లక్ష్మణుఁడు • చూచి వసుంధర కోడుగా నొన
ర్పం దలపోసి కైక పను • వం దగు; నన్నియుఁ గై కొనంగ లోఁ
గందక యున్నవాఁ డితఁడు; • కార్ముక మూనియు వట్టి పంచనై
పొందుగ వాని నెల్లఁ గనఁ • బుట్టిన యేమను చూతు; నిండనెన్.

చ॥ చేడియ లీయ లక్ష్మణుఁడు • చేకొని యిందని దుఃఖ మీఁగఁగన్
దోడనె పోదుగాక యని • త్రోవక తల్లిరొ! యాజ్ఞయిమ్ము నీ
వాడిన పల్కె ఋక్షాఁతయగు • నంచు శిరంబునఁ దల్లిపాదముల్
గూడఁగ మ్రొక్కెనంతఁ దన • కుందును వీడుమఁ దల్లి యిట్లనెన్.

సీ॥ అవనభూమియు • నీవేగఁ దగనిది, కాదు నాయన! యొండు • కలదు వినుము
అకానయే సుమ్ము • నీ కయోధ్యా పురి, నీమీఁద మాలని • ప్రేమ గలుగు
రాఘవుండే దశ • రథుఁడు మా జానకి. యే రాజ్యమును వీడి • యేగు పిదప
మని యుండు సీతల్లి, యను బుద్ధితోఁ బొమ్ము, నీవిఁక నిట నిల్వ • నీతి గాదు

తే॥ తమ్ముఁడని కాక రాముని • దాసుఁడ నని, సేవసేయు మీతఁడు మము • చేరవచ్చు
నేని తోడనె రమ్ము కా • దేని మున్నె, ప్రాణములు వీడు మనుచు న • ప్రములురాల్చె

చ॥ ఇరువురు మ్రొక్కి నిల్వ జన • యిత్రియు దూడల వీడి గోవు వా
చఱచు విధమ్మునం గురరి • చందమునన్ విలపించె సామ్యముం
దొరయని యక్కుమారకులు • తోరపు దుస్తులఁ దీసివైచి యా
దరమున నార చీరలను • దాల్చిరి వచ్చిరి రాజ పీఠికిన్.

తే॥ తాను ధరియించు నారలు • తమ్ముఁడు దువ, గాంచి కాకుత్స్థవర్యుండు • క్రమప జీతి
శ్రద్ధ నీ యుత్తమోపదే • శంబు వినుము, లక్ష్మణా! యంచు నిట్లు ప • ల్కంగఁదొడఁగె.

ఉ॥ తల్లులు తండ్రియుం గనయ • థాస్థితి లేరు మనంబు లెంతయుం
దల్ల డిలంగఁ గుంది కృశ • తన్ భజియించిరి నన్ను పాసి వా
రొల్లక ప్రాణముల్ మఱియు • నుత్కట శోకమునొందుచుంద్రు నీ
వెల్ల విధాల నాకొఱకు • నిచ్చట సేవ యొనర్చుచుండుమా.

ఆ॥ అనఘుఁ డట్లు పలుక • ననుజుండు భుజములు, వడఁక నులికి మరల • వచ్చు నొక్క
యుసుఱు నడుమఁ గలఁగ • నుమ్మలించుచు నను, దానుఁ దేమి మీకుఁ • దప్పొనర్చె.

చ॥ భువనము లుండఁ దామరస • ముల్ కువలంబులు చేఁప లుండెడున్
భువనము లుండఁ జీవతతి • పొందిక నుండును తీక్ష్ణభానుఁ డీ
దివి వెలుగన్ సమస్తమును • దీపితమౌ నటు లేను సీతయున్
భువి నెవరుండ నుండుదుమొ • పొల్పుగఁ దెల్పఁగదయ్య రాఘవా!

ఉ॥ గాజులు చేధరించు నొక • కాంతకు లోఁగి జగంబు వాడి యు
త్తేజము వాసి ప్రాణములు • తేఁకువ దప్పి చలింపఁ గానకుం
జాజరఁ ద్రోచియున్ బ్రదుకు • సత్యధనుండగు చక్రవర్తికిన్
వాజ వహించు పుత్త్రుఁడవి • పల్కితివో యిటు జానకీపతీ!

ఉ॥ దండక కీవు పోవుదని • తాల్చిన కోపము వించుకైన లే
కుండ నశింపఁ జేసి తపు • దొప్పక యిప్పుడు వెండి నన్ను వీ
డుండని యాజ్ఞసేయుచు ని • టుల్ వచియించుట దానికంటెఁ బై
మెండగు తైక్ష్ణ్యముం గలది • మేలిమిఁ జూడుము జానకీపతీ!

తే॥ శాత్రవ ప్రేమ పాత్ర క • శత్ర నేత్ర, రంజ వాంజన భంజన • వ్యంజనాసి
దక్షిణకర! నీ పొందంగఁ • దగిన భాగ్య, మెల్ల విడిచి మమ్మును వీడి • యేగఁదలఁ తె?

తే॥ అనుజుఁ డీరీతి వచియింప • నగ్రజుండు, బదులు వలుకంగ నేమియుఁ • బాలు పోక
తమ్మ మొగము వీక్షించుచుఁ • దమ్మిఁబోలు, చక్షువుల బాష్పకణములు • జాఱనిలిచె

క॥ అంతట నృప సభ నుండి కొ, అంత గనని తపము ప్రేమ • రాజిలు మునియున్
జెంతకు రాఁగా మ్రొక్కిరి, వంత నతఁడు చూచి శోక • వార్ధి మునింగెన్.

ఉ॥ అంచిత సత్యముం గనిన • యమ్ముని వారల యాననంబులం
గాంచెను వారి దెందములఁ • గాంచెను కట్టిన నార చీరలం
గాంచెను వారి యత్నమును • గాంచెను చెప్పఁగనేమి లేమియుం
గాంచెను మించి నెంజిలియుఁ • గ్రమ్మఁగఁ దా మఱచెన్ సమస్తమున్.

మ॥ అభిషేకంబునకున్ సమగ్రముగఁ గా • ర్యంబుల్ ప్రవర్తిల్ల వా
శుభ లగ్నంబుననే దురంత గతి న • స్తోకార్త శోకంబులా

రభటిన్ లేవఁగ రాఘవుండు వడి నా • రల్గట్టె నా బ్రహ్మనే
నభవున్నేని నొగుల్చు దుర్విధిని ద్రో • యన్ శక్యమే యేరికిన్?

సీ॥ కారాని యాపని • కైకేయి యొక్కతె, వలనఁ గలిగెనంచుఁ • దలఁప రాదు
చూడంగ రాని యీ గోడు యోచింపంగ, రామున కొదవ న • ర్హము గాదు
దేనిచే నైనదో • యీ నిర్ఘృణత్వ మిం, కెవ్వరి తలఁపో పై • నెఱుఁగ నగును
అని మదిఁ దల పోసి • యారాఘవుని గాంచి, వత్స! నీపుర • వరము వదలి

తే॥ వనుల కేగిన నీతండ్రి • బ్రదుకఁడనిన, శేష శయనంబు పై నిద్ర • చేయు టుడిగి
భూమి నవతార మందు శ్రీ • రామ చంద్రుఁ, డిట్టులను గురువునకు స • హేతుకముగ.

తే॥ చక్రవర్తి యాజ్ఞను శిర • సా వహించి, నడచు టెన్న నావిధి ధరా • నాథుఁజేరి
కుందు వాపి నెమ్మది నీవి • కుల గురుండ, వైన నీ విధి యిదియె ధ • ర్మ్యంబు ననిన.

తే॥ అడవిఁ జేరఁగ నీతండ్రి • యాజ్ఞ యిడఁడు, పగఱ బాణమువంటి య • వ్వార్త పలుకు
కైక కా వరముల ముందు • గాన కొసఁగె, నను వసిష్ఠుని పలుకుల • నాలకించి.

చ॥ తగవును నిల్పు కోస మవ • తారము నొందిన రామచంద్రుఁ డిం
పుగ నను సన్మునీంద్ర! వర • ముల్ ప్రియమందఁగ నిచ్చెఁ దండ్రి; నె
మ్మిగులగు తల్లి కానల గ • మింపఁగ నాజ్ఞ యొసంగె; నట్ల యేఁ
దగఁ జరియింపఁ బూనితిని • దానిని మీరలె యడ్డగింతురే?

తే॥ అనుడు నవ్వసిష్ఠుం డేమి • యనఁగ లేక, కంట నస్రముల్ ధారగాఁ • గాఱ నిలిచె
నమ్మహా భుజుఁడగు రాముఁ • డతని కెఱఁగి, నగరి వాకిటి యొద్దకు • నడచె నంత.

## పు ర జ ను ల దుః ఖ ము.

తే॥ తనర వల్కలములు దాల్చి • తమ్ముతోడఁ, దమ్మి కంటెను తేటయై • నెమ్మొగంబు
కౌతుకం బొందు రాముని • కడఁక యెఱిఁగి, పుర జనంబులు మిక్కిలి • పొక్కినారు

తే॥ విప్రులును మునిపతులుఁ బృ • థ్వీ వరులును, వనట యేనాఁడెఱుంగని • పౌర జనము
దేశవాసులుఁ గొనుచింతఁ • దెలుపఁ దరమె?, కలఁగి కోరర సురలు రాఁ • గల శుభంబు

తే॥ దేవకన్యలఁబోలిన • తీవఁబోండ్లు, రాముఁ జూచిన యంతనే • తామర పయి
వ్రాలు తేఁటుల లేఁగొమ్మఁ • బట్టి తోలు, పోల్కిఁ జేతులతోఁగనుల్ • మూసికొనిరి.

చ॥ కొఱవడ కెచ్చు ప్రేమమునఁ • గొందఱు దేహము బెండగిల్ల ను
ర్వరఁ బడి నాకముం గొనిరి • రాముని తండిరి కంటె మున్నుగాఁ
దఱుచగు ద్వంద్వ కర్మములఁ • దక్కక మూలముఁద్రుంచు చేతనో
యుఱవగు ప్రాణముల్ మరల • కుండుట చేతనొ కానమేమిటన్.

ఉ॥ కొందఱు నేలపైఁ బడిరి • కొందఱు క్రుంగిరి సొక్కి సోలుచున్
గొందఱు లోననే కుమిలి • కుందిరి దయ్యము సోఁకు చంద్ధముం
గొందఱు పొందినారు మఱి, కొందఱు మున్గిరి బాష్పవాహినిన్
గొందఱు విహ్వలించి రెల • కుంజము మంటను గూలు కైవడిన్.

తే॥ దరుల నిప్పంటు కొని నట్లు • పరుగు వాఱి, తల్లడిల్లిరి కొందఱు • మల్లె కొల్ల
వోవు తీవ విధమ్మునఁ • బొగిలినారు, తోఁచకేమియు ధరఁబడి • దొరలినారు

సీ॥ కొందఱు కన్నీరు • కురియక యినుప గుం, డియ నాఁగ మ్రాన్పడి • నిలిచినారు
కాయముల్ తడఁబడి • కంపించె జీవముల్, చలియించె నిక్కంపు • సెలవుదప్పి
మతులు గలంగెను • మనసులు దిగఁ బాఱె, వ్రణముల నెత్తురు • వచ్చునట్లు
కనుల నీర్వెట్టి ర • క్తంబు స్రవించెను గగ్గోలు పడియె న • క్కటక మెల్ల

తే. రెండు తుండము ల్గలుగు వే • దండ లీలఁ, బొలుచు వారలు తెంపునఁ • దలలు దొల్ల
నఱికి కొనినారు కొందఱు • చురికలఁగొని, పొక్కఁగనలేక కన్నులఁ • బొడిచికొనిరి.

తే॥ చెదరెఁ దొడవులు మొల నూళ్లు • చిందె రత్న, సమితిరాలెను తెగియెఁబూ • సరములెల్ల
జెలుల నెప్వుల కొంతులు • చెడియె వారి, సుందరాననములు చెంగెఁ • జందురునకు.

తే॥ నిష్కలంక పతివ్రతల్ • నృపతిసతులు, రాణు లఱువది లేవురు • రాము కడకు
వచ్చి పొంగు నుమ్మలిక మా • పంగ లేక, వా విడిచి గోల పెట్టిరి • వార్ధివోలె.

ఉ॥ రాముఁడు తక్క వేతొకతి • రంబగు ప్రాణముఁ బోలు పుత్త్రికున్
నోమని రామలా యెదరు • నొవ్వి సహింపక కేకి హంసికా
స్తోమము తెక్కలూడ నిల • సోలుచు వ్రాలు విధంబునన్ మన
స్స్థైమము తక్కనేఁటఁబడి • చిక్కిరి స్రుక్కిరి సొక్కి రొక్కటన్.

సీ॥ ఆ రాజ కాంతల • యమృతంబు కంటె నిం, పైన వాక్కులు మితి • లేని చింతఁ
గడలేని యూర్పులఁ • గ్రాఁది గద్గదికతఁ, దెరలి వావిడిచి రో • దించు కతన
సుషిర వాద్యములగు • సొంపైన పిల్లనఁ, గ్రోవి మున్నగు వాని • రావములకుఁ
దంత్రీయుతంబులై • తనరిన సారంగ, వీణాది సస్వన • వితతికొగ్గ

తే॥ వనులఁ జేరుద మని తన • యునకు వగచు, చెలుల ముఖములచేఁ బ్రహ • రులు గలట్టి
నగరులొప్పెను చెందొవల్ • పగటి పూట, చెలఁగి వెలుఁగొందు నొక వన • క్షేత్రమనఁగ

చ॥ కనుల కలంగి వెల్వడిన • కాల్వలు కుంకుమ పంకమందు నం
దును మొగి వండగాఁగ నిడి • తోరపు హారముఁబం బెసంగు చు
బ్బిన స్తనశైల శీర్షమున • బిందు సరస్స్థితి జాఱి మేఖలా
గుణ కటి తీర వారిధి వి • గూఢ గతిం జని చొచ్చెఁ జెచ్చెరన్.

తే॥ దశరథేశ సతీముఖ • తామరసము, లను దినేశుండు గాంచె నా • దినము నందు
నమర పతికైనఁ జెడువేళ • యమరెనేని, యెట్టి దుర్దశ రాకుండు • నెంచి చూడ?

తే॥ తల్లులును ప్రేమబంధులు • తదితరులును, చుట్ట ప్రక్కంబులును నిప్పు • సోఁకఁ బరి త
పించు కరణిఁ దపించుచు • వెలికఁ బాఱి, ముఱిగిళుల సందు లేకుండ • మూఁగినారు.

తే॥ గోల పెట్టుచు వారాశి • కూడవచ్చు. పగిది నడవ రాముఁడు వారిఁ • బనుచు తెరువు
నెఱుఁగ కూఱడించెడి త్రోవ • యరయలేక. వడిగ, దన మేడ వంకకు • నడవసాగె.

తే॥ ఉన్నతంపుఁ గిరీటంబు • నొగి ధరింప, రత్న మయమైన కాంచన • రథము నందు
వెడలి నట్టి శ్రీరాముఁ డా • వీథి నిపుడు, నారలం జుట్టి కాల్నడ • నడవ సాగె,

ఉ॥ నల్లని మేను గల్గు రఘు • నాథున కిట్టి కడింది పాటు పా
టిల్లఁగఁ గాంచియున్ సురిఁగి • డింకని ప్రాణము గుండెకంటె మేల్
చెల్ల రె! గట్టి దయ్యె నిఁకఁ • జెప్పఁగ నేటికిఁ దొల్లి బామునన్
నల్లవా! చేయు నోము లవి • నంజానకంటెను బెట్టిదంబులౌ.

ఉ॥ పట్టము మోమునన్ వెలయ • వచ్చున యంచుఁ బ్రతీక్ష సేయు ని
ప్పట్టున నెండ లొక్క మిడి • వాడఁగఁ జేయు వనంబు చేరు రా
పట్టిని చూచుటా? యొక య • పాత్ర వినాశము సేయు దేశ మం
దిట్టులు కన్నులొంది జని • యించుట పైపము పైఁప మక్కటా!.

ఉ॥ అందఱిలోనఁ బెద్దయయి • యర్థ బలంబు గుణంబు గల్గు నీ
సుందర దేహఁ దొప్పికొని • చొచ్చుటయా బహు దుష్ట సత్త్వముల్
క్రందుగ నున్న కానలను? • కానల కేగుటఁగాంచి మేనితో
నిందుల నిచ్చుటా? నిలిచి • యేడ్చుటయా? యిది మంచిప్రేమమే!.

చ॥ బలము చెడంగ బుద్ధియును • భ్రష్టత నొందిన రాజుకై మన
శ్చలనము నొంది ధర్మమును • జాఱఁగ నిచ్చుట నిల్తుమేని రా
కొలము నశింపఁ జేయు పెను • గొద్దటి వాని నడంచు రాముఁ గా
నలకుఁ దొలంచి నట్టి కుల • నాశిని కైకను బోలు వారమే!

చ॥ మురువగు మేన వల్కలము • పొందుగఁ దాల్చిన వాఁడు రాముకై
హరువుగఁ బంచ వాయువుల • నర్పణ సేయు ప్రతిజ్ఞ వాఁడు జో
దొరయని శోక దారుణత • యుల్లమునం గలవాఁడు తమ్ముఁ డొ
క్కరుఁడె యొకో రఘు ప్రవరు • గాదిలి చుట్టము పట్టణంబునన్,

సీ॥ పెను బందకంటెఁ గ • రిన మైన మనసును, గదలతోఁ బగుల మో • దుదమయంచుఁ
బరుగులు వాఱి త్రో • వనుబాష్ప పంకంబు, లం జాఱి పడుచుఁ గ , లంగు వారు

రంగారు బంగారు • రత్నాలబొమ్మలు చెడఁ దెగి పడఁ దీసి • చెదర వైచి
మించును మించిన • మేన వస్త్రాల వలు వల నూడ్చి ప్రాఁతవి • వలచు వారు

తే॥ దండిపుత్త్రుల లోనఁ గ్రూ • రుండొ కండు చావఁ బ్రాణముల్ విడుతురు • జనకు లెందు
వంశ మందను వనికింపి • పలుకుఁగావ మనిన తండ్రి గుండియ యిను • మనెడివారు

ఉ॥ శ్రీకరుఁడున్ సుధీ జన ప • శీ కరుఁడున్ గరుణాకరుండు మే
ఘాకృతిగల్గు రాముఁడు మ • హాటవిఁ జేరఁగ వానితోడనే
లోకులు పోవఁ బాడు పడి • లోఁకువయైన ధరిత్రిఁ బుత్త్రుఁడున్
గైకియు నెత్తిఁగట్టుకొని • కాతురు గావలయున్ ముదంబునన్

తే॥ క్రుంగు నడుములనొప్పించు • కుచములొప్పు, సతులు మస్తములందు హ • స్తములుచేర్చి
రోదన స్వరములఁ జాల • ఖేద మంది విరుల లతకూన లట్లు కం • పించినారు

చ॥ సిగరములన్ నిశాకరుఁడు • చిక్కులఁబొందెడు పెద్ద మేడలన్
మగువలు పయ్యెదల్ దడియ • మందిరి కొండ నెమిళ్ళ కైవడిన్
బొగిలిరి పంజరంబులను • పొందిన చిల్కల పోల్కిఁ గల్కు లొ
ప్పఁగఁ గిటికీలఁ గాంచి రల • బాష్పము లంజన మిశ్రితంబుగాన్

ఉ॥ అందములైన నేత్ర వల • యంబులనుండి స్రవించు నస్రముల్
బిందువు లౌచు ధారలయి • పెద్దప్రవాహములౌ కతంబునన్
సుందర సౌధముల్ మిగుల • స్రుక్కుచుఁ గన్నులు గుంటవాఱ నా
క్రందనముం బొనర్చు క్రియఁ • గ్రాలెను శ్రీరఘువర్యు పోకకై

క॥ తల్లుల మఱచిరి తనయులు తల్లులు తమ సుతుల మఱచి • తలరి సురిగి కం
పిల్లిరి కుత్తుక లెండఁగఁ దల్లడిలిరి తండ్రు లెదలఁ • దద్జ్ఞత కలఁగన్

క॥ ఇంపును మృదువును కాకలి సొంపుగలుగు పలుకు లొప్పు • సుదతులు వీథిన్
గుంపులు గూడఁగ మేడలు కంపిల్లఁగ సిరి తొలంగు • కమలముఁ బోలెన్

మ॥ తరణి వ్రాతము లీలఁ గుండలములు • ద్యుత్కాంతు లీనంగ ని
ర్ఝరిణీ వ్రాతము రీతి నశ్రువులు గా • అన్ ప్రస్తకై శిక్యమై
తరుణీవారము బాణ విద్ధమయి సం • తాప ప్రఘూర్ణంబు లౌ
హరిణీవారము వోలె సంచలిత దే • హావస్థమై దూపిలెన్

మ॥ అడఁగెన్ గొండలఁబోలు మేడలఁ బతా • కాదుల్ మృదంగ స్వనం
బడఁగెన్ మంగళవాద్య ఘోషణముల • త్యంత ప్రమోదా రవం
బడఁగెన్ వీధుల ధూళి ధూసరము బా • ష్పాంబు ప్రకీర్ణంబుగా
నడఁగెన్ భూసుర వేదఘోషములు న • ర్వాశీః ప్రఘోషంబుతోన్

ఉ॥ నీఁగెను వంటయిండ్లు పొగ • నీఁగెను మేడలు ధూప ధూమముల్
నీఁగెను దేహళుల్ కళల • నీఁగెను ఖాణములన్ హరుల్ కరుల్
నీఁగెను కీరపోతములు • నీటగు బంగరు పాలగిన్నెలన్
నీఁగెను మోదమున్ జనము • నీఁగిరి తల్లులు తొట్ల కూనలన్.

ఉ॥ వీడెను కాంతి ప్రాణముల • వీడిన వానిని పోలి యాస్యముల్
వీడెమ వర్షముం గురియు • వేడ్క వినీల పయోద సంఘముల్
వీడెను వారువంబు లట • విస్తృతమై తగు నశ్వశాలలన్
వీడెను దంతి రాజి తని • విన్ మధువుం గొను తేంట్ల కైవడిన్.

క॥ విడిచెను నీడల గొడుగులు, విడిచెను క్రొవ్విదలు క్రొత్త • విరుల సరములన్
విడిచె మరుశరము వేఁడిమి, విడిచెను కటకముల మేటి • వీరుల పదముల్

క॥ వదలెను ధ్వనులను భేరులు, వదలెను కింకిణుల రొదలు • వార్వముల గముల్
వదలెను గీఁకల గజములు, వదలెను నేమిస్వనంబు • బంగరు రథముల్.

చ॥ కలుగవు మంగళ ధ్వనులు • కల్గవు విప్రుల వేదనాదముల్
కలుగవు వీణరావములు • కల్గవు కాహళల నందుకధ్వనుల్
కలుగవు మేఖలాధ్వనులు . కల్గవు కోకిల శారికాధ్వనుల్
కలుగవు తేంట్ల శబ్దములు • గల్గవు పిట్టల శ్రావ్యగీతముల్.

క॥ మఱచెను నీటిం బొలములు, మఱచెను లేబొట్టియలను • మగువల కరముల్
మఱచెను నేతిని వహ్నులు, మఱచెను తత్త్వంబు జ్ఞాన • మాన్యుల మనముల్.

ఉ॥ కుందిరి గుంపు గుంపులుగఁ • గూడుచు నాడుచు నుండు వారలున్
వందిరి శ్రావ్యగీతములఁ • బాడుచు నుండిన వార లట్టులే
పొందిరి కొందలంపు రొద • పొల్తుక లక్కలఁ గొన్నవారలున్
మ్రందిరి ప్రాణనాథులను • మానుగఁ బొందిన సుందరాంగులున్.

ఉ॥ చాఁపవు తొండము ల్కరులు • చాఁపవు నోళులు మేఁతకున్ హరుల్
చూపవు పోతసంతతికి • సూటిగఁ బక్షులు తెచ్చు మేపులన్
దాపవు పాలు దూడలకు • దాయఁగ నీయవు ధేనుకా తతుల్
మేపవు గోవులం బిదుక • మే కొనవున్ దగ గోప వారముల్.

క॥ మగల వెడందయురమ్ములు, మగువల కుచమర్దనంబు • మఱచెను తోడ్తో
మగల సొగసైన సిగలును, మగువల నిడుపైన జడలు • మఱచెను విరులన్.

క॥ అందము నొల్లవు గజములు, పందెము నొల్లవును పరువు • వలచిన మా వుల్
గందము నొల్లవు వీధులు, చందము నొల్లవు సువర్ణ • సౌధ పతాకల్.

చ॥ సమముగ సౌఖ్య దుఃఖముల • సన్మతిఁ జూచెదు యోగులే మదిం
గుమిలిరి; తగ్గ చోటరసి • కూడిన దుష్కృత భాగ్యమంచుఁ దో
యముగఁ దలంచువారు లన • దంచిత కర్మఫలంబ యంచు దెం
దములఁ దలంచువారు నగు • తక్కటి వారల చింత యెట్టిదోః

ఉ॥ ఊహములెల్ల వేఁడియగు • నూర్పులతో నుసుఖల్ చరించి సం
దేహమునొంద నందమును • దీప్తి చెడన్ మది గ్రుక్కి నెక్ష సం
దోహము తాఱుమాఱగుచు • దుఃఖము నొందఁగ మేనులెల్లరా
ద్దేహము వోలెఁ బ్రాణములు • తీఱుగతిన్ బురిఁ దోఁచె నెల్లెడన్.

రాముఁడు సీతయున్న మందిరమును కరుగుట.

ఉ॥ పౌరులు విహ్వలించుచొక • ప్రక్కకె డెందము లెల్ల వ్రాలఁగాఁ
గాఱియనొంది కుంది వెను • కంబడి రా గణియింపరాని యా
కారములొప్పు దేహులకు • గాదిలి ప్రాణమొకండ నాఁగ నొ
ప్పారిన రాఘవుం డరిగె • నయ్యెడ జానకి యున్న చోటికిన్.

ఉ॥ తల్లులు ధారణీ సురులు • తాపస వర్యులు సంగకంబులన్
బెల్లుగ ధూళినింద దుర • పిల్లచు వచ్చుచునుండ రాజసం
బొల్లని నారఁ గట్టికొని • యొప్పని తీరున వచ్చు నాథుఁ దా
నుల్లము వాఁడ గాంచి యొక • యూఁకున లేచెను సీత కొంకుచున్

ఉ॥ అగతి లేచు ధారణిజ • నత్తలు కాటుక కంటి నీటితోఁ
గౌఁగిలిఁ జేర్చి తద్పుచును • గద్గదికంబున నొక్క పెట్టఁ దా
మాఁగక యేడ్వఁ గాంచి జన • కాత్మజ వారలు దుఃఖముం గొనం
గాఁ గతమేదియో మదిని • కానఁగఁ జాలక కాంచె రాఘవున్.

తే॥ కాంచి మించుసంమనఁ జలి • యించు మేను, గలుగు వై దేహి యిట్లనుఁ • గాంతుతోడ
చక్రవర్తి కేదేనియు • సంభవించె, నేమి పల్కుఁడు జాగు స • హింప నసుడు.

చ॥ అసదృశుఁడైన నాయనుజుఁ • దక్కటికంబున ధర్మపద్ధతిన్
వసుమతినేలు వృద్ధజన • వాంఛిత మిద్ది జగంబు నెమ్మదిం
బసఁగొనఁ గారణంబయిన • వారిదము ల్వసియించు కానకున్
వెసఁ జని వత్తు నీవు మది • వేసట నొందక యుండు మిందనన్.

ఉ॥ కాంతుఁడు క్రూరసత్త్వయుత • కానన భూమికి నేగునంచు భూ
కాంతుఁడు గాక పోయెన • కష్టము సెందక యింటనుండుమా

వంతను వీడు వేగ చని • వత్తు నటన్న సుతీక్ష్ణ వాక్కులా
కాంత మనంబు మిక్కిలిగఁ • గాల్పఁ దొడంగ వహించె వేదనన్.

మత్త॥ క్షీర సాగరమందు వీలగు • శేష తల్పము పై రహిన్
చేరికల్ విడి ధర్మ ముద్ధృతి • సేయ భూస్థలిఁ బుట్టఁగా
వారిజాక్షియుఁ బుట్టి వీడక • వచ్చు తన్ను దొలంచు నా
దారుణార్థము వీనుల న్వినఁ • దన్వి కూఱట కూరునే?

క॥ జననీ జనకుల యాజ్ఞం, దనయుఁడు తలఁదాల్చి సేఁత • తగవే యగున
న్వనరఁగ నిచటనె యుండుమ, యనఁ గారణమేమి యనుచు • నారట పడియెన్.

ఉ॥ రాముఁడు రామఁ గాంచి యను • రాక్షసరూపముఁ బోలు కొండలున్
భీమములౌ విభావరుల • వేఁడిమి తగ్గక యుండు ప్రస్తర
స్తోమము ముమ్మొనల్ గలిగి • త్రోవల నిండుగనుండి కాళులన్.
వేమఱు బాధవెట్టు నలి • వేఁడి; మరల్పుము నీయభీష్టమున్.

చ॥ అని తను గూర్చి పల్కు తన • యర్మిలి భర్తకు సీత యిట్లనున్
గనికర మింతలేక • మది గాటపుఁ బ్రేమయు లేక వీడి పో
వనె తలపోసి నాఁడ విది • పద్ధతియే? లయకాల భానుఁడున్
ఘనమగు నీవియోగమున • కంటెను కాల్చునె? ప్రాణ వల్లభా!

చ॥ నలువుగ రాముఁడామె వచ • నంబులు వింటయెకాక తన్మతిన్
దలకొను చింతయుం దెలిసి • తక్కక బాష్పపయోధి పొంగ నా
జలజ సుగంధిఁ బాయుటకు • సమ్మతి లేని సదంత రంగుఁడై
నిలిచెను కర్తమిద్ది యన • నేరక నెవ్వగ నివ్వటిల్లఁగన్.

ఉ॥ అత్తటి సీత విస్తృత గృ • హాంతర సీమకు నేగి దెంద మం
దత్తలపాటుతోడ మృదు • లాంబరము ల్విడనాడి సాహసం
బొత్తఁగ నార చీర నను • వొందఁగఁ దాలిచి వచ్చి రాము ను
ద్వృత్తభుజంబు వట్టికొని • యిమ్ముగనిల్చెఁ బ్రయాణపాటుకై.

మ॥ అబలా రత్నము గోలకోమలి యసూ • ర్యం పశ్య గావించు చె
య్ది బహ్లక్లేశముఁ గూర్పఁజాలఁదగు పృ • థ్విన్ బ్రాలియున్ గాలుఁడున్
గబళింపం దవు జీవితంపు దినముల్ • గల్గన్ శిరోగ్రంబునన్
బ్రబలంబౌ నొక గుండు పైచినను చా • వం బోవ దే ప్రాణియున్.

తే॥ చెలులు దాదులు దాస దా • సీ జనంబు, మంటలోఁ బడి తపియించు • మాడ్కినైరి
రామచంద్రుఁ డుత్తమ సతి • రాజ వదన, యైన జానకిఁగని యిట్టు • లవియె మరల.

మ॥ సుదతీ! రాఁగల కష్టము ల్దలఁప వో • సుంతైన నాతోడ రా
ముద మొప్పారఁగ నుంటి హెచ్చుగ శ్రమం • బుల్గూర్తు వచ్చేననన్
ముదమే కల్గును నన్ను వీడి చనఁగా • ముఖ్యంబుగా నేనె మీ
ముదముం బాపఁగ నుంటి నోటు! నిజమే • పో! యంచుఁ గోపింపఁగన్.

తే॥ మనసు కలఁగి ప్రతి స్థల • మునను జనులు, పడుచు లేచుచు దుర్దశఁ • బడయుచుండు
రాచ వీధిని మెల్లఁగా • రామ విభుఁడు, జానకిం దోడు కొనుచుఁ గ • ష్టమున నేగె.

తే॥ ముదిత వల్కలములు దాల్చి • ముందు వోవ, విల్లుచేఁ బూని యనుజుండు • వెనుకనడవ
నడుమ రాముఁడేగుట గాంచు • నాగరకుల, యడలు వర్ణింప నాబోటి • కలవియగునె?.

తే॥ అశుభముగ వెన్క నెవ్వరు • నడల లేదు, తలరు మదితోడఁ జుట్టి సీ • తా హృదీశు
కంటె మున్నుగఁ బోదము • కాన కనుచు, నడచి రెల్లరు పెనుగోల • యడరు నట్లు.

క॥ ఇనకుల జలనిధి సోముఁడు, జనకు నగరు డాసి యంత • జనులఁ గని యిం
దునె యుండి తండ్రిఁ దేర్పుం, డన వారలు తల్లడిలిరి • హాహా యనుచున్.

క॥ సుడియుచు నాలుక తడఁబడ, వడఁకుచు నిలువేల్పులారా! ప్రార్థింతుము కా
వుఁడు వీరల నని తనయులఁ, బుడుకుచు దీవించి సితఁ • బొగడిరి మిగులన్.

తే॥ జనులను వీడి కులగురు • చరణములకు, మ్రొక్కి రాముఁడు తన ప్రాణ • ములను **పోలు**
తమ్ముతోడను సీతతోఁ • ద ప్తకనక, రథముపై నెక్కి వెడలెఁ బు • రంబె కలఁగ.

5 తైలగుప్తి పటలము. 83

చ॥ నిలిచిరి రాజులెల్ల ధర • జీవరు నెప్పుడు వీడియుండమిన్
నిలిచెను భిత్తి చిత్రములు • నెక్కొను ప్రాణము లేకపోవుటన్
దలఁపఁగ నెవ్వరింక నయ • ధాముని రాముని వెంటఁ బోక య
న్నెలవున నిల్చినారలు గ • ణించినచోఁ గలికానికేనియున్?

తే॥ కాంచన స్యందనంబు మా • ర్గమున యందు, వేఁడికన్నీటి కాల్వలు • వెల్లి విరియ
మెల్లఁగా నేగుచుండ నా • మేటి వీరుఁ, డబ్ధి విహరించు నాది మ • త్స్యంబుఁ బోలె.

క॥ వనముల కరిగెడి రాముని, గనఁ జాల నటంచు నినుఁడు • కనికరమునఁ దా
వనరాశి దూఁకెనో యనఁ, జని క్రుంకెం బసియు మరలి • చన మందలకున్.

క॥ నెలవంకఁ గొని యజుండే, కలిగించిన జిగి నొసళ్లు • గల కలుకుల మో
ముల వలె సరసిజములు మో, ములు మోడిచె నక్షు లురలి • మురువుచెడంగన్.

క॥ మునిమాపున వేఁడిమి చెడ, ఘనమతి కైకేయి మదిని • కటు మంథర బో
ధనమను విష మలమిన రీ, తిని శీతదవంబు వీడి • తిమిరము క్రమ్మెన్.

క॥ ఉడుసమితి వెలుఁగు గగనము, కడఁకన్ గౌతమునిశాప • కారణమున గం
డ్లడరు వెయిగనుల వేలుపు, బొడయని దేహంబు వోలె • నొప్పెసలారెన్.

క॥ నగరి విడిచి రెండామడ, లొగిఁజని కాకుత్స్థవర్యుఁ • డొక్క వనమునన్
దిగి యచటి ప్రియస్నేహితు, లగు తాపస వరులఁ గలిసి • యలరి వసింపన్.

చ॥ వినుత గుణాఢ్యు రామ విభు • వీడఁగఁ జాలక వెంటనేగు నా
జన నికురుంబ మవ్వనము • చక్కటి నామడ చుట్టి నూవు గిం
జను విడువం గట్టి యెడ • సైతము పొందని రీతి నిండ న
వ్వన మొక కంచె కోటగ • వైఖరిఁ గానఁగనయ్యె నయ్యెడన్.

క॥ ఎదియును నోటం బెట్టక, నిదురింపక పరితపించు • నెంజిలిఁ దమసా
నది పులిన శాద్వలంబుల, నొదిఁగి పడిరి జనములెల్ల • నోర్వని చింతన్.

క॥ క్రొవ్విరి తామరలనఁ జను, మవ్వపు నయనములు గలుగు • మడఁతులు పాలన్
నివ్వటిలు నురుగుఁ బోలిన, దువ్వలువలఁ బఱచికొని రొ • దుంగఁగ నచటన్.

తే॥ నిడుపు పగలెల్ల మిక్కిలి • యడలి యడలి, పరితపించి మొగ్గవనులు • కఱకుటలుఁగు
కనులు తీయని పలుకులు • గలపడుచులు, పెంచుతల్లుల యొడుల ని • ద్రించినారు.

ఉ॥ కాటుక మావిపిందెలకుఁ • గట్టిన యట్లు రహించు కన్నులన్
మాటి మొగిడ్చి నిద్రిలిరి • మానిను లందు కరేణులం బలెన్
మేటి కరాసి వీరులును • మేదుర గంధగజంబులం బలెన్
బోటులకున్ సమీపమునఁ • బొందిరి కూరుకులం గ్రమంబునన్.

చ॥ అతిశయ ధర్మమందపము • నందుట నున్నతి నొంది వల్లభ
ప్రతత కృపానురాగ రస • భారలు కొందఱు లే మయూర సం
తతులు ముడింగి వ్రాలు క్రియ • ధారిణిపైఁ బడి తీవ్రతాప సం
గతలయి వ్రాలినారు కను • గందులు స్తన్యముఁ ద్రావుచుండఁగన్.

ఉ॥ కొందఱు మాధవీ కుసుమ • కుంజములన్ హరినీల వేదులం
జెంది మయూరవారముల • చెన్నునఁ బండిరి సోలి వ్రాలుచున్
గొందఱు బంధుర క్రముక • కూటములన్ హ్రద తీర సైకతం
బందు పరుండి కూర్కెరెల • యంచల పిండుల మించు సంచునన్.

క॥ వసమటి చంపక వనములఁ, గుసుమ లతలు వాదు క్రియను • కొందఱు గుముల్తై
యిసుక పఱుపుపైఁ గొందఱు, మస చెడి నిద్రిలిరి విద్రు • మ లతల పగిదిన్.

ఉ॥ కొందఱు కుంకుమంబు నెఱిఁ గూడిన కొండను మంచు వ్రాలు పొ
ల్పొందఁగ తొమ్మలందు దవ • యొప్పఁ బరుండిరి నేల సోలుచున్

గొందఱు దిండుగాఁగఁ దమ • కోమల హస్తములం గదించి కూ
ర్కుందిరి మోము, లంగు చెడి • యంబుజము ల్ముకుళించు చాడ్పుగాన్.

ఉ॥ కొందఱు బండలందు మఱి • కొందఱు రాలిన యాకుకుప్పలన్
గొందఱు కొంగులం బఱచి • కొందఱు పల్లవము ల్ఘటించుచున్
గొందఱు వట్టి నేలపయిఁ • గొందఱు భర్తల పాదసన్నిధిన్
గొందల మంది డెందములు • క్రుంగఁగ వ్రాలిరి సోలి నిద్రకున్.

తే॥ ఇట్లు మైవ్రాల్చి నిదురింప • నెల్లవారు, మైథిలీ భర్త యపుడు సు • మంత్రుఁ బిలిచి
పావన గుణ విశాసి! నీ • వలన మాకుఁ, గావలయు పని యొక్కటి • కలదు వినుము.

మ॥ అధిక ప్రేమము గల్గు నీ జనులఁ బో • నంపంగ లేనైతిని
వ్విధి వీరిం గొని పోవఁ జాలనయితిన్ • వే త్రిప్పి కొంపోవు నీ
రథ మార్గంబును కాంచి వీరు "పురమున్ • రాముండు చేరెన్ మనో
రథముల్ దీరె"నటంచుఁ గ్రమ్మ ఱెడు వా • రల్ దీనిఁ గావింపుమా.

మ॥ రథిక శ్రేష్ఠుఁడు రాముఁడిట్లు పలుకం • బ్రార్థించుచున్ మేటి సా
రథి వాక్రుచ్చును నిన్ను వీడియును నా • ప్రాణంబులన్ వీడ కీ
రథముం గొంచుఁ బురంబు చేరి కన నే • రన్ గోడు, కాంచంగ దు
ష్పథముం బొందిన కైకకున్ విధికి నేఁ • బై చేయియే యాడుగా!

ఉ॥ తమ్ముఁడు దేవియుం గడు ము • దమ్మునఁ దో నరుదేర రాము నం
దమ్ములు చిందు నందన వ • నమ్మున వీడితి నంచుఁ జెప్పనా?
యిమ్ముగఁ దోడి తెచ్చితి స • హింపుఁడి చూడు డి యంచుఁజెప్పనా?.
యెమ్మెయి ఱాతిగుండె గొని • యేమని చెప్పుదు వారి కచ్చటన్?

తే॥ ప్రాఁత మిత్రుఁడ నొక మచ్చ • పడని వాఁడ, మృదుల పుష్ప ప్రకీర్ణ మా • మేదినిపయిఁ
జెలఁగి నడవంగఁ దగిన యా • సీత తోడఁ, దనయులం గాన నీఁగితి • నన(గఁగలనె?

తే॥ ప్రబలములగు నింద్రియములు • రాతి గుండె, గలుగు నేను శరీరంబు • కార్శ్య మొంద
మది కలఁగి పరిదేవించు • మనుజ నాథు, కడకు యమ దూతవలెఁ బోవఁ • గలనెచెపుమ

తే॥ నగర వాసులు నీపుత్త్రి • నయముతోడఁ, బిలిచికొని వత్తురని శాంతి • గొలుపుచుండ
నతని నిప్పుడు కట్టెఁడి • యముని పోలి, కఠినవాక్కునఁ గొలచేయఁ • గలనె చెపుమ?

తే॥ అరుదుగాఁ గన్న పుత్త్రి సిం • హంబు లడవి, కేగెనని తెల్పఁ బోదునే? యీ సునీతి
పలుకఁ బోలునే? యశ్లైనఁ బార్థివునకుఁ, గైక యే మేలుచేయి నా • కంటె నరయ

తే॥ వజ్రపాతంబునకు నుల్కి • పడి విధమున, వెల వెలం బాఱి రామ భూ • విభుని చరణ
సరసిజంబుల వ్రాలి యా • సచివుఁ డిట్లు, పెక్కు విధములఁ బ్రార్థించె • వీడ లేక.

క॥ జ్ఞానేంద్రియములు గందక • జ్ఞానమునకు నెఱుఁగనైన • శాశ్వతుఁడు రమా
జాని సుమంత్రుని కరములతో నెత్తుచుఁ దడవి నీరు • దుడుచుచు ననియెన్

క॥ పుట్టిన పిమ్మట రాఁదగు • నట్టివి సంపూర్ణముగనె • యరసిన నీవున్
గట్టిగ శ్రమ గలదనుచున్ • బట్టును ధర్మంబు మది మ • జవ నాయంబే?

తే॥ జగతి నుత్తమ ధర్మంబు • జన నుతముగఁ • జలిపి మరణించినను నిల్చి • స్వర్గమొసఁగు
నింపు గలదెని చేయుచ • నిష్ట మొసవ • పీడు వాఁడెట్టి ధిరుఁడో • చూడు మీవ

తే॥ వాఁడికైదువు లొమ్మనఁ • గాఁడ నోర్వఁ, గలుగు లెన్నంగ వీఁ • లక్షణము గాదు
మరణ మబ్బినసంపద • హ్రాసి పోవఁ • దగవు దప్పకుండు టె మగ • తనము సుమ్మె

తే॥ శత్రుజీవాపహారణ ద • క్షప్రభాసి • ఖడ్గహస్త వనుఁ కేగఁ • గష్టమనుచు
మరలితిన యేని ఓవి యందు • చిరయశంబు • గాంచు మావారి కది కలం • కంబుగాదె?

తే॥ సత్కులావర్న పురుషుఁడు • సత్యమునకుఁ • దనయు వనుల కంపు టతని • తపమయగును
అతని యాజ్ఞను తలఁదాల్చి • యడవి కరుగు • టరయ నా మేటితవము నీ • వడలు చేల?

తే॥ మొదటఁ గులగురునకు నాదు • మ్రొక్కుగాఁగ • వినయపూర్వకముగ • మ్రొక్కి • పిదప నతని
తోడ మాతండ్రిఁ గాంచిపు • త్త్రుండు జోత, సలిపె నని చెప్పి యవల నా • తలఁపుదెలుపు

చ॥ కులగురు నాజ్ఞ నౌదలను • గూరిచి ధర్మవిధాను వర్తివై
సలుపుము నుఁడుమా శుభమె • సజ్జన పాళికి దేవతాళికిన్
వలవని నా వియోగమున • వందురు తల్లులఁ దండ్రిఁ దేర్పునీ
తలఁగని సత్త్రప్రవృత్తినని • తమ్ములకుం దగ విన్నవింపుమా

ఉ॥ క్రూరుఁడు తండ్రి యిట్లు చెడు • గుల్ ఘటియించెన యంచు నీవు దు
ర్దారుణరీతి నెంచక ము • దంబున నాయెడఁ జూపు నుల్లస
త్కారుణికత్వముం దగు వి • ధంబున మార్దవ ఫక్కినాఁ డో
దారపు చెందు నట్టులు ని • దానముగా వినిపింప వేఁడెదన్

తే॥ గురుమహాదేవుతో నంతి • పురికి నేగి • మొదటఁ దండ్రి దుఃఖము దీర్చి • పిదప నతని
భరతుపై మీ యపార కృ • పన్ ఘటింప • వలయు వరము వేఁడితినని • పలుకు మయ్య!

తే॥ అడవులం బదులునాలుగు • హాయనములు • గడపి వచ్చి మీచరణ పం • కజములు కడఁ
జేరు నడలకుఁడనుచు వ • సిష్ఠమౌని • వలనఁ జెప్పించి సాంత్వన • పలుకు మతని

చ॥ ననుగని పెంచు తల్లులకు • నానెటి దప్పని వందనంబులన్
వినతి మెయిం గదించి • యను • వెండియుఁ దండ్రి • యలంత దీర్చి యా
తని మది నావియోగమునఁ • దాలిక • యుండఁగ నూఱడించుచున్
బనవక వీడకుండు దని • ప్రార్థన చేసితి నంచుఁ దెల్పుమా

ఉ॥ సేవకు కింకరత్వ మది • చెందదు మార్పు సతం బటంచు సం
భావన చేసి యంతట సు • మంత్రుఁడు రాముని భద్రపాద రా
జీవములం భజించి భువి • జీవికిఁ దప్పని సౌఖ్య దుఃఖముల్
దైవ వశంబులంచు వని • తా మణి సీతకు మ్రొక్కి నిల్చెడున్.

ఉ॥ వందనముల్ వచించె నను • వత్సలతం గను మామగారికిన్
జెందెడు ప్రేమతోడ • నెను చేరఁగఁ దీసెడు ముగ్గురత్తలన్
దెంచ మెఱర్చ మ్రొక్కెనను • తేఁకువ ముద్దుల కీరి శారికన్
ఎందిక పెంచఁ గోరెనని • పల్కుము గాదిలి చెల్లియంద్రకున్.

ఉ॥ సీత వచించు వార్తవిని • చింతయె కానని యీమె కానలన్
జేతము స్రుక్క నెంత పగ • చెందునొ యంచుఁ దపించు మంత్ర వి
ఖ్యాతుని గాంచి రాముఁడనుఁ • గష్టము వచ్చినఁ దీర్చు నేర్పరుల్
భూతల మందు గల్గుమరె? • పోవఁగఁ జూచినఁ బోనె ప్రాణముల్?

తే॥ సుస్థిర ప్రేమచే మది • స్రుక్కు మంత్రి, రాము వాక్కులఁ గొంత యూ • ఱటనుపొంది
ముదలఁగొని మ్రొక్కి లక్ష్మణు • మోముగాంచి, యేమిపల్కెద వనవచి • యించెనతఁడు

ఉ॥ నామనమున్ సమస్త సుగు • ణంబుల చేత జయించు రాఘవ
స్వామికి భూమి నిచ్చి యొక • చాన కుబుద్ధికి లోఁగి పిమ్మటన్
రాముని కాన కంపి తన • రాజ్యము స్త్రీకి నొసంగు సత్య వా
క్ష్వేముని రాజుగాఁ దలఁచి • చెప్పఁగ నొక్కటి యేని యొప్పునే?

ఉ॥ కొనల జ్యేష్ఠ పుత్త్రికుఁడు • కాయలు దుంపలు దిన్చు నుండఁగాఁ
దాను సురేంద్ర భోగములఁ • దప్పక పొందెడు సత్యశీలికిన్
దానికి మానినీ జిత వి • ధానికి జీవము తోడ నుండి యిం
కేని దివంబుఁజేరఁజాలి • యింపని స్థైర్యముఁ జూటి పల్కుమా

చ॥ అవనికి రాజు కాఁదగిన • యాతని తోడను పుట్టలేదు నే
నవనికి నిప్పుడేలి కగు • నాతని తోడను పుట్టలేదు నా
కిపరజుఁడున్ భువిం గలుగఁ • డంబుజసంభవుచేత నాకు నేఁ
దవిలిన తోడగాఁగ వసు • ధన్ జనియించిన యే బలిష్ఠుఁడన్.

తే॥ అనుచునిటు కోపమునఁబల్కు • ననుజుఁగాంచి, వత్స! యొప్పిదములుగాని • పలుకులనకు
మనుచు నాశ్వాస మొనరింప • మనసు కుమిలి, చాఁగి మ్రొక్కి తేరి కడకు • సాగెమంత్రి

ఉ॥ తేరికిఁ బూన్చె గుఱ్ఱములఁ • దేకువఁ జేకొనెఁ గోలఁ గేల నా
దారి జనంబు లెల్ల విప • దంబుగఁ గాంచెడు నట్లు చోదక

స్ఫార విచక్షణత్వమున • సందడి యెక్కుడుగాక నిద్రకుం
గూరిన వారు మేలుకొనఁ • గూడని తీరునఁ దేరు తొలుడున్.

ఉ॥ సీత పతివ్రతాత్వమును • స్వీయ విశేష గుణంబులున్ లస
త్ఖ్యాత యశంబు సత్యమును • ధర్మవు విజిత కార్ముకంబు సం
ప్రీతుఁడు తమ్ముఁడున్ దనకు • వీడని తోడుగ నా నిశీథినిన్
శ్రీతరుణీ మనోహరుఁడు • చేరె వనంబులకున్ మనో ధృతిన్.

చ॥ కుటిల మనస్కులౌ దనుజ • కుంజరవర్గముఁ గూడి లోక సం
కటమగు కృత్యము ల్సలుపు • కష్టుల కార్యము లడ్డుకో విశం
కట గతి నొప్పి యెల్లెడలఁ • గాటుక రంగు వెలార్చు చుండు చీఁ
కటిఁ దొలఁగించు వేలుపుల • కాగడ నా నుదయించెఁ జంద్రుఁడున్.

ఉ॥ మర్మముఁ దాఁకు పాపముల • మాయఁగఁ జేయ వలంతులైన స
ద్ధర్మములన్ వహించి మహి • ధర్మము నిల్ప సహాయపడ్డ యా
కర్మ ఫలంబు నెంచి కుతు • కంబునఁ గానఁగ వచ్చినట్టి యా
యర్మిలి ధర్మదేవత ము • ఖాబ్జ మనన్ శశి తాల్చెఁ దేజమున్.

మ॥ భయదారణ్యములం జరించు నసి తా • బ్జ శ్యాము పే దర్మిఁ గాం
చి యెదల్ నొప్ప మొగంబు మోడ్చినటు దోఁ • చెం గల్వ లంభోజ సం
చయముల్ గన్పడె జెట్టిపోతుల శిర • శ్ఛాయన్ మనో వేదనన్
లయమై నోరులు మూసి కొన్నపవి యే • లా చెప్ప నన్యంబులన్.

ఉ॥ అంజన శైల సుందరుఁడు • నట్టిఁడ మేలి పసిండి చాయమై
రంజిలు వాఁడు వింటికొన • రాణ నొసగ్గల భూమి జాత మె
ల్లంజన వేసటం గొనని • లాగున నేగుట కాను కూల్యమై
కంజ విరోధి వెన్నెలలు • గాసెను మెత్తని దూది పై చెనన్

తే॥ మిగుల లేఁగొను స్తన లక్ష్మి • మెఱయు సీత, మృదు మృణాల పదంబుల • మెల్ల మెల్ల
వెంబడించె విపులమైన • ప్రేమకంటె, గురు తరంబగు వస్తువు • ధరణిఁ గలదె?

చ॥ ఇనుఁ డుదయాచలంబు శిర • మెక్కెడు మున్నె రఘూ ద్వహుండు ద
క్కినముగ యోజన ద్వయము • కీడ్పడ కేగెను, మీఱి బాష్పముల్
కను గవ వీడఁగా మనసు • కాతఱ తాపము నొంది కుందఁగా
మనికిత పాటు తోఁజని సు • మంత్రుఁడు చేరెఁ బురంబు చేరువన్.

ఉ॥ చేరి దినేంద్ర వంశగురు • శిష్టు వసిష్ఠునిగాంచి మ్రొక్కి కాం
తారము రాముపోకఁ బరి • తాపముతో వివరింప మౌని ని

ట్టూరుపు వుచ్చి కాఁగలది • యుల్లమునం దరికించి యక్కటా!
భూరమణుండు తీటెఁ బర • ముం గలగుందు వడెం గదా యనెన్.

తే॥ రాజు నిందకు జంకి మ • రల్పఁడయ్యె. ధర్మమును నిల్పనెంచిన • దాశరథియు
వినఁడ యింతయు నామాట • విధిని దాఁట, నగునె? యని యేగె నతనితో • నంతిపురికి

తే॥ దాశరథి వచ్చెననుచు న • త్కరమంత్రు, డరి' పరిధి చంద్రుంబోలె • నధిపుఁ జేరి
రాముఁగానక బాష్పవ • ర్షంబు గురియు, నాసుమంత్రుని గని చాల • నడలినారు.

తే॥ తేరుమరలినదని యెల్ల • వారు పలుక. రాముఁడేతెంచెనని దశ • రథుడు కనులు
తెఱచి నా జీవజీవ మే • తెంచెనె? యని, యడిగెఁ దనయెడ యుబలాట • పడుచులేవ.

తే॥ బదులు చెప్పఁజాలక మౌని • పరితపించెఁ, దపసి మొగమె భూపతికి ను • త్తరమొసంగె
నెదఁద పగిలి భూమీశ్వరుఁ • డిలకు వ్రాలె. గొవరు చూడఁ జాలకమౌని • యవలికేగె.

ఉ॥ దగ్గఱ నుండెనే సుతుఁడు • దవ్వుల నుండెనె యంచు మెల్లనన్
బ్రెగ్గడ నడ్గి యాతఁడు ద • వీయ వనంబుల కేగెఁ దమ్ముతో
సిగ్గరి సీతతో నని వ • చించి వచింపక మున్నె భూవరుం
దగ్గలికంపుఁ బేర్మిఁదన • యా! యనిహా! యని వీడెఁ బ్రాణముల్.

చ॥ అపుడు పురందరాది సుర • లందఱు మాప్రభుతండ్రి వచ్చె నం
చుపగత మోద భావమున • నొక్కటియై శశిఁబోలె శీతలా
తపము వెలార్చు కేరిపయి • దాకొని పుట్టెడి తంటలెల్ల లే
క పొదలు పైజగంబునకుఁ • గైకొని పోయిరి సమ్మదంబునన్.

మ॥ కని సందేహమునన్ సతీ తిలకమౌ • కౌసల్య మైదాఁకి చ
ల్లనయై యావియు నాడ కుండుటలు పో • లం జూచి నాధుండు మ్రం
దెనకా నిశ్చయమంది గ్రీష్మరవి సం • దీప్త ప్రతాపంబుచేఁ
దనుకం జొచ్చిన యెమ్మలేని జని చం • దం బందుమం దూపిలెన్.

సీ॥ కమల గర్భుండాది • గాఁగ సమస్తజ. గంబుల సృజియించి • కాచు హరిని
శ్రీపయుఁగాఁ బడయు ను • త్తమ తపం బొనరించి, నట్టియన్నులమిన్న • యట్టెకూలి
పీయూషమును జాఱ • వీడి నందురు వారి, వలె మది మిక్కిలి • పరి తపించి
మణిఁగోలు పోయిన • ఫణి విధంబున నుల్ల, మల్ల లాడఁగఁబెల్లు • తల్లడిల్లి

తే॥ మగపుఱుఁబాసి • మనమున మఱుఁగుపట్టి, కురరి భంగిని గద్గద • స్వరముతోడ
నెన్నువలు పల్కి వినువారి • యెదలు పరఁగి ద్రవముగాఁ బ్రలాపించె రో • దనముతోడ

చ॥ వినుత మహాశయుండు నృప • వీరుఁడు ధన్వి యొకండు వ్యాధియున్
జెనకక తానుగాఁగ మృతిఁ • జెందెనె మమ్మ వియోగ దుఃఖ భా

జనముగఁ జేసి యంచు జల • సద్మము వట్టఁ దపించు మత్స్యభా
తిని బలు తల్లడం గుడుచు • దేహముతోఁ బృధివీస్థలిం బడెన్.

సీ॥ ఈదేశమును గాచు • నృపతుసాకేరీతి, స్వర్గంబుఁ బాలించు • వారెకాదె?
పొలుపుగా మనిన స • త్పుత్త్రకులకు గతు, లొక్కెడనేని లే • కుంట గలదె?
మత్సుతుఁదేలెంచి • మదికి నూఱట గొల్ప, కిటు తండ్రి మృతికిఁ దా • హేతువయ్యె
నను చింత యొక్కటే • నన్నాఱటం బెట్టెఁ, గైదువుపోటు రో • గంబు లేక

తే॥ ప్రాణములు వీడుగతికిఁ బా • ల్పడియె నకట, కన్నకొడుకులచే నిట్టి • గతియుఁ దగునె?
వెదురు శక్తియరఁటియెంద్రి • విధమెయయ్యె, నీమహీంద్రుబ్రదుకు భరి • యింపఁదరమె?

తే॥ మతి బలిమిచేత విభుబుద్ధి • మార్చివై చి, బదులు పలుకనీయని రీతి • వరముఁగొంటి
మగనిఁ జంపుకొంటివి తృప్తి • నెగడుచుంటి, కైక! మిగిలియున్నదె చేయఁ • గలదియింక?

ఉ॥ దుర్జయుఁడైన శంబరుని • దోర్బలశక్తి నడంచు వీర! నీ
యూర్జిత శౌర్యసంపదనె • యోడక నెమ్మది నందుచున్న యా
నిర్జరపాళికే యిపుడు • నెమ్మి గడించిన విందవైతివే
వర్జన సేయఁగాఁ దగునె • పార్థివ! నమ్మిన మమ్ము దీనలన్?

చ॥ ననుగొని వేల్మి వేల్చిన మ • నః ప్రియ! యిప్పుడు నన్నువీడి క్ర
న్నన నొకరుండ వే చనఁగ • నాయమె తత్ఫలముల్ భుజింప? స
త్యనయ ఫలంబు నానుటయు • ధర ఫలానుభవంబయేనియున్
జనునొకొ సామి దేహమునఁ • జక్కనగా ననుభూతి నొందుటల్?

చ॥ గజ విభుఁ బాసి తాపమునఁ • గ్రాఁగు కరేణువు పోల్కి కోసలా
త్మజ విభు తొమ్మపై శిరము • దారిచి యిట్లు విలాప మొంది సో
లి జగతి వ్రాల సంతి పురి • లేమ లురమ్ముల బాఁది కొంచు దుః
ఖ జనిత బాష్ప తోయములఁ • గ్రాఁగుచుఁ దోఁగుచు స్రుక్కి వెక్కుచున్.

చ॥ విసము భయంబుచేఁగుడిచి • విహ్వల మందుచు వ్రాలు కైపడిన్
దెసచెడి నేలఁగూలుచుఁ బ • తిన్ దివమందు భజింపఁ గోరి ని
ర్వ్యసన మనస్కలోచుఁ బ్రతి • మాకృతిఁ దాల్చిరి ప్రేమకంటె ని
వ్వసమతి వేఱొకండు చెడు • వస్తువు గల్గునె పోలఁ జూచినన్?.

సీ॥ ఉప్పళంబుల తీర • మొప్పారు కదలిచే, బలసిన యాధరా • తలము నందు
దివమున యందుఁ బై • భువనమ్ములందును, కల కులసతుల వీ • రలను పోలు
నకలంక హృదయఁ లెం • దైనఁ గల్గుదురేమి?, యనఁగనొప్పి యదవి • నదరువాఁక
గిరిఁ జుట్టి కవియ ను • స్థిరముగా నిలిచిన, కొండపై నెమిళుల • కొమరు దాల్చి

తే॥ కొడుకుఁ బాసి డెందము వ్రీలు • నుడువుచేఁ, జచ్చియును మరణాంతంబు • సత్యమందె
నిలుచు ప్రభునొడలిని వీడి • తొలఁగలేక, కిట్టి పలవించు చుండిరి • చుట్టు మూఁగి

చ॥ మనుజుల బంధహేతువగు • మాయ యనం జను చోట మీను చే
రిన జననాంబురాశిని ల • ంఘింపఁగఁ దారకమంత్రరాజ నౌ
కను గొను వారి పోల్కిఁ బ్రభు • కామిను లర్వదివేలమందియున్
మనమున దార్ఢ్యమూని యన • మాన సునిశ్చలతన్ భజింపఁగన్.

తే॥ రాము తల్లి లక్ష్మణు తల్లి • వ్రాలి సోలి, మఱుఁగు చుండ నోరువని సు • మంత్రుఁ డేగి
జరిగినది దెల్పఁగా రాజ • గురుఁడు వచ్చి, ప్రభుని మరణంబునకుఁ జాలఁ • బరితపించె.

తే॥ వరము లొసఁగి కుమారుని • వనుల కంపి, యార్యుఁడు గతించెనని మది • నడలి యడలి
యబ్ధిలోనావ వ్రీల నా • యకుఁడు చావ, జీవ్చవడు మాలిమిం బోలె • ఋషివరుండు

చ॥ జరుపగఁ దగ్గ సంస్క్రియలు • సల్పఁగఁ బుత్త్రులయందు చెంత నొ
క్కరుఁడును లేమికిం గురుఁడొ • కానొక మార్గమునెంచి యంతటన్
భరతుఁడు వచ్చు పిమ్మటనె • పద్ధతిగానొనరింప రాట్కళే
బరమును తైలరాశి నన • పాయత గుప్తము చేసె నెవ్వడిన్

చ॥ పతి కిట సంస్కృతు ల్జరుపు • పట్టున మీరలు ధీరచిత్తులై
చితిఁ జొరవచ్చుఁ బొండనుచుఁ • జెచ్చెర రాణుల సాగనంపి సం
గరముగ లేఖ వ్రాసి యిది • కైకొని కైక కుమారు రాజు నా
నతి యని వేగ తోడు కొని • నైపుణి రండని పంపె దూతలన్.

తే॥ సర్వసైన్యాధి పతియును • సారధియును, మంత్రిముఖ్యుండు నైన సు • మంత్రుఁబిలిచి
యవసరంబులౌ రాజ కా • ర్యంబులెల్ల, జరుపుచుండుమ యనుచు నా • జ్ఞప్తియొసఁగె

చ॥ తన కుల దీపకుండయిన • ధారణి నాధుఁడు స్వర్గమేగెఁ ద
త్తనయులు చెంతలేరు నృప • ధర్మము నాశిల కంతఁ దాఁకఁ బ్ర
ధ్వని తగఁగాతు నంచుఁ జను • దెంచిన కైవడి భాస్కరుండు తూ
ర్పున నుదయించె నిర్జరులు • పుణ్యులు మ్రొగ్గఁ బయోధి మ్రోఁగఁగన్

సీ॥ చింతింపఁ గూడని • చెన్నునఁ జింతించు, చుండిన వారలు • నొడలు మఱచి
కూర్కిన వారును • కోదండ పాణియు, నిటనె యున్నాఁడని • యెంచినారు
నగు జనంబులు లేచి • యంబుద శ్యాముని, గానక మనమున • గాసిచెంది
మాయని కన్నులు • మూసి మనల నిట్లు, చెఱుప నెంచిన వని • పలికినారు

తే॥ ధరణిఁ బొరలిరి దెసలకుఁ • బరుగు లిడిరి, పడిరి లేచిరి కుందిరి • వందినారు
మనల దుఃఖసాగరమున • మునుఁగ విడిచి, జారి పోయెను రఘురాము • చంద్రుఁడనిరి.

సీ॥ చెడుపని చేసెరా • ముఁడు తగునే యిది? దండక భువిలోనె • యుండ దేమి?
వెదకి చేరక యున్న • నెదలోన నూఱట నందఁగాఁ గలమెర • వంత యేని?
అరదంపుఁ గందువ • యరయుదమా యని చని కొంత దూరంబు • గని జనములు
మరలె నయోధ్యకే • మన రాము లేఁడని పోయిన ప్రాణముల్ • పొందినట్లు

తే॥ తలఁచి తలఁచి మేఘముల్ • జలధిఁ గలిసి ఘోష మొనరించు తీరునఁ • గూడి యార్చి
త్రాఁచు కాటొంది పైనప్పు • తంబు పొరకి మరల జీవముల్గాంచిన • కరణిఁబొంది

ఉ॥ త్రోవ తొలంగ కుండఁ బురి • త్రోవనె స్యందన మెగుదెంచు నా
ప్రావను గాంచి మించిన య • పార ముదాన లయంబునాఁడు లో
కావలిఁ గప్పి ముంచికొని • యవ్వలఁ జెల్లెలికట్ట లోఁకిన్
లోవు పయోధిఁ బోలి జను • లుం దగఁజేరిరి పట్టణస్థలిన్

ఉ॥ చేరి ప్రభుండు నాకమును • చేరెన యంచును రాఘవుండు కాం
తారమె చేరెనంచు విని • తద్దయు డెందము కుంది క్రుళ్ళ శా
రీరము కీఁచు వోవఁ దల • రెఱ్ఱ సొలసెన్ జనమెల్లఁ గాలపున్
మేర తొలంగదేని మర • ణించునె జీవి తపింపుచుండినన్?

సీ॥ ఉసురు లీఁగిన పతి • కొదవని వారును వనుల కేగిన రాఘ • వునకు నల్లె
దుఃఖమున్ చెఱయందు • మూలి తపించెడి వారలఁ గాంచి తా • పసవరుండు
నేనును తలఁపంగ • రాని వంతకుఁ జిక్కి యే చావకీ గోడు • చూచుమంటి
నని సమాశ్వాసింప • నమ్మని పల్కులు, నందఱు బడబాగ్ని • కలికి వేల

తే॥ మీఱకుండు కడలివోలె • నూఱడిల్లి రట నుదారుఁడౌ భూదారు • నాజ్ఞ యనెడి
నాకుల తపఃఫలంబున • నట్టనడిమి రేయి వెళ్ళి నాతని వివా • రింత మింక

## 6 గంగాపటలము (69)

ఉ॥ కాటుక కొండయో? మరత • కస్థిరమో? జలపూర్ణ మేఘమో?
నీటి సమూహమో? యనఁగ • నిర్మల సుందర విగ్రహుండు ఘో
రాటవి త్రోవ మేని జిగి • యర్యమ కాంతిని గప్ప నేగె న
ప్పాటల గంధితో ననుజ • వర్యునితోఁ జరితార్థ భావుఁడై

ఉ॥ లేదన నొప్పు కౌను లవ • లీ లలితాంగము నీలవేణి క్షీ
రోదధివెన్నఁబోలిన మృ • దూక్తులు నిండుతపంబు వంటి శు
ద్ధోదము వంటి శీలమతి • యొప్పు మనోరమతోడ రాఘవుం
డాడటఁ గాంచె మత్తకల • హంసము హంసియుఁ గూడి యాడుటల్

ఆ॥ కాము బాణములను • రాము కోదండంబుఁ గొలిచి గెలుచు కనుల • గలుగు సీత
రాఘవేంద్రు చరణ • రాజీవములు హసి యించు పంకజముల • నంచుఁగాంచె

సీ॥ మకరందమును పరి • మళము గుప్పెడు వేణి, నెలవంక బోల్నొసల్ • గలుగుసుదతి
జానకితో రామ • చంద్రుఁడు మేఘము, మెఱపుతో వచ్చెడు • తెఱఁగు దాల్చి
నాగంబు పిడితోడ • నడచు చందంబున, నడచుచు సుషిర ని • నాద సరణి
తంత్రీ విరావమ్ము • తంబు కరణిఁ దేనె, వలెను చక్కెరపాగు • పగిదినమరి

తే॥ చెలువమైన పల్కులు గల • చిలుకవంటి, సీత కన్నులఁబోలిన • చెంగలువల
మళ్లలోఁ గల్వు తీసెడు • మగువ మిన్న, లూడ్చి కుప్పవై చుటగాంచె • నొప్పమీఱ

ఆ॥ మద మరాళ యాన • హృదయంబు నందించు, కేనిగ్లాని యనుట • యెఱుఁగ కుండ
విభునితోడఁ జనియె • విహరణ లీలల, నించు గానుగలను • కంచుఁద్రోవ.

సీ॥ చిందమ్మ లెక్కుడు • చిందించు నాణిము, త్యములు వెలుంగు ప • ద్మాకరముల
హంసలు నిద్రింప • ననువైన తోఁటల, సంకు పుర్వులుగల • సైకతముల
సుమము లొత్తుగరాలు • సుందర వనముల, వర హేమమును వెలి • వఱచు నదుల
వరివెన్నులను మేయు • వదనంబు లందు క్షీ, రంబులు గార్చు హే • రంబ సమితి

తే॥ తేనెఁ గ్రోలఁగ వ్రాలిన • తేంట్లులేవ, వారి దుముకుచు లేచెడు • వాలుగలను
హంస లట్లు చెలులు మున్గు • హ్రద చయములఁ, గనుచుఁ గోసల దేశంబుఁ • గడచిచనిరి.

చ॥ పరిధి గలట్టి కాంతులను • భాసిలు భూషణ భూష్యతోడ న
ప్పురుషులు మేటి క్షేత్రముల • పొల్పెస లారెడు కోసలంబు దాఁ
టి రయమెసంగ వేదము ప • రించి మహత్త్వము నొందు తాపసే
శ్వరులు వసించు తీరములు • భాసిలు గంగను చేరి రంతటన్.

తే॥ అచటవసియించుమునులుమా • యఖిలవినుత, పాత్రమగుపరమార్థంబు • వచ్చెననుచుఁ
గౌతుకంబున వచ్చి య • క్కమల నేత్రుఁ, గాంచు వేడుక మూఁగిరి • కడఁకతోడ.

చ॥ మతిఁ దలఁపంగఁ బల్కనణు • మాత్ర మడంగని ప్రేమరూపమున్
శ్రుతులకు దాఁటి వెల్గుపరి • శుద్ధ సుధామయ మూర్తి నమ్మని
వ్రతతులు చర్మ చక్షువుల • బంధుర మోదముతోడఁ గాంచి రం
దితర గృహస్థు లెయ్యడల • నేని వరాంగులఁ గాంచుకైవడిన్.

తే॥ వంశ ధరులగు ముని వరుల్ • పద్మనేత్రుఁ, బాల కదలి వెన్నను పోలెఁ • బరిగణించి
కనులఁ ద్రావుచు నెదుటను • గంతు లిడుచు, నిఱచు పాటలతోడ స్తు • తించి నారు.

తే॥ ఇలు వీడిన కొడుకుల • నెల్లవేళఁ, దలఁచి తలరుచు వెదకుచోఁ • దనయు లొకట
వచ్చిచేర నుత్కంఠమై • వచ్చు తండ్రు, లం బలెన్ వచ్చి కనిరి ము • దంబు గొనిరి.

తే॥ అతఁడు నడచు మార్గాయాస • మఱ స్వనేత్ర, బాష్పశుద్ధ జలంబుతోఁ • బరఁగనార్చి
మృదుమధుర వాక్య సుమముల • నెద గదించి, చెదని ప్రేమామృతంబు భు • జింపఁజేసి

తే॥ వనము లందుండి యేర్చి తె • చ్చిన విశుద్ధ, కంద మూల ఫలంబులఁ • గాన్కలిడుచు
విమలతేజః కులంగట • వెలయు గంగ, యందు నీరాడి వేల్చి ర • మ్మారగింప.

చ॥ తగ నిటు ప్రేమ పూర్ణులగు • తాపసు లాడఁగ రామ భద్రుఁడున్
మగువలలోన దీపమన • మాన్యత గన్న విదేహ కన్యతోఁ
బొగడఁగ దేవ సంఘములు • పూర్వము బ్రహ్మ కరంబుతోడ నిం
బుగఁదన పాదముం గడుగు • పూత జలంబుల మున్గె నర్తిజిన్.

ఉ॥ గంగయుఁ గేలు మోడ్చి కడుఁ • గ్రమ మృదూక్తుల నిట్లు వల్కె శ్రీ
రంగ దురన్వలా! ఘన త • రంబగు పాపము గల్గు వార లా
రంగ మునింగి పాప్మ నిక • రంబుల నాయెడ వీడువారు న
న్నంగను తండ్రి పీవిట్టు ము • నుంగ భజించితి నేఁ బవిత్రతన్.

ఉ॥ నాగ కులేశ కంకణుఁడు • నాక నదీ జటిలుండు శైలపు
న్నాగ తనూజయు న్నిలిచి • నందన మందుఖుఁ గాంచుచుండ, నా
భోగ మనుష్యతం దెలుపఁ • బుట్టిన రాముఁడు మున్గి లేచు నా
బాగు రహించె గంగను క • పర్దమునన్ ధరియించు పోలికన్.

చ॥ జనకజతోడ మున్గి నృప • చంద్రుఁడు లేచుట చూడఁదొల్లి శ్రీ
వనిత కరంబు పట్టికొని • పన్నుగ వెండిని పోలు పాల వె
ల్లిని ఫణి తల్పమందు పవ • ళింతను వీడి జగంబుఁగావ లే
చిన రహి దోఁచె బుణ్య జన • సేవిత శైవలిని జలంబులన్.

సీ॥ కౌనును గాంచి తీఁ • గలు వుయి లోడంగ, నసుఁగు నడక కోడి • హంసలొదుఁగఁ
బదముల కెదవడి • పద్మముల్ తేలంగఁ • గనుల కలికి వాలు • గలు తొలంగఁ
బాణిచే నీరు • వన్నియ మీఱంగ, మృదుపదయుగ యగు • మెలఁత మిన్న
పతి భుజంబును కర • పంకజమునఁ బట్టి, పూత తోయంబుల • మునిఁగి లేవ

తే॥ శూలి జటలోని జిల్లేడు • రేలపూల, గంధముం బొంద నట్టి గం • గా జలంబు
కుసుమవేణి క్రొవ్వెదలోనఁ • బొసఁగు పుష్ప, వాసనయుఁ గస్తురియుఁ గొని • పరిమళించె

చ॥ తరఁగలుపై నురుంగులఁ గ • దల్చుటచే నరవొందు వేణి కా
భరము గలట్టి పెద్ద మగు • వం బలెఁ గానఁగ వచ్చు గంగ సం
బరమున సీతఁ దృప్తి పఱ • పం గొని పెంపుడు తల్లి కైవడిన్
దరఁగ కరంబు చాఁచి ప్రమ • దంబునఁ దీర్ఘము లాక్చె నొయ్యనన్.

తే॥ సీత జడయను జీమూత • జాత మపుడు, విరిసి వ్రాలి నీటను మున్గు • విధము దోఁచె
గంగ నడుమను బ్రవహించు • కట్టియమున, యుదక మందున్న పెనుసుడుల్ • కదలెననఁగ

తే॥ సుడులు వడుచు శబ్దించెడు సురసరిత్తు, కనులఁ బోలిన పెనువాలు గలు చలించి
తమకు వెల్లువతో సీత దోఁగి లేవఁ, బాలకడలి లేచిన లక్ష్మి పగిదిఁ దోఁచె.

చ॥ తొలినొక పాదమే కడిగి దోషములెల్లఁ దొలంచి కొంచు ని
ర్మలినతఁ జెంది పూర్ణ మహిమంబు గడించిన గంగ యిప్పుడా
సలలిత దేహమెల్లఁ బెలు చన్ స్పృశియింపఁగ నోచె నింక లో
కులు నరకంబుఁ బొందెదరొ కో! తనయందు మునుంగ భక్తిమై?

తే॥ వార లీరీతి రేవున నీరమాడి, యాశ్రమము చేరి జ్ఞానగమ్యంబు పరమ
వస్తువుఁ దలంచి హుతవహు భక్తిఁ గొలిచి, మునుల ప్రేమంపు టాతిథ్య మనుగ్రహించి

ఉ॥ వేసట కోర్చి తానె యొదవించిన యయ్యమృతంబుఁ బ్రీతి స్వ
ర్వాసులకున్ భుజింపుఁడని రాజిల నిచ్చిన మేటి యిష్ట సం
తోసము తోడ మౌనులిడు దుంపల నాకులఁ దృప్తిగాంచె; నౌ
వీసర వోవునే తనియు పెద్దల కొందఁగఁ జేయు కృత్యముల్?

## గుహుఁడు రాముని గానవచ్చుట.

సీ॥ అంత వేనావల కధికారి దివ్యాప, గాతీరవాసి వి ల్కాంద్ర మిన్న
కుధర భుజయుగుండు కుక్కలు గలవాఁడు, తమ్మటమును జోళ్లు దాల్చువాఁడు
చీకట్లు గుంపులై చేరెసనగ నొప్పు, మెఱుఁగారు నల్లని మేనివాఁడు
తనవెంట సేన రా దట్టంపు గార్మొగు, ళ్లాగి లేచి వచ్చెనా నొప్పువాఁడు

తే॥ కొడుపుఁ గట్టితో దుందుభిఁ గొట్టువాఁడు, పంబ పంబ వాయించు సైన్యంబు గలఁడు
తలిరుఁ బోలిన కెంపు తూపులు గలాఁడు, గజఘటలవంటి చుట్టముల్ గలుగువాఁడు

తే॥ తొడల కంచంపు టరలాగు దొడిఁగినాఁడు, చుట్టు పులితోఁకలను వ్రేలఁ జుట్టినాఁడు
తెల్లనామంబు నుదుటను దిద్దినాఁడు, భల్లుకాజి నోష్ణీషంబు పరఁగువాఁడు

సీ॥ పండ్లు కూర్చిన లీలఁ బరిఢవిల్లెడు గవ్వ, లం గూర్చు హారము లాల్చినాఁడు
ఱాళ్ల కూర్చిన రీతి రవళించు నందియల్, పొలుపుగాఁ గాళ్లకుఁ బూనినాఁడు
చీకట్లఁ గట్టి చేర్చినయట్లు చెన్నారు, సిగయందు పరివెన్ను చెక్కినాఁడు
నూనియఁ ద్రావిన జానున నొప్పారు, నిరుల వన్నియ మేనఁ బొరసినాఁడు

తే॥ పిడువ కిసుబొమల్ మిక్కిలి వెడఁద ఱొమ్ము, గలుగువాఁడు కఱకు తాళకంటకములఁ
బోలు రోమముల్ ముంజేతఁ బొందువాఁడు, పంజరముం బోలు మధ్యంబు పిటల్పువాఁడు

తే॥ పలుకు పొందిక లేకుండఁ బలుకువాఁడు, చలువ కంటెను క్రూర దృష్టులు గలాఁడు
నల్ల చిన్నెల ధనువెగల నడుమువాఁడు, జముఁడు సైతము వడఁకెడు స్వరమువాఁడు

తే॥ బల మతిశయింప నెఱచి చేఁ • పలు భుజించు కంపుగలిగి నవ్వని నోరుఁ • గలుగువాఁడు
కినుక లేకున్న విప్పులు • కెరలునట్టి కిఱుకు బెడిదంపుఁజూపులు • గలుగువాఁడు
ఆ॥ గంగ దరిని గలుగు • శృంగి బేరంబను, నగరమున వసించు , నాయకుండు
గుహుఁడు రాముఁ జూడఁ • గొనకొని తేనియల్ మీలు కాన్కఁ గొనుచు • తీరఁజేరె
క॥ ముదమున బంధులకడఁ దన • ప్రదరంబులు విల్లు వాలు • వదలి వినయమౌ
నెదయందు నెనరు నిండుగఁ • బొదలు గుహుఁడు తపసి వాటి • పొంతను నిలిచెన్
తే॥ వేఁటరుల నాయకుండెదఁ • బ్రేమనిండ గుక్కఁ బోలిన ని సేవ • కుండు వచ్చి
యాజ్ఞ నెఱవేర్ప నున్న వాఁ • డనఘ చరిత! కరుణ నేలు కొమ్మనుచు బి • గ్గఱగఁబిలిచె
తే॥ పిలువ విని లక్ష్మణుండట • వేగ వచ్చి యెవఁడ వీవు వచ్చిన పని • యేమి యనఁగం
గుఱ్ఱరము వంటి మీ సేవ • కుండు గుహుఁడు పాద సందర్శనము చేయ • వచ్చెననిన

చ॥ ఇచటనె యుండు మంచు వచి • యించి పదంపడి లోని కేగి య
న్న చరణ పంకజంబులకు • నర్మిలి మ్రొక్కి విశుద్ధ మానసుం
డు చితుఁడు తల్లికంటె నెన • రొప్పిన వాఁడు గుహుండు నావికా
నిచయము గల్గువాఁడు నిను • నెమ్మిని చూడఁగ వచ్చె నాఁడనన్

ఉ॥ రాముఁడు సంతసించి కొని • రమ్మన రమ్మని లక్ష్మణుండు ప్రే
మామృత మొల్కఁ బిల్వఁగగు • హాఖ్యుఁడు లోనికి వచ్చి యాస నా
కోమలికంబుఁగాంచి తన • కుం గల కన్నులు ధన్యతంగొనన్
నేమము తోడ మ్రొక్కియట • నిచ్చెఁ గరంబున నోరు మూయుచున్

మ॥ ఇటఁ గూర్చుండుమ డాసి యంచు రఘు వం • శేశుండు వాక్రుచ్చ నం
తటఁ గూర్చుండక యెల్ల మీఱిన ప్రియాం • త ర్భూత భావాఢ్యుఁడా
దట మీకోరెముఁదెచ్చినాఁడ మధు మ • త్స్యంబుల్ గొనుండన్న మీఁ
దట రాముం డెం నవ్వుతో ననుఁ దపో • ధన్యాత్ముఁ గాంచుచున్

ఉ॥ పీడని ప్రేమ ఎండి ప్రభ • వించిన భక్తి యె ముఖ్య హేతువై
నూడిదగాఁగఁ దెచ్చినవి • చొప్పడు నెన్నఁగ దుర్లభంబులొఁ
బోఁడిమి కూర్మిచేత నవి • పూతములౌ సుధకంటె నింపులౌ
వేడుకతోఁ గొనం దగిన • వే భుజియించినవార మేకదా!

క॥ మాపిచట నుండి రేపట రేపకడ సురాపగం ద • రింపఁగ వలె నీ
వీపాట వెళ్ళినావం జేపడఁ గొనితెమ్ము సాహ్య • చిత్తమునఁ జేసి!

ఉ॥ శ్యామల దేహుఁ డిట్టులు ప్ర • యంబునఁ బల్కఁ గుహాఖ్యుఁ డిట్లనున్
భూమిని సర్వ సంపదలు • పొల్పుగ నీయవికావె? నీదు తీ

రీమెయిఁ గాంచు కన్నుల స • హించిన కృత్రిమ వేషి నేను నీ
బాములఁ జూచి నిన్ను విడు • వం గలనే? యిట సేవ చేసెదన్.

చ॥ విలుగల వీరులందు ఘన • విశ్రుతుఁడాతని పల్కు వించుఁ దో
య్యలి జనకాత్మజం గని గు • ణాకరు తమ్ముని మోముఁ గాంచి యీ
బలియుఁడు మేరదాఁటి చను • భక్తిగలాఁడని పల్కుచున్ దయా
విలసితనేత్రుఁ డాతనిని • పేరిమి మాకడ నుండుమా యనెన్.

ఉ॥ నావుడు రామ చంద్రునకు • నర్మిలి మ్రొక్కి మునీంద్ర వాటికిన్
గావలియుంచి సైన్యమును • కార్ముకముం దగ నెక్కువెట్టి బా
ణావలి చేతఁ బూని కటి • యందడిదంబు ఘటించి యంబుదా
రావముఁ బోలు కంఠమున • రాఘవుఁ బ్రస్తుతిసేసి నిల్చుచున్.

ఉ॥ రాజ్య సుఖంబు వీఁడి యిటు • రాఁ గతమేమన సర్వలోక సం
పూజ్యుని తమ్ముఁ డంతయును • బోలఁగఁ దెల్పఁగ నానిషాద సా
మ్రాజ్య విభుండు చింతిలి ధ • రారమ పెద్ద తపించియున్ ఫల
ప్రాజ్యత నొందకుండెనని • వందురెఁ గన్నుల నీరు చిప్పిలన్.

చ॥ పరవిన చీఁకులన్ పగఱఁ • బాఱఁగఁ దోలి దిశల్ జయించి యు
త్తరదిశ నిల్చి పాలన ము • దంచిత లీల నొనర్చి కీర్తి సం
భరితముచేసి సర్వజన • మాన్యత పెల్లుగడించి పెద్ద ని
ద్దురగొను నాజికై వడినె • తోయజ మిత్రుఁడు క్రుంకె వెన్దెసన్.

చ॥ ఉరవడి సంజ కర్జముల • నొప్పుగఁదీరిచి రాఘవేంద్రుఁడున్
సురసుధ వోలు సీతయు వ • సుంధర వర్ధిలు శాద్వలంబునం
బొరసిరి నిద్ర కార్ముకము • పూని సుమిత్ర సుతుండు తెల్లవా
ర్వఁజకును కన్ను మూయక క • రంబు మెలంకువ నిల్చెఁ గాపుగన్.

ఉ॥ ఎండలు కాయు హేమగిరి • యింబు చెడన్ విలసిల్లు ప్రాజ్యరుక్
షండము నీను వజ్ర మయ • కాంచన భూషణుఁ డర్కవంశ్య చం
ద్రుండు మృగేంద్ర సన్నిభ గ • తుండగు లక్ష్మణు నిద్రచేర నా
యండ కయోధ్యఁజేరు దిన • మందున రమ్మని పల్కె నామెయున్.

తే॥ వీరనిధి లక్ష్మణుని విధి • మీఱలేక, యతని పాదపద్మములకు • నతి యొనర్చి
యార్య! మీయాజ్ఞ తలఁదాల్చి • యక్లైవత్తు, ననుచు వెడలె నిద్రాదేవి • యచటి నుండి

చ॥ కమల నికేతనాఁశ్రీయగు • కాంత విదేహ నృపాత్మజాతతో
విమలుఁడు రామచంద్రుఁడట • విం బవళించుటఁ గాంచి యెట్టి గా

రములను పొందు వంచితుఁడు • రక్కెస రీతి నిటం బరుండె హా।
యమవిధి యంచు లక్ష్మణుఁడు • నశ్రులురాల్చుచు నిల్చె బొమ్మనాన్.

మ॥ పరికానిం గరియూథముల్ బలయు శే • వం జుట్టు చుట్టాలతో
శరముం గూర్చిన వింటితో గుహుఁడు ప • జ్జన్ లక్ష ం జూచి ని
ద్దుర గావించెడు రాముఁగాంచి మిగులన్, దుఃఖించి కన్నీటితో
ధురముల్ వెల్వడు శైల లీల నిలిచెన్ • సంతప్త సర్వాంగుఁడై.

చ॥ జననములేని భాస్కరుఁడు, స్వర్గ సుఖంబులు చావుపుట్టుకల్
దినగతి బోధసేసి కడ • తేఱు పథంబును తెల్పఁబూని భూ
జనముల మేలు కొల్పుటకుఁ • జయ్యన వచ్చిన వానిఁ బోలి తా
మునుపటి నాఁడడంగి మఱి • పుట్టెను పిమ్మటి నాఁడు తూర్పునన్.

తే॥ పంకజంబులు తేరిపైఁ • బరఁగు భాను, మండలముఁగాంచి వికసించె• మఱియునొక్క
నల్ల సూర్యుఁడనందగు •నాథుఁ గాంచి, సీత మోముఁ దమ్మియు విక • సించె నపుడు

చ॥ పగఱకు భీకరం బయిన • బాహులకుం దగు కార్ముకంబు నొ
ప్పుగ ధరియించు రాఘవుఁడు • పొల్పుగఁ దీరిచి కాల్యకృత్యముల్
మొగసలఁ జేరి నావికుల • ముఖ్య గుహుంగని గంగ దాఁటఁగాఁ
దగు కలమొండు దెమ్మని ము • దంబున నానతి సేయ నంతటన్.

చ॥ మనమున పీడలేని ప్రియ • మందనుఁడైన గుహుండు భక్తిమై
జనకజకుంద మాల సుమ • సాగర నీరద నీలరత్నవ
రునకు, బ్రణామముల్ సలిపి • నొచ్చి కనుల్ వెసఁ గ్రుమ్మరించు వాః
కణములు వెల్లువై పఱవఁ • గై ముకుళించి కడంక నిట్లనున్.

సీ॥ వనమాలి! విను మా ని • వాస మసత్య ప, ద్ధతిలేని శుద్ధ కాం • తార భూమి
అక్షీణ బలమున • నలరారుదుము మేము, భవదాజ్ఞ మిగుల న • ల్పంబ యైన
శిరసా వహించి చే • సెదము మమ్మెల్లర, నీ బంధువులు గాఁగ • నెమ్మి నెంచి
నీ వనవాసంబు • మా వనంబునఁ గడ, పంగ నర్థింతు మా • ప్రభుఁడ వగుచుఁ

తే॥ దేనె కొల్లలు దివ్య లఃర్ధించు నెఱచి, కలవు తోడుగాఁ గుక్కల • కరణి నున్న
యల్పమైన మాప్రాణ చఃయంబు గలదు, వనులు గలవు గంగయును దాఃపునవెగలదు

సీ॥ పట్టుఁ బోలిన చర్మ • పట్టముల్ గలవు భు, జింప నింపగు పండ్లు • దుంపలుండు
నూఁగు లాడుటకు మే • లుయ్యాలలంబోలు, కలముల పైభాగ • ములును గలవు
పరుగెత్తఁదగు కాళ్ల • బలువిండ్లు గల కేలు, గలవు దుస్సాధముఃల్పనువు సేసి
నంబర వీధి ను • న్నట్టి వస్తువునైన, గడియలోఁదెచ్చి యీఁ • గలము మేము

తే॥ విల్లుకొంట్రాజ్ఞ నెఱపేర్చు • వేఁటరులును, బలియు రేఁబది లక్షలు • కలరుమీర
లొక్కదినమేని మాయాకు • టిక్కయందు నిలిచి మము ధన్యు లంజేయుఁ • డెలమితోడ

ఉ॥ ఆతని వేఁడికోలు విని • హర్షముతోఁ జిఱునవ్వుతో హృద
ద్గాతము నిండు ప్రేమ రఘు • వర్యుఁడు పల్కెను వీరశేఖరా!
పూతములైన యాపగల • పుణ్య జలంబులఁ గ్రుంకి పెద్దలం
జేతము రంజిలన్ గొలువు • చేసి యనంతర మిందు వచ్చెదన్

తే॥ అనుడు నింగితజ్ఞుండగు • నాగుహుండు వడివడిం జని యొకపెద్ద • పడవఁ దెచ్చె
జలజనేత్రుండు మౌనుల • సెలవుగొనుచుఁ దమ్ముతోఁ జంద్రభాలతోఁ దరణినెక్కె

ఉ॥ ప్రాణముఁ బోలు రాముఁడు త • రంగిణిలో నడపింపు వే యనన్
నాణెముతో మరాళ మటు • నావ తరంగములందు పోవ ని
స్త్రాణ వహించి తాపసులు • సంకటమున్ భజియించి చింతమై
బాణలి వైచు మిర్యముల • భాతిని వాడిరి రాము పోకకై

ఉ॥ పాలను గెల్చు పల్కుల నృ • పాల తనూజయుఁ దమ్మి నెచ్చెలిం
బోలిన రాముఁడున్ నదిని • పుణ్య జలంబుల మీటతోడుతన్
బోలఁగఁ గేల వారుకొని • పొల్పుగఁ జల్లుచు నుండఁ దెల్లతో
మాలిమి నడ్పు నావ పటి • మం జనెఁ గర్కట మేగు కైవడిన్.

ఉ॥ చందన సైకతస్తని ప్ర • శస్త సురాపగ కాంతి పుంజముల్
చిందుమణుల్ తళత్తళలు • చెంద సుగంధ జలేజ రోచులె
ఱ్ఱందన మొంది తేటగు త • రంగములన్ కరముల్ఘటించి తె
చ్చెం దన దక్షిణంపుఁ దట • సీమకుఁ బ్రేమ పయోధిఁ జేరుచున్

శా॥ ఆర్యుం డావలి తీర మెక్కి ప్రమదం • బారంగ నచ్చో సుహృ
ద్వర్యుం గాంచుచుఁ జిత్ర కూటమునకున్ • దారిన్ వెసం జూపి నీ
కార్యం బారయ నేగు మన్నఁ జెలిమిం • గావంగఁ బ్రాణంబులున్
స్థైర్యం బొప్పఁగ నీయఁ దగ్గ గుహుఁడా • సత్య స్థిరుం గాంచుచున్

ఉ॥ ఏనును వెంటవచ్చెదు న • దృష్టము పొందుదునేని రాఘవా!
కాననమందు దారి నెఱుఁ • గన్ వలఁతిన్ మఱి పండ్లు దుంపలున్
దేనెయు మీకు వేళకాగిఁ • దెచ్చి యొసంగు పవిన్ సమర్థుఁడన్
జాను కుటీరముం జలుపఁ • జాలిన ప్రోడను వెంట వచ్చెదన్

ఉ॥ దుష్ట మృగంబులన్ దిశలఁ • దోలుదు శుద్ధ వనస్థలంబులన్
గష్టము లేక రోసి వెసఁ • గాంతును కోరిన వస్తుజాలముల్

మృష్టము గాఁగఁ దెత్తుఁ బని • మేకొని చేయుదు రేయి వేళ వి
స్పష్టముగాఁ జరింతు నెడఁ • బాయక యుండెద వెంట వచ్చెదన్.

చ॥ పలువగ దుంపలన్ శిఖరి • పై లభియించినఁ గ్లగించి తే
వలఁతిని చాలదవ్వు నడ • వన్ జలమెచ్చట నున్నరోసి శేఁ
గలుగుదు విల్లుదాల్చి మిము • గాతును కంటిని ఱెప్పవోలె నే
నలుకను దేవికిన్ శ్రమము • నందను వీడక వెంట వచ్చెదన్.

చ॥ మురువగు వక్షముం గలుగు • మోహనరూప! యభీష్టమేని సం
బరమున నాబలంబుఁ గొని • వచ్చెదఁ గాచెద నొక్కవేళ ము
ష్కరు లెవరేని శాత్రవము • సల్పి పయింబడిరేని తొల్త నే
నిరవుగఁ దాఁకి ప్రాణముల • నిచ్చెద వేఁడెద వెంటవచ్చెదన్.

చ॥ అనుచు గుహుండు భక్తిమెయిఁ • బ్రార్థన సేయఁగ రాముఁ డిట్లనున్
వినుము సుహృత్తమా! సుగుణ • విశ్రుత! ప్రాణముఁబోలు వాఁడ వీ
యనుజుఁడు నీకుఁ దమ్ముఁడు ల • తాంగి ధరాత్మజ నీకు మిత్రురా
లును భవదాజ్ఞ కేను మఱి • లోఁగిన వాఁడ నొరుండ నొదునే?

చ॥ శ్రమముల నొందు నంతఁ గద • సౌఖ్యము గల్గును జీవకోటికిన్
వెనుక సుఖంబుకై సడుసు • వేధ వియోగముఁగూర్చెనంచు నీ
మనమున నెంచి చింతిలకు • మానుగ నల్వుర ముంటి మయ
క్కొను మనమొప్పు సోదరులు • కూరిమి నైదుగు రైతి మియ్యెడన్.

ఉ॥ కాలవిపర్యయంబునను • కల్గ సిలుంగు ధరింపఁ దోడు కాఁ
జాలిన నీదు తమ్ముఁడు య • శస్కరుఁ డొక్కరుఁ డున్నవాఁడు నా
కేలలి నేరితో నయిన • నేల పగల్ జనియించు? నీవు నీ
ప్రోలికిఁ బొమ్ము నే మరలి • పోయెడు నాఁటికి నిన్ను గాంచెదన్.

ఉ॥ అచ్చటి బాంధవ ప్రతతి • నారయ నీ యనుజుండు గల్గెన
ట్లిచ్చటి చుట్టలం గరుణ • నేలఁగ నేరు గలారు పల్కుమా?
నచ్చిగ నీకు బంధువులు • నాకును బంధులు గారొ? వారలున్
బెచ్చగు దుఃఖ మొందఁ దగ • వే? మదనుజ్ఞను వారిఁ గావుమా.

ఉ॥ ఆనతి మీఱలేక మది • నంగద వీడఁగలేక చూచు వా
రీ నరుఁడేదొ రోగపడె • నేమొ యనం జను శృంగిబేర భూ
జానియు పీడుకోల్పడసె • జానుగ భూషలు దాల్చు కేకిఁబోల్
జానకి లక్ష్మణుండు రఘు • చంద్రుఁడు పట్టి రరణ్యమార్గమున్

## 7. వనప్రవేశపటలము. 45

చ॥ వెడఁగులు పోఁడిమిన్ వలఁచు • వేశ్యల డెందమువోలెఁ జెమ్మ యొ
క్కెడయును కద్దొ లేదొ యని • యేర్పడ శంక వహించు నట్టు ల
ప్పుడమియు నెండఁ బాఱు మిడి • పొందుచు వేసఁగివచ్చువేళ రా
ముఁడు చనుదేర మేఘములు • మూఁగెడు జాడలు దోఁచె మింటిపై.

న॥ గ్రహపతి లేఁత వెన్నెలల • కైవడిఁ గాయఁ దరూత్కరం బను
గ్రహమున నీడ లీన ఘన • కాండము నోన వెలార్వ గంధ సం
గ్రహుఁ డనుకూలుఁడై వెలయఁ • గైపున నెమ్మిఋలాడఁ జారు వి
గ్రహు లెదఁ దాపముం గొనక • కాననవీథిఁ దరించి రిమ్ముగన్.

మ॥ ధరణీజాతను గాంచి రాముఁడను డెం • దం బింపు సొంపార నో
హరిణాక్షీ! యిటు చూడు మింపయిన వ • స్త్రాళుల్ ఘటింపించు మే
ల్వేరవుం జూపెడు నింద్రగోపములు ను • ర్విన్ తేలపూరాసులున్
ధరణీ దేవికి రత్నహార విధి ను • ద్యత్కాంతులం జిమ్మెడున్.

శా॥ రోలంబంబులు పాడ మద్దెల మొగుల్ • మ్రోఁగింపఁ బింఛంబులన్
లీలన్ విప్పినటించు నెమ్మిఋలు నీ • నెమ్మేనసంఖ్యాక నే
త్రాలం జూచుచు నీదు వేనలి క్రియన్ • రాజిల్లకుండంగఁ బే
రీలన్ బర్హము ముద్చుకొన్న వయినం • బింపారగాఁ జూచితే?

చ॥ పరవిన కాంతు లుల్లసిలు • పచ్చని మేనును రాగ వక్త్రమున్
బొరసిన కీర వారములు • పోల శిరీష లతాంత రాజిపై
విరువుగఁ గూరుచుంట గణి • యించిన నీదు ప్రకోష్ఠమందు వ్రా
లు రహిఁ జెలఁగుఁ గాంచితె వి • లోలవిశాల మృగాక్షి! యియ్యెడన్.

తే॥ ఆమ్ర పల్లవ లలిత వ • ర్ణాంగి! చూడు, నమలి పిల్లలు జింక కూ • నలును నీదు
మేనివన్నియ చూపుల • మేల్మిఁగాంచి, తమకుఁ జుట్టంబవియె యెంచి • దాయుచుండె.

తే॥ ప్రసవ రాశిలో నిద్రించి • వచ్చుకేకి, పింఛమునఁ దావి యుండుట • పెట్టగాంచి
ప్రణయ కోపాన దానిఁజే • రంగనీక, తిరుగుచుండుట చూచితే • తెరవ మిన్న!

తే॥ వికచకంకేలి నెట్టని • విరుల యందు, గండుఁ దుమ్మెదల్ వ్రాలఁ బం • గారునూఁదు
బొగ్గులందున లేచు ని • ప్పులను పోలి, వెలయుచుంట వీక్షించితే • విధు విభాస్య!

తే॥ నాగలింగ కలిక నొక • నమ్మిగాంచి, పామవి తలంచి నోటితోఁ • బట్టికొన్న
నరణిఁగవి విరి మొల్లలు • నలుపు చుండు, మందహాసంబు గంటివే • మధుర వాణి!

ఉ॥ కోనల సంచరించు పులి • కూనలు చీఁకటి ముద్దలన్న చె
న్నూనిన హస్తిపోతములు • నొద్దిక గొల్లలయింటి క్రేపులన్
బూనికఁ గూడి వైరమును • బొందక వీడెడు నిచ్చలేక మే
లానిక సంచరించి చెర • లాడుచునుండుట గాంచితే చెలీ!

చ॥ ముడువఁగఁ దగ్గ పూలు పరి • పూర్తిగఁ బూచిన గుత్పసంతతుల్
దొడిగిన పెక్కుకొమ్మలు మ • ధు ప్రసవంబులఁ దాల్చు కొమ్మలొ
క్కెడ దిగి నీరమాడు క్రియ • నింపగు తెల్లని పట్టువల్వకై
వడిఁ దగి తావులం జిలుకు • వారిని మున్గుట చూచితే సఖీ!

ఉ॥ నీటగు వింటి కొప్పు లలి • నెన్నుదు రొప్పు వరాంకుశ్వ? యీ
పాటలి మొగ్గలందు చొరఁ • బాఱఁగ లే కెలదేంట్లు మిక్కిలిఁ
వాటము గాఁగ విచ్చు ప్రస • వంబుల పై కెగఁ బ్రాఁకి యుండుటల్
హాటకమందు నీల మణు • లంటిన చందము దోఁచుఁ గాంచితే

చ॥ పరిమితి మీఱి గ్రాగు మధు • పాయులు కన్నులు తెర్వలేక బ
మ్మెర గొని సొక్కి మార్గము గ • మింపఁగఁ గానక తూల నాఁడు బం
భరములు గాంచి ముఁదుగను • పాటలు పాడుచుఁ బోవ వెన్కఁ జీఁ
కు రహిని నేగు చుఁడె నది • గోకనుఁగొంటివె యంబుజాననా!

చ॥ విరి కయిసేఁత కన్యకలు • వే యలవాటొనరించు నట్లు బం
గరువు హొరంగు రంగరువు • గల్గిన వేఁగిస కొమ్మ లిందు నీ
పరసితె? నీదు ముంగురుల • యందపు ఫాలము నంట సూటిగా
బెరయు వినూత్న పుష్పముల • వేడుకఁ జిందఁగఁజేయుచుండుటల్

ఉ॥ సుందరి తార హారమును • సొంపుగఁ దాల్చు పయోధరంబుపై
నందు హరిద్ర లేపము క్రి • యన్ సుర తావులు విఁబు పెప్పెడుల్
క్రందుగ రాలపైఁ బడుచుఁ • గప్పుట చేత హిరణ్య ఖండముల్
పొందుగ వాఁగా విరిసి • భూస్థలిఁ బడ్డ విధానఁ గన్పడున్

ఉ॥ నీ పదకంజముల్ కలఁగు • నే యని హర్మ్యనఁ ద్రోవ నెల్లెడన్
మోపఁగ మెత్తనౌ కిరణిఁ • బూవుల రాల్చిన చెట్లఁ జూడు మీ
దాపలి పూవుఁ గొమ్మలు సు • ధామయదేహ! యుదుక్కఁబోలి మో
పోపని నీదు కౌనునకు • నొప్పగ లేక చలించె వెల్లనై

సీ॥ వీరజంబులఁ బోలు • నీ పాదముల నీదు, పాదంబులం బోలు • పల్లవముల
ముసరిన తేఁటి గుం • పులను గాంచెదె? చీఁక, టిం బోలు నీవేణి • రీవి యొప్పు

మొగుళులఁ జూచెదే? భుజములఁ బోలిన, యెల వెదుళ్ళగుముల • లలినిగంటె?
శిఖి కోకిలలపాట • లాకేకి గమియాట, లేజింక చూపుల • హేల కంటె?

తే॥ కలికి యను సూనములు నిండఁ • గల్గు కొమలఁ, బజలటనటఁ గూర్చుంట• వర్ణి వ్రాయు
పలు తెగల పూల పక్షుల • విలసనంబు, పజలు తెర చీరలం బోలు • వానిఁ గంటె.

చ॥ అనుగల మొందు జానకికి • నవ్యమ పంక్తుఁ డిటుల్ వచించుచున్
దనియు విహార పద్ధతిని • దారిని చాల నతిక్రమించుచున్
దినమణి యస్త శైలముసఁ • దేరును సిల్పుట గాంచి రాఘవుం
డెనసితి మంచుఁ బల్కెను ము • నీశ్వర వాటముఁ జిత్రకూటమున్.

## రాముఁడు భరద్వాజు నాశ్రమము చేరుట

సీ॥ మించు ప్రేమను మనసు పూ • రించువాఁడు, చిరము తిరముగ సిద్ధికై • చేయుతపము
ఫలము గనుపెట్టంగిన భర • ద్వాజ మౌని, పూని భవరోగ వైద్యుని • గానవచ్చె.

క॥ గొడుగును దండము కుండిక, జడముడులును జింకతోలు • సంధించి వెసన్
దడఁబడక త్రోవఁ గాంచుచు, నడచి యెదురు వచ్చె యోగి • నాథుం డటకున్.

సీ॥ నాల్గు వేదములు ఘ • న క్రమ పదరీతి, నటనంబు సలిపెడు • నాల్కవాఁడు
నలువ సృజించు ప్రా • ణులు సమస్తం బొక, రూపునఁ గాంచు కా • రుణ్యమూర్తి
యెల్ల లోకమ్ముల • సృష్టించు నేర్పున, హరినాభిఁ బుట్టని • యపర ధాత
మునినాథ నికరంబు • ఘన శిరోమణి యగ్ని, పూజ తప్పక చేయు • పుణ్యమూర్తి

తే॥ రాఁగ రాఘవేంద్రుఁడు సుమా • ర్చనము చేసి, ముని పదములకు మ్రొక్కెను • మ్రొక్కి లేవ
నతని గాఢ పరిష్వంగ • మాచరించి, తపసి వేషంబు గాంచి చిం • తయు వహించె

క॥ చిరము ధరనేలఁదగు నీ, తరుణంబునఁ దపసి రూపు • దాలిచి వనులన్
జరియింప వచ్చు కారణ, మఱియఁ దగున యేని తెల్పు • మా? యని యడుగన్

చ॥ జరిగిన వృత్త మాతనికి • స్పష్టముగా వివరింప మౌని నీ
వ్వైరగొని యిట్టి చెయ్వి ప్రభ • వించునె యీ యుగమందు నక్కటా!
జరుగక తప్పునేమి విధి • చక్కటి; గొప్పతపంబు చేయదీ
ధరణి యటంచుఁ జాలఁ బరి • తాపము నొందెను డెందమందునన్.

ఉ॥ పేశల క్రమ వాక్య వర • బింబ సమోష్ఠి విదేహ కన్యతో
శ్రీ కనిభుండవౌ నిను మ • హిం బరిపాలన సేయు మంచు భూ
మీశుఁడు నాహితుండు వచి • యించి యనంతర మిట్లు పంపి జీ
వాళ గడించువాఁడు భువి • నాఁడిఁ బొందక యుండుఁ జెల్లరే!

చ॥ తొడరికి గాఁగ సౌఖ్యమును • దుఃఖము వచ్చుట సాజమేకదా?
పుడమిని దేహి చేయు తన • పుణ్యము పాపము చేత నవ్వియుం
దొడరును మిన్న కిక్కరణి • దుఃఖము నొంది ఫలంబె? యంచుఁ దాఁ
దడవుచు రాముదేహము ము • దంబునఁ దోకొని యేగె నింటికిన్

ఉ॥ పూతగుణుండు యోగికుల • పుంగవుఁడాదటఁ దోడి తెచ్చి ప్ర
స్ఫీత తలంబు చూపి గుఱు • పేశల వాక్కుల నాతిథేయముల్
బ్రాఁతిగఁ జల్పి కాయలను • పండ్లునొసంగి తనూజులం బలెన్
బ్రీతిగఁ జూడ రాఘవులు • వెడుక నిల్చిరి రేయి యచ్చటన్

తే॥ ఇతనితో మనమిట వస • యించు కతన సుగతి గలదని తలపోసి • సుజనహితుని
రాముఁగని భరద్వాజుండు • ప్రేమతోడఁ, గలదు వచనీయమని యిట్లు • పలుకఁదొడఁగె

చ॥ కలవిట నిండుగా జలము • కాయలు పూవులు పండ్లు దుంపలున్
గలిగిన చింతలుం దొలఁగుఁ • గ్రచ్చుఱఁ బుణ్యము వృద్ధి నొందెడున్
గలుగద యింతకంటె మఱొ • కండు ప్రశాంత సుఖస్థలంబు మీ
రలు మముగూడి యుండినఁ గ • రంబు కృతార్థుఁ మౌదు మిమ్మహిన్

శా॥ అంతర్వాహినియౌ సరస్వతియు సూ • ర్యాత్మయసంజాత యీ
ప్రాంతంబందె సురాపగం గలియు ది • వ్యక్షేత్ర మీతావు వా
క్కాంతుండిందు వసింపఁగా నెడఁద ను • త్కర్షించు మా బోటికీ
చెంతంజేరఁగ దుర్ఘటంబు లభియిం • చెం బూర్వపుణ్యంబునన్

చ॥ అనియిటు పల్కు మౌనిఁగని • యంజలితో రఘురాముఁ డిట్లనున్
మునివర! కోసలంబునకుఁ • బుణ్యతలంబిది దవ్వుగాదు మా
జనములు గుంపు గుంపులుగఁ • జక్కన వచ్చి వసింతు రిందు మా
యునికి నెఱింగిరేని యది • యొప్పదు మీరు గ్రహింపఁ జాలరే?

ఉ॥ నావుడుఁ దాపసేంద్రుఁడను • నాయమ యిద్ది నిజంబ యొప్పితిన్
వావిరి నీవనంబుఁ గడ • వన్ దశయోజన దూరమందునన్
దేవతలెల్ల బ్రాంజలి ను • తింపఁగ నొప్పిన చిత్రకూటమే
నీవు వసింపఁ దగ్గదది • నిక్కము నాకముకంటె నింపగున్

తే॥ మరిపమున నిట్టులను యతి • పరునకెఱఁగి, మూవురును చని పిల్లన • గ్రోవులూఁదు
గొల్లపల్లె లుపత్యక • లెల్లఁగడచి యమునఁ గాంచిరి కదఁక మ • ధ్యందినమున

శా॥ సారంగంబులు నీరుద్రావుటలు భా • స్వద్వంశ సింహంబు లా
ప్పారం గాంచి పవిత్ర వాహానికి హ • స్తాబ్జంబుల నొమ్రిచ్చి వి

స్ఫారంబైన ధరా పరాగము విడన్ • స్నానంబు గావించి కాం
తారాహారముఁ గొంచు నిల్చి రగ బృం • దచ్ఛాయ విశ్రాంతికై.

ఉ॥ అవ్వల వాహినిం గడచు • టారయుమా యన లక్ష్మణుండు తా
నవ్వనిఁ గల్గు వంశముల • నంటఁగఁ గట్టి కలంబు చేసి పై
జవ్వనియున్ రఘూత్తముఁడు • చయ్యన నెక్కఁగ రెండు చేతులున్
మవ్వపుఁ దెడ్లుగా ఝషముఁ • మాడ్కినిఁ ద్రోచుచు దాఁటె నన్నదిన్.

తే॥ రాము తమ్ముని భుజ మంద • రంబు తిరుగ, నొక్కప్రక్కనీరంబు తూ • ర్పుదధిఁజేరె
మిగుల జలములు పడమటి • మేరఁజేరెఁ, దెప్పవైశంబ యావలి • దిక్కుఁజేరె.

ఉ॥ నారలు దాల్చియుం ద్రిభువ • న ప్రతిమారులు దంతివైరి గం
భీరులు తీరమెక్కియట • విం బహుదూరము వోయి కొమ్మలున్
వేరులు మాఁడి ధారణియు • వేఁడిమి నొంది కనంగఁ జిత్తమున్
నీరుగఁ జేయునట్టి యొక • నిర్జల భూమిని గాంచి రయ్యెడన్

ఉ॥ జానకి యీభువిం గడవఁ • జాలదయంచు విభుండు చింతిలన్
భానుఁడు శీతభాను చెలు • వంబునఁ జందన శీతలత్వముం
బూనెను మాఁడి నల్లనగు • మోడులు వెంటనె పల్లవించె ఘో
రానల మంత నంబుజ వ • నాకృతి నొందె మనోహరంబుగన్

ఉ॥ వేఁచిన విత్తులట్టి కఱి • వేంద్రపు రాళులు కోసి మెత్తగా
పైచిన పూలఁ బోలినవి • వేఁగిన తీఁగలు నన్చెఁ గోటలం
బూఁచిన చిల్మవోయి సుధ • వొంది భుజంగము లుఁడెఁ దృప్తిమైఁ
దోఁచిన మేఘముల్ గురిసెఁ • దుంపురులన్ భువనంబు చల్లఁగాన్.

తే॥ హింస్రకులగు వేఁటరులు ఋ • షీంద్రులైరి, యాఁకలియె లేక పగవీడి • యల తడవు
పులుల కడఁ జేరి సారంగ • పోతకములు, పాలు ద్రావ సాగిన యవి, భయములేక

తే॥ కొండ చిలువలు క్రూరంపుఁ • గోపమీఁగి, నీటదిగినవి వోలె శాం • తిని వహించె
వంశములుచిటపెటమండు • వరుసమాని, కుందరదనలదాహుల • కొమరుదాల్చె,

చ॥ కసవు పెరింగి పచ్చనగు • కంబళముం బఱపించినట్టి సొం
పెసఁగె మయూరముల్ పురుల • నింబుగ విప్పుచు వేశ్యలంబలెన్
బొసఁగఁగ లాస్యముల్ సలిపెఁ • బోయెడు త్రోవల గండుఁ దుమ్మెదల్
దెసలను వైణికాళి బలెఁ • దృప్తిగ గానముసేసె నయ్యెడన్.

చ॥ ఫలము లకాలమయ్యుఁ బరి • పక్వములై యిల వ్రాలుచుండె దుం
పలు తమ వేళ్లతోడ వెలి • వాఱి కనంబడె భూమియెల్లఁ బూ

వులఁ దరుజాలముల్ సొగసు • పూనిన చానలఁ బోలెఁ; బ్రేమ మ
గ్గలముగఁ గూర్చు శీలమున • కంటెఁ దపం బొకరుండు గల్గునే?

తే॥ బోయ పల్లెయు మునిపల్లె • యాయెఁ గెంపు, వోలె నెడనెడ నారుద్ర • పురుగులొలసె
వృక్షములయందు చింతించు • పెంటులఁ గని, గండు కోయిలల్ ప్రియమున • గారవించె.

చ॥ వెనుకకు వచ్చువేళ విని • పించిన నాధులఁగాంచి ప్రాణముల్
తనియఁగఁ గౌగిలించుకొని • దాడికి నంపిన యావతంబు నె
మ్మనముల కైవడిం గుముల • మాఁడిన యమ్మరు భూమి, గెల్చి వ
చ్చిన ప్రియులం గనం జెలఁగు • చేతములం బలె నయ్యెఁ జల్లనై.

మ॥ మరుభూమిస్థలి దాఁటి మువ్వు రెలరే • మస్నీడు గర్వంబునన్
మఱుఁగన్ గర్జిలు మేఘపాళిఁ గని సం • భ్రాంతాంతరంగంబుతోఁ
గరిణీవారముగాఁ దలంచి గజముల్ • కైసాఁచు నెత్తైన భూ
ధరముం గాంచిరి చిత్రకూటము మునీం • ద్ర ధ్యాన సంవాటమున్.

## 8 చిత్ర కూట పటలము. 56

చ॥ వినుత సురాళికిన్ మనకు • వేఱిమి నొందక యొక్కయాకృతిన్
మొనసి వినిశ్చలం బయిన • పుణ్య పథంబునఁ బోవు రాఘవుం
డనఘుఁడు సీతకా శిఖరి • యందలి సుందర దృశ్య వీక్షచేఁ
బొనరు పరిశ్రమంబు మఱు • పుచ్చుచు నిట్లను నింపపల్కులన్.

తే॥ అలరు బోఁడి! చూడుమ యుప • త్యకతలముల, నేలకులతీవియలును త • మాలములును
నీరదములు వారణములు • వేఱుపఱచి, కాంచరానట్టి కరణిని • కాననయ్యె.

తే॥ కువలయాక్షిరో! కాంచుము • కొండమీఁది,యురణములుమరకతరత్న • కిరణసమితి
బలయ భానుని పచ్చని • వారువములఁ, బోలి విలసిల్లుచున్నవి • పూతచరిత!

తే॥ మదగజంబు లడఁగు పెద్ద • యుదరములను, దొరయు పాములపొరలు వె • దుళ్లయందు
దగులు కొని కదలుచు నయో • ధ్యాపురమున, సౌధశిఖర ధ్వజము లనఁ • జాలెఁగంటె!

తే॥ పగడములు పొదిఁగినయట్లు • ప్రభలు వెలయ, శైల పార్శ్వంబు లందెల్లఁ • బాలఁబోలు
చమర వాలముల్ గదల వి • ద్రుమగిరీంద్ర, జనిత నిర్ఝరిణిఁబోలు • చాయ గంటె!

తే॥ కుపిత సింహ పాటిత గజ • కుంభములను, రాలుముత్తెముల్ మగువల • ప్రణయజనిత
కోపవేళను రాలు కుం • కుమ విలిప్త, మౌక్తికములన నొప్పారు • మగువ కంటె!

తే॥ [illegible] విడిదిగా నెత్తిన • చందమొప్పు, గొనబు కెంపు సొంపులు నింపు • కొండకొమ్మ
హర కపర్దము గాఁగ నం • దలరు ఝరము, లందు పసియించు గంగ నా • నదరెఁగంటె!

తే॥ తళుకు మానికములతోడఁ • దరలు పన్న, గములు చూడఁగా మదకరీం • ద్రములు కెంపు
ముఖ పటంబులతోఁ బోవు • మురువు దోఁచెఁ, గంటివే సుధామయి! కంటి కలువుదీలు.

తే॥ రత్నఘటయుతశమును దా • రంబు మోచు, ననువుఁ బోలు కౌనొప్పు ల • తాంగి! కంటె
ననుచు చందన వనములు • నభము గప్ప, నందు చొచ్చి పోయెదుక్రియ • నబ్బుఁదొప్పు

తే॥ లతలకొమ్మలఁగొని మూఁగు • నళుల దోలి, తేనియంగొని కరిణికి • నానఁ గరము
చేత నందిచ్చు నెలవంకఁ • జెనయు దంత, ములుసు గల హస్తిఁగాంచితే • చకిరుబోణి!

చ॥ మనుపగఁ గర్తయైన హరి • మాయ నెడంగి కనంగ రాకయు
న్ననుకి విశారాఖులైన ముని • నాధులకున్ బయలైన యట్టి బం
గిని తనయందు డాఁగి కొను • కింపురుషావళిఁ గానిపించు పొం
తినిమి వహించెఁ గాంచుమివి • తర్దికలౌ పటికంపు బండలన్.

ఉ॥ ఆడెడు నెమ్మికంటెఁ గడు • నందము నొందిన కోకిల స్వరా!
మోడి యెడదంతోఁ బతుల • మోములఁ గాంచక యల్క నూను నా
చేడెలు తామె వల్లభులఁ • జేరఁ దపించుచు రోయునట్లుగాఁ
బాడెడి కిన్నరాంగనల • పాటల వైఖరి వింటె? యుగ్మలీ!

ఉ॥ ఎక్కుడు విల్లువంటి నుదు • రించుక వంచి కనుంగొనన్ వెదు
ళ్లక్కడ నక్కడన్ దగుల • నారఁగఁ గాలు మరంద బిందువుల్
పిక్కిలి, యందు వేఁటరులు • మేగలి దుంపలఁ ద్రవ్వటించు ప
ల్లిక్కల నిండెఁ జూచితె య • హీన సతీత్వ మహిష్ఠ జీవమా!

తే॥ ఎలమితోఁ గుతుకంబుతో • జలకమాడు, నాఁడు కోతి పిల్లర జంట • బలిమి చల్ల
నెదుటి దరిఁజేరి గడ్డపై • మెసఁగు మొగులుఁ, గలఁచి చలులాడెడు మగ • కపిని గంటె!

తే॥ వల్లిలేనట్టి యప్పులి దీ • పంబు! యెండ, వంచె శిరీష కొంతులు పిప • త్వంబునొందు
కెంపు గుండులు వెవ్వేఱ • గదికి దిగు, పెక్కురవి బింబములఁ బోలి • వెలిఁగెఁ గంటె!

తే॥ శీలమా యరుంధతికిని • చెప్పఁజాలు ఇమ్మహావని వేఁగిస • కొమ్మలెల్ల
స్వచ్ఛ పుష్పంబులం జల్లి • పాదములకు, నెఱఁగి లేప వారిని పోవు • తెలుఁగు కంటె!

తే॥ తలిరుఁ బోణి! యుష్టకరుఁడు • లడవు నెట్టి, శిఖరిపైఁ గొఱ్ఱచేలాచు • చెలువ లరసి
పిట్టలంవోల నోడినెఱ • విసరుమణులు, మింటఁ జుక్కల మాడ్కి గని • మెఱయుఁ గంటె!

తే॥ ఎఱుకు లగురు కట్టెలఁగాల్ప • నెగయు పొగయు, మునుల హోమకుండమ్ములనెగయు పొగయు
గలిసి పెనుగిరి శిఖరంబు • కరచెఁ బర్వె, రాజవదనా! కంటివె యంబ • రంబు దెసను.

చ॥ గుమగుమ గుప్పు వాసనలఁ • గూడిన దీర్ఘ వినీల కేశ భా
రమునఁ జలించు కౌనుగల • రామ! వియన్నదిలోన ఋషి సం

చిందుటలు చూచుచుం పె కృ • శోదరీ! ప్ర, శస్తయతుల మహిమనెన్న • శక్యమగునె?

తే॥ చెట్లఫలముల రాల్చెడు • చెడుగుఱంబు! చెలఁగు కోఁతులు ప్రత్తిని • చిక్కుదీసి
పోఁగుచేసి జందెములకై • మునుల కొసఁగు, చిందుటలు కాంచుచుంటివే • యువిదమిన్న

తే॥ మావి పనస యరఁటిచెట్ల • మంచి పండ్లఁ, దెచ్చి యిచ్చు కీశమ్ములఁ • దెలియఁ గంటె
దుంపలం ద్రవ్వికొని భక్తి • తోడఁ దెచ్చు, కిటుల నిటఁ గంటివే పైడి • కీలుబొమ్మ!

తే॥ కొండపరి జొన్న రాగి కం • కుఱను వెదురు, బియ్యమనుములు నీ నన • చెయ్యివంటి
నోళ్లుగల కీరనికరమ్ము • మళ్ళ నుండి, తెచ్చి మునుల కిచ్చుటఁ గంటె • మచ్చెకంటి!

తే॥ దంతములు తేజరిల్లు మ • దావళముల, నెత్తుకొని మ్రింగు భుజగంబు • లుత్తమజన
ధాతి వినతిమై జటిలులు • పదములూని, త్రొక్కి మెట్లగు టరసి కే • నిక్కలాఁడి!

తే॥ చపలనేత్ర! యీ కొండపైఁ • దపముచేసి • కన్నుల ముదశ్రువులు కుండ • కరణిరాల్చు
వారలకు ముక్తినీయ దే • వతలు వచ్చు, మింటి తేరు లెండలఁ బోలె • మెఱసెఁ జూడు

చ॥ తపనుని మ్రింగి యాజ్యమును • త్రావిన కుంతముఁ బోలి కాలుఁడున్
విపుల భయంబు నొందు కడు • విస్పగు కాటుకకంటి! జానకీ!
ఉపగల సూతికాశ్రమము • నోర్వఁగ రేణువులన్ భరించి త
ద్వీపములు నొవ్వనీకొదవి • తేఱిచి పట్టుచునుంటఁ గాంచితే!

తే॥ నీదు మైకాంతి మెఱుపని • నిశ్చయించి, ఫణులు పుట్టలఁ దూఱుట • పడఁతి! కంటె
జలద నాదంబు సింహ గ • ర్జనమయంచుఁ, గలఁగిపాఱు వారణములఁ • గలికి! కంటె.

చ॥ అఱని గృహస్థ ధర్మమున • యందె తపంబును సత్యమున్ దిటం
పఱచిన యాజి పుత్త్రికుఁడు • పైదలి కిట్టి వినోదముల్ ముదా
కరముగఁ జూపుచుం జని స • కర్మలు తాపసు లందు కొసరా
నెఱఁగి మునీంద్రవర్యులకు • నెచ్చగు విందయి యుండె నచ్చటన్.

క॥ పెనఁగాల నేమి నాఁ జను, నసురుని యుసుఱుల హరించి • యరుణంబయి యా
కసమున వెలసిన చక్రము, పసదోఁచెం బశ్చిమాద్రి • భానునితీరుల్

తే॥ చక్రదారిత దనుజ వి • స్రస్తదేహ, గళితరక్తంబు నా సరిజ • కావి పరవె
వానినొర విఱుగు కోఱ • పల్లువోలె, నంద మొందెను మింటలేఁ • జందమామ.

క॥ సుదతులకు ముఖ వికాసము • పొదలించుచు నలిన పుష్ప • ములు ముకుళించెన్
పదపడిగగనముఁ బోలిన, హ్రదముల రిక్కలను పోలి • యలరెం గలువల్

తే॥ ఆఁడు మగ కోఁతులటమ్రాఁకు • లరయుచేగెఁ, బిడులుపంతులుసానువుల్ • వెదక వెడలెఁ
గాన పిట్టలు నీడముల్ • గానఁ బోయె,- జ్ఞాన వేద్యుఁడు సంజ క • ర్మముల కరిగె

తే॥ కొన్నిపువ్వులు ముడిఁగెను, గొన్నివిడిగె, రామునకు లక్ష్మణునకు సు • ధామయి యగు
జానకికి హస్తనేత్ర కం • జంబు లపుడు, నీరజంబులకై వడి • నేముడింగె

## లక్ష్మణుఁడు పర్ణశాల నిర్మించుట.

క॥ ఉత్తముఁడు సుమిత్రాసుతుఁ, డత్తటి తనుమధ్యతోడ • ననఘుం డుండన్
జిత్తమున నెంచి యచ్చటఁ, దత్తఱమునఁ బర్ణశాల • తగ నిర్మించెన్.

సీ॥ పంగ కట్టల నాటి • పైన నడ్డంబుగాఁ, బొడవైన వెదురులఁ • బొందు పఱచి
నడుమ నిట్రాడుల • నాటి పైవాసంబు, లమరించి పెండియ • లణఁగఁగట్టి
శాక పర్ణంబుల • జానుగాఁ గప్పిపై, బోద కసవువైచి • బొద్దుగాఁగఁ
బ్రక్కల వెదురుల • బ్రద్దల నల్లి మ, ట్టిని మెత్తి మణిగాన • మొనరఁజేసి

తే॥ జానకికి రామునకు వేఱు • స్థలము లుంచి, వాస్తు శాస్త్రోక్తముగ నెల్ల • పనులు తీర్చి
లోనఁ గుంకుమ పంకంబు • తోన యలికి, గోడలకు నదీ రత్నముల్ • కూర్చియంత.

తే॥ బర్హిబర్హ వితానంబు • పరఁగఁగట్టి, కత్తిఁగొనిప్రేలు క్రచ్చులఁ • గత్తిరించి
చుట్టు వెలుగు వెదుళ్లతోఁ • గట్టి నసఁ, బఱచి కొమ్మిరుల్ చల్లి • తల్పం బమర్చె.

ఉ॥ ఈవిధి లక్ష్మణుండు ర • యించిన యొప్పగు పర్ణశాలలో
దేవతలన్ భజించి జగ • తీపతి యంబుజగర్భునందు స
జ్జీవశి నన్ను బోటి జను • లందుఁ జరాచర కోటియందు నొ
క్కవిధి నొప్పువాఁడు తన • యింతినిగూడి వసించె నచ్చటన్.

ఉ॥ మాయను నీఁగినట్టివగు • మానసముల్ శ్రుతులన్ సుధాబ్ధియుం
బాయని తొల్లి పెంపయు స • మస్తము నియ్యెడె యంచుఁ బల్కనొ
చాయను లక్ష్మణుండు కడు • చాతురిఁగట్టు కుటీరమందు సీ
తాయుతుఁడై రఘుప్రభుఁ డె • దం బరితృప్తివసించె నత్తఱిన్.

తే. జానకీ సుమకోమలం • చరణయుగళి, కటు శిలాదల మార్గంబుఁ • గడవ నడచెఁ
దమ్మికిరములు గుడిసె నొం • డంగఁగట్టె, సాయమే లేని వారికీ • జగతిగలదె?

క॥ అని చింతించుచుఁ దమ్ముని, గనుఁగొని యీపర్ణశాలఁ • గట్టెడు పని యెం
దున నేర్చితి వని నిలువక, కను గొలుకుల నశ్రువులను • కార్చెను తోడ్తోన్.

చ॥ పొలుపగు సంపదన్ భరత • పుత్త్రున కిచ్చిన తండ్రి యానతిన్
వెలలి వనంబు చేరి బహు • విశ్రుత ధర్మముఁ గాచి భాస్కరుం
బలె వెలిఁగించు సన్నుతి స • పార్జన చేసితి నంటఁ జెంతె నా
కులతను నీకు మిక్కిలిగఁ • గూర్చితి నంటయె యుక్తమౌ గదా?.

చ॥ అనియిటు రాఘవుండనఁగ • నంతటఁ దమ్ముఁడెడందఁగుంది య
న్నను తగఁగాంచి యిట్టులను • నాయక! యన్నకు సేవసేఁశకై
యనుజుఁడు గల్గు నిక్కమిది • యారయఁ గష్ట ముఖాంకురంబు నా
టనె యుదయించి కాటనె రు • టంబుగ నిల్చుటెఱుంగవేయనన్.

ఉ॥ ఐన నటుండ నిమ్ము పరి • హారము దీనికి లేదు ధర్మమున్
మానుట కూడదంచుఁ దన • మానస మందు తలంచి సేవపైఁ
బూనికయుం గుతూహలము • పూ ర్తిగఁ గలిగిన తమ్ము చింతయున్
లోన నెఱింగి వాని యద • లుం దొలఁగింపఁగ నెంచి యిట్లనున్.

తే॥ ఉర్వి సంపదలకుఁ దుది • యొందు గలదు, భావి సద్గతి యనెడి లా•భంబుతోడి
అతుల సమ్మోద మరయ శా•శ్వతముగాన, దీనఁగొఱఁత యేమున్నది•తెలియుమయ్య

తే॥ తమ్ము రాఘవుఁ డిటు సమా • ధానపఱచి, యమరులు నుతింప వ్రతముల•నాచరించె
తలిసి యగు వసిష్ఠునియాజ్ఞఁ • దరలినట్టి, దూతలేమైరొ వారలఁ • జూత మింక.

## 9. దహనపటలము. (145)

తే॥ సత్య వాక్యులౌ దూతలు • సరగ రేయిఁ. బవలు నిలువక నడచి యా • భరతుఁడుండు
హర్మ్యముం గని తమరాక • యతని కెఱుక, పఱపుఁడని ద్వార్స్థితులతోడఁ• బలికినా

తే॥ భరతు నానతిఁ గొనుచు లో • పలికి వార, లరుగఁ గుతుకంబు మితిమీఱ• నతఁడుకాం
రాజరత్న కిరీట నీ • రాజితాంఘ్రి, యుగళుఁడగు తండ్రి సుఖుఁడయి • యొప్పు

ఉ॥ రాజు సుఖుండనంగ యువ • రాజును లక్ష్మణుఁడున్ సుఖా ప్తికిన్
భాజనులే కదా? కుశల • వ ర్తినులే జనసుల్? తపోధనుం
డోజకు భద్రమే? యనుడు • న్ త్తర మిచ్చుచు దూతలెల్ల వా
రోజ. జెలంగు వారనుచు • నుంచిరి భూపతి శ్రీముఖం బటన్.

తే॥ మఱియు గల బంధువుల యనా• మయములడిగి, తండ్రి పంపిన లేఖ మ • స్తమున న
ముద్రగల దానిఁద్వరగ వి • ప్పుచునె వారి, కిచ్చె న కంబు గా గ ధి • భీష్ట ధనము

తే॥ మొగమునందునఁ జిఱునవ్వు • మొలకలెత్తఁ, బులకములకు శరీరంబు • కులకముఁ
నుబ్బి యగ్రజుఁగాంచనౌ • నుత్సుకతను, విరులవారిగాఁజల్లెను • భరతుఁడపుడు.

తే॥ అరుగఁ బరివార విరతికి • నాజ్ఞయొసఁగి, పెద్దలకు మ్రొక్కి వారి దీ • వెనలఁబొంది
యాయితంబైన తేరిపై • ననుజుతోడ. నెగడి పరివారముల గమ • నింప కరిగె.

సీ॥ ఏనుఁగుల్ ముందుగా • నేగెను రాజ కు, మారులు బారులు • తీరి చనిరి
సాయుధం బగు వీర • సైన్యము నాలుగు, ప్రక్కలఁగ్రమముగా • బలసి వెడలె

నొత్తిరి శంఖముల్ • మొత్తిరి భేరులు, వెలసెను ధ్వజములు • బలిసె ధ్వనులు
మెఱసెను గొడుగులు • బెరసె భూషణ కాంతి, మొరసె నేమి రవంబు • విరిసె సురఁటి

॥ మ్రోఁగె బండ్లపై బహువాద్య • ములరవంబు, మూఁగెఁ దేఁటులు క్రొవ్విరి • మొగములందు
రేఁగె మిన్నుమన్నులము భూ • రేణు చయము, సాగె భరతుండు మిక్కిలి • సంబరమున

తే॥ మించి సకిలించి తలల నా • డించునవియు, నింగికెగుగనున్నను వేడ్క • నెగయునవియు
పోవఁ దగు వేళ కేచేరఁ • బోవునవియు, మొగము వాంచిన ఎ నశ్వ • ములును గదలె.

తే॥ విల్లుకాండ్రు రీఁబెలవారు • మల్లవరులు, చక్రతోమరాసి గదా ప్ర • శస్త్ర హస్తు
లనుభవం బున్న మావటీం • ద్రధిక విజయ, శీలురగు వీరులును చుట్టి • చెంత నడవ.

తే॥ పోటులాడుదున్నలు కోడి • పుంజులును పొ, ట్టేళ్లు కముఁజులు మఱియుఁ బూ • రేళ్లు పెంచు
నట్టి వేఁటరుల్ మనముల • నలరి వాని, వెరిటఁ గొని వేడుకగ ముందు • వెడలినారు.

తే॥ ఉత్తములు కొండ ఉరముల • నొరసికొనుచు, జరగి వాల్చాలునని నిల్చి • జన్మమెత్తి
సురలు జ్ఞానులై యైహిక • సుఖము వీడి, పూర్వనాకలోకముఁ • గొన్న పోల్కినుండ్రి.

తే॥ మధువు చెవులకుఁ గుడిపిన • మాడ్కి వఱలు, మాగధుల కీర్తనధ్వనుల్ • మలసె దివిని
ఒడలికిని ప్రాణముం బోలె • నొప్పునట్టి, మద్దెల రవంబు లెల్లెడఁ • దద్దచెలసె

క॥ భేరి రుతి మించి విప్రా, శీరవము చెలంగె మేటి • జెట్టుల పెను గ
ర్జారవము మించి వందులు, పేరుకొని వచించు వినుతి • పెలుచం దాఁకెన్

## భరతుఁడు కోసలముఁ జేరుట.

క॥ అడవుల నదులను గిరులను, కడచి చెఱకు రసము మడవ • గనిమలఁ ద్రిప్పన్
'వడియు వలుఁద పొలములు గల, పుడమిని కోసలము నేడు • పూఁటలఁ జేరెన్

క॥ పొలములు మడకల నీఁగెను, పొలముల పైరులను నీఁగి • పోయె జలంబుల్
జలజాసన జలజంబున, నిలువక యేగుటయె గాక • నీఁగ్గె విషయమున్

కి॥ పండిన ఫలముల పెలువడి, నిండి రసము దరుఁబాఱి • నిష్ఫలమయ్యెన్
మెండగు పువ్వులు విరిసియు, నెండి దిగువ రాలి వితగ • నెఱసెను మంటన్.

తే॥ పక్వకాలంబు నెఱుఁగు కా • పరులు లేక, పండి వరిపైరు తలవ్రాల్చి • పాఱుచున్న
మావిపండ్లరసము గని • మలను పొరల, మొదలు మురిసి ధాన్యంబులు • మొలకలెత్తె

తే॥ పక్షులాడు పొలంబులఁ • బనులు సేయు, తిల సుమంబులఁ దెగడు నా • సలు గలారు
పనులు సేయరు మదఁతులు • ప్రణయ కోప, మొంది నట్టులు కలుపుఁ • నూర్వకుండ్రి

క॥ చిలుకలు పలుకులు నిలిపెను, పొలఁతులకున్ దూతి పనులఁ • బోవుట తొలఁగెన్
జలుకవు భేరులు పురవీ, ధులలో నుత్సవము లెందుఁ • దొడరక యుండెన్.

క॥ వేఁడవు శిరసులు పూవుల, నాడవు చెలిగములు నీట • నాట నెలవులన్
బాడవు పిల్లనఁ గ్రోవులు, కాఁడవు మాడువుల సువ్వి • కర్ణ బిలములన్

తే॥ వెలయు మొగముబు చిఱునవ్వు • వీడియుండె, మాడుగులు తావిపొగలను • మానియుఁ
దీపములు ప్రకాశములేక • త్రిక్కియుండె, మనవతుల జడల్ సుమములు• వదలియుండె

క॥ పెరిఁగినసంచ్చని పైపలు, చెఱువుల నుదకములు రామిఁ • జెడు లోభుల మం
దిరముల వాకిండ్లపదన్, దిరిగెదు యాచకుల మోము • తీరున వాడెన్

క॥ వేలుపులు దూరి మేగఁగ, నాలుకతోఁ బలుకరాని • నయమున సుక్షే
త్రాళులు పంటల పీఁచఁగ, నేలపొలుపు దక్కె నునుఱు • నీఁగు నొడలు నాన్.

క॥ అటుపంటి కోసలంబును, చటుకున భరతుండు చూచి • తన మదిలోఁ బే
రటమట పడి చెదుగేదో, యిట విన నగు నంచునూర్పు • లెచ్చుగఁ బుచ్చెన్.

క॥ మఱి యేగి సత్య భూపుఁడు, తఱిమెడు నరదంబు కంటెఁ • దద్దయువడిగా
నెఱుకఁ బనిచి యాలో మెఱు, పొఱియని సాకేతమును స • ముత్కతఁ గాంచెన్.

తే॥ వేవెలుఁగుఁగని యబ్బూమి•వేల యెల్లఁ దిరిగి యలసితి నిలువుము • తిందు రమ్మ
వెనుకఁ బోవచ్చునని నిక్కి • పిలుచునట్లు, గాన నగు ధ్వజ పటములఁ • గానఁడయ్యె.

తే॥ ధర పద్ధతి నార్జించు • ధనము నెల్లఁ, గోరు వారలు వచ్చిరై • కొనుఁడటంచుఁ
గీర్తికాములు పిలిచెడు • కేకవంటి, మురజ నిస్వనములు మున్ను • మొనయ వినఁడు

క॥ సధనుల నుండి యిభంబుల, నిధులను దొడ్డగొనువారి • వైఱిఁ గానుకలన్
బుధులును గాయకులును మా, గధులును కొనిపోవు టతఁడు • గానఁడు నగరిన్.

క॥ ఆవుల మద వారణముల, మావులఁ బెన్నిధులఁ బడసి •మన్ననతో భూ
దేవతలు నడచుచుండుట, భూవిభునందనుఁడు కనఁడు • పుర వీధులలో.

క॥ పురమున గాయను లిండ్లన్, ద్విరేఫములు వీణియలును • తీయని సప్త
స్వరములు వెలిపఱుపమి నుం, దరుల కురుల కరణి నొప్పెఁ • దార రహితమై

క॥ కరులను పల్యంకి కలను, హరులను రథములను బండ్ల• నరిగెడు వారె
వ్వరు లేరు నగరవీధులు, శిర విరహిత సికత సహిత • ఝురముం బోలెన్.

క॥ ఉత్తమగుణియగు ం, దత్తఱి నగరంబు కాంతి • యందము చెడుటల్
చిత్తమునఁ దల యను జా॥, యత్తెఱఁగున నుండెఁ జూచి • తే పురి? యనియె

క॥ అరివీర భయద-భుజబలు, పుర సంస్థితి చూడఁ దఁ • బొలుపఱి దామో
దరు సతి వీడిన కలశాం, బు రాశి గతి నొప్పుచుండె • బుధ నుత! కంటే,

తే॥ రత్న భూషండు సింహ ప • రాక్రముండు, నైన శత్రుఘ్నుఁడిరుగేల • నంజలిగొని
యిపుడు గలిగిన దొక దొడ్డ • యెదరు సతము, చెడని పురమును సిరివీడు • చెన్నుదోఁచె

## భరతుఁడు కైకగృహంబున కేగుట.

తే॥ అని పలుకుచున్నయంతలో • స్యందనంబు, నగరుచేర వేగ భరతుండు • దిగి బిరబిరఁ
దండ్రివసియించు నట్టి సౌ • ధంబుచేరె, మనమునందున శంకలు • మల్లడిగొన.

తే॥ ఉద్ధతభుజుఁ డుత్కంఠతో • నుర్వినాథుఁ, దెలమివాడుకవసించు • గృహముసొచ్చి
యెచటఁ గానక యిది యల్ప • హేతుకంబు, గాదటంచు శంకించె మి • క్కుటముగాఁగ

తే॥ జనకు వెదకి విశుద్ధ హ • స్తముల తోడ, వందనముసేయ నుంకించు • భరతుఁగాంచి
యొక్కచేటిక మీతల్లి • యుత్సుకతను, పిలుచు చుండెను రండని • పిలుచునంత.

తే॥ వచ్చి తల్లికిమ్రొక్కిన • వ్యసనరతనయు, మనసు తనివొందఁ దడవుచుఁ • దనదుతల్లి
దండ్రి సేమంబులడుగ నా • తండు వారు, భద్రయుతులని పలికి యా • వలనుకాంచి

శా॥ తల్లీప్రేమముపెల్లగిల్ల గను మ • తండ్రిన్ వడిం గాంచ నా
యుల్లంబల్లల నాడుచున్నయది యెం • దున్నాఁడొ నానేత్రముల్
చల్లంగాఁ గనువాఁడఁ జెప్పఁ గదె ప్ర • శ్నంబింకఁ జాలింపు మే
నొల్లం దండ్రిని కాంచు పిమ్మటనె నా కుత్సాహ మొప్పారెడున్

ఆ॥ అట్లు తనయుఁ డడుగ • నావంత యుల్లమ్ము, నందు వంతలేని • యతివ తెగువఁ
బలికె నసుర బలము • నడఁచిన మీతండ్రి, సురలొసఁగు దివము చొచ్చె • ననుచు.

ఉ॥ భగ్గునఁ గాల్చునట్టి చెడు • వార్త వినంబడ నెత్తివెండ్రుకల్
దిగ్గన నగ్గిఁగాలుగతి • దిక్కఱి వజ్రముచేర రావి భ్రమా
నెగ్గతిఁ గూలు నగ్గతిని • పృథ్విని గూలి చిరంబు శ్వాసమున్
గ్రుగ్గక తెల్విదప్ప నయ • ముం బలె నుండె జనంబు లంకరఁగన్.

చ॥ మొగమున కాంతి గ్రుగ్గ నర • మోడ్చిన కన్నుల నశ్రుబిందువుల్
బుగులుకొనన్ వెసం గొలువి • పూర్తిగ వీనులఁ జొన్పు రీతి నీ
దగరము లాడ నిన్ను బలెఁ • నెక్కొరుదు నెవ్వరు డెందమందు చ
ల్కఁగఁ దఁకొందురే యిటులు • కర్కశ మానస వెట్టులైతివో!

తే॥ గుహుని కంటె సుందరుఁడు గ్రు • క్కుచునులేచి, పరితపించుచు మనసేఁ • గ్రాలివగచి
వేఁడిగా నూర్చి వేదన • వెక్కసముగ, నేడ్చి యేడ్చి తుదిం గాంచ • కిట్టులనియె.

తే॥ ధర్మ నిర్మూలనము చేసి • దయనుచంపి, శీతలోన్నత కరుణకుఁ • జెలుపు చెఱచి
మరణ మొందితి వననీతి • మఱచి నాఁడ, వింతకంటె హెచ్చగు దోష • మెద్ది తండ్రి?

ఉ॥ కోపము ద్రోసి కామమును • గోసి యెడందను లోభసంహతిన్
లోపము చేసి యున్నతిని • లోకము నేలు నుదార! నీప్రజన్
దాపము పాలుచేసి తగు • దారిని నీకయి చూచుకొంటయున్
లోపము గాదె? యద్దియును • లోభముగాక యుదారమార్గమే?.

తే॥ ఇనుఁడు మొదలుగా నీకుల • నృపుల చరిత, ములను క్రొత్తలు చేసిన • పూతచరిత!
భర్గుమేర్వంశమగు విల్లు • భంగపఱచు, ముద్దుకొడుకు నెల్లెడఁ • బాసిపోయి తిట్లు.

తే॥ ఆర్య! ధర్మచరిత్ర! యీ • యవనియందు, మ్రందు వార లేవంశము • నందులేమి
స్వర్గమున మైత్రిగలవారు • చాలఁగలరు, పోదమని యెంచి యేగితే • భువనవంద్య!

తే॥ తడవు చల్లనై యున్న నీ • గొడుగు నీడ, వఱలు పలుజీవు లిప్పుడు • వాడి నిలువఁ
గల్పశీతలచ్ఛాయ నా • కాంక్షచేసి, వెదలి నాఁడ వెనీవార • లిడుమఁ గుడువ?

క॥ శంబరుఁ బోలిన దనుజులు, వెంబడి మతిముట్టిరేమి • విబుధులు కదగం
ద్లంబడి పరుగిడి నీచర, ణాంబుజములఁ బడిరె? దాన • నరిగితె చెపుమా?

ఉ॥ శాత్రవు లిచ్చినట్టి ధన • సంపద విప్రులకిచ్చి దివ్యులన్
బాత్రముగా భజింపఁ దగు • పద్ధతిఁ జేసితి వశ్వమేధముల్
పుత్రులఁ గంటి భక్తి శుచి •పూజ లొనర్చితి వట్టి పుణ్యచా
రిత్రక! యిట్టి వెవ్వియు భ • రింపని నాకముఁ జేరఁ గోరితే?

తే॥ తండ్రి! రాముఁడు వట్టిహ • స్తములతోడ, నున్నవాఁడని నీచేత నున్నప్రభుత
నతని కీయఁగఁ దలఁచి యే • బ్రతికియుండ, సమ్మతింపఁ దనుచు నిట్లు • జరిగితేమి?

చ॥ అరిది తపోబలంబు భువి • నందమి రామున కీవు మోద సం
భరితముగాఁ గులక్రమ స • మార్జిత శీర్షకమున్ ధరింపఁ జే
సి రహిమహోత్సవంబు విల • సిల్లఁగ నీదు విశాలనేత్రముల్
గరువము నొందు భాగ్యమును • కాంచవు గావలయున్ నృపోత్తమా!

క॥ భరియింపలేని చింతను, భరతుం డిటు పనవి పనవి • బాష్పాకులిత
స్ఫురితేక్షణుఁడై, యొకవై, ఖరిఁ దేఱి పచించె నిట్లు • కైకం గనుచున్.

తే॥ తల్లియును తండ్రి గురువును • దైవతంబు, జ్యేష్ఠుఁడును మేరమీఱిన • శ్రేష్ఠగుణుఁడు
రాముఁడే కాన నతని పా • దామలాబ్జ, ములకు మ్రొక్కఁక నామది • యలఁత వోదు.

క॥ అనిన న్విని పిడుగుఁ బో, లిన పలుకుల నారి తేఱు • లేమ కయిక నా
తనయా! జానకితోఁ ద, మ్మునితో రాఘవుఁడు వనికిఁ • బోయె ననంగన్.

క॥ అడవుల నున్నాఁడని తలి, నుడువఁగ విని మ్రింగు కరణి • నొగిలి మఱియు నే
చెడుగులు నే వినఁదగినవి, కడమపడియెనో యటంచుఁ • గంపము నొందెన్.

ఉలికి పడంకి భ్రమసి పడి • యూర్చి యలందురి రాఘవుండు కా
నలకు గమింప దోసములొ • నర్చెనొ? దైవము కోపగించెనో?
యల విధి దార్చె నేమి? మరి • యూద తొలంగెనొ? దేని చేతస
కలఁక తొలంగఁ దెల్పుము క • కావికలయ్యె మదంతరంగమున్.

తే॥ చెడుగులే రాముఁ డొక్కెడఁ • జేయునేని, తల్లి కార్యంబు వోలె భఁద్రదమయగుమ
తండ్రి మరణించు పిదపనే • దాశరథియు, వనుల కేగెనొ? తెలుపవే •యనుడుఁ గైక

చ॥ గురువులఁ దిట్టి కాదు మఱి • కోపము చేతను కాదు దైవముఁ
దొరయదు భానుఁబోలి తన • దొడ్డ కులంబునఁ బుట్టి నట్టి భూ
వరుఁడు సజీవుఁడై వెలయు • పట్టుననే యతఁడేగెఁ గానలన్
ధరణి తనూజతోడఁ దన • తమ్మునితోఁ జరియింపఁ బుత్త్రకా!

చ॥ అని తన తల్లి పల్కుటయు • నాతఁడు దోసము లేద యేని యీ
సునఁ బగవారి కుట్రలును • చోపవయేని విధి ప్రకారమున్
బొనరక తండ్రి యుండఁగనె • పుత్త్రుఁ డరణ్యముఁ జేరుటేల? మా
జనకుఁడు పిమ్మటన్ విసివి • చావఁగ నేల? వచింపవే యెసన్.

చ॥ అనుటయుఁ గైక యిట్టులను • నయ్య వరంబుల నీయఁ గాంచి
వనులకు రాము నంపితిని • వారక రాజ్యము నీకుఁ గూర్చితిన్
దనయ వియోగమున్ మదిని • తాళఁగ లేక విభుండు స్వర్గముం
జెనసెను నీవు నా కనులు • శీతల మంద భువిం భరింపుమా

## భరతుఁడు కైకను దూషించుట

ఉ॥ కైక కటూక్తి కర్ణములఁ • గాఁడక మున్నె శ్రవంబు మూసె వి
భ్రూకుటిఁదాల్చె నగ్ని వెలి • వుచ్చెను కన్నులఁ జిందె నెత్తురుల్
వాకొన మానె రోమములు • వహ్ని కణంబులఁ గ్రక్కెఁ జెక్కులన్
సోఁకె వడంకు కాళుల వ • సుంధర వ్రయ్యఁగ మోఁదె నార్చుటన్.

ఉ॥ కాళుల నేల గ్రుద్దుటయుఁ • గంపము నొందె జగంబు మేరువున్
గాలికి వారిధిన్ సుడియు • గంధ గజంబుల నావకై వడిన్
వేలుపులెల్ల భీతిలిరి • వెక్కస మందిరి దైత్యులయ్యెడన్
గాలుఁడు కన్నులన్ మొగిచెఁ • గల్వల సూడును క్రుంకె జంకునన్

చ॥ కలఁగిన క్రూరకోపమునఁ• గ్రాఁగిన యా భరతుండు పాప పం
కిలయగు నామె తల్లియని • గీల్కొను గారవముం త్యజించి ని
ర్మలుఁడగు రామచంద్రుఁ డెద • మన్నన సేయుఁడ యంచుఁ జంపఁగాఁ
దలఁపక యీసడించుచుఁ బ • దంపడి యిట్లనియెం గటూక్తులన్.

ఉ॥ రక్కసి వీవు నీ చెడు వ • రంబునఁ దండ్రి గతించె నన్నయున్
దక్కన కాననంబులకుఁ • దారెఁ దపం బొనరింప నిట్లు నీ
చిక్కులఁగూర్పు జిహ్వకను • చీల్పక నెమ్మది విన్న యే నిటన్
దక్కెనె యంచు రాజ్యమును • తాల్చిన వాఁడన కానె? పాపినీ!

ఉ॥ శవువు సిగ్గు లేకెదుట • నే నిలుచుంటివి క్రూరరాక్షసీ!
నీవిటులాడ వా తెఱవ • నే ధరియింగొని క్రుక్కకుండితిఁ
ఖావిలయింబుఁ గామ పరి • పూర్ణ గుణుండగు రాఘవుండు నన్
గావలుఁ దంచుఁ దిట్టునని • కాక క్షమింతునె తల్లి యంచెదన్?.

ఉ॥ పూర్వి వచస్సుచేఁ బ్రభుని • గూల్చితి వంపితి వన్నఁ గానకున్
గోరి మీఱ రాజ్యమును • కూర్చితి నాకయి మాయలాఁడి! యీ
తీరొకి ధర్మమార్గమని • తేర్చెదొ? యిట్లగు నేని ధర్మమున్
గోరక యుందుఁ గాక! జన • కూటము కోరఁగ నిచ్చగించునే?

ఉ॥ వంచకురాలు తల్లి చెడు • పద్ధతిచేత సనాతనంబుగాఁ
గాంచిన వంశగౌరవముఁ • గాటికి మున్ భరతుండు పంపినాఁ
డంచు జగంబు దూఱ బిడి • యంబున నా తలవంచి మానముం
ద్రెంచి చరించు పీనుఁగయి • త్రిమ్మరు కంటె మఱేమి గాంతునో!.

తే॥ తగు సతీత్వము ధర్మ ప • ద్ధతిని వీడు, నిన్ను చేపట్టు పతిని ద్రుం • చించి వరముఁ
గాంచు నీవొక పెనుభుజం • గ మవుకాక, కలికివే? మఱి యెవ్వరెఁ • గఱవ నుంటి?

చ॥ పతి యసువుల్ హరించితివి • వ్యాధివొ? కావు పిసాచివీవు; జీ
వితము వహించు కంటె వడి • బిడుట మేలటు దోరు; నన్ను గాం
చిటి స్తన మిచ్చి పెంచితివి • నింద దృఢంబుగఁ గూర్చితింక నే
వినఁబన నేమి గూర్చెదవొ? • ప్రేముడి తల్లివి మిన్న కుందువే?

ఉ॥ సత్యము మీఱలేని జన • సన్నుతు నీవిధు నావిఁద్రావి యీ
విత్య విశిష్టంబయిన • నిందను గాంచి ధరన్ హరించి సం
స్తుత్యముగా సుఖింతు మని • సొక్కితి రాముఁడు వోవ ధేనుకా
పత్యము న్యాయముం జెనయు • పౌరులఁ గాంచియు బుద్ధిమాఱదో?

ఉ॥ ఇచ్చిన మాటయుం గొఱఁత • యెంచక తండ్రి గతించె రాజ్యముం
జెచ్చెర పడుటే తగవు • సేయుట యంచుఁ ద్యజించె రాఘవుం
డచ్చగ వాని తమ్ముఁడగు • నాతఁడు తల్లి కుతంత్ర బుద్ధిచే
వచ్చిన రాజ్యమేలెనని • వాదెడు దూఱును నే భరింతునే?

చ॥ జనకుఁడు తద్వియోగమునఁ • జచ్చె నెఱింగక కైక దెందమీ
యనువున మార్పు నొందఁగల • మక్కట నేనని యెంచి నెమ్మదిన్
జనపరిపాలనంబు తగఁ • జల్పఁ గలాఁడని నమ్మి కానకుం
జనియెను గాక యొండయినఁ • జల్పునె రాఘవుఁడిట్టి పద్ధతిన్.

చ॥ తరణికులాబ్ధిచంద్రుఁడగు • తండ్రి తలంపది యేదియైన నా
గురుత మదీయ సేవనము • కోరి యొనర్చుచు నుండినట్టి యీ
భరతుఁడె లోపలన్ గుటిల • భావము నూనెన యంచు రాఘవుం
డుపవుగ నూహసేయ భవ • దుగ్రపరం బొకటైనఁ జాలదే?

చ॥ వనముల నగ్రజుండు కర • భాజనుఁడై ఫలమూల సంతతుల్
దిన నిట నేను జీవముఁ • దేఁకువ దాల్చి సువర్ణ పాత్ర మం
దున రుచులూరు నోగిరము • తుష్టిగ మెక్కుటఁ గాంచి లోన నే
మని జన మెపడించు? నది • యర్హమె రామపదానుజన్మికిన్?

చ॥ అడవులఁ జేరె రాముఁడను • నంతనె తండ్రి గతించెఁ గీర్తితోఁ
గడలి విసంబు నా నడరు, కైక వచించిన యా క్షణంబె నే
విడువక ప్రాణముల్ చెడుగు • ప్రీల్పక కన్నుల నీరు గార్తుఁ బ్రే
ముడి గలవారి పోల్కి నిది • బూటక మంచు జగంబు పల్కదే?

చ॥ జగములు సమ్మతిం గొనునె? • పాపక యే సపనిందఁ గాంతునేఁ
నగరము నందు లక్ష్మి చర • ణం బిడి నిల్చునె? యేరి తోడ నీ
తగవు తలంచి చేసితివి? • తప్పడు త్రోవల నేరుమాపి రి
ట్టగడు గడించి పాడి మొప • లంటఁగఁ ద్రుంచి యదేమి గొంటివే?

ఉ॥ నీ కొల నోటచే జనకు • నిల్వనఁ జంపిలి [illegible] మాత్రమా?
లోకము నాడి పోయఁ బెను • లబ్ధి [illegible] దోలితిన్
లోకము లేఁ నిల్చితి వి • లరింత బుద్ధి [illegible] దోసమున్
నీకడఁ గల్గునే? తెగడు • నీఁగెడుమార్గము [illegible] గల్గునే?

ఉ॥ ఏనొనరించు కార్యములు • నింకను కొంచ[illegible] న్నులాడఁగాఁ
గానఁగ నిమ్మ; నాయెడఁదఁ • గానక లోకము [illegible] పేయు; నే
జానున నన్ను మోముఁగనఁ • జాలదు? [illegible] వినాశినీ? గరం
బానని వానిఁ జంప దను • న్యాయము చెల్లెను నాదు మన్కికిన్.

ఉ॥ పాపిని వైన నీనరక • భాజనమౌ నుపర [illegible] జేరి నేఁ
దోఁపఁగ నైన పాతకముఁ • ద్రోచి [illegible] రెల్లఁ దీఱ నం

స్థాపిత ధర్మదేవతయె • సాక్షిగ లోకము చూచి మెచ్చ నేఁ
దాపసి వేష మూని బెడి • దంబగు కానఁ దపంబు పూనెదన్.

ఉ॥ జ్ఞానులు పల్కు నీతి వచ • నంబులె యాశితి నింతనైన నీ
ప్రాణము వీడితేని చెడు • పద్ధతి యోచన సేయలేక యే
పూనిన దానవున్ వినుత • పూత చరిత్రవు ధన్యురాలవున్
మానిని వౌదు దీని కిఁక • మార్గము పాచితి మోఁడి గలునే?

భరతుఁడు కౌసల్యా గృహమున కేగుట.

చ॥ అని వచియించి యా భరతుఁ • డంతట నీ చెడు క్రూర కర్మముల్
పనివడిపూని కాఁజలుపు • పాపిని యొద్ద వసింపఁజాల నా
కొనరిన దుఃఖముల్ దొలఁగ • నుత్తమ శీలయుఁ గోసలేశ నం
దనయగు తల్లి పాద నలి • నంబుల వ్రాలెద నంచుఁ జయ్యనన్

ఆ॥ వెరలి యచట రెండు • విధముల కౌసల్య, యడలుచుండ నామె • యడుగుల కడ
పుడమి పగులు పగిదిఁ బడుచు నమ్మా! యని, యవలఁ బలుక లేక • యడలెఁ బెలుచ,

ఉ॥ నాకులు సంతపింపఁ గరు • ణంబుగ నేడ్చుచుఁ బల్కెఁ, దండ్రి యే
లోకముఁ జేరె? సద్గుణ వి • లోలుఁడ గ్రజుఁ డెందు పోయె? నే
కాకినయైన యేను ఎడి • గాఁ జను దెంచుట గోడు చూడనే?
వ్యాకులపాటు దీర్పఁదగు • వారలు మీరలు గాక యన్యులే?

ఆ॥ ధూళి భుజములంట • దొరలుచు మాయన్న, చరణ యుగళిఁ గాంచఁ • జాలనైతి
రాఘవుండు రాజ్యపద మీడఁ దగువాఁడె, వలదు నారు తప్పు • సలిపినారు.

తే॥ పాపు లెల్లరు కులమును • పాడుసేయ, రేను తద్వాక్యము నిశ్చ • యింపలేదు
చెడుగు కడుపునఁ బుట్టిన • చెనఁటి నౌట, మునిని తాపంబు వీఱంగ • మ్రందువాఁడ.

తే॥ చీఁకటులఁగొంగ మొదలుగాఁ • జెలఁగు శ్రీ వంశమున నొక్క • భరతుఁ డుద్భవమునొంది
పూర్వగౌరవ మెల్లను • పొలియఁ జేసి, తార్చెనొక నింద నాచంద్ర • తారకముగ

ఆ॥ తండ్రి దివిని చేరఁ • దనయుండు వనిఁజొర, గనులు లేని పగిదిఁ • గాంచి నాడు
ఘోర దుఃఖ జలధిఁ గూలి తీరముగాన, కందె మునిఁగి మునిఁగి • యడలె నసుదు

తే॥ కులము నోర్చు సతీత్వంబు • కుదురుకొన్న, కరుణరూపిణి కౌసల్య • భరతుఁ గాంచి
రాజ్యముం గోరఁడితఁడు నిర్మలుఁడటంచు, నిశ్చయించి యిట్లనియెను • నెగులుతోడ

తే॥ కలుష మింతయు లేని ని • ష్కపటి వీవు, కైక వంచన మెఱుఁగవు • గాద! యన్నఁ
గట్టువడిన సింగము వోలె • గర్జజేసి, భరతుఁడిట్లను ధర్మదే • వతయు నలుక.

## భరతుఁడు శపథములు సేయుట

సీ॥ ధర్మంబు చెడఁ బ్రియ • త్నము సేయు వాఁడును, కరుణసుంతయులేని • కటికివాఁడు
పరుల వాకిటనిల్చి • పరితపించెడు వాఁడు, పేదలయెడలఁగో • పించు వాఁడు
ప్రాణిహింస యొనర్చి • బ్రదుకు దుష్టాత్ముండు, వామలఁ గత్తితోఁ • జంపువాఁడు
సన్న్యాసులకుఁ గీడు • సాధించు వాఁడును, బవరాన వెన్నిచ్చి • పాఱువాఁడు

తే॥ యాచనాధనమును గొన • నడరువాఁడు, హరిని పరమాత్మ కాఁడను • నవగుణుండు
పోవు గతులకు నేనును • పోవువాఁడ, రామునకు నెగ్గుదలఁచు దు • ర్మతిన యేని

సీ॥ తల్లి యాఁకలిగొని • తపియింపఁ దన పాడు, కడుపు నించుకొనెడు • కావరుండు
తన నాయకుఁడు రణ • స్థలినుండఁ జేవీడి, వెనుకకుఁ బాఱిన • పిఱికిపంద
చరణంబులంబడి • శరణు వేఁడినవాని, శత్రుల కొప్పించు • స్వార్థపరుఁడు
యతి నిందకుండు ని • యతి దూషకుండును, తఱచుగా ధర్మంబు • మఱచువాఁడు

తే॥ సభను కూటసాక్ష్యమువల్కు • సాహసికుఁడు, నొచ్చువానిని మఱియునుఁ నొంచువాఁడు
పోవు దుర్గతులకు నేను • పోవువాఁడ, రామునకు నెగ్గుఁదలచు దు•ర్మతిన యేని.

తే॥ కలన భీతిల్లి మ్రాన్పడి • నిలుచువాఁడు, కొన్న శరణాంకమును లాగు• కొనెడువాఁడు
పోవు నరకంబులకు నేను•పోవువాఁడ, రామునకు నెగ్గుదలఁచు దు•ర్మతినయేని.

సీ॥ అనఘుల యిండ్లకు • నగ్గియిడెడు వాఁడు, నిసుఁగుల వధియించు • నీచగుణుఁడు
ప్రాడ్వివాకుండయి • పక్షపాతము పూను, చెనఁటి వేలుపు నింద • సేయువాఁడు
క్రేపు కృశింపంగ • క్షీరంబుఁగొనువాఁడు, నిల్లడ గొని హరి • యించువాఁడు
తోడని వచ్చు పొ • ల్తుకను దొంగలు బాధ, పెట్టఁ గాపాడక • వీడువాఁడు

తే॥ తోడివారలాఁకొనఁదినఁ• దొడఁగువాఁడు, కృతము మఱచినిందించు దు•ష్కృతి పరుండు
పొందు పాపంబు లేనును • పొందువాఁడ, రాఘవున కెగ్గుదలచు దు • ర్మతిన యేని.

సీ॥ ధర్మమార్గము తప్పి • ధనహర్తయగుతేఁడు, నమ్మించి చెఱచు దు • ర్ణయ పరుండు
తనకుల ధర్మంబుఁ• దప్పిమేగెడు వాఁడు చెల్లినచుచుఁ బీడ• సేయువాఁడు
శరణు చొచ్చిన తన • జనమును బాధించి, పాఱిపోవఁగఁ జేయు • పాలసుండు
కన్యకం జెఱచిన • కడు కావరుండును, గురుపత్ని మోహించు • క్రూరకర్మి

తే॥ తగుదునని రణమాలను • తాల్చి శక్తి, కొలది పోరక పాఱు భూ•తల విభుండు
పోవు దుర్గతులకు నేను•పోవువాఁడ, రామునకు నెగ్గుదలఁచు దు • ర్మతినయేని.

సీ॥ మంచి వంటక మొంటి • మ్రెఁగుకవలెఁ దన, కడుపుచూచు కొనంగఁ•గతుకువాఁడు
క్లీబుఁడాయన సిగ్గు • కెరలించి తనకృత్య, ములను తొల్లిటి యట్ల • సలుపువాఁడు

పెద్దల పలుకులఁ • బెడ చెవినిడువాఁడు, పరుల దోషమె వెలి • పలుకువాఁడు
నిర్దోషవంశంబు • దుర్దోషయుతమంచు, వ్యర్థకల్పనసేయ • నడరువాఁడు

తే॥ కలపునకు బీదలన్నంబు • చెఱచువాఁడు, జనుల నోరూర భక్ష్యముల్ • దినెడువాఁడు
పొందు దుర్గతు లేనును • పొందువాఁడ, రామునకు నెగ్గువలుకు దు • ష్కృతినయేని.

తే॥ అస్త్ర శస్త్ర కార్యంబుల • వ్యర్థపఱచి, శిబి వినస్థ శరీర ర • క్షణముఁ గోరి
దయ దలఁచి యడలిచ్చు జీ • ద్రవ్యుఁ దింకి, చోటు నాఁడొందు గతినాకు • నొసఁగాత

తే॥ శరయనని పల్కితపియింపఁ • జేయకుండ, నుస్నుఁడి యితునని చెప్పి • యిరవు యొకని
పలుకుబుల్ ద్రిప్పి యలయించు • పాపిగతికిఁ, బోవు వాఁడ రామునకెగ్గు • పూనియున్న.

తే॥ పగిలు గెలుచు ఖడ్గము కేలఁ • బట్టివెళ్ళి, సిత్యరోగాస్పదంబయి • నీచులూరు
నొడలిపై నాస నుపతులు • తొడరి నవ్వఁ, బగలు కడఁగు దుర్గతులు నా • కిగునుగాక

తే॥ వనములను గుళ్ల పరిమళ్లు • పలువియుండు, తన విలాసిని పరరాజు • లనుభవింప
సంకెలల పాదముల తోడి • శత్రునెదుట, నిలుచు హీనగతులు నాకుఁ • గలుగు గాక

తే॥ ఆపిశాచ కార్యంబులే • నడసియున్నఁ, గుక్కనై రోత కూడు సి • కుష్ఠువొంది
చదిసి చత్తునుగా నప • జ్ఞుల కడరు, గూడ్చువాని గతులు నాకుఁ • గొలుగాక.

చ॥ ఇటు లకలంక మానస మ • హీన గతిం దెలిపించు వాక్యముల్
పటుతర రీతిఁ బల్కి దన • పట్టి సుఖంబుల నీఁగి యేగి పి
మ్మటఁ జనుదేరఁ గాంచు గతి • మానిని తృప్తివహించి యాతనిన్
దటుకునఁ గౌఁగిలించెఁ బరి • తాపముఁగూర్చితి నంచుఁ బల్కుచున్

తే॥ పరమ పూత చేతస్కుఁడౌ • భరతుచెయిది, కైక క్రౌర్యంబు కౌసల్య • గనియంత
స్తన యుగంబున దుగ్ధంబు • జాలువాఱ, శోక మోర్వక మోహమూఁడ • స్రుక్కిమేడ్చె

తే॥ తలఁపఁ దలఁప మనసుఁ గ్రుంగి, తలరి కరఁగి, పసవు నాయన యుత్తమ • పావేంద్ర!
మీకుఁ బంబున నిసువంటి, మేటిగుణులు, పుట్టలేరని దీవించి యుప్పె తడవె.

తే॥ చిన్నతమ్ముఁడు మఱిమఱి • చిఱిమి లేచు, శోకమున విక్లబుండయి • సురిఁగి తల్లి
చరణముల వ్రాలఁ గౌసల్య • సరగనెత్తి, వత్సలత మీఱ నూరార్చె • వానికుంప

క॥ అత్తఱి వసిష్ఠుఁడచటికిఁ, జొత్తెరఁగఁ గాంచి తండ్రిఁ • జూపంగదె యో
సత్తమ! యని పదములఁ బడఁ, జిత్తము కలఁగంగ భరతుఁ • జేచ్చెనుఁ బమునన్

దశరథునకు శత్రుఘ్నుండు దహన సంస్కారాదులు సేయుట.

క॥ నాయన! మీనాయన చని, యీయెడ కీరేడుదినము • లేగెను పుత్త్రుల్
చేయంగఁ దగిన విధులం, జేయుదు గాక నుదుఁ దల్లి • చేయుమ యనియెన్.

ఉ॥ ఆనతి యిచ్చు తల్లిచర • ణాబ్జములన్ శిరమందు చేర్చి య
మ్మౌని కులేంద్రు వెంటఁ జని • మానుగ ధర్మముఁగావ జీవముల్
దానముసేయు ధీర విను • తండ్రి సనాతన ధర్మమూర్తి నా
జానగు తండ్రి దేహమును • జాలి దగుల్పడఁ గాంచె నొక్కచోన్.

కని ధరఁబడి పొరలుచు రో, దన మొనరిచి యంతఁజిన్ని • దపుఁ జాయను పొం
దిన మేనిని కన్నీటన్, మును ము న్నాడించి పూత • ముగఁగావించెన్.

వేద విదులు పెను చింతను, భూదారు క శేబరంబు • పొలుపగు రవముల్
మేదురముగ మ్రోఁగఁగఁగొని, యాదట బంగరు విమాన • మందుంచి రొగిన్.

భూరమణ సమూహంబొక, తీరమువలెఁ దోఁచి కుమిలి • తెరలుచు నుండన్
పౌరులు జలనిధి ఘోషము, తీరున రోదించిచుట్టు • తీసిరి గుములై.

సారథులు హితులు మంత్రులు, వీరులు సేనాధిపతులు • విరివిగఁ గనులన్
నీరము గార్చ విమానము, వారణ పృష్ఠమున నుంచి • పదిలించి రొగిన్.

భేరీకాహళ మురజా, ద్యారవములు జాలి పుట్ట • నడరుట చూడన్
పౌరాంగనాళి కన్నుల, వారక మోఁది కొని యేడ్చు • వైనమ తోఁచెన్.

హరులు కరులు తేరులు భూ, సురులు నృపులు నడవ రాజ • సుదతులు వెనురా
నర విభుని ప్రేతముం గొని, సరయూ తీరంబు చేరె • జన సంచయముల్.

చేరి మహిసురులు తెలిపిన, తీరునఁ గార్యంబు లెల్లఁ • దీరిచి భరతా!
గారమ్మ జనకునకు సం, స్కారము లొనరింపు మనుడు • సంయమి యనియెన్.

నీతండ్రి కైకవలనన్, చేతము రోయంగఁ గలఁకఁ • జెంది ప్రతినమై
నతోడి వావి త్రెంచెను, ప్రేతక్రియఁదీర్పఁ దగవు • వీడుము వత్సా!.

ఉ॥ నీవలనన్గులానుగుణ • నీతి విపర్యయ మందె నన్న యా
భావము తెల్పునట్టి వహి • వావిని త్రెంచెన యన్న తోడనే
తా వికలత్వ మొంది ధరఁ • దాజెను; రాజటు వల్కెనన్న దీ
పావన చిత్తముం దెలిసి • పాల్పడునే యిపు డట్టి జాసకున్?

చ॥ ముని యటు పల్కు మాటవిని • మూర్ఛిలి కొందొక తేటి మేలు మే
లని కడు నూర్చి వెక్కి మది • నావఁగఁ బూనిన నాఁగకుండఁ బొం
గిన పెను వంతచేఁ గుమిలి • కీడ్పడి గద్గదిక స్వరంబుతోఁ
బసవుచు నెల్ల వారు వినఁ • బల్కెను రాలు కరంగు జాలితోన్.

చ॥ తుదకిటఁ బ్రేత కృత్యములఁ • దూకొన నర్హుఁడఁగాని నీచుఁడన్
బదపడి రాజనై ధరణి • పాలన కర్హుఁడ నైతిఁ జెల్లరే!

పొదలిన సూర్యవంశ్యులగు • పూర్వులలో నొకరుండు నావలెన్
గొదరిన యిట్టి కీర్తిఁ గయి • కొన్న మహాత్ముఁడు కానవచ్చునే?

ఆ॥ నిలిచి పచ్చు మావ • సుంధరాద్యులు తమ, విమల ధర్మముననె • వేల్పులైరి
ఎన్న నేను పుట్టి • పిన్న నాఁదేనడ, పీస్గునైతిఁ దనువుఁ • బెంచి చెడితి.

ఆ॥ పొంచి పెంచు తల్లి • గావిలిఁగూర్చిన, మేలు బళిరె! యెట్టి • మేల్మి గలది?
దిందు లేక గాచు • టెంకాయ గెల గూబ, ద్రొక్కు కాయ రీతిఁ • దోఁచినాఁడ

తే॥ ఏలు విధంబుల నీరీతిఁ • బలుకు చదలు, భరతు నూఱడఁ బల్కి త • ద్వంశ గురుఁడు
తదను జన్మని గొని చేయఁ • దగిన కృత్య, ములను క్రమముగా జపపించి • పూర్తిచేసె

చ॥ చలనము నొందు పూలతల • చందము నొందిన రాణులెల్ల భూ
షలును తదంగముల్ మెఱయ • శైల మయూర చయంబు పత్త్రిముల్
వెలయ నికుంజముల్ తుఱగ • లించు వనంబునఁ జొచ్చు కైవడిఁ
జ్వలనము నందు చొచ్చిరి వె • సన్ మనముల్ పరితృప్తిఁ జెందఁగన్

ఉ॥ తమ్ములవైఖరిన్ శశివి • ధమ్మున రాణుల మోము లంద చం
దమ్ములు దోఁప వహ్నియుఁ ము • దమ్మునఁ జందన శీలిగాఁగ డెం
దమ్ములఁ దృప్తిమైఁ బతిప • దమ్ములతోడ గమించు స్త్రీలు చే
తమ్ములు చల్లఁగాఁ గొను ప • దమ్మను పొందిరి కాంక్ష తీరఁగన్.

తే॥ వారలకుఁ జేయఁదగు క్రియల్ • వరుసఁ జేసి, చురుగు దెంచెను శత్రుఘ్నుఁ • డన్నకడకు
నాఱుదూఱను నాకుటా • యాద ఱావ, భరతుఁడింటికి నేఁగెఁ బె • న్వనట మునిఁగి.

తే॥ భరత శత్రుఘ్ను లంతటఁ • బది దినములు, యుగములుం ద్రోచి పట్టుల • నొగిలి త్రోచి
పైతృకంబుల విధ్యుక్త • భంగిఁ గొఱఁత, పడక పూర్తి గావించిరి • కడఁక చెడక

చ॥ నియమిత పైతృకం బెదుట • నిల్చి యొనర్చు వసిష్ఠ మౌని య
వ్యయ గుణశాలులైన ముని • వర్గముతో భరతుం గనం జనెన్
నయ విదులైన మంత్రులును • నాధుఁడు లేని విలాతి దుఃఖ సం
క్షయములఁ బొందు నంచతనిఁ • గానఁగ వచ్చిరి వృద్ధపాళితోన్.

## 10 ప్రయాణ పటలము. 58

క॥ కరుణానుస్థిర చిత్తులు, వరమంత్రులు మౌని జన వి • భావసుఁడు సభన్
బరఁగునని సంతసంబునఁ, బుర వృద్ధులతోడ వచ్చి • మ్రొక్కిరతనికిన్.

క॥ సిద్ధులగు మునుల తోడఁ బ్ర, సిద్ధులు పండితులు నృపులు • సేనాపతులున్
వృద్ధులు కవులును గాయకు, లిద్ధగుణుని భరతు బలసి • యేర్పడ నుండన్.

క॥ మతిమంతుఁడగు సుమంత్రుఁడు తతమతి భరతునకుఁ దనదు • తలఁపు విశదమౌ
వితమగు ముఖ చిహ్నంబులఁ బ్రతిభాశాలియగు గురుని • వదనముఁగాంచెన్

తే॥ మంత్రి సంజ్ఞలను వసిష్ఠ • మౌని నోటఁ గాక సంజ్ఞలతో బాగు • గా నెఱింగి
ధరణిఁ బాలింపు మిదినీకు • ధర్మమనుచుఁ, దెలియునట్లుగ నిట్లని , పలుకఁ దొడఁగె

చ॥ అరయుము నావచస్సు సుగు • ణాకర! విప్రులు వృద్ధులున్ మునుల్
నరపతు లాదిగాఁగల జ • నంబులు నీకడ కేగుదెంచుటల్
తిరముగ నీతియున్ దగవు • త్రైవ్వక నెక్కొనఁ జేయుకోసమే
విరివిగఁజెప్పనేల? యిది • విశ్రుత పద్ధతి నీవెఱుంగవే?

చ॥ ధరణిని ధర్మమున్నెఱయఁ • దాల్చుట క్షత్రియధర్మమంచు నీ
వరయవె నీమనంబున? స • మంజస రీతిగ దీజగంబునం
బరమున సౌఖ్యమిచ్చు నిది • పావన మానసులైన వారలే
జరపఁగఁ దగ్గకార్యమగు , సజ్జన సన్నుత సద్గుణాన్వితా!

తే॥ అరసి చూడంగ రాజు లే • నట్టి భూమి నలినమిత్రుండు లేని ది • నంబు సరణి
కలువ చెలిలేని రాతిరి • కరణి జీవుఁ డెదలు నొడలి వడువునగు • నృపకుమార!

తే॥ నాకలోకంబునను దైత్య • లోక మందు, నిఁకను గల లోకములయందు • నెన్నఁడేని
జీవులను గావ నొకఁడేఁడు • చెలఁగఁడనుచు వినఁగరాదింత దాఁకనుఁవిమలచరిత!

చ॥ క్రమముగ పశ్చయించి మతి • కాంచిన బ్రహ్మ సృజించినట్టి స్వ
ర్గమునను భూమియందును సు • ఖ స్థితిఁ బొందిన జీవరాశియున్
సమసెడు ప్రాణికోటి యగు • సర్వచరాచరముల్ విభుండు లే
కమరిక నుంట యే జనులు • నారయ రప్పుడు నిప్పు డెప్పుడున్

మ॥ హరినాభీ కమలోద్భవుండయిన బ్ర • హ్మందొట్టి పుణ్యాత్ములె
ల్లరు కీర్తించు యశంబుఁగాంచి సుజనో • ల్లాసంబుగా నీ ధరా
తరుణిం జేకొని కాచిరింత దనుకన్ • ధన్యాత్మ! యీనాఁడు కా
పరుల న్నీఁగి పయోధిలోఁ బగులు నా • వంబోలి యల్లాడెడిన్

మ॥ తనయా! తండ్రి గతించె నన్నయును కాం • తారంబులం జేరె నీ
జనయిత్రీ వర సంగృహీత ధరణీ • సామ్రాజ్య మిద్దాని నీ
వనుకంపా గుణసంపదన్ మనుపుమా • యక్షీణ దక్షామతిన్
జనముల్ మంత్రులు మేముఁగోరిన యభీ • ష్టం బిద్దియే నావుడున్

తే॥ కనులనిండ బాష్పమ్ములు • గ్రమ్మనతఁడు, గరళముం దినుమంచు ని • క్కచ్చిపఱుప
వడఁకు వానికంబెను గొప్ప • యదలుపూని, గడగడ వడంకి పుడమిని • పడియె సురిఁగి

ఆ॥ వరఁకి వరఁకి నాల్క • తడఁబడ నయనముల్, ముడుగ నాఁడువారి • మొగిని వగచి
ప్రాణములును వాడఁ • బడపడి తెలివొంది, రనతలంపు దెలియ • ననియె నిట్లు.

ఆ॥ మూఁడు లోకములకు • మూల కారణమగు, జ్యేష్ఠుఁడుండ నేను • శీర్షకంబు
తొడువుటరయ గురులు • నొడువు ధర్మంబయ్యె, పల్లి కార్యమందు • తప్పుగలదె?

ఆ॥ దుష్టురాలు కైక • దొసఁగు సమర్థించి, యురమునకు మిచె • యొదవి వలుక
నడుమ రెండు యుగము • లెడలఁదు సుమప్పి, యలిమె వాపెననుచుఁ • బలుకుటిపుడు

ఆ॥ రాజసభను నిలుచు • రాజిత గుణలావ!, నలువ మొదలు నేఁడు • నరుల పలుకు
నన్న యుండఁ దమ్ముఁ • డవని న్యాయంబున, నేలినాఁడుండె • నేని చెపుఁడ.

ఉ॥ నీలి తొలంగకుండు పెసు • నేమ మిదేయని మూవలింపిసన్
భూతలమున్ భరించుటకుఁ • బూని యొడంబడు వాఁడనే? మహీ
నేతగ రామునే యిటకు • నేఁదొడి లెచ్చెద మత్కులంక్రమా
నీత కిరీట మాలనికె • నెక్కొన నిచ్చెదఁ జూడుఁ డిందఱున్.

శా॥ నాచే నయ్యది కాదయేని వని న • న్నం గూడి పద్నాలు గేం
డ్లా చందంబున నాలిలున్ జదలునొ • య్యందాల్చి తృప్తిం దపః
శ్రీచెన్నారఁ జరింతు నడులు మతే • రీతిం బ్రశంసింపఁ డెన్
మీచెంతం దృఢియింతు జీపములఁ జూఁ • డీ యంచు వాక్రువ్వఁగన్.

చ॥ భరతుని పల్కులన్ విని స • భాసదులెల్ల నెబాసు! మేదినీ
వరుఁడట మున్నె రామునకుఁ • బట్టముఁ గట్టఁగ సమ్మతించెఁదం
డిరి సురభూమిఁ జేర పగ • ఓంది ధరారమఁ ద్రోచిపుచ్చి తు
ర్వపు నిసు వోలె మీకుల యు • వ ప్రపంచొకరుండు గల్గెనే?

తే॥ పుడమిఁ బాలించి ధర్మంబు • ప్రోవ వన్న, ములను కావింప పెంచంగ • పలయునేమి?
ఈ చతుర్దశ భువనంబుఁ • లెడలి చనిన, నీదుకీర్తి సుస్థిరముఖ • నెగడుఁ గాక.

తే॥ అనుడు భరతుండు వసిష్ఠుఁ • దప్ప వలిపి, రాజపదయోగ్యుఁడైన శ్రీ • రాముఁదోడి
తేర నరిగెద మని వాటి • ఫేరి మ్రోగఁగఁ, జేసి సైన్యంబు పయనింపఁ • జెప్పు మనియె.

క॥ శ్రీకరుఁడు భరతునాజ్ఞ గు, ణాకర శత్రుఘ్నుఁడంత • నరయంజేయన్
శోకమునఁ బడిన ప్రజ • లా కమ్మలపఁ బోల లేచె • బటు ఘోషంబున్

ఉ॥ ఇంద్రియ నిగ్రహాత్ములు మ • నీశ్వరు లాదిగ భూమిఁ గల్గు రా
జేంద్రులు వీరులున్ జనులు • నెల్లరు రాముఁడు రాజటంచు ని
స్తంద్ర విఘోషణంబు విని • పెద్దయు నార్చిరి మోద సంభృతిన్
సాంద్ర నినాద మద్ది ప్రజ • లంబుల జుట్టు సురామృతం బొకో!

మ॥ భరతుం డన్నను కేతనాంచల పటు • ప్రాంచన్మహాభోగ సం
దరమౌ నీ పుటభేదనంబునకు మో • దంబారఁ దో డ్తేరఁగాఁ
దురగ స్యందన దంతి వీర భట సం • దోహంబు వే లెమ్మనన్
బుర పాథోనిధి కట్టి దాటు వెనసెం • బూర్ణేందు జన్మంబు నాన్

ఉ॥ ఎన్న యుగాంత కాలమునఁ • నేడ్తెఱ లేచు పయోధి సప్తకం
బన్న యటుల్ చమూ సమితి • యానము సేయుచునుండఁ గాంచుడున్
మున్నుగఁ గైక యాస చెడి • మూలము ముట్టఁగఁ బెల్లగిల్లె; నా
మన్నని యందు పౌరులకు • మక్కువ పొంగఁ దొలంగె నంగదల్,

తే॥ కరులు తేరులు తురగముల్ • ధరణిఁగప్పె, ఘన పతాకలు గగనంబుఁ • గప్పివైచె
వాహినీ పాద ఘట్టనన్ • వడిగలేచు, రజము సరసిజాసనుని నే • త్రములఁగప్పె

తే॥ రుద్రుఁడీలోకములనెల్ల • రుత్త చేయు, దినమునం దోచుధ్వనికంటెఁ • దివిరెమ్రోఁత
రాముఁగాంచు నుత్సాహంబు • ప్రబలమైన, యానకంటెను సైన్యమ • త్యధికమయ్యెఁ

తే॥ రాజ్యమును వీడినట్లె పు • రంబు వీడి, వృక్ష సంకీర్ణమగు మహా • విపినమునకు
చామయనుమించుతోఁ జను • రామమేఘ, మిదియ యనఁ గరేణువులతో • నేగెఁగరులు

మ॥ అరవిందంబుల యందమ్ము దెగడు స • మ్యక్పాదలైనట్టి సుం
దరులన్ [illegible] కరేణు [illegible] వే • [illegible] వీడి యా
తరుణీ [illegible] • [illegible] సుం
గరి [illegible] • [illegible]

తే॥ వేదనం గూర్చు భాస్కరు • వేఁడినార్ప, జలద శీకరంబుల వడిఁ • జల్లుచుఁ జను
తఱచు ధ్వజ పటావళులు కో • దండ పాణిఁ, గనక, చింలించు కాంతల • గతిఁజలించె

ఉ॥ ఉన్నత మూర్తియైన రవి • యొక్కటఁ జెక్కగు రూపు బొంది పైఁ
దిన్నగఁ బూర్ణచంద్రు లరు • దేరఁగఁ గంధర సంఘ మురి పైఁ
బ్రన్ననఁ బర్వి యొక్కమొగి • బంధుర రీతిఁ జరించె నన్న యా
చెన్నున వెళ్లినారు నృప • శేఖరు లెల్ల మదేభపాళిపై.

మ॥ ఒక పాథోనిధి తేర్లపై వెదలె వేఱొ • క్కం డిభశ్రేణిపై
నొక నీలాంబుధి వాజి సంచయముపై • నొక్కబ్ధి యిద్ధాత్రిపై
నకలంక స్థితిఁ బోవఁ గాహళ మృదం గాది ప్రణాదంబు మూ
ర్ఛ కదంబంబునఁ బందితాళి కరణిన్ • రాణించె మౌనంబునన్.

చ॥ సురుచిర లజ్జయున్ గుణము • సొమ్ముగ సొమ్ములు దాల్చు పొంచె వే
సరి ధరియింపమిన్ సహజ • చారుత వేలుపులన్ మరు ల్గొ

బెరసిన పందయాన లట • నిం గొను రాముని చూడఁ బోవు సం
బరమున నేగినారు కుసు • మంబులు రాలిన వల్లులో యనన్

మ॥ చతురంభోధి పరీత భూతల మహా • చక్రంబుఁ బాలించు భూ
పలి పంకాను గరాతపత్త్రము పయిన్ • భాసిల్లమిం జేసి యా
హృతినా వాసిమునందు పిన్నగొడుగుల్ • వే పర్వ నక్షత్ర సం
చతు నొప్పార విధుండు లేని నిసి నాఁ • దాల్చెం బ్రభాహీనతన్

చ॥ చను నెడచేత దిక్కులను • చాలిన విస్తృతి లేనివంచుఁ దె
ల్పిన గురు సేననే యచల • లీల వహించిన దన్నచోఁ జతు
ర్వననిధి వేష్టితం బగుచు • వర్తిలు ధారణి నొక్క చానయం
చు సబల యంచుఁ బల్కు మను • జుల్ నిజమారయ సత్యవంతులే?

తే॥ గంధ మగురువు కుంకుమ • కలపములును, తారహారములేక లేఁ • తయును వలుఁద
యైన కుచములు వేఁలు భూ • షాలిలేమి, నబ్బు డెలనీరుకాయల • యంద మొందె

తే॥ తరుణి కుచలేపమైన చం • దనము చేత, విరుల సరులచే మఱుఁగయి • పరఁగకుంట
గుములు పొదలును లేనట్టి • కొండలవలె, వీరుల బలిష్ఠ భుజములు • వెలసె నచట

ఉ॥ తావి పొగల్ గుబుల్కొనని • తంబము నొంచెడు వేణులారు నే
ణీ విమలాక్షులయ్యెడ గ • ణింప కలంక్రియలెల్ల మానఁగా
మేవిన యంజనం బధిగ • మింపని కన్నులు, గెల్చి యావలన్
బోవిడఁ చాలలం గడుగఁ • బొల్చు కురారముఁ బోలి రాజిలెన్.

తే॥ రణిత కింకిణీ విరహిత • రథములట్లు, సఖుల పిఱుఁదుల మేఖలా • స్వనములేదు
మధుప రుచిలేని వికచ ప • ద్మములరీతి, చివురు టడుగుల నందెల • రవములేదు.

తే॥ తాల్పఁదగిన హారాదులఁ • దాల్పకుంటఁ, దలరు నడుము లూపిరి విడఁ • దరుణమబ్బె
కైక పాడు వరంబు లీ • కలువ కంట్ల, నడుములకు మాత్రమే మేలు • తొడరఁబోలు

తే॥ రాఘవు డు వీడి చనుటచే • రమణచెడిన, సిరియుఁ దప మొనర్పఁగ దవ్వు • చెందెననఁగ
మరుఁడు దుస్తర దుఃఖాబ్ధి • మజిఁగె ననఁగ, లెక్క లేని సేనహారంగు • దక్కియుండె

క॥ దివి భువి దిశలను ముంపఁగఁ, దవిలి యుబుకు నుదధి యుపమ • దగునన నెట్లోఁ?
దివిరి నడచు చమువు స్వయం, భువు కనులను మనసు మించి • పొలిచెన్ దారిన్.

క॥ కదలి జలముఁ ద్రావుచుచేఁ, బుడమి తిరముగాఁగ నిలుపఁ • బూనుటచే గ
ట్టడఁచుటచే సైన్యముద్రా, విడ భాషా స్రష్టఁబోలి • విలసిల్లెఁ గడున్.

తే॥ వెడలు నా బాల గోపాల • మడదు జనము, సిరియు వీడుటచే సొంపు • చెడి యయోధ్య
అల యగస్త్యుఁడు జలమెల్ల • నాని విడువ, సురిఁగి చేడ్పడి యుండిన • శరధిఁ బోలె

క॥ వనముల సుక్షేత్రంబులఁ, బెను గ్రామంకుల నదుల • బృథివిం • గనుచుం
జను సేన త్రోవ నెఱి పే యని సాకేతంబు వీధి • యనఁ దగి యుండెన్

క॥ ఘన గజముల మదజల వా, సనఁ దక్కఁగ విరులొ సరులొ • చందనమో మేల్
పునుఁగో కస్తురియో కూ, ర్చిన కలప మొ తావి విరియఁ • జెందదు సేనన్

క॥ మనుజులు కల మెక్కి చనెడి వననిధికంటెను విశాల • వాహిని యందా
వనితల మధ్యము దక్కన్, ఘన తాటంకాది కాంతి • గప్పదు కనులన్

తే॥ మురజ కాహళాదికములు • మ్రోఁగఁగనికి నరుగుచున్న చమూంమా • హమ్మచూడఁ
బృథుల కుడ్యంబుపైనఁ జి • త్రింపఁబడిన ప్రభు బలంబును వోలి యప్పట్లనుండె

చ॥ అడవుల రామచంద్రుఁడు దు • రంత మనఃక్లమ మొందె నంచుఁ బాల్
ముడువ కలంకృతుల్గొనని • ముగ్ధల కన్నుల నుండి వాఁడిమిన్
విడిచిన యమ్ములా యువక • విస్తృత వక్షములందు గాఁడి నె
వ్వడి నుసుఱాన లేదు మఱి • వజ్ర తనుత్రములయ్యె వారికిన్

చ॥ మదనుని పంచ బాణముల • మానక మున్ను తపించు డెందముల్
సుదతుల చన్ను దోయి పయి • సూటిగ వ్రాలి రమింప వయ్యెదన్
హృదయములందు కైక యెడ • హెచ్చిరు కోప దవాగ్ని మండఁగా
మదమఱి యవ్వి మాఁడునని • మానెను కావలయున్ నిజంబుగన్

తే॥ ఇట్లు పెను సేన నడవఁగా నిద్ధ గుణుఁడు భరతుఁడును నారలు ధరించి • ప్రక్కవచ్చు
తమ్మతోడ శతాంగంబుఁ • దఱిసియెక్కి, పొడవు కొన్న నెవ్వగ తోడఁబోవుచుండె

తే॥ తల్లులును తపోధనులును • తండ్రిఁబోలు, మంత్రులును బందుగులును సామంతవరులు
బ్రాహ్మణులు తొడరిక గాఁగ • బలసి రాఁగ నగరి పెద్ద వాకిలి దాఁటినడచెనతఁడు

తే॥ మంథర యను మృత్యువుజనుల్ • మలయుచుండఁ ద్రోసికొనిపోవుచుంట • శత్రుఘ్నుఁడు
మండి పరుగిడి గర్జించి • మగువఁబట్టి త్రొక్కి నింగికెగురవెయఁదొడఁగునంత

చ॥ భరతుఁడు చేయి పట్టికొని • పావనః పూర్వ నృపాల పద్ధతుల్
వఱదను గల్పి యిట్టి చెడు • పాప మొనర్చిన కైక దేహమున్
నఱకియె యుందుఁ గిన్కయఱ • నజ్జగ నజ్జగఁ గాని రాముఁడీ
కఱకుఁదనంబు సైఁపఁడని • కాక తలంతునె తల్లి యంచెపన్?

తే॥ కాన సీతిజ్ఞః యంతము • లేని చింత, మనకు నెల్లరకును కూర్చు • మంథర పయి
నలుప పూనంగఁ దగదన్న! • యన్న కినియు ననుచునూరార్చితోడ్కొని • యరిగెనవల

క॥ జనములు సేనయుఁగ్రమముగఁ, జని చెంతనె చుట్టి నిలిచి • సంభ్రమము చంద
మ్మనసుండ, రాఘవుఁడు తొలి, దినమున దిగు వనము నందె • దగియెన్నితండుల్

మా॥ ఆ రేయంతయు నిద్రలేక నయనా • నంతాశ్రుపూరంబు నం
దారం దోఁగి వనంబులందొరకు కా • యల్ కూరలన్ మెక్కి యా
శ్రీరాముండు పరుండినట్టి పృథులో • ర్వీన్ బర్ణతల్పంబుపైఁ
జేరెం దమ్ముఁడు చెంతనుండి తెరలన్ • జింతాకులస్వాంతుఁడై

తే॥ రాముఁడట నుండి సన్నిమా • ర్గమున నడచె, నవరతాంగ తురంగ సా • రంగములను
వెంట రాఁ బంచి పథమందు • విసుగు లేక, కాలినడకతోఁ జనియె నా • కారుటడవి.

## 11 గుహ పటలము. 63

క॥ కావేరి సరాసని, కైవడిఁ గేదార ఫలము • ఘన కోసలమున్
వేవే నడచి చని చని, స్ఫారములు వగప గగ • దరిఁ దారసిలెన్.

తే॥ విరివియై జలపూర్ణమై • వెలయునదిని, కరి మదాంబుపూరంబులు • గలియు కతన
నమితపంకంబెక్కఁ ద్రాపను • జలకమాడ నొడలికయ్యె నర్తకీని గం • గోదకంబు

తే॥ తురగ ఖుర ఘట్టనోద్ధూత • ధూళి పరవి, దివిజ శీర్షము లలముట • దెలియరాదు
కాని, జలమాను టిఁదుట • కడఁకఁ బొరలు, జెచటఁ గాంచినఁ గానయై • యేపుమీఱె

క॥ గంగా వాహిని యమృతపు, రంగునఁ దొలియట్లు తోయ • రాశిఁ గలియఁ జే
రం గాంచ వచట దగ యా, అంగం ద్రావినవి తత్త • అంబున సేనల్.

క॥ కోసల కేగిన రాముని, గాన భరతు వెంటఁ జనిన • క్రందగు జనముల్
సేనలు లెక్కించినచో, నానిక నార్బుదుల వేల • యక్షౌహిణులౌ.

క॥ జనములు గంగాతీరము, ననువుగఁ జేరుటను కాంచి • యంబుధి జలమున్
గొను మొగులుఁ బోలు శ్రీరా, ముని మీఁదికి వచ్చెననుచు • మొగిఁ గుపితుండై.

తే॥ కాలకల్పుఁడు ధీవర • పాలకుండు, గుహుఁడు కనులెఱ్ఱఁజేసి భ్రూ • కుటి ముడించి
నాసికారంధ్రముల పొగల్ • ధూసరిల్ల, నట్టహాసమ్ముచేసి వి • ల్లమ్ములు గొని

సీ॥ కెరలిపాపుల జంపఁ • గేల శూలముఁగొన్న, రుద్రమూర్తియె పెక్కు • రూపులొందె
ననఁ బ్రాపీ భీకర • మైయొప్పు సైన్యంబు, గలవాఁడు బలువిల్లు • గలుగు వాఁడు
సురియఁ జెరివి యోడు • గజముఁ బరుసుతోఁ, గ్రుద్ధనేత్రముల మె • ద్గుఖుల రాల
నలుకతోఁ గాంచి నే • డాలంబు గలిగెన, కాయని భుజముల • గ్గ్లికఁ బొంగ

తే॥ మొగిసి యపదెంచు నీ చమూ • మూషికములఁ, గాలభుజగమనై యావి • గాలిమ్రింగి
కాదుగాఁ జేయు వాఁడ నీ • కదనతలము, ననుచుఁ గటు వీర వాక్యంబు • లాడికొనుచు

తే॥ పంచ సఖముల కైవడిఁ • బరఁగు సేన, విలయ కాలాబ్ది నిర్ఘాత • విధుల నార్చి
సప్త జలధులు పొంగిన • సరణిలేచి, తన్ను బలసి రానది వల • దరినిచేరి

న్యము౯గని భరతునితో, జన్యం బొనరించి సేన౯ • జంపి శమన రా
ఙ్య పురి కంపి రాజ్యము, మాన్యత రామునకు నొసగ౯ • మది గుఱిగొంటిన్.

రలును సమ్మతింపు౯డు, భేరులు మొరయింపు౯ డరులు • వెడలక యుండన్
సలు రేవులు చెఱుపు౯డు, తీరపు నావలను నీట • దింపకు౯ డెస౯గన్.

ఉ॥ ప్రాణహితుండు రాఘవు౯డు • ప్రాయి౯డిగా భువినేల నీక ని
ప్త్రాణునిగా నొనర్చి మహి • సంపద వంచన౯ గొన్న భూపు౯ డ
క్షీణ బలంబుతో వనుల౯ • జేరిన యన్నను చంప వచ్చె మ
ద్బాణ పరంపరన్ రిపుల • భగ్నము చేసెద౯ జింతనూడ్చెదన్.

ఉ॥ వీరల౯ గూల్పనేని పృథి • వీ తలమే నను గేలి చేయదే?
వీరలు గంగ దా౯టుదురె? • భీతి౯ జలింతునె వీరి ధాటికిన్?
గూరిమి తమ్ము౯డంచు నను • గొప్పగ౯ జూచిన రాఘవేంద్రుకై
పోరిని జీవము ల్విడువ౯ • బోలదె? యింతకు నేను చాలనే?

ఉ॥ అగ్రజు౯డంచు నుంత హృద • యంబున నెంచ౯డు వే౯గివంటి స
త్యాగ్రహు౯డైన తమ్ము౯డొకి౯ • డందు గలా౯డని లెక్క సేయ౯ డ
వ్యగ్ర హితాత్ము౯డై గుహు౯డ • వక్ర పరాక్రమశాలి మల్ల భూ
పాగ్ర సరుండు గల్గునని • యైన మదిం దలపోయ౯ డేలొకో?

ఉ॥ దోసము పాదుగా సదరు • దూఱును మిత్రులు వీరు శత్రు లీ
వేసమువారలంచు౯ బృథి • వీ పతులెందును చర్చ సేయరో?
చేసిననేమి? చేయమిని • చేసెడిదేమి? గుహుండు జీవముల్
పాసిన పిమ్మటం గద నృ • పాలు౯డు రామునిపైకి౯ బోవుటల్?

ఉ॥ రాము౯డు నాడు పోవిడి య • రణ్యములం దపియించుచుండ నీ
ప్రామిడి రాజ్యమేలుటయె? • ప్రాణము నాకు సుధాసమంబొకో?
నేమహి౯ గీర్తి నిచ్చి మర • ణింప౯గ లేనె? యనుంగుతో వనీ
భూమికి నేగకుండుటయు౯ • బోలెను నానెటి నే౯డె తీర్చెదన్

మ॥ మదమాతంగ తురంగ సద్భట కదం • బంబుల్ నదిం దా౯టుచో౯
బిదపం జూతము మీ౯ది కార్య మిపుడే • వే పోయి నౌకాతతిన్
నదిలో నిల్పక తెందు పొ౯దు సమరా • నందంబు డెందంబులం
బొదలం జేయు౯డు మిత్రుకంటె నసువుల్ • మున్నీడ౯గా నొప్పదే?

మ॥ మన వీరావలి కొక్కనా౯టి యనికై • మాఱొడ్డ౯గా లేని యీ
మొన మీరేల సురాలి తా౯కినను నా • పొల్పారు • కైనున్న యీ

ఘన కోదండ ఘనాఘన ప్రసృత ని • ర్ఘాంత ప్రభాపూర్ణమా
ర్గణ వర్షంబునఁ బ్రేత భూమిగ నొన • ర్పం జాలనే వ్రేల్మిడిన్?

మ॥ ఎరమో దారుఁడు రామ భూవిభునకుం • బట్టాభిషేకార్హ వే
శ రవాన్ వల్కలముల్ ధరింప నిడు కా • లవ్యాళ సంకాశకున్
వరపుత్త్రిండగు వీని సైన్యముల మ • ద్బాణ ప్రఘాతంబులన్
మురియల్ సేయ శవంబులన్ జలనిధిన్ • ముయ్యేలు చొప్పింపదే?

చ॥ రిఁముమన వీరులం దునిమి • రాముఁడు ప్రాకట ధర్మమూర్తి ధా
రిణిఁ దగనేలనిచ్చి యమ • రింబగు కీర్తివహింపఁ దీరు స
ద్గుణుఁడయి రాజ్యముం దనకుఁ • గొంకక వీడిన యామహాత్మ దు
ర్గుణుఁడయి కాన నుండుటకుఁ • గూడ సహింపక యెత్తెఁజెల్లరే!

చ॥ యతులకుఁజుట్టమై యడవు • లందు వసించు మదగ్రజుండు స
న్మతి మది నొచ్చునో యనుమ • నాయెద జంకెడిఁగాని లేనిచో
శిత విశిఖాగ్నిచే నివురఁ • జేయనె సైన్యసముద్ర సప్తకం
బిలవగు లేఁత పైరు పసి • కిమ్ముగ నబ్బిన చంద మేర్పడన్?

తే॥ జెట్టివిలుకాఁడురాముని • చెలిమికాఁడు గుహుఁడుమూఁకతోనిట్లు వా • క్రుచ్చుచుండఁ
గని సుమంత్రుండు సింహాసం • హనను భరతుఁ, జేరి మెల్లన నిట్లని • చెప్పఁదొడఁగె

సీ॥ ఈగంగ యిరుదరు • లెలమి నేలెడివాఁడు, మగయేనుఁగుంబోలు • మాబలుండు
లెక్కయిడఁగ రాని • పెక్కునావలవాఁడు, రామ చంద్రున కతి • ప్రాణ హితుఁడు
సాయుధ వాహినీ • జలరాశిగలవాఁడు గుహుఁడను విఖ్యాతి • కుదురు వాఁడు
శైలబలుఁడు కరు • జాఖుండు చీఁకటి ముద్దఁ బోలినమేని • మురువువాఁడు

తే॥ నీవు చనుదారికెదురయి • నిలిచినాఁడు నిన్నుచూడఁ దలఁచినాఁడు • నిర్మలాత్మ!
బలము నందెల్లఁ గాంచిన • బాహువులును నీరనీరద తనుకాంతి • నెగడు సుభగ!

తే॥ పితృసముని సుమంత్రునిపల్కు • విన్నయంత నలరి యనఘుండు గాంచె • యంతరంగ
హితుఁడ యగునేని ననుచూడ • నేగుదెంచు మునుపె నేఁబోయి కాంచెద • ననుచులేచి

తే॥ తమ్మతో మది నుబుకు ప్రే • మమ్ముతోడ, వెలలి సురనది దరిఁజేరి • నిలుచుభరతు
గుహుఁడు గని వానివేషంబు • గూడఁగాంచి, చెన్నుచెడిన మోమరసి ని • శ్చేష్టుఁడయ్యె

ఉ॥ నారలఁగాంచి తత్తనువు • నం గడు నిండిన ధూళిఁ గాంచిపైఁ
జారు తరార్క బింబము కృ • శత్వమునన్ జిగి పోకఁగాంచి యా
తీరు నిజంబుగాఁ గరుణ • దేవత రూపును బోలఁగాంచి పైఁ
పారిన విల్లుజారి పడ • నట్టులెనిల్చెను జాతి బొమ్మనాన్

చ॥ పురుష వరేణ్యుఁడౌ భరత • భూవిభుఁడున్ రఘురాము పోలికన్
బరఁగుచు నున్న వాఁడతని • ప్రక్కనె నిల్చెను తమ్ము లక్ష్మణుం
డొరసిన వాఁడు వెక్కసపు • దుఃఖ భరంబున కంతులేదు శ్రీ
ధరణిజ భర్త తమ్ములును • తప్పు లొనర్పఁ దలంప బోదురే?

తాపము నొందువాఁడు మదిఁ • దాలని ప్రేమగలాఁడు రాముఁ బో
ల్తాపసి ం షం దనరఁ • దాల్చిన వాఁడగు కైక పుత్త్రి ను
ద్దీపిత భావ ల్ల మఱి • తే. డం గని వత్తు నుండుఁడీ
యోపికఁ ద్రోవఁ గాచి య యోధుల కాజ్ఞయొసంగి యంతటన్.

చ॥ కల మొకఁడెక్కివచ్చి రఘు • కాంతుని దిక్కు నమస్కరించు నా
యలఘుని చేరి మ్రొక్కనన • ఘాత్మల శీర్ష హృదంతరంబులం
జెలఁగు యశస్కుఁడున్ విధియుఁ • జేతులు మోడ్పఁగఁ దగ్గ యాతఁడున్
దలిరిచి కౌఁగిలించికొనెఁ • దండ్రికి మించిన కూర్మి తోడుతన్

తే॥ భరతుఁ గాంచి గుహుండు నీ•వచ్చు హేతు, వేమి• యన నతండను మా మ•హీశధర్మ
మందు నుండి తొలంగె మా • యయ్యదానిఁ, బాప రాముఁ దోడ్కొనిపోవ • వత్తుననుడు

తే॥ ఒనరునవ్వార్త వినిగుహుం • డూర్పుపుచ్చి, యుత్సుకత హొంగఁ బూరించి • యుర్విపాలి
మరల భరతుని యడుగు దా • మరలఁ దనదు, హస్తములఁ బట్టియిట్లని • ప్రస్తుతించె.

చ॥ విమల యశోవిశాలః తలి • వేఁడఁగఁ దండ్రి యొసంగఁ బాప కా
ర్యము వలె రాజ్యమున్ విడిచి • యాననమందున దైన్యమంది యీ
క్రమమున రాముఁ దోడుకొని • క్రమ్మఱ నేగఁగ వచ్చు నీమ శీ
లముఁగన వేయి రాములు తొ • లంకిన నీ సము లౌదురే మహిన్?

ఉ॥ ఉత్తమశీలమే భుజ బ • లోన్నతి గాఁగల ధీర: నీమహా
చిత్తవిశుద్ధి బోయ తెగఁ • జెందిన నే వినుతింప నౌనె· రా
ట్సత్తమ సంస్తుతించఁబగు ప్ర • శస్త దినేశ కులేశ కీర్తు లా
కెత్తున ఖ్రింగి నాఁడవు గ్ర • హేశుఁడు తక్కటి కాంతులంబలెన్.

మ॥ అని పల్కాడి గుహుండు కైక సుతుపై • నత్యంత సౌహార్దముం
గొనియెన్ ధారణి నెవ్వరాతని యెడం • గూర్మిం బ్రమోదించి యుం
డని వారల్? మది నూహకే యరిది యౌ • సచ్ఛీలమే హేతువై
చనుఁగాదా? యట రాముపై గుహునకున్ • సంగాతమున్ వర్ధిలెన్.

ఉ॥ కరుణాశీలుఁడు కైకపట్టి యతనిన్ • గౌరవ్య భావంబుతో
విరవారంగని యన్న యీస్థలమునం • దెచ్చోట నాఁడుండె నే

కరణిన్ నిల్చె వచింపుమా? యనుడు నో • కాకుత్స్థ వర్యా! యిదే
యరయన్ రమ్మని తోడి తెచ్చె గుహుఁడ • త్యంత ప్రమోదంబునన్.

మ॥ భరతుం డయ్యెడఁ బండపైనఁ దృణ త • ల్పంబంది యారేయి భా
స్కర వంశాంబుధి చంద్రముండు నిదురం • గావించుటం గాంచి దు
ర్భర దుఃఖంబునఁ దత్తళించి ధరపై • వ్రాలెన్ మహా భూజ ము
ద్ధుర వాతాహతిఁ గూలు చందమునఁదా • దోదూయ మానాంగుఁడై.

శా॥ ఈ పాపాత్ముఁడు పుట్టు హేతువున నీ • కీపాటు కైకేయిచే
నాపాదిల్లిన దంచు విన్నపుడు కా • యల్ మూలముల్ మెక్కిని
శ్చాపల్యంబున నిందు కూరుకుట లేఁ • చం గాంచుచో నిప్పుడున్
దీపౌ ప్రాణము పీడకుంటి నిఁకఁ బ్ర • ధ్వీ భారముం దాల్పనో?

తే॥ తమ్ముఁడా! అన్న నిద్రించు • తలమిదైనఁ, గూర్మిచే భోగ భాగ్యము • ల్గూలఁ ద్రోచి
వెంట వచ్చిన యూర్మిళా • విభుఁడు రాత్రి, గడపె నెచ్చటఁ గాన్పింపఁ • గదవెయనుడు.

తే॥ సీతయును రాముఁడిచట వ • సించి నిద్ర, సేయ నచ్చట విలు దాల్చి • చేతితోడ
వేఁడినిట్టూర్పుతో తెప్ప • వేయకుండ, నిలిచి తెలవారు దాఁకఁదా • నలఁగుచుండె

చ॥ అన విని మాండవీ పతి గు • హాఖ్యున కిట్లను తమ్ములంచుఁ బు
ట్టిన ముగురందు నొక్కఁడ ఘ • టించితి నంతము లేని సేగి నా
యనుజుఁడు దానిఁ దీర్ప స్వసు • ఖావలి వీడుచు వెంటనేగె భూ
మిని కడుఁ బ్రేమకుం గలడె • మేరయ? నాబ్రదు కేల కాల్పనే?

చ॥ అని యట నాఁడు ధూళిపయి • నంగముఁ జేర్చి పుళిందరాజ! ది
వ్యనదిని దాఁటఁ జేసిన న • నంత నిరంతర చింతఁ దీర్చి రా
ముని కడఁ జేర్చి యాతదను • పూర్తిగఁ బాపిన పుణ్యమూర్తివౌ
దని భరతుండు కోరుటయు • నాతఁడు సమ్మతిఁ జూపి యంతటన్

చ॥ సరియని బోయతేఁడు తన • సంగడికాండ్రను చేరఁ జీరి మీ
రురవడి నేగి యోడల మ • హోన్నతి నాయిత పర్చి•తెండనన్
హరు రజతాద్రి రామ విభు • హస్త విభంజిత మేరు శైలమున్
నర తురగేంద్రు పుష్పకము • నాఁ బలు రూపుల నొప్పు నావలున్

చ॥ ఆవలి వారి సీవలికి • నావలి కీవలి వారిఁ జేర్చుటన్
దేవ మహీతలంబులకుఁ • దేఁకువ జీవులఁ జేర్చు పుణ్యపా
పావలి నాఁగఁ జెల్వల యొ • యారపు యానముఁ బోలి యొత్తుగా
నావలు చేరె నందముగ • నాకనదీ జలమెల్ల నాడుచున్.

క॥ భరతుని గని గుహుఁడిట్లను, నరవర! లెక్కకును మీఱు • నౌకలు వచ్చెన్
బరికింపుఁడన్న నతఁడును, త్వర నెక్కింపుఁడని తన ప్ర • ధానికిఁ దెలుపన్

ఉ॥ ఏపగు నాజ్ఞ నౌదల వ • హించి సుమంత్రుఁడు గుంపు గుంపుగా
నోపిన పద్ధతిం జలిపి • యోడలఁ జేర్చ రథాశ్వ దంతి సే
నా పరివారముల్ మనుజ • నాథులు బంధులు నెల్లవారు వీ
చీ పరిపాటి రత్నములు • చిందు సురాపగ దాఁటి రయ్యెడన్

మ॥ విల యాంతంబున మేఘముల్ గదియఁగా • వేలేచి గర్జాళితో
జలముల్ పూర్తిగఁ ద్రావఁ దోయధిని వ్రా • ల్చందంబునం బొందికన్
గలముల్ పెందెర కంబము ల్పొసరి శీ • ఘ్రంబేగు సంగంబునన్
గలభంబుల్ పయికెత్తి హస్తముల గం • గా వారి నీఁదె న్వడిన్

ఉ॥ సామజముల్ జలంబులను • చప్పుడెసంగఁగ నీఁదు మంద మ్ము
క్తామణులున్ దరంబులు ను • దగ్రఘుషంబులు లేవఁ ద్రోవఁ బ్రో
ద్భిమ మహాబ్ధి తోయమును • దివ్యనదింజొర దేవ గంగయున్
రాముని చూచు కౌతుక భ • రంబుననో వడి దాఁటెఁ గూలమున్

చ॥ ఘనమగు తేరులందలి యు • గంధర చక్ర యుగానుకర్షముల్
పనివడి యక్ష మాదిగ న • వస్కరముల్ విడఁదీసి వానికిం
బనుపడఁ బూన్చు గుఱ్ఱములఁ • బట్టుగ నావలఁ బంపినాడు చ
చ్చిన పిదపన్ శరీరములఁ • జేర్చెడు కర్మములం బలె న్వడిన్

తే॥ పాలముద్ది శరీరముల్, భయము ముద్ద మనసు, కిరువలి ముద్ద కా • ళ్లను గలట్టి
పవన జవన తురంగముల్ • బయలుదేఱె, నడకఁ జొఱ ముద్ద నాఁడగు • నావలందు

తే॥ కలుకు లెదురెదు రయి మొత్తు • గాఁగఁజేరి కానవచ్చుటచే భద్ర • గజ చయంబు
లొండొకటిఁ గ్రుమ్మనిలువఁగా • నొప్పుమీఱు దంతములభంగినుబ్బెను • స్తనములొప్పె

తే॥ ఉత్తరీయములం బోలి • యెత్తుగాఁగ నఱులేవ దిగిన పద • హస్తికర
శిరములం గుంభ వరములు • చెలఁగెఁ జూడ జాహ్నవీ స్తనములఁ బోలి • జానుమీఱి

చ॥ ఉరవడి నావలేగు నెడ • నొక్కటి నొక్కటి దాఁకఁ గోమలుల్
కరము మనః కలంకమునఁ • గాతరలై యిరువంకఁజూడ దు
ర్భరమగు విభ్రమంబున, శ • రంబులు త్రోవఁ జలించి భీతిమై
నుఱుకుచుఁద్రుళ్లు వాలుగల • యొప్పు వహించెను వారి మోముకుల్

చ॥ చెరచెర రెండు ప్రక్కలను • వేరికఁ దెల్లఁ గదల్ప లెచు దుం
పరలు వరాంగనా మృదుల • వస్త్రములం దడుపంగఁ దోఁపపుం

బిఱుఁదుల కొంతు లుట్టి పడి • వెల్వడ, దెందములందు కుంది ము
చ్చిరి తల వ్రాల్చు వీరులకుఁ • జింత రవంత తొలంగె నత్తఱిన్

శా॥ చం తీరంబునఁగల్గు వాహినులఁ బై • నెక్కించి కొంపోయి వే
యాతీరంబున డించి క్రమ్మఱిలు శూ • న్యంబైన నౌకావళుల్
దాల్చత్వం బలపోక యిచ్చి మఱియున్ • దానంబు సేయంగ సం
ప్రీతిన్ రత్న నివాసుఁ జేరెడి ఘన • శ్రేణిన్ విడంబించెడిన్.

ఉ॥ సమ్మిలి యీఁకలందనరి • నల్లని ధూపము వోలె నాడు పొం
కమ్మగు కాఁడ లయ్యెడలఁ • గంబములం బలె నిల్వ నాణి ము
త్యమ్ముల జంపు లుల్లసిల • నల్లల నాడెడి నల్ల పెక్కెముల్
క్రమ్మిన చాపలంబలె నీ • రాజిల నావలు వోయె నల్లనన్.

సీ॥ గంగ యాకాశంబు • గాఁగఁ జిందిన ముత్తె, ములు వితాజిలు ఋక్ష • ములుగ నొప్ప
జెందమ్ములం బోలు • నందంపు మోముల, మించుఁబోఁడులు పయ , నించునావ
లెలమి జలము లాడి • బృందారకాంగనల్, గమనించు సుర విమా • నములఁ బోలె
తుంపురుల్ లేవఁగాఁ • ద్రోచు తెడ్లడుగుల, వలెఁ గానరాఁ జెల్వ • లలరు నౌక

తే॥ వారిపాదంబులును వెలి • వచ్చితోఁప, ప్రాణములు పొంది నడచెడు • పగిది నొప్పె
సేనలును పౌరవరులును • చేడియలును, గంగ వెనుకఁ బడఁగ నట్లు • కడచినారు

ఉ॥ ఎక్కువ జాతిచేత ఘటి • తంబయి త్రోపఁగఁ బూను నావపై
నెక్కక కామ వేగమున • నేపున మింటనె మౌనివర్గముల్
చక్కన నేగె, నిక్కముగ • సత్పల మిచ్చెడు కృత్యమొక్కఁడే
నెక్కడ నేరియుం గలదె • యిద్ధ తపంబున కంటె నిద్ధరన్?

చ॥ సుడులు గట్టి వెల్లువలఁ • జొప్పిలు గంగను దాఁటి యెల్లరుఁ
దొదరికఁ దీరముం గదియ • దుర్ధన వాంఛలు వంచనంబులున్
విడిచి ప్రభుత్వముం జరపు • వీరుల కీర్తులఁ గ్రిందు చేసి యీ
పుడమి మహోన్నత స్థితిని • పొందిన యా భరతుండు చెచ్చెరన్.

తే॥ అనుపమగుణి శత్రుఘ్నుఁడు • జనములును సు, మంత్రుఁడును గుహుఁడెక్కఁగా • మాన్యుఁ
భరతుఁడెక్కిన యంతనా • పడవ నడవ, సాగెఁదెడ్లను కాళ్లతో • సత్వరమున.

సీ॥ బాంధవుల్ దేవతల్ • ప్రణతులై సేవించు • కోసలేంద్రాత్మజన్ • గుహుఁడు గాంచి
యీమె యెవ్వరి తల్లి • యెఱిఁగింపఁ దగునన, భరతుఁడిట్లను వేని • వాకిలికడ
రాజులు మనవికై • రహిఁగాచి యుందురా, దశరథేశ్వరు జ్యేష్ఠ • దార యీమె
కమలజు నాభిని • గన్నమహాత్ముని, ఘన తనుఁ గడుపారఁ • గన్నతల్లి

తే॥ భువన తారకమగు రామ • భూరిఫలము, కడఁక జగముల కొనఁగిన • కల్పతరువు
అతనిఁ గనుటచే నొందు భా • గ్యంబదెల్ల, నేను జనియించుకతమున • నీఁగికొనియె.

తే॥ అనుడు గుహుఁడామె యడుగుల • నడలిపడఁగ, వత్సముంబాయు గోవునా • పనరు దేవి
యీతఁడెవఁడనమాయన్న • హితుఁడుమాకు, నన్న గుహుఁడని భరతుఁడా • యమకుఁదె

చ॥ నాయనలార! దుఃఖము న • ణంపుడు సత్య పరాక్రముండు భో
గాయతనంబు రాజ్యరమ • నందక కానకు నేగు చెన్న మే
లే మొనరం గతంబయిన • దింక మహామతిఁ గూడి యేవుర
త్యాయత భూమి నేలు కొనుఁ • దర్మిలి నొద్దికఁ జాలకాలమున్

చ॥ అనుడు సుమిత్రఁగాంచి గుహుఁ • డల్లన నిట్లనుఁ బ్రేమపూర్ణ యీ
జననిని గూర్చి పల్కు మనఁ • జక్కటి పీడని చక్రవర్తి కా
ప్పిన కడగొట్టు భార్య రఘు • వీరుని సన్నిధి పాయకుండు నా
యనుజుని కన్నతల్లి సుగు • ణాలయ యంచు నతండు దెల్పఁగన్.

చ॥ తనపతిఁ గాటికంపి కుప • ధంబునఁ బుత్త్రుఁడు దుఃఖ వార్ధిలో
మునుఁగఁగ రాఘవుండు వన • ముం జొర విష్ణువు గొల్చు లోకముల్
తనమది నున్న క్రౌర్యమునఁ • దక్కఁగఁగొల్చిన కైకఁ జూపి యో
జననిని గూర్చి పల్కుమనఁ • జయ్యన నా భరత ప్రభుం డనున్.

ఉ॥ దొడ్డగు నెంజిలిన్ భువికిఁ • దుందుదు కొప్పఁగఁ గూర్చి నిందయన్
బిడ్డను పెంచుతల్లి పృథి • వీస్థలి ప్రాణములేని పోల్కిఁ బే
దెడఁ దపించుచుండ లవ • మేని యలందురు చిన్నె లేని యా
వెడ్డరి యెవ్వరో యెఱుఁగ • వేః ననుగన్న మహాత్మురాఁగున్.

చ॥ అనియతఁ డాడు పల్కువిని • యగ్గు హుఁడంతట వారికిం గ్రమం
బునఁ దనమేల్మి కేల్మొగిచి • మ్రొక్కెను హంసి యొకండు తెక్కలన్
గొనక జలంబు నీఁది దరి • గొన్న వితంబున ద్రోణియుం దరిన్
గొనకొని చేరె జాహ్నవికిఁ • గూరిమిఁ జేతులు మోడ్చి పంచఱున్.

తే॥ దిగిన జనములు ముప్పురు • తీరమందు, పల్లకీ నెక్కిచనఁగ నా • భరతుఁడపుడు
క్రొత్త కన్నీటి వెల్లులఁ • జిత్తభార, మడఁగఁ గొల్పత గుహునితో • నడచి నడచి

తే॥ కర్మ భరము జ్ఞానాగ్నిచేఁ • గాల్చివైచు, వరబలుండగు మునిభర • ద్వాజువనము
చేరె నమ్మని వారల • తీరుగాంచి, వృద్ధయతులతో నక్కడ • కెదురు వచ్చె.

## 12 పాదుకా పటలము (135)

క॥ అరు దెంచిన యెతివరుఁగని, భరతుఁడు తండ్రివలె నెంచి • ప్రణతిమొనర్పన్
హరుఁ బోలిన యమ్మునియును, భరతుని దీవించెఁ బుత్త్రి • వాత్సల్యమునన్.

క॥ భరతా! నీరుం జేరిన, ధరణిఁ గిరీటము ధరించి • తాత్పర్యమునన్
ధరియింపవ నారలు జడ, లిరవుగ ధరియించి రాఁగ • నేమి కతంబో?,

క॥ అనుడు మన మెరియఁగినుతను, మునివరుఁగని ప్రాఞ్జలికః మొట్ట మొదట ని
ట్లనువగు పనియొనరుపలే, దనుటయు మిము బోఁటివారి • కర్హమె చెపుఁడీ!.

మ॥ శ్రుతి శీర్ష ప్రతిపాదితాంఘ్రియుగుఁడై • శోభిల్లు శ్రీరామ భూ
పతికిం దిమ్ముఁడనై నెటిన్ విడిచి ధా • ధారంబుఁ గైకొందునే?
యతఁడే వెన్కకు వచ్చి రాజ్యము ప్రియం • బారం గొనందేని ని
శ్చిత బుద్ధిన్ వనులంచ యన్నకడని • శ్చింతం బ్రవర్తించెదన్.

క॥ ఆ పలుకు భరతుఁ డాడఁగ, దాపస వరతనువు లుబ్బెఁ • దన్మానసముల్
ప్రాపిత హరిచందన కృత, లేపమ్మునఁబోలె మోద • లీలలఁదేలెన్.

క॥ మునుకొను నెనరున భరతుని, తన శుద్ధ కుటీరమునక్కు • దతమతిఁ గొని య
మ్మని సేనకు విందులు పం, బిన వేడ్క నొనర్తు ననుచు • వేలిమిఁ జేసెన్.

క॥ తలఁచిన యంతన దివియును, లలిత గతి న్నిలిచె, జనము • లకు వేతొక పు
ట్టొలసిన గతి తమ ముందటి, నెలవు మఱవ సుఖ జలధి ము • నింగిరి వారల్.

తే॥ చెడని ధర్మ ఫలంబులఁ • బడయువార, లంచు రంభాదు లెదు రేగు • దెంచి పొగడి
యిందు మండలములఁ బోలి • యెసక మెసఁగు, సౌధములకుఁ గొంపోయిరి • సకలజనుల

తే॥ గంధవాడి మేనఁగూర్మిన • లందినారు, విన్ను వాఁకలో మున్కగా • వించినారు
శిరములం గల్ప సుమములఁ • జెరివినారు, సుమములంబోలు వల్వలఁ • జుట్టినారు

తే॥ కుసుమ లత కూనలం బలెఁ • గునిసి నిలిచి, సుందరాంగులు నగలిచ్చి • సొగసుచేసి
యొనర దేవ రాజాను పీ • యూష కల్ప, మైన యోగిరములు వెట్టి • యలరఁజేసి

తే॥ హంస కేకి తూలిక లెట్టి • నైన పత్తి, తెల్లదూది బూసగదూది • తీర్చిచేయు
పట్టుసెజ్జల హరిణుల • పగిది దేవ, వనితలు పరుండ నెల్లరు • కునికినారు.

తే॥ ఏలికలు మొదలుగఁ బల్ల • కీలు మోచు, వారివఱకు గ్రమంబుగా • గారవమున
మహిమ నొందిన విబుధుల • మాడ్కినుపచ, రించి వారి యెడఁద లల • రించినారు.

తే॥ అటులు రంభాదులైన బిం • బాధరలును, వారి యాజ్ఞల దాసుల • పలె నొనర్ప
భరతుతో వచ్చు కాంతలు • భవ్యమైన, దివ్య భోగంబులంది స • తృప్తిఁగొనిరి.

తే॥ నందనవన నవ ప్రసూ • నములతావిఁ, గొనుచు నంధులు కేలూఁత • గొని చరించు
కరణి నచ్చటి పిల్లతె • మ్మెరలు పొలసె, సకలజనముల మనములు • సంతసింప.

తే॥ క్షౌద్ర మెక్కువ కలిపిన • కబళములను, లేఁత వరియాపురాసిఁగ • ల్పించి కల్ప
కంబు లొసఁగ భుజించెను • గజచయంబు, మదజలముఁ ద్రావిమధుపము • ల్మదముగొనఁగ

తే॥ నరక బాధలఁ దొలఁగించు • గురుతగలుగు. నీరముల వారణంబు లిం•పారఁ ద్రావె
పచ్చఁజా లేత కాంతులు • పరిఢవిల్లఁ, బెరుఁగు కసవుఁదురంగముల్ • వేడ్క మేసె.

క॥ అందఱు నారీతిగ బలు, విందుల సురభోగ మనుభ • వించిరి భరతుం
డందలి కాయల దుంపలఁ, బొంది యొడలు ధూళి మునిచి • పోఁగడపె నిసిన్

తే॥ తెలివిగలుగుచో వీడెడు•కలయుఁ బోలె, నమ్మహాభోగములు పూర్తి•యగుడుఁ బుణ్య
ఫలము పొందిన జీవి క • ప్వాలి విధాప్తి, కరణి నిరులు తొలంగఁగఁ • దరణి పుట్టె

తే॥ త్రికర బైక్యంబుగాఁ బాడి • తివిరి చేయ, కుండు జీవికి వలె భోగ • యుక్తిమాజె
సుర పదచ్యుతులై భువిఁ• జొచ్చువారి, వలెనె వారలు పూర్వభా•వములఁ గనిరి

తే॥ నాఁటి యుదయానఁ బెనుతోర్వి వ•నడచు సేనఁ, గాంచి దివ్యులు వననిధి • గాదు భరతు
సైన్యమని యెన్నునయ్యది • శైలవనము, తెల్లదుక్కగా మరుభూమి• యెల్లఁ జేరె

క॥ పెరిఁగిన రజమున మఱిఁగి౯, తరణియు శీతకరుఁడగుచుఁ • దాపము వీడెన్
కరుల మదజలము నడవం, బొరయని రొంపియయి యెడరు • పొలముగమాఱెన్.

క॥ రాజుల తెల్లని గొడుగులు, రాజిలె గురుతరుల నీడ • ప్రావిన కరణిన్
రాఁజుకొను గులక రాల్గల, యాజగ మరు భూమి పంది• రై యొప్పెసఁగెన్

తే॥ అధికరాజ్య సంపదఁ నుగొను • మంచుజనని, పలుక నొందిన కినుక య • గ్గముగాఁగ
మొగ మెఱపు మేనునల్లనౌ•పుణ్యుఁగాంచి, ప్రేమఁ గరఁగి యెండిన తరు•వితతి ననిచె

తే॥ జీవముల కంటె గొప్పది • శీలమనుచు, సత్యవాక్కుకై మరణించు • జన వరేణ్యు
దడము క్రూరమౌనెడరుఁ గే • దారమట్లు, దాఁటి చిత్రకూట శిఖరిఁ•వఱిసె నంత.

## భరతుని సైన్యమును కని లక్ష్మణుఁడు కోపించుట

సీ॥ అధిక భూరజము న • శ్వాదుల రథములు, కోపానఁ జెఱరే గు • కుంభియము
కిలిగించు రవమును • కా[illegible]ంబుల[illegible]ల, కలమును విని గొప్ప • బిఱమె యనుచ
నేల యుబికి లేచు • పోలికఁ జనుదొక్క, శైలాగ్ర మెక్కి ల• క్ష్మణుడు చూచి
యిల శాశ్వతంబుగా • నేల నిప్పించి దు, రాశచే దుర్బుద్ధి • యడర నిట్లు

తే॥ భరతుఁడే కూర్చుకొని సేన • పరశురాము, గెలుచు జోదుపై దాడి సా • గించెననుచుఁ
గ్రుద్ధుఁడై శిఖరంబు ను • గ్గుగను ద్రొక్కి, దుమికి వడి నన్న యొద్దకుఁ • దొకరివచ్చి

చ॥ భరతుఁడు తోడఁబుట్టువను • పాటియు నెంచక గొప్ప సేనతో
నుర వడి దాఁక వచ్చెనని • యొత్తిన కిన్కఁ గటారి చెక్కి తొం
దొరగ ధనస్సు నెత్తికొని • తూణముఁ దాలిచి యన్న పాద పం
కరుహములన్ భజించి పలు • కం దొడఁగెన్ మది తత్తఱింపఁగన్,

చ॥ ఇహపర సౌఖ్యముల్ విడిన • యీ భరతోద్ధుర బాహుశక్తియున్
సహచరసైన్య సత్త్వమును • సత్యపరాక్రమ! నీదు తమ్ము ను
త్స్పహన మహా సహాయ బల • సంపదయున్ ముదమారఁ జూడు దు
స్సహతర కష్టము ల్దొలఁగి • సంతస మందెదు నేఁడు రాఘవా!

ఉ॥ పీనుఁగు పెంట చేసి యిటఁ • బేర్చిన తుంగ మతంగజంబులన్
జాను తొఱంగి పడ్డ రథ • సంఘముఁ బ్రేవులు చిందఁగూలు నీ
సేనల నుద్దుగుడ్చి తెగి • చిందఱవందఱమైన తేజులన్
మానగు రక్త వాహినుల • మానక చూచెదు గాక రాఘవా!

చ॥ తళతళ లొప్పు తూపు లడి • దంబుల చేతుల బొందదంబులం
దళమగు తొమ్మలం దొలిచి • దద్దఱ ప్రాణముతోడ వీఁపునం
గళచెడ దుస్సిరక్తము ము • ఖంబుల నొప్పక వెళ్లదిక్కఁరుల్
కళవళ మంద నేచుటలు • గాంచెదు గాక ప్రసన్నరాఘవా!

చ॥ జవన తురంగముల్ కెరల • స్యందన హాటక శృంగ పంక్తులం
దవిరళమై పిశాచము ల • హంకృతి నార్చుచు బ్రీలు కేడెముల్
దవిలి ధరించి హస్తములు • దట్టుచుఁ బాటలు పాడు చాడ్పునన్
జవి గొన నల్లఁద్రావి కడు • జంపునఁ ద్రేన్చుట చూడు రాఘవా!

తే॥ భరతు సేనా మహీజంబు • పాదుతోడఁ, ద్రుటిని పేరు లేకుండఁగఁ • ద్రుంచి వైవ
స్వర్గ పృష్ఠంబు విఱుగ స్వ • భార మీఁగ, ధాత్రి యూఅట గొనుటయుఁ • దవిలి కను

చ॥ ఎనసిన రక్త వాహినుల • నీఁదుటచే నొదలెఱ్ఱనైన శా
కినులును ప్రేత భూత తతి • గిట్టి కబంధములున్ సమస్త ప
ట్టనములు నీకరంబుల న • డంగిన వంచు సురావళిం బలెన్
గని మనమందు సంతసిలి • గంతుట గాంచెదు గాక రాఘవా!.

క॥ కరులు హరులు బలియురు తెగ, నురవడిఁ బ్రవహించు రక్త • ముదధిం గలియన్
శరధులు రక్త శరధులై, మొరయుటగని మనమునందు • మోదింతు నృపా.

చ॥ విఱుగ శతాంగముల్ రథిక • వీరులు చావఁగఁ గైదువుల్ చెడన్
దఱిఁగిన దంతి వాజి భట • తండ శిరమ్ములు నంఘ్రు లూరువుల్
బరులు కరంబు లొండొకటిఁ • బాసి రణస్థలి ఘోరభూమిగాఁ
బఱపు మదీయ బాణముల • పద్ధతిఁగాంచెదుగాక రాఘవా!.

చ॥ మురువగు టెక్కఁలున్ గనక • పుంఖములుం గల మచ్చరంబు ల
య్యురువుర తొమ్మలం దొలిచి • యిచ్చమెయిన్ గగన స్థలంబునన్

దిరిగెడు కంక గృధ్రములఁ • దీయని విందొనరింపఁ బిల్వఁగాఁ
దొరతొరఁ బృష్ఠభాగమున • దుయ్యుట గాంచెదు గాక రాఘవా!

చ॥ ఒక సకియందు మోహమున • నుర్వర నొంచిన రాజు నాజ్ఞచే
వికలుఁడు పొందినట్టి పృథి • వీస్థలి నేలుట వీడి యివ్విధిన్
బ్రకటిత రీతి నన్నుపయి • వైరముతో నిట వచ్చినాఁడు నా
రకమున కేగు వాఁడిపుడు • క్రన్నన నావలనన్ రఘూత్తమా!

మివీడి కాననములఁ • బొందునీకుఁ, గలుగు నాపదఁగని నిన్ను • కన్నతల్లి
లుటం గాంచి మోదించి • నట్టికైక, నేలఁబడి పొర్లియేడ్చుట • నేఁడుగనుము.

త్రుటిలోనె యీ బల • ముక్కడంచి, త్రిపురముల దహియించిన • మృడుని భంగి
వాఁడ నటంచు లక్ష్మణుఁడు పలుక, నల్ల నిట్లను జానకీ • వల్లభుండు.

॥ తమ్ముఁడ! నీ తలంపులకుఁ • దగ్గ విధంబున సర్వలోక జా
లమ్ముఁ గలంగఁ జేయఁగఁ ద • లంచితి విప్పుడు దానినాఁప
క్యమ్మెకొ? దానిఁగూర్చి యిఁక • నాడుట కేమియు లేదు సావధా
నమ్మున విందుగాక యొక • జ్ఞాన వికాస విధాన కార్యమున్.

॥ జగములబలంబు మెచ్చిన భు • జంబులు గల్గిన వీర! సుస్థిరం
బుగ మనవంశ జాతులగు • పుణ్యుల లెక్కడ శక్యమౌనె? యా
సుగుణుల నొక్కరేని తమ • సూనృత ధర్మములం ద్యజించిరే?
నిగమ హిత ప్రకారములు • నేర్చిన యాభరతుండు దుష్టుఁడే?

॥ హితమతి సత్యవాక్యుఁడగు • నీతఁడొనర్చు సమస్త కార్యముల్
శ్రుతి హితముల్; విరుద్ధములు • చొచ్చుటగానము; నీవు నాయెడన్
మతి చెడనుంచు ప్రేమమున • మించి పరామరిసింపకుంటి వె
వ్వితమునఁ జర్చసేయుఁ గ్రుధ • వెంచిన దెందము సత్కృతమ్ములన్?

॥ ఆడికవోవ నన్నయను • సర్మిలి నాయెడ కేగుదెంచుచు
న్నాఁడు సమస్తభూతలము • నాకొసఁగన్ మది నిశ్చయించి యు
న్నాఁడిది నీ వెఱుంగక ఘ • నంబుగఁ బోరఁగ నెత్తినచ్చుచు
న్నాఁడని యెంచుటల్ మతి కొ • సందగు పద్ధతి యౌనె? తమ్ముఁడా!

ఁడు నేలను సేనల, సిరి నొసఁగి క్షమాపణంబు • సేయఁగఁగోరన్
తి వచ్చెననుట విడి, యిరువుగఁ బోరంగ ననుచు • నెంచుట తగునే?

ుమా సద్గుణంబను • తేరి చీల. ధర్మమూర్తి భరతు నిట్లు • తలఁపఁదగునె?
టికి నన్ను చూడనే • వచ్చువాఁడు, పిదపఁ దెలియంగఁ గలవిది • వినుతసుగుణ!

## భరతుఁడు రాముని డాయు వచ్చుట.

తే॥ రాముఁడిట్టులు తమ్మునా • రార్చు చుండ. భరతుఁడచ్చట సేనన • వ్వలనె నిలిపి
తన్ను వీడని యనుజుతో • దగ్గఱించి. యన్నస్థితిఁ గాంచె నుమ్మలి•మధికరింప.

ఉ॥ దోయిలి గూర్చు హస్తముల • తో వసివాడి కృశించు మేనితోఁ
ఛాయని దుఃఖవేధ జిగి • వాసిన కన్నులతో జటాలితో
వ్రాయఁగ రాని దుఃఖమయ • భావముతో నొక నారచీరతో
దాయఁగ వచ్చునా భరతుఁ • దప్పక రాముఁడు కాంచెఁ బార్తిగన్,

తే॥ లక్ష్మణా! యిటు రమ్మ బ • లంబు గలుగు. భరతు సంగర యోగ్య రూ • పంబుఁ గం॰
యనుడుఁ దమ్ముఁడు నాతని • సట్టె చూచి, మ్రానుపడి నిల్చెఁ గన్నీటి •వానతోడ.

తే॥ తాను నిందించు పలుకులు • వినదు కినుక, నెంచి సిగ్గిలి డెందంబు • సంచలింప
వింటితో వేఁడి బాష్పముల్ •పృథివిఁదొరఁగ, వాడిన మొగంబుతో తిచ్చ • వడుచునిలిచె

ఉ॥ న్యూనత లేకయుండఁ దప • మున్నతిఁ జేసి ఫలంబు పొందుచో
భాను కులేశుఁడౌ మగనిఁ • దాసి శుభంబులఁ బాసి శోకముం
బూని కృశించు రాజ్యరను • పూనిక నంపిన దూతవోలె మో
డ్పూనిన కేలుతో భరతుఁ • దుస్సహ దుఃఖము తోడ దగ్గరెన్,

తే॥ తజన [illegible] డిరి • [illegible] [illegible] వీచి
నీతి మానిత [illegible] మై • నెలపు తప్ప, [illegible]

తే॥ ఉసులు లున్నవొ లేవొ యం • చూహ సేయఁ, దగినతీరునఁ గృశియించు• తమ్ముఁగాంచి
నేత్ర కంజముల్ విడుచు క •న్నీరు భరతు, జడలు నించి పొరలి కాలి • జడిమ నిలిచె

తే॥ ఆదిదేవుఁడు ధర్మంబు • నలము-పగిది, నెల్ల నీతుల కిల్లయి • యెసఁగు రామ
వరుఁడు నిట్టూర్పుపుచ్చి బాష్పములు వీఁపు,నం బడఁగఁ దమ్మునాలింగ•నంబొనర్చె

క॥ అలమికొని యతని వేషము, పలుమఱు గమనించి యరసి • వత్సా! జనకుం
డెలమిని సుఖముం బొందునె? యిల నేలునె? దుఃఖ మొంద •నేలా? యనుడున్ ,

తే॥ అన్న! నీవియోగ వ్యాధి • యలము కొనఁగఁ, గన్న తైక వరంబను • కాలువలనఁ
దనకుఁ దగిన సత్యంబును • ధరణి నిలిపి, స్వర్గలోకంబు చేరెను •జనకుఁ డనఁగ.

మ॥ పరలోకంబునఁ జేరె నన్న పలుకుల్ • బల్లెంబుఁగాయంబులోఁ
జొర దూటించిన యట్టులై చెవులలోఁ • జొత్తెంచు మున్నే వెసన్
సురలోకోపరిలోక మేలఁదగు సు • శ్లోకుండు హృన్నేత్రముల్.
సురుఁగం గాలిపటంబు చుట్టు కరణిం • జుట్టెజ ధరన్ వ్రాలుచున్,

తే॥ మొదలు నఱకిన భూజంబు, పుడమి వ్రాలి, సరణిఁ బడి పిడుగున కల్కు • సర్పమువలె
తెలివి దప్పి యొకింతకుఁ • దేఱి యూర్పు, పుచ్చి తపియించి యాఱక • పొగిలెనాగిలె

సీ॥ ఆఱని భాను కు • లాలయ దీపమా! నిర్వ్యాజ గురు ధర్మ • నిలయ! తండ్రి!
అరిమద గజసింహ • మా! దయాలోల! యిం, కెవ్వరు సత్యంబు • నేలు వారు?
మాకు దిక్కెవ్వరు? • మఱి తేర్చువారెరు? మరణించితే యిట్లు • మమ్ముఁబాసి
యెవ్వరి నింకఁ దం • డ్రీ! యని పిల్తుము, తగునె యిందఱ వీడి • తరలి నీకు

తే॥ మేటి ఋశ్యశృంగాదివేత • మేల్మి పేల్మి, యొనరఁ గావించి ననుగాంచి • యుర్వియందు
కన్న గొప్ప ఫలంబేది? కడకుమమ్ము • వీడి యింపైన ప్రాణముల్ • వీడుటొక్కొ?

తే॥ ప్రాణులకుమేలు సేయు దా • ర్ఢ్యంబు గలుగు, భూమి భారము నేఁదాల్పఁ • బోదమువిఘ్న
హేతు విదియొకో? నీయావి • యెగురఁగొట్టు, కాలుఁడై పుట్టితినె జగ • మేలుకొఱకు?

తే॥ శంబరుం జంపి వజ్రికి • స్వర్గమిచ్చు, పార్థివేంద్ర! పాలనము మా • వశము చేసి
యింద్రియములు స్వవశముగా • నెనరఁగఁజేసి, తపము చేసిన విధమిదే • తండ్రినీవు?.

ఉ॥ కోరఁగఁ దగ్గ పాలనము • కోరిక నెల్లరు వేఁడఁ బూని యీ
ధారణి కెల్ల దుఃఖమును • దార్చిన యల్పుఁడ నైతి మృత్యువుం
గోరుట దక్కఁ బ్రాణములఁ • గూరిమి వీడని మేను వెంచి యే
నేరి మొగంబుఁగాంచుటకు • నింకను మేదిని నుండఁ గోరుటల్?

తే॥ కోసలము వీడి యడవి నీ • కొడుకు చేరె, ననుచు విన్నంతనే దివి • కరిగితి వట
తండ్రి! నీమృతి వినియును • తలరి తలరి, బ్రతికియే యున్న వాఁడను • బ్రదుకుగోరి

ఉ॥ జానుగఁ బూర్ణ చంద్రునకుఁ • జల్లఁదనంబు నొసంగు లో కన
మ్మానసి తారక త్రిశీత సూనము దివ్యుల కేని మాన్పఁగా
రాని బలం బుదారత తి • రంబగు సత్యము నీతి ధర్మమున్
దోన యడంబు కొంచు నిటు • తూఱితె యెల్లర వీడి స్వర్గముణ?.

తే॥ ఇట్లు పలువిధముల నెం • గెత్తి యేడ్చు, రామ చంద్రుని తమ్ములు • రాజ వరులు
చేరి లేపి పట్టుకొన వ • సిష్ఠుఁ డంత, హిత మితోక్తుల నోదార్చ • నెంచుటయును.

తే॥ తాపస శ్రేష్ఠుఁగు భర • ద్వాజుఁడాది, మునులు నేడు దీవుల లోని • మనుజవరులు
మంత్రులును సైన్యపతులు రా • మ విభుఁజేర, వచ్చిరి మనంబులారట • పడుచునుండ

తే॥ మఱియురాఁడగు నెల్లరు • మలసి వచ్చి, నిలువఁ బరితపించుచునున్న • నృపకుమారు
మోముఁగని బ్రహ్మసముఁడగు • మునివరుండు, వాక్యకోవిదుఁడీరీతి • పలుకఁదొడఁగె.

చ॥ లతమతి సన్న్యసించుటయు • ధర్మమొనర్చుట దక్కనెమ్మదిన్
బ్రతుకఁగఁ గోరు పుణ్యులకుఁ • బ్రాపగు సాయమొకండు గల్గునే?

మృతియును పుట్టువున్ సహ • జమే కదః ప్రాణుల కెల్ల భూమిపై
శ్రుతి హితపారగుండవు వి • శుద్ధ చరిత్రుఁడవున్ స రింపవే?.

తే॥ స్థిరములేని జన్మంబులు • దెలుపనేల? కోట్లకొలఁదియౌనవి కామ • కోపమోహ
దుఃఖసౌఖ్యములొందు నీ • తోయమెఱిఁగి, యముఁడుదాక్షిణ్యయుతుఁడని • యనఁగదగునె

ఉ॥ పుట్టక మున్నె జీవములు • పోవ జనించుట చూచుచుండమే?
పట్టగు విద్యకల్మి భువి • భారము నర్వదివేల యేఁడు లి
ట్టట్టు చలింప కోర్చి నెల • వారిన ధర్మము కీర్తి నించి యే
ల్దిట్ట గతింప నిట్లు వగఁ • దీల్పఁడ బాడియె? రుజనందనా!

తే॥ శీలమును ధర్మమును భువిఁ • జెడక నిలిపి, శూలమును చక్రమును వాణి • లీలఁదాల్చి
మూల పురుషులై వెలయు ము • మ్మూర్తులకును, కాలమను వలఁబడకుండఁ • గావశంబె?

తే॥ ఇంద్రియంబుల కెఱుకయై • యిలను వెలయు, నన్నిటికిని మూలంబులై • యమరు పంచ
భూతములు నొక్కయప్పుడు • పొలియు నవియె, యనఁగదీనికిఁ జింతింప • నగునెచెపుమ?

తే॥ పూజ్యమగు పుణ్యమను నేయి • పోసి కాల, మనెడి వత్తిడి విధియను • నగ్గిచేత
జీవితమను దీపము నుద్దె • సించి నిలుపఁ, గారణములు రెండును తీఱ • నాఱు టరుదె?

తే॥ ఈజగంబున దుఃఖమం • దేమునింగి, యాజగంబున నరకంబు • నందె మునిఁగి
మరల జన్మించి చిక్కుల • మలఁగుచుండు, పెక్కు వగల జీవుల లెక్క • పెట్టనగునె?

తే॥ వినుత సద్గుణాకరః తండ్రి • యనెడు కతన, సృష్టికర్తయౌ బ్రహ్మకుం • జెందరాని
విష్ణులోకంబు నందున • వెలుఁగు చుండె, నతనికీవు గావించు సా • యంబిఁకేది?

ఉ॥ ఆతని పోకకై మది ర • వంతయుఁ జింత యొనర్పరాదు పై
నాతని కింతకంటె నర • యం గడ తేఱు పథంబు లేదు నీ
వాతని కింకఁ జేయఁదగు • నయ్యవి యున్నవి శ్రద్ధతోడ నీ
చేతులతో నొనర్పు మది • చిత్తము శాంతిలఁ గారణంబగున్.

ఉ॥ వాన పడంగ నీటివడి • భాసిలు బుద్బుద పంక్తిఁబోలు నీ
మేనులఁ గూర్చిచింత మది • మీఱుట వేఱేఁడి లక్షణంబగున్
మానక బాష్పముల్విడిచి • మానిసి గాంచు ఫలంబు గానమున్
గాన జలాంజలి న్విడుము • గాదిలి తండ్రికి జానకీశ్వరా!

తే॥ అనుడు శ్రీరాముఁడును చింత • నవలఁద్రోచి, యాచతుర్వేద వేది మ • హాతపస్వి
యగు వసిష్ఠుతో గంగకు నరుగు దెంచి • చేయఁదగు కృత్యముల భక్తిఁ • జేయఁబూనె

తే॥ సకల జీవాత్ములకు నొకే • చందమొప్పి, యెఱుక నొసఁగు మహాత్ముఁడ • య్యేటమునిఁగి
గురుఁడు తెలిపిన విధులెల్లఁ • గొఱతలేక, సలిపి ముమ్మాఱు తర్పణ • జలము వదలె.

తే॥ చేయఁదగుక్రియలనుపూర్తి । చేసియవల, మాన్యులగుమంత్రులునున్నృపుల్ । మౌనివరులు
తక్కువారలు తను చుట్టి । తరలిరాఁగ, జానకి వసించు నప్పర్ణ । శాలఁజేరె.

తే॥ చేరునంతలో భరతుండు । సీతయున్న, పర్ణశాలను గని యొంటిఁ । బరఁగుచుంట
గని కరంబులతో మోఁది । కొనుచుఁగనుల, రోదనముతోడఁ బడె నామె । పాదములను

తే॥ ఇంద్రియములలో జలనిధు । లేడునున్న, వనఁగ నెట్టినౌ కన్నులఁ । బనవి పనవి
వెక్కివెక్కి బాష్పంబువుల్ । వెల్లిఁగాఁగ, విడుచుచుండెను భరతభూ । విభుఁడు వెలికి

క॥ పెను దుఃఖంబున మునిఁగిన, యనుజుని తన పొదవుచేతు । లమరిచి రాముం
డనువుగ నెత్తుచు సీతను,గని జనకుఁడు మనలవీడి । కడచనె ననుడున్.

క॥ వడఁకూను నెడఁదతోడన్, బుడమింబడి యడలి యడలి । పొక్కుచుఁబెలుచన్
గడలికవ యనఁగఁ గనుఁగవ, యెడపక బాష్పములు విడిచె । నెన్నువతోడన్.

క॥ కలకంఠరంబున వనరెడు, జలజాక్షికి భర్త వెంటఁ । జనిన యడవియున్
విలసిల్లెఁ బ్రోలుగానిపు, డలరాణ్మృతి దుఃఖ జలధి । నడుగుల నిలిపెన్.

క॥ ముని పత్నులు తల్లుల వలె, జనక సుతను డాసి హస్త । సరసిజములతోఁ
గొని విమల జలములందున, మునిచి యడలు పోవఁ బలికి । మోదించి రాగిన్.

క॥ నలువురు రాజ కుమారులఁ, బొలుపుగఁ, గన్ పూజ్యురాండ్రు । మువ్వురతో వృ
ద్ధుల తోడ సుమంత్రుండిన, కుల జలనిధి విధుని కడకుఁ । గుములుచు వచ్చెన్.

తే॥ మొదటి వాఁడగు నలువకు । మొదటివాఁడు, తండ్రి వీడి వచ్చితిరెయో । తల్లులార!
యనుచుఁ దచ్చరణాబ్జ చ । యంబు లంటు, వ్రాలి కన్నీటి కాల్వలోఁ । బరితపించె.

క॥ వారలు నొక్కట రాముని, వారక కౌఁగిలిని చేర్చి । వనట యుబుకఁగా
బోరున రోదించిరి యం, గారమ్మున నేయి కరఁగు । కరణిఁ గరఁగుచున్.

తే॥ అవల నప్వీరులంగన్న । యవ్వలపటి, తీయని యెడంద గలుగుపై । దేహిఁజేరి
చెలువకట్టిన యప్పటి । స్థితినిగాంచి, కడుపు మండి కట్టుకొని పె । ల్లడలినారు.

తే॥ యోధవరు లయోధ్యంగల । యోగ్యజనము, రాజబంధువుల్ తక్కిన । ప్రజయువచ్చి
క్లిశిత మానసములతోడఁ । గిట్టిరాము, వేషమును స్థితిగని చాల । వెగచినారు.

చ॥ పడగల నీడఁబాఁప దణి । పాన్పునఁ బండుట మాని ధాత్రిపైఁ
బొడమిన లోక నాయకుఁడు । పొందిన తక్కల నాధుఁ దౌటచే
నడరిన యంటు వోమునిఁగి । యర్హ విధు లొప్పనరింప వేగెనాఁ
బడమటి వార్ధిలోమునిఁగె । భాస్కరుఁ డంతట లోక శాంతికై.

## భరతుఁడు రాముం బ్రార్థించుట

సీ॥ ఆనాడు కడపఁగా • నవనీపతులు రాజ, బాంధవుల్ మునులును • బలసియుండ
శ్రీరామ చంద్రుండు • చెంతనెయున్న భ. రతుఁ గాంచి వత్స! యీ • హితమువినుము
జనకుఁ దవ్వయ పదం • బునకేగె నతనియా, జ్ఞానుసారముగ రా • జ్యంబు నీదె
మకుటంబు ధరియించి • మహి నేలకీలఁ, దపసి వేసము నూనఁ • దగునె? యనుడు

తే॥ నీవు కాఱడవులఁ జేరి • యిట్టులుండ, ధర్మమూర్తు లెవ్వరు? పురి • ధర్మమేది?
పాడి నీకంటె మున్నెయీ • వనము చేరె, దానిఁబడసి కొంపోవంగఁ • బూనినాఁడ.

తే॥ మనసు సమ్మతింపని వర • మునసెనిన్ను, తగని స్థితి నిల్పియంతట • మగనిఁ జంపి
నట్టి కైకేయి కన్నట్టి • పట్టిగాన, నాకు నీవేషముచిత మ • న్యంబు తగునె?.

చ॥ జగములు సంతపింప బలు • జాలిని గూర్చిన దుష్టురాలి కిం
బుగ జనియించు పాపగుణ • పూర్ణుఁడఁ గావున నాకుఁ జావఁగాఁ
దెగువయుఁ గల్గ లే దొడలి • తీపియుఁబోదు తపంబు సేయఁగన్
దెగడికనుండి తప్పి కడ • తేఱెద నింత యనుగ్రహింపవే.

తే॥ కొలముపాడి వీడిన సతి • గుణము • నోర్పు పరఁగకుండు తపంబును, కరుణవిడిన
ధర్మమును, పూర్వ వంశ ప • ద్ధతులు నీఁగు, పాలనము కంటె మేలయి • క్రాలునేమి?

చ॥ జననము తోడ నీకుఁగల • స్వామ్యము, వీడఁగ రానిదౌసనా
తన కులధర్మమౌ పదవిఁ • దప్పఁగఁ ద్రోసి తపంబు పూనె దీ
వనునెడఁ బట్టుపట్టి నయ • మాఱిచి ధర్మముఁ ద్రెంచి మ్రింగువా
రిని బలె రాజ్యపాలన వ • రించి చరింతునె నీకుఁ దమ్ముఁడన్?

ఉ॥ మేర యిడంగరాని పెను • మేలిమి కూరిమితండ్రి చావఁగాఁ
గారడవిం జరియించుచును • కాయలు మెక్కుచు నీవు పోవఁగా
వేఱిమితోడ వంచనము • వెంచి ధరాస్థలిఁ గవ్వికొంటకున్
బేరిమి క్రుంగి యున్న తఱిఁ • బేరిచి నాఁచుకొనంగ వైరినే?

మ॥ భువనాధీశ్వర! తండ్రి చేయు పొరపున్ • బోరామి లోకాలకున్
దవులం జేసిన కైక కీడు భువిఁజెం • దన్ రాక రక్షింపఁ బ్రా
భవ సామ్రాజ్యము నేల రమ్మ జగముల్ • భవ్యంబులం బొంద మా
భవ బంధంబులు డింద నంచు నిటు వి • స్పష్టంబుగా నాడఁగన్.

తే॥ భరతు పల్కులు విని వాని • భావమెఱిఁగి, చింతనము చేసియతని నీ • క్షించి వత్స!
నాదు పలుకొండు కలదు వి • నంగఁదగును, చాల యోచింప ధర్మసూ • క్ష్మంబుదెలియు

ఉ॥ శీలము సత్యమున్ దగవు • చెల్మియు నీతియు వాంఛనీయమౌ
మేలిమి మున్నుగాఁగలుగు • మెచ్చగు సత్ప్రవృత్తులెల్ల భూ
పాలుర శాసనంబులకు • బద్ధములై భువి నిల్చుచుండు నీ
లీల మనంబు నందు పది • లించి తలంపుము సద్గుణాకరా!

ఉ॥ ఉత్తమ శాస్త్రముల్ వినుట • యుత్తమ బుద్ధి గడించు చుండుటల్
ఉత్తమశీలముం గొనుట • యుత్తమవృత్తుల నభ్యసించుటల్
చిత్తము దేవుపై నిడుట • చింతన సేయఁగఁ బెద్దవారె కా
సత్తమ మార్గ దర్శకులు • సత్యము నీవుఁ దలంచి చూడుమా.

తే॥ ఆమహాత్ము లెవ్వారని • యడుగ వలతె? యెల్లవిధముల మనసున • నెంచిచూడ
తల్లిదండ్రులు దక్క నీ • ధరణియందు, వేఱెవరు లేరు నిక్కంబు • విమలచరిత!

మ॥ జను లభ్యాసము సేయు శాస్త్రముల వై • శారద్యముం గొన్న పా
వన చారిత్రక! తండ్రి యాజ్ఞఁగొని సం • భావ్యాన్వయౌ చిత్యభా
వనతో దానిని సమ్మతించితిని నీ • ప్రార్థించుటంజేసి వీ
డినచో నయ్యది సద్గుణం బగునె? పా • టింపంగ లేవే మదిన్?.

క॥ తనయులు తలిదండ్రులకున్, ఘనకీర్తిని కూర్చుటకొ? య • ఘంబగు నిందం
బెనుచుటకొ నీవచెపుమా? జనియించిన ఫలము సుజన • సన్నుత చరితా!

ఉ॥ ఏను దురాశచే జనకు • నీభవమందునఁ గల్ల రీనిగాఁ
బూనిశి రౌరవంబున గు • భుల్లనఁ ద్రోచి వినోదసౌఖ్యసం
ధానక రాజ్య భోగములఁ • దాల్మిని పొంది రహింపనేర్తునే?
మానవుఁడైన వాని కిహ మాత్ర సుఖంబులు సుస్థిరంబులే?

చ॥ ధరణి నొసంగి సత్యమునఁ • దప్పక నిల్చిన తండ్రి పల్కుచే
భరత! ధరిత్రి నీదెయగుఁ • బాలన సేయఁగఁ దగ్గ సత్త్వముం
బొరసిన నీదెయౌ మహిఁ బ్ర • భుత్వపు టర్హత నీకెయున్న దిం
కరమర లేల? యేలుకొను • మయ్య జనంబులు సంతసిల్లఁగన్.

తే॥ అనుడుభరతుఁడిట్లను జ్యేష్ఠుఁ • దగుచుఁబుట్టి, మూఁడు లోకంబులనుసాటి • మొనయకుం
నీవ నాదిరాజ్యంబని • యెంచితేని, నీక యొసఁగితి రమ్మ మ•న్నించి మమ్ము.

ఉ॥ భూమి సమస్తముం గలఁగి • ముచ్చిరు చుండఁగఁ జూచి చూచి పై
నీమనమందు దోఁచు లలి • నే యొనరింతె? కలంక దేఱఁగాఁ
బ్రేముడి వచ్చి మమ్ముకయి • వీడక ప్రోవుమ యంచు దీనతన్
రామ పదాంబుజంబులు శ • రంబులఁ బాయక పట్టెఁ బట్టుడున్.

## భరతుఁడు రాముం బ్రార్థించుట

సీ॥ ఆనాడు కడవఁగా • నవనీపతులు రాజ, బాంధవుల్ మునులును • బలసియుండ
శ్రీరామ చంద్రుండు • చెంతనెయున్న భ, రతుఁ గాంచి వత్స! యీ • హితమువినుము
జనకుఁ డవ్యయ పదం • బునకేగె నతనియా, జ్ఞానుసారముగ రా • జ్యంబు నీదె
మకుటంబు ధరియించి • మహి నేలకీలఁ, దపసి వేసము నూనఁ • దగునె? యనుడు

తే॥ నీవు కాఱడవులఁ జేరి • యిటులుండ, ధర్మమూర్తు లెవ్వరు? పురి • ధర్మమేది?
పాడి నీకంటె మున్నెయీ • వనము చేరె, దానిఁబడసి కొంపోవంగఁ • బూనినాఁడ.

తే॥ మనసు సమ్మతింపని వర • ముననెనిన్ను, తగని స్థితి నిల్పియంతట • మగనిఁ జంపి
నట్టి కైకేయి కన్నట్టి • పట్టిగాన, నాకు నీవేషముచిత మ • న్యంబు తగునె?.

చ॥ జగములు సంతపింప బలు • జాలిని గూర్చిన దుష్టురాలి కిం
బుగ జనియించు పాపగుణ • పూర్ణుఁడఁ గావున నాకుఁ జావఁగాఁ
దెగువయుఁ గల్గ లే దొడలి • తీపియుఁబోదు తపంబు సేయఁగన్
దెగడికనుండి తప్పి కడ • తేఱెద నింత యనుగ్రహింపవే.

తే॥ కొలముపాడి వీడిన సతి • గుణము • నోర్పు పరఁగకుండు తపంబును, కరుణవిడిన
ధర్మమును, పూర్వ వంశ ప • ద్ధతులు నీఁగు, పాలనము కంటె మేలయి • క్రాలునేమి?

చ॥ జననము తోడ నీకుఁగల • స్వామ్యము, వీడఁగ రానిదౌసనా
తన కులధర్మమౌ పదవిఁ • దప్పఁగఁ ద్రోసి తపంబు పూనె దీ
వనునెడఁ బట్టుపట్టి నయ • మాఱిచి ధర్మముఁ ద్రెంచి మ్రింగువా
రిని బలె రాజ్యపాలన వ • రించి చరింతునె నీకుఁ దమ్ముఁడన్?

ఉ॥ మేర యిడంగరాని పెను • మేలిమి కూరిమితండ్రి చావఁగాఁ
గారదవిం జరియించుచును • కాయలు మెక్కుచు నీవు పోవఁగా
వేఱిమితోడ వంచనము • వెంచి ధరాస్థలిఁ గవ్వికొంటకున్
బేరిమి క్రుంగి యున్న తఱిఁ • బేరిచి నాఁచుకొనంగ వైరినే?

మ॥ భువనాధీశ్వర: తండ్రి చేయు పొరపున్ • బోరామి లోకాలకున్
దవులం జేసిన కైక కీడు భువిఁజెం • దన్ రాక రక్షింపఁ బ్రా
భవ సామ్రాజ్యము నేల రమ్మ జగముల్ • భవ్యంబులం బొంద మా
భవ బంధంబులు డింద నంచు నిటు వి • స్పష్టంబుగా నాడఁగన్.

తే॥ భరతు పల్కులు విని వాని • భావమెఱిఁగి, చింతనము చేసియతని నీ • క్షించి వత్స!
నాదు పలుకొండు కలదు వి • నంగఁదగును, చాల యోచింప ధర్మసూ • క్ష్మంబుదెలియు

ఉ॥ శీలము సత్యమున్ దగవు • చెల్మియు నీతియు వాంఛనీయమౌ
మేలిమి మున్నుగాఁగలుగు • మెచ్చగు సత్ప్రవృత్తులెల్ల భూ
పాలుర శాసనంబులకు • బద్ధములై భువి నిల్పుచుందు ని
లీల మనంబు నందు పది • లించి తలంపుము సద్గుణాకరా!

ఉ॥ ఉత్తమ శాస్త్రముల్ వినుట • యుత్తమ బుద్ధి గడించు చుండుటల్
ఉత్తమశీలముం గొనుట • యుత్తమవృత్తుల నభ్యసించుటల్
చిత్తము దేవుపై నిడుట • [illegible]న సేయఁగఁ బెద్దవారె కా
సత్తమ మార్గ దర్శకులు • [illegible]త్యము నీవుఁ దలంచి చూడుమా

తే॥ ఆమహాత్ము లెవ్వారని • యడుగ వలతె? యెల్లవిధముల మనసున • నెంచిచూడ
తల్లిదండ్రులు దక్క నీ • ధరణియందు వేఱెవరు లేరు నిక్కంబు • విమలచరిత!

మ॥ జను లభ్యాసము సేయు శాస్త్రముల వై • శారద్యముం గొన్న పా
వన చారిత్రక! తండ్రి యాజ్ఞఁగొని సం • భావ్యాన్వయౌ చిత్యభా
వనతో దానిని సమ్మతించితిని నీ • ప్రార్థించుటంజేసి వీ
డినచో నయ్యది సద్గుణం బగునె? పా • టింపంగ లేవే మదిన్?

క॥ తనయులు తలిదండ్రులకున్ ఘనకీర్తిని కూర్చుటకొ? య • ఘంబగు నిందం
బెనుచుటకొ నీవచెపుమా? జనియించిన ఫలము సుజన • సన్నుత చరితా!

ఉ॥ ఏను దురాశచే జనకు • నీభవమందునఁ గల్ల రీనిగాఁ
బూనిపి రౌరవంబున గు • భుల్లనఁ ద్రోచి వినోదసౌఖ్యసం
ధానక రాజ్య భోగములఁ • దాల్మిని పొంది రహింపనేర్తునే?
మానవుఁడైన వానికిహ-మాత్ర సుఖంబులు సుస్థిరంబులే?

చ॥ ధరణి నొసంగి సత్యమునఁ • దప్పక నిల్చిన తండ్రి పల్కుచే
భరత ధరిత్రి నీదెయగుఁ • బాలన సేయఁగఁ దగ్గ సత్త్వముం
బొరసిన నీదెయె మహిఁ బ్ర • భుత్వపు టర్హత నీకెయున్న దిం
కరమర లేల? యేలుకొను • మయ్య జనంబులు సంతసిల్లఁగన్

సీ॥ అనుడుభరతుఁడిట్లను జ్యేష్ఠుఁ • దగుచుఁబుట్టి మూఁడు లోకంబులనుసాటి • మొనయకుం
నీవ నాదిరాజ్యంబని • యెంచితేని నీక యొసఁగితి రమ్ము మన్నించి మమ్ము

ఉ॥ భూమి సమస్తముం గలఁగి • మున్నిరు చుండఁగఁ జూచి చూచి పై
నీమనమందు దోఁచు లలి • నే యొనరింతె? కలంకదేఱఁగాఁ
బ్రేముడి వచ్చి మమ్ముకయి • వీడక బ్రోవుమ యంచు దీనతన్
రామ పదాంబుజంబులు క • రంబులఁ బాయక పట్టెఁ బట్టుడున్

తే॥ నెనరు మనసున నీ, యిచ్చ నేర్చినట్లు, నేల యిచ్చుట కొనుటలు • నీతియగునె?
నిందకై జంకి జనకుండు • నీకునొసఁగ, నాఁడు సమ్మతించిన యేండ్లు • నేఁడె చనెనె?

తే॥ సత్యమొక్కటి దక్క యీ • జగము వేఱు, పూతగుణమున్నదని చెప్పఁ • బూనునేమి?
సత్యమున నుండి జాఱ దు • ష్కృత్యమయగుఁ, గాని వేతొండగునె నీవ • కాంచుమయ్య

క॥ ముదమున జనకుస యానతిఁ, బదునాల్గేండ్లేను వనుల • వసియింపంగా
సదమల మతివై యంతకు, వదలక నాయాజ్ఞ నీవు • వసుధం గొనుమా.

తే॥ తండ్రి యపుడె కిరీటంబుఁ • దాల్ప మనఁగ, నతని యాజ్ఞమీఱఁగ జంకి • యనుమతించి
నాఁడ నదియెంచి నాపచ • నంబు దాఁటఁ, దగునె? పని వినుమింకఁ జిం • తనమువలదు.

## వసిష్ఠుఁడు రాము నయోధ్యకు రమ్మని కోరుట

ఉ॥ తేజిత సత్త్వశాలియగు • ధీరుఁడు రాఘవుఁ డిట్లు వల్క వి
భ్రాజిత కీర్తిశాలి ప్రతి • భన్ భరతుండు వచింపఁ బూన నం
భోజభవాత్మజుం డనియెఁ • బూర్వ నిరూఢ పరాక్రమాఢ్యులౌ
రాజుల సచ్చరిత్రములు • శ్రద్ధను విన్మరియాట దీఱఁగన్.

ఉ॥ తొల్లి వరాహమూర్తియయి • తోయజ నేత్రుఁడు కోఱ పంట జా
బిల్లి కలంక మట్లు కను • పింప ధరన్ జలరాశి నుండి యు
త్ఫుల్ల మనంబుతోడ జన • ముల్ పరితోషమునొంద నెత్తి నాఁ
డుల్ల సిత ప్రకాశమున • నొప్పుచు నెప్పటియట్ల యుండఁగన్.

మ॥ విల యాంతంబునఁ బంచ భూతములు ని • ర్వీర్యంబులై తేజముల్
బొలియన్ దత్త్వము లెల్ల లీనమగుడున్ • భూతేశుఁడౌ విష్ణు వీ
జలరాశిన్ సృజియించి యందు బహు వి • శ్రాతిం గనంగోరి ని
ర్మలమౌ మేటి వెలుంగు రూపమున ని • ద్రం జెందె మఱ్ఱాకుపై

తే॥ ఉన్నతులగు వేల్పులకుఁ బీ • యూష మొసఁగు, కదలి వంటి నల్లని మేను • గలుగువాని
నాభియందు పుట్టిన నలి • నంబు నుండి, యఖిల జగముల సృజియింప • నజుఁడుపుట్టె

తే॥ అవ్విరించి జగంబుల • నివ్వటిల్లఁ, జేయుచోఁ గర్గెఁ దొలుత వి • శిష్టమైన
మీ మహాన్వయ మందలి • మేదినీశ, వరులు నెఱి దప్పు వారలీ • వఱకు లేరు

తే॥ క్రతులుశాస్త్రములిహపర • సుఖములొందఁ, గఱపుగురుఁడె పోషకుఁడు జ • గంబులందు
తండ్రులై దుగురం దని • తద్జ్ఞులండ్రు, నిక్క మిదియుఁ గుమారక! నీ వెఱుఁగవె?

తే॥ సదమ లాత్మక! యేను శా • స్త్రములు పెక్కు, లెలమి నేర్చిన ఫలమునా • కెనయునట్లు
నాదు పనుపు గాదనక వె • న్కకును వచ్చి, రాజ్య భారంబు పూనుము • రామభద్ర!

తే॥ అట్లు పలికిన కులగురు • నరసి రాము, చంద్రుఁడీరీతిఁ బల్కె నం • జలి ఘటించి
సర్వశాస్త్రార్థవేత్తలు • సద్గుణులరు, కలవె మీ రెఱుంగని ధర్మ • గతులు ధరణి?

చ॥ అగుదురు గాక సద్గురువు • లౌదురుగాక విధాత సూనులే
యగుదురుగాక దైవతము • లౌదురుగాకయుఁ దల్లి దండ్రులే
యగుదురు గాక సత్యసుతు • లాడి తొలంగమి కడ్డు లాడుటల్
తగునొకొ? మిమ్ముబోఁటి గుణ • ధన్యులకుం దలపోసి చూచినన్?

ఉ॥ తల్లి విధించెఁ జేయుమని • తండ్రియు నుత్తరు విచ్చియయ్యెఁ బైఁ
జెల్లుదునంచు నియ్యకొని • దీక్షమునన్ వహియింప కేగు నా
ప్రల్లదు పుట్టుకం బెఁ బడు • పాటుల మంచియుఁ జెడ్డఁగాన కే
పొల్లగు లంపటన్ దిరుగు • ముక్కిడి కుక్క భవంబు మేలెకా?.

చ॥ ఎదుట విధించు పెద్దల య • భీప్సితముల్ నెఱవేర్తు నంచు బెం
పొదవఁగ సమ్మతించితి స • మున్నత మానస మందు మీరలా
పదపడి యిట్టు లాజ్ఞ యిడు • వారలు! నేనెది చేయు టొప్పగున్
త్రిదశ మునీంద్రవంద్య! యుప • దేశము చేయుఁడి ధర్మ సమ్మతిన్.

చ॥ అనుడు వసిష్ఠ మౌని యిఁక • నాడఁగ నెయ్యది లేదయంచు శం
కనుగొని యూరకుండె నటఁ • గైక సుతుండను నట్టులైన మే
దిని పరిపాలనం జేలుపు • దిష్టము చిత్తము గల్గ వారలే
గొనకొని యేలనీ; యితనిఁ • గూడి వనంబులనే చరించెదన్.

తే॥ అనఁగ నత్తఱి వేలుపు • లది యెఱింగి, గుంపులై తమ్ముఁడన్న ను • గొంచుఁ బోవ
మన తలంపులు సఫలమ్ము • నెనయఁజాల, ననుచుఁ జింతించి యిట్లని • రందఱు విన.

చ॥ వినుత గుణాఢ్యుఁడై న రఘు • వీరుఁడు ధీకతఁ దండ్రి యాజ్ఞమై
వనులఁ జతుర్దశాబ్దము ల • వారణ రీతిగ నుండువాఁడు స
న్మనమునఁ గైక పుత్త్రుఁడు జ • నంబులఁ బ్రోచుచు రాజ్యమేలువాఁ
డినకుల వార్ధి సోములకు • నియ్యది యుత్తమ ధర్మమై తగున్.

ఉ॥ దేవత లిట్లు పల్క జగ • తీ తనయా వరుఁడంత నానుడుల్
ద్రోవఁగ రాని వయ్య మది • దొడ్డగ యోచన సేయ వయ్య నే
నీవని నుండు కాల మది • యెంత? పదంపడి వత్తు నయ్య ని
న్నీవిధి వేఁడికొందు నని • యచ్చ గ్రహించెను తమ్ము హస్తముల్.

చ॥ ఇటులను నన్నకయ్యనుజుఁ • డిట్లను నేమనువాఁడ నిందుపై
నటులె చతుర్దశాబ్దముల • యమ్మఱునాఁడె పురంబు చేరఁగాఁ
దటుకున రమ్ము రాకయటు • తప్పిన నీపదమాన సుమ్ము ప్రో
త్కటతర వహ్నిఁ జొచ్చి కద • గాంచెద నాఁడె సురల్ నుతింపఁగన్

తే॥ అట్లు శపథంబు చేసి హృ • దబ్జమందు, నెగులు విడిచెను భరతుండు • పొగడుగుడిచె
నదరు సల్కీర్తిత్వనకంబెం • బొదవుగాఁగఁ, గాంచు రామచంద్రుఁడు సమ్మ • తించెనంత

చ॥ భరతుఁడు వేశొకం దరుదు • భావన చేసి మహాత్మ! పాదుకల్
స్థిరమతినిమ్ము తత్ప్రతిని • ధిత్వము పూని ధరిత్రిఁ గాచి నీ
కరుణ గడింతు నన్నుఁ బద • కంజములం ధరియించు వాని ని
ర్జరుఁకు నొందరాని స్థిర • సౌఖ్యము లిచ్చెదు వాని నిచ్చినన్

ఉ॥ వారక బాష్పధార లొద • వం గల కన్నులతోడ ధూళి యొ
ప్పారిన మేనితోడ నమ • రాది సమస్త జనాళి దుఃఖ ని
స్తారక రామ పాదుకల • సమ్మతి రత్న కిరీట లీలఁజొ
క్కారముగా ధరించి రఘు • కాంతుని వీడ్కొని యంతఁగ్రమ్మఱన్

క॥ జనసులు బంధులు పెద్దలు, మునులును సచివులును పౌర • ముఖ్యులు తక్కం
జనములు భరతుని వెంటనె, చనియెం జన లేక రామ • చంద్రు నెడయుచున్

తే॥ ధర్మశాస్త్ర వీరుఁడు భర • ద్వాజుఁడేగె మరలె నింగిని కూడిన • సురగణంబు
కూర్మిమిత్రుండుగుహుఁడు వీ • డ్కొలువడసి, భరతువెంటనె చనెదుఃఖ • భరతుఁడగుచు

సీ॥ ఈపాదములె కదా • యింద్రాది సురల కా, పదవేళ నొదవెడు • పట్టుగొమలు
ఈ యంఘ్రులే కదా • శ్రేయంబు లొనఁ గూర్చు పావనగంగకుఁ • బ్రభ గృహము
ఈచరణములెకా • యింద్రియ జేతలౌ యతివర హృదయ గే • హముల దివెలు
ఈపదములె కదా • యింతి యహల్య పా, పంబుల మాన్చిన • వరుసవేది

తే॥ అనుచు భరతుండు తననింద • కాదుకొనిన పాదుకల మస్తకంబున • భక్తిఁదాల్చి
గంగదాఁటి పాదైచెడు • కాడుఁబోలు పురము సాకేతమును చొర • బుద్ధిగొనక

శా॥ నందిగ్రామమునందు పాదుకల నా నందంబున న్నిల్పి తా
మందుం బోలెనె రామసన్నిభ సుఖం • బుంబొంది రాజ్యంబు రా
జేంద్రుల్ భక్తినిగొల్వ మోదమున లో • కేశుల్ ప్రశంసింప స
ద్బృందంబుల్ సుఖియింప నేలె భువన • శ్రేయంబు గేయంబుగాన్

ఉ॥ రాముఁడు చిత్రకూటశిఖ • రంబున నుండెడిఁ జూత మం చయో
ధ్యామనుజుల్ ప్రియంబు మెయిఁ • దప్పక వచ్చుచు నెమ్మనంబు దో
లామతి సేయువారని త • లంచుచు నచ్చటు వీడి దక్షిణా
శాముఖుఁడై యతండు చనె జానకితో ననుజన్ముతోడుతన్

అయోధ్యాకాండము సంపూర్ణము
శ్రీ రామచంద్రార్పణ మస్తు,
ఓమ్ తత్ సత్

# అరణ్యకాండము

## 1. విరాధ వధ పటలము (72)

చ॥ మ నుజ విభుండు సత్త్వగుణ • మాన్యుఁడు జీవ హృదంతరాత్మయై
మననము సేయఁ జేయ మహి • మం బొనఁగూర్చెడు వేదముల్ విరిం
చనుఁడుఁ దపంబు సేసి కనఁ • జాలని సర్వ జగత్ప్రభుండు మా
మనమున కందువాఁడె? పలు • మార్గములన్ గమనించి చూచినన్

ఉ॥ ముత్తియముల్ కుదించి నటు • ముచ్చటఁ గూర్చు స్మితంబు మోమునన్
హత్తిన సీతతో యువకు • లాదటఁ జిత్ర శరాసనంబులన్
జొత్తిలఁ దాల్చి పత్రఫల • శోభితవాటి భవాబ్ధి పారగుం
డుత్తముఁ డైనయత్రి వన • మొప్పగఁ గాంచిరి వారుముందటన్

చ॥ గొనకొని భూమి భారము క • కుప్పల విల్చి వహించు మత్తవా
రణములఁ బోలె వారు ముని • రాజు వనంబునఁ జొచ్చి ముప్పగన్
దునిమి ప్రశాంతిమైఁ దపము • తొట్టఁ గఁ జేయు మునీంద్రుఁ గాంచి వం
దన మొనరించి నిల్వఁ బ్రమ • దంబును పొందె నతండు పొంగుచున్

ఉ॥ బందుగులెల్ల గీమునకు • వచ్చినచో గృహమేధి సంతసం
బందు విధాన నత్రి ముద • మంది కుమారకులార! మీర లి
ట్లొందఁగ దర్శనం బొసఁగ • నొక్కట దేవతలున్ జగంబులున్
గొందుగ వచ్చి నట్లడరెఁ • బుణ్యుఁడనైతి నటంచు మోదిలెన్

ఉ॥ ఆతనితోడ నాఁడచట • నర్మిలిమై వసియించి సాధ్వియున్
బూత చరిత్ర యత్రిముని • పుంగవు దేవ్యనసూయ సీతకుం
బ్రీతి నొసంగు గంధ ఫల • వస్త్ర సుభూషణరాజిఁ గొంచు రా
మాతిలకంబు రా విబుధ • మాన్యులు దండకఁ జేరి రంతటన్

। మదవారణంబులు • పదునాలు నంత రెం డంతల సంఖ్య పం • చాననములు
పదునాలు శరభముల్ • గుదిగాఁగఁ గూర్చిన ముమ్మొన వాలు చేఁ • బూన్చి పట్టి
జుంజులు జేగులు • జొంపంపుఁ దలవాఁడు విషగిరి నడచెనా • వెలయువాఁడు
క్రొమ్మొగుల్ వసియించు • కొండలు కాలఁ ద్రొక్కుడు దూదివలె లేవ • నడచువాఁడు

। వ్రణము లట్లు ప్రకాశించు • కనుల నుండి, మిడుఁగుఱులురాల రవిక్రుంగ • మిన్ను వడఁక
నవనియును దద్దఱిల్ల మహాబలిష్ఠుఁ, డైన యముని చేవయును కా • ర్శ్యంబు నొంద

సీ॥ సింహాసంపుము ప్రవే • శించి గర్జించెడు, శ్రవణ కందరముల • ప్రక్కలందు
నెల్లదిశల విల • సిల్లెడు మేరు శి, ఖరములు వో(గుల • నొరయు చుండ
మొగుళులసందున్న( • బొడసూపు నెత్తురి, యాకసమోయన • నతిశయిల్లి
నల్లచే( దడిసిన • నల్లని కాయంబు, చందన సిక్తమౌ • చందమొప్ప

తే॥ వీరులను తురంగమముల • వారణముల, నరదములను సింగంబుల • వ్యాఘ్రములను
చిక్కవాని నెల్లను కొండ • చిలువలందు, గూర్చు దండలు కుత్తుక( • గొమరుమిగుల

ఉ॥ కొండల( బోలె శూలమున( • గుచ్చిన యేనుగులం గరంబు లొం
డొండుగ నంది యాయ(గ మ • హోన్నత పర్వత కందరంబు నా
నుండెడి బాకినోట నొక • యోరను ముడ్చి మెదించి మ్రింగుచున్
మెండగు నా(కటం దనివి • మేకొనకుండెడు బొట్టపొట్టతో

ఉ॥ పన్నగరాజ రత్నముల • బంధురలీల( బొదింగి వానితో(
బ్రన్నన రాహు పాశమున( • బట్టి దిగీశ విమాన పంక్తులన్
గ్రన్నన( గూర్చి ఋక్షముల( • గట్టిన మాలికలోన గ్రామలన్
మన్నన( జేర్చి తాల్చు జయ • మాలిక వక్షమునన్ రహింప(గన్.

ఉ॥ సంజను వహ్ని( బోలి పరు • సం బయి యెత్తు( దనంబు మీఱు నా
జంజుకు వెంద్రుకల్ విరియ • శోభన వారణ కుంభమట్టు లు
బ్బంజను ఫాలభాగమున • వాసవ సామజ ఫాల పట్టమున్
రంజిలు పొన్ను పొన్ను రద • నంబులు చొక్కముగా వెలుంగ(గన్.

తే॥ నలుపు మీఱంగ( గ్రూర గు • ణంబుపొంగ, నలుక( దగియున్న కొడిమెవి • సాగ్నులట్లు
పొలయ( దామసమను నిరుల్ • పూ(తగా(గ(, బూసికొనివచ్చు కలికాల • మోయనంగ.

ఉ॥ చంపిన వే(గిచర్మములె • సన్నని వల్వగ దంతి చర్మముల్
జంపగు నుత్తరీయముగ( • జాలగు దిగ్గజ మస్తముక్తముల్
పెంపగు నందుకంబులుగ( • బెన్చిన లావగు కొండ చిల్వలే
సొంపగు కాసెగా(గ యి(ద్రి • శూలము దాల్చి హరుండు నా(దగన్.

తే॥ ఫణి ఫణామణి ఖచిత కం • కణము లొప్ప, చేతులందున వలమురి • చింద మమర(
జేయు కడియంబులును దాల్చి • జీబులైన, మీసముల( గల్లువాసన • మిగుల( గొలుప.

శా॥ కైలాసంబును మేరు భూధరము ను • గ్రస్ఫూర్తి( జెండ్లంబలెన్
దూలందన్ను బలిష్ఠ పాదములతో • దుర్వార వేగంబుతో
వేలావేష్టిత భూతలంబు తనతో • వెన్నంటి రా నాదితే
యాలోకంబుల నంతరంగముల న • ల్లాడించు రౌద్రంబుతో.

ఉ॥ స్థూలములైన భూతములు • చొక్కముగా నొక రూపమందెనన్
బోలిక వాఁడు మేఘ రవ • ముందలపించు నెలుంగు వాఁడు గీ
ర్లాలసుఁ డిచ్చనిచ్చు నొక • లక్షయు నిర్వదియైదువేల నా
గాలి బలంబు గల్గిన య • జాండ భయంకర దుష్ట కర్ముఁడున్.

చ॥ బెడిదములైన గుంపు మగ • పిడ్గులఁ బోలిన క్రూరకృత్యముల్
నడపెడువాఁడు కూళుఁడు చె • నంటి విరాధుఁడు డాసి వృక్షముల్
బెడియుచుఁ బెల్లగిల్లఁ బృధి • వీ ధరముల్ వడి వ్రీల రేఁగి దుం
దుడుకున దొడ్డ విండ్లు గల • దోర్బలవీరులఁ గాంచి కేరుచున్.

ఉ॥ కోఱలఁ జూపుచున్ బలుపు • కొండ గుహంబలె నోరువిప్పుచున్
మీఱి యదల్చి నిల్మనుచు • మ్రింగెడు పోలిక వచ్చి తెప్ప ల
ట్లాఱుచునంతలోన విక • చాంబుజ మందు వసించు హంసి వా
సౌరు వహించు సీతఁగొని • చయ్యన వ్యోమ పదంబు ముట్టఁగన్.

మ॥ పురుష శ్రేష్ఠులు వానిఁ గాంచి మిగులం • బొల్పారు కోపంబుతో
శరముల్ విండ్లను గూర్చి వెంటఁ జనుచున్ • జా వేఁడి యిట్లేల రా
జరుగంజూచెదు రాక్షసాధమా! యెటే • చందాన నీవేగినన్
బరియల్ సేయక వీడ బోము నిలుమా • పందా! యనన్ దైత్యుఁడున్.

మ॥ తొలి వేల్పిచ్చు వరంబుచేత నసువుల్ • ద్రుగింపలేరెవ్వరున్
బలిమిన్ ముజ్జగ మొక్కటై యెదిరి నన్ • భంగింపఁగా లేదు నే
నిల నేకైదువు లేకయే యెసఁగి మా • యింతున్ సమస్తంబు మీ
కెలమిం బెట్టితిఁ బ్రాణ భిక్ష చనుఁడెం • దే నీ చెలిన్వీడుచున్.

మ॥ అని శ్రీరాముఁడు దంత కాంతు లొలయన్ • హాసంబు గావించి యీ
దనుజుం డెన్నఁడు పోరెఱుంగఁడు భుజో • త్సాహంబు దర్పంబు నొ
క్క నిమేషంబున నూఱడిల్లి సమయుం • గాకంచు లోనెంచి ని
స్వన పూర్ణంబుగ నారి లాగుచు ధను • ష్టంకారముం జేయఁగన్.

విరాధ యుద్ధము

తే॥ విరిసి యాధ్వని సాగర • వేష్టితంబు, కుధర భరితంబునైన యీ • కువలయంబు
నమర నాగాది లోకంబు • లధిగమించి, యశనిపాతంబు చందాన • నతిశయిల్లె.

తే॥ వంచక విశాల వదన గ • హ్వరము నందు, చిక్కి తపియించు చిల్కనాఁ • జెలఁగు సీత
నిలను వదలి దైత్యుఁడు సుంత • చలితుఁ డగుచు, నంజనాద్రిఁ బోలినరాము • నడరితాఁకి

శా॥ వేరాగాద్యుల యాఁకలిం దనుప వి • ద్విడ్బృంద కీలాలమున్
వేతః ప్రీతి నొసంగి వారి వినుతుల్ • చేకొంచు నాదిత్య హృ
ద్భీతిం గూర్చుచు బాడబానల శిఖా • దీవ్యత్ప్రభాయుక్తమై
చేతం దాల్చిన శూలమున్ విసరె నా • శ్రీరాముపై నుద్ధతిన్.

ఉ॥ దిక్కులు దిక్పతుల్ సురలు • దిక్కరులున్ భువనంబు సర్వమున్
దిక్కఱి వెక్కసంపడ ను • దీర్ణహలాహల మట్టురాగ. స
మ్యక్కులశైలమట్లు కన • కాచల మట్లు వెలుంగు చాప మం
దొక్క యలుంగు గూర్చి చెవి • యొందఁగ లాగుచు రాముఁడేయఁగన్.

తే॥ అసుర కుల మెల్ల నేఁడె పొం • గాఱె ననఁగఁ, బట్ట పగలునక్షత్రముల్ • పడియెననఁగఁ
దుండ్లు తుండ్లయి శూలంపుఁ • దుంట లెల్లఁ, జువ్వలట్టులఁ బఱచుచుఁ • జొచ్చెదిశల.

చ॥ సురలకు మృత్యుహేతువగు • శూలము త్రుంగుటఁ జూచి రక్కసుం
డురవడిఁ జేతులన్ మలల • నూడ్చి రఘూత్తము పైనవైవ న
గ్గిరులను వజ్రసన్నిభ ని • కృంతన భల్లము లేసి త్రుంప నా
పరియలు వానిపై మరలఁ • బాఱి శరీరము నొవ్వఁ జేయఁగన్.

తే॥ దైత్యుఁడంతట నొక మహా • తరువు పెఱికి, విజ్ఞు లెవ్వని తత్త్వంబు • వేడ్కఁగాంత్రు
ధర్మముద్ధరింపఁగ నేఁడు • ధరకు దిగియె, ప్రణవ మంత్రార్థ మెవ్వఁడా • రామునేసె.

క॥ వీరుఁడు రాముఁడు నాలుగు • నారసముల దానిఁద్రుంచి • నాటించెను నా
లాలు శిత శరము లసురుని, పేరురమున బాహువులను • భీకర లీలన్.

తే॥ కంటకములు వేధింప ముం • గాళ్ల తోడఁ, దీయనెంచి సంకటపడి • దేహమును వి
దిర్చికొను నేదువలెఁ దన్ను • దివిరినొంచు, ములుకులూడ మేనినివాఁడు • ముడిచివీడ్చె.

ఉ॥ నిప్పుల వంటి ముల్కులవ • నీవిభుఁడేయఁగ నవ్వి మేనిపైఁ
గప్పక దూఱి దూయుటయుఁ • గష్ట విచేష్టితుఁడైన కూళయున్
గుప్పున మేనినుండి వడి • గ్రొచ్చిన గంటుల రక్తధారలన్
దొప్పగఁ దోఁగి సత్త్వమును • త్రుంగఁగఁ దెల్వి నశించి నిల్వఁగన్.

చ॥ పిడికిటి పోరునందు బహు • విశ్రుత వీరులు రామలక్ష్మణుల్
చెడని వరంబు గొన్నబల • శీలి యితండు శరాళిచేతఁ జా
వఁడు మరలన్ రణంబునకు • వచ్చు నటంచు నరాజిధూసి కే
లెదయఁగఁ ద్రుంతమంచు • నసురేశు భుజంబుల నెక్కనాతఁడున్.

తే॥ పొంగిపాఱెడు శోణిత • పూరమొప్ప, సుంత దెలిసి భుజంబుల • శూరవరుల
నొక్కనరక పదింతలు • మిక్కుటముగ, గగన వీధిని ఏఱచె న • గ్గలిక మెఱయ.

తే॥ కనక గిరిఁ జుట్టు చంద్ర భా • స్కరులఁబోలి, యిరువురొప్పారనసురయం • బరమ
రక్త కాయంబు తోడను • ర్విడి గదించి, దిరిగె గిరగిర శరధి మం • దరము మాడ్కి.

ఉ॥ బంగరు చాయ వాఁడసిత • వారిద వర్ణము వాఁడు బాహులన్
రంగరుచుండ మింటికిఁ ద్వ • రన్ నెగయంజను సోఁకుచూడఁగా
సంగడి నన్న లం గొనుచుఁ • జయ్యన మింటికి నేగు పాడి రా
పుంగొని యొప్పు పక్షికుల • పుంగవుఁ దార్క్ష్యుని బోలె నత్తఱిన్.

క॥ కరుణా కరుఁడగు తనపతి సురరిపుచేఁ బడఁగ్న,సీత • సుడి వడి హంసన్
దొరఁగిన హంసిం బలెవా, డొరసెన సుమవల్లి వోలె • నుర్విర వ్రాలెన్,

తే॥ పదముపడి లేచి వేతొండు • పలుకఁ దోఁప, కునికి నదు మసియాడనా • దనుజునంటి
చనుచుఁ దల్లి బోలిన దయా • గుణుల వీడి, తన్ను భక్షింపుమని సీత • ధరణిఁగూలె.

తే॥ పనవి పలుకులు తడఁబడఁ • బ్రాణములును, వాడఁ జేష్ట దక్కిన సీత • పగిది యెఱిఁగి
యన్నఁ గనుఁగొని లక్ష్మణుఁ • డార్య! దేవి, పరితపింప నిట్లుండుట • పాడియే? యన.

చ॥ జరుగఁగఁ దగ్గఁ త్రోప యిటు • సాగుట మేలె యటంచు నెంచితిన్
దొరకొని వీనిఁ జంపుటది • దొడ్డయే? యంచు హసించి రాఘవుం
డురుతర పాదఘాతమున • నుర్విరఁ గూలఁగఁ దాఁప వాఁడు పెం
దరువు ప్రభంజనాహతికి • ధరిఁ గూలిన పోల్కిఁ గూలుచున్.

చ॥ ధరఁబడి రోఁజుచుండఁ గని • దైత్యుని రాజకుమారు లిద్ద ఱు
ద్ధురతర బాహుమూలములఁ • ద్రుంచుచుఁ దూఁక విరాధుఁ డుగ్రుఁడై
యురవడి సూర్యచంద్రుల స • ముద్ధతి మ్రింగఁగ వచ్చు రాహు వ
ట్లిరవుగ రామలక్ష్మణుల • నెత్తుగడం గబళింప వచ్చుడున్.

చ॥ వ్రణముల నుండి యోడిగిలు • రక్తము పై పయి వృద్ధినొంద దు
ర్గుణుఁడగు దైత్య ప్రాణములు • క్రుంగమి రాముఁ డెడంద నెంచి ల
క్ష్మణుఁగని గుంట ద్రవ్వుము ని • శాచరుఁ బూడ్చుట యుక్తమన్న స
ద్గుణయుతుఁ డొక్క పల్లమును • త్రొచ్చెను బాణబలంబునన్ వడిన్

చ॥ నదుల జలంబునందు జత • నంబున దోషిని పాచితంబుకై
వదలక ముంచునట్లు ర • పర్యుఁడు త్రోవఁగరాని దొడ్డ యం
గదలఁ దొలంచు భక్త జన • కామదమైన పదంబు తోడ నా
మదయుతుఁడైన రక్కసుఁడు • మ్రింగఁగ బల్లమునందు త్రోవఁగన్

చ॥ తొలుతను బ్రహ్మయై నెగడి • దొడ్డ యజాండము సృష్టిచేసి యం
దుల వడిఁ దానొకడుంగను • తోఁచిన రాముని కాలి తాఁకుచే





నలఘుఁడు నోఁకు పూర్వముల • కాధిపుఁ డిచ్చిన శాపశక్తిచేఁ
గలిగిన ఘోరరూపమును • గ్రక్కున వీడి గమించె మింటికిన్.

తే॥ ఎగిరి గంధర్వుఁడై నిల్చి • యింద్రియముల, విషయములకు వశంబయి • వీఁగుబుద్ధి
మాలు సుజ్ఞానియై భక్తి • మనసు నందు, గలుగ రాఘవు వినుతించె • గారవమున.

విరాధుఁడు రాముని వినుతించుట

చ॥ శ్రుతుల నుతించు నీదగు వి • శుద్ధ పదంబులు సర్వలోక సం
గతములు గాఁగ వ్యాప్తిగొనఁ • గాఁ గడ మంగము లెట్టి వ్యాప్తివో?
రతనపుఁ డెంకి యందునఁ డి • రంబుగఁ గాక యొకండొకంటితో
నతుకని పంచ భూతములు • యందును నిల్చి న నిన్ భరించునే?

మ॥ గజనాధుండు జలగ్రహ గ్రహణ దుః • ఖంబంది కేలెత్తియో
త్రిజగద్వంద్య! ముకుంద! దేవ! శరణా • ర్థింజూడవే ప్రోవవే
భుజగాధీశ్వర తల్ప! యంచుఁ బిలువం • బూర్ణాను కంపామతిన్
నిజ సంశీలత దంతిఁ గాచితివి ని • ర్ణిద్రాప్ర మేయాకృతీ!

తే॥ ఇహపరంబులు గన నడు • నెడను నిలిచి, స్థిర కృపాకటాక్షంపు వీ • చికలఁబరపు
దేవ! నీవాకో? ధర్మను • స్థితిని మనుప, నొంటరిగ గాలిపడగ నా • నొలయుచుంటి.

ఉ॥ పుట్టుట గిట్టు టాటలుగఁ • బూన్చిన దేవ, విరాగ పూరుషుల్
పుట్టిన చారి పూర్వగతి • పోవునె! తక్కినవారి కైవడిన్
బుట్టుదురేమి? తొల్లి తమ • పొందిన సంస్థితిఁ బొందు టబ్రమే?
యిట్టలమైన సద్యశము • నెల్లెడ నించిన రాఘవేశ్వరా!

చ॥ భయమును కూర్చునట్టి భవ • వారిధి దాఁటఁగ నావ యంబుగా
నయగతిఁ బూను సర్వమత • నాయకులట్టి మతాధి దేవతల్
నియమిత తత్త్వరూపివయి • నీవు జగంబుల నుల్లసిల్లనే
జయ మహిమంబు లొందుదురు? • సల్పున దెయ్యది? రాఘవేశ్వరా!

తే॥ బ్రహ్మ మొదలుగ నెల్ల ని • ర్జర వరులకుఁ, దక్క ప్రాణులకు మొదలి • తండ్రినీవ
యైనచో లోక ధర్మంబు • ననుసరించి, ~~కాంచి~~ పెంచెదు తల్లిగాఁ • గ్రాలు టెవరొ?

ఉ॥ నీవె పరాపరంబు, గతి • నీవె, సమస్త మహాండ జాలముల్
నీవె, చరా చరంబులును • నీవె, విచారణ చేయఁ దేబుటల్
నీవె, మతంబు లన్నియును • నీ చరణావధులే, యిటేల మా
యావిధిఁ గ్రీడ సేయు వల • పా? మటి దొంగ విధంబు లేలొకో!

ఉ॥ రానరుదైన వానిక్రియఁ • గ్రాలుచు వచ్చు మహేశ! ధేనువుం
గానని దూడ వత్సమును • కానని గోవును లేవు; లోకజా
లానకుఁ దల్లి నీవయిన • లాలిత రీతి నెఱుంగు దెల్లయున్
గానఁగఁ జాల దీ జగము • గాంచిన తల్లి నిదేమి మాయయో?

చ॥ జనములు పెక్కు దైవముల • సన్నుతి సేయఁగ నిచ్చగింతు రై
నను నినుగాక యన్యమగు • నాయకదైవము గల్గునంట స
జ్జనుల కనర్హమౌ; కమల • జ త్రిపురాంతక నిర్జరావళుల్
వినుతి యొనర్తు రిన్నియని • విజ్ఞ సమూహ మెఱుంగ కున్నదే?

శ్రీనివాస! రమేశ! ని • ర్నిద్ర! జగతిఁ, బలుమతముల దైవములు ద్వం • ద్వములఁదగులు
వారివలెఁ దపించు; ని • ర్ద్వంద్వుఁడైన, యీవు నిద్రింప కీవేష • మేలకొంటి?.

మోయుచున్నాఁడ వహివయి• భూవరాంగి, నెత్తుచుంటివి పోత్రివై • యెలమితోడ
గ్రుక్కగొందు వొక్కొకపరి • కొలుచుచుందు, విద్ది శ్రీదేవి యెఱిఁగిన • నెరియకున్నె?.

నీవు పుట్టించు జీవులు • నిజము నెఱిఁగి, కొఱల దానిచే నీకింత • కొదువ పడునె?
కర్మనకు నిచ్చు భిక్షచే • శంకవిడిన, వారు మర్త్యు లమర్త్యులౌ • ప్పటికిఁ గలరె.

మ॥ భువనోద్ధారణ! హంసవై నిగమముల్ • బోధించి తా బ్రహ్మ క
య్యవి నీ కెవ్వరు మున్ను నేర్పి? రలవా • రంతంబు పాటించిరే?
భువి జీవాత్మల వేఱయ్యే యొకటియై • పొంకంబుగా నుండు సం
భవ మవ్వానిని వీడియో? విడకయో? • భావింప నేమాయయో?.

చ॥ అసదృశమూర్తి! నీవు తొలి • నాడటఁ బండిన పాలవెల్లిఁ బా
ప సకిన మంచము న్విడిచి • పాపుని దానుసి గాచుకై కృపా
రసము వహించి వచ్చి తమ • రన్ భవసాగర మీఁదఁగంటి నిం
పొసఁగు భవత్పదాబ్జ మహి • మోన్నతి నేమని సంస్తుతింతునో!

ఇట్లు వినుతించు నతని పే • తేఱుఁదరసి, యిట్టి జన్మంబు రాఁగత • మేమి తెలుపు
మనుడు నాతఁడసత్య జీ • వనము తొలఁగ, జ్ఞానమొసఁగు పదాంక! నా • చరిత వినుదె?

అలక వాసిని తుంబురుఁ • డనెడు వాఁడ, రంభ నాట్యగానంబు లా • రంగఁ గాంచి
లచి కలియుటచే శ్రీదు • వలన నాకు, నిట్టిజన్మంబు సిద్ధించె • నేమి సెప్ప?

కొదఁగి జ్ఞానంబు మొదలంటఁ • దుడిచివైచు, కామరుజ నన్ను వెన్నంటఁ • గలుగుకతన
రుణ మాని కుబేరుండు • కరిన దైత్య, రూపి వగుమని తిట్ట నీ • రూపువచ్చె

క॥ శాపముక్తి తెలుపఁగ, దే శంకరమిత్ర! యంచునే • వేఁడ భవత్
పేశల పద తాడనమున, నీశాపము దీఱునంచు • నెఱిఁగించె దయన్.

క॥ స్వర్గపదం బెల్లెడల న, సర్గళ గతిఁ దిరిగి వేఁడు • నరహంతకుఁడై
దుర్గముఁడై దానవకుల, మార్గు డగు కిలింజునకుఁ గు • మోరుడ నైతిన్

క॥ మంచియుఁ జెడుగు నెఱింగెడు నంచిల మతిలేక చెడుగె • యార్జించితిఁ గా
న్పించిన ప్రాణుల వీడక వంచి విఱిచి పొట్టఁబెట్టు • పంచనకలనన్

తే॥ నన్ను సద్గతికిం ద్రిప్ప • నున్ననాదు పూర్వకృత పుణ్యమువె నిటు • పొగడఁదగిన
నిగమని శ్రేణిగల పద • నీరజములఁ బొంది తెలితి నెప్పటి • పొలుపు గొంటి

తే॥ నన్ను గ్రుంగించు పాప గ • ణంబులడఁచు నిన్ను వెడఁగనై నేచేయు • నేమములను
మన్నన యొనర్చి ప్రోవు స • న్మాన్య! యనుచుఁ గ్రన్న నెలవంది దివ్వు మొ • గంబుతో

తే॥ సాధువుల బాధ సేయు వి • రాధుఁ డీల్గె, ననుచు నలరిన విమలాంగి • జనకజాతఁ
గూడి వేడుక వనములఁ • బాడుచుండు, పక్షి రుతముల వినుచు న • వ్వారుచనిరి

తే॥ కాలుఁ బోలు శరంబులు • కరముందు గలుగు రామ లక్ష్మణుల నాఁ • డెలమి మిగుల
వేదములె రూపునొందిన • విధిని వెలయు మునుల వనముల మసలిరి • ముదితతోడ

## 2 శరభంగ ముక్తి పటలము (44)

క॥ ఆ రాత్రి వికచ సుమలత సొరుగు మహీజ తోడ • సౌఖ్యంబుగ న
య్యారామమందు కడపి శు భారంభకులు శరభంగు • సరయఁగఁ జనుచున్

క॥ సునిశిత రసంపన్నులు• ఘను లవటికిఁ జేరునంతఁ • గలువల దొర పు
ట్టిన ముడుఁగని తమ్ములఁ బో ల్కను లోకవెయి గలుగు ప్రోడ • గానఁగనయ్యెన్

క॥ తెలిపిట్ట నడకగల వే, ల్పుల చెలువలు దాల్చినట్టి • భూషణకాంతుల్
మిలమిల మని మిన్నున మెఱు పుఱు మెఱయఁగ వాని నడుమ • బొలుపుగొలుపుచున్

చ॥ మెఱుగు నీల దేహమున • వేల్పు పడంతుల యాస్య పద్మ కో
మల వన చారులౌనియన • మంజుల భృంగ సహస్రకంబుతో
గుహ సుభాశివే మహతి • కమ్ర నినాద మధుద్రవంబు ని
మ్ములఁ జవిచూచుచుండు శ్రుతి • పుష్పలిహంబులతో ముదంబుతో

తే॥ శాస్త్ర సమ్మతముగఁ గ్రతు • శత మొనర్చి నట్టి మేటరి మూర్తిత్ర • యంబుదక్క
దక్క వెల్పుల మకుటము • ల్దాఁకు నట్టి, గండ పెండరముఱు కాళ్ళఁ • గలుగు వాఁడు

తే॥ జలజవాసినిఁ బోలిన • శచిని గూడి ముమ్మదంబుల చౌదంతి • నెమ్మినెక్కి
వెండి కొండపై నగజతో • వేడ్కనుండు లోకనాథుని శంభుని • జోక నెనసి

తే॥ ఏమ కలిగి వ్యర్థంబని • యెంచి విధుఁడు టిపియ పడి కంతి హీ నుడై • వెల్లఁ బాఱ
స్వర్గమే గొడుగయి తన • పైన నిఱుచు దంట పంబు శ్వేతాతప • త్త్రంబుతోడ.

సీ॥ దిక్కరుల మదమను బింకఁ • జిక్కఁ జుట్టి, బవరముల యందు ధృతిచెడి • బడలి పాఱు
నసురవరుల కీర్తులఁబట్టి • యంటఁగట్టి, నట్టులున్న వింజామర • లండ బెరయ.

సీ॥ అరుణ కిరణుండు నిల్చిన • యట్టులున్న, మేటి బొమ్మి డీకము తల • మెఱయువాఁడు
కౌస్తుభంబు కైవడిని ప్ర • కాశ మమరు, రత్న హారంబు బొమ్మునఁ • గ్రాలువాఁడు

సీ॥ భాను సంకాశ రంజిత • వజ్రఖచిత, కవచ మవయవంబుల మీఁద • గలుగువాఁడు
విజయలక్ష్మి మందస్మిత • విధము దోఁచు, హార కేయూర భుజములొ • ప్పారువాఁడు

సీ॥ లెక్కలేక రత్నంబులు • చెక్కినట్టి, నగల జగియెల్ల నొక్కటై • నెగడి చిత్ర
ఫక్కి వెలుఁగంగ నింద్రచా • పంబుతోడి, మొగులుకుప్పనాఁదగి డాలు • మునుమువాఁడు.

సీ॥ సకలజగములఁ బరవు వా • సనలు గలుగు, మధువు చిందెడు క్రొవ్విరి • మాలవాఁడు
మీల గెలిచిన వేలుపు మెఱుఁగుఁ బోండ్ల, కనులఁ బోలిన ఖడ్గంబు • గలుగువాఁడు.

సీ॥ భువన కంటకుఁడగు పది • మోము లతని, మీఁద వైవఁగ వరిముక్క • మేనయేని
మొక్క వోవక కాంతియుఁ • బొలియకుండు, పవిని చేపట్టు నింద్రుండు • పజ్జనిలిచె.

సీ॥ ఉరు తపోధనుఁ డెదురేగి • యుపచరించి, వచ్చుపనియేమి యన వజ్రి • పలికెనిట్లు
నీ తపంబును మెచ్చి య • బ్జాతభవుఁడు, తోడి తెమ్మన వచ్చితిఁ • దోడకొమ్ము.

సీ॥ స్రష్ట మీకిచ్చె నాతని • సత్యలోక, మీరు వేంచేయ ధాతయు • నెదురువచ్చు
శ్రేష్ఠ లోకంబనుచు దానిఁ జెప్పవలెనె? యీర లెఱుఁగరే యన నాతఁ • డిట్టులనియె.

సీ॥ కదలఁజాలని బొమ్మల • కరణినుండి, చెడెడు సత్యలోకంబు నేఁ • జేరఁగలనె?
బాధ తపమూని పెక్కు క • ల్పములు గడచె, నీ వెఱుంగవె? యల్పంబు • నిచ్చగింప.

సీ॥ ఇట్టి వార్త నీవును వచి • యింపఁ దగునె?, బ్రహ్మలోకంబు పడసియు • ఫలముగలదె
బహుళ భాషలఁకేల? త • పః ఫలమ్ము, వొందు కాలంబు డగ్గఱె • భువనవంద్య!

సీ॥ సుస్థిరంబయి నిలుకడ • చొప్పు చెడక, పెరుఁగక నశింపక గుణము • వేఱుపడక
సకల భూతముల్ నశియింప • సమయకుండు, మోక్ష పదవిని నేనిప్డు • పొందువాఁడ.

## రామలక్ష్మణులు శరభంగుని చూడవచ్చుట

సీ॥ ఇట్లు శరభంగ ముని వచి • యించు నెడను, దృఢధనుర్ధరులటవచ్చి • యెదుటఁగలుగు
కలకలంబును విని యేమి • కతమొయనుచుఁ, దమ మనంబుల యోచించి • డాసి కాంచి

సీ॥ బలితమై వజ్ర ఖచిత సం • బములు వెలయు, నాల్గు రదనముల్ గల సిత • నాగముఁగని
యింద్రుఁ డిమ్ముసీంద్రుని గన • నేగు డెంచి, యుండునని మదిఁదలపోసి • యుత్సహించి

సీ॥ హరిణాక్షిని తమ్ముని ముని, వరు నాశ్రమ వనముబయట • వదలి యొకండె
హరివలె వృషభమువలె రఘు, వరుఁడట కరుదెంచె వర త • పస్విం గాంచన్

క॥ సురలోక నాయకుండీ, ధరనాలుగు వేదములకుఁ • దధ్య ఫలంబౌ
పరమూర్తి రామభాస్కరుఁ, బరుఁగాంచె సహస్రనయన • పద్మము లలరన్

తే॥ కాంచి మదినొచ్చుకొని తన్ను • గాచునతని, బ్రహ్మవిద్వరులకు నధి • పతియునైన,
రాము సతతంబు మ్రొక్కు శి • రంబుతోడ, భుజములను వంచి సాష్టాంగ • ముగ నెఱంగె.

సీ॥ జయకేతనంబెత్తి • శత్రులఁ బరిమార్చి, వేదార్థముల నేర్పి • విశద ఫణితి
సద్ధర్మమును సదా • సన్మార్గమునఁద్రిప్పి, సంపదనొసఁగి మో • క్షంబు నిచ్చి
శరణాగతులకు వ • జ్ర కవచ మయ్యును, ప్రాణంబులయ్యుఁ • దపంబు నయ్యు
నయనంబులయ్యు సు • జ్ఞానంబు నయ్యు వే, ర్పడక రక్షించు శ్రీ • రాము జూచి

తే॥ యధిక సమ్మోద భరమున • నవశుఁడగుచు, మనసుకరఁగఁ బజ్జనునిల్చి • మఘవుఁడంత
నేమి తెలియని కరణిఁ దా • నెఱిఁగినంత, తెలియఁ బలుకుచు నిట్లుస్తు • తింపఁదొడఁగె

## ఇంద్రుఁడు శ్రీరాముని స్తుతించుట.

సీ॥ ఎల్లవస్తువులందు • నేకరూపంబంది, యంటి యంటకయుండు • నాత రూప!
విస్పంగ నియత ము • ని ప్రవరాధార! వేదాంత విద్యా వి • వేక వేద్య!
కరుణాసముద్ర! ర • క్షణకార్యనిర్నిద్ర!, తల్లియు నీవ మా • తండ్రి నీవ
దాసులమగు మేము • దైత్యులచేఁ బడ, రాని పాటులు పడి • దీనులమయి

తే॥ త్వత్పదంబులఁజేరి కా • పాడవేఁడ, నాఁడొసంగిన యభయంబు • నేఁడుపూర్తి
సేయ నిట్టులేతెంచిన • చిన్మయుఁడవు, నీపదాబ్జాతముల భువి • నీతినొందె.

సీ॥ క్షీరసాగర శయ • నా! రమాలోల! నీ, కెవరు మిత్రులు? శత్రు • లెవరు? రేయి
యెయ్యది? పగలెది? • యెందు గలవు బాల్య, తారుణ్యవార్ధక్య • దశలు నీకు
నెదియాది? యెదిమధ్య? • మెదియంత, మగుఁగాంచ? లింగవచన నామ • లీలగలదె?
ముందేది? వెనుకేది? • సందేది? యెడమేది? • పొందేది? యెదయేది? చందమేది?

తే॥ అట్టి నీవిట్లు పురుష మో • హనుఁడవగుచుఁ, జేతఁ గోదండమూని మా • చేతములను
నొవ్వనడవకుండిన నీకు • నెవ్వగలదె?, చిత్తరంజన! మఱు మేలు • చెందఁగలవె?

సీ॥ నీనాభిఁబొడమిన • నీరజోద్భవుఁడు వి, లయ కాలముల నెల్ల • లలితరీతిఁ
గొలత కట్టఁగఁజేసి • పలుకల్పకాలముల్, గొలిచినఁదఱుఁగని • గుణగణాఢ్య!
మున్ను మేదినికుంభ • ముగ నీరుపెరుఁగుగా, మందరగిరి తరి • మ్రానుగాఁగ
నీహస్తపద్మంబు • లోహటింపక నొవ్వఁ, జిలికి పీయూషంబు • చిక్కుదనుక

తే॥ దాని మాఱు మాత్ర మొసంగి • దైత్యవరుల. మోసగించితి వలపక్ష • మాసఁజేసి
దాసులము మేము వారు శా • త్రవులె నీకు?. ధర్మవైరంబు నడఁగించు • తలఁపుగాక

చ॥ మొదట నొకండవై పిదప • మొత్తమవై తుది నొక్కటౌ లస
త్పదః గుణతత్త్వభూజ నవ • పల్లవః మావెత దీర్ఘనాయకాః
కదియుచు సజ్జనావళులఁ • గాచెదు దుష్టులఁగోపగింతు దు
ర్మదమొనరించు దుష్కృతియు • మాయురెః నీదగు సృష్టియే కదాః

శా॥ మాయా వేష్టితతత్త్వమాః జనము నీ • మాయన్ బ్రభిన్నింప నీ
వే యధ్యాత్మ వతంసుఁ గాదనుచు ను • య్యేలాడు దెందంబునన్
నీయాధిక్యము నమ్మనుల్ భ్మగనిచే • నిక్కంబుగాఁ జూచు చో
నీయోగ్యత్వ మెలర్పఁజేసితి జగ • న్నిర్మాత వంచేర్పడన్

తే॥ ఇట్లుబహుభంగులను నుతి • యించి యింద్రుఁ, డచటిమునికగు భాగ్యంబు • నరసియంత
వర మునీంద్రుని యానతి • వడసితాను, వచ్చుదారిని మరలి ది • వంబుచేరె

క॥ తరలిన యింద్రుని మది ఋషి వరుఁడు దెలిసిరాముకడకు • వచ్చిన నతఁడ
ప్పరమ మునీంద్రుని పదముల కెరఁగ ముదశ్రువులు పులక • లెగయఁగ నతఁడున్

క॥ సుకముగ వర్ధిలుమని జా నకితో లక్ష్మణుని రమ్మ • నన్ వారలు కౌ
తుకమున వచ్చిరి రాముఁడు స్వకీయ పూర్వ సుఖ నిభ శు • భంబులఁ దేలెన్

క॥ రాముఁడు సీతయు లక్ష్మణుఁ డామాపమ్మని వచించు • న్యాయము లెల్లన్
బ్రేమమున వినుచుఁ గడపిరి భాముం డుదయించు దనుకఁ • బ్రమదాలసులై

తే॥ పరవి యుఱవగు కాంతులఁ • బరఁగు భానుఁ డొక్కటిగ నల్లుకొని యున్న • దిక్కుడుంగ
మందుకరముల నాతప • మను నరాసఁ, గొని తమంబను తీఁగలఁ • గోసివైచె

శరభంగుఁడగ్నిం బ్రవేశించి శాశ్వతపదంబు నొందుట.

తే॥ తత్త్వవిజ్ఞానిః శరభంగ • తాపసేంద్రుఁ డతని యెదుట నగ్నిని చొర • నాత్మ నిశ్చ
యించి విధ్యుక్తముగ వహ్ని • యేర్చుఁడింక నాకు సెలవిండనుచుఁ దన్మ • నంబునిల్పె

ఉ॥ చాప విశారదుం డపుడు • శాస్త్రవిశారదుఁగాంచి పల్కెనో
తాపసచంద్రః మీరిట ము • దంబునఁ జేసెడు కార్యమేది? మా
కోపికఁ దెల్పుఁడన్న నతఁ • డొయ్యన నిట్లను రామచంద్రః నే
దీపిత వహ్నిఁజొచ్చి ముగి • తిం గొననెంచితి నాఁ గృపాళుఁడున్

తే॥ తాపసేంద్రః నేవచ్చిన • తరుణ మందె, చేయుటేల ~ ~ కుమార • సింహుఁగాంచి
మారజితుఁడైన తపసి రో • మములు నిక్క నిట్టలంపు మోదంబున • నిట్టులనియె

తే॥ విజయ శీలః నేనిచ్చట • వేవిధములఁ దపము సేయుచునుంటి నీ • దర్శనంబు
గలుగునను నమ్మకంబుతోఁ • గలిగె నేఁడు, ద్వంద్వములునశియించెనేఁ • దలఁతుముక్తి.

తే॥ నిన్న మాపున వేల్పు మ • న్నీఁడు వచ్చి, బ్రహ్మమీకిచ్చెఁ దన సత్య • పదము రండ
నంగఁ బరమపదంబు నొం • దంగఁ గోరి, యచటి కేగక నిలిచితి • నయ్య! యనుచు

చ॥ మనసునకున్ వచస్సులకు • మానితనైగమ శాస్త్రపాళికిన్
దనరఁగ నందకుండు పర • తత్త్వముఁ గాంచిన మౌనిచంద్రుఁ డిం
పునఁ గరుణింపుమంచుఁదన • పొత్తుకతో ననలంబుఁజొచ్చి తా
ననుపమ మోక్షభాగ్యరమ • నందె జనంబు వెలుంగు పొందఁగన్

ఉ॥ భావియెఱుంగు పంకజ భ • వ ప్రభృతి త్రిదశాలిచేత వి
జ్ఞాపలిచే మమత్వము న • హంకృతి పూర్తిగ నుజ్జగించి ద్వం
ద్వావధి వీడి చేరఁదగు • నట్టి మహాపదమున్ భజించె న
ప్పావని తత్త్వవేత్త శర • భంగుఁడు పెన్నిధి రామ సన్నిధిన్

మ॥ ఒకచోనాడిన యాటవస్తువులఁ దా • నుత్సంగ మందుంచు బా
లికపోల్కిన్ సకలాండ జాలముల నో • లిం గర్భముం జేర్చు న
య్యకలంకేశుని నామ సంస్మరణ పు • ణ్యంబెన్నఁగాదన్న, నా
యకు శ్రీరాముని గాంచువారు కను భా • గ్యంబద్ది సామాన్యమే?

## 3 అగస్త్య పటలము (59)

తే॥ అట్లుశరభంగుఁడంతంబు • నందఁగాంచు, కతన వ్యాకులతఁ బొంది • ఘనగభీరు
లతని యాశ్రమస్థలి వీడి • యవలికేగి, రవనిజం గూడి విసుఁగుతో • నాదతోడ

క॥ వనములు వృక్షంబులు దు లును గిరులును కొండచఱియ • లును మనమలరన్
గనుచుఁ గుసిగుంపు వడయక, చని రమ్మవ్వరును దాఁటి • సమ్మదలీలన్

తే॥ నలువమనుమలు వాలఖి • ల్యులునుమౌన, యుతులు బోదలుజటిలులు • యతివరులును
దండకారణ్య వాసు లౌ • తపసులెల్ల, ముదమునంది రాముని గన • నెదురుకొనిరి

క॥ క్రూరగుణుల రాకాసుల, ఘోరుపఠఁగ లేక క్రుంగి • పొనుఁగు పడిన య
వ్వారలు రాముఁగనిరి జల, ధారలఁ గనినట్టిమ్లాన • తరువులఁ బోలెన్

క॥ పెలుకుటి రాకాసుల పే, రులు తడఁబడఁ బలికి దుఃఖ • రోగులయిన మౌ
నులు మందు నడవి వెలవడి, తలిఁ గనుక్రేపుల విధానఁ • దనిసి రెడఁదలన్

ఉ॥ రాక్షసులు సేయు బాధ మోక్షము గనలేక కుందు • మునివరు లబ్ధిన్
రక్షింప నౌక రా న్, లక్షించిన పగిదిఁ గని తొ • లంచిరి కలఁకన్

క॥ తమ తపమే పండయి గా, రమున నెదురు వచ్చు పగిది • రాముఁడు రా మో
దమున మునులు భవ కారా, విముక్తి గను యోగులట్లు • విలసిల్లిరటన్

క॥ కోరిన వారికిఁ గోరిన, కోరికలిడు తపము నూని • గురుశాంతుఁడ నౌ
కారణమున రాకాసుల, వోరుపడగ లేక కష్ట ములఁ బడి రోర్మిన్.

క॥ లేచిరి వచ్చిరి మేఘము, పూచిన ననఁబోలు రాఘ • వుని డాసి రతం
దేచిన భక్తిని మ్రొక్కిన, నోచిన ఫలమొంద వరుస • నొడివిరి జయముల్

తే॥ వారిఁ గొనిపోయి చక్కని • పర్ణశాల, యొసఁగి యాతిథ్య మిడి తప • యునికి కేగి
యవల సోఁకులపాలన సంభవములైన, తొందరల దొంతరలఁ దెల్పఁ • దొడరి చనిరి

ఆ॥ వచ్చు మునులఁ గాంచి • చెచ్చెరఁ గూర్చుండఁ, బనిచి యాజ్ఞయడుగ • వారుతవిసి
చక్రవర్తి తనయ! సమకుఱినట్టి మా, నొగులు వినుమ యనుచు • నుడివిరిట్లు.

చ॥ కనికర మింతలేని మది గల్గిన రక్కసిమూఁక పాప వ
ర్తనమునఁ గష్ట పెట్టి చెడు • దారులఁ దీసితపంబు పాడుగా
నొనరిచి చేయరాని కడు • నొప్పములం బొనరింప మాతపో
ఘనపథ ముజ్జగించి కడ • గండ్లను పొందుచు నుంటి మిచ్చటన్.

తే॥ పులులవనమున జింకల • పోల్కి మేము, రేయిఁబవలు గగ్గోలొంది • కృశతనంది
చితికి ధర్మపథంబు వీ • డితిమి మాకుఁ, దలఁప ముక్తియుఁగలదె కోదండపాణి!

ఉ॥ కాము తపోనియుక్తులము • కాము శ్రుతుల్ చదివించు వారమున్
గాము పఠించువారమును • కాము మఖంబులు వేల్చువారమున్
గాము పరార్ధ చింతకులు • కాము నియామక కార్యనిష్ఠులుఁ గా
గాము గురుత్వవర్తనులు • కామిఁక బ్రాహ్మణులన్ రఘూత్తమా?

తే॥ ఇంద్రుఁడో దానవుల యాజ్ఞ • యెదఁదయందు, శిరమునందును తాలిచి • చెలఁగువాఁడు
కాన మాతండ్రి! మాకడ • గండ్లఁ దీర్చు, వారులేరు మాభాగ్యాన • వచ్చి తీవు.

తే॥ రాజరాజ సుతుండవు • రాత్రివంటి, దుఃఖమున నేమి యెఱుఁగక • దొరలుచుండఁ
దివిరి రవివోలె నీవరు • దెంచి తయ్య, అభయమంటిమి కరుణామయాత్మ! కావు.

## శ్రీరాముఁడు మునుల కభయ మిచ్చుట.

తే॥ జనకజాజాని యిట్లను • దను జవరులు, నన్ను శరణొందరేని యెం • దున్ననేమి?
మచ్చరాసన నిర్ముక్త • మార్గణముల, నేలఁ గూలు వారలు దుఃఖమేలమీకు?

ఉ॥ తండిరినాక మేగఁ, బిన • తల్లి వరంబులు గోర, నాదు త
మ్ముండును నిందకై యడల • భూరిగుణాఢ్యులు పౌరులేడ్వఁ, గో
దండము నూని సీతయును • తమ్ముడుఁ దోనరుదేర, నిట్లు నే
దండకఁ జేరుటెన్న మదు • దాత్త చిరంతన దిష్టమే సుమీ.

ఉ॥ ధర్మపథా నువర్తుల యుష్మ॰ద్వార, మహత్త్వ మెఱుంగలేని యా
దుర్మతులన్ వధించి మహిఁ • దోరపు ధర్మము నిల్పనేని నేఁ
గార్ముకమున్ ధరించి వృథ • గాదె జగంబున సంచరించుటల్?
నిర్మల భాగ్యమన్న మఱి • నెక్కొనునే యితరంబు నాకిఁకన్?

తే॥ ఘన తపస్వులరగు మీరుఁ • గష్టులైన, రక్కసుల కబంధముల న • ర్తనము సేయ
ధనువు మోసిన నా బాహు • దండములును, దగిన విశ్రాంతి నొందుత • ధరణియందు.

తే॥ గోవులను విప్రులను దీన • కోటి శరణు, చొచ్చువారి రక్షణముకై • చచ్చువారె
వేలుపులు గూడ వినుతింపఁ • జాలినట్టి, దేవతా శ్రేష్ఠులగుదురు • దివమునందు.

తే॥ తారకారి త్రిపురవైరి • దనుజవైరి, వచ్చి కాచిన, నెవరు దు • ష్పథులు వారి
వారి వారిని తుదముట్ట • వచ్చువాఁడ, శంకమాని సుఖంబుండుఁ • డింక మీరు.

క॥ అనిన విని మదిని ముదమం, దినవారు త్రిదండములను • ద్రిప్పుచుఁ బన్నా
లను పరియించుచు నర్తన, మొనరించుచు నిట్టులనిరి • ప్రోత్సాహమునన్.

క॥ లోకేశ! నీవు కినియఁ ద్రి, లోకంబులఁ బోలు కోటి • లోకము లెదురై
తాఁకిన నేమగు? నిక్కపు, సాకిరు లీ శ్రుతులు తపము • జ్ఞానము భగవన్.

క॥ కావున నీగడువగు నేం, డ్లీవనమున నిలిచి మాయ • భీష్టార్థంబుల్
కావింపు మనఁగ రాఘవ, భూవిభుఁ డందుండ మోది • మున నీకొనియెన్.

ఆ॥ వారలటఁ బదేండ్లు • వసియించి యుండిరి, మునులు పిదప దీర్ఘ • ముగఁ దలంచి
యిద్ధగుణుఁ డగస్త్యుఁ • డెలమి వసించు న, వ్వనముఁ జేరుఁడన్న • వారలేగి.

## సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణుం గాంచుట

ఆ॥ బీఁటలైన చోట్లు • వెదురులు గలచోట్లు, పొదలు దట్టమైన • పదములందు
చనుచు వడి సుతీక్ష్ణుఁ • డను బ్రహ్మతేజస్వి, తపమొనర్చుచున్న • తలము గనిరి.

ఆ॥ గర్వ రహితులైన • కాకుత్స్థ వర్యుల, మ్మునికి మ్రొక్క నతఁడు • ముదముతోడ
విట వసింపుఁ డనుచు • హితమతిఁ బల్క వా, సిత సుగంధ వని వ • సించినారు.

క॥ శ్రీ రామునకుం దగు నుప, చారమ్ములు చేసి వత్స! సమ్మద మారన్
మీరిట కరుదేరఁగ నే, పారిన నా తప మదెంత • యతిశాయి యొకో!.

క॥ అనవుడు రాఘవుఁ డిట్లను, మునివర! బ్రహ్మాన్వయమునఁ • బొడమిన ఋషులన్
మునుకొని మీపలె ఘనతప, మొనరించిన వార లెవ్వ • రుత్తమ చరితా!.

క॥ సాధుజన దర్శనంబున, నేధన్యుఁడనైతి నన ము • ని ప్రవరుఁడు ప్రే
మాధికత విందువగుచుఁ ద, పోధన మఖిలంబుఁ గొనుము • పూత చరిత్రా!.

క॥ అను మునికి రామభూవిభుఁ, డను మీకృప తపము కంటె • నధికమయైనన్
మనమున నగస్త్యఋషివరుఁ, గనవెంచితి-నదియ కొదువ • గావింపు దనన్.

క॥ రామా మేలే తలఁచితి, యే ముందే యదియ తెలుప • నిచ్చించితి నీ
వా మహనీయుం గాంచుము, క్షేమంబులు నీకునెల్ల • జేకుఱు నచటన్.

క॥ అతఁడును నీరాకకు స, మ్మతిని ప్రతీక్షించుచుండు • మానుగ నటఁజే
రితివేని జనులకును దే, వతలకు శ్రేయంబులగుఁ గృ • పాపరః యనుచున్.

క॥ ఆదారి చూపి యాశీ, ర్వాదమ్ములు సేసి యనుప • రఘురాముఁడు స
మ్మోదమునఁ దేనెవాఁకల, పాదులుగల యయ్యగస్త్యు • వనముంజేరెన్.

## శ్రీరామున కగస్త్యుఁ డెదురు వచ్చుట.

చ॥ ధరణిఁ ద్రివిక్రమం బలెను • ద్రావిడ భాషను గొల్చినట్టి స
ద్గురు వరుఁడౌ నగస్త్యుఁడు, క • కుత్స్థకులేశులు రామలక్ష్మణుల్
హరువుగఁ గాంచవచ్చునడి • యారసి పైపయి నుబ్బి మోద సా
గరము జగంబునిండఁ బడ • కంజము లాత్మఁడు గొల్వఁగాఁజనెన్

ఉ॥ మున్నొకవేళరక్కసులు • మున్నినవారిధిఁ జూపి వీరులన్
మన్ని గొనంగ వేతొకఁడు • మార్గములేదు కృపన్ వహింపవే
యన్న సురాళి కూయివిని • యంబుధి తోయములెల్ల నొక్కచే
తన్నెఱినుంచి త్రావి విశ • దంబుగ నుమ్మినవాఁడు పిమ్మటన్

తే॥ వంచకుండగు వాతాపి • నంచితముగ, మెసవి జీర్ణించికొని వాని • యుసురు దీసి
వానియనుజు నివులుచేసి • ప్రాణికోటి, నెఱిని గాచిన ధీరుండు • కుఱుచవాఁడు.

ఉ॥ యోగులు విభ్రమం బొరసి • యుత్కట సంకట మొంది వేఁడ ను
ద్యోగిత సూర్య చంద్రులను • వ్యోమము నంటి పెరింగి యడ్డు విం
ధ్యాగముఁ గాలమాని భుజ • గాధిపలోకము దాఁకఁద్రొక్కి పు
న్నాగము నెక్కు పోల్కి జత • నంబున నెక్కిన యట్టి జాణఁడున్.

ఉ॥ పార్వతి పెండ్లి వేళఁ ద్రిభు • వంబులప్రాణులు చేరు హేతువై
యుర్వర క్రుంగి యొరగిల • నొయ్యన దక్షిణ మేగు మంచు నా
శర్వుఁడు కోర దక్షిణ ది • శంగల శైలము నెక్కి ధారిణిన్
సర్వసమంబుగానిలుపఁ • జాలిన తత్త్వ మహత్త్వసత్త్వుఁడున్.

తే॥ తవియ ముక్కంటి యొసఁగిన • ద్రవిడ భాష, వినియె నేర్చెదుశ్రుతికంటె • ప్రేఁగట్టుచు
ఘనుల వాడుకఁ బట్టియుఁ • గవితఁబట్టి, చింతనము చేసి వెల్లడిం • చిన ఘనుండు.

తే॥ స్వర్గ మర్త్యనాగమ్ములందు • సకల జీవరాశి యెడఁదల బుక్కిలిఁ • గ్రాలు నాతఁ
డితఁడ యని యెల్లరు తలంచు • ధ్యేయవస్తు, తత్త్వమగురాముఁగాంచు.ను • త్కంఠవాఁడు

చ॥ వినుతగుణంబుల న్నెగడు • వేదములం బరియించి పెంచు జ్ఞా
న నికషమందు రాచి జత • నంబునఁ దోయజగర్భుఁడుం దుదిం
గనుఁగొనలేని తత్త్వమని • గారము రామునిపైనఁ జేర్చి యా
తనిఁగని పల్కె భాగ్యమది • దక్కెటకున్ ముదమందు నాతఁడున్

తే॥ అసమదైత్య బలంబను • వినము పేరు, తొట్టి మాయించు మంచి వై • ద్యుండువచ్చె
బ్రదికి రమరులు మునులు జీ • వములఁ గనిరి, ధర్మవర్తనులైనారు • తక్కె జనులు

తే॥ ఇతర జీవులఁ దిన హరియించు • దైత్య, భయద నిర్ఘాత సంఘాత • పాత సదృశ
కోపవహ్నిఁ జల్లార్ప ర • ఘుప్రవీరుఁ, డంచి తాంబుదమూర్తి యే • తెంచెననుచు.

ఉ॥ తీరుగ సర్వలోకములు • దిక్కులు దుర్గతి నీఁగి సద్గతిం
జేర నుదారతవ్ బహు వి • శిష్ట తపఃఫల జాతయైన కా
వేరిని కుండికం గొనుచు • వేడుకఁదెచ్చు నగస్త్యమౌని యా
శ్రీరఘు రుఁగాంచి విల • సిల్లి ముదశ్రులు రాల్చనిల్చనన్.

తే॥ మస్కరీంద్రుని గనుచు న • మస్కరించి, సీతయును రామలక్ష్మణుల్ • చెలఁగినిలువ
ద్రవిడ భాషాప్రసిద్ధుండు • తనిసి యలమి, స్వాగతము వచియించె స • ద్భాషణముల.

తే॥ యతివరులు పనసలు వల్కె • యతనిఁ జుట్టి, తమకమండలు జలము మ • స్తమునఁ జిలికి
విరులు సల్ల నగస్త్యుండు • విశదమైన, తన ప్రశాంత వనమునకుఁ • గొనుచు నేగె.

తే॥ వీరుఁడాతని పర్ణకు • టీరమందు, విందుప్రేమతోఁగొని హర్ష • మందియుండ
ఘనతపము సేయు మా తపో • వనముచేరి, తపము పూర్తిగావించి తు • దాత్తచరిత!

చ॥ అని వచియించు మౌనిఁ గని • యాతఁడు పల్కె సమస్తదేవతల్
మునులను వృద్ధులన్ నృపతి • ముఖ్యులు నావలె మీకృపన్ భరిం
చిన ఘనులేరు లేరు పలు • శ్రేయము లొందితి సప్తలోకముల్
మునుమిడి గెల్చినాఁడఁబోలు • పున్ గడియించితి జన్మధన్యతన్.

చ॥ శశిధరసన్నిభుండయిన • సన్ముని రాముని గాంచి యిట్లనున్
వశమయి *యష్టమంగళ గు • ణంబు లెసంగిన రామభద్ర! స
ద్యశము గడించి తండ్రిని య • ధార్థ వచస్కు నొనర్చి దండకా
దిశ కరుదెంచు నాఁడె యరు • దేరుదు వియ్యెఁడ కంచు నెంచితిన్.

---

*అపహత పాప్మత్వము. విజరత్వము, అమృత్యుత్వము, విశోకత్వము, విజగత్సత్త్వవ
అభిభాసత్వము, సత్యకామత్వము, సత్యసంకల్పత్వము, అనునవి అష్టమంగళములు.

తే॥ ఇంధ నీవుండు మిట వసి • యించియున్న, మాతపంబు లభీష్టముల్ • పూఁతపూచు
క్రూరులగు రక్కసులు వచ్చి • కొడిమె సేయ, వారి వధియించి మాయెద • వనటదీర్తు

ఉ॥ పాలనమన్ హలంబు గొని • పాడియె పంటయొనర్చు రాట్సుతా!
శీలము నీతియున్ శ్రుతులు • చెల్వగు ధర్మము వృద్ధినొందెడున్
మేలు గడింత్రు వేలుపులు • మృత్యువు గొంద్రు నిశాచరుల్ సదా
యోలల నాడు సమ్మద ప • యోధి జగంబు నిజంబు నిర్వ్యమా

ఉ॥ అమ్మని యట్లు పల్కవిని • యాయతబాహుఁడు రాముఁ డిట్లనున్
సమ్మతి మీయనుజ్ఞఁ గొని • చంపెద సోఁకుల దిమ్మమాల్చెదన్
నెమ్మది గూర్తు మీకు నిది • విక్రమము నమ్మఁడు యాతుధాన సం
ఘమ్ము చరించు దిక్కుకడఁ • కన్ మునుపేగుట యుక్తమౌననన్

## అగస్త్యుఁడు రామునకు వైష్ణవ ధనువు నొసఁగుట

ఉ॥ మంచిది పోయిరమ్మనుచు • మౌనివరుండు రమా హృదీశ్వరుం
డంచిత రీతిఁ దాల్చు జగ • దప్రతిమాన శరాసనంబు పూ
జించుచు నుంటి నక్షయ వి • శిష్ట నిషంగము తోడ నిత్తు దు
ర్వంచకులైన వారి సమ • రంబునఁ ద్రుంపుమ యంచు నిచ్చుచున్

తే॥ ఈజగములెల్ల నొకతల • యిద్దియొక్క, తల యనఁగ నొప్పు కత్తియు • దర్పకారి
నగ ధనువుగొని పుర దహ • నంబు సేయు నసదృశంబగు విశిఖంబు • నమరనిచ్చి

చ॥ కుజములు సైకతంబులును • కొండలు నెత్తుగఁగల్గి ప్రక్కలన్
సజలములైన వాహినులు • చల్లగనొప్పి ప్రశాంతభూమియై
సుజన మనోభిరామమయి • సూన గుళుచ్ఛ వికాస భాగ్యమై
యజిర వినోదమై పరఁగు • నట్టిద పంచవటీస్థలంబగున్

తే॥ అచటఁ దోఁక వడును తేనె • యరఁటి పండ్లు గలవు కావేరివంటి యే • రులునుకలవు
జానకిం గూడియాడ హం • సలును కలవు అందు వసియింపఁ దగుదు వీ • వార్యవినుత!

తే॥ అనుడు నీలమేఘ శ్యాముఁ • డలని కెఱఁగి యాజ్ఞగైకొని పికవాణి • యైన సీత
యనుజుఁడగు లక్ష్మణుండు వె • న్నంటిరాఁగ, నమ్మునీంద్రు మనస్సుతో • నవటికరిగె

## 4 జటాయు దర్శన పటలము (48)

ఉ॥ చేరికఁ గల్గినట్టివియుఁ • జేరక వేఱుగనుండు భూమిభృ
ద్వారము గాంచి యెక్కుచును • దాఁటుచు వేగయుతంబులైన వాః
పూరము లందు తెప్పపయిఁ • బోవుచు దవ్వతరించి కాంచి ర
వ్వారలు ప్రేమ వేగ పరి • భావితవాయువు నజటాయువున్

తే॥ కరఁచినట్టి బంగారంబు • కరఁగి నుదయ, గిరి శిఖరముపైఁ జేరు భా • స్కరుఁడు దిశలు
వెలయఁ గిరణపక్షంబుల • విరియఁజేసి యున్న మాడ్కి నుత్తేజుఁడై • యున్నవాని

తే॥ నీలగిరిఁ బోలు కచ్ఛప • నేతపైని క్షీరవారిలో శశికాంతి • చేరియుండ
నిర్జరులు మథియింపంగ • నిలిపినట్టి మందరాగంబు కైవడి • మఱియు వాని

క॥ నీలాబ్జ వికాసము, మూలంబడ రక్తకాంతి • మొనయు పదములన్
నీలగిరి మీఁదఁ బొడవుప్ర, వాళ లతలు పఱవు పెఱవు • పఱవిన వానిన్

ఉ॥ లోపము లేనివాఁడు గుణ • లోలుఁడు సత్యయుతుండు శీలి సం
తాపము లేనివాఁడు నెఱి • ధర్మపథంబు లెఱుంగు ధీరుఁడున్
గోపము లేనివాఁడు పెను • కూరిమివాఁడు కుశాగ్రబుద్ధి దు
ర్లాపము లేనివాఁడు సుఖ • లావిదుఁ డార్యుఁడు దూరదర్శియున్

తే॥ అనిశ మింద్రు నంకుశధారి • నెనయుచుండు పుటముతోఁ గ్రూరరాక్షస • ఘటములను వి
దారణముచేసి యమునకుఁ • బారణమ్ము చేసి పిదప గాత్రముల ఖ • జించువాని

తే॥ గ్రహచయము నేలు ధ్రువచక్ర • గతిఁ దనర్చు రత్నఖచితహారము మెడఁ • గ్రాలువాని
మేరు గిరి మీఁది వెలుఁగొందు • మిహిరుఁ బోలు ఘనకిరీటంబు శిరమునఁ • గలుగువాని

తే॥ పర్ణనాలీలమగు కీర్తి • వఱలువాని సిరులు నశియింప నుదయించు • నరుణు తనయుఁ
గల్పకాలముల్ త్వరలోనఁ • గడపునట్టి దినము లట్టుఁ జూచిన • తెలుఁగువాని

తే॥ శైలమున నిల్చియది మోవఁ • జాల కిలకుఁ గ్రుంగి నట్లుండు తోఁపిక • కొఱలువానిఁ
గాంచి రామలక్ష్మణులు శం • కావిలగ్న హృదయు లగుచు నాతని దరి • కేగినారు

క॥ తన ముగియిక లాన వెదకి, కొని వచ్చిన రక్కసీని • కుహనారూపం
బనియును బలియుఁడు గరుడుం డనియును తలపోసి చూచి • రలుకన్వానిన్

తే॥ దృఢ ధనుష్మంతులను వీరి • తేజులైన రాకుమారులఁ గని జటా • రాజియున్నఁ
దాపసులు గారు వేడ్కకై • ధరకు దిగిన, సురలొ యని జటాయువువారి • నరసిచూచె

ఉ॥ కాంచితి వాసవున్ సురఁ • గాంచుచునుండు సతంబు భక్తిమైఁ
గాంచితి మాధవున్ గనక • గర్భుని శంకరు నిట్టివారలం
గాంచను మారుఁడేనియును • కాంచిన సిగ్గిలి మూలదాఁగువాఁ
డంచితులైన వీరి చర • ణాబ్జ పరాగము నేని పోలునే?

చ॥ గొనకొని మూఁడులోకములు • కూడ భరింపఁగఁజాలు భద్ర ల
క్షణముల దేహముల్వెలయు • కార్ముకవీరులు లక్ష్మిఁబోలు ని
ర్వనజదళాక్షితో హరుల • వైనమునం జరియింపనేల? నా
మనమును చూఱగొన్నగుణ • మాన్యులదెవ్వరి పుత్త్రులో కదే?

ఉ॥ ఒక్కఁడు చూడ నీలగిరి • యొక్కరుఁడో యరుణాచలంబు పే
రక్కలొ లక్ష్మికిన్నెలవు • లందపుఁ గన్నులొ పద్మపత్త్రముల్
చెక్కిళు లద్దముల్ మఱియుఁ • జెన్నగు మొక్కటులెల్లఁ జూడ నా
మక్కువకాఁడు కోసల ర • మాపతి పోలికలే కనంబడున్.

॥ ఇట్లు యోచించుచున్నంత • నినకులేశు లతని డాసి రంత జటాయు • వాదరమున
ధనువులం దాల్చి మునులచం • దమున వచ్చు. వీరులార! మీరెవ్వారు • వినుచుఁ డనుడు.

॥ సత్యమే తక్కవేఱు కాం • చని కుమార, వరులు ధారణి నేకాత • పత్త్రముగను
దివిజవైరుల గుండియల్ • దిగ్గురనఁగ, పాలనము సేయు దశరథ • ప్రజలమనిరి.

## జటాయువు దశరథ మరణము విని శోకించుట.

॥ అనుడు నానంద వననిధి • మునిఁగి లేచి, ప్రీతి వారలఁ జేర్చి ప • రిష్వజించి
జనకు దీర్ఘబాహులు బలి • ష్ఠ ములె చెప్ప, డింపుమై నన నవ్వార • లిట్టు లనిరి.

అనుమాటను మఱి తప్పుట, యనుచితమని జనకుఁ దేగె • నమరపురికి నం
చను నంత నాజటాయువు, వనటన్ భరియింపలేక • వ్రాలెన్ ధరణిన్.

ఇరువురు కరములఁ బక్షీ, శ్వరు లేవఁగనెత్తి బాష్ప • జలముల మొగమున్
బరిమార్జన మొనరింపఁగ, మరలఁ దెలివి నొంది యతఁడు • మఱుఁగుచు వంతన్

ఉ॥ త్యాగము ఛత్త్రమున్ శమము • దాల్చిన నిన్గని సిగ్గునొందు క
ల్పాగము చంద్రుఁడున్ భువియు • నందఁగరాని ప్రమోదమంద, యా
చ్ఛాగుణపాళి ధర్మమును • నన్నును దుఃఖపయోధి ముంచి మా
కేగతి చూపి పోయితి? నృ • పేంద్ర! యశస్కర! సత్యభూషణా!

చ॥ జగముల కెల్ల నీడనిడు • ఛత్త్రము దాల్చిన చక్రవర్తి! యీ
జగములఁ గాచు కార్యమొక • చక్కని వీడి మదీయ మైత్త్రి నీ
పగఁ బరికింప నేగితివొ? పాపపుఁ బుంజమనైన యేను గ్ర
ద్దగ జనియించి ధర్మములఁ • దప్పి యడంగక యుంటి నిచ్చటన్

ఉ॥ శంబరుఁ ద్రుంచు కాలమున • సర్వజగంబు లెఱుంగ నీవు ప్రా
ణంబులు నేను దేహమని • నమ్మఁగఁ బల్కుట తప్పవేకదా?
వెంబరయా కృతాంతుఁ డవి • వేకముచేత నసూత్కరంబు భూ
మింబడ దేహముంగొని భ్ర • మించి దివంబున కేగె నేమొకో?.

కీర్తి వ్యాపింపఁగా నగ్ని • కీలలఁబడి, మాఁడవలయునుగాక యి • మ్మాడ్కి నడలి
యిట్లు దుఃఖింపఁ దగునె? యం • చతఁడులేచి, వత్సలార! వినుండని • పల్కె నిటు.

సీ॥ దక్ష ప్రజాపతి సుతనయులఁ గాంచె నేఁ, బంద్రఁవారల నొక్క • పగిదినున్న
పదుమువ్వురను కశ్య • పప్రజాపతికిచ్చె, వారిలోఁ దిలకమై • వఱలు నదితి
ముప్పదిమూఁడు కో • ట్లొప్పు సురలఁగాంచె, దితియను సతి పూర్వ • దేవతాళి
నఱువది యాఱుకో • ట్లడరంగఁ గనియెను, దనువను చెలిగనె • దానవులను

తే॥ మనుజతతిఁ గాంచె మతియసు • మదఁతి, సురభి, కాంత కామధేనువుతురం • గంబులాది
మృగములం గాంచె, సింహక్ర • మేల గార్ద, భాదులను క్రోధవశయను • నతివపడసె

సీ॥ వినతా వనితగాంచెఁ • బిడుగుల మెఱపుల, నరుణుని గరుడు ది • వాంధమూఁను
కంకంబు లాదిగాఁగల పెనుపక్షులఁ, ద్రామయన్ పడఁతి యొం • దంగఁగనియెఁ
బిచ్చుకల్ పూరేళ్ళ • బెళవలు కౌఁజులు, మున్నగు పినపిన్న • పులుఁగు తెగలఁ,
గళయను నామె తీఁ • గలు చెట్లుగుల్మముల్. మొదలగు నుద్భిజ్జ • ములను పడసె

తే॥ భయద ఫణములుగల యహి • ప్రతతిఁగాంచెఁ, గద్రువయను చెలందినా • గములుతక్క
వానిఁ గనె సుతయనునది • తానరిష్ట, యుడుము లుడుతలు తొండలు • పడసెఁ బుడమి.

సీ॥ జలచరంబులఁ గాంచె • నిలయను నెలనాఁగ, యట్టులా చెలులు చ • రాచరముల
విరివిగాఁ బడసిరి • వినతా సుతులతోన, నరుణుండు రంభ యం • దనుఁగఁ గాంచె
మమ్ముఁ, మాయన్న సం • పాతి నన్ను జటాయు, వంద్రు దివౌకసు • లందు నుండి
తక్కుజాతుల వేలు • లెక్కించు కాలాన, జనియించి నాఁడ మీ • జనకుహితుఁడ

తే॥ నరుణుఁ డెందెందు వర్తించు • నందు నందుఁ, దిరుగనేర్తు నెదురులేక • దివ్య తేజు
లార: మిము గంటి మీతండ్రి • నారఁ గాంచి, నట్టులయ్యె మనంబున • నలరు మిగిలె

తే॥ అతఁడిటు వల్క రాఘవు • లంజలి గొని, యుబుకు వంతచే బాష్పంబు • లురలఁ గీర్తి
విచటనిల్పి నాకంబున • కేగుతండ్రి, మరలి రాఁజూచు కైవడి • మసలినారు.

ఉ॥ అత్తఱి రామలక్ష్మణుల • నర్మిలిఁ బక్షములందు చేర్చి రా
జోత్తములార! నాకుఁదగ • నుత్తరకార్యములెల్ల మీరలే
యిత్తఱిఁ జేయఁగావలయు • నిద్దఱు మూర్తుల కొక్క జీవమై
హత్తిన మిత్రుఁడేగ భర • మైకను దేహము నగ్ని నీఁగెదన్.

క॥ అను పక్షిరాజు పలుకుల, ఘనులగు రాఘవులు వినుచుఁ • గై మోడ్చివెసన్
గనులను ముత్తెంబుల యను, పున బాష్పము లురల ననిరి • పొక్కుచు వనటన్.

తే॥ కడఁక మాజీవిత సహాయ • కారియైన, తండ్రి సత్యవాక్యంబుకై • తరలె దివికి
నిప్పుడీవును మము డించి • యేగునెడల, మాకు దిక్కెవ్వరింక నీ • లోకమందు?

ఉ॥ పీడఁగరాని ప్రేమపద • విశ్రుత రూపులఁ దల్లిదండ్రులన్
వీడితి మాతృబంధువుల • వీడితి ముద్ధతమౌ నయోధ్యయున్

వీడితి మెల్ల సంపదలు • వీడని కానలలోని కష్టముల్
వీడితి మేము మీవలన • వీడుట పాడియె మీరు నిచ్చటన్?

తే॥ అని తపించుచు నిల్చిన • యనఘుఁ గని యిపుడు నేను దేహము వీడు • టింపు గాక
యున్న మీరయోధ్యకుఁ జేరు • క్రన్నవిడిచి దశరథుం జేరు వాఁడనో • తనయులార!

మ॥ జనకుండున్ దివికేగఁ బూజ్యమగు రా • జ్యంబీరు పాలింప కి
వ్వనికిన్ రాఁగత మేమి? యేమి జరిగెన్ • బల్కుఁడు దూపిల్లు నా
మనమున్ నిర్జరదైత్య పన్నగ రిపు • క్ష్మానాథు లేరేని స్వే
గిని గావించినఁ దీర్చి మీకు నభిషే • కింతున్ మహింగ్రమ్మఱన్.

తే॥ జనకుఁడైన జటాయు వీ • సరణిఁ బలుక, నన్న తమ్ముని గ్రేఁగంటి • నరయునంత
నతఁడు పినతల్లియగు కైక • కతన జరగు, వృత్తమెల్ల స్పష్టంబుగా • విన్నవించె

తే॥ తండ్రి సత్యవంతుం జేసి • తల్లిపలుకు తలను దాల్చి రాజ్యమ్మును • తమ్మునకు నొ
సంగు త్యాగమూర్తి! తండ్రి! సంతసగను నీ పనుల్ మఱి యేరిచే • నెగడు? ననుచు

తే॥ కమలనేత్రుని బిగియారఁ • గౌఁగిలించి శిరము మూర్కొని యశ్రువు • లురలఁగాంచి
యోసమర్థ కుమార! నీ • వీసరణిని పితరునకు నాకు యశము • గావించి తనుచు

తే॥ గాజులం దాల్చు నొక హంసి • కరణి నున్న జనకజం గాంచి యాతన్వి • చంద మేమి?
కుసుమకోమలి మీతోడఁ • గూడిరాఁగఁ గారణం బేమి? యనుడు ల • క్ష్మణుఁడు పలికె

చ॥ తమిగమిఁ బోలి భీకరులు • తాటకఁ జంపుట గోలె శంభు ధ
ర్మముగొని తుండ్లు సేయుటయు • మైథిలి పెండ్లియుఁ బట్ట భంగమున్
తమ విపినాగమంబు పితృ • తర్పణముం బొనరించు దాఁక స్ప
ష్టముగ వచించెఁ బక్షికుల • చంద్రముఁ డెల్ల నెఱుంగునట్లుగన్

క॥ భోగకర రాజ్యమెల్లను భోగి కుబుసమూడ్చు పోల్కిఁ • బోవిడిచిన వై
రాగులు మీరీవనమున నాఁగుఁడు రక్షించుచుండు • ననవరతంబున్

చ॥ అని విహగేంద్రుఁడాడ విని • యార్యుడు రాముఁ డగస్త్యమౌని చె
ప్పిన దగు గౌతమీ తట వి • విక్త తలంబున నుందుమన్న న
య్యనఘుఁడు లెస్సయయ్యెఁ • దగ • నాస్థలమందె తపంబు సేయుఁ డ
వ్వనిఁ గనిపింతు రండనుచుఁ • బక్షము నీడనె కొంచుఁ బోవుచున్

తే॥ అమలహృదయుండు గుణనిధి • యగుజటాయు వెదుట నున్న పంచవటి నం • య్యుద్ధగుణుల
కెఱుక పఱచి చనిన యంత • నినకులేశు లవ్వనంబునఁ జేరి ర • ల్యాదరమున

ఉ॥ అచ్చటనున నరాక్షసుల • యాశ్రయ సత్త్వములెల్లఁ జక్కఁగా
నిచ్చ నెఱింగినట్టి విహ • గేంద్రుఁడు కొర్తిత్తడియైన జానకిన్

మచ్చిక నక్కమారులను • మాటికి మాటికి వచ్చి పిల్లలన్
ముచ్చటఁ గాంచు నండజము • వోలెఁ గనుంగొనుచుండె నంతటన్

## 5 శూర్పణఖాపటలము (143)

ఉ॥ వీరులు రాఘవుల్ గనిరి • పృధ్వి కలంకృతియై సమస్త సం
భారము లిచ్చి పార్శ్వములఁ • బంచ విధంబుల పంట భూములన్
దారిత పాతకంబులగు • దారుల రంజిలి యాత్తలక్షణో
దార కవిత్వ పద్ధతిని • హారి వినిర్మలమైన గౌతమిన్

చ॥ కమల ముఖంబులన్ గలువ • కన్నులఁ గాంచి తరంగ హస్తముల్
క్రమముగఁ జాఁచి పుష్పములు • క్రందుగ వారలపై విదుర్చుచున్
భ్రమర విహంగ రావముల • స్వాగతపద్యము లల్లుచుండె గౌ
తమి యతిధుల్ రఘూత్తములు • తన్ను రయంబునఁ జేరఁ గాంచుచోన్

ఉ॥ మిక్కిలి ప్రేమ సువ్రతులు • మేదిని నాయక పుత్త్రరత్నముల్
చక్కటికై వనంబులకు • సాగిన కష్టముఁగాంచి యోర్వలే
కిక్కటికంబుచేఁ దరిఁగ • లన్ కరముల్ గొని మోఁదుకొంచుఁ బే
రక్కలినొంది యుత్పల క • టాక్షములన్ వడిఁగార్చె బాష్పముల్

### సీతారాముల గౌతమీ తీర విహారము

ఉ॥ నాకయుతంబులైన నలి • నంబులపై వెసఁ జక్రవాకముల్
వ్రాలుట గాంచి రాఘవుఁడు • వారక సీత కుచంబులం గనున్
ఆ లలితాంగియున్ విభుని • యంగద బాహుల సౌరు గాంచి ర
త్నాల మెఱుంగు లీను గిరి • నాయకముం గనుచుండు లీలమై

తే॥ హంసి యట దొలఁగుట గని • హంసకులుఁడు సీత నడకను గాంచి హ • సింప నామె
సీరు ద్రావి నివర్తియ • గౌరు నడక గాంచి రాము నడక చూచి • కడఁప నవ్వె

తే॥ తీవియలు కదలుట గని • తీవఁబోఁడి నడుము గాంచె రాముఁడు సీత • నాధతనువు
నల్ల కలువల నడిమి యు • త్ఫుల్ల వనజ యుగము నెగదిగ సిట్టు • లోరఁ జూచె

ఉ॥ అట్టి వినోద దాయక మ • హానది గౌతమి చెంతఁ గొండలం
బుట్టిన నిర్ఝరంబులును • ముచ్చట గూర్చు శకుంత రావముల్
పట్టుగ మ్రోఁగు పంచవటి • బంధుర లీలల లక్ష్మణుం డెదం
గట్టిన గట్టి పర్ణ కుటిఁ • గాంచి వసించిరి వారలంతటన్

*(1) కుఱింజి— కొండయు కొండ క్రింది నేలయు (2) ముల్లై— అడవియు అడవి క్రి
నేలయు (3) నెయ్దల్ — కడలియు తీరభూమియు (4) మరుదం — మాగాని [5] పాలై — మరు

## శూర్పణఖ రాముసందము గాంచుట

ఉ॥ జీవముతోడ దేహమునఁ • జేరి క్రమంబున వృద్ధినొంది యా
జీవముతోడ దేహమును • చీల్పఁ దఱిం గమకించు దొడ్డ రో
గావృతిఁ బోలునట్టిదియు • నచ్చపుఁ బచ్చలకొండవంటి యా
రావణు మూలముట్టుగఁ గ • రంబు వినాశము సేయు జాణయున్.

తే॥ జేగుతైన వెంద్రుకలును • చిట్టుగొన్న, రాహువును పోరు దేహంబు • గ్రాలునదియు
విబుధవరులకు మునులకు • విశ్వజనుల, కొక ముగింపు నన్వేషింప • నూనునదియు

తే॥ భావి కలుషంబులకు నొక • పట్టుగొమ్మ, అడవినెప్పు దొంటరిగఁ జి • ట్టాడు కొమ్మ
వడిగ లోకమెల్లఁదిరిగి • వచ్చు బోటి, శూర్పణఖ యను జోటి య • చ్చోటికేగె.

తే॥ చెట్ట తన బందుగులకు సూ • చించు గోతి, చుప్పనాతి నాకులు వేఁడ • సోఁకుమూకఁ
జంపఁ బాఁప సెజ్జను వీడి • జగతి యందు, నవతరించిన శ్రీరాముఁ • నరసి కాంచె.

చ॥ మదనుఁడె యందమా యొదలు • మాఁడినదెన్నఁడొ! యింద్రుఁడందమా
పొదలవు వేయి కన్నులు! భ • వుండని యందమ ఫాలమందు క
న్నొదవదు: నాభిపంకజము • నుండి జగంబుల సృష్టి సేయు ల
చ్చి దయితుఁ డందమా యలరు • చేతులు నాలుగు లేవు కాంచుచోన్.

క॥ భవు కంటి మంటచే నివు, ఱవు మారుఁడు నాఁటఁగోలె • నరుడగు తపమున్
దవిలి యొనరించి యిట్టి వ, పువుఁ బొందంబోలుఁ గాక • పొలుపుగ నిలపై.

మ॥ అసమానంబగు లీల జానువుల నొ • య్యందాఁకి సొంపైన యి
య్యసమేషు ప్రతిమాన బాహులకుఁ గ • ల్పాగంబు హేమాద్రి యొ
ప్పెసలారన్ సరిగావు బల్లిదములై • యేపారు దిక్కుంభి హ
స్తసమంబుల్ సుకుమార సుందరములై • దర్పించు దోర్దండముల్.

తే॥ పురుష వర్య బాహువులకు • ముదిరియున్న, నీలగిరిసాటియగుఁదక్క • శైలములును
రాలుగలయవి మేరువు • రసమయంబు, గాన విపుమంతయును సాటి • కావుకావు.

తే॥ కమల దళములఁ బోలిన • కన్నులొప్పు, కొండవంటి యీ పురుషుని • గురు భుజములఁ
గాంచ నా కనుల్ దీర్ఘముల్ • గాకపోయె, నంతకంటె వెడంద తొ • మ్మమరుఁగదవే!

చ॥ అలవికి మించి కాంతు లల • రారు మనోహరు శౌర్య తేజముల్
తొలఁకెడు నెమ్మొగంబునకుఁ • దోయజముల్ సరి తూఁచరాదు లే
జలజ విరోధి మోమునకు • సాటియె యన్నఁ గలాక్షయం బటన్
గలుగును నిండుచందురుఁడొ • కందొకఁ దొందినవాఁడు చూడఁగన్.

ఉ॥ ఏమి యొనర్ప నెంచి యితఁ • డిట్టి మనోహర రూపమొందెః నీ
కోమలికంబు పొడుగ నా • కొండు తపంబిటు లేల సేయుః దై
త్యామర సిద్ధ సాధ్య మను • జావళి లోఁగొనఁ జాలు ధీరుఁ డి
ట్లీ మహిలోఁ దపింపఁ దప • మే తపముం బొనరించెనేమొకోః

తే॥ ఏణలోచన గిరికుచ • యిభ్యయాన సైకతశ్రోణి ఘనవేణి • జలజపాణి
వనధిచేల భూదేవి యీ • వరుని పదము లంటి శాడ్వల రోమాంచ • యగుమనుండె

తే॥ ఈ సుభగు కాంతి దినకరుఁ • డెఱుఁగఁడేమోః భువనమందుజ్వలంబగు • పొల్పునించి
బిడియ మొందక నభమున • నడచువాఁడు తానెయసమ తేజస్విగాఁ • దలఁచినాఁడుః

తే॥ దాఁట నరుదైన గిరులను • సాటి గొనని, యున్నత భుజంబు లొప్పు నీ • వన్నె కాని
యధరమునకుఁ బ్రవాళ సా • మ్యంబు వలుక జను లిసీయనమజియేది • సవతుగలదుః

క॥ చక్కని నిండు కళలతో, నిక్కు నిశానాధుఁ డెగడు • నీటరి కటిపైఁ
జెక్కిన వల్కలముం బలెఁ బెక్కువ తపియింప వేమొ • పీతాంబరముల్ః

తే॥ మొగులు దొంతుల కరణిని • మొనలు దిరిగి, దట్టమైనల్లనై యున్న • జుట్టు విడిచి
జడలఁ బూన దయేని చం • చలములగుచుఁ జెలుల మాన ధనంబులు • చెడకయున్నెః

తే॥ తారహారముల్ మల్లికా • దామ వితతి నితఁడు దాల్చిన జిగియున్నె • యింతకంటె
ఘనతరోజ్వల మాణిక్య • గౌరవంబు వేఱు రత్నంబుచే నభి • వృద్ధియగునెః

ఉ॥ భద్రగుణాలి యెల్ల బహు • భంగుల నెర్చి విరించనుండు సా
ముద్రిక లక్షణంబుల స • మున్నతిఁ జూపు నిమిత్త మిట్లు ని
ర్నిద్రత వీనిఁజేసియును • నిందను బొందె సమస్తలోక సం
పద్రతి వజ్రి యొందెఁ దన • పార రిజంబును బోలకుంటియున్

ఉ॥ వెల్లువలున్ సముద్రములుఁ • బిన్నవిగాఁ గనుపట్టు దెంతమం
దల్లిన మోహమన్ జలధి • యామెను ముంప దరిద్ర దూషణల్
పెల్లుగ నోర్చి యెంత విల • యించిన నొక్క తృణంబయేని యీ
నొల్లని లోభికీర్తివలె • నుంకెడు శీలము గల్గు దైత్యయున్

చ॥ పడలి తపించి కుంది రఘు • వర్యుని యున్నత దోర్యుగంబుపైఁ
బడఁ దన చూపుల న్నిలిపి • వాని మరల్పఁగలేక శిల్పి నే
ర్పడర లిఖించు బొమ్మయన • నట్టె చలింపక నిల్చి యేదియున్
దొడఁగఁగఁ బాలుపోక మది • తుం పెసలాడఁగ దైత్యయవ్వలన్

ఉ॥ వీని విశాలవక్షమును • బిగ్గ గవుంగిలిఁజిక్కఁగొందుఁ గా
దే నమృతంబు నిచ్చిన క్ష • యించుట నిక్కము మిన్న కేఁగఁగా

రేను మదీయ దిష్టము ఫ • లింపఁగ నీ నవమారు సన్నిధిన్
మానుగఁ జేరు పెట్టనుచు • మంతన మొందఁగఁ జేసి యంతటన్

చ॥ కుటిల కరాళ దంత బహు • కోటుల జీవుల వైచికొన్న యు
త్కట కుహరోప మోదర య • తర్కణ మిట్లు దలంచి యాతఁడీ
కటుతర రూపమున్ మదిని • కైకొనఁ డంచు నెమిళ్ళ కోకిలల్
పటుమతి వెంటనంటఁ దగు • భవ్య తరాకృతి గాంచ నెంచుచున్

## శూర్పణఖ కామరూపిణియై రాముకడ కరుగుట

తే॥ నీరజాలయ నెడఁద ధ్యా • నించి తనకు సిద్ధియై యున్న మంత్ర మా•చెలి జపింప
నబ్జుఁ దెగడు మొగము తోడ • నంగకాంతి దెసలఁ బర్వ సుందరియయి • తేజరిల్లె

తే॥ ఎఱ్ఱ ప్రత్తియుఁ జిగురాకు • నీల గొనఁగఁ దగ్గ చరణాబ్జములు గల్గి • తనివి సనఁగ
మాటలాడు మయూరి నా • మానసౌక మనఁగ లేఁదీఁగ యన విన • మనఁగ వచ్చె

తే॥ లక్ష్మియందంబునీలోత్ప • లము సొబగు గలుగునయనకుంతంబులు • వెలుఁగు మొగము
వలలయువతిరూపముఁగొన్న • వాత్ర మొందు మెఱపుతోఁ గాకిబొంటితో • నెఱఁగె ననఁగ

తే॥ కల్పకముగన్న యెలదీవ • కైపుగలిగి కామదంబగు మధుర వా • క్యములుగలిగి
యందగత్తెయై భీతి • మృగాక్షియగుచు నమిలి నడచిన కయివడి • నడచివచ్చె

తే॥ రశనయును నూపురములు వ • స్త్రమును కురుల విరుల బంభరముల రొద • విస్తరింప
నింతి యొకతె వచ్చెడు నని • యెంచి రాముఁ డాదెసను దృష్టిసారించి • యరయసాగె

తే॥ ఒక్క యమృతంబు నాకస • మొనఁగె ననఁగఁ గుచభరంబున మధ్యంబు • కునియరాఁగఁ
దలఁపు నిచ్చియజ్ఞానంబు • తొలఁగఁ ద్రోచి జ్ఞానదృష్టి నిచ్చెడు వాఁడు • సకియఁగనియె

మ॥ సురలోకంబున నాగలోకమున నీ • క్షోణిన్ గనన్ రాని యా
పరరూపంబును గాంచి రాఘవుఁడు ధా • పంబంద యూహించె నె
ల్లర సౌష్ఠవ్యము సామె యంద యడఁగెన్ • లక్షించి వీక్షించినన్
సరిపోల్పంబగు చామలుంగలరె యీ • సౌందర్యవారాశికిన్?

చ॥ తపమది రాఘవున్ వలచు • దైత్యయు నారని సుందరింపు మో
మును తలపోయుచుం జరిజ • ముల్ లన హస్తముల్ మొగిడ్చి మ్రొ
క్కినిడువు క్రేవ గాడ్కిడి • కించియుఁ బోదని యట్లు సుంత ల
జ్జను గొని యేణి యట్టులొక • చక్కి దొలంగి మరంగి నిల్వఁగన్

ఉ॥ ఆగతయైన శూర్పణఖ • నాగమవేద్యుఁడు గాంచి పల్కె దూ
రాగత పద్మగంధిరొ! శు • భావహ మయ్యెడు నీదురాక నీ

కీగతి నిందు రాఁ గత మ • దెయ్యది? యెయ్యది వాసభూమి? నీ
బాగు వచింపు నామమెది? బంధువులెరు? వినంగఁ గోరెదన్.

తే॥ అనుడు నయ్యది యిట్లను • నబ్జగర్భు, పౌత్త్రి పుత్త్రిని త్రిపురారి • మిత్రుఁడగుచు
దిక్కరులఁగెల్చి రారాద్రిఁ • దివిరి యెత్తు, ఘనుని చెల్లెల నాపేరు • కామవల్లి

తే॥ అనిన రాముఁడు సందేహ • మంది దీని, నడత చెడ్డది యగునైన • నరయుదమని
రావణుని చెల్లెలైన నా • రజపు రూపు, గలిగె నెవ్విధిఁ దెలియంగఁ • బలుకు మనఁగ

చ॥ లడఁబడకుండు వాక్యముల • దానవి యిట్లను రామచంద్ర! మ్రు
క్కిడులును మోసగాండ్రు నగు • కర్బుర సంఘము తోడి జీవితం
బెడయఁగ రోసి నా యెడఁద • నింతవివేకము గల్గ ధర్మము
న్నడపుచుఁ బాపముడ్చి సుమ • నస్కులచేఁ దగఁగొంటి నీ యెడన్.

ఉ॥ ఆ పలు కాలకించి సుగు • ణాఢ్యుఁడు రాముఁ డనున్ మహేంద్రుఁడున్
ద్రేఁపఱ లొంగి సేవలొద • వింపఁ ద్రిలోకము లేలు వానికిన్
జాపలనేత్ర ! చెల్లెలయి • సంగడు లెవ్వరు లేక యొంటిమై
నీవగిదిన్ వనంబులకు • నీ వరుదేరఁ గతంబు తెల్పుమా

తే॥ అనిన రాముని ప్రశ్నకు • నన్నృతవాది, ని యగు నాపెయిట్లను రాజ! నీచదైత్య
సంగతిని మాని దేవప • క్షంబు నూని, వచ్చితిని కార్యమొండు నీ • వలనఁ గలుగ

తే॥ అనుడు స్త్రీలమానసములు • గనఁగదివుట, యోగ్యములు కావనుచునెంచి • యువతి! యేమి
పని గలదు తెల్పు మయ్యది • భావ్యమేని, తప్పకయొనర్తునని పల్కఁ • జుప్పనాతి.

తే॥ తాము పొందిన వలవంత • తామె తెలుప, మానినులకుఁ దగనిదైన • మాఱు దిక్కు
లేకయుంటి మన్మథుఁ డద • లించి సేయు, సిలుగులం ద్రోచి నన్ను ర • క్షింపు మనిన.

క॥ వాలికలై కన్నులు పెను, వోలికలై తిరుగుచున్న • పొలఁతి తలంపుల్
చీలికలై సిగ్గటి వల, పేలికలై చెడిన వనుచు • నెంచుచు నుండన్.

తే॥ తేంట్లు పోరాడు వేణి నొం • దిన వెలంది, మౌనమున నున్న రాముని • మనము నెఱుఁగ
లేక ప్రేమించి నన్ను పా • లించు నొక్కొ, కాదనునొ యంచుఁగలఁగి యీ • కరణిఁబలికె.

ఉ॥ రామ! యలేఖ్య సుందర! స • రాగముతో నిట కీవు వచ్చుటల్
మును కానకీ మునుల • నేమకముల్ పొనరించుచుంటి నా
కామనకామినీత్వమును • గారవు యౌవన మింత కాలమున్
గౌముది కానఁ గాయు క్రియఁ • గానట బీనట యయ్యెఁ గాంచితే?

ఉ॥ నిందితురాలు దైత్యసతి • నీతిని మాలి యిటుల్ వచింప రా
జేంద్రుఁడు వేఱుకార్యమున • కిట్టులు వచ్చిన దంచు నెంచి యో

సుందరీ! బ్రహ్మవంశమున • జోటివి నీవు నరేంద్రవంశ్యుఁడన్
బొందిన వర్ణ ధర్మములు • బూదిని గల్పుట యుక్తమా? యనన్.

ఉ॥ తండిరి బ్రహ్మవంశజుఁడు • తల్లి యరుంధతిఁబోలునామె దై
త్యుండు సుమాలి కూఁతురగు • దోషము లేదు వృథా వివాదముల్
మెండుగఁ బల్కి యిట్లు కడ • మీఁటుదువేని భరింపఁ జాలనీ
దండనె ప్రాణము ల్విడుతుఁ • దప్పదు పాపము నీకు సుందరా!

చ॥ వల పెద నగ్గిలం బగుడు • వారక రావణు చెల్లె లీగతిం
బలుకఁగ సుస్మితంబను ప్ర • భా తరళంబగు మించుతోడిదౌ
జలదము భాతి శోభిలు ప్ర • జాహిత చిత్తుఁడు ఖేలనారతిన్
జెలువ సురారి కన్యకను • చేకొన మర్త్యున కొప్పునే? యనన్.

చ॥ తలఁపఁగఁదగ్గ శ్రద్ధ ప్రమ • దం బగు భక్తి ఫలంబు పెద్దగాఁ
దలఁపక తొందరం దవిలి • దైత్య వరాంగిని పంక్తికంఠు చె
ల్లెల నని పల్కుచే తెలివి • లేమిగ నెద్దఁ దలంచి గొప్ప వే
ల్పుల వరశక్తి దైత్యతను • పూర్తిగ నీఁగితి నంచుఁ బల్కఁగాన్.

చ॥ ఇనకుల చంద్రుఁ డిట్లు వచి • యించు సుభాసినీ! నీదు సోదరుల్
ఘను లొకరుండు వీరత జ • గంబుల నేలెడి ధీరుఁ డొక్కఁడో
ధనదుఁడు వారు నిన్ను ప్రమ • దంబున నిచ్చినఁ గేలు పట్టుటల్
పనియగుఁ గాక యన్యమగు • పద్ధతి యుక్తము కాదుచుమ్మనన్.

సీ॥ మరునిచే నైక్యమైయున్న • మనసులొప్పు, స్త్రీలకును మగలకు శాస్త్ర • సిద్ధమగుచు
వలలు గాంధర్వవిధి యట్లు • జరుగు పిదప, నన్నలును సమ్మతింతురు • వన్నె కాఁడ!

చ॥ ఋషులపయిన్ విరోధము వ • హించు సురారులు నిన్నుగాంచి వి
ద్విషుఁడని వైరమూనరు మ • దిం దలపోయ నొకండ వుంటి వీ
విషయమె వంశమైత్రికొక • వేడుక వారధి గాఁగనొప్పు స్వ
ర్విషయము నీయ:పే ర మొస • రింతురు మిక్కిలి మేలు గూర్తురున్.

చ॥ అనవుడు రామచంద్రుఁడను • సంగన! నీ సుఖమందితిన్ బలా
శనుల కృపం గడించితిని • సంపద నొందితి మేలు బొందితిన్
జనపదముం దృజించి విపి • నంబునఁ జేయు మహాతపంబు గాం
చిన ఫల మొక్కఁడా? యనుచుఁ • జీర్ణగవుం బొనరించు నంతలో

## శూర్పణఖ సీతను కాంచుట.

॥ త్రిభువనవాసుల • దృష్టిభూషలచేత, వెలయుచు వాసనల్ • వీచుచుండు
నాకు గీమున నుండి • యన్నులు మిన్నని, ర్జరులు పొందిన మహా • వరము వలన

భూమిలో రత్నంబు • పోలిక నుద్భవిం, చిన సీత యచటికిఁ • జేరరాఁగఁ
గాలెడు మాంసంబు • గతికి పొక్కిన యాస్య, మొప్పిన మతిహీన • చుప్పనాక

తే॥ కాయమున వెల్వడిన సూర్య • కాంతివంటి, కాంతి యొక్కండు ప్రక్కనఁ • గ్రాలనరసి
ధరను నింగిని నిండి న • క్తంచరాట, వుఱను కాల్చు పతివ్రతా • నెలముఁగాంచె.

ఉ॥ రావి కురుల్ గలట్టి పని • తామణి నీతఁడు తోడఁగొంచు ని
ట్లీ పని కేగుదేరఁడు మ • హీతలమం దిటువంటి సుందర
శ్రీ విలసిల్లు కామినులు • చెందరు లక్ష్మియె సద్మమైన రా
జీవము వీడి భూస్థలిని • చెన్నగు కాళులు తేయ వచ్చెనో?

చ॥ అని భ్రమియించి చూచి కమ • లాసను సృష్టి మతింపు మీఱు సం
చున నొక హద్దులేని బలు • సోయగముం గలదంచు నెంచి క్ర
న్నన నొక యాఁడుదాన నగు • నా కె కనుల్ మనమున్ మరల్పఁగాఁ
బనుపడకుండె నింక మగ • వారలు గాంచిన నేమి యౌదురో?.

ఉ॥ రాముని చూచి చూచి మఱి • రామను తప్పక చూచి చూచి యా
తామరసాసనుండె యొక • తావునఁ గాంచఁగఁ దగ్గ యిట్లు చె
తో ముద మొందఁగాఁ దలఁచి • తోన యజాండమునందు గల్గు న
క్కోమలికంబు లొక్క యెడఁ • గూరిచి చేసెను వీరి నిద్దఱన్.

ఉ॥ కుందనముం బలెం బురుడు • గూడని నీలపయోద గాత్రుఁ డీ
సుందరమూర్తి యీతనికి • జోడగు నేమిది నన్ను వోలె? నీ
చందనగంధి నావలెనె • చయ్యన మధ్యనె వచ్చెఁగాదె? దీ
నిం దొలఁగించి త్రోవ నిత • నిం బురికొల్పెద నంచు రాముతో

చ॥ సుగుణగణాఢ్య! యీ చెలువ • చూడఁగ రక్కసి మాయలాఁడి దీ
ని గుణ మెఱుంగరానిది గ • ణింపఁగనేల? పలాశి దీని సో
యగమును నమ్మఁ బోకు నిజ • మైనది కాదిది నీకు హాని గూ
ర్పఁగఁ దఱి వేచియున్నది త్వ • రన్ దొలఁగింపుము మేలు కోరినన్.

చ॥ అనవుడు రాముఁడిట్టులను • నాసురికిన్ దరలాక్షి' మేలు! నీ
సునిశిత బుద్ధి మెచ్చితిని • సూక్ష్మమతి న్నిను గెల్చువారు భూ
మిని కలరేవి? నీ పలుకు • మేలుర నీ హృదయం బెఱింగితిన్
గనుపడ దీనిదైత్యయని • కాంచెదు గాకని నవ్వె నల్లనన్

చ॥ సుధయు వసిష్ఠు చానయును • జోదనఁదగ్గ వరాంగి సీత రా
మ ధరణినాథు డగ్గఱఁగ • మండెడు నిప్పులఁ బోలు కన్నులన్

గ్రుధ గొనఁ జుప్పనాతి కని • కుచ్చితురాలః విలాసవేళలోఁ
బ్రధనము సేయ వచ్చితివె • పానక మందలి పుల్ల కై వడిన్.

ఉ॥ చంపెదఁ జూడుమంచుఁ బరు • షంబునఁ జూడ భయంబునంది యా
చంపకగంధి సీత కడు • సన్నని కౌను వడంక దూది చం
దంపుఁ బదంబు నొవ్వ జల • దంబున మించును పోలె రాముని
డెంపు భుజాంతరంబునఁ బ • డెం జెదుగొ జడుపూని యత్తఱిన్.

ఉ॥ దుష్ట గుణంబులే యదరు • ఘోరులతో డిది ఖేలయయ్యెఁ బై గ
గష్టములే వెలార్చు నని • కార్ముకవీరుఁ డెదం దలంచి నీ
యిష్టము గాననయ్యె సుద • తీ! యిట నిల్వకు లక్ష్మణుండు నీ
చేష్ట లెఱింగెనేని తగు • శిక్ష యొనర్చును పొమ్ము వే యనన్.

చ॥ జలగిరి పద్మసద్మలును • శంబర వైరియుఁ దక్కఁ వేలువుల్
జలగిరి పద్మ సంస్థితులఁ • జాలఁ దపింతురు నన్ను పొంద, నీ
చెలువ రచించు మాయ వలఁ • జిక్కితి మోసము వచ్చు నీకు నా
పలుకులు నమ్ముమం చసుర • పల్కుచునుండఁగ రాఘవేంద్రుఁడున్.

తే॥ తగులు నీతోడ వలదను • పగిదిఁ దెలుప, మెఱుపు వెన్నంటు మేఘంబు • కరణి సీత
వెంట శ్రీరామచంద్రుండు • వెడలి పర్ణ, శాల లోనికిఁ జనియె ని • శ్చింత మెయిని.

తే॥ తెలివి నశియించి నిశ్చేష్ట • యొలయు దైత్య, యంత శ్వాసంబువిడుచుచు • యంతరంగ
మవశ మగుడుఁ గోపించి యా • యతివయందు, గాఢ మగు ప్రేమగడదవి • కలఁకనొంది

మ॥ ఉరుసౌందర్య పయోధియైన రఘు వ • ర్యుం బొందు మార్గంబు లో
నరయం జూచుచు నేగు శూర్పణఖ య • వ్యాపన్నతన్ వీని పే
రురముం గౌఁగిటఁ గూర్పనేని తనువు • ద్యోగింతు పేడంగ నం
చిరవౌ స్ఫాటిక కందరంబునకుఁ దా • నేగెన్ విహారంబులోన్.

## శూర్పణఖ సంతాపము

ఆ॥ జలజ హితుఁడు గ్రుంకె • సాంధ్యరాగము గ్రమ్మె, శూర్పణఖకుఁ గ్రూర • సర్పవిషము
వోలె దేహమెల్ల • దూల వ్యాపించె న, మ్మరుని వలని బాధ • మరులు పోల్చ.

క॥ తాటక వక్షంబున మును, నాటిన శ్రీరాము మార్గ • ణము వలె మరుఁడున్
గాటముగ నేయు బాణము, నాటుటచే సంకటంబు • సం దూపిల్లెన్,

క॥ మలయా నిలమను నస్త్రము, విలయావేదనము గూర్చ • వెల వెల గొనుచున్
నెలతేని వ్యంజనంబుగ, వలతేనిం దిసఁదలంచె • వడి నాతురయై.

తే॥ సంకటము గొల్పు వార్ధి ఘో • షంబడంగఁ, గొండలంద్రోచిపూడ్పంగఁ • గోరియంతఁ
గువలయాప్తుఁడు తన్ను సం • కోచ పఱుప, మాని తాపంబుచేఁ జాల • మాఁడుచుండె

తే॥ విరులు పొడియగు నట్టులీ • పృథివి గలుగు, వనములను ధ్వంసమొనరింప • వాంఛచేసి
జక్కవలు రెండుగూడిన • చంద మరసి, వాని ధ్వని విని మదిక్రుంగ • వడఁకుచుండె

తే॥ విడఁగి వెక్రమింగ నొక భుజం • గంబుఁదెత్తు, ననుచుఁ గోపించి చనుదోయి • నంటిచల్ల
గాలి సోఁక సంకటపడి • విడఁకమాను, రాముపైఁగల వలపున • నంపెలాఁడి,

తే॥ ఉదుకు చనుదోయిపై మంచు • నుంచుకొనియెఁ, గామశరవహ్ని మేన నె • క్కటము గాఁ
వేఁడి బండపై నుంచిన • వెన్నముద్ద, మాడ్కిఁ గరఁగి నీరయ్యెనన • మ్మగువకదియు.

చ॥ జలనిధిఁ గ్రూరుఁడౌ కుసుమ • సాయకుఁ దాఁచి యడంప యోగ్యమౌ
స్థలమెది యంచునెంచి యను • నంచయ మూఁగుచునుండు దుస్థితిన్
గలిగి స్మరాగ్నికిన్ జడిసి • కంధిని మున్గి మునింగి నట్టియా
జలమును వేఁడియౌటఁగని • చామ బిడెంబును పొందెనత్తఱిన్.

తే॥ చెమ్మగల నెలతాలు ను • ష్ణమ్ము నొంద, మదిఁ దపించు దైత్యాంగన • మరులుసోఁకి
కారు మొగుళులు నీలంపుఁ • గంబములును, కానవచ్చినఁ గేల్మోడ్చుఁ • గళవళించు.

తే॥ మారుతమ్ము దోషాకర • మన్మథులును, తన్ను చూడకుండఁగ భయ • దంపుదంష్ట్రి
లుండు సర్పముల్ వసియించు • చుండునట్టి, కొండ గుహలోనఁ జేరె ర • క్షోమృగాక్షి

క॥ అట వీచు మారుతము మును, పటికంబెన్ మించి వేఁడి • పాఱి చనులు గా
లుటచేలెఁ గర్జమెఱుఁగక, తటమట పడి చిగురుటాకు • తల్పమునఁ బడెన్.

క॥ రాముని రూపము గనఁబడఁ, జామయు నుత్కంఠనొందు • సంకోచించున్.
సోముగొని సోలు సిగ్గిలు, రాముఁడు మఱుఁగైన మరుని • రాయిడి మఱుఁగున్.

ఆ॥ కారుమొగులుఁ గాంచి • కాకుత్స్థుఁడని యెంచి, చనుల నాన నలమి • సంతసించు
వేఁడిచేలె నదియు • విరియంగఁ జాఱిన, నడలు, దానియలఁత • కంతు గండె?

క॥ విలయాగ్నిం బోలు స్మరా, నలమునఁ గ్రాఁగియును శూర్ప • ణఖ రాముని మే
నలమి మనునాస జీవం, బుల విడువఁగ లేదు వలపు • పొలుపెట్టిదియో?

క॥ అంజన గిరిసన్నిభః యిటు, నెంజిలిగొను నాయెడంద • నిలిచి కరుణతో
రంజిలు మంజలి యిడెయని, నంజు గొనినదాని పోల్కి • నడుఁకు నడలునన్.

ఉ॥ ప్రాణము పోయినన్ మరులు • పాయని మాయిని చుప్పనాతి సం
త్రాణము లేదటంచుఁ గొల • దాఁకిన కైవడి సంతపించు న
య్యేణ విలోలనేత్ర భువి • నిందిర కంటెను సుందరాంగి గీ
ర్వాణ నుతుండు దాని విడి • పాపిని నన్ను పరిగ్రహించునే?

ఉ॥ ఇచ్చటనున్న సుందరియు • నిందిరయేయగు, నాకుఁగల్గు నీ
మచ్చిక వానికింగలదె? • మారుఁడు చూపెను పక్షపాత మం
చెచ్చిన బాళిఁగుందునెడ • నీతఁడు రాక్షసలోక తామసిన్
గ్రచ్చుఱ మ్రింగు భాస్కరుఁడె • కా! యని చూపఁగఁబూనె భానుఁడున్.

## శూర్పణఖ సీతను పట్టఁబోవ లక్ష్మణుఁడు దాని ముక్కు సెవులు గోయుట

మ॥ ఉదయం బందుట గాంచి శూర్పణఖ లో • నుత్సాహముం బొంది యి
మ్ముదితారత్నము చెంతనుంట వలను • న్మోదింపఁ డీతండు నా
చదురుల్, దీనిని దాఁచియుంచి యితనిన్ • సంతృప్తిమైఁ బొందినన్
బ్రతుకంగల్గుదునంచుఁ బొంచి చనియెన్ • రామామణిం బట్టఁగన్.

ఉ॥ అంగన, రాముఁడొక్కసర • మం దుదయాదిక కృత్యముల్ పొన
ర్పంగను బోయియుండుటలు • బాగుగఁ జూచెను పర్ణశాల చెం
తం గవిపెట్టి లక్ష్మణుఁడ • తంద్రతఁ జీఁకటియైన తోఁట నుం
టంగనలేక సీతను క • డంక గ్రహింపఁగఁ బోయె నెవ్వడిన్.

ఉ॥ ఒంటరియై లతాంగి యిట • నున్నది నాతలఁపుల్ ఫలించె నీ
దంటను పట్టి దాఁచెద న • తండు నిజంబుగ నాకు లొంగు నా
కంటను పడ్డ యిక్కలువ • కంటియుఁ జిక్కకపోనె! యంచు వె
న్నంటెను లక్ష్మణుండు నసు • రాంగన వచ్చుట గాంచి యుగ్రుఁడై.

శా॥ ఓసీ! యెచ్చటి కేగె దింక నిలు నీ • యుద్యోగముల్ చాలు రా
కాసీ! యంచుఁ దురీలుసం బలచి త • త్కాంతాత్వముం గాంచి బా
ణాసం బూనక కీలఁబోలు కురులన్ • హస్తంబునం బట్టి బ
ల్రోసం బారఁగ వస్తిఁదన్ని కరవా • లుం బూని యుగ్రాక్షుఁడై.

శా॥ ఉత్సాహంబునఁ దన్ను మోచి కొనుచున్ • వ్యోమంబునం జేర ను
ద్యత్సంరంభము నొందు దానివడిఁ గ్రిం • దం ద్రోచికోపాన దు
ర్మాత్సర్యంబులు మానుపంచుఁ జెవులున్ • రంగారు ముక్కుం జనుల్
తత్సౌందర్యము వోవఁగోసి విడిచెన్ • దైత్యాంగనం దిట్టుచున్.

॥ అప్పుడా దైత్య వాయెత్తి • యడుచు నలుపు, దిశలనిండి దివ్యుల చెవిఁ • దివిరిసొచ్చెఁ
గాలు నెత్తుట భువి నాని • కిరఁగఁజొచ్చె, ననఁగ దాని పడిన పాటు • నరయవశమె?

॥ చంపఁ బయిలోడి రక్కసి • చనుల ముక్కు, నాస గోసిన కార్యమె • న్న,గ దశాస్యు
రత్నముకుటమస్తక భూధ • రములఁ ద్రెంప, వరముహూర్తంబుగుఱుతించు • కరణినొప్పె.

॥ పృధివి యదరఁగఁబడి కాళ్ళు • విదిరిచికొని, యఱచురక్కసి ఖరవధ • కొఱకు లేచి
రక్తవర్షము గూరియు పీ • రదము వోలెఁ, బెరిఁగి రోపంబు నవమతి • పెనఁగొనంగ,

ఉ॥ ఎన్నఁడు జంకు కొంకు వెత • లించుక యొందని పూర్వదేవ సం
పన్నఁకులంబునం బొడము • పైదలి మింటికి లేచు ధారణిం
దన్నఁదపించుఁ జూకురు న • ధైర్యమునందుఁ జలించు వందుఁ గే
ల న్నలఁచున్ విదుర్చు వెత • లం బడు నుత్తలమందు సిగ్గిలున్.

ఉ॥ ముక్కును చేతనద్ది తడు • ముం గొలిమిం గల మంట కైవడిన్
మిక్కిలి యూర్చుఁ గేలఁ బడ • మిం గడు మోఁదుఁ గుచంబు లంటుచున్
దిక్కట మక్కటంపడుచు • దిక్కులు నూచుఁ జెమర్చు వెక్కువే
చొక్కును పండ్లు గీఁటు నఱ • చున్ బఱచుకా వెఱచున్ దలారుచున్

చ॥ బొట బొటఁ గొండ యూటవలె • జొబ్బిలు రక్తము చేతనైన యు
త్కటతర పంకమందు తడ , కట్టుగఁ జుట్టుచుఁ జుప్పనాతి సం
కటపడి వేల్పులున్ జముఁడుఁ • గాతర సెందఁగఁ దగ్గ రాక్షసో
ద్భటులను పేరుకొంచుఁ బలు • వార్తలఁ బల్కుచుఁ బిల్వ మేకొనెకా.

చ॥ అనలము చేతఁబట్టు నిట • లాక్షుని శైలము నెత్తినట్టి యో
దనుజవరేణ్య! నీవు ప్రమ • దంబున మేదిని నుండ మానుషుల్
ధనువులఁ దాల్చి క్రుమ్మరుట • తక్కువకాదె? విరోధి వర్గముల్
మునుకొని నవ్వ నీకు మొగ • ముం గనిపించుట యెట్లు? కానవో?

చ॥ విలయము వేళనైనఁ దగ • వేసట నొందని బ్రహ్మవిష్ణు శం
భులకును విద్దరాళికిని • భోగుల దైత్యుల కంటె మేటి దో
ర్బలః పులి యుండఁగా నినుఁగుఁ • బట్టఁగ నౌనె? యటంచు లోకులన్
పలుకులు నేఁడు నాయెడ న , బద్ధమ యెయ్యె నిఁకేమి చెప్పుదున్?

మ॥ అమరానీకము చుట్టిరా ముదముతో • నైరావతం బెక్కి యు
ద్ధము గావించిన యింద్రు నోర్చిన బలో • ద్యద్దంబరున్ శంబరున్
సమయం జేసిన యాజి నాజిఁ బఱవం • జాఁగించు నోరావణా!
యమరెన్ నీకపకీర్తి దొడ్డదిగ ర • మ్మా కొంతు గాకిచ్చటన్.

మ॥ భవుచే ఖడ్గము గాంచు వీర! వరుణున్ • వైవస్వతున్ బావకున్
దివిజౌఘంబు నవగ్రహంబుల జగ • ద్విఖ్యాతిగా సేవకుం
దవులం జేసిన విక్రమం బిపుడు చెం • దం గల్గెఁ బెన్నింద మా
నవులన్ వీరి నెదుర్పఁ జాలమిని స • న్న్యాసుల్ పిసాళింపఁగన్

మ॥ మద దిగ్వారణ దంతరాజి విఱుగన్ • మాఱాటముం జేసి దు
ర్మదులన్ కొండలు పిండిసేయు బలవీ • రా! రూప సౌందర్య సం

పదలన్ మన్మధు మీఱు వారయిన సం • యద్భూమి నీ కాలి చె
ప్పుదవం బోలని యీ నరాధములపైఁ • బూనింపవో కోపమున్.

తే॥ సురల దెసలకుఁ దోలిన • యరిది బలము, పఱలు రావణునకును సో • దరుల కిపుడు
చేగ సమసెనా? దనుజుల • కోగిరంబ, యైన యిమ్మానవుల కడ • నడఁగె నేమి?

మ॥ భవుఁడో ధాతయొ వెన్నుఁడో యని తలం • పం దగ్గ తేజమ్ము సం
స్తవ రీతిం బొలుపారుచుండు ఖర! కొం • తారమ్మలం దాఁగుచున్
యవలన్ మెక్కెడు వన్య తాపసుల వీ • ర్యంబో? మనుష్యాద దా
నవ హంవీరుల యోటయో? యెఱుఁగవే • నన్నిట్లు వీరేఁచుటల్?

మ॥ దివిషన్నాథుఁడు బ్రహ్మయున్ విబుధు ల • ర్థిం గొల్వ నింద్రాణి గౌ
రవ చిహ్నంబులఁ బాడ సప్తజగముల్ • ప్రాగల్భ్య మగ్గింపఁ బ్రా
భవ మొప్పన్ ధవళాతపత్త్రము పయిన్ • భాసిల్లఁ గొల్వున్న నీ
కవురా చూపఁగఁ గూడునే? విశ్రుతా • స్యంబున్ జను ల్నవ్వఁగన్

చ॥ ఇది ఖరుఁడున్న కాన మఱి • యిచ్చట నిట్టి పరాభవంబు నా
కొదవఁగ మీకుఁగాదొ? బల • మొగ్గఁగ నన్ను ధరాస్థలిం బడన్
జదుపుచు ముక్కు గోసిన భు • జంబుల నిక్కనఁ జూచికొంచు దు
ర్మదుఁడయి మానవాధముఁడు • రాజిల మీ భుజశక్తిగాల్పనే?

ఉ॥ దిగ్గజ వేగముల్ తఱుఁగ • దీకొని పోరి తదీయ దంతముల్
నుగ్గుగఁ జేసి సద్యశము • నూల్కొన నుబ్బిన బాహుసత్త్వ! నే
ముగ్గిన యొక్క యాసగొని • ముక్కును నీఁగితి రట్టు నొందితిన్
సిగ్గిది నైతి దీననగు • చిన్నతనంబును నీది కాదొకో!

చ॥ త్రిదశుల గెల్చి దేవవిభు • శృంఖలలన్ దగిలించి నొంచి యొ
ప్పిదమగు సేవలం గొనిన • విశ్రుత మల్లుఁడ! యల్లఁడా వనిన్
మదమున నిక్కి గ్రుచ్చుఱుము • మానవు లిద్దఱు నన్ను త్రోచి సి
గ్గొదవఁగఁ జేయ నేఁ గుమిలి • యూరక చచ్చుట నీకుఁ దృప్తియే?

తే॥ అఖిల భువనముల్ గడగడ • లాడ నన్ని, దిశల నోర్చి యింద్రుని గెల్చి • తివురు మేఘ
నాద! యీ మానవుల చేవ • నఱుమ రమ్ము. వీరిఁ గూల్పక నీకీర్తి • వృథయె చుమ్ము.

ఉ॥ కొండలు పిండిసేయు రణ • కోవిదులార! ఖరా! తిశీర్ష! దో
ర్దండ పరాక్రమాఢ్యులయి • రాజిలు సేనలఁ గూడి కుంభక
ర్ణుండును పోలె నిద్రగొని • బ్రుంగుచు నుంటిరొ? నేను త్రోలుటల్
కొండొకయేని మీచెవుల • కున్ వినరాదొకొ? యింత జాలమే?

తే॥ ఇట్లు పలువిధంబులఁ బల్కి • యాసుగొన్న చుప్పనాతి భూమింబడి • ప్ర
నంపరేణ్యుండు గౌతమీ • నదిని నియత, కృత్యములఁ దీర్చికొని యట •

## చుప్పనాతి మరల రాముని బతిమాలుట

ఉ॥ వచ్చిన రాముఁ గాంచి దశ • వక్త్రుని చెల్లెలు కద్పునల్పుచున్
బెచ్చుగ బాష్పధారలను • భీకర శోణిత ధారతో భువిన్
రొచ్చుగఁ జేయుచున్ న్రుప శి • రోగ్రణి నీసొగసైన రూపమున్
మచ్చిగఁ గోరి యీగతిని • బ్రమందితిఁ జూడుమ యంచుఁ జూపఁగన్

ఉ॥ వ్రీలఁగ వ్రేలు పెంద్రుకల • వెక్కురు రక్కసి క్రూరచేష్ట యే
దో లలిఁ జేసి యుండు నని • యున్ దన తమ్ముఁడె చేసియుండి నఁ
చోలిఁ దలంచి నీవెవతె • వాయ్యన నియ్యెడ కేల వచ్చి తీ
లీల నొనర్చి రెవ్వరు చె • లీ! వివరింపుమ యంచు ఛేఁదనన్

ఉ॥ రక్కసి ఎల్కు నన్నెఱుఁగ • రా! పగవారను పేరె యెక్కుడన్
నెక్కొననీకొఁపెర్చు రజ • నీచరనాథుని చెల్లెలన్న, నీ
యిక్కల రక్కసుల్వదల • నిచ్చట మేము తపించుచున్న యీ
చక్కటి కేల వచ్చితివి? • సంఘటనం బిది యెలొకో యనన్

చ॥ కుమిలెడు వేఁడి కామ రుజ • కుం దగు మందగు రామ! నిన్ననే
సుమశరు బారి గ్రుగ్గి పడ • స్రుక్కుచు వచ్చుట విస్మరించితే
కిమందిశాక్ష యన్న రఘు • కాంతుఁడు జేగుఱు రేఖలొప్పు మీ
నముల క్రియం జలించు నయ • నంబులతో నడుదెంచు టీరొకో?

తే॥ అనుడుఁజెవులుముక్కునుపోవ • నంగుచెడదె! యనుచురక్కసి క్కు నోయు
పడి యిటేల చేసితి వని • పలుకు నన్నుఁ గాంచి కేల్మోడ్చి నుడివెఁ ల • క్ష్మణ

చ॥ పలుచపు లూరగా నమలి • పొరగ సేయుటకో? మటేమొ? క
వలి గల రక్కసుల్ కిఅపి • పంపిరొ? కానఁగరాదు గాని ని
ప్పులు గురియంగ మావదినెఁ • బొంచుచుఁ బట్టఁగఁ బోయెనన్న ప
లుక్కులు విని యంటకున్ మరులు • గ్రుంగునె రక్కసపల్కు నీగతిన్ -

తే॥ ఆఁదునత్త మండూకము • నంద నుండఁ, గాంచి చూలైన మండూకి • కలఁ
పుష్కరిణిగల కోనంల • ఘాప! సవతిఁ గన్నపుడు మదిలో నల్కు • గలుగకనె

చ॥ పొలఁతికి రాముఁడిట్లను న • పుంసకు లట్లు మఱుంగు నుండి పో
రులు పొనరించు రాక్షసుల • రూపడఁగింపఁ బ్రతిజ్ఞపూని యి

వ్వలనికి వచ్చినార మిటు • వ్యర్థ వచస్సులు వల్కి యూరకే
పొలియక వేగ పొమ్మనుడు • పోవక మూర్ఖతఁ బల్కెనిట్లిదిన్.

చ॥ ముదిమియుఁ జావులేని యజ • ముఖ్య సురాళి దశాస్యుఁ గాంచఁగాఁ
గొదుకుచుఁ గాన్కలిచ్చి పడి • కొల్తురు వాని యనుగ్రహంబుకై
మదిగొన కిట్లుమీరు మతి • మాలి యొనర్చితి రిట్టిచేఁతలన్
బ్రదుకఁ దలంతురేని యొక • పల్కు వినుండది మీకు లగ్గగున్.

చ॥ చెలియలి ముక్కువోయనని • చెప్పెడి వారల నాల్కఁ గోయు దో
ర్బలునకు మేరలేని తల • వంపుగ నాదగు ముక్కుగోసి నా
చెలువము గడ్డిఁ జిందఁగను • చేసి భవత్కుల రూప సంపదల్
పొలియఁగఁ గోసికొంటి రిఁకఁ • బోవునె యెట్టులుఁ దప్పి దాఁగఁగన్.

ఉ॥ నాకముఁ గాచువారలును • నాగముఁ గాచెడు వారు భూమి న
స్తోకమతిన్ భరించు బల • శూరులునేని త్వదీయ శీర్షముల్
కాకులు గ్రువ్వకుండ నిటఁ • గాచు సమర్థులు కారు మీరు న
న్నీకొని కాతురేని మిము • నేనును కాచెదఁ బ్రాణముచ్చియేన్॥

మ॥ తమ మానంబును తామె గాచికొను కాం • తల్ పల్కఁగా నేర్తురే
తమయుత్కర్షము? నైన నేనె దెలుపన్ • దక్కొంటి మీమీఁది ప్రే
మముచే నియ్యది నిర్దరీగళ చల • న్మాంగల్యవిచ్ఛేది దై
త్యమహీశానుని చెల్లెలంచుఁ దెలుపం • దార్కొమ్మ సీతమ్మతో

సీ॥ పెనుపోరులందు కా • తును మోచికొని మింటఁ, జనుదు నెచ్చటికేని • క్షణములోన
మాంసమ్మువంటి క • మ్మని ఫలములఁ దెచ్చి, యిత్తును కోరిన • దీయఁగలను
రక్షించువారిఁ ది • రస్కరించుట మేలె? కోమలి సీతచేఁ • గూడునేమి?
వలఁతులరైనచోఁ • బలుకుఁడీ జగమున, స్వర్గంబునందున్న • సతులలోన

తే॥ జాతియందుఁ గోరిన దిచ్చు • నీతియందు, నేర్పునందును, గుణముల • పేర్పునందుఁ
బలుకులందు సుఖమునందుఁ • గులుకులందు, యౌవనమునందు నాసాటి ? యరయఁగలరె?

ఉ॥ ముక్కును కోసివైచితిరి • మూర్ఖత నైనను లోపమేమి? నన్
మక్కువఁ గొందురేని క్షణ • మాత్రములో మఱుముక్కు గొందు మే
ల్చక్కఁదనంబు నొందుదును • సత్కృప గల్గినఁ జాలుఁ దక్కువే
ముక్కఁడి స్త్రీత్వసంపదకు? • మూరెఁడు ముక్కు వికారమే కదా?

చ॥ మనసు కవింపకున్నఁ గద • మానినిఁ గోరఁగ రామచంద్రు మీ
మనమున నేను కోరఁబడ • మానము ప్రాణము మీఁదిదా దె? కాం

తే॥ ఇట్లు పలువిధంబులఁ బల్కి • యీసుగొన్న, చుప్పనాతి భూమింబడి • గ్రుక్కుచుండ
నరవరేణ్యుండు గౌతమీ • నదిని నియత, కృత్యములఁ దీర్చికొని యట • కేగుదెంచె

చుప్పనాతి మరల రాముని బతిమాలుట

ఉ॥ వచ్చిన రాముఁ గాంచి దశ • వక్త్రుని చెల్లెలు కద్దునల్పుచున్
బెచ్చుగ బాష్పధారలను • భీకర శోణిత ధారతో భువిన్
రొచ్చుగఁ జేయుచున్ నృప శి • రోమణి నీసొగసైన రూపమున్
మచ్చిగఁ గోరి యీగతిని • గ్రుందితిఁ జూడుమ యంచుఁ జూపఁగన్.

ఉ॥ వ్రీలఁగ వ్రేలు వెంద్రుకల • వెక్కురు రక్కసి క్రూరచేష్ట యే
దో లలిఁ జేసి యుండు నని • యున్ దన తమ్ముఁడె చేసియుండి నం
చోలిఁ దలంచి నీవెవతె • వొయ్యన నియ్యెడ కేల వచ్చి తీ
రీల నొనర్చి రెవ్వరు చె • లీ! వివరింపుమ యంచు వేఁడనన్.

ఉ॥ రక్కసి పల్కు నన్నెఱుఁగ • రా! పగవారను పేరె యెక్కడన్
నెక్కొననీకొనర్చు రజ • నీచరనాథుని చెల్లెలన్న, నీ
యిక్కల రక్కసు ల్వదల • నిచ్చట మేము తపించుచున్న యీ
చక్కటి కేల వచ్చితివి? • సంఘటనం బిది యేలొకో యనన్.

చ॥ కుమిలెడు వేఁడి కామ రు జ • కుం దగు మందగు రామ! నిన్ననే
సుమశరు బారి గ్రుగ్గి పడ • గ్రుక్కుచు వచ్చుట విస్మరించితే
విమలదళాక్ష' యన్న రఘు • కాంతుఁడు జేగుఱు రేఖలొప్పు మీ
నముల క్రియం జలించు నయ • నంబులతో నడుదెంచు టిదొకో?

తే॥ అనుడుఁజెవులుముక్కునుపోవ • నంగుచెడదె! యనుచురక్కసి పల్కు, నోయనఘ! యీ త్ర
పడి యిటేల చేసితి వని • పలుకు నన్నుఁ, గాంచి కేల్మోడ్చి నుడివె ల • క్ష్మణుఁడు మెల్ల

చ॥ పలుచవు లూరగా నమలి • పాఠ్య సేయుటకో? మహేమొ? కా
వలి గల రక్కసుల్ కలపి • పంపిరొ? కానఁగరాదు గాని ని
ప్పులు గరియంగ మావదినెఁ • బొంచుచుఁ బట్టఁగఁ బోయెనన్న ప
ల్కులు విని యంతకున్ మరులు • క్రుంగక రక్కసిపల్కు నీగతిన్

తే॥ ఆఁదునఁ త్త మండూకము • నంద నుండఁ, గాంచి చూలైన మండూకి • కలఁతపఱచు
పుష్కరిణిగల కోసల • భూప! నవతిఁ, గన్నపుడు మదిలో నల్క • గలుగకున్నె?

చ॥ పొలఁతికి-రాముఁడిట్లను న • పుంసకు లట్లు మఱుంగు నుండి పో
రలు పొనరించు రాక్షసుల • రూపడఁగింపఁ బ్రతిజ్ఞపూని యి

వ్వలనికి వచ్చినార మిటు • వ్యర్థ వచస్సులు పల్కి యూరకే
పొలియక వేగ పొమ్మనుడు • పోవక మూర్ఖతఁ బల్కినివ్విధిన్.

చ॥ ముదిమియుఁ జావులేని యజ • ముఖ్య సురాళి దశాస్యుఁ గాంచఁగాఁ
గొదుకుచుఁ గాన్కలిచ్చి పడి • కొల్తురు వాని యనుగ్రహంబుకై
మదిగొన కిట్లుమీరు మతి • మాలి యొనర్చితి రిట్టిచేఁతలన్
బ్రదుకఁ దలంతురేని యొక • పల్కు వినుండది మీకు డగ్గగున్.

చ॥ చెలియలి ముక్కువోయనని • చెప్పెడి వారల నాల్కఁ గోయు దో
ర్బలునకు మేరలేని తల • వంపుగ నాదగు ముక్కుగోసి నా
చెలువము గడ్డిఁ జిందఁగను • వేసి భవత్కుల రూప సంపదల్
పొలియఁగఁ గోసికొంటి రిఁకఁ • బోవునె యెట్టులుఁ దప్పి దాఁగఁగన్.

ఉ॥ నాకముఁ గాచువారలును • నాగముఁ గావెడు వారు భూమి న
స్తోకమతిన్ భరించు బల • శూరులునేని త్వదీయ శీర్షముల్
కాకులు గ్రువ్వకుండ నిటఁ • గాచు సమర్థులు కారు మీరు న
న్నీకొని కాతురేని మిము • నేనును కాచెదఁ బ్రాణమిచ్చియేన్॥

మ॥ తమ మానంబును తామె గాచికొను కాం • తల్ పల్కఁగా నేర్తురే
తమయుత్కర్షము? నైన నేనె దెలుపన్ • దక్కొంటి మీమీఁధి ప్రే
మముచే నియ్యది నిర్ఘరీగళ చల • న్మాంగల్యవిచ్ఛేది దై
త్యమహీశానుని చెల్లెలంచుఁ దెలుపం • దార్కొమ్ము నీతమ్మితో

సీ॥ పెనుపోరులందు కా • తును మోచికొని మింటఁ, జనుదు నెచ్చటికేని • క్షణములోన
మాంసమ్ము వంటి క • మ్మని ఫలములఁ దెచ్చి, యిత్తును కోరిన • దీయఁగలను
రక్షించువారిఁ ది • రస్కరించుట మేలె? కోమలి సీతచేఁ • గూడునేమి?
వలఁతులరైనచోఁ • బలుకుఁడీ జగమున, స్వర్గంబునందున్న • సతులలోన

తే॥ జాతియందుఁ గోరిన దిచ్చు • నీతియందు, నేర్పునందును, గుణముల • పేర్పునందుఁ
బలుకులందు సుఖమునందుఁ • గులుకులందు, యౌవనమునందు నాసాటి ? యరయఁగలరె?

ఉ॥ ముక్కును కోసివైచితిరి • మూర్ఖత నైనను లోపమేమి? నన్
మక్కువఁ గొందురేని క్షణ • మాత్రములో మఱుముక్కు గొందు పే
ల్చక్కఁదనంబు నొందుదును • సత్కృప గల్గినఁ జాలుఁ దక్కువే
ముక్కిఁడి స్త్రీత్వసంపదకు? • మూరెఁడు ముక్కు వికారమేకదా?

చ॥ మనసు కవింపకున్నఁ గద • మానినిఁ గోరఁగ రామచంద్రు మీ
మనమున నేను కోరఁబడ • మానము ప్రాణము మీఁదికాదె? కాం

చిన జనులెల్లఁ గోరఁదగు • చెల్వముకూడ విషంబయౌఁగదా?
కొనియెద నీవు సమ్మతిలు • కోమలికం బవలం గ్రహింపవో?

చ॥ మృడుఁడును పద్మగర్భుఁడు ర • మేశుఁడు వజ్రియు ధాత్రినొక్కటై
పొడమిన యట్టులున్న యొఱ • పున్ మెఱపున్ గల వన్నెకాఁడు దీ
టడరని పుష్పబాణమున • నందఱఁ జంపెడు మన్మథుండు త
మ్ముఁడె యగునేమి? లక్ష్మణుని • పోలిక నిశ్చయుఁ డయ్యె నాయెదన్

సీ॥ ఈరూపమున నిది • యిచ్చటనేయుండు, నెచటికి వెడలఁ బో • దెవరుఁ గానరు
అనియెంచియే యిట్టు • లొనరించి నారలు, కాకదీనికి వేఱు • కతము కలదె?
యీరు తపొనరింప • రేనది యెఱిఁగియే, రెట్టింపు ప్రీతిఁ జే • రితిని తెలివి
లేనిదాననె? యుగ్రు • లౌ నరాదు లెఱింగి, కోపింప జగమెల్లఁ • గూలిపోవుఁ

తే॥ దగు కులీనులు ధర్మంబుఁ • దలఁచువారు, లోకనాశకార్యములకు • లోనుగారు
అరసి నన్నేలి మీకగు • నగడుద్రోచి, కూడి సుఖియింపుఁడని వేఁడి • కొనుచునిలిచె.

ఉ॥ ప్రల్లద మిట్లు పల్కెడు • రక్కసిఁ గన్గొని రాఘవుండు నీ
తల్లికిఁ దల్లివంటిదగు • తాటకఁ గూల్చిన బాణమున్న దే
నుల్లమునం దపంబె కడు • నూఁకుపఁగాఁగొని రాక్షసావళిన్
ద్రెళ్ళఁగఁ జేయవచ్చితిని • దెప్పరమౌఁ జుమి చేష్టచేసినన్.

చ॥ అసదృశుఁడైన కోసల ధ • రాధి పుత్త్రులమేము తల్లియా
జ్ఞ సకల సంపద ల్విడిచి • చయ్యనఁ గానకు వచ్చి చేరి తా
పసు లిట నర్థిమైఁగొనర • వాసము చేయుచునుండి క్రూర రా
క్షస కులమెల్లఁ జక్కడఁచి • క్రమ్మఱువారము మా పురానకున్.

చ॥ చెఱవడినారు దేవతలు • చిక్కిసురారుల కోడి వీర లి
ద్దఱు నరులంచు రెక్కడక • దంటవయేని క్రుధానమేతులుం
గఱకరుఁడన్ బలాఢ్యులగు • కర్బుర సంఘము యక్షకోటి న
క్కజగొని తోడితెమ్ము వెసఁ • గ్రచ్చఱఁ జంపెద నీదు ముందఱన్,

సీ॥ అని రాఘవుఁడు పల్క • నాసురి యనుఁజై పె, దవి ప్రీలిపండ్లెల్ల • దంతురముగఁ
గనఁబడు వాగల • కామిని యని తలం, పక నన్ను నెమ్మిని • వలఁతువేని
సోఁకులఁ జంప వ • చ్చును ⁕రి మాయల, నెఱుఁగంగ వచ్చు జ • యింపవచ్చు
నన్నియు సాధ్యంబు • లౌసీత పదలవ, యేని నేనుంటయు • నెక్కువగునె?

తే॥ మాయులగు రక్కసులు మీకు మఱుఁగు నుండి, పలుపుమాయలఁ దొలఁగింతుఁ • బాము
పామె యెఱుఁగున్ సామెత • ప్రభుఁడ వినవా, నన్ను చేకొను నీకిది నయముసుమ్ము

ఉ॥ నెమ్మది నాపయిం జొరంగ • నీయక జానకి యున్న దన్నచో
ముమ్మరమైన యుద్ధమున • మువ్వురముం దలపడ్డ దైత్య శీ
ర్ష మ్ములఁ ద్రుంపవచ్చు నిది • చక్కటియంచు నెఱుంగ లేని మీ
తమ్మునికిం దగం బలికి • తార్పుము రావణు లెక్కకుం గొనన్.

ఉ॥ మీరలు కోసలంబునకు • మేలుగ నేగెడువేళ నేను మీ
కోరిన రూపు గైకొనెదఁ • గోపి సుమిత్ర సుతుండు ముక్కుఁడిన్
జేరఁగఁ దీయఁ జాలనని • చెప్పిన మధ్యములేవి సీతతో
వారకయుండుఁగాదె? యని • పల్కుము నీ వనుచుండు నంతలో

ఉ॥ రక్కసఁ జంపఁగా నొక శ • రంబును లక్ష్మణుఁ దోరకంటితోఁ
గ్రిక్కనఁగాంచి యార్య! యడఁ • గించెద దీనిని చంపకున్నచో
మిక్కిలి పీడసేయు నన • మేచక దేహుఁడు పోవకుండుచోఁ
ద్రెక్కొన వచ్చు నన్నఁ గను • ద్రిప్పుచు దానవి లేచి యుగ్రయై.

ఉ॥ చక్కని ముక్కు వీనులును • చన్నులు వోయియు మిమ్ము గూడి నే
నిక్కడ నుండ నొక్క క్షణ • మేని సహింతునె? మీగుణంబు ల
మ్మక్క! గ్రహింపఁగోరి యిటు • లాడితి వాయువు నగ్ని మీఱు నా
మొక్కలి మీ యమున్ ఖరుని • పోఁడిమిఁదెచ్చెద నంచు వే చనెన్.

## 6. ఖరవధ పటలము (19!)

ఉ॥ పూని చలంబు శూర్పణఖ • భూరిజవంబునఁ బాటి యా జన
స్థానమునన్ వసించు ఖర • దానవు పాదములందు వ్రాలె వా
లూనిన నెత్రుతో ముటికి • యూడ్చెదు కాలువఁ బోలు ముక్కుతో
వేనలి వీడ సంజ జిగి • పేర్చిన విప్పగు మబ్బు కైవడిన్

॥ విలయ ఓదియని జముని సం • ప్రేరణమున, మ్రోఁగు భేరిచా రోగను • ముంబొనర్చి
పిడుగువేఁ గాలి సంకట • పడెదు లాఁచు, పోర్కి నేర్పైఁబడి ఎడిఁ • వారలి యేడ్చె.

। మాటతోఁ గూడఁ బొగలేవ • మండి ఖరుఁడు, నిన్ను చూచి ఁ రిల్లత • నిట్టుపమున
నిట్లు చేసిన దెవఁడొ వాఁ • డెఱుఁగఁబలుకు, యమునితలఁదన్ని శిరమెత్తి • సుమియువాఁడు

చ॥ అనవుడు దైత్య యిట్టులను • నన్న! మనుష్యులు మౌనివేషులై
ధనువులఁ దాల్చి గ్రాలుదురు • దర్పక సుందరు లాజి ప్రత్తిపన్
ఘనభుజు లున్నతాంగులును • కయ్యము సేయఁగ దానవాళిన్
వనముల రోయుచున్ దిరుగు • వారలు సింహపరాక్రములౌ చలున్.

ఉ॥ ధర్మమునం జరింతురఁట! • దానిని నెక్కొనఁ గూర్తురంట! వే
దుర్మదులైన రక్కసుల • దోర్బలయుక్తిని ద్రుంతురంట! మీ

వర్మకృపాణ బాణ మన • బాహు బలోద్ధతిఁ గీటు పుచ్చు స
త్కర్మరులంట! వారి బల • గర్వములన్ వివరింప శక్యమే?

చ॥ ఇరువురతోడ నొక్క చెలి • యిందును వేల్పుల నెందు నేరికిన్
దొరకని నూత్న సుందరత • తో విలసిల్లు మదీయ చక్షువుల్
పొరసి తరింప లేక యటఁ • బొర్లుచు నుండె వచింప శక్యమే
తరుణి విలాస సంపదలు • ధాతకు నాతని తాతకేనియున్?

తే॥ ఇంతిఁగాంచి లంకాపతి • కిత్తుదీని నని చలించిన బుద్ధితో • నచటి కేగఁ
గోపమున వారు నాముక్కు • గోసినారు చూడుమా యన ఖరుఁడు చి • చ్చువలెమండి

చ॥ ఎదురుగఁ జూచు వారల ది • హించెడు తీరున గ్రుడ్లనార్చుచుం
బదరుచు ముంజెలూడ్చు పిద • పఁ గనుపట్టెడి తాటి బొప్పె ల
ట్లదరక ముక్కుగోసిన దు • రాత్ములఁ జాపుము చీల్తుఁగూల్తుఁ జం
పుదు నుఱుమాడుదుం బొడుతుఁ • బుల్లని పచ్చడిచేసి మ్రింగుదున్

చ॥ నిలిచి సమస్తలోకముల • నీఱుగఁ జేయఁగఁ జాలు కంటి ని
ప్పులు చెదరంగ మండిపడి • ముద్దుల సోదరిఁగాంచి యా దురా
త్ములు మనుజాధముల్ మతి వి • దూరులు నావలన న్నశించిసన్
జెలియరొ! యీకలంకము న • శించునె మేదిని యున్న యంతకున్?

ఖరసేనాపతులు పదునల్వురు రాముచే మడియుట

సీ॥ రథముఁ దెమ్మనిన మా • త్రన హస్తముల తోడి నీలాద్రులం బోలి • నిలుచువారు
పృథివి నొక్కొక చేతఁ • బెకలింపఁగలవారు మమ్మంపుఁడని చుట్టుఁ • గ్రమ్మువారు
పరశు పట్టిన శూల • పాశ గదా తోమ, రాది సాధనముల • నలరువారు
చతురబ్ధి వేష్టిత • జగతీతలంబెల్ల, పడఁకించు హుంకృతి • వఱలువారు

తే॥ హాలహలమె రూపొందిన • యట్టివారు చెలఁగి సేవ ధన్యముగ నీ • క్షింపు మధిప!
యనుచుఁ బదునాల్గు వేల్పుల • కధిపులైన వారు ఖరు నధిక్షేపించి • పలుకుటయును

ఉ॥ లెస్స వచించినారు కడు • లేబర మాఁగద స్వచ్ఛకీర్తి యా
తుస్సులతోడ నే రణము • తూకొనుచో విబుధుల్ హసింత్రు రం
హస్సున మీరలేగి మను • జాధములన్ వధియించి వారి యం
హస్సమయంబు లాఱిచి త • దంగనతోఁ జనుదెందు పొందనన్

తే॥ ఖరుని యాజ్ఞ సేనాపతుల్ • బడఁక మ్రొక్కి! సిగ్గిఁడియుజముమాతనాఁ, జెలఁగుచుప్ప
వాతి ముందేగ శుభసూచ • నముగ వార లినకులేశ్వరులున్న తా • వునకుఁజనిరి

తే॥ విమల శశ్వత్సహస్ర నా • మములు గలిగి క్షీరసాగర శాయియౌ • శ్రీముకుంద
పాదపద్మముల్ స్మరియించు • పద్మనేత్రుఁ, జూపెఁ జేసన్న వారికిఁ • జూప్పనాక

తే॥ వీనిఁబట్టి నింగికెగుర • వేయవలయుఁ, జేతనందు కోవలయును • చీల్పవలయుఁ
గట్టవలెఁ గొందవలెఁ గడి • కండలుగను రండు రండని రక్కసుల్ • రాముఁగదియ

తే॥ లక్ష్మణుని గాంచి యార్యుఁడ • లలనఁ గాచి యుండు మనికల్పకము పూచి • యున్నపగిది
నొప్పుకరమున గొనయమె • క్కుంచినట్టి కార్ముకంబందికొనె నిషం • గములతోడ

తే॥ తోయజాక్షుఁడా వింటినం • దుకొని తూణ ముఁను తాల్చి పర్ణకుటి య • వ్వలకునేగి
యిచ్చటికి రండనుచు వారి • నెల్లఁ బిలిచి, తొడఁగె యాతుధానులతోడ • దురము సేయ

తే॥ ప్రళయ కాలాగ్నిఁ బోలిన • వారిపాశ బాణ శూలాదికములఁ గం • బములవంటి
యిరువ దెనిమిది భుజముల • నలికి వైవ, మ్రోడులం బోలువారలు • మోహరించి

తే॥ వారి శస్త్రాస్త్రములతోడ • బాహువులును, తునుఁగ నురములబలిమిచే • దురము సేయు
రక్కసులతలల్ సునిశితా • స్త్రములఁద్రుంచి పాఱఁజూడ ముక్కుఁడియును•పాఱిపోయె

తే కనలు సింహంబుచేఁ గరి • ఘటలుగూల హస్తమును నెత్తిపై కెత్తి • యదలిపఱచు
కరిణిఁ బోలి శూర్పణఖ యా • ఖరునికడకుఁ, బోయి జరిగిన వృత్తాంత • మునువచించె.

క॥ వృషవాహనునకు నరుదగు, విషమనఁదగు ఖరుఁడు దనుజ • వితతి మడిసెనే?
విషధరుఁడు గరుడు మ్రింగెనె? విషమించెనె? యనుచుఁ గనుల • విషముంగ్రక్కెన్

తే॥ సింగములును భీతిల్లగ • ర్జించి ఖరుఁడు రథముఁ దెండు సైన్యంబుల • రండనుండు
త్వరగ వాయింపరేమి ప్ర • స్థానభేరి లెండులెండని పడిఁ గద • లించె సేన

తే॥ స్వర్గపాతాళములు వడ • వడ వడంక భేరిమ్రోఁగ లెక్కిడరాని • వారిదములు
కెరలు కరణి యుయుత్సుజి • గీషువులగు రథికులెల్లరు గుంపులై • ప్రబ్బినారు

తే॥ గురుతరాభీల ఖాంకృతుల్ • ఘోషములుగ, వీఁగు భుజములె యలలుగా • విలయవేళ
పెద్దకడలి ప్రభంజన • ప్రేరణమున రేఁగినట్లు విజృంభించెఁ • బృథులసేన

ఉ॥ ఆఁకలి యింకదీఱునని • హర్షముతోఁ దిరుగాడు శాకినీ
డాకినులట్లు దట్టపుయి • దంబుగ మిన్ను మఱుంగుచేసి య
స్తోకగతిన్ వెలుంగు కడుఁ • దోరపుఁ దెక్కెము లోలిఁ బర్వఁగా
నాకులు భీతినొందఁ గద • నంబునకుం జనె సైన్యసంఘముల్

తే॥ బంధముఁ ద్రెంచికొని స్వేచ్ఛ • బరుగువాఱు రెండుతొండముల్ గలుగు వే • దండములనఁ
గ్రాలు దానవకరముల • ఖడ్గనికర, ఘర్షణమున నగ్నులు పుట్టి • కాన యెరియ

క॥ పంబల రొదతో నేమీ, శంబరవము గలియ నిరుల • సంఘాతంబుల్
పంబి కమలాప్తుతో సమ రం బొనరుప వచ్చెననఁగఁ గ్రాలెన్ సేనల్

క॥ అహిరాజు మేను గుదివడ, మహి నిలుకడ దప్పి క్రుంగ • మాత్రొద్ది మహా
మహీ ధరము లొక్క వరుస ని వహముగ రఘురాముపైకి • వచ్చినవనఁగన్

తే॥ పులుల గుంపులో? వారిద • పుంజమొక్కొ? వారాశియో? పర్వత • పంక్తియేమొ?
కాదు కాదు హర్యక్ష ని • కాయమనఁగ, సాయుధీయ బహుళ సైన్య • చయములరిగె

సీ॥ అరికట్టరానట్టి • యమునిఁబోలిన యనే క సహస్ర విరటులౌ • కొల్లలములు
శరనిధియో యనఁ • బొరలి వచ్చునపుడు శరభ సింహ గజ భీ • కర ఉలాయ
శార్దూల జంబుక • శ్వాన భూత పిశాచ, గంధర్వ కిటి వృష • గార్దభములు
కట్టంగఁ బడినవి • కంటికందని యంత, దవ్వుగాంచెడు గృధ్ర • తండయుతము

తే॥ లగుచు జయశంఖ నినదంబు • ఒదరుచుండు రథచయంబులు సూక్ష్మనే • త్రములురక్త
వదనములు గల వారణ•వ్రజము వాయు గమన మొప్పుతురంగముల్ • గములు గట్టె

సీ॥ పరశువుల్ శక్తుఁ • వజ్రఖడ్గంబులు, ముసల తోమర శూ • ముద్గరములు
దండముల్ పంజర • దండముల్ పాశముల్ వక్రకుంతంబులు • వజ్రములును
చక్రముల్ కుంతముల్ • శంఖముల్ బాణ బా, ణాస నాంకుశ గదా • ద్యాయుధములు
భానుఁడగ్నియు సిగ్గు • పడనొప్పు కాంతులు, రక్తమాంసములతోఁ • గ్రాలునవియు

తే॥ వేలుపుల కెల్ల బాధ గ • ల్పించినవియు, విజయ చిహ్నంబులంగూడి • వెలయునవియు
నైన హేతి సందోహంబు•న్ని యెడలఁ, గిఱుకిఁ బిశళశమనుచుఁ గ్రిక్కిఱిసి మెఱసె

సీ॥ బయలు దేఱినసైన్య • పతులనొక్కొక్కరు, వెయి గౌరుల చేవ • వెలయువారు
భూమండలము నొక • ముద్దగాఁ గొనువారు క్రూరాగ్ని వంటి క • స్నొద్దవారు
పదునలువురు వారి • బలమొక్క సౌకరికి నలువది లక్షలు • పఱఁగుచుండు
పలువురు చతురంగ • బలమెనిమిది కోట్ల నలువది లక్షు గలుగుననియు

తే॥ ఒక్కొకని దళమొక కోటి • లెక్కయునియు పదునలువురు నాయకులకుఁ • బదియునాల్గు
కోట్ల సైన్యంబులనియుఁ జెప్పుకుదచింతు రమితమై లెక్కయిడరాని • దదినిజంబు

సీ॥ బలయుతుల్ పిడుగుల • పరె బొబ్బలిడువారు విసరు కైదువు కేల • వెలయువారు
బ్రహ్మచే వరములఁ • బడసిన వారలు మొగుళులు గిరులనఁ • దగినవారు
దురహంకృతులు లెప • దోర్బలశక్తికిఁ దగువారు లేరని • నెగయువారు
ఆకాశమును కొల్వ • నగు నొడల్గలవారు కఠిన విశాల వ • క్షములవారు

తే॥ ధరణిఁ గొల్వంగఁ దగిన పా•దముల వారు విబుధులుమతింపు సేయ గా•వించు సమర
మిదియటంచు వీరావే• • మెనయు వారు మొగి నిహంపూర్వికగ నని • మొనయువారు

సీ॥ అమరులు వైచిన • యాయుధముల నుగ్గు, గావించు దృఢ దోర్య • గముల వారు
... ... ... యుండఁగఁ జేయు చండశాసనములఁ • జలిపినారు

హాలాహాలంబగ్ని • యదరి రూపొందిన, గతి నున్న కాయముల్ • గలుగువారు
రక్తకేశములు క్రూ • రత్వంబు వక్రదం, తమ్ములు మిడిగ్రుడ్లు • తనరువారు

తే॥ కాటుకయుఁ దెల్పెయనఁదగు • కట్టివారు, బలిమి బెడిదంబుగని పితృ • పతియుఁదనకు
మిత్తులనుచు భీతింజెంద • మిడుకువారు. జడుపు దయసుంతయును లేని • యెడఁదవారు.

సీ॥ గండపెండెరములు • కాళులఁగలవారు, పుష్పహారములచేఁ • బొలుచువారు
కవచులు రత్నకం • కణు లురుదంష్ట్రలు, జ్వాలలవంటి కే • శములవారు
సంగరోత్సుకులు త • రంగముల్ సింగముల్, క్రోఁతులు భూతముల్ • ప్రేతములును
శరభ భల్లూకముల్ • శార్దూలములు సార, మేయంబులను శంక • మీఱువారు

తే॥ నిప్పులం బోలు మొగముల • నెగడువారు కాలకూటంబుఁ బోలిన • కనులవారు
కాలుసేతులు మొగములు • గణనసేయ, మూఁడు నాల్గైదులేడులై • పొనరువారు.

తే॥ వజ్రియును కోపఘూర్ణిత • వదనమరసి, బెడిసి వెన్నుచూపఁగఁదగు • బెట్టిదులును
బవరమే లేమిఁగండూతిఁ • బడసియున్న, భుజగిరులు గలవారలు • భూరిబలులు.

సీ॥ యక్షులనుండి కొ • న్నవి రాక్షసేశులి, చ్చినవి దేవతల వం • చించి లాగి
కొన్నవి గంధర్వ • గుహ్యక సిద్ధుల, బాధించి కైకొన్న • ధ్వజచయంబు
జాలరు గొడుగులు • చామరంబులు స్యంద, నవితానములు నిండి • కవియుకతన
మార్తండు కిరణముల్ • మఱుఁగు పడంగఁ జ, తుర్దశ లోకముల్ • తొదరిగెలుచు

తే॥ దణులు పదునల్వురును వారి • దళపతులును, ఖడ్గఖేటక శూలాది • కములుదాల్చి
పులులవలె సింహములవలెఁ • బలముమెఱసి, దాడి వెడలిరి జగముబ • తల్లడిల్ల.

తే॥ విండ్లుకత్తులు గలవారు • పెనపులపయిఁ, బండ్లు కనఁబడు వారలు • పైఁడికొండఁ
బెల్లగించు వారలు దైత్య • పల్లనాథుఁ, దీర్చుటయె ముఖ్యమైయుండు • దీక్షవారు.

చ॥ త్రిశిరుఁడు దూషణుండు పెను • తేరులనెక్కి జయేందిరన్ పెసన్
పశ మొనరించి నట్టి ఘన • హేతి గదాదులఁ దాల్చియుద్ధ క
ర్కశులగు వీరవర్యులు స • కాశమునన్ విజయాంక గీతముల్
విశదముగాఁ బఠింపఁ గడు • వీఁకను వచ్చిరి సంగరాప్తటిన్.

ఉ॥ మిక్కుటమైన మల్లభట • మేఘ కదంబము భేరి మ్రోఁతతో
జక్కరభేఁడు మిన్నొరియు • స్వర్ణగిరిం దగఁజుట్టి నట్టులై
మొక్కలులైన రక్కసులు • ముంగల వెన్కల నన్ని ప్రక్కలన్
నిక్కుచు రాఖరుండు పయ • నించె జగంబులు బెగ్గడిల్లఁగన్

మ॥ మదమాతంగ ఘటల్ తురంగ చయముల్ • మౌర్వ్యంబులున్ దేరులున్
మదఫేనార్ద్ర మహీతలంబునఁ జరిం • పం ద్రొక్కుడైయెండిపె

ల్లిదమై ధూళి వియత్తలంబు పరవన్ • లీలన్ జగద్బంధు ప
చ్ఛదనంబందిన గుఱ్ఱముల్ రథము న • చ్చంబయ్యె వీక్షింపఁగన్.

ఉ॥ సాగర ముల్బణంబయిన • చందమునన్ మితిమీఱి క్రాల్బలం
బాగతి సాగఁ బాఱఁగ వ • నాంతరమెల్లను దుక్కియయ్యె శై
లాగములందు మింటఁగల • నబ్బములన్నియు నెండెఁ; బూఁడెఁబో
సాగరమన్న రాత్రిచర • సైన్యరజంబు వచింప నెట్లగున్?.

ఉ॥ కొండలమీఁద వేఱు పెను • కొండలు వింతగ నెక్కురీతి వే
దండ శిరంబులందు సెగ • దాఁకు విసంబును పోలి హింస లు
ద్దండతఁ జేయు రక్కసులు • దాఁటుచు మీటుచు హుంకరించుచున్
ద్దండితనంబుఁ జూపుచు ము • దంబున నేగిరి కొండ యుద్ధతిన్.

శా॥ మాయాబంధము పూర్తిగాఁ దొలఁచు స • న్మాన్యాశికిం ద్రోవ నే
చాయన్ శక్యముగాక తోడనె నివా • సంబంది ప్రాణంబులం
బైయామ్యేశున కందియిచ్చు రుజరే • వన్ సైనికాగ్రంబునం
దాయుర్వర్ధన సూచకంబుగఁ జనెం • బ్రావేశయై విగ్రయున్.

ఉ॥ భేరి రవంబుచే గగన • వీధిఁ బయోదము లోట నొందఁగా
జ్యారుతికిం గడుంజడిసి • హ్రాదినులుం బయిలోడి పాఱఁగాఁ
బేరులివుల్ వినంబడఁగ • వెన్నుని చెంకియు లజ్జనూనఁగా
వీరవరేణ్యులున్న యట • వీస్థలిఁ జేరె సురారిసైన్యముల్.

చ॥ పరవిన సేనఁగాంచి మృగ • పక్షులు చూపులు దిగ్భ్రమింపఁ, ద
త్తఱపడి నోరులెండఁగ, రు • తంబులు గీడ్పడ, మేలుసోల, దె
ప్పరిలుచు రోఁజుచుం బఱచెఁ • బార్థివ పుంగవు తోడ శత్రు భీ
కర ఖర సేనరాక వడి • గామును దెల్పెడు వేగులోయనన్.

## శ్రీరాముఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట.

చ॥ ఘనులగు రామలక్ష్మణులు • క్రన్నన ధూళిదివంబు గప్పుటల్
దనుజుల పాదఘట్టనఁ బో • దళ్ల మహీజములుక్కికూలుని
స్వనములుభీతిఁబాఱు మృగ • పక్షుల గందరగోళ పాటు చూ
చిన తటి దైత్యసైన్యములు • చెచ్చెర వచ్చెనకాఁ దలంచుచున్.

శా॥ తూణీరంబులు పూని ఖడ్గకవచా • దుల్దాల్చి హస్తంబునన్
బాణాసంబు ధరించి లక్ష్మణుఁడు కో • పస్వాంతుఁడై రాము గీ
ర్వాణ ప్రార్థిత జన్ముఁగాంచి నను సం • గ్రామార్థి నంపుండి యా
యేణీలోచన తోడ నిండలరి నా • యేపుం బరీక్షింపుఁడీ.

మ॥ అనుడున్ రాముఁడు తమ్ముఁగాంచి వినుమ • న్నా! మున్ను నన్నర్థిమై
మునిసంతానము కోర రాక్షస బలం • బు న్నేనె మాయింతుఁగా
కవి పంతంబును పూనియుంటిని మదీ • యంబైవ పల్కుల్వ్యథా
చన కుండం బరిమార్తుఁ గావు మిట భూ • జాతన్ మది న్నెమ్మదిన్.

మ॥ అని తమ్ముం గడు బుజ్జగించుచు నర • ణ్యంబెల్ల నాశంబుగా
నని సేయం జనుదెంచు నద్ధి ఖర సై • న్యంబించు నూహించి క్ర
న్ననఁ గోదండ తనుత్ర తూణములు బొం • దం దాల్చి సన్నద్ధుఁడై
యనుజుం గ్రమ్మటఁ గాంచి యిట్లను ఘన • శ్యాముండు రాముండొగిన్.

శా॥ అన్నా! క్రమ్మఱు టక్కజంబయిన యీ • యాయోధనం బందు నన్
గ్రన్నం దాఁకిన దైత్యమర్త్య సుర సం • ఘంబుల్ బలంబేది యా
పన్నత్వంబునఁ గ్రుంగి గ్రుందునని చె • ప్పన్ లేదు దోస్సత్త్వ సం
పన్నత్వంబున ప్రాలుమాలికఁ దొలం • పం బంపుమా వైదేహిన్

ఉ॥ నావుడు లక్ష్మణుండు రఘు • నాథు పరాక్రమ సత్త్వసంపదల్
వావిరిఁ గాంచు వాఁడగుట • భ్రాతృ నిదేశము మీఱకుండ సం
భావనసేయు వాఁడగుట • మాఱు వచింపఁగ లేక మ్రొక్కి బా
ష్పావిల నేత్రయైన జన • కాత్మజ చెంగట నిల్చె భక్తిమై

కా॥ తాటంకంబులఁ దాల్చు పూర్ణశశి నొం • దం బూచు పూఁ గొమ్మకున్
సాటింజెందిన సీత సోలిపడ ని • ష్పావంబు తోడ న్నిరా
ఘాటం బొప్ప మహా గుహన్ వెడలు సిం • గం బట్లు రాముండు దో
షాటుల్ గర్జిల వీడెఁ బర్ణకుటి విం • ద్రాదుల్ ప్రహర్షింపఁగన్

చ॥ విడుపు వెదుళ్ళఁ బుట్టు చెడు • నిప్పడవిం దమ వంశ సంతతిన్
బొడవడఁ జేసి తీలుపడు • పోలిక నొప్పిన చుప్పనాతి త
ల్లడపడి రాముఁగాంచి మన • లం బరిమార్పఁ బ్రతిజ్ఞఁ గొన్నయా
దుడుకఁ డితండె యంచుఁ దని • తోయము వారికిఁ జూపెనాతనిన్

ఉ॥ నింగిని రశ్మిఁ గ్రుంచి రవి • నిల్వ విమానములన్ జరించు వె
ల్పుం గమినోర్చి కీర్తి పొలు • పుం గడియించు ఖరుండు భూమిభృ
త్పుంగవుఁ గాంచి రాక్షసుల • తోడ వచింయ మనుష్య నీతినిన్
భ్రమంగఁగఁ జేసి నే విజయ • మాల ధరించెదఁ జూచుచుండుఁడీ

చ॥ దుడుకఁ డొకండు వీఁడ! మన • దుర్దమ సైన్యములెల్ల నిల్వ నీ
యడవియె చాలకున్నది! ప • యంబున నేఁ గొనుగెల్పు గొప్పదై

యదరునే? యల్పకార్యమిది • యందఱుఁ జూచుచు నుండుఁ దేనె యొ
క్కఁడుపున వీనిఁబట్టికొని • ప్రాణము తోడుత మ్రింగివైచెదన్.

చ॥ ఖరుఁడిటు పల్కుచుండఁగ న • కంపనుఁడన్ బుధ తల్లజుండు సం
బరమున నడ్డువచ్చి విను • మా యొకవాక్యము దైత్యనాథ! సం
గరమున మిక్కిలింగినుక • గాంచుట మంచిదె కాని నేఁడు దు
స్తరల దుర్నిమిత్తములు • తార్కొనెఁ గాంచుము యంచు నిట్లనున్.

అకంపనుఁడు ఖరునకు దుర్నిమిత్తములు దెలుపుట.

తే॥ తోయదములు గర్జించి నె • త్తురులు గురిసె, నర్క బింబంబు పరివేష • మమరెఁ జూడు
నీధ్వజము మీఁదఁ గాకముల్ • నిగిడిపోరి, పడుచుఁ బనవుచుఁ బొరలాడు • పగిదిఁగనుము

తే॥ ఖడ్గధారలపై మషి • కములు ముసరె, నెడమ కనులు బాహులు వీఁగె • నెక్కటులకుఁ
గుదిర లెల్ల సిల్వనసె తూఁ • గుచును పడియె, నూళ వెట్టెఁ గుక్కలు నక్క • లొక్కట

తే॥ మదజలముగార్చెఁగరిబులు • మదకరులకు, విఱిగెఁ గొమ్ములు మహితూలఁ • బిడుగులరొ
దెసలు మండె శిరంబులఁ • గుసుమచయము, పొలసు వాసన వీచె నీ • పొలముగనుము.

తే॥ ఇట్లగుట వీని నరుఁడని • యెన్న దగదు, వీనిఁ జూడఁ దోఁచునవి యె • న్నేని గలవు
పన్ను మన మాయ లిచ్చటఁ • బనికిరావు, మీఁదు కినియక నన్ను క్ష • మింపవయ్య.

చ॥ అనుడు జగంబు లొక్కపరి • యల్లల నాడఁగ నవ్వి యాఖరుం
డను విబుధావళుల్ మెదుగ • నాజిని నూఱఁగ నన్నె పాత్రముం
జెనసిన మద్భుజాగ్రములు • చెచ్చెర మిక్కిలి బూరటిల్లెనా
వినుత పరాక్రమ స్ఫురిత • వృత్తి మనుష్యుల కంత చుల్కయే?

క॥ అనుచుండ సింహమును గవి, సినసామజములను పోలి • శ్రీరాముని దై
త్యుని సైన్యము దట్టముగాఁ, జెనసె నుడిసె నార్చెఁ బేర్చెఁ • జిడిముడి పడుచున్.

ఉ॥ విండులు వంచినా రసుర • వీరులు పిమ్మట రాఘవుండు కో
దండము వంచి బాణములు • చట్టముగాఁ బఱపంగ ధారలై
దుండిగ వారువంబులకుఁ • దున్గెఁ బదంబులు సిద్ధుపాటుచేఁ
గొండలఁ బోలెఁ దొండములు • కోల్పడి కూలె మతంగజంబులన్.

తే॥ విఱిగె శూలముల్ ఖడ్గముల్ • మురిసెగదలు. తెగియె భిందిపాలంబులు • త్రెవ్వె విండ్లు
తునిగెఁ జక్రముల్ దండముల్ • త్రుంగెఁదోమ, రములునుగ్గయ్యెఁ గేదెముల్ • వ్రయ్యఁ

క॥ చెడియెం గరుల పదంబులు, పడియెం గంకణము లొరయ • భల్లకరంబుల్
మిడిసెం దలల మలలు పఱి, చెడిసె శతాంగములు భిన్న • భిన్నాంగములై.

చ॥ ఖరువుల డుస్సి యందఁగల • గంధగజంబుల డుస్సి వే దిగం
తరములఁ జొచ్చురాఘవుని • దారుణ శాత శరాళిచేత ని
బ్బరముగ వీరలక్ష్మికి ని • వాసములౌ దనుజాళి వక్షముల్
విరిసెను శీర్షముల్ తెగియె • వెల్లువలై ప్రవహించె రక్తముల్.

ఓ॥ కంజనేత్రుని యస్త్ర మొ • క్కండు నూర్లు, వేలు లక్షలు కోటులై • పెరిఁగి గిరులౌ
గిరుల శిఖరములో యనఁ • బరఁగు సోఁకు, మూఁకలం గూల్చి పీన్గుల • ప్రోగుచేసె.

ఉ॥ ప్రామఁకులు కాయటగ్గిఁ బడి • ప్రేలుచునున్న తెఱంగునం దలల్
వ్రేఁకన త్రుంగ మొండెములు • ద్రెళ్లెను రక్తమయంబు లౌచుఁ బై
వాకసమందు పొఱు కమ • లాఘ శరావళి వారి ప్రాణముల్
వీకున మ్రింగ వెంటఁబడి • వీడక యేగిన చందమై తగెన్.

ఉ॥ స్త్రీల కనుంగవం బలెనే • దీర్ఘములై బెడిదంబులైన శ్రీ
లోలుని వాఁడి తూపులరి • లోకము ఖడ్గ కరంబు లుర్లఁ గం
రాలి తెగన్ శిరాలు విరి • యంగఁ బదంబులు త్రెవ్వఁ జూపఱుల్
సోలఁ జెదర్చె దిక్కులకు • సోఁకుల వింతగు శీర్షరాసులన్.

మ॥ క్షితిభృద్వీర మహేంద్ర చాప శర వృ • ష్టిన్ జాఱు కీలాల సం
హతిదై తేయ కబంధబంధవృతి యే • పారన్ మహౌఘంబులై
తత విస్ఫార వనాశయాళిగ వనం • తం బెల్లఁ దత్పూర్వ సం
స్థితి మార్పం బడి యెప్ప టట్ల వెలసెన్ • జిత్రంబుగాఁ జూచుచోన్,

॥ ఆ రక్త సాగరంబున, శూర శిరో బాహుదండ • శూల పతాకా
వారణ రథగజ ఘోటక, వారంబులు దేలియాడెఁ • బరిపరి విధులన్.

॥ అప్పుడు బలియురు కొందఱు, నిప్పులు గ్రక్కుచును చూచి • నిగుడుచుఁ గొండం
గప్పిన జీమూతము లనఁ, గప్పిరి శరవృష్టి తోడఁ • గాకుత్స్థవరున్.

॥ వారల బాణాసారము, వారక యాతఁడు హరించి • పఱపి దెసలకున్
ధారణి నడుము విఱుగఁ గాం, తారము నిండంగ నఱకె • దైత్యుల శిరముల్.

॥ ఆట్టలాడెఁ గ్రొన్నెత్తుట హరులు కరులు, మునిఁగెదైత్యవరుల క్రొవ్వు • ముక్కువఱకు
మెసవి క్రక్కుచు భూతముల్ • మేలుమోవ, లేక మెలమెల్లఁ గాల్గద • లింపసాగె.

॥ కల్లు మత్తు పంచనమును • గలుగు నసుర, వరుల నేత్ర రత్నంబులఁ • గరట చయము
కొల్లగొనె; ధర్మ సత్త్వము • కుంఠితంబు; దుష్టులకుఁ జేటుమూఁడుట • కష్ట తరమె?

చ॥ ఇరులఁ దొలంచు భాను క్రియ • నేచిన రాఘవు మీఁద నీఁటెలం
దొరసిన రోష దృక్కులను • దొందడి సేసి యుగాంత కాల భీ

రర జలదంబు లొగ్గి వడ • గండ్లు వెలార్చిన లీల యామినీ
చర నికరంబు లొక్కమొగిఁ • జల్లె వెసన్ సకలాయుధంబులన్.

సీ॥ వీరుపై చిసవారు • వీరువీచినవారు, వీరు వేయఁ దలంచు • వారలనియు
వీరు నేర్చినవారు • వీరునేరనివారు, వీర లెక్కటివోరు • వారలనక
విరిచిన వారల • నరిగిన వారలఁ, గాందిశీకులఁ డిట్టి • కఱవువారి
రేఁగెడు వారల • రేఁపు వారల నెధి, రించు వారల హుంక • రించు వారిఁ

తే॥ గని మసఁగి గ్రుంపఁగా మస్త • కములుకొన్ని, మేఘమండలమునఁగొన్ని • మిధునరాశి
గొన్ని ఋక్ష మండలమునఁ • గొన్ని గిరులఁ, గానలోఁ గొన్ని కొన్ని ది • క్కరులఁజే

చ॥ తరఁగల తోడి శోణిత న • దంబులఁగూర్చ సురారి శైల కం
దరములఁ దొల్చి రామవిభు • దారుణ శాత శరాళి భూమిపై
గిరుల పయిం బయోదములఁ • గీల్కొనెఁ గొన్ని పయోధిఁగొన్ని క
ర్పురుల తను వ్రణంబులను • గ్రుచ్చుచుఁ గొన్ని యెలర్చె నెల్లెడన్.

ఉ॥ హారయుతుల్ మహోజ్జ్వల దృ • గంచితు లాయుధ హస్తు లుత్కట
స్ఫార శరీరులౌ మగలు • భానుకులేశు శితాస్త్రపాళిచే
సురలి తునింగి నుగ్గయి శ • రోద్ధత ఘోర సమీరణంబునన్
శరధిని చేర నిర్జరులు • సంతస మందిరి నింగి నార్చుచున్

చ॥ ప్రబల తురంగ సంహతి త • రంగ వితానము గాఁగర క్తమ౼
కబరజలాన గుండెలను • కంజ వనంబు రహింప వారణా
లబికిన నక్ర బృందముగ • నూడిన ప్రేవులు శైవలంబుగా
గబగబ భూతరాజి దుము • క౼ విలసిల్లె రణోర్వి సంద్రమై.

ఉ॥ కొందఱు కుయ్యవెట్టి రొక • కొందఱు సోలిరి కొందఱీల్గఁగాఁ
గొందఱు పొట్ట వ్రీల మటి • కొందఱు కాళులు చీల జోలుచుం
గొందఱు దొర్ల నెత్తురునఁ • గొందఱు మున్గుచుఁ జచ్చి తేలఁగాఁ
గొందఱు పాఱఁ గొందఱటఁ • గుందిరి రాముని బాణవృష్టిచే.

ఉ॥ వ్రంతల భీతిఁ బాఱు సుర • వైరులఁ గాంచుచుఁ దిట్టి నవ్వి కా
లాంతకుఁ బోలు రాక్షస • గణాధిపతుల్ పదునల్వు రొక్కటన్
ధ్రుంతము క్రుంతమంచు ఘన • దోర్బల గర్వమునన్ మహోగ్ర దు
ర్దాంత విషంబు నా నడరి • దండడిఁ జుట్టిరి రామచంద్రమున్.

తే॥ శివుని కవిసిన త్రిపుర దా • నవుల కరణి. రాముఁ గవిసి మతింపక • రాఁజు కనలుఁ
గములఁ జూపుచు మేఘంబు • నెనయు ధనువు, కేలఁగొన్న యాతనిఁగొట్టఁ • గిట్టినారు

చ॥ ఒకరుఁడు ఖడ్గముఁ వయిచె • నొక్కరుఁడు చక్రముఁ ద్రిప్పి వీడె వే
ఱొకరుఁడు పాశమున్ విసరె • నొక్కఁడు తోమరమేసెఁ జేవ నిం
కొకరుఁడు కొండలం బఱపె • నొక్కఁడు దండము వీచె నుగ్రుఁడై
యొకరుఁడు కేరితిట్టె మఱి • యొక్కఁ డదల్చె నొకండు హుమ్మనెన్.

చ॥ వెలువడు రామ శాత శర • బృందముచే రథ రథ్య వర్గముల్
హిలిసె మతంగజంబులును • భూమికి ప్రమొగ్గెఁ దురంగ సంఘముల్
తలలను కోలుపోయె నవి • తామరసాప్తుని చుట్టె గుళ్లు నాఁ
దొలఁగిన సోఁకుమూఁకయుస • దోరె రణస్థలి పీన్గు కుప్పగాన్.

ఉ॥ సోలిన దైత్య దేహముల • శోణితముల్ వ్రణరంధ్రముల్ విడన్
జాలుఁగఁ జిల్లున న్నెగసి • క్ష్మాతలమెల్లను కప్పివైవ దే
వాలియుఁ గేల మూసికొనె • నక్షియుగంబుఁ గృతాంత దూతలుం
గాళులు నొవ్వఁ గాఁపడును • కాఁచుచు మోచిరి ప్రాణబృందమున్.

ఉ॥ ఓలి పిశాచము ల్దిరుగు • యుద్ధము నున్మద వృత్తిఁ గోరు దై
త్యాళుల వక్త్రగహ్వరము • లందు ఘనీతతిచొచ్చెఁ దచ్చిరః
పాళుల నక్కలెక్కెఁదమ • వాత శరంబులు గ్రువ్వవారి ము
గ్జాలముఁ జేరు కర్బుర ని • కాయము ప్రోదినులట్లుగ్రమ్మెటెన్.

చ॥ తలలురలెన్ గనుల్చెదరెఁ • తన్నయనంబుల నిప్పుకల్ వడెన్
మలలుగ నేల దొర్లినవి • మత్తగజంబులు దిక్సమూహ మ
ల్గల పడెఁ గొల్మిసట్లు మిడుఁ • గుర్లెగసెన్ సమసెన్ వరూధినుల్
లలిత నృపావతంసు కర • లాఘవ మెట్లు వచింప శక్యమౌ?

తే॥ స్యందములతో నాయుధ • చయముతోడ, దళపతులు పదునల్వురు • తక్కువారి
సైనికనికాయ మెల్లను • సమసి పొలసు, కంపుగలరక్త జలధిలోఁ • గలిసిపోయె.

ఉ॥ వారలు సంగరాంగణము • వారకచూచి శిరంబుతోడి వా
రేరును లేమి రాముపయి • నేపునమండుచుఁ బండ్లు గీఁటుచున్
మోరలు నిక్కఁగా నరద • ముల్ రఘువర్యుని క్రేవఁద్రోలుచున్
ధీరత హుంకరించుచు మ • దించుచు గర్వపు మాటలాడుచున్.

ఉ॥ వచ్చినఁగాంచి రాఘవుఁడు • వాఁడిశరంబులు నాఁటనేసి యొ
క్కచ్చునఁ దచ్చుతాంగముల • నర్వ్వడుసేయ గుఱాలు సారధుల్
విచ్చిన నేము లచ్చులును • వ్రీలిన సెక్కములున్ యుగాంత మం
దెచ్చిరి గాలిచే నెగసి • యేగెడు పోలిక దోఁచె మింటిపై.

తే॥ స్యందనము లట్లు సమయఁ ద్రొ • చ్చండ భంగి, నవుడుగలుచు భూమియు • నగలునట్లు
క్రిందికిం దూఁకి ధనువులు • కేలఁదాల్చి, పిడుగులం బోలు శరములు • విడిచినారు.

తే॥ దిశల భేదింపఁ జాలిన • నిశిత విశిఖ, తరుల నడుమన ఖండించి • దాశరథియు
వారి బాణాసనంబుల • పరుసపెట్టి, విఱిచి మానిచె వారల • వింటిపోరు

క॥ కోపమున వారు కొండల, నేపున బెకలించికొని ది • నేశుని తేరుం
ద్రేపు చెడ • నెత్తి పయికా, బోపంబున వైచి రుగ్రుఁ • డున్ దిగులూనన్

క॥ గొనయముతోఁగను బొమ్మలు, నినకులునకు వంగె వాహి • నీశుల తలలున్
ఘన గిరులతోడఁ బడె మే, దినిపయిఁ గరలాఘవంబు • దివ్యులు పొగడన్.

క॥ ఈలాగు వారు గూలఁగ, మూలబలము గదిసి రాము • ముట్టెం బెలుచన్
బోలఁగ దివి భువి దెసలని, తేలికఁ దెలుపంగరాక • తికమక పడఁగన్.

తే॥ దుందుభులతోడ నేమఁగుల్ • క్రందుసలిపెఁ, గటుగుణధ్వనితోడ శం • ఖములు మొరసె
తురగ హేషలతో రణ • దోహలులగు, రక్కసుల పేరెలుంగులు • పిక్కటిల్లె.

ఉ॥ అంబర వీధి నిండెనసు • రావలి కైదువు లెల్ల వాని మ
ధ్యంబునఁదూటి రామవిభు • దారుణ మార్గణరాజి నుగ్గునూ
చంబుగఁ ద్రుంపఁగాఁబెటిలి • చయ్యనమింటికి నేగ నిర్జరా
ఘంబులు పాఱె దిక్కరులు • కన్నులనార్చె జగంబు బెగ్గిలెన్.

## త్రిశిరుని సంగరము.

మ॥ బలవంతుండు పసిండి బొమ్మికము లు • ద్భాజిల్లు వాఁడుం గడున్
దళము ల్గలిగినవాఁడు మూడు తల లు • ద్యద్దీప్తి రాజిల్లు సోఁ
కులమున్నీఁడు ఖరానుజుండు గిరి • క్రూర త్రిశూలంబు నాఁ
జెలఁగెన్ రాక్షససేనమధ్య మరవ • ష్టింగూర్చు చాపంబుతో.

మ॥ లయకాలాంబుధియో యనంగ జగముల్ • మార్మ్రోఁగ శబ్దించుచున్
భయద ప్రోద్ధతిఁ దన్నుచుట్టికొనఁ జా • పశ్రేష్ఠ మాత్రంబు తో
డయి యొక్కండుగ నిల్చు రాఘవ విభుం • డవ్వేళ నొప్పెం దమో
మయ రంగస్థలి వెల్గు దీపమన స • మ్యగ్దీప్తి యుద్ధావనిన్.

మ॥ శరఖడ్గాదులతోడ భీకర ధను • ష్టంకార హుంకార ని
ష్ఠురరావంబులతోడఁ గ్రూర నయన • వ్యాపారుడై రాముఁడా
ఖరుతమ్ముంగని వాని సేనను వృష • త్క క్రూర కారిత్వమున్
పరదోస్సారముఁ గానిపించె సమతన్ • ప్రాగల్భ్య మేపారఁగన్.

తే॥ తెగెను కాళులు తలలును • తెగెను కేలు తెగెను తొడలును నడుములు • తెగెనుద్రేళ్ల
తెగెను మోకాళ్లు పాదముల్ • తెగెగొడుగులు తెగెనుపాళాదికంబులు • తెగెరథోర్వి

తే॥ అరదములు పతాకలును ర • థ్యముంతోడఁ గ్రుంగి పుడమినిపడియె దుం • దుభులతోఁ
దుండములు తెగి మత్త వే • దండచయము పిడుగుచేఁ గూలుగిరులట్లు • బెడిసిపడియె

తే॥ తలలు తెగువారు తెగుటలు తెలియక శరవృష్టి గురిసి • తీఱుదు రిలపైఁ
దలదెగని వారు రేఁగుచు జలదము క్రియఁగురియుచుంద్రు • ంవర్షంబున్

చ॥ కరముఁ గేదెముల్లనరఁ • గాటుకకొండలవంటి కర్బురో
త్కరము కబంధముల్ కనక • కంకణ నూపురముల్ ధ్వనింపఁగా
మురియుచు నాడు వేలుపుల • బోటులు జన్నపు రోవెలందులున్
వెఱఁగు పడంగ నాట్యములు • పెక్కువిధంబులఁ జల్పె నయ్యెడన్

చ॥ గొడుగులు చామరాంు సురు • గుల్ కరులున్ దెగు బాహువర్గముల్
సుడులుగఁ దెక్కముల్ పడవ • సోలుపులై లగ రక్తవాహినుల్
కడలిని చేర నుప్పనయి • క్రందుగనున్న సముద్రశీంమున్
విడువఁగఁజేసి నూత్నమగు • పేరిమి గూర్చె రణప్రకారముల్

తే॥ రామశరములచే రీ • రములు విడిచి, వజ్రదంతులు రక్కసుల్ • స్వర్గవాటి
నమరనారులతోఁ గూడి • తమ కబంధ ముఖ నటించు నాటకము లి • మ్ముగను గనిరి

ఉ॥ వేలుపు టింతులం గలిసి • వేడుకఁగా ననిఁజూచు పూర్వదే
వాలి ధరన్ రఘూత్తము శ • రావలిఁ ద్రెవ్వెన స్వీయ బాహులన్
వాలి పిశాచపాళి యొక • వంకకు శ్వానము లొక్కవంకకున్
గ్రోలుచుఁ బోరి లాగుటపు • గోరికఁ గాంచుచు నవ్వరయ్యెడన్

శా॥ జ్ఞానాస్త్రంబులు సోకఁ జీలిన హృద • బ్జాతంబున్ దైత్యు ల
జ్ఞానావస్థఁ దరించి పాపముల నో • జం గోసి దివ్యాత్ములై
ధ్యానాసక్తత నద్వితీయుఁడయి యు • ద్ధంబాడు శ్రీజానకీ
ప్రాణేశుంగని రద్వితీయ పరత • త్త్వంబంచుఁ జిత్తంబులన్

ఉ॥ తుండ యుగంబుతోడి కిరి • తోయము నొందిన రామచంద్రు కో
దండ ధనుర్విముక్త శిశి • త ప్రదరంబులు మూల ముట్టుగాఁ
దుండు లొంర్చి నొంచినవి • దుష్టులఁ గాంచిన వారి నెల్లరన్
జండి యశాంతిమై నసృత • సాక్ష్యము వల్కిన వాక్కులంబరెన్

ఉ॥ రాజిలు జెక్కులొప్పు భ్రమ • రంబు లభించిన కీటకంబు ను
ద్వేజిత రీతిఁ గాంచి తన • తీరు నొంగిన భాతి పూతి ధా

త్రిజ మనోహరుండు తన • తీవ్ర శిలీముఖ రాజిచేత ర
క్షోజన కీటకంబులను • క్షోభిలఁ జేసెను ఖేచరాళిగన్.

చ॥ కడుబెడిదంపు టాముస నొ • కానొక మానిసి సాహసించి యు
క్కడదముగ దైత్య సంఘములఁ • గాడుగ బీడుగఁ జేసె నంచు ను
గ్గడువునఁ బంక్తి కంఠునకుఁ • గార్యము దెల్పననంగ నచ్చటం
దుడిచిన దానవాంగముల • తోఁ జనె లంకకు రక్తవాహినుల్.

చ॥ బలసిన మోహరంబుగల • వాహిని రాఘవు నస్త్రరాజిఁ బో
ర్కలనునఁ ద్రుంగఁ గాంచి త్రిశి • రస్కుఁడు మీఱిన కోప మానియై
కలిసిన రక్తమందు మునుఁ, గం బడు తేరును ద్రోలు మంచు నీ
ట్టలముగ నార్చి యాజికిఁ గ • డంగెను దుస్సహతేజుఁడై వెసన్.

తే॥ సత్యమునకు నెల్లరకును • సాక్షియైన, రామచంద్రునిపై ముఖ • రంబులైన
శాతసాయకములు గుప్పి • చంద్రసూర్య, లకును రాఘవుఁ గనరాని • లలినొనర్చె

తే॥ త్రిశిరుఁ డేసిన తూపులఁ • ద్రెంచివైచి, మరల రాముఁడు పదునాల్గు • మార్గణములఁ
గనక రథము ధ్వంసము చేసి • కడఁగి యొక్క, భల్లమున సారథి శిరంబు • డుల్లనేసె.

తే॥ మఱియు దేవత లార్వంగ • మనుజవిభుఁడు, స్వర్ణపుంఖబాణమున రా • క్షసునిమూఁడు
తలల నొక్కటి ఖండించి • ధరణిఁ బడక, మునుపె రెండవ తలగూడఁ • దునియనేసె.

తే॥ రథము నిరుదల వోఁ త్రిశి • రస్కుఁడనెడు, పేరు చెడినను బలిమియు • బిగువు చెడక
గగనమున నిల్చితన కార్ముఁ • కంబు వంచి, విశిఖ వర్షంబు గురిసె భూ • విభునిమీఁద

తే॥ భ్రుకుటి వికటంబుగాఁ జూచి • భూవరుఁడు, కారుమేఘంబు మెఱుపుతోఁ • గానఁబడఁగ
గాలిఁ జెల్లాచెదరులైన • కరణి వాని, యంప వానను తూలించె • నాశుగముల.

చ॥ మఱియును దొడ్డ సాయకము • మాటి త్రిశీర్షుని విల్లుద్రుంపఁగా
వెఱవఁడు మోము కాంతియును • వీడఁడు బాహుల సత్త్వసంపదం
దొఱఁగఁడు కోప దృష్టులను • దోర్పఁడు కొండలువైచు పోఁడిమిన్
దఱలఁడు వీరవాక్కుల వ • దల్పఁడు వాని కడంక యెట్టిదో?

ఉ॥ మాయలు వన్ని యొక్కఁడె సు • మాళమునన్ బలుమంది పోలికన్
జేయుచు సింహగర్జనలఁ • జేయుచుఁ గ్రూరతఁ బోరుచుండు దై
తేయుని రెండు పాదములఁ • ద్రెంచుచు రెంటను రెంటఁ జేతులన్
మాయఁగఁ జేయనంతటను • మ్రాలక రాముని బిట్టదల్చుచున్.

ఉ॥ కాళ్లను గేలు పోయినను • కర్బుర వీరుఁడు విక్రమంబునన్
ద్రుళ్లుచు శీతభానుపయి • దూఁకెడు రాహువు పోల్కి నెత్తిపై

సుళ్లను కోఱలుండు గుహ • చొప్పునఁ గన్పడు బాకి నోటితో
మళ్లక వచ్చువాని దయ • మాలి వధించెను రాముఁ డత్తఱిన్.

చ॥ త్రిశిరసుఁ డన్ మహీధరము • దివ్య రఘుప్రవరాఖ్యగోత్ర భి
న్నిశిత శరాశనిం దెగుడు • నిల్వక దూషణుఁ డడ్డగించినన్
వశమఱి రక్తవాహినుల • వారక తూఱుచుఁ గాలి పెండముల్
పిశితము ప్రేవులుం దవిలి • వెక్కస పెట్టఁగఁ బాఱి రందఱున్.

ఉ॥ కొందఱు దేవతా వితతి • గొల్గున నవ్వఁగ భూమి పల్లముం
బొందఁగ దూఁకి పాటి యటఁ • బూఁడిన క్రొవ్వునఁ గాళ్లు జాఱఁగా
సందె మునింగినారు చది • యంబడు పీన్గుల నెక్కి జాఱఁగా
సందుల మ్రందుచుం దొరలి • చావక కొందఱు తప్పి రయ్యెడన్.

ఉ॥ కొందఱు మధ్యబాణములు • గ్రుచ్చి పదంబులఁ ద్రెంచి క్రుంచఁగాఁ
గుందుచుఁ గూలినారు మఱి • కొందఱు నెత్తురు టేళ్ల మున్గి క్రొ
వ్వొందిన పంకమందు దిగి • యోపిక లేవఁగ లేక కొందఱున్
దందడి రక్త పూరముల • దాఁటఁగలేకయె యీల్గి రెందఱో

చ॥ నడుములనుండి జాఱి చర • ణంబుల పైఁబడి త్రెంచుచున్న పే
రడిదములం గణింపక భ • యం బురు వానిన రీతిఁ బుద్ధియుం
జెడి పరుగెత్తు రక్కసులు • చెచ్చెర రాఘవుఁ డేయు నంపఱల్
విడువక వక్షము ల్దొలువ • వీఁకను రాక తొలంగి రా పథిన్.

చ॥ పరువిడుచున్నరక్కసులు • వ్రస్సి గుహాంతర సీమ కైవడిం
బఱఁగిన వారణోదర నీ • వాసములం భజియించి సన్నిధిం
దొరసిన మొండియమ్ముల నొ • దుంగుచుఁ గాంచి వయస్యః వీరలన్
దురమునఁ జూడలేదను మి • దో కయివారము లందు రొంటునన్.

దూషణుఁడు దురమునఁ బాఱు సేనలఁ బ్రేరేఁచుట.

ఉ॥ దూషణుఁ డందు నిల్చి తమ • దోర్బల శక్తులు గ్రుంగఁ బాఱుచున్
రోషము దక్కు రాక్షసుల • రూక్ష దృశం బరికించి తాపస
ప్రేషిత మానవాధముని . బీరము నోపఁగ లేక పాఱు నో
యోషితలారః నావచన • మొందు వినుం డిది వీరధర్మమే?

చ॥ పిఱికి మనుష్యులం గనుచు • భీతిలి పాఱుచు నింద మోచు న
మ్మొఱకులఁ గాంచి గాజులను • మోదముతో ధరియించు కాంతలున్
వెఱవరు నిబ్బరంబనెడి • పేరఁటియె పదిలంబు గాంచు పె
న్నుఱవు: భయంబు ప్రాణముల • కొప్పిన తొడగునే? వచింపుఁడీ;

తే॥ జిష్ణుతోఁ ద్రిమూర్తులతోడఁ • జెనకి చేయు, యుద్ధమున నిశాచరు లెవ్వ • రోడినారు?
పిఱికి తనమును మీకోడి • వెఱచిపాఱు, వేలుపులయొద్దఁ గొంటిరే • వెడఁగులార!.

చ॥ సుకమునె గాంచి యెల్లపుడుఁ • జొక్కిన రక్కసులార! యిందు మీ
రొక నరుచేత నోటువడి, • యొక్కరి నొక్కరు ద్రోచి కొంచుఁ బొం
దికగఁ బురంబు చేరఁగ మ • దిం దలపెట్టితి రే? యందు మీ
సకుల పయోధరంబులను • చయ్యనఁ గౌఁగిలిఁ గాంచఁ గల్దురే?

ఉ॥ జేగురు చూపు వెల్లనఁగఁ • జేకొని పాఱెడు పందలార! మీ
రాగిణులైన కాంతల క • రమ్యములం జనువేళ వీఁపులం
దోఁగిన కట్టు గీట్లు రణ • దోహలతం గను పోటు లందురో?
మేఁగిన పక్షముల్ తొడరి • మ్రింగిన తూపులఁ జూపికొందురో?

చ॥ జగములు కూడి మార్కొనఁగ • సాధ్యముకాని భవత్కులోత్తముం
డగు దశకంఠు చెల్లెలికి • నంగము వోయిన నింద చాల కీ
వగ ననిఁ బాఱి మోములను • వంతురె పెద్దల మ్రోల? మర్త్యుఁడే
మగఁడయి పోరుసల్పె నవ • మానము వేతొకఁ డింతకుండు నే?

శా॥ వీరావేశము తోడ యుద్ధముల వి • ద్విట్ప్రాతముం గూల్చి త
త్కాంత్రాస్త్రంబులఁ బుచ్చికొన్న విలస • ద్దోర్వీర్యులారా! యిఁకన్
మీరల్ మృత్తము లమ్మ వర్తకముకై • మేకొందురో? లేక భూ
దార ప్రక్రియ కాయుధంబుల నొగిం • దట్టింతురో కటుగన్?

ఉ॥ మీరలు నా ధనుర్బలము • మిన్నక చూచుచునుండుఁ డాతనిన్
మాఱుతు నేన యంచు జన • మాన్యుని మార్కొనియెన్ భయంకరా
కారుని దూషణున్ సురలు • గాంచి యెడందలయందు దిగ్భ్రమం
దారిరి కాచుకొమ్మని యు • దగ్రుఁడు రాముఁడు నిల్చె ముంగలన్.

## రాముఁడు దూషణుని వధించుట

చ॥ దురమున నాయుధంబులను • తుండములున్ రదనంబులున్ గరుల్
బఱియలుగాఁగఁ ద్రుంగె రథ • వర్గము కేతనముల్ శిరోగ్రముల్
పరిపరి త్రోవలయ్యె వరి • పైరుల కోఁతలఁ బోలెఁ గుత్తుకల్
దఱుగఁ దురంగ సంఘములు • దట్టముగాఁ బఱపై ధరం బడెన్.

సీ॥ రామధనుర్ముక్త • భీమ సాయకములు, ప్రాణంబు లున్నట్టి • పట్టువెదకి
వారి యాయుధములు • బంధుర కవచముల్, చెండుచుఁ గొండల • నుండి పాఱు
నదులకై వడి రక్త • నదులుబ్బి పాఱంగ, డాలుల యందు మై • వాలులందు
తూఱుచు వ్రచ్చుచుఁ • ద్రుంచుచుఁ దజ్జీవ, ములతోడ నచ్చటఁ • గలిసెఁ గొన్ని

తే॥ యట్లు కలిసి పోనొల్లని • యర్ధచంద్ర, కాండములు గొన్ని కత్రించెఁ • గంఠవితతిఁ
గొన్ని వంచకహృదయముల్ • గ్రొచ్చివైచె, దాసి తొమ్మల వీఁపుల • దూసెఁ గొన్ని

తే॥ దూషణుఁడు వేయి శరములు • తునుఁగునట్లు, వానిసేనల కైదువుల్ • వ్రయ్యునట్లు
యుద్ధ ఖేలఁ గావించి స • మిద్ధ తేజుఁ, డాచమూ సాగరము వట్టి • యడఁగఁ జేసె

తే॥ కాంచి వేలుపు లార్చి మో • దించినారు, రుధిర పూరముల్ బెట్లతోఁ • గుధరములను
గూడఁ బెకలించికొని పాఱెఁ • గ్రూరశరము, లన్నిదెసల నోఁకుల ధర • నడఁచి వైచె

తే॥ దురము గోరి నిల్చిన వారు • కెరలుచుండ, వారి జీవము గ్లానిపోవు • పనిని దవిలి
విసిఁగి వేసరి శోషిల్లెఁ • బ్రేతరాజు, చెలఁగి పీనుఁగుఁడిండ్లాట • చెప్పవలెనె?

చ॥ కరులు గుఱాలు తేరులును • కార్ముకముల్ తలలున్ గబంధముల్
గురువులు దేలు నెత్తురులు • క్రొవ్వు మెదళ్లును కాలుగేలు నొ
డ్డొలుకముగాఁగ నిండిన ర • ణోర్విని దాఁటి రథంబు రాము ద
గ్గఱ కదలించి తోలుమని • కర్బురవర్యుఁ డదల్చె సారథిన్.

చ॥ తగవునె చంపఁగాఁ దిరుగు • దానవదేహ పరంపరాద్రు లె
త్తుగఁ బడియుండియున్ రథముఁ • దొలఁగ గల్గిన గాలిచేతఁ బె
ల్లెగసెను గాలిగుమ్మటము • లేగినకైవడి నట్టి దారిలో
దిగిన రథంబు వొందుగతి • తీరుగ నెట్టులు పల్కఁ శక్యమో?

చ॥ తమముఁ దొలంచినట్టి హిమ • ధాముని పోలికవెల్గు రామచం
ద్రముని నిశాత బాణమను • ధర్మని సన్నిధికిన్ స్వయంబుగాఁ
దమిఁగొని పోవు జీవువలె • దర్పముతోడుత నిర్వదైదు గు
ఱ్ఱములను పూన్చు తేరిపయి • రాసెను దూషణుఁ డాజి రాఘవున్.

తే॥ దాయి నరదంబుఁ జాపంబు • దాల్చు శైల సరణిఁ దేరిపైఁ బొలుచు దూ • షణుని గాంచి
నీదునిలుకడ మేలు! ని • న్మెచ్చవచ్చు, ననెడునంతలో నోఁకు మూఁ • దమ్ము లేసె.

చ॥ మురువుగ దిక్కుఁ న్నిలిచి • మోయు గజేంద్రుల తోడ సాయమై
బరువు వహించు కచ్ఛపము • పన్నగ రాజులలోన నొక్కరిన్
ధరణిని మోవ నిల్పి మఱి • తక్కరుఁ దోడుగఁ గొన్న జానకీ
వరు నుదుటన్ ధరించు జయ • పట్టముఁ దాఁకె శరత్రయం బటన్

తే॥ దూషణుఁడు వైచె సమయంబు • దొడ్డకడిమి, లెస్సయని రామభద్రుండు • లేఁతనగవు
తోడ వాఁడి యలుఁగుగొని • తొడరియేసి, తునియలుగవానియరదంబు • ధనువుదునిమి

తే॥ తపసు లాశీర్వదింప వే • లుపులు పొంగ, వలఁతి వైతేని గుఱి దప్పి • బ్రదుకుమనుచు
వాఁడి యమ్మేయ వాఁడును • పండ్లు గీఁటు, క్రూరదృష్టులతోఁ దఁటఁ • గోలు పోయె

తే॥ అనుజుతల తెగుటయు రాము - నంపవాన, మునుఁగు సైన్యంబు గని కడుఁ • గి
క్రొమ్ములం గల్గు దిక్కరి • క్రొమరువిల్లు-నాయుధమ్ములు దాల్చిన • హస్తమెత్తి.

ఖరుని యుద్ధము.

క॥ యముఁడును భీతిల్ల దనుజ, చమూ జలధి తోడ రేఁగి • చందురుని మొగుల్
గము లలము లలిని కోపం, దముఁ దాల్చిన రాముపైన • దరి వేష్టించెన్.

క॥ అక్షీణ పాప కర్మలు, రాక్షస వరు లొక్కపెట్ట • రథ గజ హరులన్
దక్షత ఫణిరాజ ఫణము, లక్షమమున నవియ నడపి • రతి రభసమునన్.

శా॥ శ్రీరామ ప్రభు శాతసాయక హతిం • జీకాకులై యేనుఁగుల్
శీఘన్ నేలకు వ్రాలె వారువములున్ • దేరుల్ రజంబయ్యెఁ గే
యూరాంచద్భుజముల్ తునింగె మకుట • ప్రోద్యత్సుప్రచ్ఛీర్షముల్
చేరెం ధారిణిఁ గాళ్ళు త్రుంగె గుదులై • జీరాడె నాంత్ర చ్ఛటల్

క॥ మీటిన ఖడ్గాటవి శూ, లాటవి ధనురటవి తోమ • రాటవి గురుబా
హాటవి మున్నగు దను వం, శాటవి శ్రీరామ శర ద • వాటవి నడఁగెన్.

క॥ తగవే రూపొందిన గతిఁ, దగు రామ శిరౌఘ మపుడు • తారాపథమున్
దగ దూసి చనియె నన మృదు, వగు తనువులఁ జొచ్చి దుస్సి • యరుగుటయరు దే

క॥ చుట్టును ముట్టిన మూఁకలు, తెట్టెలుగాఁ గూల నేగు • దివ్యాస్త్రంబుల్
నెట్టన న్యాయసభను కడు, దిట్టలు కపటమున నొరు బరులఁ • దిగుచుటఁ బోలెన్

క॥ ఖరుఁడను క్రూరాభిఖ్యుఁడు, ఖర గుణులగు నసురలెల్లఁ • గడతేఱుటచే
గురు కోపి యగుచు శోణిత, శరధిని మందరము వోలెఁ • జక్కన నిలిచెన్

తే॥ నల్ల కడలిని చనునొక • నావయనఁగ, నొప్పు నరదంబుపై నెక్కి • యుగ్రదృ
మిడుఁగుఱులు రాలఁ జూచుచు • మింటసూర్యు, కరణి వెలుఁగుచు రాముని • కడ

చ॥ భువనము లెల్ల నొక్కపరి • బూది యొనర్పఁగ లేచు నగ్నినా
నెవడి సుతీక్ష్ణుఁడై ఖరుఁడు • నిల్చిన యంత నమేఘ చాపమున్
దివిరి భువింబడంగ వడిఁ • ద్రెంచిన దోర్బల వీర్యశాలి రా
ఘవుఁడు నిశాత మార్గణ ని • కాయము లేర్చి ధరించి నిల్చినన్.

క॥ అనల జ్వాలలఁ గురిసెడు, ననిల జవము గలుగు వాఁడి • యమ్ములు వేయిన్
జనవరుపైఁ బఱపఁగ నా, ఘనుఁడును నట్టివియ విడిచి • ఖండించి వెసన్.

క॥ లోకైక నాయకుండగు, కాకుత్స్థుఁడు తొమ్మిదింట • గర్బురు నేయన్
పీకున వాఁడును నడుమనే, తేఁకువ ఖండించి నవ్వె • దిక్కులు వదఁకన్

శా॥ దుష్టుండంతటఁ బోక మానవుఁ డసా • ధ్యుం డంచు మాయా విధా
వష్టంభుండయి మీఱి దానవుఁడు స • త్త్వస్ఫూర్తి శోభిల్ల దు
శ్చేష్టన్ మేఘమనన్ శరంబులను వ • ర్షింపంగ నిర్భిద్రతా
ధృష్టుం డాద్యుఁడు కిన్కఁ బూని ధనురా • కృష్టిం బ్రకృష్టంబుగన్.

మ॥ ఒక బాణమ్మున వీని యాలము ముగిం • పొందింతు నంచున్ వెసన్
గ్రకచస్ఫూర్తి శరంబు దొడ్గి గుణ మా • కర్ణంబుగా లాగఁగా
ర్ముకమున్ ఫెళ్లన బ్రీలె నిర్దరులు మా • పూర్ణాశలున్ గర్వమున్
వికటంబయ్యెనె యంచుఁ జింతిలిరి వి • ల్వెఱొండటన్ లేమికిన్.

తే॥ ధనువు విఱుఁగుట కొంటిమైఁ • దనరుటకును, కలఁత నొందక రాముఁడు • క్షత్త్రధర్మ
విధిని తన దీర్ఘ బాహుల • వెనుకపంకఁ, జాఁచి నిల్చిన వరుణుఁ డా • సడి యెఱింగి

ఆ॥ చెంత కేగుదెంచి • చింత వలవదంచుఁ, దొలుత జామదగ్న్యు • గెలిచినపుడు
కొనుచు నిల్లడగను • తనయొద్ద నునిచిన, వింటి నంది యిచ్చె • విబుధు లలర.

ఆ॥ విల్లు నందికొనుచు • వినతమైఁ గేల్మోడ్చి, వంచి యెడమ చేతఁ • బట్టి నంత
ధర్మదూరులైన • దానవావళికెల్ల, నెడమ కనులు భుజము • లెగయ నదరె

ఆ॥ త్రుటిని నారిఁ గూర్చి • దురమున యమువంటి, వారు మెచ్చ నొడ్డి • పోరు సలిపి
ఖరుని రథము నూఱు • కఱకుటమ్ములచేతఁ, దుత్తునియలు గాఁగఁ • ద్రుంచివైచె

తే॥ అరద మట్టులు చెడ ఖరుఁ • డార్భటించి, చలము వీడక యంబర • స్థలికి నెగసి
రాము భుజగిరుల్ మునుఁగనా • రాచవృష్టి, మొగులుకై వడిఁగురియించె • క్రోఁతతోడ.

తే॥ తగ్గుచున్న తూణము నుండి • యగ్గివంటి, శరములం గురియించెడు • ఖరుని చేయి
యక్షయ నిషంగమందుండి • యందుకొనిన, యొక్కయిషువునరాఘవుఁ • డుర్విఁగూల్చె.

తే॥ కుడికరము పడిపోవఁగ • నెడమ చేత, నొక్కయినుప రోఁకలి గొని • యుక్కుమీఱ
వైచినంతనె జానకీ • వరుఁడు దాని, నడుమఁ దుండ్లుగానొక కోల • నఱకివైచె.

తే॥ తాఁకరాని విసముగల • దంష్ట్రలూడు, పాము బుసపెట్టి నట్టులా • బలియుఁడూర్చి
వృక్షమొక్కండు గొనిరాము • వేయుసంత, మొగి నొకేశరమున దాని • నెగురఁగొట్టి.

మ॥ వరగర్వంబున మాయలం బలిసి స • ప్తద్వీపముల్ సప్త బం
ధురలోకంబుల బాధసేసిన మహా • దోషంబులం బొందఁగా
ఖరుహస్తంబును పోలె వాని తలయున్ • ఖండించి శ్రీరామ భూ
వరుఁ దొప్పారెను మంచువో నలరు భా • స్వన్మండలంబో యనన్.

తే॥ ఖరుఁడు పడుటను గని సుర • వరులుగూడ, యాడిపాడి యానందించి • యడరంపొగడి
పారిజాత సుమంబులా • పంకజాక్షు, మీఁద నొత్తుగఁగురియించి • మిడిసినారు.

తే॥ బుషులుపేరరా లక్ష్మణా • గ్రిముఁదుముదము, నందిఘోర యుద్ధమునకుఁ • బ్రాణమొందె
వెరల నొంటిమై నున్నట్టి • యొదలి వంటి, క్షోణిజాత యెదురుచూచు • చోటికరిగె

ఉ॥ ఒంటికినేగి దాఁగు మిడి • మేలపు నోఁకుల మేని నెత్రు దు
ష్మంటిన యంఘ్రియుగ్మము ము • దశ్రుల ధావనచేసెఁ దమ్ముఁ డా
యొంటికి నంటు ధూళియు ద్ర • జోత్థిత వేదనవోవ నిమ్మళం
బొంటఁ గవుంగిలించె నను • వొందఁగ జక్కవచంటి సీతయున్.

తే॥ ఒక ముహూర్తమాత్రంబున • నుక్కడఁగిన, యసుర రక్త వాహినులు ది • గంతములకు
నడరెఁ గడలి ఘోషంబు నా • నమరులార్చి, పొగడరాముఁడు సంతోష • మనుభజించె

తే॥ రావణుని చెల్లెలైన శూ • ర్పణఖచూచి, చేతఁ గడుపు మోఁదికొని ని • శ్చేష్టఁగుడిచి
ఖరుసపైఁబడి నెత్తురు • వఱదఁ బొరలి, రోదనముచేసెఁ గనుల న • శ్రువులు దొఱఁగ

చ॥ మనసున నాస నుంచితిని • మానవుపై నది ముక్కుదీసె సి
గ్గున మదిలోఁ దపించి మృతిఁ • గోరనకోరక మిమ్ముఁరేఁపి మీ
తనువుల మంటఁ గల్పితిని • దారుణ కర్మము నాచరించితిన్
బనుకుచు నింక నేపనికిఁ • బాల్పడుదాననొ యంచు నేడ్చుచున్.

మ॥ జయమాలల్గొను నాయుధంబులను హా • స్తంబందు సంధించు దు
ర్జయులౌరక్కసులం దదీయ కులముల్ • బంపిల్లు పాపంబులున్
క్షయముం జేయఁగఁబూని శూర్పణఖ యుం • రూమారుతంబట్లు వా
త్యయుఁ బోలెన్ మది తత్తఱింపఁ జనియెన్ • ద్రాఁచుంబలెన్ లంకకున్.

## 7 మారీచ వధపటలము. (252)

మ॥ బలవంతుల్ చనిపోక శూర్పణఖ భా • వంబందు చింతింపకే
జలదశ్యాముని మేనిసొంపు మదిలోఁ • సంధించి లం కేశుఁడా
కలికిన్ రాఘవుదేవిఁ గైకొను వహిం • గావింతునేనిన్ మను
ష్యలలామున్ దగఁ బొందవచ్చు నను నూ • హంజేరెఁ దాలంకకున్.

సీ॥ నశ్వరంబగు భువ • నంబును సచరాచ, రముగ సృష్టించిన • బ్రహ్మకైన
నరుదయి విజ్ఞాన • పరమార్గమునను క్ర, మంబొంది చేయుధ • ర్మంబుపగిది
మయుని నైపుణ్యక • ర్మంబు పూర్తిగఁదెల్పు, రత్న ఖచిత సభా • రంగమందు
దిగ్గంతిఎంత వి • దీర్ఘభుజాంతర, సిమ పూర్వాద్రినాఁ • జెలఁగుచుండ

తే॥ ద్వాదశార్క బింబమ్ముల • ర్వ దిగ నగుచు, వెలయుకరణిని కర్ణకుం • డలము లలర
బాహుపురి మణుల్ పంక్తి • బాహులందు, వహ్ని పర్వత శిఖరాల • పగిది వెలుఁగ.

సీ॥ వ్యాఘ్రాజినుండు పీ • తాంబరుఁడును పంక, జాసనుండేనొక • పీసమేని
త్రుంగింపఁ జాల ర • నంగఁ జప్పిడివేల్పు, లొక లెక్కయేయని • యొదిఁగి నిలువ

సన్నని నడుములు • స్తనహేమకుంభమ్ము, లెట్టినిరేఖల • నెసఁగు కనులు
చెలువారు చెలువలు • చెనయు నక్కుకును వం, గని కిరీటాంచిత • మణులు వెలుఁగ

తే॥ శేషమణి ఫణావళి యట్లు • వెలుఁగు భుజము, లదరఁ జుక్కలన్నియుఁజుట్టి • యలరుచుండ
గ్రహములను పట్టియుంచిన • కారవోలె, నిండురత్నహారంబులు • నీటుగులుక.

తే॥ సాటిలేని పరాక్రమ • శాలులైన, రాక్షసుల రత్నమకుటముల్ • రాయు కతన
నఱిగి యఱిగి మహిమనొంది • యడుగుపందు, రత్నకటకముల్ మిక్కిలి • రవ మొనర్ప

తే॥ మూఁడులోకంబులంచును • ముఖ్యులైన, పెద్దలొసఁగు నుపాయన • బృందమనఁగ
దేవతలు రాక్షసులు భక్తి • విస్కరించు, చల్లిన సుగంధ పుష్పసం • చయము వెలయ

తే॥ ఇచట నీతటిఁగనునని • యెఱిఁగి శిరము, లందు చేతులు జోడించి • వందనములు
చేసి వరుసలు వరుసలై • చేరి నిలిచి, కొలుచు విద్యాధరులు చుట్టి • నిలిచియుండ

తే॥ చెప్పినది స్త్రీలవిషయమై • చెలఁగుచున్నఁ, దమ్ముఁగూర్చియే యనియెంచి • తలరి మ్రొక్కు
వారు భయభక్తులును కల • వారునైన, సిద్ధవరులు సింహము లట్లు • చేరినిలువ.

చ॥ సచివులఁగాంచి పల్కిన వ • చస్సులు తమ్ముగుఱించి యంచు స
ద్భ్రుచు ముదలన్ గ్రహింప మదిఁ • గొంకుచు నిల్చి భజించు కిన్నరుల్
విచలితులై పరేశవిభు • వీక్షణ గాంచిన జీవులం బలెన్
బ్రచుర వికంపన స్థితికిఁ • బాల్పడు నాగులు చుట్టి నిల్వఁగన్

తే॥ దిక్కరుల గెల్చి ఛఫుఁడును • చెగడునొందఁ, వెండిమలనెత్తి స్వర్గంబు • బెండువడఁగ
నింద్రుని జయించు భుజముల • రుంద్రకీర్తి, తుంబురుఁడు పాడి ప్రమని సం • తుష్టిఁ బుప.

తే॥ వినెడి వారలు కరములు • వివశమెయి, తాళములు వేయ నారద • తాపసేంద్రుఁ
డొప్పుమీఱఁగ మహతి చే • నూనివాణి, విధిని వాయించి చెప్పుచు • వినుచునేయ

ఉ॥ వారిధి నేత పర్వులట • సంబులఁ బూచిన క్రొత్తపూసలన్
దీరగు పొన్నపూలఁ గల • తేనియతోడఁ బరీమళించు న
న్నీరుగ్రహించి యందరుఁ • నెమ్మెయి సోఁకునొయన్న భీతితో
వారిధరాఖ్యఁ జెన్నెసఁగు • భవ్త్రిరలం బిలికించుచుండఁగన్

చ॥ రకముగ బొమ్మిడీకములు • రాచుకొనం బడు మౌక్తికావళుల్
వికసిత సూన మాలికల • స్త్రీలు లతాంత నికాయమల్ భువిన్
చకచక రాలు మున్నె భయ • సంభ్రమముల్ మని నాల్కొనంగ బౌ
రుకొని సభాంతరంబును మ • రుత్తుఁడు శుభ్ర మెయి ర్చుచుండఁగన్.

తే॥ కంచుకులు పైఁడి బెత్తముల్ • గలుగువారు, పలువు రంపందు నిల్చిన • [illegible] రు
క్రమముగా వెండి బంగారు • గద్దెలిచ్చి, శీఘ్రగతి గౌరవంబులు • చేయుచుండ

తే॥ రోమయుత చర్మదుందుభి • మ్రోఁగునపుడు, యముఁడు శూలదండాదుల • నవలవీడి
కేల నోరుమూసికొనుచుఁ గ్రేవనొదిఁగి, నిలిచి ప్రశ్నించు కాలంబు • దెలుపుచుండ.

తే॥ తావినేయి కప్పురము మ • ర్దన మొనర్చి, సన్నప్రత్తితో ముట్టించి • సరసులందుఁ
దామరలు పూచినట్టి ప • ద్ధతిగఁ జెలులు, మించి దీపపంక్తులను వె • లిగించు చుండ.

తే॥ కల్పతరువు చింతామణి • కామగవియు, నవనిధులు కోరినవి యెల్ల • నవ్యములుగ
నిచ్చుచుండఁగఁ బ్రభునకు • నీయఁదగిన, వేళయెఱిఁగి సురారు లఱ్చించుచుండ.

తే॥ కుండలములు మున్నగుమేటి • మండనములు, దట్టమగుకాంతు లొలయఁగాఁ • బట్టపగలె
కాక రేయియుఁ గలదె యీ • లోకమందు, చూడుఁడనుచుపభ్యులువా ర్త • లాడుచుండ

తే॥ గంగ కావేరి మున్నగు • నంగనాళి, స్తన భరంబునఁ గౌనులు • సంచలింప
నడచి చెంగేల బుక్షగ • ణంబుఁ బోలు, కుసుమ లాజాక్షతంబులు • కోరిచల్ల.

తే॥ భావరాగ తాళంబులు • పరిఢవిల్లఁ, జూపరుల హృదయంబులు • చూఱఁగొనుచుఁ.
గారు మొగుళులఁ గన్నమ • యూరమట్లు, మించి యూర్వశి సభను న • టించు చుండ

తే॥ దుర్భర తపంబుచేతను • దోర్బలమునఁ, ద్రిజగముల జయించిన దశ • గ్రీవుఁడొప్పెఁ
గలువకనులు ధనువువంటి • కన్నుబొమలు, గలుగు చెలువల చూపుల • గములయందు.

## శూర్పణఖఁగాంచి రక్కసులు వాపోవుట.

తే॥ తలను కేలుంచుకొని ర క్త • ధార వలన, నిండు చనులతోముక్కుతోఁ • గుండలములు
లేని చెవులతోఁ గార్మొగు • ల్నెగడియుఱుము, బొప్పునన్ బోలు నోటితోఁ • జుప్పనాక

ఉ॥ వాలులు చుట్టుఁ బర్వ మకు • టంబులు మిక్కిలి రాయ రాజులు
ద్వేలముగాఁగఁ గ్రిక్కిఱియు • దీపిత తన్మణిశాలఁ జేరి క
ల్లోల పయోధికై వడి వి • లూన కుచశ్రవనాస యుగ్రతన్
బోలుచుఁ జేరవచ్చెను పి • ఱుంచన దైత్యులుగాంచి దూపిలన్.

తే॥ లంకయందలి రాక్షస • లలనలెల్లఁ, ముజ్జగంబుల తేనికి • ముద్దు చెలెలు
ముక్కువోఁగొట్టుకొనఁ దాల్మి • మొనయఁగలరె?, యెదురఁగదుపుమోఁదికొనుచు • నేడ్చినారు.

ఉ॥ అక్కజమంది కాంచి యను • రావళి యాయమతోడఁ బల్కఁగా
ముక్కయుఁ దోఁపకుండుటను • మూతులు జేగుఱువాఱ నూర్చుచున్
గక్కస మందుపన్ మెఱయు • కన్నుల నిప్పులు గ్రక్కుచీగతిన్
అక్కిన వాఁ డెవండొ గద • రా? యని చేతులు నల్పుచుండఁగన్.

ఉ॥ ఈగతిఁ జేసి యీల్గుటకు • నెంచినవాఁడు సురేంద్రుఁడో మహా
భాగుఁడు బ్రహ్మయో హరియొ • భర్గుఁడొ యెవ్వఁడొ యంచుఁగొందఱున్

బాగుపడన్ మదిందలఁచు • వారలొనర్చరు శాత్రవుల్ జగ
త్పూగము నందు లేర యిది • పోలునె యేరికి? నంచుఁ గొందఱున్.

ఉ॥ రావణు చెల్లెలంచు వివ • రంబుగఁ దెల్పినఁ దల్లి! యోర్పుమైఁ
బ్రోవుమ యంచుఁ బాదముల • ముట్టుట మాని యిటులొ్నర్తురే?
యేవగ నెవ్వఁడేని యిల • నిట్టు లొనర్పఁగ సాహసించునే?
కావరమంది చేసికొనెఁ • గాపలెఁ దానె యటంచుఁ గొందఱున్.

ఉ॥ పాక విరోధి పేరుచెడఁ • బాపము లొత్తుచు నున్నవాఁడు ల
క్ష్మీకలితుండు దేవచెడి • క్షీరపయోధిని పవ్వళించె గౌ
రీకమనుండు తారక గి • రిం భజియించె నిటులొ్నర్చువాఁ
డే కలుషాత్ముఁడో? తనకు • నెంత దిటంబొకో? యంచుఁ గొందఱున్.

ఉ॥ ఊరును పేరులేని యొక • యక్కవుఁ డిట్టులు చేసెఁడెంపుమైఁ
బేరుగలట్టి వారు పిఱు • వీఁగకొనర్తురె? అంపులాఁడి యీ
స్వైరిణి వంశకీర్తి చెడఁ • బాపిన దందు ఖరుండె యల్కతో
సౌరు చెడంగఁ గోసి యిటు • సాగఁగ నంపెనో? యంచుఁ గొందఱున్.

తే॥ తాపమునఁ గ్రుంగి సోలు త్రి • దశుల పొక్క, దెబ్బ దినని వారలు మతి • తెరలువారు
మూఁడు జగములు నశియించు • ముప్పొనర్పఁ, దలఁచినారనికొందఱు • తలఁచినారు

ఉ॥ నూతన కల్పమింక భువి • నూల్కొను నంచుఁ దలంచికాక యీ
పాతకముం బొనర్ప మగ • వారలు పాల్పడ శక్తిమంతులే?
యాతత నిష్ఠమై వనుల • యందు తపంబొనరించు తాపస
వ్రాతము పొందు కోప దవ • భారతిరస్థితి యంచుఁ గొందఱున్.

పౌరస్త్రీలు చుప్పనాకంగాంచి పలవించుట

చ॥ పలుకుచు నుండ లంకఁగల • భామలు గాజులు మ్రోయఁ బల్లవం
బులఁ దలపించు హస్తములు • పొక్కఁగ నల్పుచుఁ జేటిరిడ పా
ల లలిని నిల్పు లేమిని ప్ర • లాపము లాడుచుఁ బాఱు తెంచుచున్
బెలుకుఱఁ గాంచి రే మనుభ • వించితె? యంచుఁ గవుంగిలించుచున్.

తే॥ పటహ వీణా మృదంగాది • బహుళ రవము, తక్క వేఱు నినాద మె • త్తటిని లేక
విభవముల నొప్పు లంకలో • వెక్కు గోల, నాఁడు మొదలయ్యె నాచుప్ప • నాతి కతన.

ఉ॥ పద్యము లొప్పు గిన్నియల • మధ్యమునం దిరుగాడు తుమ్మెదల్
మద్యముమీఁది దెంద మొక • మార్గము వట్టఁగ దైత్యనారులా

యుష్యపమున్ త్యజించి నెఱ • యోడికలంబలె నీరుగార్చి వి
ద్యుద్యుత వారిదప్రరతి • యోజ నలందురి ద్రొక్కి పెట్టునన్.

తే॥ విఫలమైఁ బొలయల్కలు • వీడకుండ, కతన నెట్టఁ బాటెనకనుల్ • కలఁకఁజెంది
మఱియు నెట్టనై కిన్నిటి • పఱద లొప్ప, శూర్పణఖ పాదములఁ బడి • స్రుక్కినారు

తే॥ హిమ శిఖల యందు పచ్చలు • దాల్చు కిరణఁ, బోఁక బ్రాకులశిఖరముల్ • పొలుచుచుండఁ
మణుల గొలుసుల యుయ్యెలల్ • మలయనూఁగు, చెలులు విసిగి వీధికివచ్చి • చేరినారు

తే॥ బలయఁ బెరఁచిన చిలుకల బా • హాఁపు వీఁడి, మీనములఁ బోలుకన్నుల • మిట్టిపడెడి
ముత్తెములఁ బోలు బాష్పము • లొప్పరలుచుండఁ, గొండటాయపంగననలోనఁ • గుమిలినారు

తే॥ వైరినీతిరాయుధమున • పఱలువాఁడు, భువన విజయుండు దైత్యవి • భుండు దీని
నెఱఁగనేని జగములెల్ల • నేమి యగునొ?, యనుచు నేరు దొరిరి వారిఁ • బనవినారు.

తే॥ మధు మదంబున సోలిన • మగువలెల్ల, మగల వలని సౌఖ్యంబులు • మఱచి కేశ
బంధములు స్రీల నీవులు • పదల జనులు, త్రుళ్ల నడచుచు నేడ్చిరి • దొరలిరచట.

తే॥ తారగిరి రీలనెత్తిన • దైత్యు చెల్లె, లిట్టి గతి నొందెనేయని • యేప్పి కేశ
పాశములు వీడఁ గెంగేల • పలుఁచ చనుల, మీఁద మోఁది కొనిరి వంత • మీటుచుండ,

ఉ॥ రావణ పాలితం బయిన • రాజ్యమునందు మృగంబులేని ము
న్నెపగఁ జింత నొంచి విటు • లేప్పడె నేఁడిఁక నేమి యబ్బునో?
పైత్రివడి పోయెఁ గిటుటలు • బాధలు నొందఁగ నుంటి మంచు నే
త్రావిల బాష్ప పూర్ణలయి • యంగదలం బడి నొచ్చుచుండఁగన్.

శూర్పణఖ రావణుతో మొఱయిడుట

తే॥ పలువిధంబుల లంకలోఁ • బౌరు లతల, సభను నిల్చిన వారును • జాఱఁ దలఁపఁ
గొండక్రంపఁ జేరిన కార్మొ • గులు విధమున, నంగనాచి రావణు చర • ణములఁ వ్రాలె.

క॥ కులగిరులు గపలె శేషుఁడు, తలలను వంచెను తమంబు • దశదిశ లలమెన్
దలఁకుచు దివియుం బఱచెను, తలరెన్ దిక్కరులు తలలు • దాఁచి రమరులున్.

ఉ॥ అంగదముల్ చెలంగెడి భు • జార్గళముల్ వడిబూరటిల్లఁబై
సంగెడి జ్వాలలం గురియు • చజుల చెంగట వక్రదంతముల్
వంగి రిహిం... గా భ్రుకుటి • ఫాలము దాఁకఁగఁజూచు రావణున్
ముంగల గాంచి సేవల స • మున్నతిఁజేయఁగ జంకిరెల్లరున్

చ॥ పితృపతితోడ వేలుపులు • భీకరవృత్తినిగాంచి నేఁడు దు
ర్గతి మనకో మహేరికా తా • ఱంగద యంచుఁ దపించి జీవసం

తతులును దేహముల్ నిలుక • దప్పవడంకుచునుండ భూజనుల్
మతిచెడి యేమియన్నఁ బరి • మార్చునొకో యని తూలుచుండఁగన్.

ఉ॥ మూసిన యాస్యకందరల • ముమ్మరమై పొగఁగ్రమ్మ రోమముల్
మీసములున్ గగుర్పగొన • మిక్కిలి యూర్పుచు నొడునొక్కిపెన్
రోసముతోడ దంతముల • రోచులు దిక్కులఁదూఱ మేఘ గ
ర్జాసమ వాక్కులంగినిసి • రావణుఁడెవ్వరి చేష్టయిద్దినాన్.

చ॥ అవనిని గాచువారు కుసు • మాస్త్రుని పోలినవారు భూమిపై
దివమున నాగలోకమున • దేహముగల్గిన వారిలోన నీ
దెవరును లేనివారలు న • రేంద్రులు కానకు వచ్చి కత్తితోఁ
దివుచుచు నన్నెకాదు భవ • దీయ యశంబును గోసి రుద్ధతిన్.

చ॥ మనుజు లొనర్చిరం చసుర • మానిని పల్కఁగ బిట్టునవ్వి యే
మని వచియించితే యని ద • శాస్యుఁడు కన్నుల నిప్పులుఁ గ్లగా
మినిఁగనుఁగొంచు నల్పులగు • మేదినివారలఁగూర్చి నీవు ప
ల్కినదిటులా? యసంగతము • గ్రొచ్చక సత్యమునే వచింపుమా।

చ॥ అని దనుజేంద్రుఁడాడఁ జెలి • యల్ వచియించును మారుఁబోలువా
రును దృఢబాహుసత్త్వమునఁ • గ్రుంగఁగ మేరువు నూద్వఁజాలువా
రని పలుకంగనేల? విలు • నమ్ములచేక్షణమాత్రలోన నీ
వనజ భవాండమెల్ల సుల • భంబున బూదియొనర్ప నేర్పరుల్

చ॥ మునుల యెడన్ విధేయులు ప్ర • పూర్ణ నిశాకరు వంటి కాంతి మం
డన ముఖు లుల్లసిల్గ నలి • నంబులఁబోలిన నేత్రయుగ్మముం
దనరినవారు కోమల ప • దంబులు చేతులు గల్గువారు స
న్మని జనులందు వారికి స • ముల్ గలరే త్రిజగంబు లారయన్?

ఉ॥ నారలు దాల్చినారు చర • ణంబులఁ బెండరముల్గలారు వి
ల్వీరులు జన్నిదంబు దగి • లించినవారలు సత్యవాక్యులున్
శూరులు నీకు లోఁబడరు • చూడ నినుం దృణలీలనెంచు వా
ర్ధీరులు శాస్త్రమట్లు తుది • తేలని యక్షయ తూణధారులున్.

ఉ॥ వారలఁ జేరి మౌని జన • వర్యులు రాక్షస బాధమున్గి యు
న్నారము ధీంద్రియ ప్రకట • నంబగు జ్ఞానములేనివారమై
నారము కావరే యనుడు • నాకవిరోధులఁద్రుంచి భూమి ను
ద్ధారణ సేయువారమని • దారుణమైన ప్రతిజ్ఞ చేసిరిన్.

మ॥ ఒకచో నిద్దఱు మారులీ భువనముం • దున్నారు సత్యంబు వా
రికి విర్విద్దెను మించు వారలు గలా • రే యన్నిలోకాల వా
రికి నీదైతగు వారలుం గ్గలుగరీ • పృధ్వీతలంబందు వా
రాశ్రరాక్కచంద్రేత్రిమూర్తి సన్నిభు లహో • యుద్ధక్రియా పారగుల్.

తే॥ ధరణియెల్ల నేకచ్ఛత్ర • సరణినేలు, ధర్మపరతంత్రు దశరథు • తనయులైన
వారు నిర్లోభులగు వారు • ప్రభునియాజ్ఞ. గాన నున్నారు రామ లక్ష్మణులనంగ.

చ॥ చెలియలి నాసికన్ దునియఁ • జేసిన వారు నరుల్ సజీవులై
వెలయుచు నున్న వార లట • విన్ మఱియేటికి నేను గల్గియా
తులువలు తెంపుమై వనులఁ • దోఁచుచునుండఁగ సిగ్గువీడి యి
య్యిల మనినాఁడ నంచు దను • జేంద్రుఁడు మందె మనంబులోపలన్.

చ॥ పెలుకుల లోకముల్ గెలిచి • భీకరతేజుఁడనై సమస్తమున్
బొలుపుగ నేలు నాకుఁ దుదిఁ • బొందిక నబ్బె నపాఖ్య కీర్తికిం
జెలువగు స్తోత్రపారములు • చిప్పున మాడ్చితి లోకమంతటన్
గలిగినవీరులం దునిమి • కాల్చిన నీ యపకీర్తి మాయునే?

ఉ॥ శాశ్వతనింద నా కునుపఁ • జాలిన మానవు లుండిరంట! నా
కీశ్వరుఁడిచ్చుకైదు వొక • టెచ్చినదంట! నరుల్ సజీవులై
నశ్వరమొంద కుండిరఁట! • నాకును వింశతిబాహులుండె నీ
విశ్వమునందు నేను నను • బృందముతోడుత నుంటిఁ జెల్లరే!

మ॥ మనసా! మాయని క్రొత్తనింద మన వం • శంబందుఁ బ్రాప్తించెనే
యని లజ్జంబడి కుందుటేల యవదూ • అత్యంతమున్ మోవఁజా
లిసకేలుం దల లిర్వదిం బదిచు నో • లిం దార్ఢ్యసత్త్వంబుతో
డనె యొప్పారెడిఁ గ్గేశమందకుము హృ • ష్టస్థైర్యముల్ పొందుమా,

చ॥ అని వికటంబుగా నగి స • హాయబలంబులు లేని యిద్దఱ
ల్లనువుగఁ గానయందె సడ • యాడ ఖరాదులు శౌర్యమాసప
ద్దనుజులు వారిఁబట్టికొని • దారుణభంగిని చీల్చిమ్రింగ కి
ల్లనువు పడంగ వీడిరొకొ? • యన్నఁదవగ్రజుఁగాంచి ఖిన్నయై

తే॥ కనుల బాష్పప్రవాహము • ల్గార్చునదియు, వక్షముం బాఁదుకొనునది , వసుధఁబొరలు
నదియు నగు శూర్పణఖసెత్తి • యందుచేతు, లుంచుకొని వారిలేద్వ వ • చించెనిట్లు,

ఉ॥ నాయవమానమున్ దనుజ • నాయకు లెల్లరుఁ గాంచి క్రుద్ధులై
యాయవినీతులం దునుమ • నప్పుడ సాయుధులై ఖరాది సం

స్థేయులు వచ్చిచుట్టి సర • సీజదళాక్షుని యొంటి వింటిచే
నాయమరావతిం గదిసి • రక్కసు లొక్క ముహూర్తవేళలోన్

ఉ॥ వ్యూహములం బుచె సదరి • యుర్వరగెల్చిన దైత్యసైన్య సం
దోహముతోడ నాఖరుఁడు • దూషణుఁడున్ త్రిశిరుండు దోస్సమి
ద్ద్రోహులు లొక్క మానవుని • దోర్బలసంపదచే నశించి ర
య్యాహవమంద యన్న విష • యంబునకై యొడలుం జెమర్పఁగన్

చ॥ కలిగిన కోపచింతలు వి • కారిని సేయుచు వహ్నివర్ధిన్
జిలికిననేయివో లెఁగదుఁ • జీఁదఱ వృద్ధియొనర్ప వారలి
ట్లలుకను నీదు ముక్కు మొద • లంటఁగఁ గోయఁగ నీవు వారికిన్
జలిపిన నేరమేమి? యది • చయ్యనఁ దెల్పుమ యన్న నామెయున్

## శూర్పణఖ సీత చెలువమును ప్రశంసించుట

మత్త॥ వేరిచేతను వ్రాసి చూపఁగ • వీలుకాని వరాంగుతో
సారసంబును వీడి వచ్చుచు • శంభునుండియె కౌను బం
గారు నుండి శరీరముం బడ • కంబుగా గ్రహియించి యా
కారు కనను పేరు కామిని • కై జనించెను నావుడున్

మత్త॥ రామ యెవ్వరి కాంత యంచును • రావణుం డను నంతలో
నామె యిట్లనుఁ బల్కుమాటల • నార నారసి చూచు కొ
మ్మామనోహరి గబ్బిగుబ్బలు • హాట కోఖలు పాదముల్
భూమి నోచిన భాగధేయము • ముగ్ధనామము సీత యౌ

చ॥ భ్రమరుల గీతముల్ తెలిమ • రందముఁ బోలిన తీయనైన వా
క్యములు సుగంధకేతములు • గల్గి సురాములు సంస్తుతించు చం
దముగను లక్ష్మియుం దన యు • దాత్తతకుం దగు చేటి కాదనన్
బ్రమదమనోజ్ఞ భవ్యములు • పల్కెడి నంటయు మౌఢ్యమే యగున్

సీ॥ వ్రాలిన కేశముల్ • వర్షధారలఁబోలు మృదు పదంబులు ప్రత్తి • క్రియనుపోలు
వ్రేళులు మేలైన • విద్రుమంబులఁబోలు సొగసైన వాక్కులు • సుధనుపోలు
వదనం బలోపమా • పద్మంబుఁ బోలును కదలికం బెను హంస • కనులు వెలయు
కందర్పుఁ డామెను • కాంచి తపించి నిక్కచ్చిగా మాటాడఁ • గడఁగియె చుమి

తే॥ దీర్ఘరోగవ్యథను పొంది • దినదినమ్ము, గార్శ్యముంబొంది సఫలతఁ • గాంచకునికి
మాఁడి మసియయి తుది రూపు • మాసెఁగాక హరునికంటిమంటనశించె • ననుటకల

చ॥ పగలు వసించు స్వర్గమును • బాగుగఁ జూడు ఫణామణిచ్ఛటల్
జిగిగల నాగలోకమును • చేరికఁ గాంచుము కంధి మేఖలా
జగముఁ బరీక్ష సేయు మెటఁ • జక్కనఁ గన్నను గాంచలేవ య
మ్మగువ ధరిత్రిలోనిదె సు • మా విరిఖింప సశక్యమే యగున్.

చ॥ భుజములఁ గూర్చి పల్కుదునొ? • మోమును కన్నులఁ బల్కరింతునా?
నిజముగ సారె గుబ్బలని • నీటగు చన్నులనే పచింతునా?
గుజగుజ నొడు కొట్టుకొని • కొంకుచు నూరక యుంటగాక ప
ల్కఁ జనదు రేపె కాంచెదవు • గాని మటొక్కటి విన్మ పల్కెదన్.

సీ॥ బొమలు శరాసన • మ్ములను పోలు నన్నను, కనులు కుంభంబులు • నెనయు ననిన
దంతముల్ ముత్యాల • బంతిఁ జెనయు నన్న, విద్రుమంబులు నోరఁ • బెదవులనినఁ
దొండ లంటి కంఠాల • దొరయున నన్నను, చమరంబువంటి మేఁ • గాళులనిన
ముక్కు చందము నువ్వుఁ • బువు సరి యౌననఁ, గంఠంబు సొగసైన • కంబువన్న

తే॥ పలుకు సరిపోలుఁగాని త • త్వస్తు తత్త్వ, మెన్న సరిపోవునే? వరి • తృణముఁ బోలు
ననుట పొసఁగునె? యుపమ • లయ్యనుపమాంగి, కెచటదొరకును దైత్యకు • లేశనెవుమ

తే॥ ఇంద్రుఁడింద్రాణిఁ బడసె మ • హేశుఁడుమను, పడసెహరియు రమాసతిఁ • బడసె సీత
నీవుఁబడసితి వారికి • నేడ సుఖము, మీ సుఖము నిజంబుగ • నిర్జరారి!

తే॥ ఒకఁడుసామేనుంచె వేఱొకఁడురమున, నుంచె మఱొకఁడాస్యంబున • నుంచుకొనియె
నీవు సౌందర్య • సదనయౌ • నెలఁతఁగొన్న, నెచట నుంచి సుఖింతువో • యెఱుఁగరాదు.

చ॥ తరుణివి నీవు గాంచిన ప • దంపడి నేలను నిల్వఁబోవు నీ
యురవగు నెల్ల సంపదల • నుగ్మలికై విడువంగలాఁడ వె
ల్లర కగు మేలు నీకమర • లాభము నేఁగలిగింతుఁగాని నీ
గరితలకున్ సుదుఃఖ చితి • గల్గఁగఁజేయుదుఁగాదె చూడఁగన్.

ఉ॥ వేలుపు లోకమందు పృథి • వీ తలమందును కల్గు స్త్రీల గ
ర్భాల జనించినట్టి ఒప • రాండిగాదు సురాసురుల్ మహా
భీలముగాఁగఁ జిల్కు తఱి • ద్వీపవతీపతి పంకజాసనన్
బోలఁగఁ జక్కఁజేసెని • ఘామెయు దీని నొసఁగె స్పర్థమై

ఉ॥ అంబుధి మేఖలా జనము • లౌననఁ దుమ్మెదలాడు క్రొమ్ముడిం
డంబుగఁ గల్గు రాఘవు ప • దంతుక యన్ హరిణంబుతోడ నీ
వింబుగ నాదు మేను గని • చేవగ నాశఁగ నీదు ఖడ్గ స
త్త్వంబు జగంబెఱుంగ నిస • పంక్యని నాకు నొసంగుమా రహిన్.

చ॥ తపసులు నేనియున్ విధిని • దాఁటఁగ నెరు లభింప వేళ ల
భ్య పడు సమస్తముగా దొరకు • నవ్వి లభింపని వేళలందు ల
భ్యపడవు చేతు లిర్వదియు • నాస్యములుగా బది పీనమౌ నురం
బు పడసినట్టి భాగ్యమును • బొందుట నీ విఁకమీఁద నేసుమీ

ఉ॥ సీతను గొంచు నీకడను • చేర్పఁ దిఁంవియె పట్టఁబోవ దు
ర్జాతుఁడు లక్ష్మణుం డకట! సంభ్రమ మందుచు నడ్డువచ్చి వే
వేతొలి ముక్కుఁగొసె మను • వే చెడిపోయెను నీకుఁ దెల్పి త
ర్వాతనె ప్రాణము ల్వదల • భావన చేసితి నన్న! నావుడున్

## రావణుఁడు సీతవందమువిని విరాళిచేఁ బరితపింపుట.

సీ॥ కోపంబు వీర్యంబు • గురుతరమానంబు బలిసిన నెంజిరి • బలమువలనఁ
బాపంబు పండు తా • వలమున సంపదల్ తొలఁగిన కరణిని • తొలఁగిపోయె
దీపంబు మఱియొక • దీపంబుతోఁ జేరు నపుడుండు రీతిగా • నాదలోని
తాపంబు కామంబు • తనిరనొక్కటియయి ప్రాణంబునంద యొ • ప్పారఁ గలిసె

తే॥ ధరణిజాతను మఱపని దైత్యరాజు ఖరుని మఱచెఁ జెల్లెలి ముక్కు • టఱఁగినట్టి
నృపుల బలమును మఱచెను • నిందమఱచెఁ బ్రసవశరునిచేఁ పూర్వశా • పమునుమఱచె

చ॥ జనకజ నామమున్ మనముఁ • జక్కన నొక్కటియై లయింప నా
వెనుక నొకం డొకళ్లు విడి • వేఱొక దానిఁ దలంప వేఱుగా
మనమొకఁడుండునే? మఱచి • మార్గముఁ కెయ్యది? పండితాళికెన్
మనము నడంచు జ్ఞానమది • మాఁదగఁ గామ జయింప శక్యమే?

క॥ లంకాధిపతి మయూర వి శంకట గమనన్ మహీజ • సాధింపక ము
న్నంకిలి పడు నెడఁదఁ గడుగా సం ట పడి యెండ వెన్న • చందంబందెన్

చ॥ తనవిధి బల్మిచే ఒరుగఁ • దగ్గ పరిస్థితిచేత లంకకుం
బనుపడు చెటుచే మతి య • వాఁడు సంభ్రమ మొందుచుంటచెఁ
జెనకిన దొడ్డ కామ రుజ • చెల్లఁబరింపని మూర్ఖుఁ డజ్ఞతం
బొనరుచు చెట్టు కైవడినె • పూవులు పండులు గాఁగ వర్ధిలెగా

ఉ॥ బంగరుబొమ్మ సీతఁ దన • భావమునం జొనిప్పు త్రోవచే
టంగిని ద్రావు వానిక్రియ • భ్రాంతిని మై వివశత్వ మొందుటన్
రంగుగఁ గాంచి మాటుఁడు • దంబుల నొంప సమర్థుఁడయ్యె వా
నిం గొను కామభావననె • నిల్చె బలంబు కుదించు శక్తియున్

వ॥ కొలావును వీడె రావణుఁడు • కూరిమి దీపనలిచ్చినారు పె
ద్దలు చెప్పవల్ సుగుంబులును • దంపడిఁ జలిరి ...

చెలఁగె సఖాసదుల్ చనిరి • చెడ్డ మనంబు తపించి తొందరం
జలుపఁగ హేమరత్నమయ • సౌధముఁ జేరె సురారి చింతమై.

మ॥ సుమతల్పంబులఁ జేరకే సఖులపైఁ • జూడ్కిం బ్రసారింపకే
ప్రమదారత్నము లుల్లసిల్లి పలుకం • బల్కింపకే యొంటిమైఁ
దమి నొందొక్కట నిల్చి సీతపయిఁ జి • త్తంబుంచి తావిన్నత
భ్రమణీ యాంగములన్ స్మరించె మది సం • తాపంబు పెంపొందఁగన్.

మ॥ తొలఁగింపంగ నశక్యమౌ తమి మదిం • ద్రాక్షాదిఁ యుష్ణాంతగాఁ
గలఁగింపంగఁ బరీమళ ప్రసవ సం • ఘాత ప్రకీర్ణస్ఫుర
త్తలిమం బందలి పూలవాడి యొడలుం • దప్తంబుగాఁ జిత్తమున్
మలఁగం బ్రాణము తల్లడిల్ల మఱిఁగెఁ • మారప్రహారంబులన్.

ఉ॥ చల్లని గందముం గిసల • సౌరభ పుష్పములన్ వెలందుకల్
మెల్లనఁ గొంచుఁదేర నవి • మించిన నిప్పగు మందుచే నొదల్
తల్లడ మందు రీతిఁ గడుఁ • దాపముఁ గూర్పఁగఁ గొల్మిగుంట రా
జిల్లెడు నెగ్గినా మిడుఁగు • చిందఁగ నూర్చుచు నుమ్మలించుచున్.

చ॥ మునుపు మనంబు నెమ్మదిని • బొందిన రావణుఁడిప్పు పాపమున్
దనికెడు నిందయుం బగయుఁ • దా మదినెంచక యబ్ధి కుంత మా
ర్గణ హరిణోత్పలంబుల హౌ • రంగు జయించిన కన్నులొప్పు నా
జనకజఁ గాంచఁ గోరి తమిఁ • జాలఁ దపించె మనోజవేదనన్.

తే॥ దిగ్గజంబుల నొంచిన • ధీరుఁడపుడు, తరువులం దొలిచెడు బెండు • పురువులీలఁ
గంతు తూఁపులు తనదు వ • క్షంబుఁ దొలువఁ, గుంది సోలి కుమారిలి • క్రుంగి కూలే.

తే॥ ప్రసవముల తోడి లేఁగొమ్మ • వంటిదౌ తె, వచ్చుమదిఁ జేరెనని భ్రమ • పడెడియసుర
వరుఁడు మరు నమ్మువలె నెద • వ్రయ్యసోఁకు, మలయ పవనునిపైఁ జాల • మండిపడును.

తే॥ పొక్కిపొరలి కర్తవ్యతా • మూఢుఁడైన, రావణుఁడు లేచి వడిఁ బలు • రకములైన
వీణలను కేరుపలుకుల • వెలఁదులెమర, దీపికలు గొని రానొక • తోఁపుఁజేరె.

సీ॥ మావిచెట్లకు హీర • మణులు పనసలకు, మాణిక్యములు పోఁక • మ్రాఁకులకును
నీలముల్ కురువింద • మోలి సాలములకు, గోఁగుల కరవింద • రాగమణులు
నరఁటి కంబములకు • మరకత రత్నంబు, లేపి భూజములకు • హేమరాశి
పాటల తరులకుఁ • బగడముల్ పున్నాగ, ములకును శశికాంత • ములును నారి

తే॥ కేళములకు వెండిని పోల్పఁ • దేలుఫలము, గలదెౘ మిన్నంటఁ బెరిఁగి పూ • వులకుఁ దక్క
రిక్కలకు వేర్మిగనకరాక • నిక్కియున్న, వనమునం దొక శయ్యపై • వంతఁ జేరె.

# అరణ్యకాండము

## రావణుని విరహతాపము

మ॥ ఫల పుష్పంబులనుండి వచ్చు మధువున్ • వాటంబుగాఁ ద్రావు చె
ల్వాలు పైకింబులు బంభరంబులును చి • ల్కాల్ పిచ్చుకల్ శారికల్
పలుకుల్ రజ్జులు మాని దానవ జగ • త్ప్రఖ్యాత వీరప్రభుం
డలుకం బూనునో యంచు మూఁగల క్రియన్ • వ్యాహారముల్ సేయఁగన్

చ॥ శిశిరముచేత గాలియును • జిల్లను మంచును గూడి మెల్లఁ బం
చశరుని తూపులుచ్చి యెడ • సందులఁదూఱఁగఁ గాలుసేతులుం
బ్రమసన మింతలేక సఖ • యెందొడఁగన్ ఋతువెద్దిరా' యనన్
శిశిరము వోయె భీతిమెయిఁ • జెచ్చెర వేసవి వచ్చెఁ జిచ్చునాన్

ఉ॥ లావగు పెద్ద మ్రాఁకులు శి • లాతలముల్ గిరులున్ హిమస్థలుల్
ప్రోవుగ మండిపోయెననఁ • బోడిమి వేసఁగి వేఁడి యిట్టిదం
చేవిధిఁ బల్కఁ శక్యమగు? • నిట్టలపు న్వలపన్విషంబునే
త్రావిన మందులుం గలవె? • తాఁకె నెడంద సుఖంబు దుఃఖమున్

చ॥ అతని మదిం జనించిన స్మ • రాగ్ని దిగంతము దాఁకఁ గాల్పఁగా
వెతల భజించి యెండయును • వేదన గూర్చెను దీనిఁ దోలి మున్
ఋతువునె దెండియన్న నది • యేత్తెల రా నొడలుం దపింప నీ
ఋతువును కాల్చుచున్నదిది • యెప్పటిదే యని చీఁదలంగొనన్

తే॥ దైత్యచంద్రు మీయాజ్ఞను • తప్పినడవ ఋతువులెల్లను భయపడి • కొతుకుననుడు
ఋతువు లెవ్వియుఁ బలికిరా • విచటనాకుఁ దకీసి వేయుఁడీఘటుసాకః త్వరగననియె

చ॥ వలదను నంతలోనె ఋతు • వర్గము ధర్మమువెల్లఁ దప్పి యో
గులవలె సర్వసంగములు • గొబ్బున వీడెను దేశమంతయున్
బలువగు రోగముల్ జనన • బంధము వీడి తపస్వు లొందునాఁ
కలియును దప్పిలేని దివి • కైవడి దోఁచె మనంబులోపలన్

చ॥ ధరణిని వేఁడియుం జలియుఁ • దగ్గ దశాస్య శరీరమెల్ల దు
ర్భరముగ నేయిలేక ప్రఖ • రంబుగ మండెడు వహ్నిభంగి నా
త్తరముగ మండెఁ గాలమది • తార్చునదొక్కటియా? స్మరాగ్ని ము
మ్మరమగు మంట జ్ఞానమున • మాయును గాకొక దాననౌనొకో?

ఉ॥ ప్రబ్బిన మబ్బు నాఁ దనరు • రావణుఁ డపు బిసంబులన్ రసం
బబ్బిన పూలమాలల హి • మాంబువు చల్లిన లెజివుళ్ళతో
జొబ్బిలు చందనంబు నిడి • చూచియు నోర్వక మేలు గోరువా
రుబ్బువ గొబ్బునం బలచి • యోషధి నాథుని పట్టితెండనన్

చ॥ అలుకయె శీలమై తగుద • శాస్యు పురంబు పయిన్ భయంబునం
బొలయక యవ్వలం దొలఁగి • పోవు నిశాకరుఁ గాంచి రక్కసుల్
పిలుచుచు నున్నవాఁడసుర • వీర వరేణ్యుఁడు రావణుండు నీ
వలుకక రమ్మురెమ్మన హృ • దబ్జము ఝల్లన లేచె మెల్లనన్.

శా॥ శంకం బొందుచు వెన్నెలల్ పరవు నా • సంద్రంబుపై నిల్చి తా
సంకోచించుచు గుంద్రనన్ వదలి మున్ • శాత్రవ్యుచే నొచ్చువాఁ
డంకాపొంకముతోడఁ దగ్గ యదనఁ • దంకించు చందాన నే
డాంకుం డప్పుడు దోఁచె రావణునకున్ • యామ్యేశు తోయంబునన్.

ఉ॥ అంబరవీథి వచ్చి కిర • ణావళి పర్వఁగఁ జంద్రుఁడొప్పె మో
హాంబుధి మున్గ నాతఁడు శ • శాంకుని దూషణసేయుచుండ క్షీ
రాంబుధిఁ బవ్వళించిన ము • రారి తటిం బరికించి దైత్య రా
డ్డంబర జీవము ల్గొనఁ గ • డంగి విధించు సుదర్శనం బనన్.

మ॥ తన పుట్టింటనె చెంతనుండు సుధ మో • దం బారఁగాఁ ద్రావి చ
ల్లన వ్యాపించిన చంద్రు వెన్నెలలు. క • ల్కాంబాజి రక్తాక్షుఁడై
జనిత భ్రూకుటి ఫాలభాగుఁడగు దో • షాచార భూజానికిన్
దనరెన్ వహ్నిఁ గరంగు వెండిఁబయిఁ జిం • దం బోయు చందంబునన్.

శా॥ భూరిపాత్రవమై రమాలలితమై • పుణ్యంబు నిందారు కే
దార శ్రీమిథిలేశు నల్లుఁడగు సే • తానాథు సౌందర్య పా
థోరాశిన్ వినినంత నే కడచె సం • తోషంబు మాఁడించె ర
క్షోరాట్చంద్రము నద్ది మానితు రిపు • శ్లోకంబు చందంబునన్.

ఉ॥ ఘోరుల ధర్మరాజు మది • స్రుక్కఁ దపింపఁగఁజేయు రావణుం
దారభటించి నా తలఁపు • నారసి చల్లని చంద్రుఁడెమ్మనన్
గ్రూరవిషంబు గ్రక్కు పెను • కోఱలఁ గల్గిన త్రాఁచువంటి యా
సూరుని దోడితెచ్చిన ప • సుల్ బలుఖుంరలు వారలేరనన్.

ఉ॥ సేవకు లంగముల్ ప్రిదిలి • శీర్ణతనొంద వడంకుచుం బ్రభూ!
దేవరయాజ్ఞ లేని యెరుఁ • దెచ్చుట పల్కఁగఁ బోలునేమి? రా
జీవ హితుండు తేరిపయిఁ • జెందక రాఁడిటు క్రూరచేష్టలన్
మైవడి నేఁచు నాతఁడు వి • మానయుతుండగు చంద్రుఁడే యనన్.

చ॥ పరిణతి నీరసంబయిన • భామలపొందున కిచ్చగించి సం
బరిపడు కోడెకాండ్రు వల • వంతల నొందు మనోగదంబు నె

ప్పరుసునఁ గాననటి పుర • వైరి కులేశుఁడు కాల్చుచుండు వై
ఖరిని గ్రహించి శీతకరుఁ • గాంచి దయామతి తోఁప నిట్లనున్.

శా॥ నక్షత్రేశ! కృశించితేమి? కడు వి • న్నంబోయి యున్నాఁడ వీ
వక్షీణవ్యథ నొందెదే? మఱిఁగెదే? • యంగంబు కందయ్యె మీ
నాక్షిన్ సీతను నన్నుఁబోలె విని యి • ట్లాదన్ మదిం బొందితే?
యాక్షేపింపక నన్నుఁగావ నెవర • య్యా! యున్నవా రీయిలన్?.

మ॥ సరవిన్నెమ్మది నూరకుండఁ జనదో • సాధింపఁగారానిచో
దొర య న్నాడగు జీవప త్రికళి ప్ర • త్యక్ప్రాయమై యున్న యా
తరుణీకైరవయుక్త పద్మమునకుం • దద్యంబుగా నోడి యి
ట్లెరుసుం బొంది కృశించి కందితిలలో • సిర్యాఖవులో గెల్తురే

తే॥ అనుచు నలఁతనుపొంది రే • యినిశశాంకుఁ, దొలఁచి పగలును బ్రొద్దును • కలుగుఁగాక
యనినయంత నెరేయియు • హరియుఁదొలఁగె, పగలుసూర్యుండుదోఁచిర•ప్పట్టునందు

మ॥ క్రతుకుండంబునఁ బోయు నేయివలె బం • గారం పుఁదీవల్వలెన్
తత ఖద్యోత మయూఖము ల్పరవఁ బ • ద్మంబుల్ ప్రకాశించెఁ ద
త్క్రతుకుండాగ్నిని బోలి కల్వలు మహా • ద్రవ్యంబులం బొంది యు
ద్ధతిఁ గొన్నాళ్ళకె రిక్తుఁడౌ వెడఁగు చం • దంబందె నప్పట్టునన్.

చ॥ ప్రతత మయూఖ భూషణుఁడు • పద్మహితుండొక ప్రక్క లేవఁగా
మతి బిడియంబు నూని జిగి • మాసి వడంకుచుఁ గ్రుంకె యామినీ
పతి యొకవంక యామినియుఁ • బజనె యేగెను సాధ్వ భామ నా
నతిఁ జరియించు చిన్న నసి • నాథుని చందము నొంది యయ్యెడన్.

తే॥ రాక్షస స్త్రీలు రేయి భ • ర్తలను చేరి. పొలయుచుక వీడి పుష్ప . • య్యలఁ బరుండి
కలల యందును కౌఁగిలి • కడపకుండి. ల్వరిత గతి రేయి పోవుట • మెఱుఁగరైరి

తే॥ తెల్లవారిన నడురేయి • వర్గములను, తొల గిచనఁ దృ ప్తినొందని • వెలువలపుకు
విరియు కలువలు తేనెను • వెలుచు రీతి. నాష్పములు గార్చిరా రేయి • పగలెయగుట.

తే॥ కొందఱు ఁయ్యలపైఁ దరు, బృందముఁ జుట్టిన ప్రవాళ • పీరుధములనన్
గ్రొందలిరు చేతులన్ మగ, లం దగిలికొంచు నిద్ర • లం బడి రచటన్!

తే॥ కల్లు కడవల మూఁగిన • గందుఁదేంట్లు, నడికి రేయి వింతగఁ బ్రొద్దు • పొడుపు తెలుఁగ
కుండ నిద్రించె మత్తవే • దండ చయము. క్రాగుఁబోతుల కరణి ని • ద్రాళులయ్యె.

తే॥ కలఁగుచుండు ప్రోషిత భర్తృ • కల మొగంబు, వోలె దీపంబు లన్నియు • నోళిమండు
చుండి తైలంబు కొఱఁతలే • కుండియు జిగి, తగ్గి వెలవెల వాఱుచుఁ • గగ్గుచుండె.

తే॥ వేకువను వికసించెడు • విరిదళములు, ప్రొద్దు పుట్టియు విప్పను • పొందకుండె
సెజ్జలందు నిద్రించెడు • చెలుల నేత్ర, పద్మములు వికాసములేక • పరఁగు పగిది,

తే॥ పవటియందను నిద్రింపఁ • దివురువారు, కనులఁ దెఱవరు గావునఁ•గఱకుఁగనులు
బిచ్చమిడని లోభుల యింటి • వీదితలుపు, లెపుడుమూయఁ బడెడు తీరు • నెనసియుండె

తే॥ ఒక్కరేయి యెల్ల వియోగ • మోర్వరాక, వంత గుందు జక్కవలు రా • వణుని కరుణ
సంతరమున సుఖించు భా • గ్యంబు నొంది, చెఱను విడివడు నరులట్లు • చెలగుచుండె

తే॥ నడుమనేర్పడు నాజ్ఞచే • నాఁడు విధుఁడు, తొలఁగ వికసింప కుండెడు • తొగలఁజేరి
యళులు గౌరవకార్యముల్ • సలుపకుండ, ధనులఁ జేరు గాయకు లట్లు • దైన్యమొందె

తే॥ అర్కకిరణముల్ రర్న గ • వాక్షములను, తూకిమేల్కొల్పు నిద్రచేఁ • దూఁగి లేచు
చెలులు జ్ఞానంబుచే నిజ • స్థితి నెఱుఁగక, కఱచు నజ్ఞులవలె మూర్ఖ • గరిమ నుండ్రి

తే॥ అసురనేతృ నాజ్ఞాబల • మరయలేక, దినఫలంబులఁ దెలుపు జ్యో • తిష్కసమితి
జాములం దెల్పుకోళ్లన • జ్ఞానదశను, మలఁగి తమకార్యములఁ దాఱు • మాఱుగుడిచె.

తే॥ ఇట్లులోక విపర్యయ • మెనయుచుండ, దైత్యవిభుఁడు రవింగని • తనమనంబు
నిప్పుచేఁ గాల్చుచున్న యీ • నిష్కరుణుఁడు, చంద్రుఁడే యగుననిపల్క • సరసవారు.

తే॥ చంద్రుఁడీతండు గాఁడు ప • చ్చని గుణాల, తేరుగల వేఁడివెలుఁగగుఁ • దివిరియితఁడు
కాల్చునేగాని చల్లని • కైరవాప్తు కరణిఁ జల్లదనంబును • గాంచఁడవిరి.

తే॥ కొమ్ములంగల్గు కాటుక • కొండఁబోలు, దైత్యవిభుఁడు క్రూరుని సూరుఁ • దఱిమివైచి
సాగరధ్వనిఁ దొలఁగించి • సంజవేళ. వెలయులేఁజంచురుని వేగ • పిలువుఁ డనియె.

తే॥ అశనివంటి పల్కువిని షో • డశకళాప్త, పూర్ణుఁడగు చంద్రుఁడప్పుడే • శీర్ణుఁడగుచు
విదియ జాబిల్లియై మింట • వెలసె; దుష్ట. శాసనంబన నిట్టిదే • జగతియందు

తే॥ అసురపతి కాంచియిది బడ • బాగ్నియేమొ?, ధరణిమోచు శేషుని విష • దంష్ట్రియేమొ?
కాక నాపైన దొడ్డయ • ల్కను వహించి, సంజయే కత్తిగొని యిట్టు • జరుఁగబోలు,

తే॥ పాంకదళి మధ్యమున నీ • పద్మవైరి, మొలచినట్టి వేళనె హాలా • హలముకంగ
మందుధరియించుహరుఁడునీఁ • డింతకంటెఁ, గ్రూరవిషమనియేయుంచు • కొనియెఁదలను

తే॥ అతికరాళ విషంబున్న • యహులయందు, పెద్దదని పిన్నదని రూప • భేదమేల?
పెద్దచంద్రుఁడేపిన్నయై • పిడుగువోలె, మిడుకు మ్రింగునప్పటికంటెఁ • జెడఁగలేదు,

తే॥ చాలుమానిసి నన్నిట్లు • చంపువాఁడు, లోకములఁ గాల్పఁదంచుఁ బ • ల్కటలుతగునె?
ద్యుమణియేమేలు వీనిని • ద్రోవుఁడింక, గుబులుకొను నిరులిద్దు క • న్గొంద మనియె.

తే॥ అప్డు సర్వంకషంబయి • యంధతమము, సురడులను గొనివస్తువుల్ • చూడనగుచు
హర్మ్యముల ససంఖ్యాక దీ • పాళలొప్ప, గాఢముగఁగ్రమ్మె దెసలెల్లఁ • గానఁబడక.

# అ ర ణ్య కాం డ ము.

ఉ॥ అక్షయవస్తు తత్త్వమది • యార్యులచేఁ దగనాలకించి య
జ్ఞక్షయ మొంది జ్ఞానమను • చక్షువువిప్పని గ్రుడ్డివాని దు
ర్లక్షిణ నిష్కృపా హృదయ • రంగముకంటె మహాంధకారమే
పక్షమునందు తక్కువని • పల్కఁగఁ గ్రమ్మె ధరాతలంబునన్.

ఉ॥ చీఁకటియన్ జముండదటు • చెంది జగంబులు నిండి యందుపై
నాకస మంటఁగాఁబెరిఁగి • యంతట సత్కృపవీడి మ్రింగ నీ
లోకములెల్ల వ్యర్థముగ • లొగ్గడియై నశియించునంచు లోఁ
గైకొనకిట్లుతోడుగొనఁ • గంర విషంబు హరుండు క్రక్కెనో?

చ॥ హరుఁడు గ్రసించినట్టి హాల • హాలము నందిది లొంగియుండునే?
ధరణిని స్వర్గమున్ రసనఁ • దాఁకుచు లేహనముం బొనర్చు భీ
కర విలయాగ్ని మెండుకొని • కర్కశ రీతి నెదుర్చు చండ దు
ర్గరళము మ్రింగి నల్లనయి • క్రాలినదీ తిమిరంబు చెల్లరే!.

చ॥ శరములు నగ్నియుంజొరఁగఁ • జాలని సాంద్రతమంబు లోన నొం
టరినయి కుందు నా కుఱఁగ • టన్ బయిమేఘములొప్ప సాటికం
బొరయని విద్రుమంపు లత • పొందిక లే యెడనీరుకాయలం
దిరముగఁ దాల్చి చంద్రుఁగొని • దీపము నా వెలుఁగొందెఁ జూచితే.

చ॥ చతురతఁ బూని చూపఁ జొరఁ • జాలని చీఁకటిలోనఁ గుండలాల్
వితముగఁదాల్చి నల్లనగు • వేణికతో నొక చంద్రబింబ మీ
తతిఁ గనవచ్చుచున్నదిది • తన్మయరీతిని గల్గు భ్రాంతియో?
సుతనుఁడు క్రొత్తచందురుఁడొ? • సుందరమీ నవ దృశ్యమేదియో?

చ॥ ఉరమును పూర్తిగా నలమి • యుబ్బు పయోధరముల్ పిఱుందులున్
మురువగు బంధురంబు నడు • ముం గనరావు నిజంబు తక్కుసుం
దర తరుణాంగముల్ గని ము • దంబు గడించితి నిద్దిమెల్లఁగా
గరగరికైన కాంతయయి • గట్టిగ నామది నున్నదే చుమీ.

చ॥ మునుపె సమస్తలోకముల • ముగ్ధలఁ గాంచితి నిట్టి రూపముం
గనివిని యుండలేదు మఱి • గల్గునె యిట్టిది వేఱొకండు? క
ల్గిన దని చూపువారెవడు • లేరిట నాచెలియల్ వచించు మా
రుని తురగం బపుష్పమగు • రోపము నిక్కువ మామె యీమెయే.

ఉ॥ ఏఁ గొను కామవేదన స • హింపదు దీనిని రోసి తెచ్చె న
న్నీఁగని చెల్లె శూర్పణఖ • యిందొక భేదము సేయఁ బూనునే?

వేఁగుచు నున్న నాకడకు • వే చనుదెంచిన సుందరాంగిమున్
దాఁ గనినట్టిదేమొ? విశ • దంబుగఁ దెల్పిన కాఁ దలంచుచున్.

తే॥ పిలుచుకొని వందనముఁ ద్వార • విభుఁడు పలుక, ససుర లేగిపిల్చిన యంత • నతనికులవ
దుంపతోఁ డెంపఁబుట్టిన • ధూర్తురాలు, మరునికాఁకతో నచటికిఁ • దెరలి వచ్చె

ఉ॥ ఎల్లలు నిందు మానసము • కంటె భయంకర రీతిఁ గ్రాలు నా
చెల్లెలిఁ గాంచి దైత్యకుల • శేఖరుఁ డీఁటెలఁ బోలి కాటుకన్
సల్లలితంబుగా నిడిన • చక్షులతోడ మయూరి పోల్కి స్త్రీ
లల్లజ కానవచ్చునది • ధారుణి జాతయె? యన్న దైత్యయున్.

శా॥ చెందమ్మిన్ హసియించు నేత్రములతోఁ • జెల్వంపుఁ గెమ్మోవితో
నందంబై తగు దీర్ఘ బాహువులతో • హారాస్సైన కంఠంబుతోఁ
బొందంగోరు విశాలమౌ నురముతోఁ • బొల్పైన నీలాద్రియన్
చందం బొందిన ధన్వి యాతఁడె ఘన • శ్యాముండు రాముండనన్.

మ॥ తరుణీ రూపము నాకుఁ గానఁబడఁగాఁ • దన్వంగి! నీకేదియో
పురుషాకారము గానవచ్చె ననుచుం • బొంకాడుచున్నావె? య
చ్చెరువయ్యెన్ మనయొద్దనే మనుజు లీ • జిత్తుల్ ప్రసారింతురే?
యసురగ్రేష్ఠుని యొద్దనే యెలుక మా • యోపాయముల్ సాగునే?

చ॥ అనివుడు నుల్కి యామెయను • నన్నా! మహీజ పయిం హృదబ్జముం
జొనిపితి యెంత మోహమతిఁ • జొక్కితి కావున నెద్ది గాంచినన్
వనిత నీకుఁ గానఁబడు • వైఖరినైజము నీమనంబునం
బనుపడు కాంతయే యిపుడు • భ్రాంతిని యెల్లెడఁ దోఁచు నావుడున్.

చ॥ చెలియలు! ముమ్మరంపు వల • చే నని పల్కితి వొప్పుకొంటి నీ
పలు రఘువల్లభున్ గనెదు • నగ్గలపుం బనియేమి? యన్న నా
పొలఁతియు వాఁడు నాకు నుడి • వోపని దుఃఖము గల్గఁ జేయుటన్
మలగుదు నాఁటనుండి యన • మానము నొవ్వఁగఁజేఁ గదా యనెన్

చ॥ నిజమెకదా! యటంచు రజ • నీచర నాథుఁడు చూచి నామనో
రుజ కిఁక నేదిమందు? నను • క్రూరుఁడు మారుఁడు వేఁచుచున్నవాఁ
డజితుఁడె యన్న శూర్పణఖ • యన్న! కుమారిలనేల? పోయి భూ
మిజఁ గొని తెచ్చుకొమ్మటు భ్ర • మింపఁగ నేటికి నంచుఁ బల్కుచున్

తే॥ వెడలు రావణుఁ డొడతెల్ల • నుడికి తెలివి, నందకుండ మూర్ఛను పొంద • నచటివారు
వడఁకి రింకను మనుగడ • వటులకతన, మరణమందఁడు నిర్జర • మర్దనుండు.

## రావణుఁడు శశికాంత శిలామంటపంబు చేరుట.

తే॥ చచ్చినాతఁడు బ్రదికిన • చంద మొంది, తెలివినంది యందున్నదై • తేయులఁగని
పితుకు పాలట్లు నీరు ద్ర • వించునట్టి, చంద్రకాంతమండప మొందు • సలుపుఁ దనియె.

తే॥ మయుఁడుసనుదెంచియా పితా • మహుఁడుసిగ్గు, పడఁగ నూహించి శిల్పంబు • పరిఢవిల్ల
వేయి కంబముల్ నడుమను • పెలయునట్లు, మేటిరత్నమండపము ని • ర్మించె నపుడు.

తే॥ కాలమున కనువయి చంద్ర • కాంతి లేక, చెమ్మఁగ్రమ్మెడు నెలఱాల • చేత మీఁదఁ
గ్రిందఁ గప్పి తెమ్మెర కిటి • కీలనుంచి, యావిమ్రాఁకుల యుద్యాన • మేర్పఱించె.

తే॥ స్వర్ణమణిమయ కాంతుల • జాలువాఱు, దీపములు చీఁకటులఁ దోల • దేవసతుల
నగల కాంతులు ప్రక్కల • నొగసునింప, వచ్చె నసురేంద్రుఁ డమ్మండ • పంబుచూడ.

తే॥ పెక్కుకోట్ల చీఁకట్లొగిఁ • బేర్చినట్లు, గలిగియున్నను చెలువల • చలువ గలుగు
బహుశరాస్యసుధాంశు బిం • బంబు లచట, వెలయు కతన నాచీకట్లు • విరిసిపోయె.

తే॥ క్షోణి నిల్చిన కల్పక • జ్యోతి రంగ, తరుమహాద్యుతిఁ గేరు ర • త్నముల శోభ
పలసఁ జీఁకట మాసె ది • వాకరుండు, పోయియును రేయి కాదయ్యె • భూరికాంతి.

తే॥ అవయవంబులు వివశత్వ • మంది తన్నె. యటకుఁ గొనివచ్చు చేష్టల • నరయలేక
పూర్వభవ వాంఛ తజ్జన్మ • మునను పడయు, రహిని నాత్మస్థితిం బొందె • రావణుండు.

తే॥ జగముఁజల్లఁజేయఁగఁగోరి • జలధికిదిగు, మొగులుగములపోల్కిఁందేంట్లు • మునరుచున్న
పసిఁడి తరువుల చివుళులఁ • బ్రసవములను, పలుచు పానుపుపైఁజేరెఁ • బంక్తిముఖుఁడు

తే॥ అందు మదనుండు తనకు ద • శాస్యుఁ బట్టి. విందుగాఁబెట్ట నమృతంబు • విధినివెడలి
యసువు లొసఁగు నేరుపరి మం • దానిలుండు, కొమల కొప్పుల విరితావిఁ • గూడివచ్చె

ఆ॥ కాపురించు నింటఁ • గాలసర్పము చేరు, పగిది వచ్చు మంద • పవనుఁ గాంచి
కోప చండరక్త • ఘూర్ణ నేత్రుండయి, సేవకులను పిలిచి • చీఁదఱగొని.

ఆ॥ పొంగి కూప జలము • భువనంబులను ముంచి, నట్లు నన్ను పవనుఁ • దలఁచె నిటకు
నేలవచ్చెనాజ్ఞ • నెనయక? వానిని, పట్టి తెండటంచుఁ • బదరి పలికె.

తే॥ వారు వాయుదేవుని గొని • వచ్చునంతఁ, బండ్లు గొఱుకు చుటిమి మంద • పవనమునకు
మేలి గుణమేల యీవన • మీరలిట్టి, తగవు నొంది దానిని తిట్టఁ • దగవె? యనుడు.

తే॥ వాయుదేవుని కోపించి • ఫలములేదు, సీతకృప నొందనేని ప • రేతరాజు
చేరుఁ గానఁ గష్ట విముక్తి • చెప్పఁ గలుగు, ననుఁగుమంత్రులఁబిలుఁడని • యాజ్ఞచేసె.

క॥ వారలు పిలిచిన వెంటనె, వారణములఁ బల్లకీల • వారువములఁ బెఱ
దేరుల నెక్కి భువిం దివి, వారలు శంకింప వచ్చి • ప్రాలిరి పెలుచన్

## రావణుఁడు మారీచుఁ గాన నేగుట

క॥ వచ్చిన మంత్రులతోఁ దగఁ, జెచ్చెర యోచించి తెలివి • చెడి మారీచుం
దచ్చుగఁ దపమొనరించెడు, నచ్చటికి దశాస్యుఁ దరిగి • యతనిం గాంచెన్.

తే॥ పంక్తివదనుఁడు రాఁగాంచి • భయమువలన, వడఁకి కొంకుచు నెదురేగి • వానిఁదోడి
తెచ్చి మర్యాద గావించి • తెలచి యతని, వదనమునఁ జూడ్కి నిల్పి తాఁ • బలికె నిట్లు

తే॥ కల్పవృక్షంబు నీడను • కాంక్షఁ దిరుగు, నింద్రునకు యమునకు నోట • యెదుగునట్లు
పాలనము సేయు దేవ! యీ • వశికిఁ బేద, కరణి నరుదుగ వచ్చిన • కార్యమేది?

చ॥ అనివుడు రాగఁ దగ్గ యవి • యైనవి ప్రాణముతోడ నుండియుం
బనవెదఁ గీర్తితోఁ బరువు • మాసెను వేల్పులఁగాంచి యింక పి
గ్గునఁ దల వంపఁగా వలసె • ఘోరతరంబగు నింద నేఁటికిన్
మనుజులవల్ల వచ్చె నిఁక • మానము వోనది యెట్లు చెప్పుదున్?

చ॥ బలయుతులైన మానవులు • బాహుమదంబున ఖడ్గమూని య
మ్ములుచలు నీదు కోడలికి • ముక్కు సెవుల్ మొదలంటఁ గోసి రి
ట్లలమిన నిందకంటె ఘన • మౌ నపదూఱు మఱొకండు గల్గునే?
యిలను ప్రసిద్ధమైన మన • యిద్దఱ యన్వయ శీలముల్ చెడన్.

చ॥ ఒక మనుజుండు చేత ధను • వూని రుషా విపరీత చిత్తుఁడై
యకట! నిశాచరావళుల • యాయువు ద్రుంగి ఖరాదులన్ సుర
ప్రకర జయేందిరా కచభ • రంబు గ్రహించిన యా నరాదులన్
గకవిక చేసి చంపె ననఁ • గా మన జన్మము లేల కాల్చనే?

ఉ॥ కాఁక యడంప లేక మది • గాసిలి దూపిలుచున్న నేను నా
కాఁక యడంగ నీచులను • గ్రచ్చఱఁ జంపఁగ సాటికామి య
ట్లూఁకువ సేయకుంటిఁ దమ • యొద్ద వసించు మదంతి మిన్నఁ గొం
చాఁక నెడంచి నిందను న • యంబునఁ ద్రోవఁ దలంచి వచ్చితిన్.

చ॥ అని దనుజేంద్రుఁడాడఁ గొడు • పగ్గిని గాల్చి దిటన్ శ్రవంబులం
జొనిపిన యట్లుగాఁగ మది • స్రుక్కి యిసీ యని యాశ దొడ్డదే
యని విలయంబు తప్పదని • హావడిరా యని యోటలేక యి
ట్లని వచియించె నాతఁడు న • యంబున మేను మనంబు కంపిలన్.

ఉ॥ అయువు వొల్లవేమి? మతి • నక్కట పంకము నందు ద్రొక్కితే?
యీ యపమార్గ మిట్లు వడి • నెవ్వరు నీకను కూలశత్రులై
తీయని పల్కులం గఱపి • తీర్చిరి? నీ తలవ్రాఁతయే చుమీ
వేయన నేల? యేను బలు • వీఁజిఁడి నైనను మేలు సెప్పెదన్.

ఉ॥ త్రెంచిన చేతులం దలఁ • ద్రిక్కటి చేతుల నందికొంచు హో
మాంచిత కుండమందిడి యు • మాధిపుఁగూర్చి యనేకవత్సరాల్
కొంచక విద్ర యోగిరము • గోరక చేసి తపంబు సంపదం
గాంచితి లోకనింద గొని • కొంచఁగ శక్యమె యిట్టి సంపదల్?

ఉ॥ పాపగుణంబుచేన? మఱి • పావనమైన గుణంబుచేతనా?
యీపగిదిం దపంబు ఫలి • యింప సు సంపద నీవు పొందుటల్?
కోపము మాని పల్కు మిది • క్రూరగుణంబున నొంది తేమి? యి
ట్లేపునఁ గీడు చేసికొని • యెల్ల నశింపఁ దలంపు గొంటివే?.

చ॥ దుడుకున మిత్రరాజ్యమును • దోద్ద యొనర్చిన, ధర్మ మార్గముల్
చెడ వలపక్షమూని సభ • చేసిన, మోసముతో గృహస్థులన్
గొదవల నొంచి తత్కుసుమ • కోమలులం జెఱ గొన్న, ధర్మమే
మడియఁగఁ జేయు; నెవ్వరిల • మాఁడక నిల్చిరి దుష్ట వర్తనుల్?

ఉ॥ నాక విభుం డహల్య వల • నం బడరాని యసహ్య దేహముం
జేకొనె నింద్రుఁ బోలిన ప్ర • సిద్ధు లిఁకెందఱొ కామపీడచేఁ
గైకొనినారు చేటులు ని • కంబుగ లక్ష్మిని పోలి యెందఱో
నీకు సతుల్ గలారు వగ • నెక్కొన నీమతి మాసె నేమనన్?.

ఉ॥ కాదని పూని శేని చెడు • కావలమున్ గడు దూఱు గాక వే
ఱేదియుఁ గాంచలేవ యొల • యించి ఫలంబును పొందితేనియున్
సాదుల శాప సన్నిభపృ • షత్కముబన్ రఘురామ భూవరుం
దే దమియించు నీదయిన • యిద్ధ బలంబు కులంబు సర్వమున్.

ఉ॥ నీదగు సేనకంటెఁ గడు • నేర్పున లావున మేటి యంచు సం
పాదితకీర్తి మోచిన య • వారణ సైన్యము తోడ నా ఖరున్
మేదినిఁగూల్చె నొక్కఁడె ని • మేషము లోన. సమస్తదైత్యులన్
మోదముతో వధింప మదిఁ • బూనిన వాఁడది నీ వెఱుంగవో?.

ఉ॥ రావణ? నీయనుంగుల వి • రాధునకంటెను శూరుఁడున్నె? వాఁ
డేవగ రామ బాణ హతి • నీల్గె నెఱుంగవె? యింక నే విధిం
బోవఁగ వచ్చు నంచు మదిఁ • బ్రుంగుచు నుండుఁ జెడంగనేల? నే
నే విధముల్ వచించినను • వీనుల కెక్కదిదేమి తెల్వియో?

చ॥ మడిసిరి నిన్ను మించిన స • మానులు దైత్యులు చావఁగోరి చే
సెడి పనిచేయఁ బూనకుము • చేసిన నాయువు మాయు టబ్రమే?

పుడమి మహేంద్రజేంద్రతో ప్ర • పూర్ణ బలంబున నేలినారు పెన్
దుదుకులు చే౯ భూస్థలిని • త్రుంగని వారలఁ బల్కు మొక్కరిన్.

శా॥ తమ్ముండైన సుబాహువున్ జనని దో • ర్దండ ప్రభావుండు నా
కమ్మం గూర్చినదాది దైత్యబలముల్ • గగోలుగా వారి నా
మమ్మ ల్విన్నపుడెల్ల నామనము కం • పంబొందుఁ గాఁబట్టియే
నిమ్మార్గంబునఁ గుందుచుందు దనుజా • ధీశా! పరీక్షించితే?

తే॥ భువిఁ జరాచరములు నిల్క • పొందవనుచు, నిజము దెలిసితి మసురేంద్ర! నీవు దుష్ట
చేష్టలను మాని యున్నట్టి • శ్రేష్ఠమైన. సంపదలఁ బొందునామాట • చక్క వినుము

మ॥ అన దైత్యేంద్రుఁడు శంభుఁ దారగిరి లీ • లాంకంబుగా నొక్కచే
మొనయం దాల్చిన నాబలంబు చులకం • బోనాడుచున్ మర్త్యునొ
క్కనీ నాముందఱ గొప్పవాఁడనుచు వీఁ • కం బల్కుచున్నాఁడవా?
యనుచున్ భ్రూకుటి భీకరంబుగను మా • యావిన్ విలోకించుచు౯.

చ॥ నడచిన కార్యమింతయు మ • నంబున నెంచవు నామనస్థితిన్
బెడిసి పడంగఁ దిట్టితివి • వీకునఁ జెల్లెలి ముక్కుగోయు నా
దుడుకరుల న్నుతించితివి • దోసము నొందని వారలంచు నీ
బుడి బుడి మాటలన్ సయిఁపఁ • బోలునొకో మఱినీవ చెప్పుమా?

## మారీచుఁడు రావణునకు నీతి కఱపుట

ఉ॥ అని లంకేశుఁడు కోపియై పలుకు ప • ల్కాలించి మారీచుఁ డిం
కను తాఁబల్కిన మండి దూఁకుననియ • ల్కంబోక తానిట్లనున్
నను కోపింపఁగ లేదు నిన్నును భవ • న్నందన్ • భవద్వంశమున్
ఘన కోపంబునఁ బ్రుంగఁ జూచితి వపా • ఖ్యం దాల్తువే నీతలన్?

ఉ॥ ఎక్కడుమన్న భార్గవుని • యేత్తెఱఁ గ్రుంగఁగఁ వంచుశైలముం
బెక్కువ రాట్సభన్ విఱిచి • పేర్చిన శైలము నెంచి చూడ నీ
వెక్కటి నెత్తినట్టి పర • మేశ్వరు శైలమొ? మేరు శైలమే?
మిక్కిలి యాకసం బొరయ • మీటిన వింధ్యమొ? నీవ చెప్పుమా?.

ఉ॥ కావున రామునత్త్వమును • కాంచి వచించిన నా నయోక్తులన్
వీనులఁ జొన్పవున్ జెడెదు • వీరవరేణ్యుఁడు కేలఁ జాపము౯
బూనక మున్నె ప్రాణములు • పోవుట నిక్కము మూర్ఖబుద్ధిచే
జానకిఁ గాంతఁగాఁ దలఁతు • జానుగ రాక్షస పాప రూపమా,

ఉ॥ చుట్టలతోడ సంయమనిఁ • జొచ్చుట నిక్కువమంచుఁ దప్పెటం
గొట్టిన రీతి గుండియలు • గోడుగఁ బాడుగఁ గొట్టుకొంట నీ

పట్టునఁ గానవేమి? విష • పానముచేసెడు వారిఁ గాంచి య
ప్పట్టున నున్న వారదియు • భావ్యమెయంచు వచింపఁ బోలునే?

ఉ॥ భూపకుమారకుం బ్రియము • పొందునఁ గౌశిక మౌని మెచ్చి నా
గోపమమైన దివ్య విశి • ఖోత్కర మిచ్చెఁ దదస్త్రజాలముల్
లోపము లేని కోపమున • లోఁగొనఁ జాలు క్షణంబులోన స
ప్తోపరిలోకముల్ మహిమ • నున్నతి నొందిన యా త్రిమూర్తులన్.

చ॥ అమిత బలంబునం జయము • నందిన యర్జును వేయి చేతులన్
సమితివి ద్రుంచి కూలిచిన • క్షత్రియ భీకరు జామదగ్న్య చా
పమును జగంబు జే యనఁగ • వంచిన రాము నమోఘబాహు స
త్త్వము మన చేతులం గలదె? • తత్త్వమెఱుంగక మాటలాడెదే?

ఉ॥ కామవిషంబు దేహమును • గాసిలఁజేయఁగ బుద్ధిమాలి నీ
వీమెయి దుష్టవాక్కు వచి • యించితి చేటును దెచ్చు నాయనా!
మామను నీకులంబునకు • మాన్యతఁ గూర్చెడువాఁడ నీతలం
పోమక యడ్డు పెక్కనని • యుగ్రత నొందక వీడు మీపనిన్.

ఉ॥ నీచపథంబు మాను రఘు • నేతృబలంబు దలంపుమన్న మా
రీచుఁ దిరస్కరించి వల • రెక్కొను రావణుఁ డిట్లు పల్కెనో
యీ! చతురాగ్రగణ్య! జన • యిత్రి వధించిన మానిసినికిన్
శౌచితరీతి జంకు విను • కూరుఁడవంచుఁ దలంపఁ జెల్లునే?

ఉ॥ దిక్కరులొగ్గి డాఁగికొన • దివ్యులు నిల్కడఁ దక్కి పాఱి తో
స్రుక్కఁగ ధూమధామముగఁ • జుమ్మలు చుట్ట దివంబుఁ గాల్చి పే
రుక్కున ముజ్జగంబుల మ • హోన్నతి నాజ్ఞలఁ జెల్లనిచ్చునే
నెక్కడ? తుచ్ఛులౌ మనుజు • లెక్కడ? నన్నుజయించు టేడనో?

చ॥ త్రిజగము లందు నన్నెదురు • ధీరులు లేరటు గల్గిరేని నా
భుజముల తీఁటవో నడుతు • మోదము దీనికి మించి కల్గునే?
గుజగుజ పోక నాముదలఁ • గూర్చెడు మంత్రుల ధర్మపద్ధతుల్
విజముగ దాఁటిపోవుటయు • నీతియె? చెప్పిన యట్లు చేయవో?

ఉ॥ త్రోసి తొలంగి పోయినను • ద్రోవక నీశిర ముత్తరించి నా
యాసను నేనె పూర్తిగ ర • యంబునఁ గాంచెదఁ గాక మాన మ
వ్వాస వహించి తేవి బదు • లాడక ప్రాణము గోలుపోక యు
ల్లాసముతోడ నాదగు త • లంపు ఫలింపఁగ నిల్వుమాయనన్

చ॥ విరఁగిన రాగిపైఁ జిలుకు • కంబుకణంబన ముక్కిగ్గి ట.
క్కరియగు తాటకేయుఁ డెద • గర్వము నిండిన వారునాశముం
బొరయుట నిక్కవంబు తమ • పొందఁగఁ గోరిన కార్యమెల్ల నా
గరువము చేతనే ఫలము • గాంచెద మంచుఁ దలంతు రిమ్మగన్.

ఉ॥ నీపని చూచియే నిపట • నిక్కపు సంస్థితి చెప్పఁ బూనితిన్
నాపని గాంచి యే భయము • నం బడి పల్కఁగ లేదు నాశమే
చేపడువేళ మంచియును • చెడ్డఁగఁ దోఁచుట నిక్కమల్ప బు
ద్ధీ! పనియేమి సత్వరము • తెల్పుమ యంచు వచింప నుబ్బునన్.

చ॥ కవుఁగిలి గొంచు రావణుఁడు • కాఁక తొలంగఁగ నోయి మామ! నేఁ
దివిరి యనంగు వస్త్రమునఁ • ద్రెళ్లటకంటెను రాము తూపుచే
భువిఁ బడుటెన్న భావ్యమని • పూనితి మందసమీర వైరమున్
దవిలిచి నట్టి సీతను ము • దంబుగ నాకు నొసంగుమా యనన్,

తే॥ సిగ్గు చెడఁగఁ దపోవనిఁ • జేరి మున్ను, రామ దివ్యాస్త్రవితతిచే • రాక్షసులను
సోదరుఁడు చావ భయమున • నురిఁగి పాటి, వచ్చినట్టి నేనిప్పుడే • పనియొనర్తు?

చ॥ అని మరణంబు నోటమియు • నప్పుడ పొందిన యట్లు తాటకా
తనయుఁడు పల్క రావణుఁడు • తత్తఱ నిట్లనుఁ జింత యేల? నీ
జననిని చంపు దుర్జనుని • చంపఁగ నాయిత మైతి మేటి వం
చనమున సీతఁ గైకొనుటె • సమ్మత మిప్పటికార్యమో యనన్.

చ॥ వెనుకను పోవుటేమి? బల • వీరుని రాముని సుందరిం దురం
బున విజయంబు నంది కొను • పోఁడిమి మెచ్చగుఁ గాక వంచనన్
గొనుటది యెల్లిదంబుగద • ఘోరరణంబున నీ పరాక్రమం
బును వెలయింపుమా యశము • భూమిని నింపుమ యన్న నవ్వుచున్

తే॥ వారల జయింప సేనలు • పలయునేమి?, ప్రణుతచంద్రహాసమువాలు • వారుమడియఁ
డెఱవయునుపప్పుఁగాన నా • తెలుఁగువీడి, మాయ గైకొందమనిదైత్య • మల్లుఁడనుడు

మ॥ ఇనవంశోత్తము వారఁ దాఁకుటకు ము • న్నే వీని మూర్ఖంబు లా
తని బాణంబులఁ ద్రెవ్వకున్నె? యనునా • తత్త్వంబు యోచింప నా
కును తద్భూమికి నేగి క్రమ్మఱెడు ల • గ్గుం గల్గునో? కల్గదో?
ఘనమౌ నావిధి యెట్టిదో? యనుఁచుదాఁ • గర్తవ్య మూహించుచున్,

## మారీచుండు మాయా కురంగమై చనుట

తే॥ ఆజ్ఞయేమని మారీచుఁ • డడుగ దైత్య, విభుఁడు బంగారు జింకవై • వెడలి సీత
యాస పడఁ జేయుమని పల్క • నతఁడు వోమె, వింశతిభుజుండు వెడలెను • వేఱుత్రోవ.

తే॥ మునుపు రామబాణబలంబు • గనుటవలనఁ, దానుగాఁగాక ప్రభుని ప్రో • త్సాహమునను
జింకరూపొంది పోవఁ ద • చ్చిత్తవృత్తి, యెట్టులున్నొ? యూహించియు • నెఱుఁగుటరిది

క॥ కల బంధువులను బావం, గల వీరులఁ దలఁచి కొంకి • కళవళపడుచున్
మిలు విషజలములఁదెరలెడు, లలిఁదెరలుచు మేనువడఁక • లావతి క్రుంగున్.

తే॥ మునిమఖంబును చెఱుపంగఁ • బోవునాఁటి, నుండిశోకించి నిలుకడ • నొందలేక
మూఁడవ తడవ మరణింపఁ • బూనిరాముఁ, జేరె సింగంపుగుహ దంతి • చేరునట్లు.

క॥ మెఱపులు భువిదిపి దోఁపఁగఁ, బొం రభిమానంబులేని • భూరిమయంబౌ
హరిణాకృతిఁ గొనిసీతా, హరిణాక్షి చరించుతావు • నరయుచుఁబోయెన్.

తే॥ జింకలను గన్నవారలు • జింకకంటి, నరయుబంగరు జింకపౌ • రరసి యెడఁద
లంటులేని వేశ్యల చూపు • లనెడివలలఁ, బడినవడువునఁబడజింక • వచ్చెనటకు.

తే॥ అసదు లే నడు మల్లల • నాడుచుండ, శ్రమను నడచుచు మృదుల హ • స్తంబులనెడు
కోయఁబడని పుష్పములతోఁ • గుసుమచయము, గోయుచుండెజానకి యటఁ • గూర్మితోడ

తే॥ తలఁపఁ దరమయ్యెఁగాని చం • దంపురూపు, చెన్నఁటులు నిద్రలోఁగాంచిఁరన్న పగిదిఁ
వెన్నరాని దుఃఖములొంద • నున్న సీత, గాంచె నచ్చెరువంది బం • గారు జింక.

మ॥ దశకంఠుండును వాసి జీవితము ను • ద్యద్భోగ భాగ్యంబులున్
నశియింపం దటియౌట ధర్మము ప్రస • న్నత్వంబు కా నుండుటన్
విశదప్రేక్షణ సీత మున్నెపుడుఁ బ్రు • థ్వీం గానకున్నట్టి రూ
పశరీరంబుల నొప్పు జింకను మదిన్ • వాంఛించెఁ దా జేలయై.

క॥ తరళాక్షి ముదురుటాసను, హరిణంబును పట్టి యీయ • నడిగెద ననుచుం
ద్వరపడి పూవులు చిందఁగఁ, బరువున రాఘవుని కడకు • వచ్చి నయమ్మై.

తే॥ కాళ్లు చెవులును మాణిక్య • కాంతి గలిగి, మేను బంగరు చాయయై • మెఱుఁగుచేత
గగనము వెలుంగ, జేసెడి • సొగసు గులుకు, లేడిగలదు కాంతురు రండు • లీలననఁగ.

క॥ సీత యిటుపలుక నది దే, జాతిది యటువంటిలేడి • జగమునఁ గలదే?
భ్రాంతి యని తలఁపకెంతయు, నేతేరఁ దలంచె రాముఁ • డింతి పిలుందన్

ఆ॥ సీతయాస గొనిన • చేష్టచే నాజింక, యెల్లబోఁటి గామి • యెఱుఁగకుండ
వెదలఁ దలఁచుచున్న • విమలాత్ము రాముని, లక్షణంబుగాంచి • లక్ష్మణుండు.

## లక్ష్మణుఁ డది రాక్షస మాయ యనుట

క॥ కరచరణంబులు వాలము, నరుదగు రత్నములఁబోలి • హైమాంగంబౌ
హరిణంబు గలదె ధరణిని, సురవైరుల మాయయనుచుఁ • జూచెద ననుడున్.

క॥ రాముండిట్లను లక్ష్మణ!, భూమిని పలుకోట్లురూప • ములు పలుతీరుల్
నేమమున సకలమెఱుఁగఁగ, లేమిటు లననేల? వింత • లేదనఁదగునే?.

తే॥ ఏమితలఁచి తొకేరీతి • నెనయుమందు, నవయవంబుల సూటిగా • నరయుదేని
సూక్ష్మభేదముల్ దెలియుట • చూడలేవె?, యేదుపైఁడిహంసలుపుట్టు • టెఱుఁగవేమి?

తే॥ లెక్కలేని ప్రాణులలోన • నొక్కతీరు, నొక్కయంతంబు లేదను • చుండు నంత
మీరు మాటాడుమండ బం • గారు జింక, దూరమేగునొ యని సీత • తొట్రుపడియె.

చ॥ అటువలెఁ దత్తఱిల్లు జన • కాత్మజ చిత్తమెఱింగి రాముఁడం
తటఁగుటిలాలకా! పదము • తక్కక కాంతమ యంచు నేగ సం
కటమున లక్ష్మణుండు వెను • కం జన దాఁటఁగ రాని దయ్యమై
తటుకున వచ్చి యెట్టెదుట • దంభముతోఁ గనుపట్టె లేటియున్.

ఉ॥ తమ్ముఁనె కాంచు జింకఁ గని • తామరసాక్షిరో! దీనిఁ జూడఁ జి
త్తమ్మున నేమియుం బలుక • దాకొన దియ్యది మంచిదే యనెన్
వమ్మగు నేమి? దేవతల • ప్రార్థనముల్ సుకృతమ్ము శేష త
ల్పమ్మున వీడి యీధరణి • భారము దీర్పఁ దలంచి వచ్చుటల్.

ఉ॥ దీనిని చూడు వత్స! యిది • దేనిని పోలును? ధాత్రి సాటియే
గానము ముత్తెమట్లు రద • కాంతులు గ్రమ్మను శాద్వలంబుపై
నానెడు నాల్క మించు దొర • యం దగు దేహము మేలి హేమముం
బోనిది మచ్చలెన్నఁ గవి • పుత్త్రిని జోతి నధః.రించెడిన్.

ఉ॥ ఈ హరిణంబుఁ దేటి కను • నింతులకున్ మగవారి కింత సం
దేహము లేక దెందములు • దీనిపయిం జొరఁ బాఱకుండునే?
యీహలు లేచుచున్ మీఁదుత • లేపున దీపముఁ జేరు పోలికన్
దోహలమందుచున్ వడిగ • దొర్లుచుఁ బోవుచునుంటఁ జూచితే?

ఆ॥ అన్నయట్లు పలుక • నాజింకఁ గని యిది, మంచిగాపిటంచు • మదినెఱింగి
తమ్ముడఁనియె దీనఁ • దనరు ఫలంబేమి?, మరలి చనుట యింక • మంచిదనుచు.

ఉ॥ లక్ష్మణుఁడిట్లు పల్క శుభ • లక్షణ • లక్షిత సీత, యాలస
ల్లక్ష్మము లొప్పు లేడిఁ బది • లంబుగఁ బట్టి యొసంగఁ జాప జి
తప్రక్ష్మలతైన సోదరుల • భావము లూర నయోధ్య కేగి యో
సూక్ష్మమతీ! విరామముల • సొంపుగ నాడుకొనంగ నిమ్మగున్

చ॥ అపుడు నగల్లె తెత్తు నను • నంత విచక్షణ దక్షుఁడైన ల
క్ష్మణుఁడు వచించు నార్య! యది • కద్బర మాయ దురాత్ములైన యా

దనుజులు ధర్మపద్ధతిని • తప్పి చరింతురు వారి మాయలం
దున నిదియొక్కటౌ ననుచుఁ • దుద్దుడుదం దెలియం గలారనన్.

ఉ॥ తమ్ముఁడ కన్న యిట్టులను • దైత్యుల మాయయే యైన మేలె యొ
క్కమ్మనఁ గూల్చి వచ్చెద ర • యమ్మనఁ బట్టిన ధర్మముల్ ఫలం
బిమ్మగఁ గాంచు నిక్కమగు • నేణమయేని గ్రహించితెత్తు రెం
టమ్మన కేమియుం జెడుగు • డాయదు నీవ తలంపుమా యనన్.

ఉ॥ దీనిని మున్నుగాఁ బనిపి • దీని పిఱుందన నిల్చువారలే
వైనము వారలో? మఱియు • వారల మోసములెట్టివో? యిటుల్
దీనిని పంప నేలొకొ? మ • దిం దలపోయ నశక్యమయ్యె దు
ర్మానులు రోయు వేఁట కొల • మాత్రమ కాదగచాట్ల నిప్పునాన్.

చ॥ దనుజులు వైరులంచు బహు • ధర్మవిదూరులె యంచు మాయలం
బనుపడు వారలంచుఁ దగఁ • బల్కుచుఁ బూను వ్రతంబు వీడఁగా
జనములు నవ్వరేమి? యిటు • జంకుట త్వత్కుల ధర్మమేమి? యె
ట్లును బలు మంచిదే యగు వి • లోలత యేలని రాముఁ డాడఁగన్.

ఉ॥ దాసిన కార్యముల్ తగ నె • దంప విచారణచేసి చేఁత యు
ద్భాసిత రీతిఁ గ్రాలు రఘు • వర్య! మృగంబు పిఱుంద నెట్టి రా
కాసులు నున్న మచ్చర వి • ఘర్షణ వారల యుక్కడంతు నా
శ్వాసము చెందుఁ డీ పది ని • జంబగు లేడియయేని తెచ్చెదన్

మ॥ అని సౌమిత్రి వచించుచుండ నమృతం • బంగారఁగా నొల్కు ప
ల్కున ముద్దైతగు చిల్కవోలె పదరెం • గొంచించుచున్ సీత యి
ట్లనుమానించుచుఁ బట్టి యీయరు గదా • యంచుల్ వినోదంబుతోఁ
గనులన్ ముత్తెము లట్లు బాష్పకణముల్ • గ్రమ్మన్ వెసన్ గ్రమ్మతిల్.

## రాముఁడు మాయా హరిణము వెంట నంటుట.

చ॥ చనవు మెయిం గనల్గొనుచు • సాగిన జానకిఁ గాంచి రాఘవుం
డను ననుజా! కురంగమిదు • డయ్యలివేఱికి నేనె నెవ్వఁడిం
గొని చనుదెంతు నిచ్చటనె • కూరిమితో సతిఁ గాచియుండు మం
చు నిశిత బాణముల్ ధనువు • సొంపుగఁ దాల్చచనెన్ వడిన్ వడిన్.

తే॥ మున్ను వేల్మిఁ జెఱుపవచ్చు • మువ్వురందు, తప్పిపోయిన • వాఁడని తలఁతు వీని
మొగిని గమనింపు మని కేలు • మోడ్చి పలికి, లక్ష్మణుఁడు పర్ణశాల వె • ల్పలనె నిల్చె.

తే॥ అరసి లక్ష్మణుఁ దనుమాట • నాదరముసఁ, గొనక జానకి కై కొన్న • కోపమునకు
మందహాసంబు గొని మటు • మాయజింక, వెంబడించెను సుందర • వీరవరుఁడు

ఉ॥ నేలను నిల్చుఁ జింక మెడ • నిక్కఁ జివుక్కున దాఁటు నింగికిన్
లీలను నేలఁ ద్రవ్వు ఖుర • లించిన తీరున దూఁకు డాయుఁ బెన్
గాలి మనంబు వేగిరము • గాఁ జను రీతికిఁ గ్రొత్తమార్గము
వ్వేళను నేర్పుఁ బాదములు • పేరురముం దగులంగఁ బర్విడున్

ఉ॥ చాఁచుచు నెత్తి యూపుపస • జాలముఁ గొల్చిన పాదసత్త్వమున్
బూఁచి వచింప వేటొకయ • పూర్వభగోళము గల్గునేమి? తా
నేఁచఁగ నేగినంత వడి • నేగెను జింకయు నింతమాత్రమే
తోఁచును నాఁటి వేగమున • తోరము దెల్ప నశక్యమేరికిన్

తే॥ కొండలెక్కు మేఘంబులఁ • గ్రుంకువెంటఁ, జేర దూరమేగును తాను • సింప డాయు
నిలిచి యున్నట్టె కనఁబడి • తొలఁగిపోవు, పైఁడి యూప వేళ్యల మని • పాఱు నట్లు.

చ॥ తొడఁగిన దొడ్డపై తుదిని • దోఁచిన దొక్కటి యయ్యె మున్నె త
మ్ముఁడు తలపోసినట్టి పలఁ • పుల్ తగ నామదిఁ దోఁచియున్న ని
క్కడ కటురాను పట్టిగ్రమఁ • గర్బుర మాయలఁ జిక్కి పొందితిన్
దడయఁగ నేలొకో పదము • దం బొనరించుట మేలు చూడఁగన్.

తే॥ వీఁడు మాయావి చేపడు • వాఁగు వాఁడు, చెండుటే కార్యమనుచు సం • సిద్ధుఁడైన
రాము మదినెఱిఁగిన వాఁడు • రిలుముమీఱ, మాయ నెగిరెను నింగిని • మఱుఁగుపడఁగ

తే॥ రాముఁడు క్షణమందె చ • క్రంబు విహి న, మోఘశరమొండు సంధించి • మోసగాఁడు
పోవుచోటికి వెంటాడి • పొరిగొనుమని, నారి తెగ దీసి పఱపె న • న్నారసంబు,

తే॥ ఆ శరంబు మాయావి ఱొ • మ్మంటఁ దాఁకెఁ, దాఁకె నంత నోరు దెఱచి • దశదిశలను
దాఁటివస లక్ష్మణా, యంచుఁ • పద్ద యఱచి, ప్రాణములుపోవి మారీచుఁ • డవనిఁగూలె

తే॥ నిక్కువపు రూపమునసోఁకు • నీల్గఁగాంచి, తమ్ముఁడలఁచియాతఁడు జాణ • తారకముగ
వెంట వచ్చునతఁడు ప్రోడ•వేయునేల . ప్రాణసముఁడు నేర్పరి యని • హర్ష మొందె.

తే॥ దిక్కులదరంగ నఱచుచుఁ • దీవి కూలు, నీచ దేహంబు నచ్చట • నిలిచిచూచి
మున్ను కౌశికు యాగంబు • పూనిచెఱుప, నరుగుదెంచు మారీచుఁడే • యని యెఱింగె

తే॥ శరముతొమ్మనవాటఁగ • శ్రమమునొంది, మడియుచోదైత్యుఁడొనరించు • మాయ యఁ
నాదు కంఠంబుతో లక్ష్మ • ణాయటంచుఁ, బిలిచె నదివిని మైథిలి • కలఁగునేమొ?.

చ॥ పిలుపు నిజంబు కాదనుచు • పీఱిఁడి దైత్యుఁడు పల్కెనంచు మున్
దెలివిని నాకు హెచ్చరిక • దెల్పిన తమ్ముఁడెఱింగి తెల్పఁగా

నలమట వీడి సీత హృద • యంబున నూఱట చెంది నంతఁ దాఁ
దెలిసి యొకింత నెమ్మదిగ • దించె మదిన్ రఘురాముఁ డయ్యెడన్.

ఉ॥ చావఁదలంచి వచ్చిన ని • శాచరుఁ డీతఁడు గాఁడు మద్గళా
రావము వోలెఁ గూసిన వి • రావము నందు తలంచిచూడ న
ర్థావహ మొండుఁ గల్గ నది • యారట పెట్టక మున్నె వెన్కకుం
బోవుట మంచిదంచుఁ దల • పోసి బిరానఁ జనంగఁ గ్రమ్మఱెన్.

## 8. జటాయు మోక్షణ పటలము. (225)

తే॥ రాముఁడట్లు మారీచుని • నామ మడఁచి, వడిగ వచ్చుచు నుండంగఁ • బర్ణశాల
నున్న సీత యా దీనంపు • టులివు విన్న, యంత దిగులునఁ గళవళ • మందె మదిని.

తే॥ పరభృతంబు వృక్షము నుండి • పదరి జాటి, పడిన వడువునఁ బుడమిని • పడుచులేచి
కడుపు చెయివెట్టి కలఁచిన • కరణిగాఁగ, విభ్రమము నొంది విలపించె • వివిధగతుల

తే॥ ఏల యజ్ఞానమునఁ బట్టి • యిమ్మటంచుఁ, గోరి యీ జీవితము చెడఁ • గొట్టికొంటి
నేదిగతి• ముందు వెన్కల • నెఱుఁగనైతి, యేమి చెడుగుల దుర్విధి • యేఁచఁగలదొ•

### లక్ష్మణుఁడు సీతకు ధైర్యవాక్కులాడుట.

తే॥ వత్స! లక్ష్మణా! సద్గుణ • వార్ధియైన, యన్న రాక్షసమాయచే • నలుగుల పడి
పృథివిఁ దూలె ననుచు నీవు • వినియు నింక, నిచటనే నిలుచుంటివా • యెడఁదఁగొనక

తే॥ అనుడు లక్ష్మణుఁ డిట్లను • నమ్మ! యాజ, గమున రాముని కంటెను • కడిమియందు
మించు శూరు లున్నారని • యెంచఁదగునె?, ఆఁడుఁదనమున నిరయ కి • ట్లంటి గాక.

క॥ జలధులు నిఖిల జగంబులు, కులశైలము లొక్కటగుచు • ఘోరరణంబున్
జలిపిన రాఘవు బలముం, జలియింపం జేయఁ గలదె? • చింతింపు మెదన్

క॥ పుడమియు జలమును వహ్నియుఁ, గడలును రాఘవుఁడు కినిసి • గాంచెనయేనిన్
పొడియై నీఱై పోవవె? తడఁబడి యెవ్వనిగ నితనిఁ • దలఁచితొ తెలియన్.

తే॥ రక్కసునకోడి కష్టించి • రామదేవుఁ, డిట్లు పిలుచునె? పిలిచెనే • నెల్లజగము
లట్టె విలువునఁ గూలవె? యఖిల జీవు, లింతికే మండి మాఁడి ల • యింప కున్నె?

॥ పలుమాట లేల? దివి భువిఁ, గలవారు నుతింయ గఁళ • కంయ ధనువు ము
క్కలుగా విఱిచిన శ్యామల, జలద నిభు నెదుర్చువారు • జగములఁ గలరే?

॥ పఱిమే నొవ్వియుఁ బొరయఁడు, హతుఁడగుటా? త్రిభువనంబు • లడఁగవు రవియున్
గళిదప్పఁ డువధి యింకదు, మతిమాలిన చింత నొంది • మఱుఁగం దగునే?

తే॥ ధర్మమున్నది దివ్యులు ♦ తనియఁగలరు, వచ్చు రాముఁడు వైళంబ ♦ వంత వలదు
వచ్చునపుడు రక్కసుఁడట్లు ♦ చావుకేఁక, వైచెనదివిని విశ్రాంతి ♦ పడకు తల్లి!

తే॥ అనుడు మిక్కిలి కోపంబు ♦ నడలు మనము, చంపి నంతటి వేదన ♦ చండ దృష్టి
గలుగు సీత నీ విచ్చట ♦ నిలిచి యుంట, నీతిమంతము గాదని ♦ నెట్టనాడి.

చ॥ ఒకపరి మైత్రి గూర్చికొను ♦ నుత్తము లక్కట ప్రాణమైన దాఁ
పక యిడువారు చేపచెడి ♦ ప్రార్థన చేసిన యన్న కోరికం
గని విని చేయు తమ్ముఁడిఁకఁ ♦ గల్గునె నీవలె? దిక్కులేదు నా
యకుని తలంచుచుఁగా విడుచు ♦ నగ్నిని జీవము లిప్పుడే వడిఁగా.

మ॥ అని చెందమ్మి వనమ్ముకై వెదకు చ ♦ క్రాంగిం బలెం గిన్కమై
ఘన ధూమావృత దావ వహ్ని వెడకం ♦ గాంతరముం గూర్చి యే
గిన వైదేహికి నడ్డు వచ్చి వినతిం ♦ గేల్మోడ్చి యోతల్లిరో!
నను మన్నింపు చలంబు వీడుమని దై ♦ న్యం బంది తా నిట్లనుఁగా

## లక్ష్మణుఁడు రాముని కడకేఁగుట

చ॥ మరణము నొందనేల? యను ♦ మానము మానుము నీ ప్రతిజ్ఞకున్
వెలితు మహేమియుం బలుక ♦ వెక్కసముం ద్యజియించి యిందెయే
మలక వసింపుమమ్మ బలు ♦ మాయవిధిం గెలువం గలారమే?
యిరవున నిల్మ సేవకుఁడ ♦ నేగుచునుంటిఁ గలంక వీడుమా.

తే॥ అదను గని యాపదలు వచ్చు ♦ నమ్మ! మీరు, ప్రభునియాజ్ఞ నాక్షేపించి ♦ పలుకుచుండ
వెనుక నూయి ముందుగ గోయి ♦ విధమునొంది, మదిఁదపించెదననియేగె ♦ ముదలనొంది

చ॥ నిలిచితి నేని యాయమయు ♦ నిప్పున దూఁకక మానదంచు నె
వెలలితినేని రక్షణము ♦ వీడ మహాపద చెందు నంచుఁ జం
చలుఁడయి కార్యమేది యని ♦ వాసల పల్కుల కుల్కి యిట్లు రాఁ
దలఁచుట పాడియే యనఁ బ ♦ దంపడి యేమని యందు నన్నకున్.

ఉ॥ పాడి దలంతు నేని యది ♦ భావ్యము భవ్యముగాని, యామె యె
గ్గాడి మరించు దీనిఁ గను ♦ లారఁగఁ గాంచుట కంటెఁ గర్మచే
నాడికఁ బుట్టి కొండలము ♦ నంటెడు వెంగలి యే మహేమియుం
జూడక యిచ్చటున్ వదలి ♦ నూటిగ నేగుటె చాల యుక్తమౌ

ఉ॥ ఏనిదె పోవుచుంటి నెది ♦ యేని యవాంత్రము వచ్చునేని స
మ్మానిత రీతి నెల్లపుడు ♦ మమ్ము భరించు జటాయు వున్న వాఁ
డానిక వచ్చి త్రోవఁ గలఁ ♦ డంచును పల్మఱు వెన్కఁ జూచుచుఁగా
బానలు వొందుచుం జనె ను ♦ పర్వుల పుణ్యము పండు పండఁగఁగా.

## రావణుఁడు తాపసియై సీత కడకు వచ్చుట

తే॥ అదను గనిపెట్టి యున్న ద • శాస్యుఁడంత, వంచనముసేయమదినెంచి • వాటమగు త్రి
దండమును నారలును జడల్ • దాల్చి జనము, గౌరవించు తాపసి రూపు • కడఁకనందె.

తే॥ కార్శ్యమును మేని బడలిక • గానఁబడఁగఁ, బాట గతిదప్పక నటించు • వాని మాడ్కి
వీణవంటి కంఠంబున • వేదములను, స్వరము చెడక పల్కుచు ఘన • సరణి తోడ.

చ॥ మెలఁకువఁ బూలు విప్పుగతి • మెల్లన నేగెడు వాఁడు భూమిఁ జి
చ్చలమిన చోటఁ గాలిడిన • యంగముతో నడతెంచు వాఁడు న
గ్గలమగు వేపనం బలము • కాళ్ల కరంబులు గల్గువాఁడు ని
య్యెల జరయున్ వరించుటకు • నేవపడం దగునట్టి వృద్ధతన్.

చ॥ నలినముఁ బోలు శేట నయ • నమ్ములు కచ్ఛపలీల నింద్రియ
మ్ముల యడకమ్ము గూనియును • పొల్పగు జన్నిదమొప్ప నొక్క వి
శ్చల ముని వోలె దైత్యకుల • జాల్మఁ డరుంధతిఁ బోలు జానకీ
నిలయము చేరె దిక్కులను • నిక్కి కనుంగొని మాటి మాటికిన్.

క॥ త్రిదశులను భ్రమయునట్లుగఁ, ద్రిదండి యయి రావణుఁడు వి • దేహతనయ యు
న్న దెసంగని వాతడఁబడఁ, గదిసి యెవరు మీరలనుచుఁ • గడఁకం బలుకన్

క॥ సొదగు యోగి యితండని, మోదంబున జనకరాజ • పుత్త్రి యతని న
త్యాదరమునఁ గాంచుచు సుమ్ము, దూదార వచోభిరామ • యొద్దకు వచ్చెన్.

తే॥ మదజలము గాఱునట్లు చె • ప్మటలు గ్రమ్మఁ, దొలఁకువలపున దైత్యుండు • తొడవుతొడవు
ప్రణుతి పాత్ర పతివ్రతా • రత్నమైన, సీత సుషిమ సుషమ కనుల్ • చెలఁగఁగాంచె.

తే॥ వ్యసనమున వాడియున్నయా • వామ ముఖము, సురసతీ ముఖంబులకంటె • సొబగు మెఱపె
తన్ముఖమ్మును చూచి నం • తనె సురారి, రెట్టలుప్పొంగి కృశియించె • హృదికలంగె

ఉ॥ వాని కనుంగవల్ విరిసి • పార్థివ పుత్త్రి మనోజ్ఞకంబునం
దాని ప్రసూన మాక్షికము • నాని మదంబునఁ గ్రాలుపుష్పలి
ట్ప్రేణివలెన్ బ్రమోదమును • చెందిన వంతు వచింపనేల? య
వ్వాని మనంబువోలె ముద • పాన్నిధి మున్గి తరింప వక్షముల్.

మ॥ వనజావాసము వీడి భూస్థలికి దీ • వ్యద్రత్న సంకాశమౌ
తను వల్లిం గొని వచ్చినట్టి చెలి సౌం • దర్యంబు వీక్షింప నా
కను లొక్కొర్వది నాలునేఁ తలఁపఁ బా • క ద్వేషి చందాన నా
కనిమేషస్థితి నొందు నేత్రములు వే • యైనం గనంజాలునే?

క॥ ఈరమణి తోడి సుఖ మను, వారిధి దాఁటంగఁ దపము • ఫలముగ నజుచేఁ
గూరిన యాయువు చాలునె, సౌరగు మూఁడు నఱ కోటి • సంవత్సరముల్?

చ॥ దివిజులు దిఙ్మహీశులు త • దీయసతుల్ రజనీ చరావళుల్
శవిలి భయంబునం గొలువఁ • దక్కఁక యీ భువన త్రయంబు ని
య్యుపతియె యేల నేనును న • యోక్షుల నీయమ కాలఁ చూప గౌ
రపమునఁ జేయఁ బూనుదు శి • రంబున జీవితమే తరింపఁగన్

ఉ॥ వేదన తోడి క్లేశమున • వెల్వెలయైన ముఖస్థ శోభయే
యీదివి భూమి గెల్చునన • నించు స్మితంబునఁ గూడియున్నచోఁ
బైదలి మోము గోము గరు • వం బది యెంతగ నొప్పునోకదా?
సోదెగ నీచెలిం దెలుపు • సోదరి కిత్తు సమస్త రాజ్యమున్

తే॥ ఇట్లు లవినీతుఁడై మది • నెంచుచున్న, కపటమునిఁగాంచినంత నే • కనులవారిఁ
జేతఁదుడిచికొనుచు దయ • సేయుఁడనుచు, సీత యుపచారచాతుర్య వ • చించియంత.

తే॥ దాసినం గని యామె వే • త్రాసనంబు • చూపికూర్చుండుఁడన మాయ • తాపసుండు
జింకతోలు త్రిదండంబు • చెంతనునిచి, కొంచుఁ గేశవాయంచును • గూరుచుండె

క॥ వృక్షములు గిరులు మృగములు, పక్షులు భయమంది వడఁకి • పాఱె దెసల కా
రాక్షస వరుఁగాంచి హరిణు, లక్షమమునఁజెదరి కొదరి • యదరుచుఁ దొలఁగెన్.

తే॥ ఎవరిదీపర్ణశాల? మీ • రెవ్వరిందు, గలుగు మునియెవ్వఁడనిదశ • కంఠుఁ డడుగ
నితఁడు వెరవిఁడి యని సీత • యెదఁదలంచి, పలుకఁదొడఁగె మహాదర • భావమెసఁగ.

తే॥ ఓమహాత్మక! కోసల • భూమిపాలు, ద రథేశసుతుఁడు పిన • తల్లికోర్కె
వెలయఁదమ్ము తోనీయట • వీస్థలమునఁ, గొలుచున్నాఁడతని నెఱుం • గుదురె? యనిన.

తే॥ ఔసవును వినియున్నాఁడ • నరయ లేదు, గంగ ప్రవహించు కోసలఁ • గంటి నొకట
నదియగు కాల పడవిలో • జరపుచున్న, వారు మీరేరి తనయలో • పలుక వలతు

చ॥ అనుకపటంపు మౌనికి ధ • రాత్మజ యిట్లను మౌనిచంద్రమా!
అనఘులు సచ్చరిత్రులు మ • హాత్ములు మీవలెనున్న పుణ్యులౌ
మునులయెడన్ మహాదరము • పూను విదేహ ధరాతలేంద్రుఁడౌ
జనకుని ప్రేమపుత్త్రి నను • జానకియందురు రాముగేహినిన్

తే॥ కఠినపథముల నడచి వి • క్లమమునొంది, నారు వృద్ధులు ద్వంద్వముల్ • పాఱఁదోలఁ
దలఁచినారలు మీరలే • స్థలమునుండి, వచ్చినారన నిట్లురా • వణుఁడుపలికె

సీ॥ బ్రాయనలవికాని • వరతనుభాసితుఁ, డింద్రునకింద్రుండు • సాంద్రయశుఁడు
బ్రహ్మవంశజుఁడును • స్వర్గమ్ముతోడ స, మస్తలోకములేలు • మహితగుణుఁడు

వేదవేది రజత • పృధ్వీధరము లీలc, బెల్లగించిన భుజ • భీమ బలుcడు
చౌదంతి కొమ్ముల • కుమునకుc దొడవుగాc, బోరుసల్పిన లోక • వీరవరుcడు

తే॥ అతనివీథి వాకిట నిల్చి • నట్టివారు, వేలుపులెనుమ్మి యారాము • వీధులందు
తరువులెల్లను కల్పక • తరువులెయగుc, గాపురం బాబ్రహ్మనిది లం • కాపురంబు.

సీ॥ పాదంబులొత్తుట • పాదరక్షలు మోచు, పనులు రంభాదుల • పనులె ముగుద!
అడపకత్తెలు పాcప • పడcతుకల్ కాళంజి, గొనువారు గంధర్వ • వనజముఖులు
తన చండశాసన • మున భానుచంద్రముల్, శీలముల్ మార్పడc • జెలcగువారు
ఇంద్రాది దేవత • లెల్లరు తనయింటి, కావలివారంద్రయి • క్రాలువారు

తే॥ నాకమునయందు భూమిని • నాగమందు, గల యపూర్వ వస్తువులెల్లc•గడమలేక
యుండునాతని నగరాన • యువతి! యేమి, చెప్పనేర్తును? విభవ మొ • చ్చెంబులేదు.

తే॥ అజుcడొసంగిన యమితాయు • వందువాcడు, భవునిచేc జంద్రహాసంబు • పడసినాcడు
గ్రహములంబట్టి చెఱలోనc • గట్టినాcడు, సకలసద్గుణవంతుండు • సన్నుతాంగి!.

తే॥ మంచినడవడి గలవాcడు • మహితధర్మ, శాస్త్రవేత్త కందర్పుcడా • శ్చర్య పడcగc
దగిన పరువంబుగలవాcడు • తప్పులెన్ని, యజహరాదుల గౌరవ • మడcచువాcడు.

తే॥ సకలలోకంబు లcదున్న • సన్నుతాంగు, లెందఱో వాని దయగోరి • యెలయువారు
వారికోర్కులcదాc ద్రోచి • వైచి యొక్క, కాంతcబ్రేమించి యామెకై • కాచినాcడు.

తే॥ అతcడు పాలించు లంకయం • దానమెయిని, కొంతకాలంబు వసియింపc • గోరి చాల
కాలముండి క్రమ్మఱినాcడ • లోలనేత్ర!, యనుచుcబల్కి యాయమ తలం • పరయcదలcచె

తే॥ తనువె భారమంచుcదలంచు • తాపసేంద్ర!, తపసు లార్యులు కోరంగc • దగనిహింస
సేయు నసురల నగర వ•సించుచుండ, వలసినంత కారణమేమి • వచ్చెమీకు?.

చ॥ వనముల నిష్ఠమైcదపము • వారక చేసెడివారి చెంతలన్
మొనసి వసింప కార్యజన • పూజ్యులు రాజులు గల్గు చోటులన్
పనివి వహించి యుండ కిటు • దర్పితులై బహు దుష్టకార్యముల్
పొనరుచు క్రూరదానవ స • మూహములోc బనియేమినిల్వcగc?

చ॥ అనివచియించు సీతcగని • యంతటcగ్గె తపమౌని యిట్లు ప
ల్కెను మృగనేత్ర! యీ రసము • క్రూరపథంబునc బోక హింసయున్
దనుజుల యొద్దనుండునని • తప్పుగ నెంచితి నిర్జరాళికం
బెను దనుజుల్ దురాత్ములె? క • డిందిగ యోగ్యులు మమ్ముబోంట్లకున్.

ఉ॥ రావణుcడిట్లు పల్క రఘు • రాముని దేవి తపోఽధికుల్ సదా
పావనులైన వారు చెడు • పాపులc జేరcగ రాదయంచు మా

యావులు రక్కసుల్ తలఁచి • నట్టి స్వరూపము దాల్చువారలన్
భావన లేవి దొట నటు • పల్కఁగ నించుక వాఁడు కొంకుచున్

ఉ॥ ఈయమ శంకనొందెనని • యెంచుచు దానిని కప్పి పుచ్చఁగాఁ
దోయము మార్చి యిట్టులనుఁ • దోయజనేత్ర! బలిష్ఠులైన దై
తేయులు వారికిం బరులు • దెప్పరముల్ పొనరింపకున్నచో
న్యాయము దప్పి లోకముల • కాపద గూర్పరు వారలెన్నఁడున్

ఉ॥ ఆమె మనస్స్థిరత్వము సు • రారి యెఱుంగఁగఁ గోరి యిట్లనన్
భూమిజ యిట్లు పల్కె రఘు • ముఖ్యుఁడు కానల నున్న యప్పుడే
యా మనుజాశనావళుల • నందఱఁబట్టి వధించుఁ బిమ్మటన్
క్షేమము చిత్తశాంతి ముని • సింహులు చెందెద రెల్ల కాలమున్

ఉ॥ నావుడు రావణుండు సుమ • నస్విని! మర్త్యులు రాక్షసాళికిన్
హావడి గూర్చి కూల్తురన • నౌర! శశంబు గజంబుఁ జంపదే?
వావిరి జింక చంపదె య • వారణ ధీరత వారణ ద్విషున్
జీవచెడ౯ ఖగాధిపుని • జిహ్మగముల్ వధియింపవే యనన్

తే॥ క్రూర ఖర దూషణాదుల • బారిసమరు టీరు వినియుండ లేదొ ము • నీంద్ర! యనియె
నాఁడు రామునకైన బ • న్నంబు దలఁచి వెదలు దుఃఖాశ్రుకణముఁ • దుడిచికొనుచు

ఉ॥ పుణ్యచరిత్ర! కూరులయి • పొల్చు దినేశకులే ధర్మనై
పుణ్యముచేత లంకఁగల • పుణ్యజనుల్ నశియింప నక్షజి
ద్గణ్యులు సజ్జనుల్ శ్రమలు • దక్కిసుఖించుట నేఁట రేపటన్
నాణ్యము గాఁగ జూచెదరు • న్యాయ మధర్మ తతిన్ జయింపదే?

తే॥ చక్కెరయుఁ దేనె యమృతంబు • చిక్కఁగలిపి నట్లు సీత పల్కఁగ ముద • మందుచున్న
యసుర మనుజుల గెలిచెప • రన్నమాట విన సహింపక గరువంపుఁ • గినుకఁ దాల్చె

చ॥ కినియుచు నొక్క మానవుని • కిన్ సరిగాక సమర్థులైన య
ద్దనుజుల గూలిసిందువు గ • దా? దశకంధరు బాహు మారుతం
బున నరుఁడొక్క యూఁపునను • బూరుగ దూదియుఁ బోలె దూలి యే
వననిధిఁ గూలువాఁడొ కన • వచ్చును రేపె పరాంగనామణీ!

చ॥ చదురులు పల్కుచున్న వన • జాత ముఖి! దశకంఠు వేనిగా
నెదఁ దలపోసి యిట్లు వచి • యించితి మేరువు నెత్తఁ గోరినన్
త్రిదివము గూలఁద్రోయఁగ స • రిత్పతి సంక్షుభితంబుసేయఁగనౌ
ర్వదహను నార్పివేయఁగ ధ • రందలక్రిందుగఁ జేయ నర్హుఁడౌ

ఉ॥ ఈ కరణిన్ వచించు దమ • జేశ్వరుతో నృపపుత్త్రి పల్కినా
నాకవిరోధిఁ బట్టి చర • ణంబులఁ గట్టి యడంచి బందిలో
నూకిన కార్తవీర్యుని య • నూన భుజంబులు వేయి, నొక్క రెం
డే కరముల్ గలట్టి మను • జేంద్ర విరోధియె త్రుంచి వేయఁడే॥

## రావణుఁడు కోపముతో నిజరూపము చూపుట.

ఉ॥ జానకి యిట్లు పల్కఁగ ని • శాచరు కన్నుల విస్ఫులింగముల్
వానగఁ జింపె దిక్కులకుఁ • బర్వ భుజంబు లొకళ్లొకళ్ళతో
నూనిక మోఁదె బొమ్మిక మఁ • బుప్పరమంటెఁ బయోధిరావ మ
ట్లానికఁ బండ్లుగీఁటె ముని • యాకృతిపోయెఁ జలంబు పెంపునన్.

చ॥ ఇతఁడు తపస్విగాఁడనుచు • నెంచి కలంక వహించి యెవ్వఁడీ
మతకరియంచు లోన లవ • మాత్ర మెఱుంగ నశక్యమైన దు
స్థితి గొనునట్లు క్రూర విష • జిహ్మగ మల్క ఫణంబు విప్పి వి
ద్రుతగతిఁ బైఁబడం దొడఁగు • తోపిక నొప్పె దశాస్యుఁడయ్యెడన్.

మ॥ అశిరోధుండు యముండుపట్టుకొన స • హ్యంబెంతయున్ లేని జీ
వునిచందంబునఁ గంప మొంది సురిఁగెన్ • భూపుత్త్రియచ్ఛోభయం
బును పోకార్పఁగ నేరిఁ బిల్చు? నుడువం • బోనేమీ గల్గున్? వెసం
బొసరింపంగ మతేమియుండును? తలం • పుంబోవ దేత్రోవకున్

మ॥ అమరేంద్రాదులు సేవలంజలుపు బా • హాశక్తిసామర్థ్యముల్
తమినీక్షింపుమ యంచు రావణుఁడు దై • త్యశ్రేణి నిందించె దే
ప్రమదారత్నము గాన మానితిఁగృపా • భావంబునం గానిచో
దెమలంబట్టి కఱుక్కనం గొఱికి యేఁ • దిందున్ రుషాశాంతికిన్.

మ॥ జలజాతేక్షణ! వంగ కెచ్చిరిలు శీ • ర్షశ్రేణిపై శీర్షకం
బుల చందంబున భక్తిపూర్వకముగాఁ • బొంకంబుగాఁ దాల్తు వే
ల్పుల చెల్వల్ భవదీయ పాదరజముల్ • పోకార్చి సేవింప రం
జిలి పద్నాలుగు లోకముల్ సుఖముమైఁ • జెన్నారఁ బాలింపుమా!.

## సీత రావణుం బదరుట.

శా॥ ఆమాట ల్విని శ్రోత్రయుగ్మకముఁ దా • హస్తంబులన్ మూసి కాం
తామత్తల్లిక సీత, కుర్కరము పూ • తంబౌ హవిర్భాగముం
బ్రేమం గోరిన రీతిఁ బుణ్యచరితన్ • శ్రీరాము సత్పత్ని న
న్నేమన్నావుర దుష్ట! బాలిశ! నరా • శీ! ద్రోహి!, పోఁగాలమే?.

చ॥ తృణమున నిల్చి కంకణము • తీరగు ప్రాణము కోన మాసమై
గుణవతులైన వారు కుల • కోమల ధర్మములం దృజింతురే!
ఫణులను బోలు రాఘవుని • బాణకదంబము నీ శిరంబులం
గణఁకను త్రుంచుమున్నె బ్రదు • కం దలఁ తేని తొలంగి పొఱుమా?.

తే॥ అనుడు రావణుఁడనుఁ గకు• బ్బ స్తిరదన, కిణము లొప్పు వక్షమున నీ • యనుఁడు వైచు
విశిఖములు కొండపైఁ బడు • విరుల కరణి, వ్యర్థములు గాక యేమేని • ఫలముగనునె?

ఉ॥ ఓ వరవర్ణి నీ! మదనుఁ • డుత్కట బాధలఁ బెట్టుచుండె నా
యావి కృశింపసాగె-నిఁకఁ • బ్రాణము నీయఱచేత నిల్చె న
న్నేవిధినైనఁ గావు మమ • రేశ్వర కాంతలకున్ దురాసదం
బై విలసిల్లు భోగముల • నందుమ యంచుఁ బదంబులం బడెౕ

తే॥ కత్తిపోటుచేఁ బ్రాణము • గ్గలఁగినట్లు. తనువునుండి జీవంబులు • తరలినట్టు
లార్తినొంది జానకి లక్ష్మ • ణా! యటంచు. నార్య! యంచు నా క్రందింప•నయ్యదనున

## రావణుఁడు సీతం గొనిపోవుట.

తే॥ తొంటి శాపంబుఁ దలఁచి యా • దుష్టదైత్యుఁ, డురుభుజంబుల నానేల • నొక్క పెట్టఁ
బెల్లగించి సీతను దాఁటి • వెడల నీక, చేతులంజుట్టి రథమునఁ • జేర్చి పెట్టె

తే॥ ఉరముపై భయమునఁజేతు • లుంచుకొనిన, చెలువతన ప్రాణములఁగూడఁ • దెలియదయ్యె
మట్టితో నామె మెఱుపులో • మఱిఁగిపోయె. రావణుం డాకసంబున • రథముఁదోలె.

తే॥ అనలమునఁబడ్డపూఁగొమ్మ • యట్లుసీత, వాడుఁదపియించు దొరలును • వనటఁగుందుఁ
దుశ్శిపడి లేచుఁగాలు సేఁతులు విదుర్చు. దిక్కులం జూచు వెఱగొందు • దిక్కుమాలి

సీ॥ ధర్మమా! యీ యాప • దను తొలఁగింపవే. యిదిగదా రక్షింప • నదను నీకుఁ
బావనివమ్మ గో • దావరీ దేవి! నీ, వేని దెల్పఁగదె యి • య్యెడరు పతికి
వనదై వతములార! వందనములు మీకు, నాస్థితిఁ దెల్పరే • నావిభునకు
శైలంబులార! వృక్షములార! పిక మయూ, రములార! మృగ నిక • రంబులార!

తే॥ మొగుళులార! మీకును దయ • పుట్టదేమి?. ఓదినేశ: భవత్కులా • మోదకరుఁడు
రామునకు నీవు చెప్పఁగా • రాదె? నీకు, లమున కియ్యేది యొక్క క • లంకు కాదె?

శా॥ అన్నా! లక్ష్మణ! యాపదల్ తలఁగ రా • వన్నా! గురు జ్ఞాన సం
పన్నా! నిన్నవినీతిమైఁ బనిపితిన్ • మన్నించి వేరమ్మ యా
పన్నన్ రక్షణ సేయుభార మది నీ • పై నుండెఁగా దే? దురా
త్మన్నీచుం బరిమార్పరే భరత శ • త్రుఘ్నుల్ కృపాపూర్ణులై.

మ॥ భ్రమ గొన్నావు కలంగినావు సుడియన్ • వత్సంబు గోల్పోయి దుః
ఖమునం గుందెడు ధేనువట్లు మిగులం • గ్రందిల్లుచున్నావు గౌ
తమి! నీనెంజిలి చూడఁగా నెఱుఁగు మ • త్ప్రాణేశుతో నీదు పు
ణ్యము పెంపారఁగ గొబ్బునం దెలుపవే • నాదుష్ట కర్మస్థితిన్.

తే॥ ఎదురుపడు దొనలార! మృ • గేంద్రులార!, పక్షిలార! యీభూమితో • వచ్చినన్ను
పట్టి విరువది చేతులు • పది శిరములు, బ్రుంగి ధరఁబడఁ గాంచి న • వ్వదురు గాక.

మ॥ ఉరుదుఃఖంబున సీత యిట్టులన నా • యుష్కాలముం గోలుపో
వు రహిం బూనిన రావణుండు తరుణీ! పూఁబోణి! సింగారి! చ
క్కెర బొమ్మా! నను మానవుల్ గదిసి యా • క్షేపించి గెల్పొంది విన్
వెరవారన్ విడిపించు వారె? యని న • వ్వెంజేతులం దట్టుచున్.

ఉ॥ రావణు పల్కులన్ వినిన • రాముని దేవి దురాత్మ! నీచ! మా
యావి మృగంబుఁ బంపి భవ • దంతకు రాఘవు దవ్వుచేసియే
యావల నన్ను పట్టితి కు • లాపశదా! యని సేయు తెంపు నీ
కావిధినున్నఁదొలకు శ • తాంగము నిల్పుము మాటలేటికిన్?.

ఉ॥ వీరుఁడవై శివేవి పెను • భీతిని దొంగిలనేల? పంద! నీ
వారలు రోషమూనఁగ భ • వత్సహజాతకు ముక్కుగోసి యా
తీరున వారిఁజంపు రణ • ధీరులు కానన వీథియందె యు
న్నారని గాక కుర్కుర గు • ణంబున వచ్చితివేల? బాలిశా!

చ॥ అనుటయు దైత్యుఁడిట్టులను • నబ్జముఖీ! విను నన్ను బోఁటికిన్
మనుజులతోడ నాహవము • మానక చేసిన నిందరాదె? రు
ద్రుని ఘనశైలమెత్తిన యు • దూధ భుజంబులు దొడ్డ న్యూనతం
జెనయవె? వంచనమ్మె తగు • చెద్దము మానవపాశి పట్టునన్.

చ॥ అది విని సీత నిర్దయత • నావడి చేసెడి క్రూరదైత్య దు
ర్మదులకు శత్రుసమ్ముఖము • క్రాలుట లోపము వారితోడ బె
ట్టిదపు దురంబు సేఁతయు బి • దెంబగు సాధ్వుల మోసగించు టొ
ప్పిద మగు నిట్టిపాపులకు వీర్యముమాన మనంగ నున్నదే?

జటాయువు రావణు నడ్డగించుట

సీ॥ అనునంత దుష్టాత్మ! యరిగెద వెచటికి?, నిలుమంచుఁ గాలార్ద • నినద లీల
గర్జించి నిప్పులు • గ్రక్కుకన్నులతోడఁ, బిడుగులఁ బోలిన • నుడులతోడ
మేరుగిరియె లేచి • మింటఁదిరుగుచున్న, దాయననొప్పు కా • యంబుతోడ
శంపాభమౌ బలి • ష్ఠంపుఁ జంచువుతోడఁ, గొండ కొండయు దాఁకి • పిండిగాఁగ

తే॥ జలధి చెలరేఁగి భూమితోఁ • గలసిపోవ, విలయవాయువుకైవడి, వీచుచున్న
పక్షమారుతమునఁదరు • వ్రజము విఱుగ, గరుడుఁడని పుట్టలనుభుజం • గములుచొరఁగ

తే॥ పెక్కులఁ బుట్టిన కరువలి, నక్కజముగఁబైకి నెగసి • యాకసమందుం
గ్రిక్కిఱిసి తూలు మృగములు, మక్కొక్కఁగ మిన్ను మిగుల • మాఱుపు చెందన్

క॥ అరదమున ధరణిజఁ గొని, యురవడి నెటకేగు వాఁడ • వుండు నిలుము నీ
గరువం బడఁచెద నీచా!, తెరువు గలదెనీకుఁ బోవఁ • దేఁకువ• ననుచున్.

తే॥ ద్రోహిరావణుఁ దలలతోఁ • ద్రుంపనెంచి, యెట్టికొఱలఁ మస్తక • మెట్టుకుతిక
తోడఁగైలాసగిరి వోలె • దొడ్డ తెల్ల, తనువుతోడ జటాయు వ • త్తఱివి వచ్చె.

క॥ దిట్టా! భయపడకు మనుచు, నడ్డముగా నిలిచి యసుర • నదలించుచు వీఁ
దెట్టెతనమూని తాఁకం, దొడ్డాడెన యనుచు సుంత • యూరట పడుచున్.

చ॥ చెడితివి నీవు బంధులకుఁ • జేటొనరించితి దైత్యనాథ! యీ
పుడమి కుమారి సీత నిటు • మోఱకు బుద్ధిని పట్టి తెచ్చితే?
విడువుము పీడవే నసువు • వీడుట నిక్కముజీవితంబు గో
రెడుజనులెవ్వరేనియుఁ జ • రింతురె యిట్టి కుమార్గవర్తనన్?,

క॥ ఖరదూషణాది వీరుల, దురమునఁ బొలియించి పితర • దొరకుఁ దనియ విం
దురవుగఁ బెట్టఁగ నాతఁడు, నరుసముతోఁ గొనుట యెఱుఁగ • వా! యవివేకీ!

తే॥ కోప ఘూర్ణిత మదకరి • కొప్పరింప, శిలలు వైవఁ దలంచితే? చెనఁటి! పక్షి
యేడ? నను చంపువేడని • యెంచితేమి? విసము మ్రింగియు బ్రదుకును • విశ్వసింతే?

క॥ హరిణములు పులులఁ గాంచిన, కరణిని దిక్పతులు జనులు • కాలుందురు దా
శరథులఁ జూచుచు నుందురు, వెరవేఁకివి నీవు బ్రతుకు • వెంటయుఁ గలదే?

క॥ సుతసోదర సహితముగాఁ హతమౌటకు వింతకంటె • నధికమగు దురా
గతమును కలదే? కుగతికిఁ, గతమిది, యేజన్మమునకుఁ • గలుగవు శుభముల్.

క॥ ఈ నరవరులు త్రిమూర్తుల, లో నగ్రియు లాత్మలగుట • లోకములో నె
వ్వానికిఁ బోల్పఁగ నగు? నిది, మానుగఁ దెలియంగలేక • మత్తుఁడవైతే?

క॥ అమరులఁ గాచిన నరవరు, కొమరుఁడు కోదండ ధరుఁడు • కోర్తల నడరన్
సమయింపఁ దప్పదీ వీ, యమ విడి పరుగిడుము నేనె • యతనిం జేర్తున్.

తే॥ బ్రహ్మయిచ్చినయాయువు • భర్గుఁడొసఁగు, ఖడ్గమునుమాయమంత్రముల్ • కడఁకలెల్ల
సత్యవంతు డౌ రాఘవు • సాయకములు, బయలువెదలు నంతవఱకె • బలయుతముల

తే॥ అనిన విని దైత్యవల్లభుఁ • డౌడు గఱచి, కనుల నిప్పు లురలఁ జూచి • గ్రద్ద! నీవు
త్రోవపీడుము కాదేని • యీవు పొగడు, వారిఁ జూపుము తలగిల్లి • వైచువాఁడ

తే॥ శిత శరాళిచే పీఁతొమ్మ • చీల్చికొనక • త్వరగఁ దొలఁగుము నిలువకు • తప్తలోహ
గత జలం బది క్రక్కినఁ • గ్రక్కుఁగాక, యీ మధురవాణి మీకడ • కింకరాదు

తే॥ ఇట్టు లసుర పల్కఁగఁ గోప • మినుమడించి, సీతఁగనిజటాయువు, తల్లి! చెనఁటియొడలు
ఖండ తుండ ములగు, మహా • క్రందనంబు వలదు మనవారు లేరను • వంత వలదు

ఉ॥ కన్నుల నీరు ముత్యముల • కైవడి ఱొమ్మునఁ జింద నేడ్వకో
యన్నుల రాశి! యూఱడిలి • యూరయు తాలఫలౌఘ గుచ్ఛము
ట్లున్న శిరంబులీ పది స • మున్నతి మున్నితఁడేలు దిక్కులన్
ఛిన్నములై విరూపములఁ • ర్చి పడం గనుమంచు నుగ్రుఁడై

చ॥ ఎఱకల బిల్మిచేఁ బశని • యేపునఁ జావఁ బడంగఁ ద్రోసి య
మ్మొఱకు తలల్ ధరం బదియ • మోఁదుచు ముక్కునఁ గన్నులూడ్పఁగాఁ
బెఱుగు జటాయు వయ్యసుర • వీరుని తేరిని వీఁపెక్కెముల్
విఱుగఁగఁ దన్ని తొల్దొలుత • వేల్పుల దీవన లందె నత్తఱిన్

ఉ॥ ఎన్నఁడు నిట్టి భంగ మెరి • యింపని దైత్యమనంబు దిగ్గనన్
గన్నులు క్రాఁగు లక్కవలెఁ • గట్టెబు పొందగ సర్వలోకముల్
క్రన్నన సంచలింప దశ • కంధరుఁ డయ్యెడ బిట్టు నవ్వుచుం
బన్నుగ వంచె భ్రూకుటిల • బంధము తోఁ దనదొడ్డచాపమున్

ఉ॥ క్రొన్నెలరేకవంటి నెఱి • కోఱల దైత్యుడు చిత్తజల్లు గాఁ
బన్నిన బాణజాలములఁ • బక్షమరుత్తునఁ గొన్ని దూల్చుచుం
గొన్నిటి గోళ్ళతోఁ జఱచెఁ • గొన్నియముండును భీతి నొందఁగా
భిన్నము చేసెఁ జంచువుల • భీమబలుండు జటాయు వయ్యెడన్

ఉ॥ క్రూర భుజంగమంబులను గొబ్బునఁ గైకొన వచ్చు పక్షి రా
డ్ధీరుని వోలె గృధ్రపతి • డీకొని రక్కసి బొమ్మిడీకముల్
శేరిపయిం బడం బద హ • తిం దొరలించుచుఁ గర్ణ కుండలాల్
పేరిమి డుల్చి పైకెగిరె • వెక్కసమంది సురారి చూడఁగన్

చ॥ దనుజుఁడు పట్టరాని బెడి • దంబగు కోపముఁతో బదేను మా
ర్గణముల నాజటాయువు ను • రమ్మున నాటఁగఁ నేసి వెండియున్
ఘన విశిఖమ్ములం దనువు • గాసిలఁ జేయ ఖగేంద్రుఁడప్డు క్రుం
గెన యని వేలుపుల్ మిగుల • ఖేదమునొందిరి పిచ్చలించుచున్

ఉ॥ గాయములందునుండి వడిఁ • గాఱెడి శోణిత ధారతోఁడ న
త్యాయత సత్త్వయుక్తుఁడు జ • టాయువు చూడఁగ మున్ ఖరాద్యసృ

క్రోయధి నుండి తెల్లనగు • తోయదమొండు ద్రవంబు గొంచు నా
ప్యాయముగా జడిం గురియు • వైనము దోచె నభస్స్థలంబునన్

ఉ॥ ఊరుపు పుచ్చి కోపమున • నుగ్రముఖుండయి పక్షిఱేఁడు దే
వారి భుజంబు లిర్వది న • ఖావళి ఒక్కుచు దూట ముక్కుతో
వారక చెక్కలం జఱచి • వాని మహోజ్జ్వల తారహార యు
క్స్ఫార విశాల వక్షమునఁ • బ్రబ్బిన కంకట మంటఁ జించఁగన్

చ॥ ఎరియుచు రావణుఁడు కర • నేషు శతంబునఁ బక్షిఁజేని పే
రురమును గాఁడ నేసిన ముహూర్తము లోనసె చింతనొందు ని
ర్జరులను మోదిలం బులుఁగు • రాయఁడు దైత్యుని వింటినారి ని
బ్బరమునఁ బట్టి లాగెఁ దన • బంధుర చంచువుతో బలంబునన్

తే॥ ఈశుతోడఁ గైలాసంబు • నెత్తినట్టి, లావరి శరాసనము నోట • లాగి కొంచు
నింద్ర ధనువుతోఁ దెల్లని • సాంద్ర మేఘ మట్లు మెఱసె నాతని బల • మరయ వశమె?

మ॥ పెను చూపింపని వక్షముం బొరయు నా • వేగంటిఁ బాణంగఁ జే
సిన దైత్యేంద్రుని విల్లు శూలిధనువుం • జెంతాడు శ్రీరామ చం
ద్రునకుం ధండ్రిగ నొప్పి యాజికి సుమి • త్రుండైన పక్షీంద్రుఁడు
క్కున నోటంగొని కాళ్ళతో విఱిచె ది క్కుల్ చూచి మేల్మేలనన్

తే॥ లోక కంటకుఁడైన యా • నాకవైరి, విల్లు విఱుగుట గని కోప • వివశుఁడగుచుఁ
ద్రిపుర సంహారకారకో • ద్దీప్తమైన, శరమువంటి శూలమువైచె • జగము వడఁక

ఉ॥ శూలము తన్ను చంపునని • స్రుక్కక సీడజ రాజు కాంచి నా
మేలిమిఁ జూడుమంచుఁ గడు • మేకొని వక్షముతోడఁ దాఁకఁగా
వేలుపు లద్ది సాహసము • విస్మయ మంచు వచించి చేతులన్
బోలఁగఁ దట్టి కేఁకలిడి • బోరన నార్చిరి మెచ్చులాడుచున్

చ॥ వెల చెలియింటికిం జనిన • పేదను పోలె, సతీమతల్లి వ
ర్తిలని గృహంబునం దతిధి • బృందమువోలెఁ, బరేశు చింతయే
చెలువము గాఁగ నొప్పు ముని • సింహునిగాంచిన యొప్పులాఁడి చూ
పుల వలెఁ గ్రమ్మఱిల్లె వ • డిఁ బోయిన రావణు శూలమత్తఱిన్

చ॥ కినుకను వేఱుకైదువును • కేలఁ గొనం గమకించు నంతలో
నన రథచోదకుం జదిపి • నాలుక వెల్వడ మూర్ఛ మూర్చి రా
వణుఁడు కలంగి వందురఁగ • వాని ముఖంబులు రక్తసిక్తమై
మునుఁగఁగ లక్ష్యముంచి తగు • పోఁడిమితోఁ బయివైచె నాతలన్

తే॥ విసరికొట్టిన తలఁగాంచి • వెక్కసమగు, బిడియమును కక్కసంబును • పెనఁగొనంగ
రావణుఁడు దండమునఁ బిషి • రాజుఁగొట్టె, బర్వతమువలె భువిఁ బడెఁ • బక్కితేఁడు

తే॥ అంతఁ దీక్ష్ణదృష్టియును వె • న్నంటఁ జాల నట్టి వేగంబుతోఁ దానె • స్యందనంబు
నడపుకొని పోయె దానవ • నాయకుండు సీత పుంటిపై నిప్పంచు • చెన్నునొంద

ఉ॥ ప్రుక్కడి దైత్యుఁ దేగుటయు • భూమిజ దుఃఖముఁగాంచి చెచ్చెరన్
విక్కమహోద్ధతిన్ మెఱవ • ణించుచు శోకము నొంద కిమ్మః యీ
టక్కరిఁ గూల్త్రు నేనని జ • టాయువు దివ్యుల సంతసంబుతో
నెక్కడ కెగెదించు దను • జేంద్రు శతాంగము నడ్డగించుచున్.

చ॥ బలమున వాని దండమును • పట్టి తటాలున లాగివైచి వా
జులఁ దన శాత చంచువున • జొత్తిలఁ బొడ్చి వధించె జీవితం
బులు గొను మృత్యుదేవతయు • బూరిభయంబునఁ గేలుదోయి కం
పిలఁ గొనియెన్ రథం బవల • భిన్నము చేసెఁ దదున్నతుల్ సెడన్

చ॥ అరదము నుగ్గుచేసి భుజ • హంకృతి మాపి శరాసనంబులన్
గరముల నూడ్చివైచి రణ • కర్మము సాగక చేసి లోభులం
బొరసిన ద్రవ్యరాశి క్రియఁ • బొల్చు నిషంగములన్ సరాలునన్
గెరలిపడంగ లాగికొని • కీడ్పడఁ జేసె జటాయు వాతనిన్

చ॥ చలమున వాని శీర్షములఁ • జక్కగ మోఁది శ్రమంబు గూర్చి బా
హులపయి ఱొమ్ముపై శిత న • ఖోత్కర శక్తిని ఱక్కిముక్కుతో
నలిగులిసేయ దైత్యకుం • నాధుఁడు స్రుక్కుచు విహ్వలించుచున్
నిలిచినఁ గాంచి నీబలము • నేరుపు నింతయె యంచుఁ గేరఁగన్

క॥ ఉగ్రుఁడయి దైత్యనాధుఁడు దగ్రత హరుఁడిచ్చు చంద్ర • హాసము పెలుచన్
వ్యగ్రమతిఁ బూని వానిని నిగ్రహమున నేసె విబుధ • నివహము బెదరన్

చ॥ అపజయ మెట్టిదో యెఱుఁగ • నట్టి జటాయువు వృద్ధుఁడౌట మో
క్షపదము చేరువాఁడగుటఁ • గ్రవ్య భుగీశ్వర చంద్రహాస సం
టపన మహోగ్రఁలన్ బలము • దక్కిసురేంద్రుని వజ్రధారచే
విపుల గరుచ్ఛిదం బయిన • పృథ్వీ ధరం బనఁ గూలె నేలపై

చ॥ ఎఱకలు త్రుంగి మేదిని ప • యింబడె గృధ్రవిభుండు దేవతల్
పరుగులు వాఱి రెచ్చటికొ • పార్థివనందన దిక్కులేనిదై
సురిఁగె నటంచుఁ జిత్తముల • శోకము నందిరి తాపసేంద్రు ల
త్తఱిని సువర్ణ పుష్పములు • దందడి రాలెన్ కంకరాజుపై

ఉ॥ రావణుఁడార్చె వాగుర • నొలంగి దగుల్కొను లేడివోలె భూ
దేవి తనూజ విహ్వలత • దీల్పడె మూర్చె వడంకె నొచ్చె దుః
ఖావిల తప్తచిత్తయయి • యాదరువౌ కొమ్మ త్రుంగిపోవఁగాఁ
దీవియవోలె నేలఁబడి • తేలక మిక్కిలి కుంది దూపిలెన్

తే॥ నన్నుకాపాడ వచ్చిన, నయగుణుండు గృధ్రరాజు గతించె ధి • క్కెవ్వరింక
ననుచు జానకి మిక్కిలి • యంగలార్చె నాదరువువోవ వెల్లువ • నలయుభంగి

చ॥ తెలివి యొకింతలేక గుణ • ధీయుతు లక్ష్మణు పల్కులన్నిరా
కలనముచేసి కోపమునఁ • గాఱులు పల్కితి సాగనంప త
త్ఫల మిపు డొందితిం దవిలి బాసటయైన జటాయు వీల్గెఁగా
వల మది యెట్టి కష్టముల • పాల్పడఁ జేయునొ? యేమిచేయుదున్?

చ॥ శరణ మొసంగి రక్షణము • సల్పఁగ వచ్చిన యీతఁ డీల్గుటా?
నరకమునొందఁగాఁ దగిన • నంజుడుదిండి జయంబు నొందుటా?
కరకరిపాపమే జయము • గాంచునె? ధర్మమె యోడిపోవునే?
ధరఁగల సర్వశాస్త్రములు • దబ్బఱలే? సుకృతంబు వ్యర్థమే?

ఉ॥ కొంకక యేను బేలనయి • కోరుఁట బట్టియె దూరమేగు వీ
రాంకవరేణ్యులార! తగు • న్యాయపథంబున నేగువారికిం
బొంకపు మార్గదర్శియగు • పూతచరిత్రుఁడు తండ్రికంటె ని
ర్వంకలఁ బ్రీతిశాలి యగు • పక్షివరేణ్యుని చూడరండిటన్

తే॥ క్రొత్తడి తనంబు చెడఁగొట్టు • కొనకయుంట నాప్రయత్నమేయైన వి • న్ననువుసెందు
రాముకోదండమునకు నే • రాణఁజొచ్చు వంశమునకిబ్బె నాచేటు • వలనఁబ్రబ్బు

తే॥ కొడుకుకై ప్రాణములువీడు • కోసలేంద్ర! మైత్రికై ప్రాణములువీడు • మానవీయు
నజ్జటాయువు దివిఁబరి • ష్వంగసుఖము గొనఁగఁబిలిచితే? తాని న్ను • గూడవచ్చె

తే॥ ఒలిలుచిటులుండు జానకి • నెఱకలుతెగి పడు జటాయువుఁగని చేరి • పయిని మట్టి
పెల్లతో నంసమున నామెఁ • బెట్టికొనుచు గగనవీథిని పఱచె నా • క్రవ్యభుజుఁడు

తే॥ చెనఁటి యాకాశ వీధిని • శీఘ్రగతిని జరుఁగ గన్నులు మనసును • గిరగిరమని
తిరుగ ధృతిచెడి • దిక్కులు • తెలియకుండ తన్నుమఱచి జానకిచేష్ట • దప్పియుండె

తే॥ పిదప నిసుమంత తెప్పఱి • విహగవిభుఁడు మింటిదెసఁగాంచ దైత్యుండు • మిగులవేగ
మునను జనకనందిని గొని • పోవుటరసి మనసు తపియింపఁగుంది యి • ట్లనియెఁ దుదకు.

క॥ లేరైరి తనయు లిచ్చట రారైరి ధరాత్మజాత • రావడి యుడుపం
గ్రూరాత్ముల రాకాసుల నేరీతిం గూల్చువారొ? • యెయ్యది తెరువో?

క॥ రాకాసులఁ బరిమార్పఁగఁ, గాకుత్స్థులు జగతి బద్ధ • కంకణులగుచో
నీకరణితగునె సీతకుఁ, గైకేయి కడంక యెంత • గావించెఁ దుదిన్?

క॥ పరమాత్ముఁడె రాఘవుఁడై • పరఁగె నసురవధము సేయఁ • బాపాత్ముఁడు కా
వరమున నిటువంచించెను, పురుషోత్తము వెదుట నిలువఁ బొలియకయున్నే?

క॥ నాముద్దుల తనయుఁడు శ్రీ, రాముఁడు రక్కసులనెల్లఁ • గ్రచ్చఱఁజంపున్
దామరస జన్మశాపము, చే మానిని దాఁక వెఱచుఁ • జెనటి యసురయున్.

క॥ జనకజ రక్కసి చెఱఁబడె, నని సేయ గఁ దగినతెక్క • లఱువుళ్లైనన్
వనితారత్న సతీత్వం, బనునెఱకలు త్రుంగవనుచు • నారట ముడిగెన్

ఉ॥ సత్తువ తగ్గి తెక్కలును • జాఱఁగ సీత చెఱన్ వదల్పలే
కత్తిన సిగ్గు రాఘవుల • యందలి ప్రేమయు మానసంబులోఁ
గ్రొత్తలువాఱ నిద్రగొను • కోపునఁ గన్నులు మూసియుండె లో
నుత్తలపాటుతోఁ దెలివి • యొయ్యనఁ దప్పకయుండె ధీరతన్.

తే॥ త్వరగఁ బదిలంబుగాఁగ రా • వణుఁడుజనక, తనయఁగొనిపోయియామెను • తాఁకవెఱచి
విసమువంటి రాకాసుల • పిండునడుమఁ. బందినుంచె నశోకికా • వనమునందు.

## లక్ష్మణుఁడు రాముఁ గానఁబోవుట

తే॥ అచట హేమకురంగంబు • నంటిపోవు, ననఘురాఘవు క్షేమంబు • సరసిరాఁగ
సీతయంపిన సౌమిత్రి • చెలువునింక, నరయఁబోదము వారల • మఱవనగునె?

క॥ జానకి నొంటిగ విడుచుట, చే నేమగునో యటన్న • చింతను సీతా
జాని విడఁ గాంతి మాసిన, యానగరము వీడు • భరతు నంగమతోడన్.

క॥ సాగరమున నౌకంబలె, వేగిరమున నడచి రాము • వీక్షించి మన
స్సాగరము నడఁచి పరిము, త్సాగరమున మునిఁగెఁ గనులు • తనివిం బొందెన్.

క॥ తడఁబడి భీతిం బొరయఁగ, నెఱమగు మారీచురవము • నెఱుఁగమి వలనన్
బడమి తనయ బెగడెదునని, యెడఁదఁ దలఁచు రాముఁ డలని • నెఱుంగనుచున్.

ఉ॥ దేహముతోడ మానసముఁ • దీఱని విక్లమమంది వచ్చె సం
దేహముతోడ మానసముఁ • దీఱని విక్లమమందు నాకడన్
మోహముతోడ మానసము మూర్ఛిలఁ దొంచఱ పెట్టి పంపవై
దేహియె కారణంబగు వి • ధిం దొలఁగింప జనుల్ సమర్థులే?

చ॥ అని తలపోయు చున్న తన • యన్నను డాసి నమస్కరింపఁగా
ననుజుని కౌగిలించుకొని • యత్తరపాటున వచ్చు టేలనన్

వినుటకు వింతయైన ధ్వని • వీనులఁ జేరఁగ నుమ్మలించి మ
జ్జనని భయంబు నొందెఁ బలు • చందములన్ దగవూఁది పల్కినన్

ఉ॥ నీవరశక్తి ధైర్యముల • నేనెఱిఁగింప వినంగ నొల్ల కే
పోవక యుందువేని పడి • పోయెదఁ జిచ్చున నంచుఁ గానలో
దావముఁ గూర్చి పోవునెడ • ధర్మము కాదని యందు నిల్వలే
కీపగ నామెఁ గావ మది • నెంచితి సంచనుజుండు పల్కఁగన్.

ఉ॥ చావఁగనున్నఁ దప్పునొకో? • సంకటముల్ దొలఁగంగ నూఁకు నే
ర్పెవిధి లేని దక్కటః వి • హీనమతిం బడరె న్నిజంబుగాఁ
గావలి లేనిచో నెడరు • గల్గును వచ్చిన యాపదావళుల్
పోపవు పేలు సేయుటకుఁ • బూనిన సోఁకుల తంత్ర మియ్యదో.

ఉ॥ నీయెడఁ దప్పులేదు గుణ • నీరధిః ధీ రహితాత్మ సీత నీ
వాయెడఁ బల్కఁ బల్కిల న • నాదృతి చేసెను నేఁదలంచి న
ల్లేయది పూని నన్ జెఱచె • నే యని యెన్నఁడు నేని డెంద మ
త్యాయతమై కలంకమతి • నందని రాముఁడు కుందె నెమ్మదిన్.

ఉ॥ కాలము త్రోపఁగా ఫలము • గల్గదు జానకిఁ గాంచు పిమ్మటన్
దూలును చింత వెతొకట • దోరదయంచు వచించి క్రంవరన్
జాలగ దవ్వు నారసము • చందమున న్నడతెంచి లోల్వ
క్రాలక సీతయుండిన ప • హావనమున్ వరిసించి యయ్యెడన్.

## శ్రీ రాముఁడు సీతలేమికిఁ జింతిలుట

ఉ॥ శ్రీరఘువీర శేఖరుఁడు • చింతను పర్ణకుటీరమందు కాం
తారమునందు నెచ్చటను • ధారణి కన్యక జాడ గాన క
ట్లూరక బ్రమ్మపడ న్నిలిచె • నొత్తిలి కాయము జీవువీడి ని
స్సారత నొంది పిమ్మటను • సంకట మందుచు రోయు కైవడిన్.

ఉ॥ జీవితవాంఛపై విసుగు • చెందిన రాఘవ సార్వభౌముఁడ
ద్దేవిని కానమి న్నిలిచె • దివ్యనిధిం డనకంట డాఁపఁగాఁ
జేవిడఁ జోరుఁడొక్కరుఁడు • చేరి ధరాస్థలిఁ గెల్లగించి కొం
పో వెతనొంది దిగ్భ్రమము • పొందె యలంగెడు దీనుకైవడిన్.

చ॥ తిరుగఁగఁ జొచ్చె భూమియు న • దీనదముల్ కడు సంచలించె సా
గరములు ఘూర్ణిలెన్ గిరులు • క్రక్కదలెన్ దొలివేల్పు కన్నులుం
దిరిగెను సూర్యచంద్రులును • దిక్కులు త్రోవలఁ దప్పినారు శ్రీ
వరుఁడు తపింప నెయ్యది ధ్రు • వంబుగ నిల్వఁగఁ జాలుఁ జెప్పుమా?॥

శా॥ కోపంబూనునొ పాడిపైఁ దనదయం • గోపించునో? పాపముం
గోపంబారఁగఁ జూచునో? త్రిదశులం • గోపించునో? మౌనులం
గోపస్ఫూర్తిని గాంచునో? శ్రుతులపైఁ • గోపించునో? వేనిపై
గోపంబూనునొ? యేమియౌనొ? యనుచుం • గుందెన్ జగజ్జాలముల్.

చ॥ సకలము డిందె లోకవిభు • చక్కని గర్వము సొచ్చువేళలోఁ
గకవికచెంది లోకములు • క్రన్న విపర్యయ మొందు కైవడిన్
సకల జగచ్ఛరణ్య గుణ • జాలుని రాము మనంబు వేఁగఁగా
మెకములు కొండలుం జనము • మేదిని శోకము చెందె దుఃఖమున్.

ఉ॥ కోపము కేరి చక్రము ది • గంబడి పోయినదారి యియ్యెడన్
గాంచుము దేవిఁ దాఁక భయ • కంపితుఁడై భువిఁ బెల్లగించుటల్
కాంచఁగరాదు కార్యమిటఁ • గాడ్పడి యజ్ఞులపోల్కినిల్చినన్
కాంచఁగ నౌను వారు దపు • గాఁ జను ముందని లక్ష్మణుండనన్.

## రామలక్ష్మణులు సీతను వెదకుచుఁబోవుట

చ॥ సరియని రామచంద్రుఁడును • చయ్యన నాయుధముల్ ధరించి పెం
దెరువును పట్టి ప్రాఁకు లవ • నీధరము ల్నెలఁగంగ వేగమై
సరదము భూమిమీఁదఁ జని • నంతకు దుర్గమ కాననస్థలిన్
దరియుచు దాఁటుచుం గడఁక • తక్కక యేగె ననుంగుఁదమ్ముతో.

చ॥ ధరణి శతాంగ చక్రముల • దారియు గుర్తులు తేలిపోయి యం
బరమున నేగినట్లు నడి • పాఱుటచే వ్రణమందు నీఁటె పో
టొరసిన లీలఁ దోఁపఁ గన • నోపుట కెయ్యది మార్గమంచు నం
బురుహవిలోచనుం డనఁ బ్రి • పూర్ణ గుణాంబుధి లక్ష్మణుండనున్.

శా॥ అన్నా! చూడుము కేరు దక్షిణదిశా • ప్రాంతానకుం బోయిన
ట్లెన్నంగాఁదగు నీశరంబు పొడవే • యీవ్యోమ మార్గంబు నీ
కన్నుల్ బాష్పము గార్చుచుండ నెదియుం • గాన్పించునే? పోదమీ
తెన్నుంబట్టి యుదంతముల్ తెలియనౌఁ • దెల్లంబుగా మీఁదటన్.

చ॥ అన నది యుక్తమంచు వసు • ధాధిప వర్యుఁడు తమ్ముతోడ యో
జనములు రెండు దాఁటిచని • చక్కటి నొక్కనగేంద్రమే ప్రభం
జనహతిఁ దల్లకిందులుగ • జాటినకైవడి పీఁచెక్కె మొం
డనువుగ ధారణిం బడుట • యల్లనఁ గాంచెను సంశయించుచున్.

చ॥ కని జనకాత్మజాతకయి • కయ్యము గల్గిన దియ్యెడన్ శరం
బున దనుజాళితో విబుధ • ముఖ్యులకంచుఁ దలంచి తుంత మ

ర్ధనమునవాలు బ్రీలఁగని • తద్దయుఁ గన్నుల బాష్పబిందువుల్
తొనఁకఁగ లక్ష్మణుంగని సు • దుఃఖముతో రఘురాముఁ డిట్లనున్.

చ॥ అరయుము లక్ష్మణా! జనకుఁ • డైన జటాయు కరాళ తుండ దు
ర్భరహతిచేతఁ ద్రుంగినది • రాజిత సత్త్వముచే నెదుర్చు స
ప్పరమగుణాబ్ధి కేమిగతి • పాటిలెనో? యొకరుండు దేహమున్
వరలెను వార్ధకానఁ బలు • వత్సరముల్ కడద్రోచె నావుడున్

ఉ॥ మంచిదె తండ్రి చాల మతి • మంతుఁడు వృద్ధుడు సత్త్వశాలియున్
గ్రంచరనేగి యాతనిని • కాంతము వారల నడగించుచున్
మించి విశాటులం దునిమి • మేలుగ సీతచెఱన్ వదల్చు యో
చించుచు నిట్టులుంట సొగ • సే యని తమ్ముఁడు పల్కె రాముఁడున్.

ఉ॥ జాలమొనర్చు కేగుటయె • చక్కటియంచుఁ దలంచి భూమిపై
గాలివలెం జరించుచును • గాలిపటంబు క్రియన్ భజించి జం
ఘాలురు రామలక్ష్మణులు • కార్ముక మొక్కటి యింద్రచాపముం
బోలెఁ బయోధి వీచికయుఁ • బోలెఁదునుంగుట గాంచి రచ్చటన్.

ఉ॥ తమ్ముఁడ! కాంచితే ధనువు • ధారణిఁబడది దేవదానవుల్
క్రమ్మి పయోనిధిం జిలుకు • కవ్వపుఁగొండను బోలు సత్త్వుఁడుం
దమ్ములపొందుఁ బోలిన ప్ర • తాపము గల్గిన యజ్జటాయువే
యమ్మెయిఁ ద్రుంచెనంచు సమ • రావనిఁజూచుచుఁ బోయిరిద్దఱున్.

తే॥ మఱియుఁగొంతదూరముపోయి • మరలఁగనిరి, శూల మొక్కఁండునారాచ • జాలమున్న
తూణములు రెండు కొండల • తుండులట్లు, పడి విరాజిలు టాశ్చర్య • భరితులగుచు

తే॥ మఱియుఁ గొంతదూరముపోయి • వెఱఁగుగొలుప, సూర్యచంద్రులవరిక్కలు • సొరిదిఁజేరు
కవచమున్న బొందరమును • కానమెల్లఁ, గ్రమ్ముకొనఁ జీల్చి వైచుట • గాంచిరచటన్

తే॥ పవన జవన తురంగముల్ • పడినచోటు, సారథియుఁ దలదెగిపడి • చచ్చుతావు
వానియనుచరుల్ కెడసిన • తానములును, పంక్తికంఠుఁడు సోలిన • పట్టుగనిరి

తే॥ ప్రళయవేళను భానుబిం • బములు పెక్కు. లుర్విఁగూలిన కరణిఁ • తోర్నజ్వాలత్వ
శస్త్రకుండలములు విభూ • షణచయంబు, తెరలుటఁగని కేలువి • దిర్చికొనిరి.

తే॥ అంగదములు కుండలములు • హారరత్న, మకుటములు పెక్కులున్నవి • మనజనకుఁడు
వృద్ధుతోఁ బోర నిల్చిన • వీరవరులు, శరభములఁ బోలు పెక్కండ్ర • జాడ దోఁచె.

తే॥ శ్రీశుఁడిట్లన లక్ష్మణ • సింహమువిని, తలలుచేతులు పెక్కలై • తసరుకతన
తండ్రితో నవిసేసిన • దైత్యవరుఁడు, దశముఖుండని నామదిఁ • దలఁతు ననియె

తే॥ తమ్మపలుకులు నమ్మిడెం • దమ్మకనులు, నిప్పులురలంగఁ జూచుచు • నెగచినడచు
రఘువరుండు రుధిర సాగ • రమునఁదేలు, సురతరాద్రినాఁ జనుజటా • యువునుకాంచె.

## జటాయువుంగాంచి రాముఁడు చింతిలుట

ఉ॥ తత్తఱమంది రాఘవుఁడు • తామరతేకులవంటి కన్నులం
జొత్తిలు బాష్పముల్ తెరువు • చూపఁగ నీయక యడ్డువెట్టఁ దా
నొత్తిలి తండ్రికై వడిన • సూత్కర వైఖరి నొప్పు పక్షిరా
జోత్తముపైఁ బడెన్ భువి • లోఁప్రయమందొక యంజనాద్రినాన్

తే॥ గడియసేపు రాముఁడు సొమ్మ • గాంచియుండె, లక్ష్మణుండశ్రుమిశితజ • లంబుచల్ల
నలినదళలీల గల నయ • నములుదెఱచి, మెల్ల మెల్లన నిట్లని • పల్లటిల్లె

చ॥ పితరులఁ జంపుకొంచుఁ • బృధివీస్థలి నెవ్వఁడు తొల్లి నావలెన్
బ్రతికెను? మున్నె కన్నపితృ • పాదుని వీడితి మాకుఁగాఁగ నీ
తతి నసువుల్ త్యజించితివి • తండ్రివి నీవు విఁకేది దిక్కు? దు
ష్కృతినగు నేను మీయెడఁ బ • రేతవిఘుఁడనుగా జనించితిన్.

చ॥ జననిని బోలు ప్రేమగుణ • శాలివి భావి నెఱుంగ కిట్టులే
ననయము నొందితిన్ దెలివి • నందని జానకి కీడు ద్రోహివఁడో
డెనయక యొంటిమై నిడుమ • నెన్నక మిత్రఋణంబు దీర్చి తొ
క్కనికినిగాని నేనిఁక వ • గం గడియించుట యే ఫలంబుకై?.

ఉ॥ ఏనును తుచ్ఛజీవముల • నీఁగిమె యుందును చూడలేని స
న్మానుల దుఃఖముల్ దొలఁప • మాటయొసంగితిఁగాన జీవముల్
పూనినవాఁడ మానివలెఁ • బొల్చి సుకృత్యము చేయకున్నచో
నీ నరజన్మమున్ నిలుప • నిచ్ఛవహింప ధరాతలమ్మనన్

చ॥ తరుణి చెఱం దగుల్వడుట • ధర్మగరిష్ఠుని నిన్నుచంపు ము
ష్కరుఁ డసువూని యుండుటయు • గాదిలి తండ్రివి మమ్మువీడుటల్
మెర మెరనింప హస్తమున • మేరువువోలిన విల్లుపూని చి
త్తరువు క్రియం జలింపక వి • తంబటి నిల్చిన వాఁడఁజెల్ల రే!.

మ॥ ననుబోల్కిరితిగల్గు వారు గలరే • నాణెంబుగాఁ బ్రాకృతం
బను భోగించుచునున్న సీత గనుగో • నవ్యాహత స్థైర్యమున్
దనరంజూపి కృతార్థతంగొను మహా • త్మా! యొక్కనీముందు ని
న్ననుమానింపక కూల్చిపోవ నిఁక శౌ • ర్యం బుండియుం గాల్పనే?

తే॥ పలువిధంబుల నృపుఁడిట్లు • పనవిచిత్త వికలతం జెందెః సౌమిత్రి • వెగడుకుడిచె
నపుడు నుంత తెలివినొంది • యండజేంద్రుఁ, దూర్పుపుచ్చుచు నిర్వర • నొగినిగాంచె

తే॥ రామవులఁగని సమ్మద • శ్రములుగురియ తెగినతెక్కలు ప్రాణంబు • తివిరిసప్త
ఋషిసములఁ బొందుపోలికఁ • బొంగినింద • పాపిపైచితిననియల్లఁ • బలుకఁదొడఁగె

జటాయువు రామలక్ష్మణులకుఁ గర్మప్రభావము దెల్పుట

ఉ॥ పుణ్యచరిత్రులారః పొలి • వోవు శరీరము పీడ నుంటి నా
పుణ్యఫలంబునం దెలియఁ • బొందితి మిమ్మనిచేంఁ బిచ్చి యా
పుణ్య జనేశు శీర్షములఁ • బొడ్చిన ముక్కున భానువంశ రా
డ్గణ్యుల మస్తకంబుల రు • టంబుగ మూర్కొని వెంది యిట్లనుఱ

ఉ॥ వంచనచేత జానకికి • వచ్చె దొసంగని మున్నె యెంచితిఱ
జంచలనేత్ర నొంటి నుట • జంబున వీడితిరేఁ? యన్న ధ
ర్మాంచిత మ్మూర్తి లక్ష్మణుఁడు • హావడి కారణమెల్లఁ దేట గా
వించి వచింప నాతఁడును • వీనులు క్రుంగ వినంగ లేమికిన్

తే॥ వెంది మోమును గన రామ • విభుఁ దెఱంగి తెలుపఁ జెవికడ సౌమిత్రి • తెలియఁ బలుక
విని గ్రహించి కుమారులు • వెగడు పడక యుండునట్లు పల్కఁగ నెంచి • యొయ్యననియె

తే॥ క్రొత్తిగా నొక్క రెద్దియుఁ • గూర్పలేరు జన్మ సుఖ దుఃఖములు కర్మ • సంచయమునఁ
గలుగు నని యెఱుంగక యున్నఁ • గర్మములను, బద్ధిచే జయించుటయెట్లు • పొసఁగు జెపుఁడ

చ॥ విధి కృతిమంచు నెంచఁదగు • పీడలు గల్గినవేళ మానసం
బధికముగాఁగ నొప్పఁ దన • యక్కఱ మానుట ధీరధర్మమేః
బుధనుతమైన లోకమును • పోఁడిమి సృష్టి యొనర్చి నట్టి యా
విధికిని మస్తకం బొకటి • వీడఁగఁ జేసిన కర్మ మల్పమేః

మ॥ సుఖదుఃఖంబులు గల్గువేళ తొలఁగం • జూడంగ నౌనట్టిదేః
మఖ విద్వేషి కపాలియై తిరియఁగా • మార్పించె రాహు గ్రహ
ప్రఖరాశీ గ్రసితుల్ రవీందులు చెడుఱ • వర్తిల్లు ఋబ్రాంతు దీ
నిఖిలాండంబులు కర్మచేతఁ బొదమన్ • నిల్చున్ నశించున్ దుదిన్

క॥ చెడుగులు వచ్చుట తీఱుట పుడమి జనుని పూర్వ కర్మ • మున నగు నిక్కం
బిడుమల నింద్రుఁడు పెక్కులు కుడువఁడె తొలిః మీరు వినరె • గురుశాపముననః

ఆ॥ సాటిలేని యోధ • శంబరాసురునిచే నిర్జరాధిపుండు • నింద నొంద
నపుడు వానిఁ గూల్చె • నజు పట్టి మీతండ్రి కర్మవునన యిన్ని • గలుగుఁ జూవె.

ఉ॥ వీరవతంస! జానకిని వీడుటయున్ దనుజాళి ధర్మవున్
మీఱి చరించి త్రెంచుటయు • మిక్కిలి ఖేదము సంఘటించె నీ
ధారణి సజ్జనావళికి • దానిఁ దొలంపుము క్రూరదైత్యులన్
ధీరత సంహరింపుము క • దింపుము కీర్తిని నిల్పు ధర్మమున్.

ఉ॥ భూమిఁ బెకల్చి యెత్తి కొని • భూమిజఁ గైకొని పోవుదైత్యు నా
నేమముఁ జూపి పోరితిఁ దు • దిన్ దనుజేంద్రుఁడు శంభుఁ డిచ్చు ప్రో
ద్భీమ కరాసిచే జతను • వీసరవోవఁగ నిట్లు చేసె నా
కీ మరణార్తి గల్గినది • యిప్పుడె రాజకులావతంసమా!

## శ్రీరాముఁడు దివిజులపైఁ గినుకఁ గొనుట.

క॥ ఆమాటలు చెవిఁబడ శ్రీ, రాముని కనుదోయి రక్త • ధారలఁ గురిసెన్
భీమముగ భ్రుకుటి ముడివడె. ధూమముతో నగ్నిలేచెఁ • దొట్రిలె జగముల్.

చ॥ నిలుకడ దప్పె ధాత్రి ధరి • జీ ధరముల్ పెటిలెన్ దినేశ చం
ద్రులు గ్రహముల్ గతుల్ బెదియఁ • దోయజగర్భుఁడు లెక్కిడెన్ జగ
ద్వలయము నాకము స్వదఁకె • దిగ్గజముల్ బెదరెన్ సమస్తముం
దెలిసికొనెన్ రఘుప్రవరు • దీపిత సత్త్వపరాక్రమ స్థితుల్.

తే॥ ఎవరిపై వ్రాలునొక్కొ యీ • యీర్ష్యయనుచు, జగములెల్లను బెగడొంది • సంచలింపఁ
బొగయు నిప్పును వెలుపడ • భూరి భీక, రముగ నట్టహాసంబుతో • రాముఁ డనియె.

చ॥ తెలివి యొకింతలేని యొక • తెక్కలి దైత్యుఁడు నాసతీమణిన్
బలమునఁ గొంచుఁ బోవ నొక • పాటిగ మీరిటు గాఁగ నుంత భీ
తిలని దిశావృతంబు జగ • తీ తలముం గని యూరకున్న ది
వ్యులఁ బరిమార్తు నిప్డె కని • యూఅట నందుము తండ్రి! యీయెడన్.

ఉ॥ దిక్కులు రాల సూర్యుఁడును • వ్రీల నభస్సులి నిప్పుగ్రమ్మఁగా
నొక్కటఁ బంచ భూతములు • నుర్వి చరాచర జీవ కోటులున్
గ్రుక్క సమస్తలోకములు • చూర్ణముగా దిశలుం బగుల్లగా
నుక్కటి బ్రుంగుచుండఁగ స • ముత్సుకతన్ గను తండ్రి! యిత్తఱిన్.

చ॥ అని రఘుపుంగవుం డదర • నంబుజ మిత్త్రుఁడు మేఘ మండలం
బున నడఁగారె దిక్కరులు • పొక్కుచుఁ బాఱె జగంబులెల్ల జం
కెనయును బిమ్మటిం గొనిన • ఖేదము చెప్పఁగ నేల? దిట్ట ల
క్ష్మణుఁడును జంకెనన్న నుడి • చాలదొ? తక్కటి యేల పల్కఁగన్?.

## జటాయువు రామునకుఁ గర్తవ్యము దెలిపి ముక్తుఁడగుట

ఉ॥ రాఘవు కోప జృంభణ భ • రంబు జటాయువు గాంచి యిట్లనుఁ
బీ ఘనకోపమున్ విడుము • నిర్జరులున్ ముని చంద్రులున్ వరా
మోఘ భవద్బలంబునన • మోఱకు సోఁకుల పోరుసీఁగి దుః
ఖౌఘముఁం ద్యజింతురు దు • రాత్మల వేతొక రీతి దోర్తురే?

చ॥ అజుని వరంబుచే మదము • నంది దురాత్ము డు చేయు చేఁత ల
క్కజముగ నాయెడం దెలిసెఁ • గాదె? మతొక్కటి యేం చూపఁగన్?
భుజగులు వేల్పులు న్నరుఁ • పూజ్యుఁడు బ్రహ్మయు వానిసేవలన్
గుజగుజవోవ ధర్మవును • కోరి చరించెడు వారలుందురే?

ఉ॥ వైరులయొద్ద సేవకుం • వైఖరి స్త్రీలవలెం జరించుచున్
భూరి సుఖంబుం న్విడిచి • పొక్కుచుఁజావక వేల్పు లెల్లమున్
శ్రీరమణుండు పాల్కడలిఁ • జిక్కిన వేళ ననుగ్రహించి దే
వారుల నేమఱించుచు ద • యన్ సుధ యీయఁగ నుండి రింతకున్

ఉ॥ బాహు బలాఢ్యులార! వర • వర్ణినిఁ గానల నొంటి డించి మా
యా హరిణంబు వెంటఁ జని • యచ్చపు మీకుంగౌరవంబు సం
దాహ మొనర్చినార లది • తప్పక మీదగు తప్పగాక సం
దేహములేల? మానవులు • దెప్పిన వారల నేరమౌనొకో?

ఉ॥ కావునఁ గోప మందకుము • కాంత యరుంధతి వంటి సీత దుః
ఖావలిఁ బాపి వేలుపుల • యంగద క్రుంగఁగఁ బాడి వర్ధిన్
రావణుఁ గూల్చి లోకముల • రక్షణసేయుము యంచుఁబల్కి తా
పావిల మానసుండయి ద • యాళు జటాయువు మూసెఁగన్నులన్

మ॥ విహగ శ్రేష్ఠుని నీతి వాక్యముల నవ్వీరుండు శీర్షంబుపై
దహియించెన్ మను తండ్రి వాక్యమువలెన్ భక్తిన్ భువిన్ ధర్మసం
గ్రహమున్ దైత్య వధంబు ముఖ్యమగు నా • కర్తవ్య మిప్డోఁ గ్రుధా
బహుళ వ్యాహృతులేం యంచు నుడిగెన్ • బ్రజ్ఞాయుతుండై వెసన్

మ॥ శ్రమగొన్నారలు బాధ నొందితిరి వి • శ్రాంతిం గొనుం దేను పోఁ
డిమి మీయాజ్ఞ శిరమ్మనం దునుచు కం • టెన్ వేఱు నాకేది మో
దము గల్గించును? సీత నెచ్చటికి నా • దైత్యుండు కొంపోయెఁ? ద
త్క్రమముం దెల్పుఁడు నా జటాయు వలసెన్ • దప్పెన్స్మృతిన్ మీఁదటన్

మ॥ అరవిందాసన శంకరాదులును సర్వా • మ్నాయముల్ వేని పా
ద రజంబుం గనుఁగొంటకై శ్రమములన్ • దైవాఱఁగా నోర్చియున్

బొరయం జాలవొ యట్టి రామ చరణం • బుల్ గాంచి ధన్యాత్ముఁడై
దొరసెఁ శాశ్వత మోక్ష లక్ష్మి విహగేం • ద్రుం డాత్మ సాక్షాత్కృతిన్

మ॥ అటఁ బక్షీంద్రుఁడు ముక్తినొందఁగ నిలిం • పాదుల్ రఘు శ్రేష్ఠు లి
క్కట శోకావిలచిత్తులై రి యల కాం • తార ప్రదేశంబు సం
కట పాటొందె మృగాళితోఁ దరులతో • క్ష్మా భృత్సమూహంబుతో
బటు దుఃఖంబున శీర్షమందు కరముల్ • బంధించె లోకావళుల్

మ॥ శ్రమలం బొందితి దుష్టరాక్షసునిచే • శౌర్యంబు గోల్పోయితిన్
దమినై ఘోర తపంబు సేయుదునొ? దై • త్య శ్రేణి మర్దింతునా?
యమినై ప్రాణములం ద్యజింతునొ? మహా • యం బెయ్యదో తెల్పు శ్రే
యములం గూర్చెడు తండ్రిఁ గోలుపడి యె • ట్లంకింతు జీవంబులన్?

మ॥ అను నన్నం గని తమ్ముఁడిట్లను మహా • త్మా! నిత్యతేజా! పురా
తన కర్మంబుల నింద సేయఁ దగునే? దాయంబు రెచ్చైనఁ జిం
తను పొందన్ ఫలమున్నె? రక్కసులఁ గ్రో • ధం బారఁ జక్కాడి యా
వెనుకన్ దుఃఖము నొందఁగాఁదగు మదిన్ • వీక్షింపుమా తత్త్వమున్

శా॥ అన్నా! మీరు మదిం గలంగి కడు దై • న్యంబూని విభ్రాంతి నా
పన్నుల్ మావదినెన్ విడన్ దలఁతురే • బందీకృతన్? బుద్ధి సం
పన్నుండా మనతండ్రి గీటడఁచు క్ర • వ్యాదున్ వడిం జంప కి
ట్లెన్నెన్ శోక పయోధిఁ గ్రుంకుచుఁ దపం • బీ కొంటయుం బోలునే?

మ॥ అనుజ శ్రేష్ఠుని వాక్కులొప్ప విని • దైన్యంబున్ విసర్జించి యా
దనుజ శ్రేణి వధించుటే తగవుగాఁ • దర్కించి సౌమిత్రితో
మనుజాధీశుఁడు పల్కె సీతనికి సం • స్కారంబు గావింతమా
తనుజన్ముల్వలె నౌర్ధ్వ దైహికములం • దాత్పర్యమేపారఁగన్

ని యగురు చందనేంధనా • లరసి తెచ్చి పేర్చి దర్భలు పఱపి పై • విరులు సల్లి
రణి మథియించి యనలంబు • నెరియఁజేసి విమల జలమున స్నానాది విధులదీర్చి

చ॥ కరములఁ బట్టి యెత్తి తగఁ • గాష్ఠము పేర్పునఁ జేర్చి వేద వి
ద్వరుఁడు రఘూద్వహుండు శ్రుతి • పద్ధతిఁ దక్కకచేసి యవ్వలన్
శిరము కెలంకునం గొఱవిఁ • జేర్చి దహించి కొలంకులోనఁ గ్రుం
కి రహిని తర్పణాదులను • గీర్పద కుండఁగఁ జేసి నెమ్మదిన్

తరులకు నెల్లఁ దర్పణ • విధులు తీర్చి యించుక జలంబు తాఁ ద్రావి • తృప్తినొంద
హ్మ మొదలుగ నెల్ల జీ • వ ప్రతాన ములును సంతృప్తి వహించె • మోదమంది

మ॥ జయ శీలుండగు రామ భూవరుఁడు శా • స్త్ర ప్రక్రియల్ దీర్చి సం
శయముల్ మాని నిశాట మర్దన మహా • సక్తిం బ్రకాశింప ని
శ్చయ సంతోషమునం దలిర్చెఁ గ్రతు భు • క్సంఘంబు, భానుండుఁ ద
త్క్రియఁ దానుం బొనరింప నేగెననఁ గ్రుం • కెం బశ్చిమాంభోనిధిన్.

## 9. అయోముఖి పటలము. (101)

చ॥ సరగున రామ లక్ష్మణులు • సంజను తత్థలి వీడి కారు చి
చ్చు రవులు వెల్గుచేఁ దెరువు • చొప్పు గనంబడ నొక్క నల్లనౌ
గిరివరమందు చేరి రటఁ • గీల్కొనె నింద్రు జయించి రేఁగు రే
దిరుగుడు మూఁకలట్లు కదుఁ • దెట్టియలై యిరు లగ్గలించుచున్

ఉ॥ అయ్యెడ కానలున్ గిరులు • నన్నియుఁ దేనియ చిందు వాఁగులన్
గ్రయ్యఁగ దుఃఖమొందు క్రియఁ • గానఁగ నయ్యెను వారి చింతతో
నెయ్యు జటాయుపాతమును • నిండిన కోపము నాన తెల్వియున్
దయ్యటయుం బెనంగొని యె • డందల మిక్కిలి నొంచి యారిచెన్.

మ॥ ఘన విజ్ఞానము లేని మూఢుఁడు తగం • గర్మంబుచే నొందు సం
జననంబుంబలె రేయియున్, ఘృతము నో • జం బోయ వర్ధిల్లు న
గ్నిని పోలెం గడు వేఁడి యూర్పులు పెరిం • గెన్, నిద్రరాదయ్యె రా
మునకు న్నిందిత రీతి దార జనకుల్ • ఘోరాములం బొందుటన్.

### రాముఁడు సీతం దలంచికొని పరితపించుట.

తే॥ రాము నేత్రపద్మంబులు • రాత్రులందు, ముడుఁగకుండుట సీతయన్ • జలధి కన్య
వీడి యుంటకో? తన్ముఖ • విధుని చూడ, కుంటవలననో? మది తన • యొద్దలేదొ?

తరల॥ అతని కన్నుల ముందఁ గన్పడి • నట్టులున్న వసుంధరా
సుత వరాకృతి కప్పు కుప్పలు • శోషిలం బొలుపారెఁ దా
మతిని నిబ్బరమంది లక్ష్మణు • మాడ్కి తెప్పలు వ్రాల్ప క
ట్లతివ రూపు నిమేషణ స్థితి • నంది కాంచుచు నుండఁగన్.

తే॥ మైథిలాత్మజా శోభాయ • మానమైన, మోము గాంచితినని తాను • మురియునట్లు
మలయపవనసర్పము ప్రాఁకు • మలచటియను, కాంతిగల చంద్రబింబంబు • కానఁబడియె

చ॥ అతనుఁడు పొంచియున్న తెర • నవ్వలఁ ద్రోచి జగంబు లెల్లనా
యతమతిఁ గాంచు నట్టులు ర • యంబునఁజేసిన చంద్రకాంతు లు
ద్ధతి భుజగంబు ఘోరవిష • దంష్ట్రలతోడ వియోగ బాధిత
వ్రతతిని కాటువైచి పలు • వంతలు గూర్చెడు నట్టు లేసరెన్.

చ॥ జనకజ లేని చింతయు వి • సంబును చల్లెడు చంద్రపీడయున్
బెనఁగొన నేమిదోఁచక వి • భిన్నతనొంది ఫణీంద్రువంటి ప్ర
న్నని మృదురోమరాజి నలి • నమ్మను మించిన మోము పాలఁ బో
లిన పలుకుల్ గలట్టి లవ • లీ లలితాంగిఁ దలంచి కుందుచున్.

॥ పెదవులఁ గఱచుచు నిట్టూ, ర్పొదవ భుజము లదర నిన కు • లోత్తముఁడు మదిన్
మదగజము విఱిచిపైవఁగఁ • గుదివడు లేఁ గొమ్మవంటి • కోమలిఁదలఁచున్.

ఉ॥ వంచిన వెంటతో వడిగ • వచ్చెను వచ్చునటంచు దిక్కులం
కించుచుఁ జూచె నేమొ కిల • కించితవర్తన నంచు లోన భా
వించుచు వార్ధిపై విరియు • వీచికలంబలె నెచ్చుతగ్గు గా
వించెడు నూర్పుతోడఁ బల • వించె మదిం బయ లుబ్బుకుండఁగన్.

తరల॥ మెఱుపుఁ బోలిన వక్రదంష్ట్రలు • మీఱ భీకరరూపుఁడై
వెఱపు పుట్టఁగ నిల్మనిల్మని • వెక్కసించుచుఁ బంక్తి కం
ధరుఁడు డాసినవేళ జానకి • తత్తఱించెనొ? సోలెనో?
విరవిరం గొని విహ్వలించెనొ? • భీతి నన్ను తలంచెనో?

తరల॥ విషధరంబు గ్రసించుచుండఁగ • విన్ననౌ విధువైఖరిన్
విషమ సంస్థితినొందు మైథిలి • వీరుఁడేలొకొ రాఁడు నా
విషయమే యిక విస్మరించునొ? • విప్రవ స్మృతు ధాటికిన్
విషధరాభ శరీరుఁ డల్కియె • వీడెనంచుఁ దలంచెనో?

॥ అనుచుఁ బరువును ప్రేమంబుఁ • దనకు జ్ఞప్తి, పఱుపఁ గష్టమునొంది జీ • వములుకలఁగ
దైన్యమందిన శ్రీరామ • ధాత్రివరుఁడు, తలరి నాకింక విల్లు కా • వలెనె? యనును

॥ ధనువు నెగదిగఁ జూచి మం • దస్మితంబు, సేయు భుజగిరులం గాంచి • చిన్నవోవుఁ
జెలువఁ గాపాడలేమికి • సిగ్గునొందుఁ, గదకు రాఁగల నిందకుఁ • గలఁగి జంకు.

॥ మంద పవనునిచే మేను • మఱయుచుండ, నావరారోహ కులసతి • నన్నుపాసి
పరితపించెనొ ప్రాణముల్ • పాసె నేమొ. యనుచు నిట్టూర్పులొనరించు • నటమటించు

॥ జగములఁ గావఁగఁ బూనితి, మగువ నొకతెఁ గావలేక • మఱుఁగుచు నుంటిఁ
జగజెట్టి గానె యేనని, నగు సిగ్గిలు నలఁతనొందు • నవయుం గుములున్.

॥ మసలును తమ్ముఁడు పఱచిన, కిసలయములు మాఁడిపోవఁ • గెడపును నూత్న
వ్యసనము వర్ధిల్లఁగమా,నసముం దపియింప భ్రమయు • నలఁకువ నెందున్.

॥ కమలములను పోలు • కనుల జెప్పలువ్రాల్చి, కల్పకాలములను • కడపు నతఁడు
నిసి ముగింపు గనఁడు • నెంత లేమియొ? యభి, మానముననొ? కతము • కానరాదు.

క॥ అన్నాలక్ష్మణ! దివసము, లన్నియు మును సమములగుట • యరయుదు గద నే
డిన్నియమమ్మున నిన్నటి, కన్నను నిసి దీర్ఘమైన కత • మెయ్యదియో?.

క॥ చెలి మోము సాటి నెనయమి, నలఁగుదు సిగ్గునను దిన ది • నంబు మలయుచున్
నెలతేఁడా! నాసతి ముఖ, జలజము మఱుఁగగుడు నేఁడె • సంగెదు కిడిమిన్.

క॥ గగనమున నుండి సూర్యుఁడు, పొగడొందిన తనకులంబు • పొలుపు సమసి నేఁ
డగడొందె ననుచుఁ జింతను, జగతీస్థలి దాఁటి యవలఁ • జని మరలండో?

ఆ॥ ఇనుఁడు పుట్టకుండె • నేల? వివస్వంతు, గుఱ్ఱములను రథముఁ • గూడఁబట్టి
కట్టి రావణుండు • కారాగృహంబున, నుంచఁబోలుఁ గాక • యున్నరాఁడె?

ఆ॥ ఉడుకఁబోలు మధ్య • మొప్పారు జానకి, కానకుండు పొడవు • గలుగురాత్రి
తోడ లోకలయము • తోతెంచు జాడలే• యెఱుఁగనయ్యె మదికి • నింతనిజము,

తే॥ తాపసులకుఁ గ్లేశముఁ గూర్చి • ధాత్రియందు, ప్రాణులంజంపి తిను దైత్య • వరుల ద్రి
యుందురేనియు ధర్మవు • నూఁదియున్న, వారు నిల్తురే? తగవు • వఱలునేది?.

ఆ॥ చెఱకు వింటఁ దేంట్ల • శింజిని నెక్కించి, విరి శరములఁ బూని • వేయఁదొడఁగె
మారుఁ డంబరంబు • మఱుఁగుననిల్చిరా, ఘవుని ఘనసు తలరి • కలఁగిమలఁగ.

ఉ॥ వీడిన దానిఁ గైకొనఁగ • వీ లిసుమంత లభించనేని యా
పీడినదానికై జతను • వేకొను మానవుపోల్కి రాముమై
పోఁడిమిఁ గాంచి మానసము • పొక్కఁగ మారుఁడు కుందె మున్నుతా
నాడిక రుద్రుకంటి సెగఁ • దాఱినమేనిఁ దలంచి పొందఁగన్

తే॥ నీలనీరదశ్యాముని • నెమ్మనమునఁ, దూఱి యారాత్రి శూలమై • దూసిపోవఁ
గమల గర్భుని కల్పాంత • కాలమట్లు, కడఁచెఁ జీకట్లు కొండల • గవుల కేగె

ఉ॥ క్షీరపయోధిఁ దావలచు • శేషుని శయ్యను నిద్రవీడి సీ
తారమణీ మణీ విరహ • దాహ రసాంబుధి మున్గుచున్న యా
వీరుఁడు నీడజాది వన • విశ్రుత నాదము తోడఁ దన్నిషం
గారవమొప్ప లేచె, నటు • గల్గక జీవులకున్నె నిల్కడల్?

చ॥ నెమిళులు జింకలున్ గరులు • నెమ్మది జంటలుగాఁ జరించుటల్
తమకుచుఁ గాంచు రామునకు • ధైర్యము నిల్చునె? తేనె కోకిలం
బమృతము పోలు వేణువు వ • రాంగ రసాలముఁ గేయ కమ్ర వా
క్యములు గిలట్టి మైథిలిని • కానలఁ గోల్పడి కుందకుండునే,

చ॥ తెలతెలవాఱఁ గాంచియును , తేఁకువ జానకి యించు పల్కులన్
దెలియని రామచంద్రునకు • నిన్న జలేజముపై వసించు హం

సి లలి వహించు నమ్మగువ • సీత నిజంబుగ నేఁడులేమి వి
చ్చలముగ జూపురీతిఁ దొలి • చక్కని భానుఁడు పుట్టె నయ్యెడన్

చ॥ అడవులఁ గాంచి యందు తిరు • గాడెడు జక్కవజంటఁగాంచి నె
న్నడగల కేకులం గని వ • నంబుల హంసలఁ బూలగుత్తులన్
బెడఁగగు నేణులం గని • భీతమృగాక్షి వరాంగపాళిఁ దా
నెడఁదఁ దలంచి చింతగొను • నిచ్చట నచ్చట నిల్చునార్తిమై

చ॥ ఇటులు తపించు నన్నఁ గని • యెద్ద కలంగి సుమిత్రపట్టి సం
కటపడి లోనలందురి వి • రాపము వెల్వలఁదోఁపనీక మీ
రిట వెతచెంది మూవడినె • నేర్పడ రోయక నిల్వఁ బాడి గా
దట మనతండ్రి పల్కు దను • జాధము తావును కాన లెందనన్

సరి యనఁగ నిర్వురును కొండ • సందులందు, తూటిపెక్కు వనంబులు • దొడ్డగిరులు
నదులు దాఁటుచుఁ జనిచని • నాఁడుపూర్తీ, నడచి పదునెన్మి దామడల్ • కడచినారు,

వసుమతీ తపఃఫల సంభ • వంబు జాన, కీసతిం గానఁ జాలమిఁ • గిన్కయడర
నిశ్వసించుచు వారలు • నీడజాత వాద మేదురమైన వ • నంబుఁ జేర

తనకులేశుల హృదయ చిం • తనము లెఱిఁగి, యన్నిచోటుల జానకి • నరసి యరసి
కనక మేరువు నపరభా • గమున వెదకఁ, జనిన తెలుఁగున భానుఁడ • స్తమయమందె

జ్ఞానపక్కి నెఱుఁగఁ • జాలని మూఢుల, మనముకంటె మించి • కనులు గాన
రాని రీతిఁ జెలఁగి • రాముని తనుకాంతి, గెలువనేమొ దిశల • నలమె నిరులు

వీణతంత్రులకును సొంపు • వెలయనేర్పు, శారికలు చిల్కలకు బడి • చదువునేర్పు
వనమునం జంద్రమండల • ఫక్కినున్న, పటిక జా • మండపమున ని • ల్వఁగఁ దలంచి

కూరుచుండి రామ • ధారణీనాథుండు, తమ్ముఁగాంచి యిచట • దాపునందు
నీరుగలుగునేని • నెమకి తెమ్మన లక్ష్మ, ణాఖ్యుఁ డరిగె విల్లు • నమ్ములూని

## నీరు తేఁబోయిన లక్ష్మణుని అయోముఖికాంచి కామించుట

। జలము వెదకి వెదకి • తెలియక సౌమిత్రి, యొంటరిగ మృగేంద్రు • నొప్పునఁ జను
నచట నెలవుకొన్న • యది యయోముఖియను, కాంతగాంచె నతనిఁ • గాముకియయి

। మంత్రమునకు లొంగని పాము • మాడ్కి వెంట, నంటియసుర యాసౌమిత్రి • నరసినంత
గర్వకోపమ్ములను ద్రోచి • కడఁకనితఁడు, మరుఁడె నన్నిందు వెదకుచు • మసలువాఁడు.

। అనియయంధకార మందున, ఘనతర మోహాంధకార • కలిత హృదయమై
మనసిజాని కవయఁ గోఁగిలి, గొనుటొప్పునుగాని మ్రింగఁ • గూడునె యముచున్,

ఆ॥ వేఁడుదాన వీఁడు • వినఁడేని కడుపవ్వు, గొనుచుఁబోయి యచటఁ • గుదురువఱచి
యలమి యెదఁదఁగలుగు • నలమట నెడలింతు, ననుచు నెదుట నిలిచె • నసురవనిత

సీ॥ నిట్టూర్పులందుండి • నిప్పులు చల్లుచు పెనుపండ్ల నిభముల • విఱిచి నమలి
మ్రింగనుబ్బిన పొట్ట • మీఁదఁజుట్టిన కొండ, చిలువల చనుకట్టు • గలయఁజూచి
శరభ సింహముల దా • సరి పాములంగట్టి, కాళుల నందెలు • గా ధరించి
యన్నివస్తువులఁ గ • ల్పాంత మందున మ్రింగు, మిత్తిఁబోలిన మోము • నెత్తిపైకి

తే॥ కరలి సీటినెల్లను ముంచు • గరిఁ బెసగిడి, వెలయు నోటితో బడబాగ్ని • విధమునొంది
విరిసియున్న వెంద్రుకలతోఁ • బృథివివిరివిఁ, గొలుచునట్టిపాదములతోఁ • దలముమీఱి

సీ॥ రక్తమాంస క్రియల్ • క్రమ్మిచాలుగఁ జిందు, ఘనకటి శవముల • గాంచి యొప్పఁ
బ్రళయ కాలానల • ప్రభనొప్పి మిడుఁగుఱుల్, చిటపట కన్నులఁ జెవరు చుండఁ
బాద సంఘట్టన • మేదిని వణఁకుచు, జానయా యిదియని, సంశయింప
వననిధి మోఁకాటి • బంటిగాఁ గొండలు, తిప్పలై దొరలుచుఁ • దెరలిపడఁగ

తే॥ పాఁప కడియముల్ ముంగేలఁ • బరిఢవిల్లఁ, బుఱుజ దండ లష్టాపద • ములు మినుకులు
సింహముల కుండలమ్ములు • చెలఁగుచుండ, నడచె లక్ష్మణు నెదుటికి • బెడిదురాలు,

తే॥ నిలిచి వలపున నానంద, జలకణంబు, లెట్టి చిన్నకన్నులనుండి • వట్టువాఱఁ
జూచెఁ దద్దంష్ట్రికాకాంతిఁ • జొప్పడంగఁ, గాంచె లక్ష్మణుండును దాని • కాయసుషమ.

తే॥ మునుపు ముక్కుఁ గోఁటఁదెగిన శూ • ర్పణఖగుణము, తోడఁ దాటక గుణమును • కూడినట్టి
యీచెడిపె దుష్టరాక్షస • బృందమందు, తిరుగునొక కరాళికయని • తెలిసె నతఁడు,

ఉ॥ వీరలు పాపవర్తనలు • వీటఁడులున్ బలుపాఱు స్వైరిణుల్
కారణమొండె మాకడకుఁ • గ్రచ్చఱ వచ్చుటకంచు లక్ష్మణుం
డారసి ఘోరకాననము • నందు నిసిం జనుదెంచితేల? నీ
వేరి పడంతివౌదు వచి • యింపుమ వైశము యన్నవెంబడిన్,

తే॥ బిడెము లేనిది చలియించు • నెడఁదగలది, యగు నయోముఖి యిట్లను • నాసతోడఁ
జాలకాలంబు నీయొద్దఁ • జనవులేని, దాననై నను గాంచితిఁ • దమి వహించి.

క॥ సుందరవీరా! మొన్నెవ, ధుం దాఁకని నాసఖిత్వ • దుక్కము నీకుం
జెందఁగఁ జేసితి సుఖముల, నొందుము తొలఁగింపు మని, యోగాత్యంబుల్.

క॥ ఉపశమమున రక్కసి యిటు, లుపకంఠమునన్ వచింప • నుడుకుచుఁ గినుకన్
జపలిని? యిఁకనిట నిలిచినఁ, గృపమాలిన నాఁరములు • గీటడఁచు నినున్.

క॥ తొలఁగుమ యనిలక్ష్మణుఁడన, నలుగక రాకాసి యను న, నంగ సుభగ! జో
తలు సేసెద నాప్రాణం, బుల నిలుపుము చెడుగులేదు • పుణ్యమె గలుగున్.

క॥ అభయం బిచ్చితి ననుచో రభసంబున గంగ పుష్క • రమె తెచ్చెద నో
యిభజిద్విక్రమ! నిన్నను నభమున గొనిపోదు తలఁపు • నం గొనునెడకున్

క॥ అనుపలుకుల మన్నింపక, కనలున సౌమిత్రి నీదు • కర్ణంబులతో
డను నాసిక తెగఁ గోయక మునుపే తొలఁగుట శుభంబు • బొమ్మన నదియున్

క॥ నేవీనిం గొని నాగుహ లో వైచిన పిదప నాకు • లొంగును సౌఖ్యం
బావహిల ననుచుఁ బఱచుచుఁ ద్రోవ విడిచి యొక్క క్రేవ • తొలఁగుచు విలిచెన్

క॥ మొదటన్ మోహనమంత్రము కొఱుచు లక్ష్మణుని వారు • కొని గగనమునం
దెదగందు తోడఁ జనుతో యద మనఁ బఱచెన్ మనోజు • నంగదవలనన్

చ॥ కరతలమందు పెట్టుకొని • కన్నుల నద్దుచు బొమ్మ చేర్పఁగా
సొరగు తొలంగి లక్ష్మణుఁడు • జోటిక మూఁపున నిల్వ నబ్ధి చుం
దర మటు లుండె నింద్రు మద • దంతిని బోలుచుఁ గుంత హస్తుఁడౌ
హరసుతుఁడెక్కు కేకివలె • నయ్యెను రక్కసి లేమ యయ్యెడన్

తే॥ దాని కేలను బొమ్మనఁ • దలను మెడను నిలిచి సౌమిత్రి గజ చర్మ కలితుఁ డభవుఁ
డైన లయకాల రుద్రు మ • హానటేశు కొమరు విఁసిల్లె జంకును • కొంకులేక

## లక్ష్మణుఁడు రామికిఁ జింతిలి రాముఁడు వెదకఁబోవుట

ఆ॥ అటులు దైత్యకాంత • యనుజుని గొనిపోవ, నిచట విరహ బాధ • నెనయు చున్న
యిన కులుండు నీరు • కొని తేరఁబోయిన తమ్ముఁ గుఱ్ఱ రామిఁ • దత్తఱించె

శా॥ నీరంబుల్ లభియింపవో? తెరువునన్ • విఘ్నంబు లేపారెనో?
నారామామణిఁ గొన్న వార లెదురై • నారో? దురంబయ్యెనో?
క్రూరాత్ముండగు పంక్తి కంఠుఁ డితనిం • గొంపోయెనో? యేమొకో?
మేరన్ మీఱఁడు వేగవచ్చు నతఁ డ • మ్మేధావి రాఁడేలొకో?

శా॥ నాజీవంబును బోలు లక్ష్మణుని వి • జ్ఞాన ప్రబోధంబులన్
రాజద్రీతి గణింపకే జనకజన్ • రామామణిన్ మానమున్
దేజఃకాంతులు కోలుపోయి వనటన్ • దీల్పాటు నొందంగఁ దా
నోజం గానఁగలేక ప్రాణములనే • యుజ్ఝింపఁగాఁ బూనెనో?

శా॥ దట్టంబయ్యెఁ దమంబు దగ్గఱి పదా • ర్థంబుల్ గనన్ రావు నే
నెట్టీ చీఁకటి నెందు రోయుదు మన • స్సే పుండుగా బాధ యాఁ
కట్టెన్ దోఁప దిఁకేమియున్ జెడితి నా • కాయంబు భారంబుగాఁ
దట్టెన్ జీవితమేల నాకు నను జా • తా! నీవు లేకుండఁగన్?

చ॥ ఎడతెగకుండు యుద్ధముల • నేపునఁ బూనిన నాకుఁ బ్రాణమై
యడరిన నీవుఁ గూడ మఱఁ • గైతివె? తమ్ముఁడ! అన్న! నాయనా!
విడిచెదఁ బ్రాణమున్ ధరణి • వీఱిఁడినై బ్రదుకంగ నేర్తునే?
కడుఁ జెడుగే యొసర్చితివి • గావున నీపని యొప్పు నేరికిన్?

చ॥ తొలఁగని దెప్పరంబులను • ద్రోపుడు సేయఁగఁ జాలు తమ్ముఁడా!
తలఁగని చింత నామదికిఁ • దాపము గూర్చితి బాహుశౌర్య వి
స్ఫలిత మహారివీర! యెద • చంప యిటుల్ నను వీడ నాయమే?
వెలుపల నింత కాల మిటు • వీడి వసించుట నీకు నొప్పునే?

చ॥ ననుగను తల్లితండ్రులను • సర్మిలి పితను వీడి జీవినై
చనుటయు నిన్ను పాయ మది • చాలమిచేఁ గద? జానకీ వియో
గ నిభృత తాప కర్శితుని • గ్రమ్మఱ నీవును వీడి నిన్ను రో
యను పని గూర్చి రెండవ మ • హార్తిని నాకిట సంఘటించితే?

ఉ॥ తమ్ముఁడ నీవు క్రమ్మరిలు • దారి వచించెడు వారు లేరు న
న్నిమ్ముగఁ జేరవేని త్యజి • యించెద జీవము నిక్కవంబు స
న్నమ్మిన సీతయుం జెడును • నాకము దప్పును తండ్రి కింకఁ బ
ట్టమ్మన నెల్ల రీల్గుదురు • డబ్బుఱ యింతకుఁ గూర్పఁ బోఁడనే?

శా॥ మాంధాత్రాది మహీశ వంశమున సా • మ్రాజ్యంబు గైకోక స
ద్బంధు ప్రేమను వీడి వచ్చు నను ని • ర్బంధంబుతో నెల్ల స
ద్బంధుల్ వర్ధనసర్వసౌఖ్యముల మ • త్కైంకర్య • సంసిద్ధికై
సందర్శించు ప్రియాను జన్మ! యిట నీ • చక్కన్ విడంబాడియే?

తే॥ అనుచు లేమను ధరఁబడు • నలయుసొలయు, మలయుఁదెలియును మెఱు పైన • మెలయకుండు
నిట్టి చీఁకటు లలమె నిం • కెట్టు లనును నడచుఁ బిఱమనుబమ్మెర • నడలుబడలు

తే॥ సీతతోడ నాప్రాణంబు • వెలఁగి కావ నిద్రనైతము వీడిన • నిశ్చలుండు
రామికిం గత మేమి? భా • రమగు పాప కర్మి కాతనిఁగను నోము • గలదె? యనును

తే॥ ధర్మమనునది జగమునఁ • దనరు నేని మాఱు జన్మంబునందు స • మ్మాన్యుఁడగుచు
నన్నయగుఁ గాక యతఁడు నా • కనుమఁగ త్తి దూసి ప్రాణముల్ పోకార్పఁ • దొడఁగునంత

తే॥ మాయనుండి మేల్కొన్నల • క్ష్మణుఁడుదాని, ముక్కుగోయఁగ నొచ్చిన • మొఱకుటసుర
వైచెఁ బెడబొబ్బ యదివిని • పద్మనయనుఁ • డక్కజంపాటుతోఁ దమ్మ • నిక్కవరపె

తే॥ గులకఱాల యడవియందు • గూసినైత్య, సమితి లక్ష్మణుతో నని • సలుపుచుండె
నాఁడు ముక్కుపోయినచుప్ప • నాతియేమొ, నేఁడుపేరెలుంగునఁ గూసె • నిక్కమనుచు

॥ నీలాద్రి నిభుఁడు జ్వాలా మాలాభీలంబుగలుగు • మార్గణమును కెం
గేలం గీలింపఁ దమో జాలంబులు తొలఁగి పగలు • చందం బయ్యెన్

॥ కొండలు నలఁగఁగ గ్రమాఁకులు, తుండములుగ విఱుగ ధరణి • తొడిఁబడ వాతో
ద్దండ గతి నడచె దిశలును, వండ ధరుఁడు నడలఁ బడిగఁ • దమ్ముని దెసకున్

॥ విలయకాల కాల • జలధి ఘూర్ణలి మెఁదఁ, దెరలివచ్చు కరణి • నరవరుండ
సరగ రాఁగఁజూచి • సౌమిత్రి కష్టంబు వలదు వలదటంచుఁ • బలుకరించె

॥ మీకృపచే మీభృత్యుఁడు మీకడ కేతెంచె ననుచు • మిక్కిలిభక్తిన్
బైకొని మ్రొక్కుచుఁ గనఁబడె పోకాడిన చూక్కి మరల • బొందు పగిదిగాన్

॥ కన్నీరు దొరఁగ నిల్చిన యన్నియుఁ దనలేఁగ వెదకి • యలయుచుఁ జేఁపుం
గొన్న పసి కరణి లక్ష్మణు పెన్నొడలిం దడవి తడవి • విరవిర మానెన్

చ॥ పలుమఱు దేహము న్నిమిరి • గాఢముగాఁగ బరిష్వజించి య
శ్రులఁ దనుజన్మ మైరజము • చొక్కముగాఁ దొలఁగించి తమ్ముండా!
తొలఁగితి వెంచు నెంతయును • దుఃఖము నొందితి వింత సేపు కా
నల నిటు రేయి తామసిల • నాపన మెట్లగునయ్య నాయనా!

ఉ॥ కూరినదేమి తెల్పుమనఁ • గూరిమినన్నకుఁ దమ్ముఁ డయ్యెడన్
దారిగఁ దెల్ప రాఘవుఁడు • తాఁమము మోదమునంది యిట్లనున్
దోరపు జన్మకారఁబడి • దుఃఖముం గనేయింపఁబోదునే!
వారిధిఁబడ్డ వాఁడలల • పాటునకుం జడియంగఁబోలునే?

తే॥ మూఁడు జగము లొక్కుమ్మడి • ముమ్మరించి పెనకినను లెక్కసేయక • చీల్చివైతు
నొక్కఁడవు నీవు నాయొద్ద • నుందు వేని చాలు వేఱు రక్షణము నా • కేల చెపుమ?

క॥ పోయెడి వెల్లను పోనీ వైవేయాపదలైన వచ్చి • విరియ విరియ నీ
నాయయ్యా నీవున్నం బాయునుగా కదరి నన్ను • పఱుపంగలవే.

క॥ రాకాసిముక్కుగోసితి నీకడకున్ మగిడితినని • నిగదించితి వా
సోఁకును చంపవు గద కరు ణాకర! యను రాఘవునకు • నతఁ డిట్లనియెన్

క॥ చను కట్టుతోడఁ జనుగవ దొనయుం బలె నున్నముక్కు • వొడ్డ మొరిఁబెలన్
జెనసెడు చెవుల నసంగొని లనుమఁగ నేర్చినది యనుచుఁ • దుది నవ్వటయుఁ

క॥ మను వంశ సంభవా! కిను, కను విను వెన్నంటు నసురఁ • గనలి పయిం ద్రె
క్కొనక దయ తలఁచి విడిచితె, యని రాముఁడు తమ్మునలమి • యశ్రులు రాల్చెన్

క॥ అంగదలు తొలఁగ వారలు, గంగాధరు వరుణుఁ దలఁచి • కట్టియఁ బురమిన్
రంగారఁ దొలిచి యంత, ర్గంగం గొని త్రాగి యెపటఁ • గడిపిరి రేయిన్

క॥ అడవులఁ జివుళులు పూవులు, తొడరికఁగా లక్ష్మణుఁడు వి • ద్రుమ మృదు శయ్యం
బడి రామవిభుఁడు తమ్ముం, డడుగుల నొత్తంగ రాత్రి • యట శయనించెన్.

క॥ జానకిచెఱ పడు పిమ్మట, మానము వేధించుచుండ • మలఁగి యొక ఫలం
బేని భుజింపని రాఘవుఁ, డానిక నిద్రింప కలఁగి • యలయుచు నూర్చున్,

క॥ కిన్నె వెనుకాన జానకి, కన్నులకుం గట్టినట్లు కానం బడుటల్
మన్నీఁడు మఱవమినో? లే, కున్నన్ రాక్షసుల మాయ • యో? తెలియమఁగా!

క॥ జనకజ చెంతం బోఁపఁగఁ, దనుకుమ బయలలమి లజ్జఁ • దలరును నన్నీ
వనితామణి డాయును మఱి, వెనుదీయును తనదు నడుము • విధమున మఱుఁగున్

క॥ జానౌ వదనాంబుజమునఁ, దేనియఁ గల దొండపండు • తీరగు నధరం
బానితి నిప్పుడు కనులం, బూనికఁ దెఱవంగ డాఁగుఁ • బో! నిదికలయో?

తే॥ తలఁపుకంటెను పంచభూ • తములకంటె, బెద్దదగు దుఃఖ మీరాత్రి • పీడ సేసె
చలువ తావియు నలుపును • వెలయు కురులు, గలుగు కలికి కన్నులకంటె • ఘనమెరేయి

చ॥ జలకణ క్షీరకారక వి • సార విరాజిత వారిరాశిపై
నలమి విధుండు పుట్టి బడ • బాగ్ని కరార్చులఁ జిమ్ముచుండ నూ
ష్మలత భజించి యాకసము • మై సకలంబును బొబ్బలెక్కెవి
ట్టలముగ నన్న తీరునఁ గ • దల్కొనెఁ జుక్కలు మిక్కుటంబుగన్

తే॥ పలువిధంబుల నీరీతిఁ • బలవరించి, కార్శ్యమొంది రాముఁడు మదిఁ • గలఁతఁజెందఁ
గాంచిలోక బంధుఁడు కనీ • కరముతోడ, వెలుఁగు తగ్గించి కొనె నన • మొలచివచ్చె

## 10 కబంధ పటలము (58)

తే॥ ఉర్వికంటెను మిక్కిలి • యోర్పుతోడి, క్రొత్తదితనంబు గల సీత • కొఱకు వెదకఁ
బక్షులును పలవించిన • పగిదిఁ గూయు, వేకువను రాఘవులు లేచి • వెడలినారు

తే॥ చాలాదూరంబు రామ ల • క్ష్మణులు నడచి, తమ్మినెచ్చెలి గగన మ • ధ్యంబు చేరఁ
జేతులను చాఁచి ప్రాణులఁ • జేర్చిమ్రింగి, బ్రతుకుచుండు కబంధుని, వనము చొరఁగ

తే॥ ఆపిపీలికానేకప • మైన జీవ, వితతి పరుగెత్తి యలసెను • బెదరుచూపు
లొలయ జంకుచు నుండెను • వలను దగులు, కొన్నరీతిని విలవిల • కొనుచునుండె.

సీ॥ ప్రజల కులాచార • పద్ధతుల్ నెఱకొల్ప, లేనివాఁడును కావ • లేనివాఁడు
బలహీనుఁడగు నొక • ప్రభు దేశమున జన, ప్రతతికైవడి భయ • పడెడు నవియు
చెదరునవియు గుంపు • చేరునవియుఁ బఱ, చునవియు విభ్రాంతి • నెనయునవియు
పర్వతక్రియ దొర్లి • వచ్చెడు భుజముల్, పెల్లగిల్లిన యేటి • వెల్లువలను

తే॥ తిరిగి పడుమేఘములు పొంగి • పొరలువార్ది, గాఁగఁ గాలుసేతులు పెరుఁ • గంగఁజాఁచి
సకల జీవులఁ గుప్పగా • జవిరి నోట, వైచికొను కబంధునిచేతఁ • బట్టువడిరి

చ॥ జనకిజ కారణంబున ని • జంబుగ రక్కసివండు వచ్చి చు
ట్టినదని రామలక్ష్మణులు • డెందముఁం దలపోయుచుండఁగాఁ
జనఁజనఁ జక్రవాళమను • శైలము గాయుచుఁ జుట్టుచుండె నాఁ
జను బహుభు క్కబంధు కర • సాలములోఁబడి చిక్కిరయ్యెడన్

తే॥ జానకిని దుఃఖమున ముంచు • దానవేంద్రు నగర మీయెల్లలోనిది • నవయఁజేయు
మన మనోదుఃఖ మీనాఁడె • మగ్గుననుచు నన్నపల్కఁగ లక్ష్మణుఁ • డనియె నిట్లు

తే॥ దనుజసైన్యమేయైనఁ జిం • వము తుము రవము దుందుభి పటహాది • రావములను
గలుగ వియ్యెడఁ గావునఁ • దలఁచి చూడ నేదియోయిది వేలని • యెంచువాఁడ

తే॥ పాలసంభ్రంబుఁ జిలుకంగఁ • బాలుపడిన వసుకియో? లేక మణియొక • పన్నగంబొ?
తలయుఁదోఁకయు వట్రువ • గుంగఁ ద్రిప్పి, దొరకు వానిమ్రింగెడు చొప్పు • దోఁచునాకు

ఆ॥ తమ్ముఁడనిన పలుకు • తిగియున్నదని రామ, ధరణివిభుఁడు మదిని • తలఁచునంత
మూఁడు యోజనములు • ముందఱఁ జని కొండ పగిదినున్న యాక • బంధు జేరి

సీ॥ ఇద్దఱు సూర్యుల • నేక పర్వతమునఁ బూడ్చిపెట్టిన యట్లు • పొలుచు కనులు
కడుపు మధ్యను నోరు • కడలిగాఁ బండ్ల సం, దులు యోజనాయతి • యొలయుచుండ
దనుజులు సురల్చిఁ • దర్శిమ్పచోఁ జాఁగిన, యహిరాజుఁ బోలిన • హస్తయుగము
కొలిమి తిత్తిబోలె • జ్వలన ధూపంబుఁ, జెదరఁజిమ్మెడు ముక్కుఁ • జెలమలొప్ప

తే॥ బాడబ జ్వాలవంటి జి • హ్వయును చేతు లనెడురాహుప కదలి న • ల్లని మహీధ్ర
గుహనుచేరిన చంద్రము • గ్రొచ్చిరెండు గాఁగఁజీల్చినట్లగు దంష్ట్రి • కలును మెఱయ

సీ॥ పంచ భూతములను • పంచపాలకములు కూడి రూపొందిన • కొమరు మేను
కనులను రవిచంద్రు • లను మ్రింగ వచ్చి ప క్ష్మలములన్ పాములఁ • గాంచి రాహు
కేతు లాపనిమాని • క్రేవల నలరారు గుహల నిద్రిలి రనఁ • గొఱలు చెవులు
కల్లనాక్ష్యమపల్క • కిటికటి లొండెడు ఘన రౌరవముఁ బోలు • గడుకడుపు

తే॥ కాల మాసన్న మగు ప్రాణి • గణముఁబట్టి, పడవ వంటి చేతులజొరి • కడుపునందు
వైచు కొనుటలో యమునింటి • వాకిలివలె నున్న కడుపెద్ద నోటితో • నొప్పువాఁడు

తే॥ వారిధింబలె ఘోషించు • వాఁడు హాల, హలమువంటి నల్లనిమేను • గలుగువాఁడు
చక్రమునఁ దలదెగి పడ • గ్గు కాల నేమివలెఁ బెనుమొండెంబు • నెగడువాఁడు

తే॥ గంతమున శిఖరంబును • పవనుఁడెగురఁ వైవఁ దలలేని మేరువు • వంటిమేను
గలుగువానిఁ గబంధుని • గాంచిరారు, రామలక్ష్మణు లిర్వు ర • బ్రంబుతోడ

మ॥ చతురంభోధి పరీతమైన జగతీ • చక్రంబు సర్వంబు సం
గతమై తూఁగఁ దగ్గ నోరుగని యీ • జొన్మ భృద్గుహాద్వార ము
ద్గత రక్షః పురసాల మార్గమగు స • త్యంబంచు సీతేశు డు
ద్ధృతిమండం గని లక్ష్మణుండు కడు సం • దేహంబుతోఁ గాంచుచున్

ఉ॥ క్రూర కరాళ భూతమిది • ఘోరకరంబుల కబ్బు జీవులన్
వారి కుదించి నోటఁబడ • వైచెడు నట్టిదినీని చెతులం
దారితి మింకఁ దప్పుకొను • దారి గనంబడుటన్న చేయ గాఁ
గారియ మేదియున్న దనఁ • గా రఘువర్యుఁడు ఎల్కెఁ దమ్ముతోన్

చ॥ కుతలము నుద్ధరించు వర • ఘోణిని పోలిని లక్ష్మణా! వెసన్
గతుకఁగఁ జూచె భూతము జ • గంబున దీనికి నిల్వఁ దానమున్
వెతకిన లేదు దొడ్డ దిది • పృథ్వి సమస్తము చుట్టివచ్చు దీ
ర్ఘతమ కరంబు లొప్పునది • కాఁగు దెయ్యది యింకఁ దమ్ముఁడా!

తే॥ దరణిజారఁ గోల్పోయితిఁ • దండ్రిపోయె నింద మోచితి బ్రతుకంగ • నేర నేను
దీని నోటను పడియెదఁ • దృప్తితోడ నీవు తప్పించుకొనిపొమ్ము • నియతచరిత!

ఉ॥ తల్లుల చింతమైఁ దలరఁ • దమ్ములు వంతలనొంద వృద్ధులున్
దల్లడమంద లోకములు • తప్పక దెప్పెడు జీవితంబు నే
నొల్లను సీత రాక్షసుని • యొద్దఁ ద్యజించిలి నంచు భూమిభృ
త్తల్లజుఁడైన యాజనక • ధారణినాథు మొగంబుఁ గాంతునే?

క॥ సీతను కావఁగఁ జాలని భూతలపతి లక్ష్మణుండు • పొలుపుగఁ గావన్
బ్రీతిం బ్రతికెడు వాఁడన నాతరమా యసువు నిలుప • నయగుణ వర్యా!

ఉ॥ టమ్మెర రాముఁడీ కరిణిఁ • బల్కఁగఁ దమ్ముఁడు కాంచి యిట్లనున్
నెమ్మని మీకు దాపుఁడయి • నేఁజను డెంచిన పిమ్మటం గదా
యిమ్ములు దప్పచున్న యవి • యె మపఖండింపక తప్పనేని వ్య
ర్థమ్మగుఁగాక యీదెము కృతార్థతి నొందునె యెన్నిభంగులన్?

## కబంధుచేఁ జిక్కినరామునకు లక్ష్మణుఁడు ధైర్యవాక్కులు పలుకుట

ఉ॥ వచ్చిన యాపదన్ గెలుచు • వారలె శూరులు యుద్ధభూమిలోఁ
జచ్చెడు వారిఁ జంపుటలు • సాహసకార్యము కాదు చూడఁగా
నచ్చుగఁ దల్లిదండ్రులకు నెన్నలకున్ సిలుగొందు వేళఁ దాఁ
జచ్చినఁగాదె మున్ను తన • జన్మము సార్థకమౌ ధరాస్థలిన్

మ॥ తరళాక్షిన్ జనకాత్మజన్ గొని మహో • దారుండు రాముండు దె
ప్పరమౌ కానల నుండఁగా నిదురయున్ • వర్జించి రక్షించె న

ప్పర మోదారుఁడు లక్ష్మణుం డనినయా • భవ్యాత్ములె వీఁడు ము
ష్కరుఁ డన్నన్ వడిచెన్ ద్యజించె నని ప • ల్కన్ సైఁపఁగా నేర్తునే?

మ॥ భవదీయాగ్రజు నాజ్ఞకున్ వశుఁడవై • భద్రంబుం గూర్పు నీ
కవు దుఃఖంబుల లెక్కపెట్టకుము నీ • ప్రాణంబులున్ జానకీ
ధవుకై వీడఁగఁ గూడునేని యది మో • దంబారఁ గావింపు మం
చవధానంబుగఁ బల్కు పల్లిలుకుల్ • వ్యర్థంబు గావింతునే?

మ॥ నను గన్నట్టి సుమిత్ర యేనును భవ • న్మాతన్ నినున్ గొల్చుచో
జనమున్ మెచ్చుచు సంస్తుతింపఁగ మన • స్సంబంధముల్ మార్పఁగా
గొన కెల్లెన్ని విధాల కష్టములు మా • కుం గల్గినన్ మీకునై
తృణ కల్పంబుగఁ బ్రాణముల్ విడుతు ము • ర్విం గీర్తి సంలబ్ధికై

మ॥ ధర నామ్నాయములున్ పురేశ్వరులు నం • తం బొందినన్ నాశమున్
బొరయంబోవని నీవు దంతి నిచయం • బుం దిన్పు నీ కానకో
గురువుల్ వ్రాసెడు ఘాత మొందు బలముం • గ్రుంగించి హింసింపఁగా
నటుటల్ నమ్మఁగఁబోలునే? విను జనుల్ • హాస్యంబు గావింపరే?

తే॥ సీత విడిపించి కీర్తిని • చెందలేక బవరమ్ముం జేయఁజాలక • భయము నొంది
ప్రాణములఁ బాసెనని లోకు • లందురేని దాని కంటె నపఖ్యాతి • ధరణిఁ గలదె?

తే॥ లోకనాయక! యిది లెక్క • లోని దగునె? మనల లాగు నీచేతులఁ • దునుకలుగను
ఖండనం బొనరించెదఁ • గాంచు మిప్డు, డనుచు ననుజుండు ముందుర • కరుగునంత

తే॥ తమ్ము దాఁటి ముందునకేగె • దాశరథియు నతని వారించి సౌమిత్రి • యరిగెమున్న
అన్యు లెవ్వరు లేరు వా • దాట దీర్ప, ననుచుఁ గనిన సురలు చింత • నందినారు

చ॥ ఒక మొగ మందు కన్నదుగ • మొప్పున నిర్వురు వాయునంతనే
మెకి మెక పాటుతోఁ గినుక • మీఱి కబంధుఁడు యుద్ధ వీర నా
యకులగు మీర లెవ్వరల • నల్కయుఁ జింతయుఁ గల్గి పెప్ప వా
ల్పక నిలుచున్న వారిఁగని • లక్ష్యము చేయర యంచు నాతఁడున్

ఉ॥ రోష రుహాగ్నిచే నొదలి • రోమము లెల్లను మాఁడుచుండ వి
ద్వేషము పెంచి వాఁడు కసి • దీఱ గ్రసించి మెసంగువాఁడ ఘో
రీషణతోడ నంచు గ్రహి • యింపఁగ వాని భుజంబులన్ మహా
భీషణ ఖడ్గ ధారలను • పీఁచ మడంగఁగ ద్రుంచి రొక్కటన్

తే॥ కేలు తెగి యొడలున నిరు • క్రేవలందు చిట్టు చిట్టున రక్తంబు • చిమ్ముచుండ
పొడవు పెదులు తెగిపడఁ • బొలుపు చెడిన పర్వతంబుచందమునఁగ • బంధుఁడుండె

## కబంధుఁడు శాప ముక్తుఁడై రాముని వినుతించుట

మ॥ తన హస్తంబును రాముఁ డంటు కతనన్ • దత్పూర్వ శాపంబుతో
ఘన పాపంబులు దీఱిపోవ దనువన్ • గంధర్వ వర్యుండు తొం
టి నిజాకారము దాల్చి పక్షిపలె మిం • టిం జేరి శ్రీరామ ల
క్ష్మణులం గాంచి భయంబు భక్తియు మదిన్ • సంధిల్లఁ గేల్మోడ్చుచున్

శా॥ పుణ్యాత్ముండు గడించి యత్యధిక స • మ్మోదంబు డెందంబునన్
గణ్యుం డీతఁ డజామరాధిపులకున్ • గష్టింప విజ్ఞాన నై
పుణ్య ప్రక్రియఁ గానవచ్చెడు తపః • పుణ్య స్వరూపంబు లా
వణ్య వ్యూహ మటంచు భక్తి వినుతిం • పం జొచ్చె నుత్సాహియై.

శా॥ శ్రీకాంతా! బహు పాప సంచయముచేఁ • జింతించుచున్నట్టి నా
యీ కాలుష్యముతోడ శాపమును పో • యె న్నిన్ను గన్నంతనే
లోకేశుండవు ధర్మసాక్షి విఁకఁ జా • లం జాలు నీరూపమే
లా కైకొంటివి మమ్ము బోఁటులకు • నె • ల్లం దెల్పఁగానేకదా!.

ఉ॥ మూలములేని నీవు జగ • మున్ దగవూనఁగఁ జేయ వేయు వే
సాల నెఱుంగ నెవ్వనికి • శక్యము? నీదగు లీలలెన్న నేఁ
జాలుదునయ్య! నీవు వట • సాలమొ? పత్త్రమొ? యందు పండు సం
శీలుఁడవో? ముకుందుఁడవొ? శ్రీదుఁడవో? తెలియంగఁ బల్కవే.

ఉ॥ కాంచెడు వాఁడవున్ దెలియు • కాంచనమున్ గను కన్నులుం గనం
గాంచిన శక్తి నీవ యొడి • కంబున దేనిని తాఁకకుందు నీ
వంచనయేల? యీభువన • వర్గము గర్భమునం ధరించి వె
ళ్ళించెడు నీవు పూరుషుఁడొ? లేమవొ? రెండునుగావొ? తెల్పవే.

ఉ॥ ఈవ విరించియున్ హరుఁడ • వీవ జగంబులు నీవ వస్తువుల్
నీవ శ్రుతుల్ తదర్థమును • నీవ యనంతుఁడ వీవ సర్వరూ
పావలి కావలన్ వెలుఁగు • నాదిమ తత్త్వమునీవ సర్వము
న్నీవ యటన్న తర్కుఁగల • నిర్జరు లక్క వహింపనేర్తురే?.

చ॥ ఎనిమిది దిక్కులే బిగి వ • హించిన గోడలు గాఁగ లోకముల్
పెనుగదులై రహించు ఘన • వేశ్మమునందున మూఁడు త్రోవలం
బనుపడు చోట నిచ్చ విరి • వాఱని సారస కర్ణి కాంతరం
బున వసియించు జ్యోతిమయ • మూర్తివి నిన్నెఱుఁగంగ శక్యమే?

ఉ॥ ఎల్ల యెఱుంగ లేని దెస • లెన్మిది లోపలనున్న భూమిపై
మొల్లముగా దివౌకసులు • మోదము నంద నొనర్చు వేల్మలం

దెల్ల హవిస్సు నీవ భుజి • యింతువు దివ్యులకిత్తు రెండు నీ
యుల్లసితంపు వేడ్కలని • యుల్లమునం గనువార లెవ్వరో?.

ఉ॥ ఓయి సనాతనా! జలధి • యుబ్బుచుఁ దగ్గుచు నుండునట్లు త
త్త్వాయిక బుద్బుద ప్రకర • భంగి జగంబులు పుట్టి పొల్చుచున్
నీయుదరంబునం దడఁగు • నీదగు లీల లెఱుంగలేము నీ
మాయను దాఁటి నిన్నుఁగన • మాటలొకో యది మమ్ము బోంట్లకున్?

ఉ॥ నీదగు లీలలం దెలియ • నిర్జర వర్యులు నేర్చినారలో?
వేదము లట్లు పల్కెనవొ? • విప్పుగ మేమెఱుఁగంగలేము బ్ర
హ్మాదులు వొందఁగా నరిది • యైన మహోదయ మొందినాఁడ నా
మాదిరి భాగ్యమెవ్వరు స • మంచిత రీతి భజింప రెయ్యెడన్.

చ॥ సిలుగుల కాలవాలముగఁ • జిక్కిన జన్మ పరంపరల్ తెగం
దొలఁచితి దుష్టదేహమును • దోర్చితి సుందర దేహమిచ్చి బు
ద్ధి లవము గూర్చి మోద జల • ధిన్ మునిఁగించితి మోహ దుఃఖముల్
తొలఁగిన వెట్టి సత్కృతులు • తూకొని చేసితి నిట్టి సిద్ధికై?.

ఉ॥ అంతయు నీ యపార కరు • ణాకర తత్త్వముఁ గాంచి పొందితిం
జింతలు దక్కినాఁడ నని • చింతన సేయుచు వీరి పుట్టువుల్
సుంత వచించినన్ సుమన • సుల్ తలపోసిన వెంట కెగ్గు యో
చింతుఁ గదా యటంచుఁ బసి • చెంగటి లేఁగ ఓధాన నిల్వఁగన్.

ఉ॥ శ్రీ రఘురామచంద్రము డు • చిత్తము రంజిలఁగాంచి లక్ష్మణా?
తారజనీచరత్వమును • టక్కిమహోజ్జ్వల దేహమంది పెం
పారఁగ నిల్చినాఁడితని • నారసికే యన లక్ష్మణాఖ్యుఁడున్
గారవ మారఁ గాంచి యడు • గఁ వను విట్లని ఒక్కె వారికిన్.

## కబంధుఁడు కర్తవ్యము తెలుపుట

నువను పేరి గం • ధర్వుండ వర తపో, బలమునఁ గామ రూ • పంబు వడసి
యక్క రక్కసిరూపు • నొంది వేదుకస్సూల, కెఱుఁడన్ మునిఁజేరి • కేగినంత
తఁడీ రూపె నీ • కగుఁగాక యనవేఁడి, శాపమోక్షము తీరు • చక్కనెఁజిగి
ంద్రునితోఁ బోరి • యిట్టిరూపము గొంటి, మీహస్తములు దాఁప • మేలుగంటి

కరక్షణ వినుత సు • శ్లోకులీయ, మిమ్ముపొడగంటి సుఖముల • మెఱుచుంటిఁ
ంద్రులకుఁ దంద్రులగుమిమ్ము • ధాత్రిఁగాచు, వాడలేరైన నాకూర్పు • పల్కెనుఁ

తే॥ తరణిలేని వారికి సము • ద్రంబు దాఁట, నరిదియగు పగిదిని సీత • నరయు కొఱకుఁ
దోడులేనట్టి మీకు శ • త్రువులగెలువ, దుష్కరం బగుఁ గావునఁ • దోడుగొనుఁడు.

ఉ॥ లోపము లేని మీస్థితిని • లోఁకువ యంచు వచింపఁ జాల మీ
చాప శరంబులే గెలువఁ • జాలు జగత్త్రియ, మైన లోక సం
తాపము గూర్చువేళ నగ • ధన్వి వెసం బ్రమథాళిఁ గూడియే
యేపు వహించుఁ గాదె యటు • లే యిపు డీవును కొంది బాసటన్

చ॥ కుజనుల మైత్త్రి గొన్నఁ దమ • కుం గడగండ్లు లభించు టబ్రమే?
సుజనుల గూడువారలకు • శోభనముల్ పురణించుచుండు న
క్కజముగ జీవరాసులను • గాదిలి తల్లినిఁబోలెఁ గాంచు చా
రజమున మిమ్ము గాంచు రహి • రాజిలు నాశబరిం గనుండొగిన్.

ఉ॥ ఆవల సూర్యపుత్త్రుఁడు మ • హాగుణశాలి కపీంద్రుఁడైన సు
గ్రీవుని ఋశ్యమూకమున • క్షీరజలంబులఁ బోలెఁ గూడి మీ
దేవిని గాంచు యత్నమును • దీర్చుట మేలని పల్కి మ్రొక్కి సు
శ్రీ విలసిల్ల వీడుకొని • చెచ్చెర నేగె వియత్పథంబునన్

తే॥ దనువు పల్కిన మార్గానఁ • జనుచువారు• శైలకాననముల దాఁటి • సంజవేళ
రెండు మాతంగములు చేరు • క్రియ మతంగ, మౌని యాశ్రమస్థలికి స • మ్మతిని చని

## 11. శబరీ మోక్షణ పటలము (7)

ఉ॥ కోరిన వారి కోరికలఁ • గొంచక యిచ్చెడు కల్పశాఖులన్
దీరున నందఱుం గొనఁగ • దియ్యని పండ్లను తావి పూవులన్
మీఱి యొసంగు నాశ్రమము • మేదిని వాకల స్వర్గ భూమియన్
సౌరున ధర్మయుక్తులకు • సమ్మద మోక్షమనంగ నొప్పఁగన్

చ॥ కని ముదమంది రాఘవుఁడు • కల్గు పథిశ్రమమెల్లఁ ద్రోచి నె
మ్మనమునఁ దన్ను తాఁ దలఁచి • మాన్యతపం బొనరించుచున్న వృ
ద్ధను శబరిన్ సమంచిత ము • దంబునఁ గాంచి మహాత్మురాల! యో
జనని! యనామయంబె? యన • సంభ్రమ హర్షము లుల్లసిల్లఁగన్.

ఉ॥ రామ! రమాభిరామ! జయ • రామ! శుభావహనామ! సద్గుణ
స్తోమ! యవిద్య మాసె మన • సుం దపసుం బరిపక్వమందె నా
బాము కృతార్థమయ్యెను కృ • పామయ! నీవిట కేగుదేరఁగా
నీముఖ పంకజంబు గని • నేఁ దనువందు ఫలంబు గాంచితిన్,

ఉ॥ ఆఁకలి గొంటివయ్య నడ • యాడి శ్రమంబు వహించితయ్య నే
నీకొని నీకుగా ఫలము • లేఱిచి యుంచితి నానుమయ్య నీ
యాఁకలి దీఱ లోకములు • హర్షము నందవె యంచు మున్నుగా
మేకొని పండ్లఁ ద్రుంచి చవి • మిక్కిలి వానినొసంగె బ్రాఁతిమై.

ఉ॥ ఆతఁడు ప్రేమమైఁ గొని ఫ • లావళి నానుచునుండ నింద్రుఁడున్
ధాతయు శంభుఁడున్ సురలు • తత్పరులై చనుదెంచి నీదు వి
ఖ్యాత తపంబు సత్ఫలము • నందెడు వేళ సమీపమయ్యె నీ
తా తరుణీపతిం దనిపి • తత్పృక మాయెడఁ జేరుమాయనన్,

ఉ॥ నీవిట కేగుదెంతువని • నిర్మల భక్తిని యిన్నినాళ్లగా
భావమునందు నిన్నె బహు • భంగుల సంస్తుతి సేయుచుంటిఁ బ్రా
ణావలి నిల్పియుంటి ఫల • మందెను పుణ్యచయంబు తండ్రి! నేఁ
డీవహినన్న, వారు జన • యిత్రి! శుభంబుల నొందుమా యెసన్.

ఉ॥ నీవలనన్ శ్రమంబులను • నీఁగితి మమ్మరో! దుఃఖ సంతతుల్
ద్రోవఁగఁ గంటి ముందు తలి • తోఁపఁగఁ బుత్త్రిలకున్న యెల్లక్లే
శావిల పంకముల్ తొలఁగ • వా? యని యచ్చట నిల్చిరా నిసిన్
వేవిన ఋశ్యమూక పద • విం దగఁ జూపె నిషాది ప్రీతిమై

ఉ॥ మోక్షము చేరఁదగ్గ పథ • మున్ వివరించెడు జ్ఞానికై వడిన్
శిక్షితరీతి నా శబరి • చెప్పిన పల్కులు శాస్త్రరీతులన్
సుక్షములైనవారు విని • సూటిగ జ్ఞాన సుధం గ్రహించి ప్ర
త్యక్షిత తత్త్వులై యలరు • నందమునన్ విని రా రఘుప్రభుల్

తే॥ శబరి యవ్వలఁ దనయోగ ; శక్తివలన. శాశ్వతంబగు ముక్తిక • శాశ్వతంపు
తనువు విడువఁగఁ గని చోద్య • మనుభవించి, యామె తెలిపిన త్రోవనే • యరిగినారు.

తే॥ వనులు కొండలు నదులును • వెనుకఁ బడఁగ, నడచు జనులెల్లఁ జేయు స్నా • నంబుకతనఁ
బాపమను నగ్ని చల్లాఱి • పాడి కరఁగి, పరవి నట్లున్న ఫంపను • తఱిసినారు,

అరణ్యకాండము సంపూర్ణము

శ్రీరామ చంద్రార్పణమస్తు

ఓమ్ తత్ సత్.

శ్రీరామ

# కిష్కింధాకాండము

---

## 1 పంపా పటలము (4?)

మ॥ సుజన ధ్యేయ విధానమై శుభదమై • సుజ్ఞేయమై మూలతో
యజమై వ్యక్తి గుణాత్మకంబునయి జ్ఞా • నానంద తత్త్వంబునై
త్రిజగత్కారణమై చరాచర సుహృ • త్స్వరస్థ హంసంబునై
యజముఖ్యార్థిత జన్మమై వెలయు బ్ర • హ్మంబంద్రు సీతావిభున్.

మ॥ మకరందంబులఁ జిందు తామరలచే • మాన్యంబయై మత్తదం
తికదంబంబయి స్నానమాడఁదగి నీ • తిం బోలె లోఁతై సితో
దక పూర్ణంబయి వార్ధినా, మెఱుపు ల • బ్దంబుల్ పురాణింప ద్యో
తకమౌ నంబరిమట్లు పంప వెలసెన్ • దద్జ్ఞుల్ ప్రశంసింపఁగన్

చ॥ మలిచిన నిద్దపుం బటిక • మాడికి నొప్పెడు స్వచ్ఛ పుష్కరం
బులు తెర లుప్పతిల్లఁ బొలు • పుం గొను వన్నెల ఱాల మెట్లకుం
దలకొని పెక్కు రంగులను • దాల్చి బహుశ్రుతుఁడయ్యుఁ దత్త్వముం
దెలియని యజ్ఞు మానసము • తీరునఁ గానఁగవచ్చె నయ్యెడన్

ఉ॥ ముత్తెపుఁ గుప్ప లెల్లెడలఁ • బొల్చు తటాకము విద్రుమప్రభో
ద్యత్తతిఁ బోలు పాదరుచి • యందిన హంసము హంసిమూఁకతోఁ
జిత్తము రంజిలం దిరుగు • చెన్ను రహించెను ఋక్షసంతతుల్
మొత్తము చుట్టి రా నడుమఁ • బూర్ణ శశాంకుఁడు క్రాలు మిన్నునన్

చ॥ అసమ తపస్వి గాధిసుతుఁ • డబ్ధి పరీత మహీతలంబు జీ
వ సమితి వేద పారగుల • బ్రహ్మకు మాఱుగ సృష్టిసేయఁగా
నసమునఁ బూను కాలమున • నంబుధి మాఱుగ శుద్ధ తోయధిన్
వెన సృజియించె నొక్కొ యనఁ • బెంపయి యొప్పెఁ దటాక మయ్యెడన్

చ॥ రవి నెదిరించు తేజమునఁ • గ్రాలు ఫణామణు లొప్ప పన్నగుల్
తవిలి వసించు లోకమిది • తక్కక చూడుఁడి యంచుఁ జూపు లోఁ
తు వఱలి యుండియున్ వెలసె • దోష విహీన విభాసి సత్కవి
ప్రవరుని కావ్య భావ రస • పద్ధతిఁ బ్రస్ఫుటమై ప్రమేయమై

చ॥ జల విహగంబులందు పలు • చందములన్ విహరించు చీవలా
వలకును పాఱు చప్పుట ర • వంబులు సేయుచునుంట పెక్కు బా
షలు గల పెక్కు దేశముల • జానపదావళి యొక్కపట్టన
స్థలి నొక వీథిలోఁ దిరుగు • చాడ్పు వహించె వినోద పద్ధతిన్.

చ॥ సరసున రక్త తామరస • షండమునన్ వసియించు హంస లా
సరసిజవాసినిన్ ధరణి • జాతను గూర్చి వచింపలేమి ము
చ్చిరుచును రాము నెమ్మొగము • చేరికఁ జూడఁగలేక ఖిన్నతం
బొరయుచు వహ్నిలోఁ బడెను • వైనమునం గనుపట్టె నయ్యెడన్.

చ॥ ఎఱుకువ నిర్మలంబయిన • యేపున నుండియు నప్పు డప్పు దు
స్తరమగు మాయ గప్పఁగ ని • జస్థితి గానక పోవు రీతిఁ బు
ష్కరిణిని గల్గు ముత్తెములు • గట్టు ననిల్చి పరీక్ష సేయఁగా
మఱుఁగగుచుండు నందు జల • మధ్యమునం గల నాచు మొక్కలన్.

ఉ॥ మోదములేని రామ జన • ముఖ్యుఁడు చూచినచో సతీత్వమున్
సాదుగుణంబు రూపమగు • జానకి కన్నుల చుట్టలంచు బెం
పేదఁ దలంచి బాష్పజల • మీడని కన్నుల నీరు గార్చి వి
చ్ఛేద మనస్కుఁడౌ ననుచుఁ • జింతిలి లోన నడంగె వాలుగల్.

చ॥ వెదురుల నుండి పంక మద • విశ్రుత వారణ మస్తకంబులన్
జెదరిన ముత్తెముల్ మఱియుఁ • జెన్నగు పెక్కు విమాత్న రత్నముల్
మెదలుచు మీఁద రాజిల గ • మించుచు వచ్చెడు వాఁగు వెల్లువల్
మదవతు లుల్లసిల్లి చను • మాడ్కిఁ గనంబడుచుండు నయ్యెడన్.

చ॥ మదకరు లుల్లసిల్లి జల • మధ్యముచేరి కలంపఁ బుష్కరా
స్పదము భుజంగ పుంగవులు • సల్పిన దర్పక సంగరంబుచే
నదవదయై శ్రమం బతిశ • యంబుగ నొందిన వారకాంత యొ
ప్పిదమున నుండె; స్వార్థపర • వీరుల కార్యము లిట్టివే కదా?.

చ॥ కొదరుచు నింగి రాయు పెను • గొండలనుండి స్రవించు కీనెయున్
మద గజ ధారలున్ గుసుమ • మంజరులన్ భ్రమరంబు లూడ్చు పె
ల్లిదపు మధుద్రవంబు నట • లీనముగా జలపాయు లెల్ల రు
న్మదితులై యౌట నయ్యదొక • మానిని యోష్ఠసమం బనం దగెన్.

ఉ॥ బాసలయందు బంధురత • భాసిలు లక్షణ లక్ష్యజాలమున్
వీస మెఱుంగకుండు పెను • వేఱిఁడు లొక్కటఁ గూడి వేడ్కమైఁ

గాసటబీసటం బలుకు • కైపడి నవ్వయ బంధ శూన్య ని
ష్కాసిత వాగ్వినోదములఁ • గ్రాలు విహంగచయంబు లయ్యెడన్.

ఉ॥ ప్రాణసమంబుగాఁ దలఁచి • బాళిని కౌఁగిలి గాంచు హంసికన్
బ్రాణములన్ గళేబరము • పాసిన కైవడిఁ బాయు హంస గీ
ర్వాణ పదంబునుండి యల • రన్ మునుఁగం జను వేల్పుబోట్ల శిం
జాన మృదుస్వనంబు తన • జాయ యెలుంగని సంభ్రమించెడున్.

చ॥ పెను గిరులందు నుండి బహు • వేగముగాఁ బ్రవహించుచుండు వా
హినులు సుగంధ వృక్షముల • నీడిచి తేచుచుఁ దెచ్చి నింపఁ బ
త్తన జను లిమ్ముమై నొరసి • దండిగఁ బాత్రను నించు గంధమ
న్ననువున నొప్పు వర్షఋతు • వందలి యయ్యమృతాలయాంబువుల్.

ఉ॥ సాంకపగంధి మోవికిని • సాటి వహించెడు హల్లకంబులం
బొంకముగా స్రవించు మధు • వుం దగఁ గ్రోలి మదించు నక్రముల్;
సంకెలలం బలెన్ సొరిది • జన్మ మృతుల్ వహియించు లీల ను
ల్లంకు లొకళ్లొకళ్లగ మి • లం గొన మున్గుచుఁ దేలుచుండెడున్.

ఉ॥ ఇంచుగ రామభద్రునకు • నిందిర జానకిఁ దెచ్చి యిచ్చు నే
ర్పంచిత శక్తి లేమిఁ దమ • కైన తెలుంగున మేలు గూర్ప యో
చించి మరాళముల్ నడకఁ • జెంగలువల్ కనులన్ బ్రవాళముల్
కాంచనదేహ యోష్ఠమును • కానఁగఁ జేయుచు నుండెనత్తఱిన్.

చ॥ తొడవులకాంతి దిక్కులను • దూఁటఁగ నిత్యముఁ దానమాడ సం
దడిఁ జనుదెంచు నిర్జర మ • దావళ యానలు చేతి హంసలన్
గడఁగుచు నందియీయఁ జెలి • కత్తెలు తత్తట మందు నిల్చు కై
వడిని సరస్తటస్థ సుమ • వల్లులు హంసలతోడ నొప్పెడున్.

ఉ॥ మేటి తటాక నీరమున • మీఱు ఒక ప్రతిబింబ దృశ్యముల్
స్ఫాటిక కాంతులం గులుకు • స్వచ్ఛ జలంబుల నుండు మత్స్యముల్
పాటిలఁ గాంచి భీతిలుచుఁ • బాఱుచు దాఁగ బకోట యూటముల్
నీటుగఁ జెట్లకొమ్మలను • నిల్చి విదుల్చుచునుండు ఱెక్కలన్.

ఉ॥ తీరమునం దొకొక్క దెసఁ • దీరిచి చెక్కిన యట్టులున్న జం
భారి వినీల రత్న రుచి యంతటఁ బర్వ నొకొక్క ప్రక్కఁ బెం
పారిన పద్మరాగముల • యంచిత కాంతులు పర్వ. జక్కవల్
నేరక రేవగళ్ల తరు • ణీ కుచ యుగ్మముఁ బోలు నిచ్చలున్.

ఉ॥ వాలముఁ బోలు మీలు కర • వాలము ద్రిప్పిన రీతి నాడఁగా
వాలు తరంగ మధ్యముల • వారి ఘటీ తతి గజ్జగట్టి యు
ల్లీల నటించు గారడి వ • లెన్నటనంబు బెడంగు సేయ భే
కాలప మద్దిగాంచి యహ • హా. భళిరా! యను పొల్కిఁ గ్రాలెడిన్

శ్రీరాముఁడు జలపక్షుల తీరుగని సీతం దలంచికొని చింతించుట.

ఉ॥ సుందరమై మనోజ్ఞ గతి • శోభిలుచుండు సరోవరంబు రా
మేందుఁడు చూసి యందుగల • యింపగు హంసలఁ దమ్మిపూల నిం
దిందిర వారముం గని వి • దేహ తనూభవ యొద్దలేమి నా
నందము రోయు బుద్ధియును • నాశిల మిక్కిలి చింత నొందుచున్.

సీ॥ కవ వీడకుండు జ • క్కవలార! యందంపు, టంప మెత్తిన మేటి • హంసలార!
ఎడఁబాయ నొల్లని • యిల్లాలు చెఱవోయెఁ, జిక్కి సోలుచునుంటి • జింత మునిఁగి
ఇయ్యెడనైన మీ • రెదుట నిల్వరిదేల? యెడయిక పంట న • న్నేఁచు చుండఁ
గరుణించి నిల్చినఁ • గొఱయౌనె మీకీర్తి, మిముగాంచి యూఱట • మెలయరాదె?

తే॥ ఎన్నఁడు వియోగ బాధల • నెనయకుండు, నాకు మది సుంతనెమ్మది • సోఁకునట్లు
చెవుల కింపగు పల్కుండు • దవులఁ బలుకఁ, గీడు మూడునె? యాడిక•కిట్టులేమి?

చ॥ వికచ జలేజములు సురభి • వీచెడు కైరవముల్ చెలంగ జా
నకి నెడఁబాసి కుందెడు మ • నంబున కౌషధమౌ తటాకమా!
సకియ మొగంబుఁ గన్నులను చక్కఁగఁ జూపెదు నీవు పూర్తిమై
సుకముగఁ జూపు; మేలొనరఁ • జూడని లోభులు కీర్తిఁ గాంతురే?.

చ॥ కమలినిఁ బద్మకోకనద • కైరవ హల్లక వల్లులన్ దరం
గములను శైవలంబులను • గండు మిలం గని, యొసరంబ! నా
రమణిని పట్టి వ్యోమమున • రావణ హంతకుఁ డాహరించుచో
భ్రమయఁగ నంగముల్ చెదరి • పడ్డవె? యంచడుగున్ భ్రమంబునన్.

చ॥ ఉదుటున నాడుచున్ ముదము • నొందుచు నిక్కెడు కేకి! నామన
స్సదనకు నాఁడె యోడిలి వ • సంబున నిప్పుడు తృప్తిపొందితే?
సుదతిని గాంచలేక యిటు • స్రుక్కెడు నాపయి జాలి గల్గదో?
కొదుకక చెప్పవేమి వెయి • గొప్ప కనుల్గల నీవు కానవో?

చ॥ అలుకక రండు మీ యెఱుఁగు • నర్థముదెల్ప డు హంసులార! నా
వలన దొసంగు లేదు మద • వారణ యానయె మిమ్ము గెల్చె నా
కలికి పయిం బగం గొలుపఁ • గాఁ దగుఁగాని సమానదృష్టితో
నలువునఁ గాంచి సంతసిలు • నాయెడ మీరలు కోపగింతురే?.

చ॥ దళములఁ జేరి గీతము ము • దంబునఁ బాడ ద్విరేఫపాళికిన్
జెలువుగఁ జోటునిచ్చు సర • సీజములార! తొలంగరాని తొ
య్యలి నను వీడి స్వీయ నిం • యంబగు మీకడఁ జేరె లేదనం
బొలుపగునేమొ? పిల్గియును • బొంకెడు వారల మైత్రిఁ గాంతురే?

చ॥ ఒరి పలుకైన నాడకిటు • లొత్తిలి సీతముఖంబుఁ బోలు హా
ల్లరిము కులంగటం గల వి • లక్షణశైవలమా! కడంగి జా
నకి వదనంబు నీవయిన • నర్మిలిఁ జూపుము తత్సుధా ద్రవ
ప్రకట చణంబులై పరఁగు • పల్కుల నేవిన నిచ్చగింపవో?

ఉ॥ అంతర మేల బ్రాహ్మి! లలి • తాంగి శ్రవంబవు కాని వేఱుగా
వింత పరాకులేల? కృశి • యించుచు దిక్కులు దోఁపకిట్లు పె
న్వంతలఁ జిక్కు నన్నుగని • వారిజనేత్రను గూర్చి తెల్పవో?
యింతగ వేఁడుచున్న దయ • యింతయుఁ బూనక వైరమూనెదో?

చ॥ పగదము లెఱ్ఱదామరల • పై ఖచియించిన లీల నొప్పు ప
ద్యుగళ మలక్తకాంగుళులు • తోయద మండలిఁ బోలు ముంగురుల్
నెగడఁగ నన్ను పాయు ధర • ణీసుత కన్నుల మాడ్కి నొప్పు న
ల్లగలువలార! నన్ను వెత • లం బడఁ జేయుచు నవ్వ నాయమే?

ఉ॥ క్రూర వియోగ తాపమునఁ • గుందుచు నూర్పులు పుచ్చు రామ భూ
దారుఁడు పూఁ బొదళ్లగల • తత్తటమందున నిల్చి చూచి కా
సారమ! నామనోహరిని • జానకిఁ బాసి తపించుచుండ నో
దారుప కూరకుండు విది • ధర్మమొకో తలపోయ నీకనున్

మ॥ కరుణావారిధి రాఘవుండు మద పం • కం బొప్పు సారంగముల్
కరిణీ వారముఁ గాంచి తుండముల నా • కర్షించి తోయంబు మో
దరసాబ్ధిన్ మునుఁగంగ నంది యిడుటల్ • దర్శించి తన్వీమణిన్
ధరణీజాత వియోగ మెంచు నెద సం • తాపంబు వర్ధిల్లఁగన్

## శ్రీరాముఁడు సాయం సమయ కృత్యముల నిర్వర్తించుట

శా॥ ప్రేమానర్ఘ విభూషణుండు సుగుణ • శ్రేష్ఠుండు తమ్ముండు శ్రీ
రాముం గాంచి దివాకరుం డపర భూ • ధ్రం బొందె సంధ్యావిధుల్
నేమం బారఁగ నాచరించి భవ దు • న్మేష ప్రకీర్తిం బలెన్
భూమి ల్నిండు త్రివిక్రమేశు పదముల్ • పూజింపు మన్నా! యనన్

ఉ॥ రాముఁడు చింతతోఁ జనిత • రంగములన్ బొలుపారు నత్తటా
కామల తోయముల్ దొలిత • సందు తపంబు ఫలింప, సిగ్గుచే
సామజముల్ దొలంగ రభ • సంబున వారి శకుంత జాలముల్
భూమిజపాశిఁ జేర జల • ముల్ దరిముట్ట మునింగె నచ్చటన్

తే॥ అతఁ డానీట మజ్జన • మాడునంత నతని దహియించు విరహాగ్ని • యా తటాక
వనము లెల్లఁగాంచిన • యినుము ముంచి నట్టికరణిని సంసల • మనుచు నుడికె

ఉ॥ స్నానము చేసి యంతట స • నాతన ధర్మ పథానువర్తియై
మానుగ సాంధ్య కృత్యములు • మక్కువఁదీరిచి యర్ఘ్యమున్ రమే
శానున కప్పగించి విలస • ద్గుణులౌ ముని ముఖ్యులున్న యా
కానన మంద యొక్క యెడి • కమ్మగు తావున నిల్చెఁ దమ్ముతోన్

ఉ॥ సంజను చందనాదికము • చక్కఁగఁ దాల్చు విదేహ కన్యయున్
రంజిల రామికిఁ మనసు • రాగ వియోగ మహార్తిఁ గుందుచున్
గంజదళాక్షిఁ దుండునెడఁ • గంజ హితుం బలెఁ దీక్ష దేహుఁడై
కంజ విరోధి పుట్టెఁదొలి • గట్టుపయిం బలు దిట్టకైవడిన్

ఉ॥ తమ్ములు మోడ్పు సెందె ద్విర • దమ్ములు నిమ్ములఁ జేరె నీడజా
తమ్ములు గూండ్ల కేగె మృగ • తండము లెల్ల నడంగెఁ గీర సం
ఘమ్ములు పల్కులఁ వదలెఁ • గానల నాట్యము మానె నెమ్మి మొ
త్తమ్ములు గీతముల్ పరభృ • తమ్ములు నిల్పె ముడింగె నాకులున్

ఉ॥ నిద్రిలెఁ బ్రాణికోటి ధర • ణీధర సంస్థిత జీవరాసులున్
నిద్రిలె వ్యాళ సంఘములు • నిద్రిలెఁ దామరసాకరంబులున్
నిద్రిలెఁ బక్షి జాలములు • నిద్రిలె భూత పిశాచ సంతతుల్
నిద్రిలలేదు పాల్కడలి • నిద్రిలు సామజ యుగ్మ నేత్రముల్

ఉ॥ జ్ఞానము గల్గినంతఁ దన • జన్మరుజల్ విడిపోవు కైవడిన్
భానుఁడు పుట్టుడుందొలఁగె • బాధ తమంబును విచ్చెఁ గంజముల్
శ్రీనిధి రామ భూవరుఁడు • సెందెడు దుర్భర చింత తేలికై
జాను వహింపఁగా భువన • జాలము మేలుకొనంగ మేల్కొనెన్

చ॥ ఘనులగు రామలక్ష్మణులు • గ్రక్కున మేల్కని క్షీరవార్ధిక
న్యను హరిణాక్షి రాకొమిరె • నందములౌ వనులందు శైలకా
ననముల రోయుచుం జని మ • నంబున కంచెను వేగ ఋశ్యమూ
క నగము చేరఁ బోయి రెస • కమ్మన లెక్కఁడకుండఁ గ్లేశమున్

## 2. సాలభేదన పటలము. (145)

### సుగ్రీవుఁడు రామలక్ష్మణులఁగని భీతిల్లుట.

ఉ॥ వచ్చుచునున్న రాఘవుల • వారక యర్కసుతుండు కాంచి యీ
వచ్చెడు వార లింద్రజుని • పంపున వచ్చిన వారలంచుఁ దా
హెచ్చగు భీతి గుంది పెర • వేది రయంబునఁ దాటెఁ బ్రాణముల్
మచ్చికఁ గావఁ బూని యభి • మానము వీడి బిలంబు చేరఁగన్.

ఉ॥ పాఱుచు నాంజనేయుఁగని • పావని! కాంచితె యా సుధన్వులన్
వారలు వాలి పంపుగొని • వచ్చిన వారలు నన్ను చంపఁగాఁ
గారణ మింక వేఱొకటి • గలదె యంచు భయంబు పెంపునన్
దూఱెను దొడ్డ కందరము • తోయజ మిత్ర సుతుండు గ్రక్కునన్.

ఉ॥ తారుఁడు నీలుఁడున్ హనుమ • తక్క వనేచరరాజితోడ న
ట్లారక పాఱు సూర్యసుతు • నొయ్యన వెన్కని పోవుచుండ, భూ
దార కుమారకుల్ శబరి • తత్పరతన్ వచియించు త్రోవ సీ
తారమణీ మణిన్ వెదకు • దారి కనంబడు నంచు నెంచుచున్.

చ॥ వెదకుచు వచ్చుచుండఁ గపి • వీరులు కొందఱు వోయి వారు చిం
త దవిలి చంచలత్వమును • దైన్యము తోఁపఁగ వచ్చువారు జం
భదనుజవైరి పుత్త్రకుని • పంపున వచ్చిన వారు కారు భీ
తిదులను గారు చూడుఁ డనఁ • దేఁకువ మారుతి తేటి చూచుచున్.

శా॥ జ్వాలాభీల హలాహలంబు దెసలం, బర్వంగ నాదిత్యదై
త్యాళుల్ పొందిన భీతి మాన్చిన విరూ • పాక్షుం బలెన్ జ్ఞానమ
వేలంగాంచిన యాంజనేయుఁడు భయో • ద్వేగమ్ముసెన్ మానసా
లోలత్వంబు భజించు వానరుల క • ల్లోలంబులన్ మాన్చుచున్.

### హనుమ రామలక్ష్మణుల తెరు లారయుట

చ॥ భయపడ కిందె యుండుఁడని • పల్కి యొకానొక బ్రహ్మచారియై
రయమున వచ్చి రాఘవుల • రాజిత చాపుల మౌనివేషులన్
నయవిదులౌ మఱుంగున న • ణంగి కనుంగొని శంక నొంది సం
శయము తొలంగ నిట్లని వి • చారణ చేసెఁ గుశాగ్రబుద్ధియై.

సీ॥ దేవతా పూజ్యమూ • ర్తి త్రయంబా యన్న • నిద్దఱే యిచ్చట • నెసఁగువారు
పటు చాప హస్తు లి • వ్వారలఁ బోలిన, వార లే జగమున • వఱలఁబోరు
వీరి కసాధ్యమీ • పృథివిని గల్గునే?, వీరల నెఱిఁగెడి • వెరవులేదు
స్రుక్కన మదినొచ్చి • సోలు నట్లున్నారు, వీరు చింతిలఁ దగ్గ • వారుకారు

తే॥ సురవరులుగారు సామాన్య • నరులుకారు వీరి చింత యదెయ్యదో • పెద్దదగును
భ్రాంతిఁ గొల్పెడి యరుదైన • వస్తువొండు ఖిన్నులగుచు నన్వేషించు • చున్నవారు

సీ॥ ధర్మశీలంబులే • ధనముగాఁ • గలవారు శాంతి యుక్తులు కృపా • సాగరులను
లోకహితులు దేవ • లోకేశునను వెలుఁ గందు గభీరిమ • మొందినారు
ధర్మదేవత మెచ్చఁ ది • త్తఱ పుశీలంబు గలుగు వారలు జిత • కామ తనులు
కాలుండు నడయాను • ఘనపరాక్రమ గుణుల్ వీరి కార్యము నెంచ • వేలుకాదు

తే॥ ధర నలభ్యమౌ దేవాప్త • లంపఁదోలు నరిది వస్తువు నెద పీడి • యరయువారు
సింహములక్రియ దెసల వీ • క్షించు వారు వంచనము లేని మోములు • వఱలు వారు

చ॥ అసదృశ బుద్ధిశాలి యగు • నంజని పుత్త్రుఁడు వారి పేర్చు మా
ననమున నిట్లు పెక్కు విధ • నంబులుగాఁ దలపోసె ప్రీతిచే
నెసఁగి యెడంద యుంగిరఁగ • నెచ్చిరు భక్తియు హెచ్చరింప సం
తసమునఁ గాంచుచుండె మును • తప్పన నెయ్యురఁగాంచు కైవడిన్

ఉ॥ క్రూరగుణంబు గల్గు మృగ • కోటి పిశాచములుం గనుంగొనన్
గ్రూరత మాన్చు సాధుగుణ • కోటిగ మార్పఁగఁ దగ్గ శక్తి యే
పారు మహాత్ములంగని య • హా! పగవారని వైరిసేనలో
వారిని యెంచి భీతిగొని • పాఱఁగ హేతు వొకండుఁ గల్గునే?

చ॥ విహగము లెల్ల నంచనగు • వీరి శరీరము లెండ సోకఁగా
సహనము నొందలే రనుచు • జాలిని రెక్కల విప్పి పైపయిన్
బ్రహితుల బోలెఁ బందిరిగఁ • బర్వుచు వచ్చెడి మేఘ సంఘముల్
అహరహ డింపఁ దుంపురుఁ • దన్నుగఁ జల్లుచు వెంబడించెడిన్

ఉ॥ ఆశ్రిత తప్త గంధశిల • లన్నియు వీరి పదారవింద సం
పాతమునన్ మధుస్రవము • పైకొను పుష్పము లట్లు మేకొనుఁ
బ్రాంతిగ గుల్మముల్ లతలు • పాదపముల్ భువి వంగి వ్రాలుచున్
జోతలు సేయుచుండె నిదెఁ • జూడఁగ వీరలు ధర్మమూర్తులో.

మ॥ ఘన తాపత్రయమున్ గడచ్చి మతి యా • గామ్యాది కర్మాళి వీ
డను వోకార్చి యహాలయంబునకుఁ బో • కిల్మాన్చి కైవల్యమున్
గొనఁ గాన్పించెడు విష్ణుమూర్తులొ! కదం • గున్ శత్రుముల్ పైపయిన్
దనరన్ భక్తి యపారమై కలుగు కా • నన్ రాదు నిశ్చింతంబుగన్

మ॥ అని యాలోచన సేసి పరలును దా • యంగన్ వినీతాత్ముఁడై
యనుఁ దేజస్వుల రాక భవ్యమయి యి • ష్టావాప్తి చెకూరఁగన్

బొనుఁగొఁ గాత మనిష్టముల్, కుశలమే? పుణ్యాత్ములారా? యనన్
దనుజధ్వంసియు నీవెవండ వన ను • దత్యాత్రోధిఁ దా నిట్లనున్.

## హనుమ రామలక్ష్మణులకుఁ దమ వృత్తాంతము తెలుపుట

మ॥ వనదశ్యామల! పంకజేక్షణ! జగ • త్ప్రాణ ప్రసాదంబునన్
వనితో త్తంసిక యంజనాఖ్య గనియెన్ • బ్రఖ్యాతిమైఁ బేరునన్
హనుమంతుండను సూర్యపుత్త్రునకు మం • త్రాలోచనల్ సెప్పువాఁ
డను భవ్యాత్మకులార! నే వనచరుం • డన్ దాసుఁడన్ మీకడన్.

తే॥ ఇచట సుగ్రీవుఁడను వాన • రేశ్వరుండు, మిమ్ముగని తన మది శంక • మీఱుకతన
నరసి రమ్మన నాతని యాజ్ఞనూని, వచ్చినాఁడ నిటకు వీర • వర్యులార!.

తే॥ అనుడు శ్రీరామచంద్రుఁ డా • హనుమ పలుకు, లరసి విక్రమంబునను శాం • స్త్రార్థవితతి
నెఱుకయందు సద్గుణముల • నితనిసదృశు, లెవరు లేరని తమ్మితో • నిట్టులనియె.

క॥ ఇతఁడు పఠింపక మానిన, శ్రుతులును శాస్త్రములు లేవు • సూనృత వాక్యం
బతులిత మృదుల మధుర వా, గ్వితతి గలుగు నితఁ డజుండొ? • వృషభధ్వజుఁడో?

తే॥ జగతిసామాన్యుఁడగు బ్రహ్మ • చారిగాఁడు, విక్రమంబునుమహిమయు • వెలయువాఁడు
సుస్థిరుండు నిష్కపటి వి • శుద్ధగుణుఁడు, నిజము నీవు పిమ్మట గమ • నింపఁగలవు.

తే॥ ఋషులయందు నాకులయందు • నిట్టివాక్య, చతురుఁడెవ్వఁడుగలఁడు? ని • శ్చయముగాగ
నితని నేలు నాతని కిల • నేది కొదువ,? యనుచు హనుమంతుఁగని వెండి • యనియెనిట్లు

తే॥ ఓయి ధీవీర! కీశ కు • లోత్తముండు, రవిసుతుండెందు గలఁడు ని • ర్వక్రగతిని
అతనిఁ గనుకోర్కితోడనే • యరుగుదెంచి, నారమన నుత్సహించి వా • నరవరుండు.

చ॥ ఘనభుజులార! మీకుఁ ద్రిజ • గంబుల నెవ్వరు సాటి? మీరలి
ట్లను పమమైన నెయ్యమున • నా కపినాథుని చూడ రాకచే
ననితరసాధ్యమైన తప • మాతఁడు పూర్వ భవంబునందు చే
సినది ఫలించె నిప్పుడని • చిత్తమునం దలపోసి పొంగెదన్.

మ॥ బలభిత్సూనుఁడు వాలి కోపమున దు • ర్వైరంబు వర్ధిల్లఁ గా
వలఁదై చంపఁగ వెంబడింపఁ బురమున్ • వర్జించి యీకొండపై
బలు దుఃఖంబులఁ బొందుచున్ దిగులుతో • వర్తించు మాఱేని కీ
రలు విచ్చేయుట భాగ్యదేవత కృపన్ • బ్రత్యక్ష మౌటే కదా!.

మ॥ తమ వాంఛల్ నెఱవేర్చుకొంటకయి కా • దా జీవ సందోహముల్
ప్రమదంబారఁ బ్రయత్నముల్ సలుపుటల్? భావింప యజ్ఞాది ధ

ర్మములం జేయుదు రీ జగచ్ఛుభముకై • మాన్యుల్; భయంబందు ప్రా
ణము గాపాడుటకంటె ధర్మమొకఁడ • న్యంబున్నె ధాత్రీస్థలిన్?

సీ॥ మము గావ మీరు స • మర్థు లనుట చాలఁ, జులుకన మాటయై • నిలుచుఁగాదె?
యనిమిషులాది చ • రాచర వితతితో, నలరారు కృతకంబు • నకృతకంబు
కృతకాకృతకమయి • యెసఁగు నీ పదునాల్గు, జగములఁ గావంగఁ • జాలువారు
శరజన్ముఁ బోలిన • చక్కందనమ్ము ప, రాక్రమ గుణము లొ • ప్పారు మిమ్ము

తే॥ శరణ మొందిన మాకింక • జయముగాక, వేఱు గలుగునే? మాపరి • వృఢుఁడు నన్ను
వార లెవరని ప్రశ్నింపఁ • బలుకవలయు, వైనమును మీరె సెలవిండు, భద్రగుణులు!

తే॥ సత్యమను చేని కంచెయౌ • శ్వసన తనయుఁ, డిట్లు లడుగంగ సౌమిత్రి • యించుకంత
పొరపులేని తీరునఁ దమ పూర్వచరిత, పలుకఁ దొడఁగెను మృదుల వి • స్పష్టఫణితి.

సీ॥ జగతీతలంబు నా • జ్ఞా చక్రమునఁజేసి, చతురత నడపిన • చక్రవర్తి
శంబరాదులఁ జంపి • జన్నంబు లొనరించి, యమరలోకం బేలు • విమలకీర్తి
కరుణా కటాక్ష వీ • క్షణముల నర సురా, దుల మన్ననలఁ గొన్న • యలఘుమూర్తి
సత్యసంధుండును • సహజ సద్గుణుఁడుమ, నీతి విఖ్యాతుఁడౌ • నియతవర్తి

తే॥ మనుకులాభరణంబు ప్రా • మాణికుండు, ధరణిముఖ తిలకంబనఁ • దగునయోధ్య
నేలు నాతండు జయశాలి • హిత కృపాలి, ప్రథిత గుణశీలి దశరథ • రాజమౌళి.

శా॥ ఆ రాజన్యుని ముద్దుపట్టి రఘురా • మాఖ్యుం డితం డుర్వరా
భారం బెల్లను తండ్రి పల్కు నిలుపన్ • వైమాత కోరంగ నా
మేరం దమ్మున కిచ్చి యుల్లమున సం • ప్రీతిన్ మహారణ్యమున్
జేరన్ వచ్చె మహాత్ముఁడీతనిని నే • సేవించు సద్భృత్యుడన్.

ఉ॥ రాముని పుట్టుఁదొట్టి వివ • రంబుగ దండకఁ జేరు హేతువున్
బూమెలు చేసి రావణుఁడు • భూమిజఁ బందిగఁగొంచుఁ బోవుటల్
తాము నరోయుచుండుటలు • తక్కక దెల్ప సమీరుపట్టి చే
తో ముదమంది చాఁగిలెను • తోరపు భక్తి మనంబు నిండఁగన్.

చ॥ అటులు నమస్కరింపఁ గని • యంబుజనేత్రుఁడు విప్రవర్ణి వ
క్కట కయిమోడ్పుఁగాఁ దగునె • క్షత్రియ వర్యున కంచు నవ్వఁగాఁ
బటుతర నీతివిక్రముఁడు • పావని యిట్లనుఁ గింకరుండు మ
ర్కట కులజుం డటంచుఁ బలు • కుండొకొ! మీర లెఱుంగకుంటిరే?.

చ॥ అని గురుధర్మ పద్ధతుల • కాదరువైన మరుత్కుమారుఁ డ
య్యనకులు లక్కజంపడ వ • హించె నిజంబగు తొంటిరూపు మే

దిని గల సర్వవస్తువులు • తిన్నని పిన్నని వంచుఁ బల్కు వి
న్నసువునఁ, గాంచు వారల మ • నంబులు మిక్కిలి పిచ్చలింపఁగన్.

తే॥ జగముఁ గాలితోఁ గొలిచిన • చక్రి లోక, రక్షకుఁడు రాఘవుండె ది • గ్భ్రమము నొంద
మేరు నిభ శరీరుఁడును • మిహిర శిష్యుఁ, డైన పావనిన్ వర్ణింప • నరిదికాదె?

ఉ॥ తమ్ముఁడ! కాంచితే విమల • తత్త్వము సత్త్వము రూపుదాల్చిన
ట్లిమ్ముగ మోక్షమే యొకక • పీవ్వరు నాకృతి నొందు భాతిఁ దే
జమ్ముల పుంజమై వెలసె • సమ్మతి నిమ్మహనీయుఁ జేరి దుః
ఖమ్ముల నీఁగునట్టి యెడ • కమ్మ నెఱుఁగంగ నయ్యె నియ్యెడన్

చ॥ ఎడఁదల దుఃఖముల్ తొలఁగు • నింక సుఖమ్ములు వచ్చు నిక్కమీ
కడిఁది పరాక్రమ స్థిరుని • గల్గిన సూర్యసుతుం డదెట్టిఁడో
ఎడయక యెట్టి కార్యతతు • లేని వలంతులు నీతిమంతులై
య్యెడఁగల రట్టి ఘాపునకు • భృత్యులచే సమకూరు నన్నియున్.

చ॥ అని రఘువంశ పుంగవుఁడు • స్వాంతము పొంగ వచించి యానన్నం
బును వికసింపఁ గాంచుచు స • మున్నతి మారుతి వారిఁ గాంచి స
జ్జన మహితాంగ! మా ప్రభుని • చయ్యనఁ దోడ్కొని వత్తు మీర లి
చ్చను క్షణ మింత యుండుఁ డని • సత్వరుఁడై చరలెన్ దదాజ్ఞమై

చ॥ అతులిత నీతిమంతుఁ డగు • నా హనుమంతుఁడు చిత్తమందు శ్రీ
పతి గుణభూతి మాటికిని • భావన సేసి జగంబు నేను మా
పతియును కష్టముల్ తొలఁగ • బంధుర సౌఖ్యము లొందువారమై
బ్రతికితిమంచుఁ గీశవిభు • పాలికి నేగ వడిన్ ముదంబుతోన్.

## హనుమంతుఁడు సుగ్రీవునకు శ్రీరాము వృత్తాంతము తెలుపుట.

శా॥ వాలిం గీలి వధించు కాలుఁడిటకున్ • వచ్చెన్ మనోవేదనల్
తూలెన్ ధైర్యమునొందుఁడింక మది నా • తువ్వాక్యంబు సిద్ధించు స
త్కాలంబయ్యె నటంచు మారుతి మహా • కాలుండుపోలెన్ ముదా
లోలర్లీల నటించుచుం దెలిపె మే • లుం గూర్చి సుగ్రీవుతోన్.

చ॥ దివి భువి నాగలోకమున • దిక్కులఁ దక్కు జగంబు లెల్లెడన్
నెవడిన వారిచేఁ తలను • నేత్రములన్ నుదులన్ మనస్సులం
దవిలినవారు శత్రులకుఁ • దల్లడమందెడు వారలెల్ల వా
చవి సుధఁ బోలి చూడఁగల • చందము వారలు రాకుమారకుల్.

సీ॥ కల భూమియెల్ల నేకచ్ఛత్రముగ నేలె, నాతఁడు విమల వి • ఖ్యాతయశుఁడు
రాజ రత్న కిరీట • రంజిత పాదుఁడౌ, దశరథేశ్వరుని పు • త్త్రికులు ఘనులు

నీతిమంతులు కృపా • నిరతులు యువకులు, మహిమాన్వితులు ధర్మ • మార్గరతులు
కీర్తికాములు నీకుఁ • గిశరాజ్య మొసంగి, యుపకార మొనరింప • నోపువారు

తే॥ వారిలో జ్యేష్ఠుఁడగు రామ • వల్లభుండు, తాటకను సుబాహుని చంపి • తపసి మఖము
గాచి దివ్యాస్త్రములఁ గొని • గౌతమ సతి, శాపముం బాపినాఁడు వి • శాలగుణుఁడు

సీ॥ జనకుని పురికేగి • శంభు చాపముఁ ద్రుంచి, యవనిజాతను పెండ్లి • యాడినాఁడు
త్రోవలో నెదిరించి • డడుకుతనము చూపు, పరశురాముని భంగ • పఱచినాఁడు
తండ్రివాక్యము నిల్పఁ • దల్లికోరిక దీర్ప, నిలయెల్లఁ దమ్మున • కిచ్చినాఁడు
వనమున డీకొన్న • జన విరోధు విరాధు, యముని పురంబున • కంపినాఁడు

తే॥ దండకావనమెల్ల నిర్ • దైత్యముగను, సలుప ఖర దూషణాదులఁ • జంపినాఁడు
కాలగళకంఠు ఘన పరా • క్రమము వాఁడు, రామచంద్రుండు సజ్జన • రక్షకుండు.

తే॥ అతఁడు క్షీరసాగరశాయి • యైన హరియె, త్రిదశు లర్థింపఁ బుట్టిన • దేవదేవుఁ
డతనితో మైత్రి నెఱపుమా • యాపదాళి, యర్కుఁగను మంచు కైవడి • నడఁగిపోవు

క॥ మాయిని మారీచు నొకే, సాయకమునఁ ద్రుంచె జముని • సాటికబంధున్
మాయించె శబరి ఫలము ల, మేయ ప్రేమమున నొసఁగ • మెసఁగెం గరుణన్.

చ॥ కపివర, సంయమీశ్వరులు • గాఢ తపంబు చిరంబు చేసి యా
నృపవరు దర్శనంబుకయి • నింగిని గాచిన చాతకంబు చా
డుపు వహియించి బంధములు • మల్లఁగ గాంచిరి మోక్షసంపదన్
జపలుఁడఁ దన్మహత్త్వము వి • చక్షణచేసి వచింపనేర్తునే.

ఉ॥ క్రూరుఁడు రావణుండు కడు • క్రొవ్వున వంచనచేసి రామ భూ
దారుని ధర్మపత్నిఁ గొని • దండక మార్గముఁ బట్టిపోవ నా
వారిజ లోచనన్ వెనక • వచ్చిన వారలు నీ సఖిత్వముం
గోరినవారు నీసుగుణ • కోటియు మున్నుగ విన్నవారలున్.

మ॥ మనమీఁదం గృప నూనినారు మనకై • మర్దింతు రయ్యింద్రజున్
గనిసెన్ నీసుకృతంబులున్ శుభములం • గాంక్షించి కాకుత్స్థులన్
గని మైత్రిం బొనరింపఁగా నడవుమా • కాలంబు మేలయ్యె లె
మ్మని రాణ్ణీతి విశారదుం డఖిల కా • ర్యజ్ఞుండు వాక్రువ్వ గన్.

మ॥ తనపై నెమ్మిని మారుతాత్మజుఁడు చం • దంబొప్ప వాక్రువ్వ సం
తనగా సూక్ష్మమతిన్ గ్రహించి విపులో • త్సాహుండు సుగ్రీవుఁడ
త్యను మోదంబునఁ బావనిం గని గుణా • ఢ్యుః ధీయుతున్ మంత్రిగాఁ
గొను నా కెయ్యది దుర్ఘటం బనుచుఁ గా • కుత్స్థుం గనన్ వెల్వడెన్.

## రామసుగ్రీవులు మైత్రి సేయుట

మ॥ కనులారం గనె భానుసూనుఁ డచటన్ • గార్మేఘముం బోలె వి
చ్చిన యంభోజముఁబోలె షోడశ కళల్ • చెన్నారు చంద్రుంబలెన్
ఘనమౌ పచ్చలకొండవోలెఁ దగు శ్రీ • కాకుత్స్థు సత్కర్ణవే
ష్టన హీనంబగు నెమ్మొగంబును కడున్ • జల్వైన నేత్రద్వయిన్

చ॥ కని చిర మల్లె నిల్చి యెస • కంబున ధాత సృజించినట్టి భూ
త నివహమెల్లఁ బుట్టిన మొ • దల్కొని నిన్నటి దాఁకఁ జేయుచుం
డిన సుకృతంబు లన్నియుఁ బ • టిష్ఠతఁ గూడుచు రెండు దేహముల్
గొని యిటు పుట్టెఁ గావలయుఁ • గోరిక నంచుఁదలంచె నెమ్మదిన్

ఉ॥ ఇమ్మగ విష్టరశ్రవసుఁ • డీ యవతారమునందు మానవ
త్వమ్ము భజింపఁ గోరి యిటు • వంటి శరీరము దాల్చెఁ గాన లో
కమ్మున బ్రహ్మగా హరుఁడు • గా వహియించిన లీలకంటె మ
ర్త్యమ్మున మానవుం డగుట • నన్ని భవంబులకంటె మేలగున్

మ॥ అని సూర్యాత్మజుఁ డాత్మనెంచి పులకల్ • హర్షంబుచేఁ గ్రమ్మఁగం
దన నేత్రద్వయి నాస దీఱఁ గని యా • నందాబ్ధి నోలాడుచుం
జన శ్రీరాముఁడు ప్రేమ మీఱఁగఁ గరా • బ్జాతంబు వే చాఁచి ర
మ్మని సమ్మోహకరంబులైన కుశల • వ్యాహారముల్ సేయుచున్

శా॥ శ్రీరాముండును వానరేశ్వరుఁడు రం • జిల్లంగ సంధించి దు
ర్వారుల్ క్రూరులు దానవాళి యను ని • ర్లం ద్రోలి ధర్మంబు ని
ర్వైర ప్రక్రియ నిల్పఁ బూనిన యుగ • ద్వంద్వక్రియాసంధి నా
నారం బొల్చిరి దర్శఁ జేరు శశి కం • జాప్త ద్వయంబో యనన్

మ॥ తొలి పుణ్యంబుఁ బ్రయత్న మొక్కటిగఁ దో • డ్తోఁ జేరు మాడ్కిన్ గ్రుధా
కలిత క్రూర నిశాచరాఖ్య కలుషౌ • ఘంబుల్ విమూలింప శా
స్త్ర లసద్ జ్ఞానము తత్త్వవిజ్ఞతయుఁ బ్రా • ప్తంబైన చందంబునన్
దలఁపుల్ గూడఁగఁ జేరి రర్కసుత మా • ర్తండాన్వయుల్ సమ్మతిన్

చ॥ రవిసుతుఁ డంత నిట్లనియె • రాఘవుఁ గాంచి నయంబు మీఱ నో
రవికుల దీపకా! సకల • రాజితసద్గుణ రాశివై జగ
ద్భవుక వినోద కార్య సుఖ • భావనుఁడౌ నినుచేరఁగంటి నా
భవము కృతార్థమయ్యె నను • వంటి తపోధనుఁ డున్నె యీభువిన్?

ఉ॥ పున్నెము పండు వాఱ దలఁ • పుల్ నెఱవేఱుట యింకఁ జోద్యమే?
యన్న రఘూత్తముండు సుగు • ణాకర! మాకు నిషాది తెల్పె నీ

యున్న తెఱంగు నీవలన • నుత్కటశోకము నీగు నంచు మే
మెన్నిక వచ్చినార మది • యేగినదే యగు నన్న నాతఁడున్

చ॥ నడవడి తప్పి తమ్ముఁడగు • నన్ను మహా బలశాలి వాలి దుం
దుడుకున సర్వభూమియును • తోయధులున్ ఘన చక్రవాళమున్
గడచని పోవఁగాఁ దఱిమి • ఖండన సేయఁ దలంపఁ బ్రాణముల్
విడువఁగ లేక యీగిరిని • వీడక యుందు భయంబు పెంపునన్.

చ॥ మిము శరణంటి నన్ను కృప • మీఱఁగ నేలుట మీకుఁ బాడి చం
ద్రమనుడు రామచంద్రుఁ డను • ధర్మగుణాకర! యింతదాఁకఁ దో
రముగ భరించినట్టి కడు • రాయిడి తీఱెను రేఁగ దింక సౌ
ఖ్యములను దుఃఖముల్ మనకుఁ • గల్గు సమంబుగ నింత యేటికిన్

సీ॥ నిను పఱిచెడువాఁడె • ననుపఱిచెడు వాఁడు, నీ విరోధియె సుమ్ము • నా విరోధి
నీ చెలికాఁడెపో • నాచెలికాఁడు నీ, బంధు వితతి నాకు • బంధు వితతి
నీకు దుఃఖంబేది • నాకు దుఃఖమ్మది, నీ సుఖంబైనదే • నా సుఖమ్ము
నీవు ప్రాణమువంటి • నెయ్యుఁడవైతనఁ, గపులెల్ల ముదమను • కడలి మునిఁగి

తే॥ రామచంద్ర విభుని వాక్య • రాజి సకల, జగములకు వేదముల మించి • నెగడుననిరి
హనుమ పులకితగాత్రుఁడై • యాడె సురలు, విరులు గురిసిరి మొగులు తుం • పురులు ర్చె

ఉ॥ అంతట రామభద్రునకు • నంజలిఁచేయుచు నాంజనేయుఁడో
సంతత కేళులార! స్థిర • సంపద మీ చెలికార మొంది క
ల్పాంతముదాఁక లోకులకు • సత్కలి నించెదు తారకాణయై
మంతు వహించుఁగాక యిఁక • మాభవనంబున కేగుదెండనన్.

చ॥ సరియని రామలక్ష్మణులు • సార సమిత్రసుతుండు లేవ వా
నరులును చుట్టిరాఁ బనస • నాగ తమాల రసాల సాలముల్
సరసులు గల్గి పుణ్యఫల • సంపదవోలె వెలింగి పుష్ప వ
ల్లరులు రహించు తోఁటకు వి • లాసముతోఁ జని రుల్లసిల్లుచున్.

ఉ॥ చందన వృక్ష సంతతులు • స్ఫాటిక సుందర కందరంబు లం
దందు రహించు నిర్మల జ • లాశయముల్ వికచాంబుజాతముల్
పొందుగఁ దత్తటస్థ ఘన • భూజ శిఖాంతర దోలలందు వే
ల్పుం దలిరాకుఁబోండ్లు తమి • వొంగఁగ నూఁగుట నేత్రపర్వమౌ.

సీ॥ విబుధసభను మూర్ధ • వెలయనిరీతి ను, ద్యానమందు మణి వి • తానకాంతి
పుంజ మెదుట గార • ముం బొందలేషయ్యె, సూర్య చంద్రముల వి • శుద్ధ రుచులు

ఆ॥ అట్టి యుచితమైన • యలరుల తోటలో, రాఘవులును ప్లవగ • రాజు విరుల
యాసనంబులను సు • ఖాసీనులై వేడ్క, ముచ్చటించుకొనుచు • ముదితులైరి.

ఆ॥ కందమూలములును • కాయలు పండ్లును, చవులు మీఱు మంచి • శాకములును
కపులు గొంపదేరఁ • గాకుత్స్థులిలకుందు, స్నానమాడి మెక్కి • క్రమము వీడె.

ఆ॥ అనఘుఁ డిట్టు లలని • కలిమియై మునిమంది, నరపతోఁడఁ గని గృ • హస్థ ధర్మ
మెడలకుండ నడప • గృహిణిని సీతను, పాసితేమి యనుచుఁ • బ్రశ్న సేసె.

## హనుమ శ్రీరామునకు వాలివృత్తాంతము తెలుపుట

క॥ శ్రీరాముని ప్రశ్నమునకు, మారుతి కేల్మోగిచి నిలిచి • మహనీయగుణా!
పూరింపఁ జెప్పదగునది, మీరలు సవధానమతిని • మేకొని వినుఁడీ.

క॥ శంకరు ననుగ్రహమున వి, శంకటగతి వరబలంబు , సామర్థ్యంబున్
జంకు గొలుపు విక్రమ మక, లంకంబుగఁ గొన్నవాఁడు • లావు గలాఁడున్.

తే॥ దేవదానవుల్ క్షీరవా • ర్ధిని మధించు, తఱిని తరిత్రాటి యొప్పమే • నరగునట్టు
లొక్కఁడే యురుగేలను • చిక్కఁబట్టి, తరిచినట్టి బాహుబలంబు • తనరువాఁడు.

తే॥ అవనిజలము తేజమువాయు • వనెడునాల్గు, భూతములసత్త్వమొక్కటై • పొలుచువాఁడు
చక్రవాళంబునుండి యా • శైలమునకుఁ, దేలికగ లీల దాఁటంగఁ • జాలువాఁడు

తే॥ ఐవర మొనరింప నెదిరించు • వారి బలము • సగము లాగికొనెడు వర • శక్తిగలడు
ప్రతిదినంబు దిక్కుల కొన • పఱకు నేగి, వార్ధి నీరాడి హరుఁ గొల్చి • వచ్చువాఁడు

ఉత్సా॥ గాలి వాని యాశుగతిని • గడవఁజాల దెప్పుడున్
శూలి సుతుని బల్లెమతని • సూటి త్రొమ్మ పొడువదున్
వాలి వాలు • చొచ్చని తావు • పంక్తిశిరుఁడుఁ దోపఁడున్
వాలి యనెడివాఁడు కలన • వాయువాఁడు మిక్కిలిన్.

తే॥ వాఁడు కుప్పించి యెగసిన • పడికి గిరులు, పెకలి లేచును ఘనభుజ • వేగమునకు
జలదములు గ్రహసంఘముల్ • కలఁకఁబాఱి, గతులుదప్పును వివరింపఁ • గలమె బలిమి?

మ॥ ధరణిం గోఱలఁ గ్రుచ్చి యెత్తుకిటి మం • థానాద్రి యంభోనిధిన్
దరుప న్నిల్పిన కూర్మముం హరిపద • ధ్యానైక శీలున్ గుణో
త్కరు రక్షింపఁగ నాహిరణ్యకశిపుం • దర్పించి చక్కాఁడు భీ
కరరూపుండు నృసింహుఁడున్ గపివరున్ • గయ్యంబులో గెల్తురే?

తే॥ వేయి పడగలతో ఫణి • విభుఁడు మోచు, పుడమి నగచరుఁడగు వాలి • నడచుచుండి
యె భరింపఁగలఁడు వాని • యేపు కొల్చి, తెలుప వేల్పులకేనియు • నలవికాదు.

తే॥ సతము జలధి ఘోషించుట • శ్వసనుఁడెపుడు, సంచలించుచుండుట నివ • స్వంతుఁడెల్ల
వేళఁ దిరుగుచుండుట వాలి • బెట్టిదంపుఁ, గినుకకై బిట్టు బెదరియె • యని తలంతు.

ఉ॥ వానరసేన కంతకును • వాలి యధీశుఁడుగాఁగ నుండఁగాఁ
బ్రాణములం గొనంగ సమ • వర్తియు జంకుచునుండు వాని యా
రాణువ లెక్కవెట్టఁగ వి • రాజిలు దెబ్బది వెల్వలా సువ
ర్వాణ నగంబునేని కద • వం దలక్రిందొనరింప శక్తముల్

తే॥ మొగులుమొరయ చమీఁదుగాఁ • బోవవెఱచు, సింగములుకందరముల గ • ర్జింప వెఱచు
విరులు రాలంగ వాయువు • వీవ వెఱచు, వాలి పౌరుషమేమని పలుకనేర్తు?

తే॥ వాలి వాలంబుచే బల • వంతుఁడైన, రావణుని భుజములఁ బట్టి • రాణ చెడఁగఁ
జుట్టి కొంపోవ నెత్తురు • సోఁకకుండు, తలము నాతఁడు పోవని • తలముఁగలదె?.

క॥ శతమఖునకు ప్రియ సుతుఁడగు, నతఁ డుడుపతి సాటియైన • స్వచ్ఛ తనుండున్
వితృపతికి నాజ్ఞ యిడఁదగు, ధృతిమంతుం డితని యన్న • తేజోయుతుఁడున్.

ఉ॥ ఈవిధి వాలి వాలి ప్లవ • గేశ్వరుఁడై మము గాచుచుండ సు
గ్రీవుఁడు యౌవరాజ్యమునఁ గీర్తి వహించుచునుండ నీచు మా
యావి యనంగ నొప్పు దను • జాధముఁ డొక్కఁడు వచ్చి మించి దు
ర్భావముతో రణంబునకు • రమ్మని వాలిని పిల్చెఁ బెల్చనన్.

చ॥ పిలువఁగ వాలియున్ దనుజ • వీరుని దాఁకి కలంచి నొంపఁగా
నిలువఁగలేక రక్కసుఁడు • నిల్వనఁ జంపెడి నంచుఁ బాఱుచున్
నిలువక వెంబడించు కపి • నేతను గన్గొని ప్రాణ భీతిచే
వెల వెల వోయి యొక్క బిల • వీధిని చేరఁగ వాలి యంతటన్.

ఉ॥ వెంబడి వచ్చుచుండు కపి • వీరుని తమ్ముని గాంచి సావధా
నంబున నీ గుహాముఖము • నన్నిలుమేను సురారిఁదెత్తు శౌ
ర్యంబునఁ దాఁకెనేని సమ • రం బొనరించి వధించి వత్తుధై
ర్యంబున నుండుమంచుఁ గుహ • రాంతర సీమను చొచ్చి యవ్వలన్.

క॥ పదునాలుగు ఋతువులు దు, ర్మదుని వెదకి యెట్టులయిన • మదియించెడు ప
ద్దెదఁ దలపోయుచునుండఁగ, మది సుగ్రీవుండు దుఃఖ మగ్నుం డగుచున్

చ॥ మతకరి రక్కసీఁడు మటు • మాయముగాఁ జనె నన్నకింత్రకే
వితము ఘటించెనో యెఱుఁగ • వీలు గనంబడ దేమునేగి యా
హతకు వధింతుఁ గానియెడ • నంతము నొందెద వానిచేత నం
చితఁడును బోవఁగాఁ దొడర • నేమును పౌరుల నడ్డువెట్టుచున్

చ॥ తగదని లోకనింద యని • తా మది నొప్పకయున్న నెన్నియో
తగవులు పల్కి వేఁడుకొనఁ • దక్కటి వారలు చింతనూని యొ
ప్పుగఁ బురికేగుదేరమని • పొందికతో బలిమాలఁ ద్రోసి పు
చ్చఁగ మదిరాక తుట్టతుద • సమ్మతిచూపెఁ బురంబు చేరఁగన్

చ॥ తలకొని వాలిఁ జక్కఁడఁచి • దైత్యుఁడు ద్వారము దాఁటి పట్టన
స్థలికిని వచ్చునేమొ? యని • తద్బిలమున్ బెను ఱాత మూసి పె
ద్దక్కలు శిల లొక్క పేరుపుగఁ • గూర్చితి మా శిల కూఁతగాఁగ న
వ్వల రవిపుత్త్రుఁ దోడుకొని • వచ్చితి మయ్య పురంబు చేరఁగన్

మ॥ అట మాయావిని గూల్చి ప్రాణ మధువు • ద్యత్త్రొప్ధిమైఁ గ్రోలి యు
త్కట మత్తుండయి వాలి ధీరత గుహా • ద్వారంబు దాపించి య
చ్చటి మూఁతంగని సూర్యజుంబిలిచి యే • చందాన మార్మాట యొ
క్కటియున్ లేమికి ఱిచ్చనొంది వడిను • గ్రక్రోధుఁడై యంతటన్

ఉ॥ వాఁముతోడఁ బాదమును • పైకెగయించి బలిష్ఠ చండ వా
తూలముఁ బోలెఁ దన్న వడిఁ • దూలి శిలా నికరంబు లవ్వనన్
దూలము వోల్కిఁ గొన్ని చని • తోయద మండల మంటెఁ గొన్నిది
గ్జాలము దాఁకెఁ గొన్ని పడె • సాగరమందున ఱివ్వు ఱివ్వనన్

ఉ॥ ఉరవడి వాలి వెల్వడి మ • హోద్ధతిఁ గాంచిన వారలెల్లఁ బె
ల్లుక్కఱి పఱవంగ నచ్చటికి • ఘోరతరాకృతితోడ రా గుణో
త్తరుఁ దకలంకుఁ డాశ్రవుఁడు • తామరసాప్తసుతుండు చూచి త
చ్చరణములందు వ్రాలె భయ • సంభ్రమ భక్తులు ముప్పిరిం గొనన్

ఉ॥ వ్రాలి నమస్కరించి ప్రభు వర్య! • భవత్పునరాగమంబు మా
కేలొకొ లేమిఁజేసి తపి • యించి మహాపద మూఁడె నంచు మీ
పాలికి రాఁ బ్రయత్నపడ • వానర సూరులు మంత్రివర్యు లీ
కోలును చూప కిచ్చటికిఁ • గోరికఁ దెచ్చిరి తమ్ము గావఁగన్

ఉ॥ వారల యాజ్ఞకున్ వెఱచి • వచ్చితి నిచ్చటి కిట్టు లీ ధరా
భారము పూని మీకడకుఁ • బట్టుగ రామికి సిగ్గునొందు నా
తోరపు దోషమున్ దయను • ద్రోచి కృపామతి నాదరింపుమా
నేరమి పిన్నలం గలుగ • నేర్చిన పెద్దలు సైఁచు టొప్పగున్

ఉ॥ తమ్ముఁ డిటుల్ వచింప భయ • దమ్ముగ నింద్రసుతుండు కాంచి గ
ర్వమ్ములు ప్రేవులుం గలఁగ • రక్కసమాటలు పల్కి తమ్ము దే

హమ్మ నలంగ మోఁదె జల • జాప్త తనూజుఁడు డిల్లవోఁ బ్లవం
గమ్ములు దొడ్డభీతిని క • కావికలై దిశలన్ భజింపఁగన్

మ॥ పరితాపంబున సూర్యసూనుఁడు భయ • భ్రాంతిం బయోరాసులం
బరఁగం దాఁటి యజాండ భిత్తిక సమీ • పం బొందఁగాఁ జేరినన్
గరుణాసంగములేక వాలి హరి సం • కాశుం డనాయాస స
త్వర సత్త్వంబున దాఁటి పోయెనన • సీతానాథుఁ డగ్గించుచున్

మ॥ మనసుగ్రీవు డు వాలిచే నపుడె సా • మర్థ్యంబునన్ దూఁకుచుం
జను చందంబులు నేర్పెఁ గావలయుఁ గ • ష్టంబొంది యంచాంజనే
యుని వీక్షించి యనంతరంబు త్రిదివే • శోత్తంస మార్తాండ నం
దనులే జాడలఁ బోయిరో యన జగ • త్ప్రాణాత్మజుం డిట్లనున్

చ॥ జలధుల కవ్వలం జరగి • సారసమిత్ర మయూఖ సంతతుల్
చెలఁగని చక్రవాళగిరిఁ • జేరియు వెండి యతిక్రమించుచున్
జలజభవాండ భిత్తికను • చయ్యన నింద్రసుతుండు డాసి య
చ్చటమునఁ బట్టె నాతని వి • శంకట వృత్తిని పిచ్చలించుచున్

ఉ॥ సోదర హింసకుం డనెడు • సుద్ది జగంబు వచించు నంచు సుం
తేఁ దన మానసంబున మ • తింపక దొడ్డకరంబు లెత్తుడున్
ఖేదిలు సీతఁ దయ్యదను • కీర్ప్రదకుండఁగఁ జూచి వేగ ని
ర్మోదముతోడఁ బాతెఁ దన • ముందటి వెల్ల నలంగఁ ద్రొక్కుచున్

చ॥ పటపటమంచు వాలి తన • పండ్లను గీటిన కాలుఁ దేనియున్
దటతటపొంది తా సభయ • దానము చేసిన వానిఁ గావఁగా
నటమటనూనుఁ బూర్వము మ • హాత్మ మతంగుని శాపభీతిచేఁ
గటకట! రాఁడు గాన మనఁ గగ్గె • నితం డిట నిన్నినాళ్లుగన్

తే॥ ఇతని ధర్మపత్నిని రుమ • సెతఁడుకోరి చేరఁదీసె సీతండు సు • శ్రీని స్త్రీని
వదలి రెంటికిం జెడ్డరే • వఁడుగ నున్న వాఁ డనుచుఁ బల్కెఁ దత్కథ • పవనసుత

తే॥ నిత్యనిర్మలుఁడగు రామ • నృపవరుండు మిత్రుకథ విని కోపంబు • మిగులనూనెఁ
గ్రుంగువేళ జగంబుల • గ్రుంగునట్టి పెదవి కంపించెఁ గెంపొందె • వీక్షణములు

చ॥ అరయఁ జతుర్ముఖుండు నిట • లాక్షుఁడుఁ దక్కు సురాధిపాదులే
పరముని వాఙ్మనః క్రియల • భావనసేసి గ్రహింపనేర రా
హరి తన పాదపంకజము • లాదట ధాత్రి వహింపనుంచుటల్
ధరణి నధర్మముం జెఱిచి • ధర్మము నిల్కఁగ నిప్పనే కదా?

చ॥ దయ యొక యింతలేని పిన • తల్లి వచించిన దంచుఁ దమ్ముకై
రయమున సర్వసంపదలు • రాజ్యభరంబు నొసంగు నాకృపా
మయుఁడు దయం దొఱంగి యొక • మందుఁడు తమ్ముసతిన్ హరించుటల్
స్వయముగ విన్నవించు తరు • వాత సహించుచు నూరకుండునే?

ఉ॥ వానర వీరులార! త్రిభు • వంబులఁ గల్గిన వీరు లెల్లరుం
బూనిక వచ్చి వాలి యను • వుల్ పరిరక్షణసేయ నిల్చినన్
మానక యుక్కడంచి కపి • మాన్యధరిత్రి రుమా యుతంబుగన్
మానుగ నీకు నిత్తు నను • మానము మానము వానిఁ జూపుమా

ఉ॥ నావుఁడు దుఃఖసాగరము • నం బడి మున్గి తపించుచున్న సు
గ్రీవుఁడు తత్తటంబుఁ దిల • కించి ముదంబను వార్ధిఁజొచ్చితా
నావల రాముఁగూర్చి ప్లవ • గావళితోఁ దలపోయఁ దగ్గ సం
భావన గల్గునంచు మతి • మంతులఁ బావని ముఖ్యమంత్రులన్

ఉ॥ దూరముగాఁగ నింగితులఁ • దోడ్కొని పోవఁ గపీంద్రుఁ గాంచి సా
మీరి వచించు నీతలఁపు • మేవిన భావ మెఱింగినాఁడ జం
భారిసుతున్ వధింపఁ గల • యట్టి పరాక్రమ సత్త్వసంపదల్
వారికిఁ గల్గనే యని య • వారణ సంశయ మంద నేటికిన్?

## హనుమ సుగ్రీవుని సంశయము దీర్చుట

ఉ॥ ఆతని హస్త పాదముల • యందు సుదర్శన శంఖరేఖ లు
ద్ద్యోతక విశ్వ వంద్య లస • దుత్తమ పూరుష లక్షణాళి వి
ఖ్యాతము గాఁగ నున్నవి జ • గంబున నేరికిఁ గానఁ గాన ల
క్ష్మీరమణీ విభుండె యగు • సిద్ధము నమ్ముము నా వచస్సులన్

చ॥ త్రిపురములన్ దహించి యతి • తీవ్ర రుషా సహితుం గృతాంతు ము
న్వ్యపగత జీవుఁ జేసిన క • పర్ది కరాంచిత భీష్మ చాపమున్
ద్రవగొని రాజసూనులు శ • రంబులు వంపఁగ నెక్కువెట్టి చి
ద్రుప లొనరించు సత్త్వుఁడు చ • తుర్భుజుఁ డొక్కఁడు దక్కఁ గల్గనే?

ఉ॥ నాజనకుండు వాయు వొక • నాడు 'కుమారక! ధాతఁగన్న పం
కేజదళాయతాక్షునకుఁ • గింకర వృత్తి గడింతు వీవు త
త్పూజయె నీకు నాకు భవ • దుఃఖము లెల్లఁ దొలంచు జన్మము
త్తేజితరీతిఁ బొల్చు' నని • తెల్పఁగ నేనను సం, యించుచున్,

ఉ॥ అప్పురుషోత్తముం దెలియు • నంగముఁ దెల్పఁడి యన్న నాతఁడున్
ముప్పు జగంబువొందు తఱిఁ • బుట్టి ప్రసన్నతఁ గానవచ్చుచోఁ

విప్పగు భక్తి చేకుఱ బ్ర • వించును బ్రేవు లకారణంబుగా
నప్పుడు తత్కృపాకరు ప • దాంబుజ సేవ యొనర్పుమా యనెన్

ఉ॥ వానరవర్య! తద్విధమె • వర్తిలె నిప్పుడు శంకలేల? శ్రీ
జాని మహత్త్వసత్త్వముల • చంద మెఱుంగఁ దలంచి కేని ల
క్ష్యానకు లొంగకుండు తరు • సప్తక మొక్క శిలీముఖంబుచే
నూనము లేక తూటి చన • నొయ్యన నేయుట చూతమా యనన్

చ॥ భళియని తోడునీడయగు • వాయుకుమారుని గట్టిగాఁ గవుం
గిలి గొని మోదమంది తుల • కించుచు రాముని చెంతకేగి ప్రాం
జలి ఘటియించి రండని వి • నమ్రతఁ దోడ్కొని పోయి యొక్కచో
నిలిపి నభంబు రాయు నవ • నీజములం గనిపించి యిట్లనెన్

తే॥ గీ॥ మహోన్నత సాలంబు • లేదు నొక్క, యిషువుచే రంధ్రములు వహి • యించు
ప్రబ్బి యున్నట్టి నామనో • వ్యాకులతయుఁ, దాఱునని వచియింపఁగ • దాశరథియు

క॥ ఇనసుతుకోర్కి దెలిసి మో, మున మందస్మితము చెలువు • పొలుపారఁగనె
ట్టన ధనువున గుణమెక్కిడి, ఘన తరువుల చెంత కరిగె • గజగమనుండై

## సప్తసాలవర్ణనము

చ॥ యుగములు మాఱినన్ నిలుచు • నున్కి నశింపదు లోక జాలముల్
తెగు తఱియైన నీ తరులు • తీఱవు సప్త కులాచలంబులే
యగములుగాఁగ నిల్చినవి • యంచు వచింపఁగ దగ్గ సంస్థితిన్
నెగడి మహోన్నతంబులయి • నింగిని రాయుచునుండు నెప్పుడున్

చ॥ ఇన శశులీ మహీజ శిఖ • రేంద్రముఁగాంచి తరింపలేక చిం
తను తపమూన బ్రహ్మయు ను • దగ్ర మహోత్కట సాల సప్తకం
బును గని దచ్ఛిరోగ్ర దశ • ముల్ గని తెల్పఁగలేకపోవఁగా
మనుజులు దాని యున్నతిని • మానుగఁ గొల్చి వచింప నేర్తురే?

చ॥ ప్రతిదినముం బ్రతిక్షణము • భానుని వాజులు ప్రాలు మాల కి
ట్లతితర వేగముం గొని ప్ర • యాణము సేయ మఱొక్క హేతువున్
వెతకినఁ గానరాదు తరు • విస్తృతి దిక్కులఁ బర్వి పూర్ణసాం
ద్రత గొన దాని నీడ నలఁ • తం భజియింపక యుండు నిత్యమున్

చ॥ చదలఁ జిరంబుగాఁ బొదలు • చక్కని చుక్కలు గాము లుప్పరం
బు దవిలి యెల్ల దిక్కులను • పొల్పు వహించెడి విందు పూచు నొ
ప్పిదమగు పూవులే విటప • వేధముచే వ్రణమైన మచ్చయే
యెద శశి కందటంచు వచి • యింపఁగ నొప్పెఁ దదున్నత స్థితుల్

ఉ॥ భేదము సేయరాని పృథి • వీజము లందలి కొమ్మ రెమ్మలా
చ్ఛాదనసేసి వ్యోమము ది • శా వలయంబును గప్పియుంటచే
వేదములట్లు పొల్చుటను • వేలుపుఁబెద్ద హంసయి హంసితో
మోద విహారముల్ సలుపఁ • బోలుననటంచు వచింపఁగాఁ దగున్.

ఉ॥ గాలి చలింపఁగా విసరఁ • గమ్మని వాసన వీచు పుష్ప ప
త్రాలియుఁ బండ్లు కాయలు స • మస్తము చెట్టుల నుండి డుల్లి య
వ్వేలుపువాఁకయందు పడి • వేళమ భూమికిఁ జాటి తోయధిన్
బోలఁగఁ జేరఁగాఁ దగు స • మున్నతి నొప్పెను సప్తసాలముల్.

చ॥ కొనలు గనంగ రా వజుని • గోళములం దగదాఁటి యవ్వలన్
మొనరఁగఁ బోలు నన్న విధ • మున్ వహియించి త్రివిక్రముంబలెం
బొనరి ధరిత్రి మధ్యమునఁ • బొల్చు హిరణ్య నగంబువోలె లా
వునఁ దనుపొంది చూపులకు • భూరి భయంకరమై విరాజిలున్.

తే॥ వాలి సుగ్రీవుల మనంబు • పగిది చేవ, గలిగి. యాదిశేషుని పద • గలను గూడఁ
జీల్చుకొని క్రిందికిం బోవఁ • జెనయు వేళ్లు, గలిగి మద్దు లభేద్యమై • వెలయుచుండు

తే॥ పెరిఁగి దట్టమై పరవిన • విటప చయము, భాస్కర నిరోధ శంక యా • వహిలఁజేసి
యుదయ చరమ గిరులకంటె • నున్నతిగొని, యోజనంబువిస్తృతితోడ • నొప్పుచుండె

మ॥ ఇటు లొప్పారెడు సప్తసాల నికరం • బీక్షించి రాముండు త
త్పటు బాహాబల మంత వారలకుఁ జూ • పంబూని జీవశ్రవః
పుటముల్ గింగురు వోవ నిర్ఘరవరుల్ • మున్నెన్నఁడున్ లేని సం
కటముం బొందఁగ నుల్లసిల్లి గుణ టం • కారంబు గావింపఁగన్.

ఉ॥ దగ్గఱ నున్నవారలును • దవ్వుల నుండెడివారు దిక్కరుల్
బెగ్గిలి సొమ్మవోవ సర • వింద భవుండు దినంబు లెంచ మి
న్నొగ్గె ఫణీంద్రుఁడున్ వడఁకి • యొరకువ్రాల్చె ఫణంబు లన్నిటిన్
గ్రొగ్గతిలంగఁ బడ్డవి స • రోజ హితాశ్వము లచ్చలించుచున్.

తే॥ శత్రు సంహారకుండు దా • శరధి నాప, గుణ నినాదంబు విన్న ల • క్ష్మణుఁడుదక్కఁ
దక్కువారలు పడు నవ • స్థల వచింప, నవమతించిన చందమే • యగునుగాదె

తే॥ హనుమ దాదులు నిబ్బర • మంది రాము. నస్త్ర విద్యా మహత్త్వమ్ము • నరయఁగోరి
పూన్కినిలువ నాకర్ణాంత • ముగను లాగి. నీరజాక్షుండు పటువెను • నిశిత శరము.

## సాల వేధనము

ఉ॥ సాయక మంత సాల తరు • సప్తకముం దొలచేసి క్రింద స
ప్తాయత లోకముల్ దొలిచి • యవ్వల నేడగు వస్తుపాళి లే

దే యని క్రమ్మఱిల్లి వసు • ధేశు నిషంగము చేరె సప్త సం
ఖ్యాయుతముండుచోఁ దొలిచి • యవ్వలికిం జన కేగుదెంచునే?

చ॥ జలనిధు లూర్ధ్వలోకములు • శైలములున్ ఋషు లర్కవాజులున్
మఱియు మరుత్తులున్ భువన • మాతృకలున్ గ్రహరాజి యుల్కి చం
చలత భజించి యే డనెడు • సంఖ్యను గల్గుట రామబాణ మి
మ్మెలఁ దొలచెసి చంపునని • పొల్పును వీడి వడంకె నయ్యెడన్

శా॥ లోక త్రాణ పరాయణుండగున శ్రీ • లోలుండు దుష్టాత్మలన్
జోకన్ గూలిచి ధర్మము న్నిలుప సు • శ్లోక స్ఫుర జ్జన్మమున్
శ్రీకారుణ్యము తోడ నొందెనని సు • గ్రీవుండు నిర్భీతి న
స్తోక ప్రాభవ భవ్య పాదముల సం • స్తోత్రించు గావించుచున్

సుర పూజితంబులౌ • చరణాంబుజములకు, శిరము సోకఁగ మ్రొక్కి • చేమొగిడ్చి
పంప భూతములీవ • పంకజాసనుఁడీవ, క్షీర సాగరమందు • చెంగు దీవ
పాపమ్ములం ద్రెంచు • పరదేవతవు నీవ, వెలుపల లోపల • వెలుఁగుదీవ
మత్పూర్వ పుణ్యక • ర్మములె యీదాసుని కడకుఁదో డ్తెచ్చె ని • ష్కలుషహృదయ!
। ఏఁ గృతార్థుఁడనైతినా • కేది కొదువ? పాపములు త్రెవ్వి పుణ్యంబు • పండె నేఁడు
రాక్షసవిరామ! భవ్యతా • రక సునామ!, సద్గుణ స్తోమ! శ్రీరామ • సమర భీమ!

చ॥ అని వినుతింప వాలి యిడు • నంగదచేఁ దపియించు వానరుల్
గని కపిరాజుపాలి కొక • కాలుఁడు నేఁటికి వచ్చెనంచు ము
ద్వననిధి మున్గి రుచ్మమగు • వారుణి నాని చెలంగి పాడి న
ర్తనములు చేసి గంతులిడి • దాఁటిరి దూఁకిరి తొంగలించుచున్

ఉ॥ అండచయంబు లొండయి యు • గాంతము వేళ మహాగ్ని కీల లు
ద్దండతఁ గాల్పఁగా మిగిలి • తప్పిన యెమ్ములకుప్ప కైవడిన్
మెండయి దొడ్డ కొండవలె • మిక్కిలి దుందుభి యెంపగూఁడు కో
దండధరుండు కాంచెఁ దన • దారిని నెమ్మది నబ్రమందుచున్

ఉ॥ ఇయ్యది కాలు వాహనము • నెమ్ముల కుప్పయొ? దిగ్గజం బొకం
డొయ్యనఁ గూలెనో? మకర • మొక్కటి చచ్చి కృశించి యెండెనో?
యియ్యెడ నిట్టులుండుటకు • హేతు వదెయ్యది? తెల్పఁగోరెద
నెయ్యరి! యన్న నిట్లను వ • నే చరనాథుఁడు సంతసంబునన్

## 3. దుందుభి పటలము, (15)

శా॥ శాత్రవ హింసనాయత రు • షామతి దుందుభి దానవుండు న
క్షత్రపతిం బెకల్చు నని • శాత మహోన్నత శృంగధారియై

చిత్రతరాకృతిన్ మహిష • శీర్షముతోఁ జని మందరాద్రి నా
క్షత్రముతోఁ బయోధిఁ బెలు • చం గలఁచెన్ హరి రోయు కోసమై.

చ॥ హరియును మ్రోలనిల్చి యిటు • లాలము చేయుట యేల యన్న నం
గర మొనరింప రమ్మనుచుఁ • గర్వురుఁ డాడఁగ నన్నుఁబోఁటి స
త్త్వరహితు నేల కోరెదవు • తార గిరీంద్రము చేరి పార్వతీ
వరుని దురంబు సేయఁ బిలు • వం దగునం చసురారి పల్కఁగన్.

చ॥ వడివడి వాఁడు రుద్రభగ • వానునీ శైలముఁ జేరి కొమ్ములం
దొడిచి పెకల్చి ప్రోయఁ బని • పూనుడు శూలియు మ్రోల నిల్చి నీ
వడుగు నదేమి తెల్పుమన • నయ్యసురుండును సంగరానకుం
దొడఁగుమ యన్న శంకరుఁడు • దుందుభిఁగాంచి హసించి యిట్లనెన్.

ఉ॥ నీకు సమాన దోర్బలుఁడు • నిర్జరనాథుఁడు భిక్షువైన నే
నీకొను చెట్లుపొమ్మన ను • రేంద్రుని చెంతకు నేగి దైత్యుఁడున్
నాకు రణంబు నిమ్మనఁగ • నాక విభుండును గాంచి నీకు న
స్తోక భుజాగ్ర కండువునఁ • ద్రొక్కఁటయేని వచింతుఁ బ్రీతిమై.

ఆ॥ ఆహవ దోహలుండు ప్లవ • గాధిపుఁ డొక్కఁడు నా కుమారకుం
డోహరి సాహరిం బెనఁగ • నోపును వాలి యతండు పొమ్మనన్
దాహకువోల్కి నేగి రణ • దర్పుని వాలిని పిల్చి యాగిరిన్
బాహలఁ గొమ్ములం గెలఁకి • పాదొనరింపఁగఁ దాఁకె వాలియున్.

సీ॥ వడిఁదాఁక నిరువురు • వలపల దాపల, గిరిగిరఁ దిరుగుచు • నొరయు నపుడు
వారి నేర్పులుపంగ • వలను గాకుండఁగఁ, బడుదురు విడుదురు • తొడరుచుండ్రు
నిలుతురు పిలుతురు • నెగయుచుఁ దిగియుచుఁ, ద్రోతురు లేతు రు • త్సుకత మెఱయఁ
బాద ఘట్టనలచే • బలువిడి యగ్నిపై. కెగసెను ధూళియు • నెగడె దిశల

తే॥ భూధరంబులు హుంకార • ములకుమాఱు, మ్రోఁగె భూస్థలివడఁకుచు • మొగ్గెఁబ్రకృతి
నిలుకడం దప్పి చెలువంబు • నీఁగె వారి, లెచ్చు తగ్గులు గనకిట్లు • పెచ్చు పెరుఁగ.

సీ॥ అంబువంబులు నంబ • రంబు నంబుధులు నం, బుధి వేష్టితాఖిల • భూతలంబు
ధూసరావృతమయి • తోఁతేరకుండె ని. య్యది యది యని వీర్ణ • యింపరాక
పంద్రెండు నెలలిట్లు • ఏంద్రంబుగాఁ బోర, విజిగీషుపౌ నగ • భేదిసుతుఁడు
ప్రోన్నత శృంగముల్ • పోఁడిమితోఁ బట్టి, యూడ్చి యూడ్చి శిరంబు • నేయునంత

తే॥ నసురుఁ డంతఁ బర్జన్య గ • ర్జానుకారి, యైన ఘన గర్జితంబు మి • న్నదరఁజేసి
నిలువ వాలియుఁ గోపంబు • నిలుపలేక, పిడుగుకైవడి నెత్తిపైఁ • బొడువ వాఁడు.

ఉ॥ దిమ్మగొనంగ నెత్తిపయి • దెబ్బపడన్ విఱుగన్ బదమ్ములం
గమ్ములు నుగ్గుగాఁ జదియఁ • గందరలీలను వొల్చునోట ర
క్తమ్ములు గ్రమ్మి వెల్లువలు • గాఁ బ్రవహింపఁగ జీవపాళి యొ
క్కమ్మడి లేవ వజ్ర హతి • నద్రి గిరింబలె వాఁడు దుల్లఁగన్.

చ॥ మఱియును వానిఁ బట్టి పలు • మాఱులు చామర మట్లు త్రిప్పుచున్
దిరుగుచునుండ శోణితము • దిక్కుల జిల్లునఁ జిప్పిలంగ ది
క్కరుల యొడళ్ల ధాతువుల • కాంతి వహించిన లీలఁ గ్రాలె నీ
గిరివర మెల్ల నొక్క ఘన • కింశుక వృక్షముఁబోలె భాసిలెన్.

మ॥ పటు బాహా బలశాలి వాలి యటుపై • పైఁ ద్రిప్పి వైవంగ నొ
క్కట మేఘంబుల దాఁటి భాను శశి న • క్షత్రప్రభా మండల
స్ఫుట భాగంబులు దాఁటి యూర్ధ్వ భువనం • బు ల్దాటి ప్రాణంబు ల
చ్చటనే నిల్వ శరీర మిచ్చటఁబడెన్ • శక్రాదు లగ్గింపఁగన్.

ఉ॥ దుందుభి విస్తుకంపెనఁగు • తోరపు దేహము ఋశ్యమూకముం
గ్రింది కదంగఁగాఁ బడుడుఁ • గిన్కమహామహుఁడౌ మతంగ మౌ
నీంద్రుఁడు శాప మిచ్చె నది • యే యుపకారిగఁ గాచుచుండె న
న్నిందని సూర్యసూతి వచి • యించెను పూర్వ చరిత్ర మింపుగన్.

ఉ॥ రామవిభుండు తత్కథక • రంబు రహింపఁగ వించుఁ జాప వి
ద్యా మహనీయు లక్ష్మణు ము • దంబునఁ గాంచి యనుంగ! దీని ని
చ్చామతి నిందునుండి యొక • చక్కటికిం దొలగింపు మన్న ని
ష్కామల శీలచిత్తుఁడు ప • దాంగుళితో నెగమీఁటె మీఁటఁగన్.

చ॥ అదియును సత్యలోకమున • కవ్వలి చోటికిఁ బోయి క్రమ్మఱన్
జదియెఁగ నచ్చటం బడియెఁ • జెచ్చెర గోత్రుల మూఁకయార్చె నీ
రదము క్రియన్ రఘూత్తముఁడు • రాజిత పుష్ప వనంబుచేరి స
మ్మదమున నుండ భాస్కరుని • పుత్త్రుఁడు సన్నిధి నిల్చి ప్రేమమై.

## 4. ఆభరణ దర్శన పటలము. (42)

చ॥ మఱి యొక మాట దేవ! విను • మా యొకనాఁడిట మేము గుంపుగాఁ
దిరుగుచునుండ రావణుఁడు • తెక్కలియై తమ కాంత నేమొ పే
రురవడిఁ గొంచుఁ బోవునెడ • నుగ్మలి యుమ్మలికించు చీ వనో
త్కరములఁ గల్గ త్రోవలను • గాంచుచు రోదనముం దొనర్చుచున్.

మ॥ తన మార్గంబు లదీయ నాథునకు దూ • తం బోలెఁ గాన్పించుఁగా
కని కాఁబోలును భూషణావళుల స • య్యబ్జాక్షీ చేలాంచలం

బున నొప్పన్ ముడివైచి జాఱ విడిచెన్ • బూర్ణాశ్రు వర్షంబుతోఁ
గని మేమయ్యది యంతరిక్షమునఁ జే • క్కొంబట్టి హస్తంబులన్

మ॥ ఒకచో దాఁచితి మావిభూషలను మీ • కొప్పారఁ జూపింతు మో
పిక వీక్షింపుడు మీ సతీతిలకమో • పృథ్వీజవో? కావొ? యం
చకలంకుండు దినేశపుత్త్రకుఁడు ప్రే • మాలాపముల్ సేయుచున్
సుకలుండౌ రఘురామ భూవరునకుం • జూపెన్ బ్రమోదంబునన్.

శా॥ సీతాదేవి విభూషణంబులఁ బరీ • క్షించెన్ నిమేషంబునన్
జేతం బగ్నిఁ గరంగు మైనముక్రియం • జెందెన్ విభూషామృత
ప్రీతిం బొందెను సొమ్మసిల్లె నని వ • ర్ణింపంగ నెట్లౌను? త
జ్జాతస్ఫీతహృదంతరస్థితి మహా • చాంచల్యముం బొందఁగన్

శా॥ నారీరత్నము నంగకంబులను వి • న్యాణంబుగా నొప్పు మం
జీరాద్యాభరణావళుల్ జనకజా • శ్లిష్టాంగముల్ జ్ఞప్తికిం
దేరం గానఁగనయ్యెఁ బాప మవి యా • ర్తిం గూర్చునే కాక పే
రారాటంబును మాన్పనేర్చునొకొ సుం • తైనన్ ధరాజానికిన్?

చ॥ ఎడయికచేఁ గృశించిన మ • హీశుని తెల్విని దెచ్చె నందునా?
దుడుకున రాము జీవముల • దోరిచె నందున? చందనంబుకై
వడి సుఖ శైత్యమిచ్చెనని పల్కుదునా? కడు నుగ్రతాపమే
యిడె నన నేర్తునా? మఱియు • నేమని చెప్పుదు? నెట్లు దెల్పుదున్?

చ॥ కొసరి వచించు సీత తొడు • గుల్ రఘువర్యుఁడు ప్రేమ మూర్ఛనం
గుసుమములయ్యెఁ దాల్చుటకుఁ • గోరఁగ నొప్పిన వుత్తరీయమై
విస్మృమర కాంతి యుల్లసిలి • పేరురమందున గందమట్టు లో
ప్పెసఁగె శరీరమెల్ల రహి • యించి విరాజిలె దుప్పటంబు నాన్.

చ॥ కనుగవ నుండి యశ్రువులు • కాఱి యటం గల వస్తుజాలం
గొని పడిఁ బాఱె దేహము గ • గుర్పొడిచెన్ భరియింపరాని మో
దనమున నుబ్బి నిక్కె భుజ • దండము లయ్యెడ రామభద్రుఁ డొం
దినయది సంతసంబొ? మఱి • త్రెప్పని తాపమొ? మేని సొమ్మయో?.

మ॥ తనువెల్లన్ విషబాధ నొందు వహి సం • తాపించి శ్వాసంబుఁ బ్ర
జ్ఞను పోనాడి ధరిత్రి వ్రాలు నరసి • జాతాక్షు సుగ్రీవుఁ డొ
య్యన వక్షంబున రోమబృందము చుఱు • క్కంచూనఁ గేల్సాఁచి తా
మ్మన కానించికొనెన్ మనమ్మున దిగు • లుప్పొంప దూపిల్లుచున్.

## సుగ్రీవుఁడు రాముని నీతికి సంతాపించుట.

మ॥ అటు సుగ్రీవుఁ డురమ్ముపైఁ గొదువలే • కానించు కొంచున్ మహో
త్కటమౌ రాముని దుర్వ్యవస్థఁ గని చి • త్తంబందు సంతాప లం
పటుఁడై కుందుచు నిట్లనున్ రఘువరా! • పాపాత్ముఁడౌ నేను సం
కటపాటుం గలిగించినాఁడఁ దొసఁగుల్ • గానిప్పించి నీ కియ్యెడన్.

శా॥ వేదోద్ధారక! యీ యజాండమున న • న్వేషించి నాలావు దై
త్యాదుల్ రావణ దుర్విదగ్ధుఁ దెలుఁగన్ • వ్యక్తంబుగా నీ యశః
కేదారస్థల భూసుతన్ భువన ల • క్ష్మిం దెత్తు సందేహమున్
లేదిట్లేల తపించి సొమ్మసిలె? వే • లేమ్మా జగన్నాయకా!.

మ॥ అమృతోద్ధార! పతివ్రతానియమముల్ • వ్యక్తీకరింపంగ జ
న్మము తాఁ గాంచిన లోకమాత భయ కం • పంబుల్ వెసం జెంద నొ
ప్పమి గావించిన నీచ రావణ శిరో • బాహార్గళల్ గాక లో
కములన్ నీయొక బాణ సంహతికి లె • క్కింపఁబైనఁ గాఁజాలునే?.

మ॥ భువనోద్ధారక! యింద యుండుము మహా • వీర్య ప్రతాపంబునన్
దివిజుల్ మెచ్చఁగ లంక యేటికి జగ • ద్బృందంబు శోధించి దా
నవ రాజన్యుల మస్తకంబులను చూ • ర్ణం బాకి నీదేవి నీ
వవు మేల్మేలనఁ దెత్తు సేవకుని కా • ర్యం బిద్దె వీక్షింపుమా.

ఉ॥ దానవ మర్దనా! భువ దు • దార గుణంబులఁగొల్చి నిల్చి నీ
యానతి సేయు నెయ్యుర, మ • హార్య పరాక్రమ శోభితుండు స
మ్మానితుఁడైన లక్ష్మణుఁడు, • మస్తక మందు జగమ్ముతాల్చు నీ
యానను నిన్ను నీవ యిటు • లక్కట చూచెద యల్ప దృష్టితో?

మ॥ తమ సామర్థ్యము తామె చెప్పుకొన రు • ద్యత్ప్రీతిమై సజ్జనుల్
తమ కార్యంబులఁ బట్టి లోకమె గురు • త్వంబున్ గనన్నెచ్చు ధ
ర్మము నీవేకద నిన్ను గాకితర ధ • ర్మంబున్ భువిం గల్గునే?
భ్రమలం బొందుచు నుమ్మలింపఁదగునే • భ్రాంతాత్మ చందంబునన్?.

చ॥ అకలుష వాగ్విశారద! పు • రారియు బ్రహ్మయు విష్ణుసర్వుం
దొకటిగఁ జేరుచో సమతి • యొప్పగుచుండునుగాని పర లో
క్కాఁకరుగ వేఱువేఱయిన • నొప్పరు నీకు సమాన సత్త్వనై
వికచ జలేజనేత్ర! యిటు • వీటిఁడి పోల్కిఁ దపింపఁబోలునే?.

ఉ॥ కాంచన చిత్ర పంకరుహ • కార్ముక! నా కుటుకోర్కి నిప్పుడే
కొంచక చేయుమూ యనుచుఁ • గోరుటలేదు విశంబనంబు లే

కంచిత లీల నేగ యసు • రాధిపుచే నగచాట్ల నొంది శో
కించెడు దేవి బంది దొలఁ • గింతము లెమ్మని పల్కెనంతటన్.

క॥ రాముఁ డొక విధమునన్ మూ. ర్ఛా మేఘము తొలఁగఁ దేఱి • ప్రబ్బిన బాష్ప
స్తోమము వెలియంగడుగా. రాముని సుగ్రీవుఁ గాంచి • క్రచ్చఱ ననియెన్

## శ్రీ రాముని నిర్వేదము.

ఉ॥ పాపుఁడనైన యేను నొక • పర్వత సన్నిభ చాప మూని పె
ల్లోపిన శౌర్యశాలివలె • నుర్వరఁ బ్రాణముతోడ నుండ దు
ష్ప్రాప దురంత దుఃఖముల • వఁదురి జానకి భూషణంబులన్
దూపిలి దూసె నా బ్రతుకు • దుర్భర భారము గాదె భూమికిన్?.

చ॥ అలఘు పతివ్రతా గుణము • లారసి గౌరవకీర్తులన్ మహిం
జెలఁగిన స్త్రీలపట్ల నిటు • చేసిన వారలు పూర్వమెవ్వరేఁ
గలరొకొ? దేవియట్లు కడ • గండ్లను పొందుచు నుండ నే శిలా
తల గిరి కాననంబుల వృ • థాతిరుగాడుచునుంటిఁ జెల్లరే!

ఉ॥ దారిని పోవువారయిన • దగ్గఱి చామల్ల కెద్ది యేని యు
ద్ధారము సేయువారల న • డంప గఁ బ్రాణము లిచ్చియైన మేల్
కూరుచువారు సద్గుణులు; • కోరిక దిక్కెగ జీవగఱ్ఱగా
వారక నన్నె నమ్మిన సు • భాసినిఁ గావఁగలేక యుండితిన్.

మ॥ గుణ సంపన్నులు మత్కులోద్భవులు కా • కుత్సుల్ పయోరాశినే
కణఁకం ద్రవ్విరి గంగఁ దెచ్చిరి యశః • కార్యంబులం జేసి ధర్మ సం
చణతం బింకలు దువ్వలొక్కెదొన ని • చ్చన్నీరు ద్రావించి రేఁ
బణఁతిన్ సద్గుణ సంయుతన్ సతిని గా • వన్లేక యుంటింగదా?.

చ॥ స్థిరుఁడగు ధర్మరాజునకుఁ • జేరఁగ శక్యముగాని వీరు శం
బరుఁ దునుమాడి యింద్రు దుర • వస్థలఁ బాపిన రాజుపట్టినై
గురుతర దుఃఖపాత్రమగు • గోడు గొహారు భరించి దానితో
శరములు చాపముల్ బరువు • చాలక మోయుచునుంటిఁ జెల్లరే!

చ॥ జనకుని సత్యవాక్కునకు • జాఱుడు గల్గుట యొప్పదంచు నె
మ్మనమున నెంచి రాజ్యము శి • మంబున వీడి యరణ్య సీమకుం
దనియఁగ వచ్చి యిందు సహ • ధర్మిణిఁ గోల్పడి శాశ్వతంపు నిం
దను జను లీసడింపఁ దలఁ • దాల్చితి నెట్లు తొలంచుకొందునో?.

తే॥ ఇట్లు దుఃఖించి పసచెడి • యెన్నరాని, శోక వేదనాహతుఁడయి • సొమ్మసిల్లు
రామచంద్రుని వానర • రాజు దుఃఖ, వారిరాశి తీరము చేర్చి • యూఱడించె.

ఉ॥ నీ యుపచారవాక్యముల • నీఁగితి దుఃఖ మొకింత మిత్రమా!
పాయఁగ నెంచినాఁడఁ దను • బంధము వేతొక త్రోవ లేదు నా
కీ యెడ గడ్డునింద సమ • యింపఁగ, నీకొనరింపు పంతమున్
మాయక తీర్చి యవ్వల స • మాహిత చిత్తుఁడనై మరించెదన్.

హనుమంతుఁడు కర్తవ్యముం దెలుపుట.

క॥ అని రఘురాముఁడు పలుకఁగ, విని మారుతి కేలు మొగిచి • వినయ నమితుఁడై
జనపాలక! యొక మనవిని, వినవలతును జరుగవలయు • విధ మోపికమై.

తే॥ మొదటఁ గ్రూరకర్ముని వాలి • సదమదంబు, సేసి భాస్కర పుత్త్రుఁ గి • ష్కింధ నిలిపి
యసదృశంబగు ప్లవగ సై • న్యంబు గూర్పు, కుప్ప దైత్యుల రావు రో • యుట కడింది.

క॥ దైత్యులకు నెలవు ధరనొ? య, దిత్యకలనొ? నాగముననొ? • దివినో? యెటనో?
సత్యముగ నెఱుఁగలేమయ, గత్యముగా వలయు వెదుకఁ • గపి సైన్యంబుల్.

మ॥ క్షణకాలంబునఁ జుట్టి నేరుతురు లో • కంబెల్ల నిష్టారముల్
చణులై కూర్తురు పూర్వకర్మవలె హిం • సల్ చేయ నేతెంత్రు దు
ర్గుణు లెల్లెల్లొ తొలంగుచుందురు మహా • ఘోరాపదల్ వోవు ధో
రణి వారేగు పథంబు లా కుటిల చ • ర్యల్ కాంచ దుస్సాధ్యముల్.

ఉ॥ అంచిత రీతిమై జగము • లన్ని యొ కేసరి నివ్వటిల్లగా
లించి మహీజఁ గానఁగ వ • లెన్ బరి దప్పి యొకొక్కచోటె శో
ధించుచుఁ బోవుచో వితగఁ • ద్రిప్పటగాక ఫలంబు లేదు యో
చించఁగ నేండ్లు పూండ్లు కద • చెల్లును మీరుఁ దలంచి చూడుఁడీ

ఉ॥ వానరసేన కల్పమున • వారిధి పొంగిన రీతి లోకమున్
బూనిక గప్పఁగాఁ గలదు • పూర్తిగ దెబ్బది వెల్వ లుండు నం
భోనిధిఁ ద్రావఁగాఁ జగముఁ • బోఁడిమితోఁ దలక్రిందు సేయఁగా
నై నను వాలియుండు భవ • దాజ్ఞ శిరంబునఁ దాల్చి నిచ్చలున్.

ఉ॥ కావునఁ దొల్త వాలిఁ గడఁ • కన్ వధియించి యనంతరంబ మీ
దేవిని రోయఁబూనఁగ వి • ధించుట కార్య మటంచు నెంచెదన్
దేవ! యనంగ శాంతినిధి • ధీరుఁడు రాముఁడు మంచిదంచు సం
భావన సేసి నేఁడె చని • వాలిని గూల్తము రండు లెండనన్.

సీ॥ భయద నేత్రంబుల • వఱలు శరభ మొండు, కడిమి నొప్పారు వ్యా • ఘ్రములు రెండు
గమన కౌశల మొప్పు • గజములు రెండు ప, రాక్రమ స్థిర మృగ • రాజ యుగళి

త్రోవఁ జన్నట్లు సు • గ్రీవుండు నల నీల, తార మారుతులు ను • దారగుణులు
రామలక్ష్మణులును • రాజిల్లఁ గదళీ ర, సాల తమాల తా • క్కోలసాల

తే॥ వట పనస సుర పున్నాగ • బదరికాది, తరువు లేలాది లతికా ప్ర • తతులఁ గ్రమ్మి
యున్న చరియల మార్గాన • నుద్ధతిమెయి, నేడుగురు కూడి వెడలిరా • రెసక మెసఁగ

సీ॥ ఆమార్గ మందెల్ల • హరిణాక్షులై నట్టి, హరికాంత లూఁగు ను • య్యాల లుండు
నుయ్యేల లేని చో • ట్లొప్పుగాఁ జందన, తరులచే నిబిడమౌ • చరియ లుండుఁ
జరియలు లేనిదే • శముల మేఘావృత, మగు ఘనగిరి శిఖ • రాళి యుండు
ఘనగిరి శిఖరముల్ • గలుగని చోటులఁ, దావులు వెదజల్లు • తీవ లుండు

తే॥ తీవ లల్లిబిల్లిక గల • త్రోవలుండుఁ, ద్రోవలందు విశ్రాంతికై • తోఁట లుండుఁ
దోఁటలం దొడ్డ దిగ్గియల్ • దోఁచుచుండుఁ, దిగ్గియల హరిణంబులు దిగ్గుచుండు.

తే॥ అద్రు లెక్కనప్పుడు దిగు • నపుడు సహజ, వరరుతము సేయు గండ పెం • డెరములుబిఁ
రామలక్ష్మణుల్ వీరహ • ర్యక్షభంగి, నడచినారలు తోడి వా • నరులతోడ.

సీ॥ కాకుత్స్థవర్యుల • కపికులోత్తంసుల, గమన వేగమునకుఁ • గరులు బెదరె
జీమూతసంఘముల్ • చెదరెఁ దుంపురులు చిం, దర వందరై వసుం • ధరను రాలె
సురిపొన్న వృక్షముల్ • సొంపారఁ బెరిఁగిన, చటియల నురగముల్ • పరుగులెత్తె
శరభ శార్దూల కేసరి • భల్లుక, గవయాదులును భీతిఁ • దవిలి పాతె

తే॥ వానివేగానవిఱిగిన • పాదపములఁ, దేనెతెట్టెలు చితికి ధా • త్రిని స్రవింపఁ
బోవుత్రోవ యెల్లెడఁ జాల • బురదయగుచు, నడవ సులభంబుగాక జా • ఱుడుగ నుండె,

తే॥ పద్మరాగ మణి ప్రభా • పటలి పరవి, మండుచున్న కొండలఁబోలె • మలసె గిరులు
వానిఁ జల్లార్ప జలదముల్ • ప్రబ్బు కరణి, రాఘవుల దేహకాంతులు • గ్రాలుచుండె.

ఉ॥ పాఱు వియన్నదీ జలము • పర్వత సానువులందు ద్రోణులన్
బాఱుఁ బొలంబులందు గల • పైరుల కందలి మీలు చాలగన్
బాఱు యురంబులున్ బొడువఁ • బాఱు మదావళపాళి వెన్నులం
బాఱుఁ బతత్త్రి బృందములు • పాదప శాఖలఁ బాఱుఁ గోఁతులన్.

సీ॥ఏలా లతాజాల • డోలాసమాలోల, ఫల వాసనలు సుర • పాళిఁ దివుచు
మకరంద నిష్యంద • మలయజ సాను ని, ర్ఝరములు నక్షత్ర • సమితిఁ దివుచు
బహురత్న జాత ప్ర • భా మరీచీ జాల, మింద్రచాపంబుల • నేచి తివుచుఁ
బటుతరవిస్ఫుట • స్ఫటిక శిలాతల, సందోహములు బాల • చంద్రుఁ దివుచు

తే॥ విరులగుత్తులుగ్రహకాంతి • విరియఁదివుచు, సాంద్రగుల్మముల్ మేఘసం • చయముఁదివుచు
వృక్ష సంతానములు మిన్ను • ప్రీలఁ దివుచు, రమ్యతమమైన యవ్వన • రాజమందు,

మ॥ కమనీయంబుగ నిట్టు లుల్లసిలు త • త్కాంతార మార్గంబునన్
శ్రమ లెక్కింపక పోయి స్వర్ణమయమౌ • స్వర్గంబె యచ్చోటికిన్
సుమనో రాజసుతుండు తెచ్చెననఁగా • శోభిల్లు కిష్కింధ మో
దము పెంపారఁగ డాసి చేయఁదగు చం • దంబున్ విచారించుచున్.

## 5. వా లి వ ధ ప ట ల ము. (153)

చ॥ అరి బల మర్దనుండు సుగు • ణాఢ్యుఁడు రాముఁడు కొంత సేపు క్ర
చ్చఱఁ దలపోసి యర్కసుతు • నాదటఁ గాంచి బలీముఖేంద్ర! నీ
వరమర లేక వాలిని ర • ణావని కామికతోడఁ బిల్చి సం
గర మొనరింపు మొక్క విశి • ఖంబునఁ గూల్చెదవవ్వునుండియేన్.

ఉ॥ నావుడు మేలుమేలని ఘ • నంబగు నూహమటంచు నుబ్బి సు
గ్రీవుఁడు సింహనాద మొన • రించెఁ బయోధులు పుల్లగిల్ల మే
ఘావళి సిగ్గిలంగ నమ • రాలి కలంగ జనంబు క్రుంగ ది
గ్భావలయంబు పిక్కటిల • వ్యోమము మిక్కిలి బూరటిల్లఁగన్.

సీ॥ రమ్మెదిరించి పో • రఁగ సమరంబున, నంతకాంతికమున • కనుపువాఁడ
నని యాడుగఱచి భు • జాస్ఫాలనమ్మొగిఁ, జేయఁ దద్రవము కి • ష్కింధయందు
దడిమంబునం బాల • కదలికై వడి నిద్ర, సెందిన యవ్వాలి • చెవులఁ జొరఁగఁ
గరిరాజు గీఁక కే • సరి విని కోపాన, లేచు కై వడి వాలి • లేచి నిలిచి

తే॥ తమ్ముఁ డాజి కాయితమయి • దాసి సింహ, నాద మొనరించె నని పెద్ద • నవ్వునవ్వి
నా నగవుచేత నొకపరి • యదరె నగరు, పరిజనంబులు వానర • వరులు బెదర,

మ॥ లయకాలంబున వారిరాశి తరఁగల్ • లంపిల్లఁగా లేచు నా
ప్పయి తల్పంబున వాలి లేచి చల మే • పారన్ ధరన్ దాఁచెఁ ద
ద్భయదాఘాతముచే గిరీంద్రము దిగం • బాతెన్ మహీజాత సం
చయముల్ దొర్లె భుజంబులన్ విదురుపన్ • జండాకుగ ప్రోద్ధతిన్.

శా॥ క్రోధావేశముచేత రోమతతి గ • గ్గుర్వొందె నందుండి నీ
రోధ ప్రక్రియఁ జిట్లి పెట్లి వెడలెన్ • రూక్షంబుగా నిప్పుకల్
వేధోండంబు వడంక మిడుఁగులు ప • ర్వెన్ నేత్రయుగ్మంబునన్
బాధించెం దవ ధూమమట్లు పొగ లు • చ్ఛ్వాసంబుచే స్వర్గమున్.

చ॥ కరతలము ల్వడిం జఱచు • కర్కశ నాదము భూమి మోయు ది
క్కరులకు భీతిఁ గూర్చె గిరి • కందరముల్ మఱుమ్రోఁతఁ బేర్చెఁ బ్ర
స్తరములు దొర్లు పేరులివు • దందడిచే జలదంపు గర్జనల్
కొఱవడెఁ బ్రాణికోటి కల • గుండు వహించెఁ జగంబు కంపిలెన్.

తే॥ అధమ! వచ్చితి వచ్చితి • ననెడి వీర, వాక్యములు దిక్కులకు విన • వచ్చె నదరి
నిలువ శీర్షక శిఖరంబు • నెగడి తగిలి, ఋక్షజాలంబు పలపల • క్రిదరాలె.

సీ॥ నడతెంచు వేగాన • నడరిన పెనుగాలి, వీవఁ గిరిశ్రేణి • పెల్లగిల్లి
దెసల కొనల దాఁక • విసరుకొనుచుఁ బోయి, ధరణి దద్దఱిలంగ • దొరలి పడియె
శ్వేత రోమంబుల • చివరల వెడలిన, యదరు లజాండ కు • ద్మముల మూసె
మొత్తికన్నులు మిఱు • మిట్లు గొల్పెను తెలి, గంటులు పఱచిరి • గతులు దప్పి

తే॥ పండ్లు పటపట గీఁటఁగా • వఱలు నగ్ని, కణము లశనిపాతమువోలెఁ • గడలఁ జెదరెఁ
బుజము లప్పళింపఁగ బాహు • పురుల రాలు, రత్నములు మెఱుపులక్రియ • రాలుచుండె

చ॥ నరులును వారిధుల్ సురలు • నాగులు భూతగణంబు తత్త్వముల్
ధరణియు నాసిరిల్లు తఱిఁ • దార్కొను చండతరాగ్నివోలెఁ జూ
పఱుకుఁ గనంబడెన్ భయము • భ్రాంతియుఁ గొల్పుచుఁ బూర్వమందు తాఁ
దరిచిన పాలవెల్లి బెడి • దంబుగఁ బుట్టు విషంబు కైవడిన్.

## తార వాలికి హితోక్తులు పలుకుట

తే॥ తార తిలకినీ తిలకంబు • తనదు భర్త, కనుల నుండి నిప్పుకలు మొ • గంబునుండి
పొగయు వెలువడి మేనిని • ముంగురులను, కాల్చుచుండ నడ్డమువచ్చి • కరమువట్టె.

తే॥ మగువ! విడువుమ యడ్డగిం • పకుమ నన్ను, బలిమి ననికిఁ బిల్చిన ప్రొద్దు • పట్టిఁ బట్టి
జలధివలెఁ ద్రచ్చి తజ్జీవ • ములను గ్రోలి, వేగ మరలెద ననవుడు • వెలఁది పలికె.

మ॥ జయశాలీ! భవదీయ దోర్బలము నో • ర్చనేక యల్లాడి దు
ర్భయ చిత్తంబునఁ బాఱువాఁడు నవ స • త్త్వంబొందఁగాలేదు వి
స్మయమౌ నూతన జన్మమొందఁడును భా • స్వత్పుత్త్రుఁ డివ్వేళ ని
ర్భయుఁడై రా బలశాలి యొక్కరుని తో • డ్పాటుండు నిక్కంబుగన్.

చ॥ అన వికటంబుగా నగి సు • రాధిప పుత్త్రుఁడు పల్కెఁ దొయ్యలీ!
వినుము త్రిలోకజీవు లొక • పెట్ట నెదిర్చినఁ గొప్పరించి యు
క్కునఁ బరిమార్తుఁ దారసిలి • క్రుంగక నిల్చిన శూరుఁ డొక్కఁ డిం
దనుకను వింటివేమి? వివ • రంబుగ భీతిలనేల చెప్పుమా?

సీ॥ మందరశైలంబు • మంథానముగఁ బాఁప, ఱేఁడు దిట్టపుఁదరి • త్రాడుగాఁగ
చక్రి పీఠంబుగాఁ • జంద్రుండు తరికంబ, ముగ నుంచుకొని దేవ • పూర్వదేవ
బృందంబు క్షీరవా • ర్ధిని చిల్కి యలసిన, తఱి నొక్కఁడన పట్టి • తరిచి సుధను
వారికొసంగు నా • వీరంబు మఱవంగఁ, దగినదే? నీకుఁ జం • దన సుగంధి!

తే॥ దేవ దానవు లెదిరించి • చీలుపడిరి, ప్రాణిఁ బ్రాణంబులను వేఱు • పఱచు యముఁడు
నా యభిధ విన్న గడగడ • నడుఁకువాఁడు, వీర నాతోడ నెవ్వాఁడు • పూనువాఁడు?

చ॥ అటు లోకవేళ మందమతి • యై యొకరుం డెదిరించెనేని యు
త్కట తపమూని మేలిమిని • గాంచు వరంబున శత్రుదేహ వి
స్ఫుట పటు సత్త్వమం దరులు • స్రుక్క సగంబు బలంబు చెందు న
న్నిట నెదురొడ్డువాఁడు ఫల • మేమి గడించును? చింత యేటికిన్?.

తే॥ వాలి యిటు పల్క విని తార • ప్రాణనాథ!, రామచంద్రుండు దశరథ • రాజసుతుఁడు
రవిజ మిత్రుఁడై నిను చంపఁ • బ్రతినచేసె. ననుచు హితులచే వింటి నేఁ • డనుచు నతఁడు

వాలితారకు శ్రీరాము గుణము లభివర్ణించుట

ఉ॥ పాపిని! యేమి పల్కితివి? • బంధములం దెగఁ గోయలేని బా
ధా పరితప్త దేహులకు • ధర్మపథంబు గమించి చూపు ల
క్ష్మీపతి కిట్లనర్హమగు • చెట్టలు గట్టెదవేమి? యిట్టి నీ
పాపము వోవ నింక నొక • పాచితముం గలదేమి? వెంగలీ.

చ॥ ఇహపర సౌఖ్యమున్ తనర • నిచ్చు ముకుందున కిట్లు సేఁత ము
ద్వహ మొకో? గౌరవార్హ మొకో? • తత్కృతి లాభకరంబొ? ప్రేమయున్
సహనము రూపుగా సకల • జంతువులన్ బరిరక్ష సేసి లో
క హితము గోరు ధర్మమె స్వ • కర్మ మడఁచుకొనంగఁ జూచునే?

చ॥ జనకుని సత్యవాక్యునిగఁ • జల్ప విమాతృ నిదేశ మూని వ
ర్ణన మొనరింపలేని కరు • ణామతిఁ దత్ప్రియసూతికిన్ స్వమే
దిని విడిపించి కానలకుఁ • దృప్తిగ వచ్చిన యుత్తమోత్తమున్
దనియ నుతింప కిట్లు సడి • దార్చెదు ప్రల్లద మాడఁగూడునే?

ఉ॥ అందములెల్ల నొక్కటయి • యాజి నెదిర్చినఁ గేలఁ బూను కో
దండ సహాయుఁడై విజయ • తామరసాసన చెట్టఁబట్టు ను
ద్దండుఁ డనన్య సామ్య గుణ • ధాముఁడు రాముఁడు పేరు నూరు లే
కుండెడు నీచుతోఁ జెలిమి • యొప్పుగఁజేయునె మత్తకాశినీ!.

చ॥ అనుజులకంటె వేఱయిన • ప్రాణము లేదని యెంచి వారితో
నెనరునఁ గూడి వర్తిలు వి • నీతుఁడు కారుణికుండు నాదు వే
ల్పనగు రఘుప్రభుండు తన • పూజ్యత మాయఁగ నేనుఁ దమ్ముఁడున్
మొనసినవేళ మధ్య శర • ముఁగా దెక నెక్కుడునేమి? కోమలీ!.

చ॥ క్షణ మిట నుండు మియ్యదన • చయ్యన నేఁజని ఘోర సంగరాం
గణమున వాని క్రొవ్వడఁగఁ • గాఁ జదియించి యసుప్రజం బవా
రణగతిఁ బారణల్ సలిపి • క్రచ్చఱ తోడుగ వచ్చినట్టి దు
ర్గుణులకు భంగపాటు నొడఁ • గూర్చెద వచ్చెదఁ జింత దక్కుమా.

చ॥ అనవుడు భర్తమాట కెదు • రాడ కుదార కపీంద్రుదారతా
ర నిలిచె వాలి యుత్సుకతఁ • గ్రన్నన బాహువు లబ్బఁ బూర్వ ది
గ్ఘన గిరి మీఁద దోఁచు రవి • కైవడిఁ గ్రాలి మహోగ్ర చండ కో
పనుఁడయి దుర్నిరీక్ష్యగతి • వాలి కనంబడెఁ దన్మహాద్రిపై.

చ॥ భుజబల దార్ఢ్యమందు పెను • పోఁడిమినొందు గిరీంద్రుఁ బోలు నిం
ద్రజుఁడు, నిశాచరేంద్రుని మ • దం బడఁగింపఁగఁ బూని గుంజ న
క్కఁజముగఁ బుట్టు నా నరము • గప్రభు సంచునఁ గాంచువారలున్
గజగజలాడ వచ్చెఁ దమ • కంబున నర్కజుఁ డున్నచోటికిన్.

## వాలిసుగ్రీవుల సమరము.

ఉ॥ గర్జిలు తమ్ముఁగాంచి ఘన • గర్జన చేసె సురేంద్రసూతి త
ద్గర్జ త్రివిక్రమేశుని ప • దంబు పెరింగిన యట్లు లోకముల్
దుర్జయలీల నుగ్రముగ • దూఁటెను మేఘ సమూహమెల్ల వి
స్ఫూర్జిత రీతిగాఁ బిడుగు • పుంజములన్ వడి రాల్చె నెల్లెడన్.

ఉ॥ అప్పుడు రాఘవుండు తన • యర్మిలి తమ్ముని గాంచి యిట్లనున్
దప్పక చూడు నాగ విబు • ధ ప్రకరంబులు రాక్షసాళి నీ
ర్కఁప్పయు మేఘరాజియు మ • రుత్తులయాగ్ని మతేవియేని యీ
యొప్పగు మేనితో సమత • యొప్పునె? భీకరదేహి వీఁడనఁ.

చ॥ అవరజుఁ డిట్లనున్ వినతి • నార్య! విభాకరసూతి జ్యేష్ఠు నా
యువుఁ గొనఁ గ్రూరకాలుని స • ముద్ధతిఁ దోడ్కొని వచ్చె నేఁడు సం
న్నవగతి సంగరంబు బెడి • దంబుగఁ బూనినవాఁడు కాఁడ యీ
ప్లవగుఁ డటంచు నా మనము • పాయని వేదన నొందు నిత్తఱిన్.

ఉ॥ చిత్తజరూప! ధర్మము నశింపఁగ న • మ్మిగ మాయ చెయ్యిలన్
జిత్తమ చేర్చు బాలిశుని • శిష్టులు నమ్మఁగరాదు నమ్మికో
లుత్తమ రీతికాదు తన • యుల్లమునందు విరోధి వోలె ను
న్మత్తుఁడు జ్యేష్ఠుఁ జంప జత • నం బొనరించె నిఁకెట్లు నమ్ముటల్?.

చ॥ అను తనతమ్మ మోముఁగని • యార్యుఁడు పల్కెను లక్ష్మణా! వివే
చన మొక యింతలేని మృగ •జాతుల శీలముఁ గూర్చియిట్లు చిం
తన మొనరింపఁగూడ దొక • తల్లి కుమారులలోనఁ దమ్మ లె
ల్లను తమ యన్నజాడల మె • లంగినచో భరతుం డెలర్చునే?

ఉ॥ చాప కిణాంక సుందర భు • జా! భువి శిష్టులు కొందఱే సుమీ
పాపులె పల్వు రుందురు • బాళి యెలర్చిన చోట సద్గుణా

వాపమె గాంచుచుంట గుణి • పద్ధతి యట్టుల గాకయున్న ని
ష్పాపులు లోకమందుగల • వారొకొ సూక్ష్మమతిన్ గ్రహించినన్?

తే॥ తెలియఁగగు రామలక్ష్మణ • ప్రభువులిట్లు • మాటలాడుచు నుండఁగా • మంచుఁగొండ
అట్లు దిగ్గజంబులపోల్కి • నర్కశక్ర • పుత్త్రులిరువురు పోరాడఁ • బూనినారు.

ఉ॥ కొండయుఁగొండ డీకొనిన • కోపున నొప్పి బలంబు హింసయున్
దండితనంబు గల్గిన యు • దగ్ర మృగేంద్ర యుగంబు కైవడిన్
జండతరంబుగాఁ దిరిగి • సారెకుఁ గుమ్మరి దోర్బలంబునన్
మెండుగఁ ద్రిప్పుపారె కర • ణిన్ గుడిచుట్టుచుఁ బోరి రుద్ధతిన్.

చ॥ తొడలు తొడల్ పెనంచి భుజ • తుండములన్ మెలివైచి దంత ల
గ్గడువుగఁ బోరురీతిఁ దడ • కట్టుచు దూఁటుచు ముష్టి పోటులన్
దొడఁకక చెంగుచున్ మరల • దూఁకుచుఁ బట్టుచుఁ బట్టు వీడుచున్
బెడమఱఁ ద్రిప్పుచున్ మెలసి • బెట్టిదులై వడిఁ బోరి రిర్వురున్

చ॥ భుజ బల వీర్య సంపదలఁ • బొల్చిన భీకరమూర్తు లేక గ
ర్వ జనితు లొక్క కాంతకయి • పట్టుగఁ బోరుట చూడ మున్ను బే
రజమున వచ్చు నచ్చర క • రంబు గ్రహింపఁ జలంబు మీఱి పె
చ్చు జతన పోరు సుందు నుప • సుందుని పోలిరి వార లయ్యెడన్.

చ॥ జలనిధు లొండొకళ్లఁ బెలు • చన్ సరిపోరుట రెండు మేరువుల్
తలకొని మించి డీకొనుట • దర్పము రోషము మాఱుకొంట యి
య్యలఁ గనలేనివార మిఁక • నేత్త్రెఱ వాలియు సూర్యసూతియున్
మలయుచుఁ బోరుచుంట కుప • మానము తెల్పగఁజాల మియ్యెడన్

ఉ॥ వానర నాథు నేత్త్రముల • వారక వెల్వడు విస్ఫులింగ సం
తానముచేఁ బయోదములు • తాఱెను కొండలు మండె దిక్కరుల్
పూనె వడంకు నాకులును • పూర్ణభయంబున డాఁగఁబాఱి నా
రూనములై చతుర్విధము • లొప్పిన భూస్థలి వీడెఁ దగ్గతుల్.

ఉ॥ వారు మహేంద్రలోకమున • వారొ? ధరాధర సాను భూమిపై
వారొ? ధరిత్రిపై వఱలు • వారొ? దిగంతములందు నిల్చు వా
రొ? రహి సమ్మఖానఁ గల • రొ? యని చూపఱు భ్రాంతి నొంద వి
స్ఫార జిగీషులై దిగులు • వాఱక నిమ్మకిఁ బోరి రుద్ధతిన్.

చ॥ కఱచుచు రక్కుకొంచుఁ బెను గాయములన్ రుధిరంబు కాల్వలై
వఱలఁగ వార్ధు లొండొకటి • పైకొని సేసెడు ప్రోఁత కైదు పా

ళ్లఱచుచు ముష్టిఘాతముల • యారవము ల్లయకాలమందు మ
బ్బుఱిమిన లీలఁ గ్రాలఁగ మ • హోన్నతులై యెసరేఁగి రయ్యెడన్

ఉ॥ వారిత రేత రాహతుల • వాఁడి నఖంబులఁ బంటి కాటులన్
ఘోర వపు క్షతంబులను • బోరన రక్తము చిమ్మి మిన్ను వి
స్తారము తోఁగఁ జేయ నుడు • జాలము భాసునిపోలె, సాంద్ర సాం
ధ్యారుణ శోభితంబయిన • యంబరముంబలె నొప్పె మేఘముల్.

సీ॥ కొలిమి నెట్టినగఁ గ్రాఁ • గుడు లోహమును దాకఁ, బెట్టి సమ్మెటతోడఁ • గొట్టునంతఁ
జిటపటమని దెసల్ • చెదరు మిడుంగుల, కరణి నిప్పుక లెల్ల • కిడల బెరయ
విరువుర భుజముల • నిరువురు పిడికిళ్లఁ, దాడింత్రు ఘన నిశా • దంబు లెగయ
మరములతోడఁ ద్రో • యుదురు పాదములతోఁ, దన్నుచుందురు మరుహ • స్తములతోడ

తే॥ బొడుతు రఱతురు తరుబృంద • ములను పెఱికి, వైతు రద్రులఁ బెకలించి • వైచుచంద్ర
బెదర నార్పుటింతురు కోప • వీక్షణములఁ, గాంచుచుందురు లోకముల్ • కలఁతఁజెంద

సీ॥ పైకెత్తుదురు పట్టి • పాఱవైతురు త్రొబ్బి, గాన్పింతు రురవమున • గాఢ ముష్టి
లొక్కఁగాఁ బొడుతురు • లోఁగొన సవ్యాప, సవ్యపద్ధతులఁ గే • సరుల సరణి
నరికట్టుదురు వెన్క • కరుగుచు రొండొరుల్, పెనవడి పడుదురు • పృథివి యదర
త్రొమ్ముతోఁ కంజుట్టి • యెమ్ములు పొడిగాఁగ, లాగుచుఁ గాళ్లతో • లాగిత్రోతు

ఆ॥ రీఁచెతోడఁ బొడుచు • వాటాన ఖర నఖ, రములు నెత్తురొలుక • నుక్కచుందు
రలసి సొలసి లేచి • యలవు బలంబును, చలము మీఱ రణము • సలుపుచుంద్రు.

ఉ॥ భూమిని పాదుకొన్న తరు • వుల్ శిలలుం బొడిగా ధరాధర
స్తోమము సర్వవస్తువులు • స్రుక్కక వైవఁద నొండొకందు పై
వ్యోమమునందె నుగ్గయి ప • యోధిని దిక్కులఁ జేర వారు సం
స్థేమము దక్క కొక్కరును • చిక్కక పోరిరి భీకరంబుగన్.

ఉ॥ పూచి రహించు మోదుగుల • పొల్పన దేహములొప్ప నిర్వరున్
బూఁచి చలంబు పెంపఱక • పోరఁగ నెండిన భూజ పుంజముల్
పూచిక లున్న కాన దవ • ముంబలె రోమములందు వహ్నియుం
దోఁచె సురల్ వడంకి పలు • త్రోవలఁ బాఱిరి తక్కలేటికిన్?,

ఉ॥ వీరులు వానరాధిపులు • విక్రమసంపద సొంపు పెంపఁగాఁ
బోరొనరించుచుండఁ బటు • భూరి భుజా బల శీలి వాలి క్రో
ధారుణ లోచనుండయి గ • జాధిపు సింగము నొంచుకైవడిన్
గ్రూరముగా నలంచి వడిఁ • గొట్టె మనస్స్థితి సంచలింపఁగన్.

మ॥ ఘన దర్పంబున వాలి వాలి పెను ని • ర్ఘాతంబు నాఁబ్రేయ నొ
చ్చిన సుగ్రీవుఁడు పాఱి వచ్చిపడుచున్ • జింతాకుల స్వాంతుఁడై
యిన వంశోత్తముఁ గాంచి దీనుఁడయి న • న్నిట్లేల సేయంగ నీ
వన శ్రీరాముఁడు లోన నొచ్చుకొని యి • ట్లాడెన్ దయాసాంద్రుఁడై.

సీ॥ భేద మొందకుము సు • గ్రీవః మీలో వాలి, యెవ్వఁ డనుచు మది • నెఱుఁగనైతి
గజపుష్ప మాలను • కంఠమం దిడికొని, యీసారి పొమ్ము మే • లెనయు నీకు
నని పంప సుగ్రీవుఁ డతి రభసంబునఁ, దారకల్ గూర్చిన • తీరు మీఱు
పేరు దాలిచిపోయి • పేరెత్తి,వాలిని, చీరి పేరులివునఁ • జేరి యతఁడు

తే॥ వెఱవఁ బొడిచి హింసింప న • వ్వీరుఁ డులికి, పాఱిపోయిన వాఁడేల • వచ్చెననుచు
నెగడి కోపించి రవిసుతు • నెఱఁకులంటఁ, బొడిచె దంచెను గ్రుద్దెను • మోఁదెఁదన్నె.

చ॥ రవిజుఁడు ప్రాణముల్వెడలఁ • గ్రక్కెను నెత్తురు వచ్చెఁ గన్నులం
జెవులను నొచ్చి యాతఁడును • శ్రీరఘురాముని దిక్కుచూచెఁ బైఁ
దవిలి సురేంద్రనందనుఁడు • దారుణ హింస యొనర్పఁ జూచె రా
ఘవుఁడు నమోఘసాయకము • కార్ముక మందునఁ గూర్చెఁ జెచ్చెరన్

చ॥ కటిపయిఁ గంఠమందు నొడి • కంబుగఁ గేలు గదించి యెత్తి యు
ద్భటగతి నేలపైఁ జదుమ • వాలి దినేశుని పట్టి నెత్తఁగాఁ
బటువుగ నారి లాగి రఘు • వర్యుఁడు లక్ష్యముచేసి యేసె ను
త్కటుఁడగు వాలి బొమ్మ వడిఁ • గాఁడ నమోఘ శరంబు గ్రక్కునన్.

రామ బాణముచే వాలినేలఁ గూలుట.

సీ॥ ఆ రామ శరరాజ • మయ్యెడ జలమును, జలముఁ బుట్టించు వై • శ్వానరుండు
వైశ్వానరుని గన్న • వాయువు వానికా, ధారమై వెలసిన • ధరణి యనెడు
భూత చతుష్కంబు • పొలుపు బలంబు నొం, దిన వాలి యురమునఁ • దివిరి తూఱ
వరఁటి పండున సూది • యవలీలఁదూఱిన, పగిదిఁ దన్మహిమంబు • పలుకవశమె?

తే॥ నిర్దయుండయి తమ్ముని • నేలమోఁది, కడప యత్నించు వాలి ది • గ్భ్రాంతిఁ గూలెఁ
బ్రళయవేళఁ బ్రచండ • ప్రభంజనగతి, వేళ్లతోఁ బెల్లగిలు మేరు • విధముఁదోప.

తే॥ విలయవేళను భాస్కర • బింబ మురలి, నేలఁ గూలిన లీలను • వాలి గూలి
తరణిపుత్త్రుని గొన్న హ • స్తముల వదలి, నిగుడు శర మురమ్మునఁ దూఱ • నీక పట్టె.

ఉ॥ పెంపున రామసాయకము • భీకరలీల నురంబు గాఁడ ను
త్కంపితగాత్రుఁడై యతఁడు • క్రన్నన లోఁజొరనీక వాలుతోఁ

దెంపునఁ గాలఁ గేలను గ • దించుచు నాఁపుటఁ జూచి తా శిరః
కంపన మాచరించె నల • కాలుఁడుగూడఁ దవీయ శక్తికిన్.

ఉ॥ చీల్చిఖగోళ మీ త్రుటిని చిందఱ లాడెద నంచు లేచు నేఁ
గాల్చెదనంచు దిక్కులను • గాంచు సమస్త జగంబు లిప్పుడే
కూల్చెదనంచుఁ ద్రుళ్ళిపడుఁ • గ్రొచ్చెద భూస్థలి నంచు దొల్లు నన్
మార్చినవాఁ డెవం డనుచు • మాటికి దిక్కులు సూచు హాయనున్.

ఉ॥ నేలను మోఁదు నేత్రముల • నిప్పులురాల్చు శరంబుఁ బట్టి వే
వాలునఁ గాలఁ గేల వెలి • వాఱఁగఁ జేయఁ గవించు రామికిన్
దీలుపడున్ దపించుఁ బడుఁ • దెప్పలు లేవఁగఁ జూచు వేధమై
నోలుఁ గృశించుఁ గ్రుంగు వెత • స్రుక్కుఁ జుఱుక్కునఁ దత్తరించుచున్.

ఉ॥ బాణము నేసి నారలు ది • వంబున నుండెదు వేల్పులేమొః గీ
ర్వాణులు విట్టు లేయఁగల • రాఁః యిటులేయఁ బనేమివారి కీ
జాణ యెవండొ, యంచు నొక • సారి హసించు నతండు దైత్యజి
త్ప్రాణు విరించి తుల్యబల • శౌర్యము లొందినవాఁడెవో యనున్.

తే॥ చక్రమోశూలమోకాక • శక్రుచేతి, వజ్ర మిట్టులు నా యురః • పథముఁ దూఱు
శక్తి క్రొత్తగాఁ బడసెనో • సంశయంబు, గలిగెనంచు నాక్రోశించుఁ • గలఁగు నలఁగు

చ॥ ఉరమునఁ జొచ్చియున్న శర • యోగము గాంచుచు నొక్కవింటిచేఁ
బఱపిన తూపు గాదు శర • పంక్తికి నింతటి శక్తియేః మునీ
శ్వరు లొగి మంత్రశక్తి తగు • సాయముగా విడిపించినారొః యే
కరణియొః యంచు దంతముల • గట్టిగఁ గీటు నలంగు దీల్పడున్.

చ॥ శరమిది ఘోరమంచెఱిఁగి • సంశయమంద ఫలంబులేదు నా
యురమునఁ బ్రాణ ముండఁగనె • యుద్ధతిఁ దూఱిన యియ్యలుంగు నా
కరములఁ గాల వాలమునఁ • గ్రన్ననఁ దీసెద నేసినట్టి యా
పురుషుని పేరు గాంతునని • పోఁడిమి దానిఁ దివంగ మేకొనెన్.

ఉ॥ చేవయు మేటి సాహసముఁ జిత్తదృఢత్వము ధైర్యవిక్రమ
శ్రీవిలసిల్లు వాలి తన • జీవము నొవ్వఁగఁజేయు బాణ పు
చ్ఛో వెలికీడ్చె చేవ దను • జుల్ కయివారము సేసి రార్చుచున్
భూవలయంబునం దెవఁడు • పోల నుతింపఁడు ధీర మానసున్ః.

చ॥ అడవులఁ గొండలం గడచి • యంబుధిఁ జేరెనొ నాఁగ నెత్తురుల్
కడవల ముంచి పోయు క్రియఁ • గాయము గాయమునుండి చిమ్ముచున్

వెడలెను క్రోధముతోఁ గనిన • వీరుల యుల్లములెల్ల నీరమై
కడవఁగ ఘోరదృశ్యమయి • కన్నులు మూతవడం దటాలునన్.

తే॥ వాలియురమును దొడ్డ ప • ర్వతమునుండి, వెడలు నెత్తురు సెలయేటి • విధముచూచి
సోదరప్రేమ పాశ ని • యుక్తుఁడైన, సూరసుతు నేత్రముల వారి • ధార దొరఁగె.

ఉ॥ మేరువుఁగూడ భగ్నముగ • మేకొని చేయఁగఁజాలు చేవయున్
గీరితి గల్గు వాలి తన • కేల శరంబును పట్టి త్రుంప నూఁ
కారఁగ సంగవించియుఁ బ్ర • యత్నము వ్యర్థమ యంచు దానిపైఁ
దీరుగనున్న వ్రాలు కను • దేఱిచి చూడఁదొడంగెఁ గ్రక్కునన్

మ॥ త్రిజగత్పావన మూలమంత్రము భవా • ర్తిం బాపు దివ్యౌషధం
బజ రుద్రామర నిత్యపూజితము శ్రే • యఃప్రాప్తి హర్మ్యంబు భ
క్త జన శ్రేణికిఁ దారకంబు నిగమాం • త జ్ఞాన వేద్యంబు తా
భజియింపంగల రామ నామ మెద నొ • వ్వంగాంచె నేత్రద్వయిన్.

మ॥ గృహిధర్మంబుల వీడి కానలకుఁ గో • ర్కిన్ వచ్చు ధీరుండు ని
ర్వహణీయంబయి క్షత్రవంశమునకున్ • రాణించు సద్ధర్మ సం
గ్రహ కార్యంబుల నాకునై విడిన యీ • రాముండు జన్మింపఁగా
గ్రహరాద్వంశము దుష్టమయ్యెనని వీఁ • క న్నాన చెందె న్నగెన్

సీ॥ పరఁగ నగాధ జం • బాల పటల మగ్న, మగు గజరాజంబు • పగిదినున్న
వాలి సిగ్గున మణి జాల సంశోభిత, శీర్షక యుతమగు • శిరమువంచు
నవ్వానాలోకించు • నరవరేణ్యులకిది, ధర్మమే మోయని • తలఁచి తలరుఁ
బ్రాణికోటికిఁ బ్రభు • వగు రాముఁడేనీతి, దప్పిన జనులెట్లు • తలఁగకుంద్రు?

తే॥ మేటి నియతి నాకొఱకె న • ష్టటఁ గలిపె, ననుచుఁ జిం తాకులితుఁడగు • నతనియెదుట
నిలిచె ధర్మసంస్థాపన • నియతికొఱకు, జగతి నుద్భవించిన రామ • చంద్ర విభుఁడు.

సీ॥ పీలనీరదమొండు • నీరజ ద్వయముతో, విలసిల్లుచున్నట్టి • పొలుపుదోఁపఁ
జక్కటి తా శిల్ప • చాతుర్యమున నొందె, నవయవ స్ఫూర్తి నా • నతిశయిల్లఁ
జీఁకటి మ్రాఁకునఁ • జెలఁగు తీవియవోలె, బలు విల్లెడమకేల • వెలయుచుండ
క్షత్రియధర్మంబు • సచ్ఛీలమార్గంబు, క్రమపడ నిల్పంగఁ గాంక్షసేసి

తే॥ ధారణికి దిగినట్టి సౌం • దర్యరాశి, సుగుణరాశి తేజోరాశి • సుకృతరాశి
రామభద్రుని గన్నులా • రంగఁ గాంచి, యేమిచేసితి వని వాలి • యిట్టులనియె.

## వాలి శ్రీరాముని నిందించుట.

ఉ॥ సత్యము నాభి జాత్యమును • చక్కటిఁ గావఁగఁగోరి ప్రాణ సాం
గత్యము వీడు పుణ్యకరు • ణానిధి పంక్తిరథేశు పట్టి వీ

వత్యమలాఢ్యుఁడౌ భరతు • నన్నవుగా జనియించితేః నృపుల్
సత్యము మీఱి ధర్మ మనఁ • జాలుదురే యధికార గర్వులై ?

చ॥ కులము బలంబు విద్యయు న • కుంఠిత శౌర్యము లోకరక్షణా
కలిత మహాశయంబు నది • కారము శీలము నీదు సొత్తులై
వెలయఁగ నన్నియుం దెలిసి • వీఱఁడికై వడి నీగుణాలి ని
ష్ఫల మగునట్లు వీడుపడి • పల్లటమై చనఁజేయ నొప్పునే?

చ॥ ఇలఁగల రాజధర్మము ది • నేశ కులాఢ్యుల సొత్తుకాదె? ని
ర్మలగుణ ప్రాణతుల్యయును • మైథిలు పెంచిన రాజహంసి వే
ల్పులయెరవోలె నక్రమముగఁ • బొందిన జానకిఁ బాయు మీఁద నీ
వలసిన కార్యపాళి తదఁ • బద్ధది యేమొ యలేఖ్య సుందరా!.

చ॥ దనుజాలు కీడు సేయఁ గృప • దప్పి కపీంద్రుని ద్రుంపుమంచు నా
మనువు వచించెనేమి? మతి • మాలి దయాగుణ మేదవీడి తీ
యనువున నన్ను చంపుటకు • నారసి తెయ్యది యెగ్గు? నీవ యి
ప్పని యొనరింప నద్య మ • బ్రాఁతిగ వేరు భరించు వారలో?.

మ॥ కరుణావార్ధి! చతుస్సముద్ర పరిఖాం • కంబైన యీధాత్రిపైఁ
బరుగుల్ వాలు ప్లవంగరాజికె కలి • ప్రారంభ మిట్లయ్యెనే?
వరశీలాదులు దుర్బలావళికె యే • ర్పాటయ్యెఁ గాఁబోలు! భూ
వరు లెగ్గూనిన నిందగాక యశమున్ • బ్రాప్తించునే రాఘవా!.

శా॥ నాటం జేసితి వొక్క చిత్రమొగి నా • నందంబునం దండ్రి యా
పాటన్ రాజ్యమునీయఁ దమ్మునకు స • ర్వంబిచ్చి యామీఁద నీ
కాటణ జేసితి వొక్క చిత్రమును వీఁ • కం బూని కిష్కింధ కీ
చోటన్ దమ్ముని కన్నఁ గూర్చి తిఁక నె • చ్చోఁ గల్గు నీసద్గతుల్?.

ఉ॥ శాంతినిధీ! పరాక్రమ వి • శాలురు చేయు పనుల్ మగంటిమిన్
సంతసగాఁగఁ దెల్పఁగదు! • సత్య సనాతన ధర్మపాళి కా
ద్యంతము నీవ కర్తవయి • యక్కట నాయెడఁ జేయు కార్య మి
ట్లింతలుగాఁగ, రావణుని • యెగ్గులు వల్క నెడంబు గల్గనే?

చ॥ ఇరువురు పోరుచుండ సమ • హృత్స్థితి దూరముచేసి యొక్కరుం
గరుణను గాంచి వేఱొకని • గైతవ మొప్పఁగ డాఁగి క్రూరమౌ
శరమున బొమ్మఁ జీల్చివడిఁ • జంపుట ధర్మమొ? వేఱొకండొ! దు
ర్భరతర నిందకు న్నెలవొ? • ప్రాజ్ఞులు మెచ్చని పక్షపాతమో?.

ఉ॥ కాదిది విక్రమంబు విధి • కాదు బుజాత్వము కాదు ద్వేషముం
గాదు భవత్ప్రపాలిత జ • గంబున నా తను వాక్క భారమే?
నీ దయివాఱు సత్కరుణ • నీతియు మాని దురాకృతంబు పెం
పేద నొనర్చితేల? భువి • నిట్టిది కూడునె నిన్నుబోంటికిన్?.

చ॥ ఇహపర సౌఖ్య పద్ధతుల • నెంచి సమ ప్రతిపత్తి నిల్పి వి
గ్రహములఁ దోలి యెల్లర క • ఖండిత లాభము గూర్చి కార్య సం
గ్రహ మది ధర్మము • న్నిలుపు కార్యముగాకిటు పక్షపాత ము
త్సహనము తోడఁ బూని విప • థంబున మర్కటుఁ జంపు టెట్టిదో?.

ఉ॥ చింతిలఁజేసి నీసతిని చేకొని చన్న సురారిఁ జంప ని
శ్చింతయు వీని సాయము గ్ర • హించితి నందువ యేని దొడ్డదా
దంతి శిరోంతరస్థ పిశి • త గ్రహ లాలస కేసరిం గొనం
జింతిల క్కేగ్గు కాల మృతిఁ • జెందు శశంబును గోరుటెట్టిదో?.

తే॥ జగము వెలిఁగించు చల్లని • చంద్రునందు, పుట్టుతోడఁ గళంకంబు, పుట్టె ననుచు
రవికులంబునకును నిల్వ • రంబుగాఁగ, నిలుపఁ బోలుఁ గాలుష్యంబు • నీవు పుట్టి.

తే॥ ఒకఁడు పోరున కహమహ మి • కను పిలువ, వచ్చునను దాఁగి కూల్చి త • ర్వాత విచట
దక్కువారి యెదుట నాన • దశవకుండ, నిక్కమగసింగముంబలె • నిలిచితేమి?.

తే॥ శాస్త్రధర్మముల్ కులవృద్ధ • చరితములును, శీలమును పూని నీవు ర • క్షింపలేక
వాలిఁగూల్చి తంతియ కాదు • ప్రాభవంపు, ధర్మ మర్యాద చెఱిచితి • దారుణముగ.

ఉ॥ నీదగు ధర్మపత్ని నొక • నీచుఁడు దొంగిల మాఱుచేఁత విం
పాదిగఁ జేయ కిట్టు లన • యంబు నొనర్చితి నీశరంబు దు
ష్టాదముకాదొ? నీవిల శ • రాసన విద్యల నారితేఱుటల్
మోదముతో నిరాయుధుల • ముచ్చుగ నేయుటకా? వచింపుమా.

తే॥ పండ్లు పటపటఁ గొఱుకుచుఁ • బ్రజ్వరిల్లి, కనుల మిడుఁగుఱు లురలఁగాఁ • గఠినవాక్కు
లిట్టులాడు వాలిని గని • యెదుటనిలుచు, వీరుఁడగు రాముఁ డనియె నీ • విధముగాఁగ

## శ్రీ రాముఁడు వాలికుత్తరమిచ్చుట.

సీ॥ మాయావి వెన్నాడి • మడియింప బిలమున, కొంటిమై యేగి రా • కునికిఁజేసి
యీవు పోయిన త్రోవ • నేగ సంసిద్ధుఁడౌ, సుగ్రీవుఁ గని బుధుల్ • చుట్టములును
రాజవు గమ్మని • ప్రార్థింప విసక జ్యే. ష్ఠుని చంపు దుష్టుని • తునిమి పిదప
నేనును చత్తెద • నింతయ యన్నకుఁ, దరువాత రాజ్యంబుఁ • దాల్ప ననిన

తే॥ వారు ప్రాధేయపడుచు వి • ర్బంధపఱిచి, నిష్కళంకుని సుగ్రీవు • నియత చరితుఁ
బిలుచుకొని పోవఁగా మాఱు • పలుకలేక, తుదకు నేలిరె కాలంబు • ద్రోచుచుండ.

సీ॥ మాయావి • మాయించి మరలి వచ్చిననిన్ను, గని సంతసమున వం • దనమొనర్చి
బలిముఖుల్ ప్రార్థించి • బలవంతమునఁ గట్టు, నీరాజ్య మిదియని • నీకు నొసఁగి
విర్మమత్వంబున • నిన్ను వేఁడినవాని, యెడఁ దప్పులేదని • యెఱుఁగు పిదప
శరణు బాధింపకు • కరుణఁ జూడుమ యను, తమ్మునిపై నీవు • దయను వీడి

తే॥ మన్ననలు గోర మానక • మండిపడుచుఁ, ద్రుంపఁ బూనితి వంత జి • తొస్మయనుచుఁ
నిటల తట ఘటితాంజలి • పుటుఁడు నగుచుఁ, గాళ్ళఁ బడి బతిమాలినఁ • గావవైతి.

సీ॥ భయమొంది పరుగిడు • వాఁడని యెఱిఁగియుఁ, గొంచెమేనియుఁ దయ • యుంచవైతి
అవరజుం డగుఁగదా • యనుచు నక్కటికంబు, పూనక తఱుముట • మానవైతి
మునిశాపమున నీవు • మొనయని గిరినెక్కు, దనుక వెన్నంటుట • తప్పవైతి
పాఱువారల వెంటఁ • బడుట శూరులకు గ, ర్హితమని సుంతయు • నెంచవైతి

తే॥ ప్రేమకృత్యంబు లుత్తమ • కృత్యములును, శౌర్యఫలితంబు ప్రాజ్ఞులు • చదువుఫలము
నొకఁడు వలచిన సతిఁ గాచి • యొసఁగు ఫలము, గాక వేఱొంటఁ గలుగునే • గారవంబు?

ఉ॥ మదమున వీరధర్మమును • మాలిచి దుర్బలుఁ గోపగించుటల్
సదయులు ధర్మదూరమని • చాటుదు రొక్కపడంతి భర్తతో
ముదమున నుండ మానమును మూర్ఖత ద్రొల్చుట పాడి పీడుచే
గదః యిది గాన కీవు పలు • కం గమకించెదె ధర్మి పోలికన్?.

తే॥ పొలుచు ధర్మంబు నైహికా • ముష్మికంబు, లిట్టివని పరిశీలించి • యెఱుఁగవైతి
వనుజ జీవితేశ్వరిని మ • ర్యాదవీడి, పొందినాఁడ విదియు నీకు • బుద్ధియగునె?.

తే॥ ప్రాణ మిత్రుండు భానుపు • త్రికుఁడు కాన, నిన్నుచంపితి సంబంధ • మెన్నలేని
వారెయైన దుర్బలులగు • వారి సిలుఁగు, నీఁగఁజేయుటే నామనో • నిశ్చయంబు

క॥ అని సుందరుఁడగు సన్మని, వినుతుండనఁ దగవుకాని • వెడపనులం జే
సిన వాలి యిట్టులను మా, కొనరవు నీ వాడు నీతు • లొక్కటి యేసిన్.

సీ॥ మీ కులధర్మముల్ • మేటి పతివ్రతా, ధర్మముల్ వానిని • దవిలియుండు
వ్రీడాది గుణములు • వెలయ నారులకగు, మాంగల్యధారణల్ • మాకులేవు
స్వేచ్ఛావిధిగఁగ్రీడ • సేయుచుఁ దిరుగ వి, రించియే మాకు వి • ధించినాఁడు
ఇచ్ఛాప్రవర్తన • మేగాని వేదోక్త, మార్గ సంచరణంబు • మాకులేదు

తే॥ వంశ సంగతి వచ్చిన • వర గుణములు, మాకు లేవు నేఁజేయు ప్ర • మాద మెదియు
లేదు కనుమని గౌరవ • శ్లిష్టఫణితిఁ, బలుకు వాలికి శ్రీరామ • భద్రుఁడనియె.

ఉ॥ మీరలు నిర్జరాంశముల • మేదినిఁ బుట్టిన వార లింద్రియ
క్రూరవిశేష దోషములఁ • గోరిక మీఱ నెఱింగి ప్రాక్తనా
చార నిగూఢ పద్ధతులఁ • జక్కఁగ నేర్చిన వారలౌట నీ
ధారణిఁ బోల్పఁ దగ్గ మృగ • ధర్మము నెందిన వార లౌదురే.

ఉ॥ హారము సేయువారు జయ • హారము దాల్చినవారు మీర లి
ట్లారయ నింద్రియాళి గల • యంగికిఁ జేరునె ధర్మ మార్గముల్
తీరు పరీక్షచేసి కడ • తేఱిన తెల్వికిఁ జెందుఁగాక యీ
గౌరవ పద్ధతుల్ దెలిసి • కాని పనుల్ పొనరింపఁ బోలునే.

చ॥ మకరము వట్టిలాగ విడు • మార్గము గానక చక్రహస్తు నా
వికలత మాన్పవే యనుచు • వేఁడిన జ్ఞానఫలంబుచేత నే
యకలుష ముక్తియుగ్మకము • సందిన యా గజరాజుకూడ మీ
మెకముల జాతి యాతఁడె స • మీక్షణ సేయుము శక్రనందనా.

ఉ॥ సంతత ధర్మవృత్తిఁ జన • సమ్మతుఁడౌటనుగాదె జానకీ
చింతను తీర్పఁ బూని విల • సిల్లెడు సాహస ధైర్య శౌర్య వి
క్రాంతులఁ జూపి యాపనికిఁ • బ్రాణములిచ్చిన పెద్దతండ్రి నా
వంత యెఱుంగకుందువె జ • టాయువు నాతఁడు గృధ్రరాజెకా.

చ॥ పరువున మంచిచెడ్డల స్వ • భావ మెఱుంగు విమర్శన స్థితిం
బొరయక సంచరించుటయె • మూర్ఖ మృగాదిక లక్షణంబు నీ
వరయని ధర్మపద్ధతు లి • హంబున లేవని నీ వచస్సులే
విరివిగఁ జాటుచుండ నిఁక • వేఱిఁడి చందము లేల యాడఁగన్.

తే॥ ఇదియ తగు నిది తగదని • యెఱిఁగి నీతి, పద్ధతిని నడవని వారిఁ • బశువు లంద్రు
పశువులేయైన సద్ధర్మ • పద్ధతిఁ జన, వేల్పు సమము లౌనని ధర్మ • విజ్ఞులంద్రు.

క॥ కాలునకుఁ గాలుఁడగు శ్రీ, కాలగళుం గొలిచి ఫలము • గంటివి విజయ
శ్రీలం జెలఁగితి కొంటివి, నాలుగు ఘాతముల బలము • నయ మెఱుఁగవా కో.

తే॥ దోషలందును నిమ్నులం • దును గలారు, ధర్మమార్గంబుఁ దప్పక • తరలు వారు
మునులయందును దేవతా • జనులయందుఁ, జెడుగు లొనరించి చింతించు • జడులుగలరు

చ॥ అరయ యథార్థ మిక్కరణి • యౌటఁ గులీనులకేని యేరికే
నరవడి మేలు కీడులు స్వ • యంకృత కర్మలఁ బట్టి వచ్చుటే
వరసియు గర్వబుద్ధిని ప • రాంగన శీలము పాడుచేసి తి
ట్లరసిన మూఢచిత్తు లెవ • రైనను నీవలెఁ గానవత్తురే.

చ॥ అని తగు తెల్వి యబ్బ నటు • లాడిన మాటల నాలకించి రా
ముని గని వాలి యిట్లను స • ముద్ధతి యుద్ధము సేయువేళ నేఁ
గన సముఖమ్మున న్నిలిచి • కాండము నేయక డాఁగి యేయు టే
లన విని లక్ష్మణుండు సము • దంచిత రీతి వచించె వాలితో.

ఉ॥ నీయనుజుండు తొల్త గుణ • నీరనిధిన్ శరణంబు వేఁడ న
ట్టాయతనేత్రుఁ డంత నెటి • యాడెన నిన్ను కృతాంతుప్రోలికిన్
బాయక పంపువాఁడ నని • బాస యొసంగెను గానఁ బోరిలో
నాయనఁ గాంతువేని శర • ణందువొ యంచు మఱింగె నివ్విధిన్.

ఉ॥ బాల్యమునుండి సజ్జనుల • పజ్జ శ్రుతి స్మృతి మార్గరీతి సా
కల్యము విన్నవాఁడగుటఁ • గంజహితాన్వయుఁ డాడు వాక్యముల్
కల్యము లౌట సమ్మతిని • గైకొని రామ విభుండు ధర్మ వై
కల్యము సేయఁ డందుఁ గపి • కాంతుఁడు మూర్ధము వంచి యిట్లనున్.

### వాలి శ్రీరాముని క్షమింప వేఁడుట.

ఉ॥ తల్లిని బోలి జీవక వి • తానము పట్లను వత్సలత్వముం
గొల్లగఁ బూని ధర్మము న • కుంఠిత వీర్యము సద్గుణావళుల్
చెల్లిన నీవు ధర్మపరి • శీలన దృష్టిని చూడ దోషముల్
పెల్లుగ నుండవే? నెనరు • పేర్మి క్షమింపుము రాక్షసాంతకా!

చ॥ తెలియని కోఁతియంచు మదిఁ • దేల్చి వెలార్చిన నావచస్సులం
దలఁపకుమయ్య! చింతలిడు • దారుణ జన్మరుగౌషధంబు నీ
సలలిత నామమే కద! వి • శంకటవృత్తి శరంబుసేసి నా
కలఁకను పాపి జ్ఞానమను • కంటి నొసంగితి మోక్షదాయకా!

సీ॥ ముమ్మూర్తులీవె త • న్మూలంబు నీవె పా. పంబును నీవె పు • ణ్యంబు నీవె
శత్రుత్వమును నీవె • మిత్రత్వ మీవె యౌ. దాసిన్య మీవె కృ • తఘ్నంబు
త్రిపురారి మున్నగు • దేవత లిచ్చిన. వరములు విఫలమౌ • కరణి దూసి
యకలంక దార్ఢ్య ప • రాక్రమోపేత వ. క్షముఁ దొలచేసి ప్రా • ణములఁ గ్రోలి

తే॥ నట్టి నీతూపు ధర్మంబ • యవమరేల? హరుఁడు కొల్చిన వారికి • వరములీగి
నీ లస న్నామ సంస్తుతి • నియతి గాదె?, యట్టి నిను గంటి మోక్షంబు • నందుకొంటి.

సీ॥ చరములు నీవ య • చరములు నీవ సు. స్థిరములు నీవ య • స్థిరము నీవ
ఋతువులు నీవ యా • ఋతుఫలంబులు నీవ. విరులందు వాసన • వెలయు
సర్వవస్తువులందు • సమరీతి నుండు వం. తర్భూత మగుచు స • త్యప్రకాశ!
నీవిట్టి వాఁడని • నీగుణాలివియని. యజ్ఞానమే యిప్డు • నాకుఁ దెలిపె

న నశయలోక సు • ఖంబు లరుదె?, నన్ను వెన్నంటు కర్మముల్ • నిన్నుగాంచు
టకెకద! నీదు దండంబు • వలనఁ బాసె, నాయఘంబులు నుతిపాత్ర! నలిననేత్ర!

చ॥ అనుజుఁడు నన్ను చంపుటకు • నై నిను దోడ్కొని వచ్చి యల్ప చిం
తనము గలట్టి వానర మ • తంబున నిష్ఫల రాజ్య భారమున్
బొనుపుగఁ బొంది నాకుఁ బరి • పూర్తిగ శాశ్వత మోక్షరాజ్యమున్
దనియఁగ నిచ్చె నింతకును • తమ్ముని మేలు మఱొండు గల్గునే?.

ఉ॥ సేవకుఁడైన యేనొకటి • చిత్తమునం దలపోసి వేఁడెదన్
నావలె నాదుతమ్ముఁ డొక • నాడు మధుద్రవ మాని మందుఁడై
కావర మందునేని నను • గ్రమ్మఱ నేసిన నారసంబు సు
గ్రీవునిపై వడిం గినిసి • కీడ్పడ నేయకుమయ్య! రాఘవా!

చ॥ మఱియొకమాట రామ విను • మా! రవినందనుఁ గాంచి నీదు సో
దరు లొకవేళ గేలికయి • తక్కక భ్రాతృవధంబు సేయు ము
ష్కరుఁడని యాడిరేని తగు • చందము కాదని మందలింపు నీ
వరములు పూర్తిచేసి తిఁకి • వాఁడును తప్పి చరింపనేర్చునే?

ఉ॥ వేఱొకమేలు నీకు నొద • వింపఁగ లేను దశాస్యుఁబట్టి వా
లూరక గట్టిగాఁ దిగిచి • లూమముతోఁ గొనితెచ్చి నీకు దె
వాఱఁగఁ గాన్కగా నిడెడు • భాగ్యము నోచకయుంటి నన్నిటన్
దేఱిన వాయుపుత్త్రుఁడు సు • ధీమణి చాలిన బంటు నీకగున్.

ఉ॥ శూరుఁడు సద్గుణాకరుఁడు • సూనృతవాది మహాశయుండు సా
మీరి భవత్కరం బధిగ మించిన బాణముగాఁ దలంపుమా
సూర కుమారు నీ యవర • జుంబలెఁ గాంచుము పేరి బోరె నీ
కేరును దోడ్పడం దగు మ • హిష్ఠ బలాఢ్యులు పేరు పూస్తలిన్.

శా॥ వీరింగొంచు సమస్తదేశముల న • న్వేషించి సీ జానకిం
దేరం గాంచుమ యంచుఁ బల్కి యనుజున్ • పిల్చుంబలౌ బాహులం
జేరం దీసి కుమార! నీకు నుడిదే • శింపంగఁ బెగ్గిట్టి మే
లారం దెల్పెద నాకునై వగవ రా • దయ్యా! సుధీంద్రోత్తమా!.

మ॥ వరవేదంబులు ధర్మశాస్త్రములు స • ర్వంబుస్ సపోషవ్యులన్
పరమేష్ఠ్యాదులు తక్కువారలును సం • భావించి వాక్రుచ్చు నా
పరమేశుండె కదంక ధర్మమును ని • ల్పంగోరి మేశత్రు సం
హరణ క్రీడన లాలసంబయిన యి • ష్వాకుంజుడెఁ దాఁచుచున్,

మ॥ విజయంచేసెను రాముఁడై నిజము నా • విజ్ఞప్తి లోనమ్ముమా
సుజనుల్ ముక్తికి రామనామమును సం • శుద్ధాత్ములై నిత్యమున్
భజియింపం గలవారు నీవిలని స • త్త్వం బారయం గోర న
క్కఁజమౌ లీలను నన్ను గూల్చుటయె సా • ఖ్యంబింక వేయేటికిన్.

మ॥ అనివార్యంబగు దుష్టకార్యము లసం • ఖ్యాకంబు మోసంబుతో
దినముం జేసెడివారలే యయిన వి • ద్వేషంబుతోనైన రా
ముని యస్త్రాహతిఁ గూలువారు విలస • న్ముక్తిగా భజింత్రెప్పుడా
తని పాదాంబుజ సేవకావలికి • ముక్తత్వంబు సందేహమే?.

మ॥ తన సత్కర్మలె తోడురా జని కసా • ధ్యంబెద్ది? చూడాడి తిం
దున నందుం గల సౌఖ్యజాలముల నెం • దు న్మాన్యనత ల్లవీ
ఘన లక్ష్మీయుత వక్షు నాజ్ఞయె సదా • కర్తవ్యమం చన్య చిం
తనము ల్మాని తలం ధరించి విలస, ద్భాగ్యంబులం బొందుమీ.

సీ॥ మౌర్ఖ్యంబు పెనుపారు • మర్కటచేష్ట లు, న్మత్తగుణంబు పూ • ర్ణముగ విడిచి
శ్రీరామవిభుఁ డొన • ర్చిన మహోపకృతి మ, నంబున నిడి సమ • యంబు రాఁగఁ
బ్రాణంబులైన స • ర్పణసేయ జూఁగకు, మంచిత గతి ప్రసా • దించు నితని
యాజ్ఞానుసారంబ • యఖిలకార్యంబులు, జరపి దుర్లభ పున • ర్జన్మ రహిత

తే॥ పదవి నొందుము తుచ్ఛమౌ • ప్రాభవంబు, గలిగెననుచు ను పేక్షింపఁ • గడఁగకయ్య
నెరసు లొనరినఁ గృపమను మ • న్నింపరయ్య, నృపులు ప్రజ్వలితాగ్ని స • న్నిభులు తం|

చ॥ అని హితవాక్యముల్ పలికి • యవ్వల రాఘవుఁగాంచి సత్ప్రభూ!
యినజుఁడు రక్షితవ్యుఁడు ప • యింబయిఁ దెల్పఁగనేల? యంచు కే
ల్మోనసి నమస్కరించి రవి • పుత్త్రుని గన్గొని తోడితెమ్మ నీ
తనయుని నంగదాఖ్యు ననఁ • దత్త్రుటిఁ దోడ్కొని వచ్చె నాతఁడుగా

తే॥ అంగద మఱెన్నఁ డెఱుఁగని • యంగదుండు, నిండు నెలవోలె వచ్చి క • న్పించి యచట
మృదుల సుమశయ్యగా శస్త్ర • నరమునందు, గాసి బొందిన తండ్రిని • కనులఁగాంచె

## అంగదవిలాపము.

సీ॥ రవినిభ కుండల . రాజద్వరాంగద, సంగత భుజుఁడగు • నంగదుండు
ప్రాణపదంబయి • క్రాలు తండ్రినిగాంచి, కన్నుల బాష్పర • క్తమ్ము దొరుఁగ
పెనువు ఒప్పు ఎడిప • యబ్జ బింబంబుపైఁ, బడునొక నక్షత్ర • భాతిఁ బడుచు
హాతండ్రీ! విను గని • యడలక మృత్యువు, డాసెనే? దాని న • డంపఁ దరమె?

తే॥ వాఙ్మనః కర్మపాశ్మనే • ప్రాణికేని, యెట్టి కీడొనర్పని నీకు • నిట్టిపాటు
లెసెనే నేమని పల్కెడు? నెందుచొత్తు?, నపజయ విదూర! వీర భ, ద్రవతార!.

మేకులిడినయట్లు • మేకొని దిక్కుల, మోయు గజంబుల • మొనసి గెలుచు
రావణు హృదయంబు • లాసైన యాఁదోక, వాటమై యందమౌ • వాలుఁ దలఁచు
ఏపుడెల్లఁ దటతట • నదరు నీ మీఁదట, వాని భయంబును • వదలిపోయెఁ
క్ర వాళముఁ గుల • శైలముల్ నీపాద, హతిఁగల్గ దద్దురు • లందవింక
సురలు ప్రార్థించిరేని నీ • కరణి జలధి, జిలికి యమృతంబు నిచ్చువా • రలును గలరె?
యమరులైరి వారలు నీవా • హతుఁడవైతి, హా సదబ్జాత శీర్షాంక! యగచరేంద్ర!

పలువిధముల నంగదుఁడిట్లు • పలవరించ, వత్స! దుఃఖమొందకుమని • వాలియలమి
యనా? చూడు మీ జగ • న్నాయకుండు, చేయు పుణ్యఫలంబిది • చిన్నితనయ!

చ॥ జగతిని దేహధారులకుఁ • జావును పుట్టువు పీడకుండు నా
యగణిత పూర్వ పుణ్య ఫల • మయ్యది యిట్లు రణాంగణంబునం
దెగడని మంచి చావును వి • ధించె జగంబుల సాక్షిభూతుఁడై
నెగడిన రామమూర్తి కరు • ణించెఁ దనంతన వచ్చి మోక్షమున్.

చ॥ జనకుఁడనైన నా • పలుకు • జార్చ కనుత్తమ మద్వితీయము
ఘనమగు తత్త్వమిట్లు పద • కంజము ధాటిజీ సోకఁగా శరా
సనమును కేలఁబూని మను • జత్వముఁ దాలిచి కన్నుదోయికిం
గనఁబడుచున్న దిందు పుల • కంబులు గ్రమ్మ నెమస్కరింపుమా.

శా॥ భవరోగంబులఁ బాపు నౌ • షధము నా • ప్రాణంబులందీసె నం
చవహేలం గమనింపకన్న! రఘురా • మాజ్ఞానుసారంబుగా
బవరం బబ్బిన నీవుఁ బోద్పడుము స • ద్భక్తిం దదీయాంఘ్రియు
గ్మవనేజంబుల శీర్షమం దిడుము స • త్కల్యాణముల్ నీకగున్?

మ॥ అని యారీతి హితంబు పల్కి తన య • వ్యామోహ మేపారఁ బు
త్రుని గాఢంబుగఁ గౌఁగిలించి రఘు వ • ర్యుం గాంచి యీ నా సుతున్
దనుజౌఘంబను తూల భారములకున్ • దావాగ్ని నానొప్పు వా
నిని రక్షింపుము నీదు భారమిది న • న్నిశ్చింతుఁ గావింపుమా.

మ॥ అనుచుం బుత్త్రుని రాముకేల మద మే • పారంగ సర్పింప వాఁ
డును శ్రీరామ పదాంబుజంబులకుఁ దో • ద్తొమ్రొక్కి లోకేశుఁడున్
దన ఖడ్గంబు ననుగ్రహించి శుభహ • స్తం బుత్తమాంగంబుపై
నునిచెన్ వాలియు నెమ్మదింగొనియె దే • హౌఘంబు లగ్గింపఁగన్

॥ అంతట వాలి యూర్ధ్వగతి • నందఁ గరంబుల పట్టుపీడె శ్రీ
కాంతుని సాయకం బురము • గాఁడి వడిం భువిఁజొచ్చి యయ్యెడ

స్వాంతములోనఁ దోఁగి గగ • నంబున దివ్యుల కల్పహారముల్
సంతనఁదాల్చి రాఘవుని • షంగముఁ జేరఁగ వచ్చెఁ గ్రమ్మఱన్.

## 6 పట్టాభిషేక పటలము. (54)

ఉ॥ వాలి మృతిం భజింప రఘు • వర్యుఁ డపార కృపా రసాంబుధిన్
దేలుచు మోక్ష మిచ్చి తన • దివ్యకరంబుల ధాను పుత్త్రికున్
వాలి కుమారుఁ గొంచు నొక • వంకకు నేగ గపీంద్రు దార య
వ్వాలి మరించు వార్తవిని • వచ్చి యెఱింగెను వాని మేనిపై

మ॥ కొపురుల్ తీరిన కొండ కొమ్ములకు రం • గుల్ గూర్చు పాలిండ్లపై
నపుడే వెల్వడు నెత్రు కుంకుమ రస • వ్యాప్తిం బ్రసాదింపఁగాఁ
దిపురు లట్టిన ముంగురుల్ రుధిర దీ • ప్తిం బొంద శాఖాచరా
ధిపు వక్షంబున వ్రాలెఁ దార పెను సం • దెన్ మించు చందంబునన్.

సీ॥ అవ్యక్తమధుర వీ • ణాదిక రవముల, రహిఁదీల్చు కంఠస్వ • రంబుతోడ
నేక మనస్కయై • యింకఁ దపించు గ, ద్గదికతో నిట్టూర్పు • గాడ్పుతోడ
రక్త పంక్తుల శరీ • రంబుతో నేత్రముల్, వరలెడు కన్నీటి • వఱదతోడఁ
గనువారి గుండియల్ • కరఁచి నీరుగఁజేయు, కరుణంబు నించు వా • క్యములతోడ

తే॥ నధిపు మస్తక ముత్సంగ • మందు చేర్చి, దీర్ఘకుంతల జాలంబు • లివిరి కప్ప
మొగులులోని విభాకరు • మొగినిదోఁచు, మోము గని తార యిట్లు వి • మ్మరుచును వగచె

శా॥ నాజీవంబ! మనోధనంబ! గుణమా! నాపాలి సర్వస్వమా!
తేజస్స్ఫూర్జిత బాహు పంజరమునన్ • దీపించి యేనాఁడు నే
యోజన్ దుఃఖము లెట్టివో యెఱుఁగకే • యున్నట్టి యేనిప్పుడీ
ని శోకం గనఁ జాలకుంటిఁ గద మ • న్నీఁడా! భయం బయ్యెడిన్.

మ॥ అనుకూలప్రియ జీవితేశ్వర! భవ • ద్వ్యత్యస్త ఘోరస్థితిన్
దనుకం గాంచియుఁ బ్రాణముల్ నిడని దై • త్యన్ బ్రేమతోఁ బిల్వవా?
నను దుఃఖంబుల పాలు చేసిన విధీ • నాజీవముల్ పోవఁగాఁ
దనువీ మేదిని నిల్చునే? యొకటి చే • తన్ రెండు గావించితే?

శా॥ ప్రాణంబుల్ గొనిపోవుకాలునకు మున్ • వారాన్నిధిం ద్రచ్చి గీ
ర్వాణ స్తోమముతోడ నీయవె సుధా • ద్రవ్యంబు? నీవేళ నీ
ప్రాణంబుల్ హరియించి కొంటకును సం • భావించెనే తాను? మ
త్ప్రాణేశా! జముఁ డింతలో మఱచెఁ గ్రూ • రస్వాంతుఁడై శ్రేయముల్

ఉ॥ నకుబంతంబుల నేగి దివ్యసుమముల్ • గైకొంచు సామేన నం
దిక ప్రేమంబునఁ దాల్చినట్టి హరు ము • న్వేశన్ వినిర్చెం వలం

బికలంకంబగు భక్తిఁ గొల్తు వది నే • దాలస్యముం జేసి యా
రక యిట్లుండుట పాడియే? దనుజ స • మ్రాడ్గర్వ విధ్వంసనా!

ఉ॥ వర సుమ తల్పమందు మృదు • వస్త్రముపైఁ బవళించు నీవు నేఁ
డిరవుగ వట్టి నేలపయి • నెడ్డియవోలెఁ బరుంటఁ గాంచి దు
ర్భరమగు దుఃఖ తాపముల • ద్రావెదు నేద్చెదు నన్నుఁగాంచి యొ
ప్పరికము సేయునంత యప • పాడి యొనర్చితి నేమి నాయకా!

ఉ॥ ఇచ్చట నిన్నుపాసి తపి • యించుచు నుండఁగ నన్ను వీడి ఫీ
వచ్చుట స్వర్గలోకసుఖ • మందుదు సంతసిలంగ నాయమే?
నచ్చిక మీఱఁ బల్కితివి • నావర జీవము నీవయంచు నా
పొచ్చెములేని పల్కిపుడు • పొల్లుగ నేల చరింతు వల్లభా!

ఉ॥ నీమది నేవసించుటలు • నిక్కమయేని రిపుప్రకాండ మీ
భూమిని నన్నుగూడఁ బొరి • పుచ్చియె యుందును గాదె? నీవిటన్
నామసమందునుండినను • నావలె జీవముతోడ నుందు వి
ప్లేమొకొ రెండు పద్ధతులు • నేర్పడఁ గల్లయ యయ్యె వల్లభా!

ఉ॥ నీదయచేత నెల్లరము • నిశ్చలజీవిత మొందినార మ
య్యా! దరి జేర్చితంచు విబు • ధాళి కృతజ్ఞత చూపి నిన్ను నా
మోదముతో నెదుర్కొని ప్ర • ఫుల్ల నిలింప మహీజపుష్పముల్
సాదరవృత్తిఁ జల్లుచును • స్వాగతమిచ్చిరె నీకు వల్లభా!

చ॥ కలశ పయోధిఁ ద్రచ్చి తెఱ • గంటులకున్ సుధయిచ్చు నీకు వి
మ్మలవడి దాఁగి నీపయి న • మోఘ శరం బొగి నేసినట్టి మై
థిలి హృదయేశ్వరుండె పని • దెల్పి యొసంగఁగ నాజ్ఞయిచ్చుచోఁ
బలువకు నీదు తమ్మునకు • భాగ్యము లన్నియు నీయకుందువే?

ఉ॥ తమ్మునితోడఁ బోరుటకుఁ దార్కొనియేగెడు వేళఁ గూడవం
చొమ్మిక దెల్పితిన్ రఘుకు • లోత్తముఁ డన్నెము లాచరింపఁడం
చిమ్ముగఁ బల్కినమ్మి యటు • లేగి యుగాంతము చూశఁదగ్గ నీ
విమ్మెయిఁ గూలినాఁడ విక • నెన్నఁడు నిన్ను గనంగ నయ్యెడిన్?

ఉ॥ నీవెదిరించి డీకొనిన • నిగ్గగు కాంచన శైలమైన ను
గ్గైవడి రాలునన్న నొక • యమ్మెదురై భవదీయ వక్షమున్
వావిరిఁ జీల్చివైచె నను • పల్కుల నమ్మఁగఁ జాల కుంటిని
ట్లీవగఁ జచ్చియుండు ప్లవ • గేశుఁడు వేఱొక వాలియేమొకో?

మ॥ తనయా! అంగద! నీపితృవ్యుఁడు తొలిన్ • దా వాలి తమ్ముండనన్
ఘనసంపూజ్యత నొంది యిప్పుడు పగన్ • గార్పణ్యముం బెంచి వా
లిని శ్రీరాము నమోఘ బాణమునఁ గూ • ల్పించెం బ్రభుత్వంబుకై
మన సౌభాగ్య పవిత్ర జీవితము లి • మ్మాడ్కి న్నశించెం గదా!.

మ॥ పర కష్టంబుల నౌషధంబువలెఁ బా • పం జాలు విల్కాఁడు తా
మరసాక్షుం డొక పాటి వీరు డొనరిం • పన్ రాని దుష్కార్యమున్
జరిపెం; బెద్దలు వారివారి పనులే • సద్రీతిఁ దద్యోగ్యతల్
ధరఁజూప న్నికషోపలంబు లను న • ర్థంబెన్న వ్యర్థంబొకో!.

తే॥ అనుచుఁ బరిపరివిధములఁ • బనవి పనవి, సోలినట్టి సంభవమును • చూచినీతి
మంతుఁడగు హనుమంతుఁడు • మానవతిని, చెలులతోఁ గొనిపొమ్మని • చెప్పిపంపి

తే॥ అవల వాలి మేనునకుఁ జే • యంగఁదగిన, చరమ కర్మంబు లంగదు • కరముమీఁద
గరఁకఁ జేయించి జరపిన • కార్యమెల్ల, విన్నవించెను శ్రీరామ • విభునియొద్ద.

తే॥ దోషసమితి సమూలంబు • త్రుంగిపోవఁ, జెలఁగు నర్కుండు చరమాద్రిఁ • జేరుచుండ
వరవిబింబ మంతిమదశ • నందినట్టి, యింద్రనందను మొగమట్టు • లెఱ్ఱనయ్యె.

తే॥ రవియుఁ గ్రుంకెను ధీరుఁడౌ • రామవిభుఁడు, సీతఁగూర్చి చింతించుచుఁ • జెంతనొక్క
నెలవున న్వసియించి యా • నిడుదరేయి, యనెడు కడలి నెట్లో యీఁది • యెనపె దరివి

చ॥ తనయుఁడు నాఁడు రత్నసము • దార కిరీటము దాల్చునంచుఁ ద
జ్జనకుఁడు చూడవచ్చె నను • చక్కటి భానుఁడు వేగలేచి యా
పనికి రహించి తోడుపడు • పంకజవాసిని వచ్చిచేర నె
జ్జని కరపాళితోఁ దెఱచె • రాజిత పద్మ దళారరంబొగిన్.

ఉ॥ అంతఁ గృపాసముద్రుఁడగు • నర్కకులాగ్రణి యర్కసూతి క
త్యంత ముదంబుతోడఁ బ్లవ • గాధిప పట్టము శాస్త్రపద్ధతుల్
సాంతముగా రహింప నెఱ • సంబునఁ గట్టుమ యంచుఁ దెల్ప ధీ
మంతుఁడు లక్ష్మణుండు హను • మంతుని గాంచి వచించెఁ గ్రవ్వజన్.

ఘ॥ అభిషేకం బొనరింపఁగా వలయు దీ • వ్యద్రవ్య సామగ్రులన్
రభసం బారఁగ సేకరింపు మన స • ర్వంబయ్యె సిద్ధంబుగా
నభిజి ద్వేళయు డాసె రండనిన మో • దాత్ముండు సౌమిత్రి తా
నభిషేకం బొనరించె భానుజునకున్ • బ్రాంచన్మణీ పీఠిపైన్.

శా॥ కార్యంబుల్ క్రమరీతిఁ దాపసవరుల్ గా • వింపఁగా దేవతా
వర్యుల్ కల్పకసూనముల్ ముదముమై • వర్షింపఁగా వృద్ధు లా

శౌర్యయుక్తంబుగ నక్షతంబు లిడఁగా • శీర్షంబునన్ శీర్షకం
బార్యశ్రేష్ఠుఁడు పెట్టె వానరుల క • త్యానంద మాపదిలన్

చ॥ అవలఁ గిరీటధారియగు • నర్కసుతుండు కుతూహలుండు రా
ఘవ చరణారవిందముల • గాటపుభక్తి భజింప నాతఁడు
త్సవ మలరారఁగా నలమి • సాదర మేదురమైన దీవనల్
తవిలి వచించి వెండియు ను • దార వచస్సుధ లూర విట్లనున్

## శ్రీరాముఁడు సుగ్రీవునకు రాజధర్మములు దెలుపుట

సీ॥ కీశకులాధ్యక్ష! • కిష్కింధకేగి నీ కర్తవ్యములను చ • క్కఁగ నెఱింగి
విధ్యుక్త విధులఁ గా • వించుచు రాచకా, ర్యము లాచరింపు కొ • ఱంత లేక
యంగదుతోఁ గూడి • యానంద జీవిత ,మనుభవింపుము పుట్టు • సార్థకముగ
జ్ఞానధనాఢ్యులౌ • సచివులతో వీర వరులగు సైన్యాధి • పతులతోడఁ

తే॥ బావనంబగు నెయ్యంబు • పాటిలంగ, నలరి కలుషవిదూర కృత్యములఁ బ్రేమ
విలిపి ప్రజలకు నాశ్రయ • జీయుఁడవయిఁ భీకరుఁడవై ఁఖరిమన్ • వెలయు మయ్య

సీ॥ ధూమంబుగలచోట • ధూమధ్వజుండుండు ననువాక్కులో సత్య • మరయుమయ్య
శత్రుమిత్రులయెడ • సమరీతి మధుర వా క్యముఁ బ్రసన్నత • నాడుమయ్య
అమరు లతిశయించి • భ్రమియింపఁదగిన సం పద్గౌరవంబుఁ గా • పాడుమయ్య
ముల్లోకములయందు • మూఁడు తెగలవారు, మునులకుం గలరని • మనఁగదయ్య

తే॥ ఎవరి విషయంబునను క్రౌర్య • మెంచకయ్య, దూషణము లాడినను చెవి • దూర్పకయ్య
యించి వర్ణాశ్రమములఁ బా • లించుమయ్య, దేవుఁడని ప్రజల్ దలఁపవ • ర్తింపుమయ్య

తే॥ పరుల కుపకృతి సత్యవా • క్పాలనంబు, పరులధనమునకై యాశ • పడమి యనెడు
పద్ధతులె జగమున గౌర • వంబుగూర్చి సద్గతిం జేర్చునవి యని జరగుమయ్య

ఉ॥ తక్కువవారటంచు ఘన • దర్పముతో నెటువంటివారికిన్
జిక్కుఁ గూర్పఁగాఁగదగు • చేటొనఁగూర్చును బాల్యచేష్టచే
నొక్క యవజ్ఞచేఁకద • యొందితి మంథరచేత నింతయున్
విక్కముదీని నాత్మ గమ • నించి చరింపుము మిత్రరత్నమా!

ఉ॥ స్త్రీలనిమిత్తమే జనులు • చేటుల నొందుదురన్న యర్థమున్
బోలనెఱుంగు మివ్విధము • పూర్తిగ నియ్యెడ వాలిచేఁతలన్
దేలెను వారి మూలమున • దీఱని దుఃఖజనాపవాదముల్
తేలికయున్ ఘటించు నని • తెర్చితి మీయెడ నేల వేఱేఁకన్?

చ॥ ఇతఁడొక నాయకుండె? మన • కేగ్గడ తల్లియుఁ దండ్రి చుట్టమున్
హితుఁడును గాఁడె యంచు గణి • యింపఁ బ్రజాహిత తత్పరుండవై

ధృతిగొని క్రూరకర్మలను • తెక్కలి వారలఁబట్టి ధర్మ ప
ద్ధతి చెడకుండఁ గాచుటకు • దండన చేసెదు గాక మిత్రమా!

చ॥ ఋజుమతిఁ జర్పచేయునెడ • నెక్కువ తక్కువ చావు పుట్టుకల్
ప్రజలకుఁ బూర్వకర్మములఁ • బట్టియె వచ్చు నధర్మవృత్తు ని
య్యాజానకునేని జీవిత మ • హావధిఁ గ్రుంచును ధర్మవృత్త మ
క్కాజముగఁ బెంచుచుండు నను • గణ్యుల పల్కులు నమ్మ మిత్రమా!.

శ॥ కలిమియు లేమియుం గలుగఁ • గారణమౌనవి పుణ్యపాపముల్
ఫలితములంచుఁ బల్కుదురు • ప్రాజ్ఞులు పెద్దగ నిశ్చయించి యా
కలిమికి హేతువైన శుభ • కర్మ సమూహము నుజ్జగించి లే
ములఁ గలిగించు పాపములఁ • బూని యొనర్చుట మెచ్చుచేఁతయే?.

మ॥ నృపధర్మావళి యిట్టిదంచు మది ని • ర్ణీతిన్ విచారించి స
త్కృపఁ బాలింపుము కీశరాజ్యమును; ప్రా • వృట్కాలమంతంబుగాఁ
గపిసంఘంబులతోడ నాయెడకు వీఁ • కన్ రమ్మ పొమ్మన్న సం
తపడన్ భాస్కరసూతి యిట్టులను సీ • తాహృత్సరోజార్కుతోన్.

శా॥ చెట్టుల్ చేమలు ద్రోణులున్ వెలయు కి • ష్కింధాద్రి కీశాలి కిం
బట్టౌ నంచౌక పేరె గాని యరయన్ • స్వర్గంబుతో సామ్యముం
దొట్టున్ వైభవ సంపదావళులతో • దుఃఖమ్ములం దోలి మా
పుట్టుల్ ధన్యముగాఁగ సేవ గొనుమా • పుణ్యాత్మకా! వేఁడెదన్

చ॥ నిను శరణంబు గోరి మఱి • నీయనుకంపకు భాజనంబులై
నిను పెడఁబాసి భోగముల • నిచ్చలు గోరునె మా హృదబ్జముల్?
జనకజ రోయఁగా నదను • సంధిలు దాఁకఁ బ్లవంగపట్టనం
బున వసియింపఁగా వలచి • మ్రొక్కెడువార మనుగ్రహింపవే.

చ॥ అనవుడు మందహాస రుచి • రాననుఁడై రఘురాముఁ డిట్లనున్
వనులఁ జరించు సువ్రతులు • పార్థివ భోగము లందఁజెల్లునే?
పనిగొని నీవు మమ్మ కడు • భక్తి సపర్యలు సేయుచుండఁ బా
లనమున లోటు లేర్పడ ని • లాతి నధర్మము రేకులెత్తదే?

ఉ॥ కానల సంచరింతునని • కైక • సమక్షమునందు పల్కితిం
గాన వసింప నొల్ల మహి • కాంతుల కిమ్మగు రాజధానిలో
మానవతీలలామ యగు • మైథిలిలేమి నలంగు నాకు స
మ్మానిత సౌఖ్యముల్ గలవె • ఆత్మతలమందు తలంచిచూడుమా!.

మ॥ తనదారన్ దనుజాల్ హరింప మదిఁ జిం • తాలేశమున్ లేక య
ట్టిన రాధ్భోగములంది స్నేహితులతో • వేంచేసి యాతిథ్యముల్
గొనుచున్నాఁడని లోకు లాడుకొను వా • క్కుల్ లోకమున్నంతదాఁ
కను దైవాజ్ఞక యంతరంబున నడం • గం బాఱునే మిత్రమా!

మ॥ గృహధర్మంబులు వీరధర్మములు మూ • రింబోవ నల్లాడు నే
మహి నెయ్యింద్రను గూడి సౌఖ్యముల స • మ్మానించుటల్ రోఁత; మ
ద్గృహిణిం గోల్పడ నేనుచేసిన పుదు • ష్కృత్యంబు లింకంగ ని
స్స్పృహతోఁ దాపసధర్మవ ర్తి వనలం • జింతామతిం బూనెదన్

మ॥ పరిపాలింపఁగఁ దగ్గ కార్యముల సం • భావించి రాజ్యంబుఁ ద
త్పరణిం జేయుచు నాల్గుమాసములు వే • చాఁటన్ మహాపేర్మితో
వెరవారన్ నను గాంచ రమ్మిదియ నా • వేడ్కోలు పుమ్మంచు భా
స్కర వంశాంబుధి సోముఁడాడ మతి ప • ల్కన్ లేక సుగ్రీవుఁడున్.

మ॥ కనులన్ బాష్పకణంబు లుబ్బి యురలం • గా కుత్సు నాజ్ఞానువ
ర్తనమే శ్రేయముగాఁ దలంచి తదభి • ప్రాయంబు గుర్తించి యా
తని పాదంబు శిరంబుతోఁ దడవి చిం • తావారిధి న్మగ్ని లి
ట్టిని గోల్పోయిన వానిలీల నడచెన్ • వెన్కాడు పాదాలతోన్.

ఉ॥ వాలికుమారుఁడుం గడిసి • వారని భక్తి నమస్కరింప శ్రీ
లోలుఁడు ప్రేమతోఁ దిగిచి • లోభి పసిండిని వోలెఁ జూచి స
చ్ఛీలుఁడ వౌటకున్ జనకు • చెన్నున నీ పినతండ్రి నెంచి త
త్పాలనలో సహాయుఁడయి • భాసిలుమా యని పల్కె యంతటన్.

ఉ॥ పావనిఁ గాంచి నీవును వి • భాకరసూతికిఁ దోడుగా వనా
టావని పాలనంబు నర • యందగు నన్న నతండు దేవ! మీ
సేవకుఁ డిందయుండఁ గృప • సేయుఁడు దాస్యము సేయుచుండు మీ
కేవిధమైన తక్కువల • నేర్పడనీయక చూచువాఁడనన్.

ఉ॥ రాముఁడుపల్కె గౌరవము • ప్రాజ్ఞత పౌరుష మొందినట్టి రా
ట్ప్రేముఁడు తాల్చియుండిన వ • సుంధర పేతొకరాజు పూన నౌఁ
గాములు గల్గవచ్చు నటు • గాన భవాదృశ బుద్ధిమంతులా
భూమిపు చెంతనున్నఁగద • వోలఁగఁజెల్లును రాచకార్యముల్.

శా॥ మాన్యుండైన దినేశసూనునకు స్వా • మ్యంబైన ప్రాగ్భార రా
జన్యత్వంబు స్థిరంబుగా నిలిపి యా • చందంబునన్ వచ్చి సౌ

జన్యస్ఫూర్తి వహించి నాదగు పనుల్ • సాధింప నీకంటె నా
కన్యుల్లేరిపు డేను గోరిన విధం • బారంగఁ గావింపుమా॥.

మ॥ అను శ్రీరామునిగాంచి మారుతియు మీ • యాజ్ఞప్తి యిట్లైనచొ
వన నేమున్నది కింకరుం డటులె సే • యంగల్గు వాఁడంచుఁ ద
ద్ఘన పాదాబ్జములన్ భజించి కపులం • గన్నాకు కిష్కింధకుం
జనియెం బిమ్మట వేఱుకొండ కరిగెన్ • సౌమిత్రితో రాముఁడున్.

మ॥ ఇనవంశోద్భవునాజ్ఞఁ బూని కపి లో • కేశుండు కిష్కింధకుం
జని భూభారముఁదాల్చి బాంధవ సుహృ • త్సామంత సేనాపతుల్
తను గొల్వం జని మాతృభావమున నా • తారం బ్రశంసించి వా
లిని డెందంబునఁ చంద్రిగాఁ దలఁచి పా • లించెం గపివ్రాతమున్.

శా॥ దిగ్రాజన్యమహోపభోగములతో • దీపించు శాఖాచరుల్
వ్యగ్ర ప్రక్రియ బాంధవావళి లలిన్ • భాసిల్ల నాజ్ఞావిధుల్
సుగ్రీవాజ్ఞ యటంచు నానుడిగ విజ్ఞుల్ పేర్కొనం జేసె నా
సుగ్రీవప్రభుఁ డంగదుండును యువ • క్షోణీశుఁడై యొప్పఁగన్.

మ॥ వినుతుల్ సేయఁగ వీలుకాని గుణగం • భీరుండు శ్రీరాముఁ డ
వ్వనముం దాఁటి మతంగమౌని విలయ • ప్రాంత ప్రదేశంబునన్
దన తమ్ముం డొనరించు పర్ణకుటిలోఁ • దాత్పర్య సంయుక్తుఁడై
తన జాయం దలపోయుచుం జరపెఁ ద • త్కాలంబు సౌమిత్రితోన్.

## 7. వర్షర్తు పటలము. (121)

ఉ॥ పుత్తడిబొమ్మ చందమునఁ • బొల్పు బెడంగును మించు జానకిన్
దత్తఱపాటుతో వెదక • దక్షిణ దిక్కునకున్ రఘూత్తముం
డత్తఱిఁ బంపినట్టి యొక • యర్మిలి కాలరివోలె భాస్కరుం
డుత్తరదిక్కునుండి తగు • నోజను వెల్వడె దక్షిణాశకున్.

తే॥ నల్లమబ్బులు ధరయను • మల్లకమున, వారిరాశియన్ నేయివోసి • మేరువనెడు
వత్తిలోన భాస్వరుని దీ • పము రగిల్చి, కాటుకం గొని పెట్టిన కరణిఁ దోఁచె.

క॥ జీమూతంబుల వలనన్, వ్యోమము గరకంఠు కుతికఁ • బోలియధికమై
తామసి గప్పెను భాస్కర, ధామంబుల తైక్ష్ణ్యముడిగి • ధర వల్లారెన్.

శా॥ నీలాకాశము నంజా చందమున ము • స్నీటంబలెన్ గాటుకం
బోలం దిద్దిన స్త్రీల కన్నులవలెన్ • బొల్పారు కేశంబులం

బోలెన్ నంజాడు దిండ్ల దేహముల చా • డ్పున్ బొంది తచ్చిత్రముం
బోలెం జేష్టలఁ బోలెఁగొప్ప మొగుళుల్ • మూఁగన్ జగంబంతటన్.

మ॥ చిరకాలంబుగ వార్ధి తోయముల వా • పిం గ్రోలు మేఘంబులన్
మెఱుపుల్ పుట్టెను సంగరస్థలి విజృం • భింపన్ మదేభంబులన్
ఖర ఖడ్గంబుల వీర బృందములు వ్ర • క్కల్ వేయఁగాఁ దోచు వె
త్తురుతోఁ గూడిన దుర్వ్రణంబులఁ గరుల్ • తోఁపంగఁ జూపించెనాన్.

తే॥ కారుమొగుళులు భద్రేభ • కాండమట్లు, గానిపించెఁ గరశ్మతోఁ • గదలిపొంగి
గగనమెల్లను వ్యాపించి • గర్జనంబు. లొనరఁజేయు విధంబున • నుఱుమసాగె.

తే॥ హరిహయాదుల భూషణో • త్కరములట్లు, కరువలం దగ్ని తరువులఁ • గాల్చినట్లు
నవ్యఫక్కి దిగ్దేవతల్ • నవ్వినట్లు, నింగి శంపా పరంపరల్ • నెగడి మెఱపె.

తే॥ గగనమను బొగ్గులను వడ • గాలి యనెడి, తిత్తిచే నూఁది వడివడి • దిక్కులనెడు
కమ్మరీంద్రు రగుల్చ నిం • గలములుమియు, కొలిమియననొప్పె మెఱుపుతో • జలదచయము

తే॥ పన్నగములు వియోగినుల్ • పరితపింప. విన మయూఖముల్ కోపి పె • ట్టిన విధాన
నశని జిహ్వలో యన మిట్టి • యతిశయిల్లె, నిఖిలదిక్కుల సౌదామి • నీ వ్రజంబు.

తే॥ ఒనర విద్యాధరులు సమ • రోర్వియందు, రక్తసిక్త కరాసుల • రమణఁ ద్రిప్ప
రహిఁ బదచ్యుతులైనది • గ్రాజదంతి, ఫాలపట్టికలట్లు శం • పాలి మెఱపె.

చ॥ అవనిని మోయుచున్న భుజ • గాష్టక మష్టదిశాంతసీమలన్
దివిరి నభంబు నాకఁ బలు • తేపలు జిహ్వలు చాఁచెనో యనన్
నెవడెను చంచలాలతలు • నీరదముల్ వనజాక్షు మేను నా
మివులుచు నిశ్వసించె నన • మిక్కిలి వీచెను శీత వాయువుల్.

ఉ॥ పల్లము మిట్ట నాక మఱి • పైయవి క్రిందివి నాక వాన గా
డ్పెల్లెడ వీవసాగెను మ • హీధ్రములందును పట్టణంబులన్
బల్లెలఁ గానలన్; గుణము • వంశము యోగ్యత లెక్కపెట్టకే
పల్లవు లిచ్చు రోయికయి • పద్పుది చాఁచు మనంబు కైవడిన్.

తే॥ మగలనెడఁబాసి వెతఁజెందు • చిగురుఁబోండ్ల, పొగులుకుచములమాంసపు • ముద్దలమెదు
ఘ్రింగవచ్చు భూతంబు ల • నంగ నొప్పి. దారుణంబుగ నడరె నీఁ • దరలు ధరణి.

తే॥ ధూళిక్రమ్మి యాకసమునఁ • దోఁచుకతన, మెఱుము లడిదంబులంబలె • మెఱయుకతన
మొగులు మురజంబు కైవడి • మొరయుకతన, గగన మయ్యెడ రణరంగ • గతినిదోఁచె.

తే॥ జనకజం బాసికుంద దా • శరథిమీఁద, మారుఁ డరవిరి శర పరం • పరల నేసి
నట్లు సౌదామినులతోడి • యంబుదములు, వర్షధారలఁ గురిసెను వసుధమీఁద.

చ॥ అడవులఁ గొండలందు పడు • నంబుదధారలు శత్రువింటితో
విడిచిన బాణరాజివలె • వేగముతోఁ బడె నందునుండి రా
ల్పిడుగులు రేఁ గొండల వె • లింగెడు మూలికలట్లు కాంతు లు
గ్గడువుగ వీచు రత్నముల • కైవడి రోచులు వీచెనయ్యెడన్.

ఉ॥ శోరపు వర్షధారలట • దొడ్డగు గుండ్లపయిం బడన్ సమి
ద్వీరులు శత్రు మత్తగజ • బృందముపై నిగిడించు నీఁటెలన్
తీరున నుండె నాదరువు • తీఁగ గరంగఁగ దొర్లు రాళ్ళ త
ద్వారణముల్ రణస్థలి మ • దంబుఁ, బొర్లిన పోల్కిఁ గన్పడెన్.

ఉ॥ అంబుదముల్ రమాసుతుని • యందమునొందఁగ నింద్రచాప మా
శంబరవైరి చాపమను • చందము నందఁగ వర్షధార పు
ష్పాంబకలీల నొంద గిరు • లందలి సానువు లొప్పె మన్మథా
స్త్రంబుల నొచ్చి విచ్చుచుఁ గ • రంగు వియోగుల మేనులో యనన్.

ఉ॥ జలజహితాన్వయుల్ ప్రబల • శౌర్యులు కీశులు నొక్కటౌటచేఁ
బొలిసిరి రావణాదు లని • పూర్ణ ముదంబున వేల్పు లార్పులుల్
నలిపిన యట్లు మేఘములు • సందడి గర్జిలెఁ గల్ప సూనముల్
జలజల రాల్చు కైవడిని • జాఱెను దండడి వర్షబిందువుల్.

తే॥ రావణుఁడు జానకిం గొని • రయముమీఱ, గగనవీథిని పోవుచోఁ • గలికి మిన్న
కనుల నశ్రువుల్ మిక్కిలి • కార్చినట్టు, లంబుదము లంబుధారల • నవనిరాల్చె.

ఉ॥ రాజ ధరుండు మున్ను త్రిపు • రంబులఁ గాల్చిన చిచ్చుటమ్మ నా
రాజిలు చంచలాలతలు • రాచిన కుంతము వోలెఁ జిత్తపం
కేజములందు గాఁడి యుడి • కించె వియోగమునొంది కుంద వి
ర్వ్యాజ రుషా పరీతమగు • యౌవతమున్ యువక వ్రజంబులన్.

మ॥ ధన మార్జింపఁగ దూరదేశముల కు • త్సాహంబుతో నేగి గ్ర
ద్దన రాకుండెడు నాథులం గలఁచి వం • తం గ్రమ్మఱం జేయుటన్
ఘన చింతాకులితాత్మలౌ సతులకుం • గల్యాణదంబైన కా
రును పోల్పంగ వియోగ దుఃఖ ఫణి తా • ర్క్ష్యుండన్న సంబై తగెన్.

తే॥ జలధరములు గర్జిల్లుచు • జలముగురియు, చీకటినొకటి తాఁకుచునుంట • యొప్పెగోప
కరులు గర్జించుచు మదము • గార్చు చీర్ష్యఁ, దవిలి పోరు సాగించు చం • దంబునంది

తే॥ పయర తెమ్మెర సుడిగాలి • వానగాలి, యీఁదనెడిపేళ్ళతో వాయు • వేచి వీవ
జలకణంబులు బాణవ • ర్షంబుమాడ్కిఁ, బడియె దిక్కక్కటు దిక్కులు • పొడిచెననఁగ.

చ॥ సకల జనాళి కూఁతయగు • సంపద పెంపఁగ దూరదేశ వ
ర్తకముల కేగు నాయకులు • క్రమ్మఱఁ గ్రమ్మఱ బ్రాణమొందు పొం
దిక నలరారు నాయికల • తీరున వాడిన వృక్షజాల మా
నికను తలిర్చి పూచి పసి • నిండి యెలర్చెను వానకారునన్

సీ॥ పాటలీ తరువులు • ప్రసవ దూరంబులై దుఃఖంబు నొందిన • తోయమొప్పఁ
బ్రేంకణంబులు ప్రస • వించి విరాజిల్లఁ గువలయంబులు కంది • కుందుచుండ
దినకరుండును స్వీయ • తేజోవిహీనుఁడై కరములు క్రుంగఁ బే • దఱిమి నొంద
సంపద లలరార • సంతృప్తి గొనుపోల్కి నమ్ములు నెమ్మిమై • నర్తింగ

తే॥ తమ్మవిధ్వనాడిచన్న బాం • ధవుల వెదక వలసియుత్సాహరహితులై • యలయుజముల
మొగిని పికము లడవి మౌన • ముద్రఁ బూన నెపక మొపగె పీరామని • దెసలఁ గ్రమ్మి-

మ॥ పలురంగుల్గల బంభరంబులు వెసన్ • బంగారు రంగారు వ
న్నెలచేఁ గ్రాలు ప్రియాళు సూనములపై • నిండారుటల్ వోల్చె నీ
తొలికారామని మార్చి గెల్చెఁ గద యెం • తో మేలు మేలంచు భూ
లలనారత్నము గ్రీష్మ మాఁపఁగను పె • ల్చం జాఁచు కెంగేలనన్.

మ॥ తమ శీర్షంబుల కై వడిం దనరి • విద్దంబై వళశంబునై
భ్రమలం గొల్పెడు నాగలింగ కుసుమ • వ్రాతంబు వీక్షించి న
ర్పములే యంచు భుజంగ బృందము పరి • ష్వంగంబు గావించె బు
ష్పము లామోదము చెందినట్టులె వికా • సం బంచె నాకూటమిన్

ఉ॥ పీమలు గాని ప్రేమలకుఁ • జేరిన నాధులు గీము పేరఁగాఁ
బ్రేముడి మీఱు తత్పతులు తృప్తివహింపఁగఁ బెక్కురీతులన్
గాముని కేళిఁ దేలి తమ • కమ్మని నమ్మిని తమ్మలో యనన్
భూమిని నావుగింజ పదఁ • బోలక నిండిన నింద్రగోపముల్

ఉ॥ నేరెడుపండు డుల్లిపడి • నింగిని తాఁకెడు నెత్తువాల్చు న
మ్మేరువునుండి బంగరువు • మిక్కిలి తెచ్చెడి నేరె ఛేఱనన్
జాతిన వెల్లువల్ నెగడి • సర్జక పుష్పము లారె జేల పూ
ల్గూరిచి తెచ్చుచుం గలియఁ • గూడుచుఁ బాఱె భయంకరస్థితిన్

ఉ॥ అందము చందముం బొదవు నందిన కాఁడలతోడి మోసటుల్
పొందిక నుల్లసిల్ల దళ • మూలముఁ బడి యింద్ర గోపమున్
చిందిన తేల పూవులను • చెన్నలరారె ధరిత్రిదేవి సొం
పొందఁగఁబాడు తేఁటుఁకు • నొప్పన సేయు కరంబులో యనన్

సీ॥ ఝుంఝూమ్మనుచుఁ జుట్టి • సుడియాడు మధు లిడ్వి, రావంబు కిన్నర • రవముఁ బోల
ఘుమఘుమధ్వనులతో ఘూర్ణిల్లు మేఘగ ర్జనము మృదంగ ని • స్వనముఁ బోలఁ
బురివిచ్చియాడు నెం • పౌరయు మయూర నృ, త్యంబులు చెలుల న • ర్తనముఁ బోలఁ
దాలిపూవులు కించు • తాళంబులను • బోలఁ, బ్రేంకణంబులు దీప • వితతిఁ బోల

తే॥ కాకి కలువలు సభ్యుల • కనులఁ బోల దేవసభ నాఁగ నాభూమి • తేజరిల్లెఁ
బ్రావృడంబుదజాత వ • ర్షప్రకీర్ణ, శాంత నిర్మల విశ్రాంతి • సదనమగుచు

మ॥ సుర పున్నాగ విశిష్ట పర్వతములన్ • స్రోతస్వినుల్ జాఱు చొ
ప్పరయన్ జీవులఁ గావ ధాత్రి కరుణా • వ్యాసంగయై మేదినీ
ధర వక్షోజములందు చేపిన పయో • ధారా ప్రవాహం బనం
బరఁగెన్ జీవనదాత్రి భూమియె కదా • బ్రహ్మాండ భాండంబునన్

సీ॥ కోరిన వారల • కోరిక లొసఁగంగఁ, బత్ర పత్రమునకుఁ • బసిఁడిపరులు
వ్రేలనొప్పెడు కల్ప • వృక్షంబువైఖరి తేలతరువు లొప్పెఁ • బూలతోడ
నేవంకఁ గనుఁగొన్న • నేపారు తుమ్మెద, రొదలతో వెలయు పూఁ • బొదలు పొదలె
కామ మగ్గలముగాఁ • గ్రాలు మృగంబులు పరిమళ తరువుల • కొరసికొనుచుఁ

తే॥ గ్రొత్తతావి కస్తురి కంపె • గుబులుకొనఁగ హరిణు లారసి తమువీడి • యన్యజాతి
మృగులతోఁ గూడె ననుశంక ! నొగిలి యలుక చెంది చెంతకు రానీక • కుందుచుండె

మ॥ పతిదూరంబ్బున కేగ వానతజి నె • వ్వంబొంది దూపిల్లు ప్రో
-షిత నాథాత్మక కన్నులట్లు ముకుళిం • చెఁ జా వాడి యిందీవర
ప్రతతుల్ నాథుఁడు క్రమ్మఱిల్లఁగ నవి • ర్వాచ్యప్రమోదోత్తరం
గిత సుస్వాంత వినూత్న హాస రుచులన్ • గెల్పొందె జాతీ లతల్

మ॥ దరి నర్తించు కుశీలవ ప్రభృతి న్దు • ద్వృత్రిప్తి షు • మన్నించు భూ
వరుమాడ్కిం దరి నాడు నెమ్ములకు నొ • ప్పన్ హేమమృత్పిండముల్
దరులం ద్రోచెను వెల్వ లింట నతిథిన్ • దన్పించు సాధ్వీము ఖాం
బురుహ ప్రక్రియ లేచెఁ బంకజము లం • బోదంబు నీక్షింపఁగన్

మ॥ కందర్పాగమకోవిదుల్ బహుళ సం • ఖ్యాకామినీ సంగమా
నందం బొందు విధానఁజేరి యళిబృం • దం బన్నిపుష్పంబులం
గ్రందై చిందు రసంబు నొక్కయెడఁ గూ • ర్పంజొచ్చె స్ఫూర్జద్రసా
నంద శ్రీకర రూపకంబు కవి తి • స్నన్ గూర్చు చందంబునన్.

మ॥ మన రమ్యేక్షుల గెల్చి మించు ధరజన్ • మాయావి మారీచుఁ డీ
మన రూపంబె ధరించి యాపదలు ప్రా • మంజేసె సంతోషమున్

మన మీ రాముని మ్రోలఁ జూపుట యసం • భావ్యంబయౌనంచు స
న్మని భావంబు వహించెనో యనఁగ నొ • ప్పున్ జింక లయ్యద్రిపై

చ॥ చిర మెడఁబాయఁ బ్రేమమునఁ • జెల్వల చిత్తము వాడియుండ ని
ర్భర కృప వచ్చి మోహము భ • రంబుగఁ జేసిన భర్తలం బలెన్
వరటి జలంబు లేనివగు • వాహినులందు రసంబు పొంగ సం
బిరమున వచ్చి చేరినవి • వారక తండములై మరాళముల్

శా॥ పారావార జలంబు గ్రోలి విను త్రో • వం బోవు మేఘాలితోఁ
దారామార్గము చేరి నేగు బకముల్ • దామోద రోరస్స్థలిన్
దోరంబై చను తారహారమన ను • త్తుంగోత్తరీయంబనన్
గారామార వెలింగెఁ దక్కానవి చు • క్కల్వోలెఁ గన్పట్టఁగన్

శా॥ కోపాత్ముండు నిరంకుశుండు తపన • క్షోణీశుఁ దేగంగ వి
ర్లేపుండున్ సుగుణాభిరాముఁడగు ప్రా • వృడ్భూపుఁ దేతేర హృ
త్తాపం బాసి ధరిత్రి మేనఁ బులకల్ • స్తంభించెనా శాద్వలం
బేపారెన్ గనుపండువయ్యె ధరణీ • వృత్తంబు లెందేగినన్

మ॥ నలువందొట్టి మహాత్ములెల్లడను వి • జ్ఞానేశ్వరుండైన కో
సలరాజాత్మజు దుఃఖముం గని కృపా • సంగాత్ములై జానకిన్
గలయన్ రోయఁగఁ గన్నులన్ బఱపి యా • కారించిరో నాఁగ మం
దల బర్హంబుల విప్పి యాడినవి కా • నన్ నీలకంఠావళుల్

మ॥ అరిరక్తాస్త్ర కృపాణ కుంతధర వీ • రాగ్రేసరోత్కర్ష శీ
ర్ష రుహ ప్రాక్తన వర్ణముం జెఱుచు రా • జద్రాజ బింబాననా
చరణాలక్తక భంగి నెఱ్ఱనగు న • బ్జంబుల్ విరాజిల్లెఁ ద
ద్వర మధ్యంబులఁ బోలి పూలఁదక లా • త్కంపించె లీలాగతిన్

మ॥ పికరాడ్బృందములార! • మిమ్మరలె శీ • ఘ్రం బల్కు నాసీత నో
పికమైఁ గాననసీమలందు దగ న • న్వేషించి తోడ్తెండనన్
పికముల్ సమ్మతి నెల్లదిక్కులను వే • పేర్కొంచుఁ బేర్కొంచుఁ దోఁ
పిక వేసారఁ యఱంగి కూయిడుట లా • పెంపోలు నీరామనిన్

చ॥ కడివిడి మేసి లేఁగ గమి • గంతులు వేయఁగఁ బట్టత్రోవు లె
ల్లెడఁబడి బజ్జియై చెదరి • యేపఱి మార్గికి వోవెఁ గన్పడెన్
గడిముసుమంబు లుల్లసిలి • కాన గనయ్యెను బ్రేఁత లీడి పెన్
గడవులఁ దోయఁ బైకుబికి • కన్పడు పాలనురుంగుకైవడిన్

సీ॥ జుంజుమ్మనుచుఁజుట్టి • సుడియాడు మధు లిట్స్వి, రావంబు కిన్నర • రవముఁబోల
ఘుమఘుమధ్వనులతో ఘూర్ణిల్లు మేఘగ, ర్జనము మృదంగ ని • స్వనముఁబోలఁ
బురివిచ్చియాడు సొం • పౌరయు మయూర నృ, త్యంబులు చెలుల న • ర్తనముఁబోలఁ
దాలిపూవులు కంచు • తాళంబులను • పోలఁ, బ్రేంకణంబులు దీప • వితతిఁ బోల

తే॥ కాకి కలువలు సభ్యుల • కనులఁ బోల దేవసభ నాఁగ నాభూమి • తేజరిల్లెఁ
బ్రావృడంబుదజాత వ • ర్షప్రకీర్ణ శాంత నిర్మల విశ్రాంతి • సపనమగుచు

మ॥ సుర పున్నాగ విశిష్ట పర్వతములన్ • స్రోతస్వినుల్ జాఱు చొ
ప్పరయన్ జీవులఁ గావ ధాత్రి కరుణా • వ్యాసంగయై మేదినీ
ధర వక్షోజములందు చేపిన పయో • ధారా ప్రవాహం బనం
బరఁగెన్ జీవనదాత్రి భూమియె కదా • బ్రహ్మాండ భాండంబునన్

సీ॥ కోరిన వారల • కోరిక లొసఁగంగఁ బత్ర పత్రమునకుఁ • బసిఁడిపరులు
వ్రేలనొప్పెడు కల్ప • వృక్షంబులై ఖరి జేలతరువు లొప్పెఁ • బూలతోడ
నేవంకఁ గనుగొన్న • నేపారు తుమ్మెద, రొదలతో వెలయు పూఁ • బొదలు పొదలె
కామ మగ్గలముగాఁ • గ్రాలు మృగంబులు, పరిమళ తరువుల • కొరసికొనుచుఁ

తే॥ గ్రొత్తతావి కస్తురి కంపె • గుబులుకొనఁగ హరిణు లారసి తముపీడి • యన్యజాతి
మృగులతోఁ గూడె ననుశంక • నొగిలి యలుక చెంది చెంతకు రానీక • కుందుచుండె

మ॥ పతిదూరంబున కేగ వానతఱి నె • వ్వంబొంది దూపిల్లు ప్రో
షిత నాథాత్మక కన్నులట్లు ముకుళిం • చెఁ వాడి యిందీవర
ప్రతతుల్ నాథుఁడు క్రమ్మఱిల్లఁగ నవి • ర్వాచ్యప్రమోదో త్తరం
గిత సుస్వాంత వినూత్న హాస రుచులన్ • గెల్పొందె జాతీ లతల్

మ॥ దరి నర్తించు కుశీలవ ప్రభృతి ను • దృత్ప్రీతి మ • మన్నించు భూ
వరుమాడ్కిం దరి నాడు నెమ్మలకు నొ • ప్పన్ హేమమృత్పిండమూల్
దరులం ద్రోచెను వెల్వ లింట నతిథిన్ • దన్పించు సాధ్వీము ఖాం
బురుహ ప్రక్రియ లేచెఁ బంకజము లం • బోదంబు నీక్షింపఁగన్

మ॥ కందర్పాగమకోవిదుల్ బహుళ సం • ఖ్యాకామినీ సంగమా
నందం బొందు విధానఁజేరి యళిబృం • దం బన్నిపుష్పంబులం
గ్రందై చిందు రసంబు నొక్కయెడఁ గూ • ర్పంబొచ్చె సూర్పజ్ఞరసా
నంద శ్రీకర రూపకంబు కవి తి • స్నన్ గూర్చు చందంబునన్.

మ॥ మన రమ్యేక్షు గెల్చి మించు ధరజన్ • మాయావి మారీచుఁడీ
మన రూపంబె ధరించి యాపదలు ప్రా • మంజేసె సంతోషమున్

మన మీ రాముని మ్రోలఁ జూపుట యసం • భావ్యంబయౌ నంచు స
న్మని భావంబు వహించెనో యనఁగ నా • ప్పున్ జింక లయ్యద్రిపై

చ॥ చిర మెడఁబాయఁ బ్రేమమునఁ • జెల్వల చిత్తము వాడియుండ ని
ర్భర కృప వచ్చి మోహము భ • రంబుగఁ జేసిన భర్తలం బలెన్
పరటి జలంబు లేనివగు • వాహినులందు రసంబు పొంగ సం
బరమున వచ్చి చేరినవి • వారక తండములై మరాళముల్

శా॥ పారావార జలంబు గ్రోలి విను త్రో • వం బోవు మేఘాలితోఁ
దారామార్గము చేరనేగు బకముల్ • దామోద రోరస్థలిన్
దోరంబై చను తారహారమన న • త్తుంగోత్తరీయంబనన్
గారామార వెలింగెఁ దక్కనవి చ • క్కల్వోలెఁ గన్పట్టఁగన్

శా॥ కోపాత్ముండు నిరంకుశుండు తపన • క్షోణీశుఁ డేగంగ వి
ర్లేపుండున్ సుగుణాభిరాముఁడగు ప్రా • వృడ్భూపుఁ డేతేర హృ
త్తాపం బాఱ ధరిత్రి మేనఁ బులకల్ • స్తంభించెనా శాద్వలం
బేపారెన్ గనుపండువయ్యె ధరణీ • వృత్తంబు లెందేగినన్

మ॥ నలువందొట్టి మహాత్ములెల్లడను వి • జ్ఞానేశ్వరుండైన కో
సలరాజాత్మజు దుఃఖముం గని కృపా • సంగాత్ములై జానకిన్
గలయన్ రోయఁగఁ గన్నులన్ బఱపి యా • కారించిరో నాఁగ మం
దల బర్హంబుల విప్పి యాడినవి కా • నన్ నీలకంఠావళుల్

మ॥ అరిరక్తార్ద్ర కృపాణ కుంతధర వీ • రాగ్రేసరోత్కర్ష శీ
ర్ష రుహ వ్రాక్తన వర్ణముం జెఱచు రా • జద్రాజ బింబాననా
చరణాలక్తక భంగి నెఱ్ఱనగు న • బ్జింబుల్ విరాజిల్లెఁ ద
ద్వర మధ్యంబులఁబోలి పూలఁటక ఱ • త్కంపించె లీలాగతిన్

మ॥ పికరాడ్బృంధములార! • మిమ్మదలె శీ • ఏం బల్కు నాసీత నో
పికమైఁ గానసమసీలందు దగ న • న్వేషించి తోద్రెండనన్
బికముల్ స్మృతి నెల్లదిక్కులను వే • పేర్కొంచుఁ బేర్కొంచుఁ దోఁ
పిక వేసారి యలంగి కూయిడుట లా • పెంజోలు సీరామనిన్

చ॥ కడివిడి మేసి లేఁగ గమి • గంతులు వేయఁగఁ బట్టక్రోవు లె
ల్లెడఁ బడి బజ్జియై చెదరి • యేపటి మార్జికవోఁవెఁ గన్పడెన్
గడిమినుమంబు లుల్లసిలి • కాన గనయ్యెను ప్రేఁత లీడి పెన్
గడపలఁ దోయఁ బైకుబికి • కన్పడు పాలనురుంగుకైవడిన్

సీ॥ కొండచేరువనేలఁ • గొండగోఁగులు పూచి. కొలువల కురుల ఘుం • ఘుమలొనర్చె
సురపొన్న పూవులు • విరిసి బెస్తలయువిఁ దల కచముల తావి • యలరఁజేసె
బిల్లంపునేలల • ఖాసిల్లి కలువలు, బిల్లల తలలు వా • సిల్లఁగూర్చె
సద్యో వికస్వర • జాతీ సుమంబులు, ప్రేఁతల వెంద్రుకల్ • వెలయనొప్పె

తే॥ ఎచ్చటెచట విచ్చిన విరు • లచ్చటచటి, మానినీ మస్తకముల స • మ్మానమొంది
జనన సాఫల్య మొనరించు • కొనుచునుండె, వాసికెక్కు వారఁకిదే • వర్తనంబు

మ॥ విరివిల్కాని కవారిగా శరతతుల్ • వేకూర్చ నీరామునిన్
సరసీజాక్షి ప్రసన్నసుందర తరా • ఙ్యస్ఫూర్తి గాంచంగలే
కురుతాపంబునఁ గ్రుంగి కుందు రఘువ • ర్యుండెట్టులోర్చుం గటా!
ధర నెందే సతిఁ గోలుపోవు జనికిఁ • దార్కొన్నె సమ్మోదముల్?

మ॥ అతిదీర్ఘంబగు వానకారడర దై • ర్యంబెల్ల మౌనీంద్ర సం
తతికేనిం జెడుచుంట తథ్యము సుధా • ధారా నిషిక్తస్ఫుటీ
కృతవాక్యన్ జనకాత్మజన్ విడిచి తా • నేకాకియై కుందు నా
శ్రిత రక్షామణి యేగతిం గడపుఁ బ్రా • వృట్కాల మాకాననన్

## శ్రీరాముని విరహ సంతాపము

మ॥ స్ఫురదిందీవరగాత్రుఁ డయ్యెడ మదిన్ • స్రుక్కున్ విచారించు దు
ర్భర తాపమ్మునఁ గ్రుంగుఁ గుందు బలస • త్త్వంబుల్ దిగంబాఱ ని
ష్వైరపొందున్ జలియించు నూర్చు వెత ని • ర్వేదించు నిశ్చేష్టుఁడౌ
ధరణీజాత ముఖాంబుజాతము నిఁకన్ • దర్శింతు నొక్కోయనున్

మ॥ వనదంబా! వనజాక్షి నాఁచికొని క్ర • వ్యాదుండు బంధించి దాఁ
చిన తావుం దెలిపింపవో? తెలుప నీ • చిత్తంబు మైకోదో? జీ
వనసంధాతపు నీకు నాపయినిస • ద్భావంబు పాటిల్లదో?
నను క్రుంగించి హృదబ్జముం • గలఁచుటే? న్యాయంబె యిక్కార్యముల్?

చ॥ మెఱుపను కోఱపండ్లు గల • మేఘమ! నల్లని చాయ గల్గి భీ
కరముగ బొబ్బ పెట్టు చెటఁ • గాంచిన నచ్చటఁ దోఁచుచుంటి దు
ర్భరమగు క్రూరచేష్టలను • వంచనయుం గల దైత్యరాజి వై
ఖరి గల నీవు ప్రాణములఁ • గైకొనికాని నివృత్తిసెందవో?

కవిరాజ॥ తరళమృగాక్షి సుధామయవాణి మ • దాపళయాన హిమాంశు ముఖిన్
ధరణి కుమారిని తోడ్కొని వచ్చి వి • తాకును దైన్యము నొందిన నా
కురవుగఁ గూర్పు మనేక సునేత్రి మ • యూరమ! నేను వియోగముచేఁ
గరఁగి కృశించుట గాంచియుఁ గారుణి , కత్వము పూనమి నాయమొకో?

ఉ॥ తెమ్మెరతోడఁ జేరుకొని • తీఁకువ నయ్యది యార్భభంగి నే
మమ్మన నాడుచుండెడు సు • మ వ్రతతీ చెడునంటు బల్కి నా
యమ్మల గ్రుచ్చి నొంచెదు ధ • రాత్మజ మధ్యము వోలె నాడుచున్
నెమ్మది నున్ననాకు మును • నెమ్మిని గూర్చుట విస్మరింతువే?

చ॥ తరలను దుష్కృతంబుల కు • దంచిత సత్కృతు లందు నుండియున్
మరలను మంచిపెద్దలను • మానుగఁ గాంచెడు తెల్వి నుండియున్
దొరలను సోలితిం జెడితిఁ • దూలితి నన్నియుఁ బోయె బుద్ధియుం
దెరలెను సీతఁగూర్చి నను • దేర్చు కురంగమ పుణ్యమబ్బెడిన్,

రాజ॥ మృదుపద జానకి నిష్కలుషాత్మక • మేదిని పుత్త్రిక యున్నెడ నన్
వదలఁగ నీవు వలంతివె యైన సు • భాసిని వెంటనె యేగవొకో?
సుదతియ నీకును నాయిక యౌ పదు • నున్ వెదకీవము యెంచవొకో?,
మదిమది నుండక మాలువు యుంచు ను • మధ్య త్యజింప సుఖింతువొకో?

వనవ పరములు వ్రేలు నా • రగ్వధంబు, కలికి కురువంతోఁ బగఁబూను • కతన నమ్మ
లఁచుమంటి వియ్యది గుణ • క్రమమె చూడ?, నెయ్యమెప్పు కునీకుండు • నియతులందు?

మత్త॥ సాంద్ర కోరక దంత సంగతి • పర్వముండలె జాజియున్
జంద్రుతో మరణార్తిఁ గూర్చుచుఁ • జంప నే తలపెట్టె వి
స్తంద్రుఁడౌ సురవైరి కోపమె • వాలియుండఁగఁ జంపె గా
యింద్రుకోపమొ యింద్రగోపమొ! యింతియోష్ఠముఁ జూపుచున్

శా॥ మారీచుండు ధరాత్మజాతను హరిం • పం దగ్గ యాలోచనన్
సారంగాకృతిఁ దాల్చెఁ దొల్లి యిపుడో • చంపం గృతాంతుండు దు
ర్వార క్రూర గుణాత్మకంబయిన యీ • వాత్యాకృతిం దాల్చె మా
కారాటం బొనఁగూర్చు వారలకుఁ గా • మ్యాకారముల్ గల్గె గా!

ఉ॥ క్రూర నిశాచరావళుల • కోపున గర్జిలు కాలమేఘు డా!
నీరసమొందె రాముఁడని • నెమ్మనిసీతను తెచ్చి యీయకే
తీరున మాటి మాటికి వి • దేహ తనూభవ మేని కాంతులన్
జెరిమిఁ జూపి డాఁచెదవు • వేటమి చేఁతలు నీకు నచ్చెనో

నివి॥ ప్రాణము నిల్వఁగ రావు నొసంగక • యంతట నిండిన తాపము నా
ప్రాణములన్ వెలి ద్రోచిన పిమ్మటఁ • బ్రాణము లేని శరీరమునన్
బాణములేయుట రోఁత గదా సుమ • బాణ! తొలంగుము తమ్ముడు నీ
ప్రాణము తీయుఁ దదీయ రుషా పరి • పాక మడంపఁగ లేరెవరున్

ఉ॥ అసమశరా! భవచ్ఛరము • లార్తులపైఁ దెగ నేయఁగా సమం
జసములు కావు చేవయును • స్థైర్యము గల్గిన వారిపట్లనే!
యసమున వైవఁగాఁ దగుఁ, గృ • తాంతుని యట్లనుకంప లేక నీ
కసి మఱి నాపయిన్ విడువఁ • గా ఫలమబ్బునె? కీర్తి దక్కునే?

చ॥ అసదృశ దుఃఖ వారినిధి • యందు మునింగిన రాముఁ డివ్విధిన్
బసచెడి పల్వరింప గుణ • బద్ధుఁడు తమ్ముఁడు కాంచి యోర్చు సా
హసము చలింప గేల్మొగిచి • యార్య! యెఱుంగవు నిన్ను నీవు దు
ర్వ్యసనము • కార్యభంజన క • రంబని పల్కుచు వెండి యిట్లనున్

ఉ॥ రామ! శమాభిరామ! గుణ • రాజిత ధామ! యలంగుటేల? నీ
రామని దీర్ఘమైనదని • యా? దనుజేంద్రుని శౌర్య మెంచియా?
కామిని యున్న తావు వెద • కం గపి సేనలు రావటంచునా?
నీమదిఁ గుంద నేమిటికి? • నెవ్వగపాలయి వాడ నేటికిన్?

ఉ॥ శ్రుతులు నశించినన్ బ్రిదిలి • సూర్యుఁడు చంద్రుఁడు త్రోవ దప్పినన్
వితత నభంబు భూమియును • వీఁగి విపర్యయ మందినన్ భవ
న్మతి చలియింపరాదు ఖల • నన్ బలుదైత్యుల విక్రమ క్రమ
స్థితులు భవచ్ఛల ద్భ్రుకుటి • సింగిణి వంగెడు దాఁక నే కదా?

ఉ॥ మారుతి శౌర్యధైర్యములు • మానుగ వింటిమి తక్కువారలున్
వీరులు కీశు లేడు పడి • వెల్వలు పాపములంబలెన్ సదా
తీఱని పీడ వానతఱి • దీఱెను జానకి వచ్చిచేరు నీ
వారట పొందఁగా వలవ • దాఱడి లేదిఁక నూఱడిల్లుమా

ఉ॥ దండకయందు మౌనులకు • దానవ వారము పేరు మాయ ను
ద్దండతఁ గూల్చి సౌఖ్యములఁ • దార్చెద నంటివి తగ్గయట్లె యా
దుండగులన్ ఘటించిరి సు • దుఃఖము, వారలఁ జంపి దేవతా
తండము నాకవాసము ము • దంబునఁ బొందఁగఁ గీర్తి నిల్పుమా

చ॥ పగతురఁ గూల్పఁగా విజయ • భాగ్యము నిన్ను వరించు రిత్త యీ
పగిదిఁ దపించుటల్ మగల • పద్ధతిగాదు సుఖంబు దుఃఖముం
జగతిని సర్వజీవులకు • సాజము, నీవు ప్రయత్నపడ్డచో
నెడగని దేదియుం గలదె? • నీమది చింత యదేల? రాఘవా!

ఉ॥ ఈకరణిన్ హితంబు వచి • యించిన తమ్ముని యూఱడింపులన్
శోకము మాని రాఘవుఁడు • జోక వహించెను కొన్నినాళ్ళ ల

ప్లేకదచన్న మీఁద నొక • యింద్రధను పేసెను గోరుచుట్టుపై
రోఁకటిపోటు రీతిని దు • రుద్ధరమై జడివట్టె క్రమ్మఱన్ •

కాసారము లెలర్చె • భూసారము తలిర్చెఁ, దటపట లాడుచుఁ • దరగ లురలె
ధరణి వేఁడిమి తగ్గెఁ • దరణి వాఁడిమి మ్రగ్గె, దిక్కులు నల్లనై • తెలియవయ్యెఁ
నెడఁబాటు బరువయ్యెఁ • దడఁబాటు గురువయ్యెఁ, పక్షివితతి జత • పాయకుండె
లోకంబు శాంతించె • భేకంబులు రుతించె, నీటియెద్దడి యెల్ల • నీఁగిపోయె

॥ చాలినంతకు మీఱి వ • ర్షంబు గురిసె జనులు ఘటికార యంత్రంబు • సాయముననె
గడియ లెఱిఁగిరి రేయిం బ • గళ్లు ముసరి పెక్కు దినములు జడిపట్టి • విడవి కతన

॥ కీరవాణుల వాక్య • కీర్తికి సిగ్గిలి చిలుకలు ధాన్యరా • సులను డాఁగె
సుదతుల సుందర రదనంబులకు నోడి, ముత్తెంబులు తరంగ • ములను డాఁగెఁ
గలకంఠకంఠుల • కలరవంబుల కోడి కలకంఠములు కదుం • గముల డాఁగె
అంచయానల నడ • యందంబులకు నోడి, యంచలు మానస • మందడాఁగె

॥ పూల పొన్నలు బంగరు • పోకముడిని, విప్పినట్టి పగిదినుండ • వెలఁదు లూఁగు
నుయ్యెలల గాలివలె నేగి • యువకహృదయ ముంనుక్రాఁగించెఁజలిగాలి • ముసరివిసరి

॥ సర్వసంగముల్ విడిచిన • సాదులట్లు కదలకుండు గ్రావంబుల • కరణి సామ
జము లహోరాత్రములును వ • ర్షమునఁ దడిసి నిద్రలేక చలింపక • నిలిచియుండె

మ॥ చలిచేఁ గంపిలు హంసలెల్ల నుటజ • స్థానంబులన్ హోమ వే
దులపై వ్రాలెఁ ప్లవంగికల్ గుహలలోఁ • దూఁగెన్ ప్లవంగాళి ముం
దల నిల్చెన్ ఋషిసత్తముల్ దరులఁద్రి • త్యాహార యోగస్థితిన్
నిలుకం జెందిన మాడ్కినెల్ల సుఖముల్ • నీఁగంగ నవ్వేళలన్

య్రగా॥ వీఁకజడి పట్టియెడ • మీఁక కురియంగఁ బెనువాఁకలు కొలంకులత • టాకములు నిండెన్
జోకగావి కామిను ల • శోకమతి నాదమి వి • తాకువడి తావులును • సోకువడకుండెన్
ఆకసమునంటుకొను • పోకతరుళ్యందు బలు • తేఁకువను కట్ట బడి • టీకు గొనియుండన్
శ్రీకర విలాసినులు చెకొనమి నుయ్యెలలు•వాకమగు మంచెలును • మూఁకవడియుండెన్

చ॥ మొగలి పొదళ్లమీఁదఁ గల మోహనదీపక పుష్పరాజి బం
దుగుల విధంబునం బలసి • తోరముగా వెలయన్ బకోటికుల్
తిగిచిన తెక్కలన్ ముడిచి దేహము చాపలమంద నూరికిన్
మగలను పంపి దూపటిలు మానినులంబలె నొప్పె నయ్యెడన్.

పలుపలు వన్నెల • జల విహంగంబుల స్వనము మృదంగ ని • స్వనముగాఁగ
బహువిధ భృంగ రా • వంబులు శాస్త్ర ప ద్ధతి నొప్పు సరస గీ • తములుగాఁగ

కేకుల నృత్య మ • నేక విధంబులై, దంబించు భరత నా • ట్యంబుగాఁగ
మృగముల కులికి బె • దరు చూపులం జూచు, సారంగ తతులు ప్రే • క్షకులుగాఁ

తే॥ తెలయు సుమ లతావేష్టిత • వేణితోడ, చిగురు టాకుల చేలంబు • చిందులాడ
నలరు వనదేవతా సభా • నిలయమందు, ముదము దీపించు వేడుకల్ • పొదలుచుండె

చ॥ సకినెల మంచమందు సుమ • శయ్యల ధూపపుఁ దావి క్రమ్మఁగా
సుకముగఁ దీఁగ కౌనుగల • సుందరులెల్లరు చొక్కుచుండఁగా
వికచ జలేజ రాజిఁ జలి • పెక్కసమంచుఁ దొలంగి తుమ్మెదల్
రకముగఁ జొచ్చె గంధతరు • రంధ్రములన్ సుఖనిద్ర సేయఁగన్.

ఉ॥ అంచలు కాణయాచియగు • నంబుజ పుష్పములం ద్యజించి వృ
క్షాంచిత వాటిఁ జేరి కొమ • లందు వసింపఁగఁ దావికట్టిలన్
జెంచులు సంచునించి విర • చించిన మంచెలఁ గప్పుక్రిందుగన్
జెంచెత లంటపిల్ల నొగిఁ • జేరిరి వెచ్చని హాయి నిద్రకున్

ఉ॥ తీవలు ప్రక్కలం బలియ • దీర్ఘములౌ పెను చెట్లక్రింద న
ట్టావుల మేషబృందముల • నారసి నిల్చిరి గొల్ల లొక్కెడన్
త్రోవలుగాని త్రోవలను • దొంగలకై వడి నేగు నాపిశా
చావలి పండ్లు గిటుకొని • యాఁకలిచేఁ గృశియించె నెల్లెడన్

ఉ॥ వింగివి మ్రింగున ట్లడరి • నీరద పంక్తులు బాణవృష్టి భా
తిం గొన్ని యేఁపఁ దేనియలు • తెట్టెల పట్టులు ప్రేలు కోనలన్
సంగడిగా వసించు ససి • చాలక డాఁగఁగ నొంటి యొంటి మా
తంగము లేగెఁ బర్వత ని • తంబములం గల కందరాలికిన్

ఉ॥ దీటొకయింతలేని గుణ • ధీరుఁడు రాముఁడు వర్ష వేళలోఁ
గాటుకకంటి తామరస • గంధి సుహాసిని ధాత్రిజాతపై
మాటిన చింతతో సయిఁచు • మార్గము గానక తన్ను చూచుచున్
మాటికి మాటి కూర్చుచుఁ గు • మారిలి తమ్ముని గాంచి యిట్లనున్,

ఉ॥ పంకజగంధి జానకిని • పాప విహారుఁడు రావణుం డొగిన్
లంకకుఁ గొంచుఁబోవుతటి • లావటి సోలి పయోధిఁ గూలెనో?
సంకటమందుచున్ దనుజు • సన్నిధి జీవముఁలం ద్యజించెనో?
జంకి కృశించుచుం బ్రదుకఁ • జాలెనొ? యేగతి నోర్తుఁ దమ్ముఁడా!

చ॥ అరి జన భీకరంబులగు • నస్త్రము లిట్లు నిషంగిమంద ని
ద్దుర గొన దీర్ఘ పుష్ట దృఢ • దోర్యుగళంబు కృశించి పోవ దు

ర్భరమగు దుఃఖ తాపమున • మ్రాఱచు మండుట నాకు నైజమై
పరఁగిన దీఁటె పోటునకు • వ్రయ్యక యున్నది ఱొమ్ము తమ్ముఁడా!.

ఉ॥ జీనువ లించు నీరములఁ • జేరి మిడుంగుఱుఁబుర్వు వెల్గనన్
జానుగ ధర్మవారిణుల • సంగతి హాయిగ విద్రపేయఁగా
నేనిటఁ దుంట విల్తుఁడు ర • తీశుఁడు వీంచుచు బాధముష్టిచే
సూనశరంబు లేయ మది • స్రుక్కుచు మ్రక్కుచు నుంటి లక్ష్మణా!

క॥ ఉఱుముల మెఱుములఁ గని పెలు, కుఱు సర్పముభంగిఁ గ్రుంగి • కుందుచుమంటిన్
నెఱపిన కార్యము లేమిని, వెఱపరుఁడ న్నవ్వనుంటి • విజ్ఞాననిధీ!

చ॥ ఉడుగక యిల్లె వాన పడు • చుండినచోఁ చపియించి జీవమున్
విడిచి దివంబు చేరుటయె • నిక్కము; దైత్యుఁడు దొంగిలింపఁగాఁ
బడఁతిని గోలు పోవు నప • వాదము రెండవ జన్మమెత్తినన్
విడివడునో? తపోధనుల • వృత్తినె వీడునో యేమొ? లక్ష్మణా!.

తే॥ ఇచ్చటనె యుండి దైత్యుల • యిక్క దెలిసి, కొనఁగఁ జిరకాలమేగు నా • పనియెవలదు
విరహవహ్నిచేఁ గ్రాఁగి దా • శరథి యీల్గె, ననుటయే నాకు గౌరవ • మనుచుఁదోఁచె

మ॥ అలినీలాలక విద్రుమోష్ఠి గురు కి • మ్రాలాప వైదేహి ని
ర్మల భవ్యాత్మక సాహచర్య గుణ ధ • ర్మ శ్రీల మోదించు నే
నిలఁ దామ్రద్రవ వైఖరిం గుఱియు ప్రా • వృట్కాల దుశ్శీకరం
బుల గాత్రం బెరియంగఁ దల్లడిలి ము • ప్పం బొందనయ్యెం గటా!.

మ॥ పురుషార్థంబుల పొంచె నీ గృహిణిగాఁ • బూఁబోణి వైదేహి భా
స్వరు సాన్నిధ్యము నం దొసంగితిఁ గృపం బాలించు కొమ్మన్న భూ
వరు సీరధ్వజు ధర్మ నిర్ణయము వి • ధ్వంసంబు గావించు నీ
దురదృష్టాత్మున కున్నె సౌఖ్యముల పొం • దుం దమ్ముఁడా! చెప్పుమా!

ఉ॥ ఊఱట పల్కఁగా ననుజుఁ • డుండ వియోగభరంబు నోర్చి పై
నూఱడ నేను సమ్మతిలి • యుండఁగ జానకి యిందు వచ్చి నా
కూఱటగాఁ గనంబడునె? • యుత్కట దుఃఖము నాసిరిల్ల నా
కూఱట గొల్పలేరు మఱి • యొక్కరు దీనికి నంత మేదియో?.

మ॥ శితభల్లంబుల బ్రహ్మలోకము మొదల్ • చీకాకు గావించి సం
గత రోషంబున సర్వలోకముల వీఁ • కం గూల్చి దిక్పాలక
ప్రతతిందొట్టి సుపర్వ రాక్షస నర • వ్రాతంబులన్ మూర్చి ని
ర్గతి గావించినఁ గాక కాంచఁగలనే • కల్యాణి నా జానకిన్?.

మ॥ ఘనగర్జా సమ శింజినీకృతరవా • క్రాంతాష్టదిఙ్మండలా!
ఘన రోషంబున నీ ప్రపంచ లయమున్ • గావింప కిట్లుంట ధ
ర్మ నిబద్ధ స్థితిగాదె? దానవ సుర • వ్రాతంబు లొక్కుండయై
యనిలో నన్నెదిరించి నిల్వఁగలవే • ప్రాణాలతో? లక్ష్మణా!.

మ॥ అన సౌమిత్రి వచించు నార్యః కడక్రో • యం బూని యున్నట్టి నా
ల్గు నెలల్ పోయె శరత్తు వచ్చినది ర • క్షోనాధుఁ డెచ్చోట నీ
వనితారత్నముఁ దాఁచెనో? బలిముఖ • వ్రాతంబు పేరోయఁగా
ననువౌ కాలము దాసె మానుమిఁక నీ • యారాటముల్ రాఘవా!

మ॥ క్షీరజలరాశిఁగని • యూరకయ తెమ్మనిన, మాఱుపలు కాడుటకు • నేరకయతానే
తీర రహినుండ వెర • వార నటు లానయిడ, కోరిమిని మందరము • నార భరియించెన్
పీరులగు వేల్పుల సు • రారులను చేర్చికొని, వారకమథించియె చొ • కారమగువెన్నన్
శ్రీరమణిఁ జెందె హరి • ధారణిని కార్యములు, కీరకు ఫలింపవు వె • తారపడకున్నన్

మ॥ తన సంకల్ప వికల్ప మాత్రమున భూ • తశ్రేణితో లోకముల్
తనియంజేసి హరించు శక్తిగల ని • త్య శ్రీవిభుం డెప్పుడున్
ఘనచక్రాదులఁ బూనియే దనుజాలం గారించి లోకత్రయం
బును రక్షించుచునున్న వాఁడిదిగదా • ముఖ్యంబు మాన్యాలికిన్

చ॥ త్రిపురములన్ దహింప మదిఁ • దేకువఁ జేసిన శూలి యోచనన్
తపము నుదాత్త యత్నము ను • దంచిత యానముఁ దక్కు దివ్యమౌ
నుపకరణంబులున్ వినఁగ • నూహ మొనర్ప మతింప శక్యమే?
తపనకులాగ్రగణ్యః ఘన • ధర్మ శరణ్యః తలంచి చూడుమా.

॥ పలు తెఱంగులఁ బలుమఱు • ప్రాణహితులఁ,' తోడ నాలోచనముచేసి • తోడుగొనుచుఁ
బోవఁదగు నదనునఁ బోయి • పోరొనర్ప, జయము చేకుఱు ననుటకు • శంకలేల?

చ॥ నిలువర మొందఁగా ధరణి • నిర్మల ధర్మము నిల్పఁబూని రా
కలిమిఁ ద్యజించి కానఁ గడ • గండ్లు గడించిన నీకుఁగాక యా
పలువలు రేయిద్రిమ్మరులు • పాపహితాత్ములు క్రూరచేష్టలే
చెలువని యెంచినట్టి దృఢ • చిత్తులు వారికిఁ గీర్తి యబ్బునే?

ఉ॥ పావని ధాత్రిపుత్త్రి పడు • బాములు బాములనొంద సౌఖ్యమో
దావలి నొందు: నీకుఁ గల • యాఱడి యాఱడిపోవు; నిచ్చలున్
దేవ మునీంద్ర సంతతి ప • దింబది సారులు వేఁడ వారి ర
క్షావిధి నిర్వహించు మన • కా యపవాదులు? రాజవల్లభా!

ఉ॥ తమ్ముఁ డిటుల్ వచింప నవి • తథ్యముగా మది నిశ్చయించి శాం
తమ్మున సహించె వర్షఋతు • దర్పముతగ్గ శరన్మహంబు మొ
త్తమ్ముగ లేచె నోజగొని • ధారణి వంశ పరంపరాత్తవి
త్తమ్మగుఁ గాదె? స్త్రీలకు స్వ • తంత్ర దశల్ గలవే జగంబునన్?

## శరత్కాల వర్ణనము

ఉ॥ కొంకొక యించుకంత మదిఁ • గూర్చక యర్థుల కిచ్చియిచ్చి కూ
లంకష లట్లు రిక్తత న • లంగెడుచో నొక యర్ధి రాఁగ ల
జ్జాంకురితాననంబు తెల • లైన తెఱంగునఁ గాలమేఘముల్
బింకము దక్కి ఘోషములు • వీఁగఁగ వెల్లన యయ్యె నయ్యెడన్

ఉ॥ మేదిని మేలుకీల్గధిగ • మింపఁగఁ దెల్పు శ్రుతుల్ పఠించి క
ర్మాదుల పద్ధతుల్ తగు ప • లావళి శీలన చేసిచేసి జ్ఞా
నోదయ మొందునంత నడి • యొందు నవిద్యవిధిన్ శరత్సమా
సాదనవేళ నంధతమ • సంబు పలాయన మొందె మబ్బుతోన్.

శా॥ వీరశ్రేష్ఠు లొనర్చు చండిన సమి • ద్వృత్తంబు శాంతించుచో
భేరీ ధ్వానములంబలెన్ జలద గం • భీర ధ్వనుల్ శాంతిలెన్
నారాచంబులఁబోలె దుంపురుల వి • న్నాణంబులన్ శాంతిలెన్
నారాజీ లొలయందు దాఁగినక్రియన్ • జాటొందె శంపా లతల్

తే॥ గిరుల చఱియల దురులఁ గొ • ప్పరములందు, వఱ్ఱులొడిన సెలయేఱుల్ • వట్టిపోయె
వత్తిఱిం గొండ లుత్తరీ • యంబు నంత రీయముం గట్టివీడిన • రీతిఁగ్రాలె.

తే॥ జలదములు పర్వతోపరి • తలములందు. వ్రాలి కురియ నాకసము ని • ర్మలినమగుచు
న్యాయపథమునఁ గూర్చి స • న్మార్గవృత్తి. వ్యయముచేయు ఘనుని కల్మి • వలెవెలింగె

మ॥ మద మాతంగ సమాజముల్ బెరయు సా • మ్యంబంది జీమూతముల్
చదలం దెల్లెసఁ గ్రమ్మియుండి తెరవ • స్త్రం బూడ్చు విన్నాణమై
యొదుఁగంబాఱఁగ నర్తకీ వదన బిం • బోన్మేషముంబోలె నొ
ప్పిదమై వెల్వడి వెగ్గెఁ జంద్రుడు నభో • వీథిన్ మహొల్లాసుఁడై.

చ॥ పసిమి కడాని రంగుగల • వాలుగకంటుల గబ్బిగుబ్బలన్
పసిగ నలంది తెమ్మగొను • చందన పంకము లాఱిపోవఁగా
శ్వసనుఁడు పుష్పితా తతుల • పైఁబడి నీరములాడి వెండియున్
మిసికినఁ దాఁకుదొందునని • మెల్లన మెల్లన వీచె హాయిగన్

తే॥ దాశరథి చింత దొలఁగింపఁ • దగినయదను. దొరకె మేమును జనకజ • న్వరయనేగు
వారమని పోవుక్రియ దివి • బారుగట్టి. నలువ కేఁజీలు నలు వలం • కులకుఁ బాఱె

కవిరాజ॥ చెఱువుల నీరము సాధుతపస్వుల • చిత్తములంబలె నిర్మలమై
పరఁగెను తూలముపై నిడుమా యని • పల్కెడు మాత్రనఁ బొక్కులు వి
ప్పరముగ లేచెడు లే యడుగుల్ గల • పాయపుఁ జెల్వల కాటుకరం
గారసెడు కన్నుల కైవడి నందలి • యుల్పలు మిక్కిలి మిట్టిపడెన్

చ॥ ముదిరిన పంకజంబు లొక • మూలకు వ్రాలి చిరాకు నొందియు
ప్పిదము తొలంగు కామినుల • పేద మొగంబులఁ బోలియుండె న
ల్లఁదనము నొందుపూవుల జె • లంగి వెలింగెడి నీరుపిప్పలుల్
చిదియఁగ బీల్పఁగా వెలము • చెల్వల యోష్ఠము పోలె రాజిలెన్

సీ॥ పిన్నబాలకు లొజ్జ • సన్నిధి నాతని, బెత్తంబునకు లొఁగి • భీతితోడఁ
బలువిధంబులు గల • పారముల్ గొంతెత్తి, యఱుము నుఁడెడి • తెలుఁగుదోఁప
వర్షర్తువునయందు • పరిసరి తెరువుల, బెకబెక లాడెడు • భేకనికర
మా శరత్సమయాన • నంతటఁ దమతమ, కలకలంబులు మాని • పలుకకుండె

తే॥ తమ వచోనైపుణికి గౌర • వమును ఫలము,గొఱలకుండు సదస్సుల • గ్రుక్కమిక్క
మనక మౌనమేన భూషణ • మనుచునుండు, చతురులగు బుద్ధిమంతుల • చందమునర

తే॥ వాన వెలిసిన యంతట • బర్హములను. ముడుచుకొని విసుగున దుఃఖ • మును భజించి
నెమలి గుంపు లెల్లడ ధర • జీకుమారి, చందమునఁ జింతతోఁగూడి • కుందుచుండె

చ॥ జలనిధి వీచికా కరము • చాఁచి జలంబను వల్వ నీడ్చి ప
త్నులఁ గవఁ గూడ లాగికొను • తోయమునం గనుపట్టె; వాహినుల్
పొలుపుగ భర్తతోఁ గలిసి • పూర్ణసుఖంబులఁ దేలి మోదముం
దెలుపఁగ నవ్వెనో యనఁగఁ • దేలెను ఫుత్తెము లంతటంతటన్.

చ॥ ఎడయిక చేఁ బడంతుక ల • హీన మనోహర వర్ణమొందు న
వ్వడువున సద్విధుల్ విసెడు • భక్తులపోలికఁ బోఁకమ్రాఁకులం
డడరి రహించునట్టి గెల • లద్భుత రీతిగఁ బైఁడి వన్నియం
బడసెఁ గ్రమంబుగా జనుల • భావన హెచ్చగుకైవడిన్ వడిన్.

తే॥ చాలకాలంబు నీటనే • గ్రాలుచుంటఁ, జలికి నోర్వక లేయెండ • చిలుకునట్లు
తటములం జేరి సుఖముగాఁ , దనిసి కూర్కె, నక్ర సంఘంబు లంచందు • వక్రగతుల

తే॥ కొసరి మాటాడు చిలుకల • కొమరు గలిగి, సొలయు తేంట్లను నలకల • సొంపుగలిగి
లలిరుటాకుల చేలమం • దంబు గలిగి, తను లతాంగుల కైవడిఁ • దనరె లతలు

తే॥ తమవలన నువ్వవించు ము • త్యములు స్త్రీల, పలువరుసతోడ సామ్యంబు • పడయుకునికి
వారి మోములఁ గన నాన • వాటి యడుగు, లోన మునిఁగె నాళుక్తులు • కానరావు.

తే॥ పద్మలతలు వర్షిల్లనా • పత్త్రిములను, మఱుఁగుగూని లోభులంబోలె • మఱుఁగువడఁగ
ద్వారముల మూసికొని లోనఁ • జేరుకొనియెఁ, గర్కటములు కర్కటులతోఁ • గలసిమెలసి

## 8. కిష్కింధాపటలము. (139)

ఉ॥ వెన్నెలకాలముం జనఁగ • వీరుఁడు రాముఁడు తమ్ము లక్ష్మణున్
గ్రన్ననఁ జూచుచున్ గడువు • కాలము మీఱియు నింత నిద్రమై
నన్ను దలంపఁ డియ్యెడకు • నర్మిలిరాఁడు కపీంద్రుఁ డేమి యీ
మన్ననః యేమిగాఁ దలఁచె • మానసమందు మదించిః తమ్ముఁడాః

ఉ॥ పొందఁ గడిందియైన కపి • భూస్థలి నీ పగిదిన్ సుఖంబుగాఁ
బొందియు గౌరవంబు దల • పోయఁడు శీలము జార్చె ధర్మమున్
డెందమునన్ గణింపఁడు ప • టిష్ఠతఁ జేసిన మేలు నెంచ కి
ట్లొందిన నొందుఁగాక కని • యున్ మన విక్రమ మింత యెంచఁడోః.

ఉ॥ రాజ్యసుఖంబులన్ మఱఁగి • రాఁడు కృతఘ్నుఁడు సౌహృదంబు న-
ప్రాజ్యముగాఁ దలంచె జన • పాళికి ధర్మము సత్యమెల్లెడన్
భాజ్యముగాఁగనుండ నది • పాసిన పాపిని ధాత్రిఁ గూల్చుటల్
ద్వ్యాజ్యముగాదు వానిహృద • య స్థిర నిశ్చయమున్ గ్రహింపుమా.

శా॥ ఉగ్రక్రూరుల సంహరించి దర ధ • ర్మోద్ధారణం బల్పఁ బ్రి
త్యగ్రస్ఫుత విశాత సాయక నికా • యం బుండె; దుర్వారుఁడై
వ్యగ్రుండై మనచెంతనే-కలఁడు ప్రే • తాధీశ్వరుం డింకనో
సుగ్రీవాః మిముచంపుశక్తి కలదం • చుం బల్కుమా ధీరతన్.

తే॥ విసముఁబోలు క్రూరులఁ జంప • దోసఁగుగాదు, పుట్టుకన్ వచ్చిపుడుకలఁ • బోవుననుట
యెదులోలేని దేఁబది • యందురాద, యనఁగ నున్న సుగ్రీవున • కానఁ బలుకు.

శా॥ మీ కిష్కింధయు మీప్రజా సుఖములున్ • మీపాలనా పద్ధతుల్
మీ కల్యాణులు మీరు బంధువులతో • మేలొందఁగా నెంచుచో
నే కైలాటము లేక రండు కృత మూ • హింపుండు రారేని నా
యీకోదండ విముక్తఘోర శర వ • హ్నిధ్వంబులై చావుఁడీ.

మ॥ మనకంటెన్ బలవంతులైన విభులన్ • మాటాకుగాఁ గాంచ నె
వ్విన ముల్లోకములన్ బలాఢ్యులెచటః • నీకన్న లేరన్న వ
క్కణయుః వారికి నాటునట్లు దెల్పఁగం • గాఁ గోరెడన్ వైశమే
చని యాపీరుల యూహ మెట్టిదియొ లె • స్సంగాంచి చర్చింపుమా.

చ॥ మఱియొకమాట తొట్టతొలి • మన్నన నీతులు సెప్పి యవ్విధుల్
తెలిపిని గూర్పకున్న వడిఁ • ద్రెక్కొనఁ జూడకు వారి భావముల్

నెఱవుగ నాకుఁ దెల్పుమని • నీరజనేత్రుఁడు కీర్తి భూషణుం
డుఱవుగ నాడి తమ్ముని స • మున్నత పద్ధతి వీడుకొల్పఁగన్.

ఉ॥ బొదలఁబూని యన్నపలు • కాదట మ్రొక్కి యతఁడు వేదనా
సాదిత వేగుఁడై తన వి • శాల భుజంబున విల్లునక్షయ
శ్రీద నిషంగముం జెలఁగఁ • జిత్తమునం దన యన్న పాదముల్
మోదిల నుంచి తాఁ బయన • ముం బొనరించె మహోగ్ర శీఘ్రుఁడై

శా॥ రామాజ్ఞంగొని లక్ష్మణుండు సుకుమా • రశ్రేష్ఠుఁడేయయ్యు దు
ర్భీమ ప్రోద్ధత వేగుఁడై మునుపు సు • గ్రీవుండు కొంపోవు నీ
మామార్గంబును వీడి యెట్టయెదురో • మ్రాఁకుల్ ధరిత్రీధర
స్తోమంబుల్ పొడిగాఁగ ద్రొక్కొనొక క్రొం • ద్రోవన్ విసృష్టించుచున్.

తే॥ అంఘ్రిఘట్టనచే మేరు • వంత లోఁతు, పర్వతంబులు భూమియుఁ • బల్లవడియె
నిలను ధరియించు దర్వీక • రేంద్రుఁ డపుడు, కన్నులకుఁ బరీక్షింపంగఁ • గానఁబడఁగ.

తే॥ అమితవిక్రముఁడగువాలి • యనుజుఁగూర్చి, యరుగు మనుకులతిలకుని • యనుఁగుఁ దమ్మ
వేగ మరయ నొప్పెను సాల • భేదనంబు, సేయఁబోయిన శ్రీరాము • సాయకమన

మ॥ ఒకదిజ్నాగము శాబకమ్ముదనఁగా • నూర్పుచ్చుటం గాంచి వే
ఱొక దిజ్నాగము తోడితే నరయ వే • గోద్యుక్తమై యేగు తోఁ
పికతో లక్ష్మణుఁ దేగుచుండెఁ గృతమున్ • వేజార్చు సుగ్రీవు చి
ట్టకమున్ రామునిమీఁది భక్తియును నె • ట్టం దన్ను బిట్టార్పఁగన్.

తే॥ పూర్వగిరినుండి పశ్చిమ • భూధ్రమునకుఁ, బరము నాజ్ఞచేఁ జను భాను • భంగినార్య
నాజ్ఞ సౌమిత్రి ఋశ్యమూ • కాద్రి నుండి, కీశవరుఁ డుండు కిష్కింధ • గిరికి నేగె

తే॥ రామునుండివెల్వడు బాణ • రాజ మనఁగ, వడిగఋశ్య మూకమునుండి • ప్లవగ గిరికి
నేగులక్ష్మణుఁడొప్పె మృ • గేంద్ర మొండు, కొండ కొండకు లంఘించు • కొమరు దోఁప

తే॥ ఇట్లు కోపంబుతో వచ్చు • నినకులేశుఁ, గాంచి ప్లవగులు కాలుని • గన్న పగిది
గడగడ వడంకి యంగదుఁ • గాంచి రాము, తమ్ముఁ డరుదెంచె నుగ్ర • విధాననుడు

ఉ॥ పౌరుషవంతుఁడైన రఘు • వర్యుని తమ్ముని రాకఁకుం గతం
బారయ డాసి డాయక ము • ఖాబ్జ విలక్షణ మూహ సేసి ప్రా
గ్భార లఘుప్రకారుఁడయి • పాఱి పితృవ్య గృహంబు చొచ్చి యం
దార వినూత్న భోగముల • నందు కపీశ్వరుఁ గాంచె గ్రక్కునన్.

మ॥ నల నిర్మాణ వినూత్న భాస్వదురు ర • త్నస్ఫీత విద్యు త్ప్రభా
స్ఖలన భ్రాంత నుసురాక్షతారగు నా • సౌధాగ్ర భాగంబునన్

గలిత ప్రస్తరమందు తొయ్యలులు రా • కాచంద్రబింబాననల్
లలిఁ బాదంబుల నొత్త నిద్రగొను హే • లాలోల సౌన్మత్తునిన్

శా॥ సుజ్ఞానాఢ్యులు రామలక్ష్మణులు సం • శుద్ధాత్మ లీయంగఁ దా
నాజ్ఞాచక్రముతోడ నాసవము నిం • పారంగ సేవించుటన్
బ్రాజ్ఞత్వంబు దొలంగువాని విలస • ద్భవ్య ప్రభారాశి స
ర్వజ్ఞ గ్రావము మేరు భూధర గుహన్ • బన్నుండెనా నొప్పుచున్.

మ॥ లలితామోదక పాటలీ వకుళ క • ల్హారాబ్జ సంఘంబులన్
విలసచ్చందన చర్చలన్ గచభరా • విర్భూత గంధంబులన్
లలనాచ్ఛాంగ విశేష వాసనలఁదా • లంకించి యామోదియై
నలుదొందం దిరుగాడు గంధవహు నా • నందించు విద్రాలసున్.

మ॥ మధురాలాపలు విద్రుమాధరలు భా • మారత్నముల్ పేయు న
మ్మధురాలాపములన్ ఫలోష్ఠ సుధలన్ • మందస్మిత జ్యోత్స్నలన్
మధువుం ద్రావి వికారచేష్టలను కా • మంబున్ మదంబున మనో
మథనంబున్ గురునిద్ర విస్మృతి యస • న్మాంద్యంబు గొన్నాతనిన్.

ఉ॥ కుండల హార సన్మకుట • కూట మరీచులు తెల్లమేనిపై
నిండుటచే దినేశ్వర వి • నిర్మల దీధితి పుంజముల్ మహో
ద్దండతఁ బర్వ రాజిలు ను • దార మహీధర చక్రవర్తి నా
నుండెడువాని నిదగొని • యుండెడువానిఁ బ్లవంగ వల్లభున్.

తే॥ కాంచి తారాసుతుఁడు సమీ • పించి కేలు. దోయి శిరమునఁ గీలించి • తొడరి మేలు
కొలుప యోచించి హితవాక్య • ములు శ్రవములఁ, బడఁగ గంభీరరవమునఁ • బలికెనిట్లు

మ॥ ఉరుకోపంబు మొగంబునం దెలియ న • త్యుగ్రాక్షుఁడై లక్ష్మణుం
డరుదెంచెన్ రభసాతిరేకమున ద్రి • హ్మాండంబె యూటాడఁగాఁ
జరుపందగది యేది? నీదగు నభీ • ష్టంబిప్డు తెల్లంబుగా
నరయం గోరుచునున్నవారు కపు ల • త్యంతంబు విభ్రాంతులై

మ॥ కట లేకొప్పెడు రాజ్యసంపద బలా • త్కారంబుగా లోఁపఁగాఁ
గొఱలేకుండ సురాసవంబులు మతిం • గుంచింపఁగా దేహమున్
మఱచెన్ మాటయు స్నేహమున్ మఱచె నే, మంబొప్పఁ దారాసుతుం
డుటిదిం దెల్పిన వాక్యముల్ వినఁగలే • కుండెన్ గపీంద్రుం డటన్. —

మ॥ కలభంబున్ • హరిపోతముం జెనయు నా • కస్వామి పౌత్రుండు గాఁ
గల కార్యంబిట నెంత మొట్టు యిదినం • గాదంచుఁ దత్త్వజ్ఞుఁడున్

లలితాచ్ఛ ప్రతిభాధ్యుఁడుం గపికులా • లంకారుఁడౌ మారుతిం
గలియంగా నగునంచుఁ గ్రమ్మఱిలె వే • గస్ఫూర్తి శోభిల్లఁగన్.

ఆ॥ హనుమతోడఁ గలిసి • యతనిఁబోలిన కపి, వరుడఁ గలిసి మరలి • బయలుదేఱి
తల్లి తార యున్న • తత భర్మగేహంబు, చొచ్చె నామెవలనఁ • జొప్పునరయ.

తే॥ చేరి జరిగిన వృత్తాంత • మారఁ దెలిపి, భావి కర్తవ్యమేమని • ప్రశ్న సేయఁ
దెలుగుసేసి తప్పికొనఁగఁ • గడఁగినారు, తప్పి బ్రతుకుట గలదె కృ • తఘ్నులకును.

ఉ॥ సేనలఁ గూర్చుకొంచుఁ దను • చేరఁగ రండని మీకు జానకీ
జాని వచించు నాగడువు • జార్చిన నాయువు జాఱు నంచు ము
న్నే నయమారఁ దెల్పితి బి • ఱుం దగినట్టులె విస్మరించుచున్
గాని పథంబుఁ ద్రొక్కితిరి • కాఁగల దేమిఁకఁ గీడు తక్కఁగన్.

ఉ॥ వాలి కడింది యాయువు న • వారణరీతి జముండు తైకొనన్
గోల నొకండు తాఁబఱపి • కోరిన రాజ్య విభూతి నిచ్చు నా
శీలగుణుండు రాఘవుఁడు • పేక్ష యొనర్పఁగఁ దగ్గవాఁడచేః
మేలును విస్మరించుటలు • మీకె తగుం బలు మాట లేటికిన్?

చ॥ తన సహధర్మచారిణి ను • దారుఁడు రాముఁడు పాసి కానలన్
ఘనతర చింతఁగుంది తన కాయముపై విసుగొందుచుండ మీ
రనువుగ భార్యలం గలిసి • యాదట వోవని భోగసంపదల్
గొని పరిమత్తతన్ వికృత • మూర్ఖ మనస్కుల రైతి రేమనన్.

ఉ॥ తప్పితి రాడి మిక్కిలి కృ • తఘ్నులరైతిరి పాప పుంజముల్
గుప్పునఁ జుట్టె బుద్ధులను • కూడని త్రోవలఁ బట్టెఁ జేయఁగా
నిప్పు డొకండు గల్గునె? మ • హీంద్రుఁతో నని సేయ నెంచుచోఁ
దప్పక చచ్చువారలని • తార కటూక్తుల మందలింపఁగన్.

ఉ॥ కోఁతులు పాఱి గుంపుగొని • కోట కవాటము మూసి ప్రస్తర
వ్రాతము వృక్షజాలముఁ గ • వాట బలంబుగఁ బేర్చి మించి తా
నీతలి కేగుదెంచిన స • హింపక మర్దనసేయ వృక్ష సం
జాతము గుండ్లు గుట్టలు న • సంబునఁ దాలిచి పొంచి నిల్వఁగన్.

ఉ॥ వానరు లాకవాటమును • బంధనసేయుటగాంచి లక్ష్మణుం
డీనియతుల్ స్వరక్షణ వ • హించుటకా? యని కోప సంచల
న్మానసుఁడై యలంతిగను • నవ్వి యలక్ష్యము చేసి లక్ష్మికిం
దానకమైన పూత పద • తామరసంబునఁ ద్రోవఁ దాఁపఁగన్.

ఉ॥ అంతటఁ గోట వాకిలియు • నానికఁ బేర్చిన ఱాలు అప్పలున్
వంతనయైన గోడలును • చయ్యన గూలెఁ బ్లవంగరాజి దా
వంతపడంగ లక్ష్మణుని • పావన పాదము సోఁకి ఘోర దు
ర్దాంత పురాఘ పుంజములు • తాఱి సమూలము గూలు కైవడిన్.

చ॥ బలమగు కోట వాకిలియుఁ • బ్రస్తర కుడ్యము లయ్యలంగముల్
సులభముగా రుటంబు చెడి • క్షోభముఁ గూర్చుచు దిక్కుదిక్కులన్
మలయఁగఁ గాంచి వానర స • మాజము భీతిని తల్లడిల్లుచున్
దొలఁగి చనెన్ సరాలు మని • దూరముగాఁ దమ జీవరక్షకై

చ॥ మెఱుపును మబ్బు లేక తల • మీఱిన ప్రోదినివోలె లక్ష్మణ
స్ఫురదురు పాదతాడనము • సోఁక నలంగిన కోటగోడ లా
త్తోరవుగఁ గూలఁ గ్రిందఁగల • యోధుల బొమ్మలు మస్తకంబులన్
బరిపరియై యడంగఁ గని • పాఱిరి తక్కినవారు భీతిమై.

చ॥ తెలుపఁ గడింది యైన పెను • దెప్పరమందిన వానరావళుల్
కలఁగి కకావికం బఱచి • కాఱియఁ గేకలు వెట్టఁ బట్నమున్
జెలువుగ మందరాచలక్షప • చిక్కిన యత్తఱి నార్పటించుచున్
జలచరరాశితోఁ గలఁగు • సాగరముం బలె బిట్టు ఘూర్ణిలెన్.

ఉ॥ ఈగతివానరుల్ కలఁగి • యిచ్చ తెఱంగునఁ బాఱి తత్పురిన్
వీఁగి సమీప పర్వత వ. నీ కుహరాంతర భూములన్ వడిన్
డాఁగఁ బురంబు దట్టముగ • దంబుగఁ బంబిన భంబు బృందమున్
వీఁగు నభంబు నా సొగసు • వీఁగి బిసోఁరన నుండె నత్తఱిన్.

ఉ॥ అంతట రాము నానతియె • యాకృతి గొన్న విధాన నూర్మిళా
కాంతుఁడు రాజవీథిని ది • గాలునఁ జొచ్చుట చూచి తారతో
మంతన మాడుచున్న కపి • మంత్రులదే యదె వచ్చె వచ్చె వీ
థ్యంతరముం భజించె నిఁక • నయ్యెడి దేమని కేక వెట్టగన్.

ఉ॥ అయ్యెడ నంజనీతనయుఁ • డంగద మాతను గాంచి తల్లి! యా
యయ్య మనంబు సూనమున • కన్నను కోమలమౌను గాన వెన్
దియ్యక నీవ యేగి యరు • దెంచెడు వాకిట నడగింపుమా
యియ్యెడ చేయఁదగ్గ పని • యివ్వలికిం గనువిచ్చి చూడఁడున్.

చ॥ అనవుడుఁ దార యిట్టులను • నంతటి భీతి యదేల? యేనె యా
తనిఁ గని మాటలాడి బెడి • దంబగు కోప మడంగఁ జేసెదన్

జనుఁడన వార్థ దవ్వులకు • జబ్బున నేగిరి పుష్పవేణులౌ
వనితలు చుట్టిరా నరిగె • వారక తార యుదార ధీరతన్

చ॥ మదగజ సన్నిభుండయిన • మాన్యుఁడు లక్ష్మణుఁడంతఁ గిశ రా
ట్పదవిని చొచ్చి యింతిపురి • బంగరు వాకిలిఁ జేరఁ బోవ ష
ట్పదముల లాగు నైజమగు • బంధుర వాసన గల్గు పెన్నెఱుల్
పొదలు వరాంగనా మణి ప్ర • ఫుల్ల జలెజ దళాక్షి తారయున్

ఉ॥ కొంచిన వారి దిట్టముగఁ • గట్టఁగఁ జాలిన దేహకాంతియుం
బ్రాంచిత చంద్రికా విభ ద • రస్మితమున్ మణి కల్గు లేదనం
గాంచిన కౌను లేఁగొమరు • గన్న చనుల్ గరువంపు నెన్నడల్
మించిన కన్యకల్ బలసి • మేవడి రాఁ జనె వాలి దారయున్

సీ॥ మేనఁదాల్చిన మేటి మిసిమిపాతెడు నగల్, విల్లు నమ్ముల వలె వెలుఁగుచుండ
కాలి యందియలును • కౌను మేఖలలును జేజే నినాదముల్ • సేయుచుండ
పలువలు తెలుఁగుల • వంగిన ముంగురు, లరిది బెత్కెంబుల • ట్లందగింప
గజ్జెల రవములు • ఘన భేరి మ్రోఁతగఁ, చిఱుఁదులు మెఱవడి • యరదములుగ

తే॥ బొమలు విండ్లుగఁగన్నుల • మ్ములుగనమరి యౌవతంబను సైన్యమ • య్యనఘునలమఁ,
గినుక వదలి మోమును వంచు • కౌనుబెకాక వారిఁదేఱిచూడఁగనర • వాయిగొనితా

చ॥ మొగమును వాంచి కార్ముకము • భూస్థలి నూని సుమిత్రసూతి యా
తగవున నత్తగార్ల పెను • దండున నిల్చెనె కొ్రొత్త యల్లుఁడన్
పగిదిని కొంకునొంది నిలు • వం బరిశుద్ధ మహాత్మ తార కో
డిగములు లేని సిగ్గును గ • డించుచు లక్ష్మణుఁ గాంచి యిట్లనున్

ఉ॥ వీరకుమార! నిష్ఠమెయి • వేయి సమల్ తప మాచరించినన్
మీరలు మమ్ముబోఁటి గృహ • మేధుల యిండ్లకు వత్తురేమి? మీ
శ్రీరమణీయ పాద సర • సీరుహముల్ వహియించి మాగృహం
బారఁ బవిత్రమయ్యెఁ బుసు • షార్థము లెల్ల లభించె మాకిటన్

ఉ॥ సీమహితో గ్రమూర్తిఁ గని • నిర్భీక కోఁతులు భీతిచేత ది
క్కాఁ మొగమయ్యె నీకరఁక • కారణ మారయలేము తెల్పవే
రామపదాంబుజంబు లమ • రక్తి సతంబు భజించు నీవ యా
స్వామిని యొంటిమై విడిచి • వచ్చితివేల? కుమారసత్తమా!

శా॥ సంగీతంబునకంటె నింపయిన వా • చాస్ఫూర్తిచేఁ దార స
ర్వాంగీణ ప్రశమంబు గూర్చు పగిదిన్ • వాచింప సౌమిత్రి సా

రంగాంకుండు దినంబునన్ వికలుఁడౌ • రాజన్ వెలుంగారు తా
రంగాంచంగ వెసన్ సుమిత్ర మడికిన్ • రా నొందెఁ బెంద్రుఃఖముగా

ఉ॥ మంగళసూత్రమూడ్చి కుసు • మంబులఁ దాల్పక రత్నభూషిత
స్వంగము వెల్తినొందఁ గల • పంబు లలందుట మాని యున్న తా
రాంగన వాలకంబు గని • యత్తఱిఁ దల్లుల యిట్టి దుస్థితుల్
చంగునఁ జిత్తముం దగుల • జాలిని కన్నుల వింటె నశ్రువుల్

చ॥ ఇటువలెఁ దల్లు లిద్దఱును • హీనదశన్ భజియించియుందుర
క్కటః యని జాలిఁదూలి కలఁ • కం గొని యేమియుఁ దోఁచకుండి సం
కటపడి ప్రశ్న సేయ నోడి • కంబున నుత్తర మీయకుంట యొ
క్కటఁ దగుధర్మ సంగతము • గాదని తారను గాంచి యిట్లనున్

చ॥ రవిజుఁడు మున్ను తాను దన • రాణువతో ధరణీతనూజ నీ
భువి సకలంబు రోసి సతి • పోఁబడి తెల్పెద నంచుఁజెప్పి తా
నవలను రాని కారణము • నారసి రమ్మని పంపు జానకీ
ధవుని యనుజ్ఞ వచ్చితిని • దాని విజస్థితి దెల్పుమా యనన్

## తార లక్ష్మణుని సమాధానపఱచుట

ఉ॥ పిన్నలు తప్పొనర్చు తఱిఁ • బెద్దలు సైరణ సేయుటొప్పు మీ
కన్నను మిన్నలేరు కని • కావః దినేంద్రసుతుండు దూతలం
బన్నుగ వేలువేలుగను • పంపె భువింగల యెల్ల సేనలన్
గ్రన్ననఁ దేర వారలకుఁ • గాచెను గాక కడంక మానెనెః

ఉ॥ కోఁతుల గుంపుఁ దెచ్చుటకుఁ • గోట్లకొలందిగ దూతలేగి రా
దూతలు రాఁగఁలట్టి తఱి • దూరములేదు భవత్పదాంబుజ
ధ్యాతలఁ గాచు కార్యమునఁ • దల్లిని పోలిన మీరు పూర్ణ వి
ఖ్యాత యశుల్ సహింపఁదగు • నట్లు సహించుటె గొప్ప ధర్మమౌ

ఉ॥ తప్పులు సేయకుండు నెడ • దండన కర్తులు గల్గ రీభువిన్
దప్పులు లేనివారి యెదఁ • దన్పుటకంటెను తప్పు సైఁచుటల్
గొప్ప యటంచ్రు మిత్రులకుఁ • గోరినవెల్ల నొసంగి వానిచేఁ
దప్పొక యించుకైనఁ దమ • తప్పెగదా యని సైఁపఁగాఁదగున్

ఉ॥ సత్యమనుస్కులై యరిని • చంపి సుఖాస్పదమైన రాజ్యమున్
నిత్యముగా నొసంగితిరి • నీరజనేత్రకు మీరుపోరుచోఁ
బ్రత్యయ మొప్ప మీకునయి • ప్రాణము లీయరయేని యట్టి సాం
గత్యము నేతిబీరయగుఁ • గాక విజాఖ్యగు సౌహృదంబె కః

ఉ॥ ఇమ్మగుమేలు మీవలన • నిచ్చ గడించినవాఁడె మిమ్ముల
క్ష్య మ్మొనరించు నేని యధ • మాధముఁడై చెడు నంతెకాక లో
కమ్మున నెద్దడిం గుడిచి • కష్టము లొంది పరమ్మునందు ని
త్యమ్మగు సౌఖ్యసంపదలఁ • దన్నికొనుం దనకాలఁ దానుగన్.

ఉ॥ మేటి కపీంద్రుఁ, గూర్చినది • మీకర మొక్కఁడె కాదె? నేఁడు దై
త్యాటవులం దహింపఁగ స • హాయుఁడొకం డదియేల మీకు? మీ
బోటిని దాఁచియున్న నెల •, వుం దెలుపంగలరే యవశ్య మీ
పాటియొనర్ప నర్హులుభ • వత్పరిచారకు లివ్వనాటకుల్.

మ॥ అని యింద్రాత్మజుదార తార యను వా • క్యశ్రేణి నాలించుచో
ననుకంపామతి లక్ష్మణుం డపుడు ప్రీ • తాయత్త చిత్తుండుగాఁ
గనలున్ మానెనకాఁ దలంచి ప్రతిభా • గణ్యుండు సామీరి క్ర
న్నన నేతెంచి సుమిత్రసూతి పద కం • జాతంబులన్ వ్రాలఁగన్

ఉ॥ కోపముగల్గినం గృపను • గూర్చెదు లక్ష్మణుఁ డాంజనేయు సం
తాపముగాంచి యూఱడిలి • తత్త్వగుణాంచిత నీవు సైతమున్
బ్రాపు నొసంగు మమ్ము మఱ • వందగునే? యన వాక్యకోవిదుం
డౌ పవనాత్మజుండు విను • మా యని తెల్పఁదొడంగె నివ్విధిన్.

ఉ॥ ఓపినపెద్దలన్ జనకు • నొజ్జను తల్లిని స్త్రీల గోవులన్
బాపలఁ జంపువారి ఘన • పాపచయంబును పాచితంబుచేఁ
బాపఁగవచ్చుఁ గాని యొక • పట్టున మేలును విస్మరించు నా
పాపుల పాపముల్ తొలఁగఁ • బాచిక మొందు ధరిత్రిఁ గల్గునే?

ఉ॥ మీకుఁ బ్లవంగరాజునకు • మేలగు మైత్రి సతంబుగాఁగ నే
నేకద నాఁడు కూరిచితి • నిప్పుడు నెయ్యము శీర్ణమైనచో
నేకదఁ దప్పి యేఁగఁగల • మేనును వానరనాథుఁ డంతియే
కాక భవత్సుహృత్త్వమునఁ • గల్మష మందుట కాదె ఘా మతుల్?

మ॥ తొలి జన్మంబున నీభవంబునను సం • తోషంబునం జేయు ప్రా
జ్ఞులసేవల్ వ్రత దాన ధర్మములు సం • శోభిల్ల మీరూపమై
చెలఁగెం గాకని నమ్మియుందుఁ ద్రిజగ • త్సేవ్యుల్ కృపంజూడుఁడీ
తలి దండించిన బిడ్డ తల్లి పద ప • ద్మంబుల్ వడిం జుట్టదే?

మ॥ కపిరాజేంద్రుఁడు మిమ్ము గూర్చి మఱపం • గాలేదు జంఘాలురన్
గపి సంఘంబులఁ దేరఁగాఁ బనిచి రా • కం జూచుచున్నాఁడు త

తన్నుపులేతేరఁగఁ దామసంబు గలిగెం • గాకవ్యము ల్గలునే?
కపియైనం దగపుం ద్యజింప నరకా • క్రాంతుండు గాకుండునే?

చ॥ తనకడ మేలువొందని యు • దారుఁడు మేలొనరింప వానికై
తన కొదవంగనొత టిని • తప్పక యాతని శత్రువర్గమున్
జెనసి యెదిర్చి గెల్చుటయు • చేడ్పడి కయ్యమునందు చచ్చుటో
తన గడియింపఁగాఁ దగిన • ధర్మము వేతొకచేఁత యుక్తమే?

ఉ॥ నీవిఁక నిందు నిల్చుటయు • నీతిపథంబును గాదు శత్రులీ
త్రోవ యెఱింగిరేని మన • తోయము ద్రెంపఁగఁ బూనకుందురే?
నీవ యనుగ్రహించిన వ • నేచర రాజ్యరమఁ సహోదరున్.
లోవరి కేగుదెంచి యప • లోక మొనర్తువు గాక రమ్మనన్.

చ॥ హనుమని మాటలన్ వినిన • యార్యుఁడు కోపము వీడి రాముచేఁ
దనియ లభించు భోగములఁ • దత్పరతన్ భజియించి మత్తుఁడై
మనమున మిత్రకార్యమును • మానిన యాతఁడు కాఁడు కావునన్
వనచరరాజు చూడఁదగు • వాఁడని చింతనసేసి యిట్లనున్.

పలుకంగలదే? పవనజ!, పలుకఁగ నగునేమి? యన్న • పరితాపంబున్
దిలకింపఁ గలిగెనేనియు, శిలయైనం గరఁగుఁ గడుపు • చెలువగుఁగాదే?

శా॥ క్రూరాత్ముండు ధరాత్మజం జెఱగొనం • గోపంబు మానాగ్నియున్
శ్రీరామున్ దహియించుటల్ గనిన నా • చిత్తంబు సోద్రేకమై
ఘోర క్రూరతఁ గొంది కొంది నలుకం • గోరుం జఘన్యావలిన్
గ్రూరత్వంబు నపాఖ్యయుంచె దలఁపఁజూ! కోపాతిరేకంబునన్

శా॥ నాకోపంబును నేనె యార్చుకొని ప్రా . ణంబుల్ బిగంబట్టి పి
తాకాంతున్ దగ నూఱడించుటకె నీ • తంబయ్యె నాకాలమా
మాకోపంబు లడంగకున్న జగముల్ • మాఁడున్ సురల్ నత్తు రం
తేకాకుండఁగ ధర్మమాఱు: విధిచె • య్యిం దాఁట శక్యంబొకో?

ఉ॥ వోలఁగ విన్ను చూచి రఘు • ముఖ్యుఁడు దెప్పరమందు వేళ నీ
మూలముగా శుభంబుఁగను • పొందగజేయున యంచు గీశభూ
పాలుని నన్నువోలెఁ గొని • ప్రాఁతిని చూచుచు నిన్నినాళ్ల ప్రా
ణాలను నిల్పఁగాక ఁన , నాతిని రోయఁగలేఁడె యమ్మలన్?

శా॥ ఆకాశంబుననేల? బ్రాజ౦ధి కై • లాంతర్గుహాసీమలఁ
లోకాలోకములం డవాండమున నా • లోకించి ఘాసుత్రి హా

ద్వైకల్యంబు దొలంచి తెచ్చుటకు భా • స్వద్వంశ్య కోదండమే
వీఁకంజాలదె? యైన మీపలుకు ని • ర్వీర్యంబు గానొప్పునే?

శా॥ ఈపాలారుపు కాలయాపనమెకా • దెన్నంగ దైత్యాళికిం
త్రోపుం గూర్చితి రాచి తేయుల హిత • మ్ముం దూల్చి పారాశరి
వ్యాపారంబులఁ గూల్చి పాపముల నొ • ప్పంగూర్చిలో నెన్నఁడుం
గోపంబూనని రామచంద్రు మదికిం • గ్రోధంబు గల్గింతురే?

మ॥ అని సౌమిత్రి వచింప వాయుసుతుఁడా • ర్యా! మించు కార్యమ్ములన్
మనమందుంపకుమయ్య మేము చలుపన్ • మైకొన్న కార్యంబు వీ
డినచోఁ బ్రాణమె వీడువార మిది పా • టింపంగ ధర్మంబె యొ
మ్మిన సాక్ష్యంబగు భానుసూనుఁ గనర • మ్మి! ప్రేమ దైవాఱఁగన్

ఉ॥ నావుడు లక్ష్మణుం డనిల • నందనుఁ గాంచి వచించు మారుతీ!
నీవనినట్లె పూర్వమును • నెక్కొనఁజేసితి మా ప్రయత్నమున్
దావకబోధనం బెపుడుఁ • దప్పము పోదము కిశరాణ్మనో
భావము గాంతమంచు • వడిఁ బావని వెంబడి నేగె లోనికిన్.

సీ॥ శరములవంటి వీ • క్షణములు చెంగలు, వలవంటి సౌరైన • వదనములును
వింటికోపులఁబోలి • వెలుగొందు బొమలు మ, యూరంబువంటి యొ • య్యారములును
అంచకై వడి మంథ • యానంబు ముత్తియ, ములవంటి యొప్పైన • పలు వరుసయుఁ
గోమల భుజములు • కోయిల కంఠముల్, బంగరు, గిండ్లన • బరఁగు చనులు

తే॥ చంచలా లత యనఁదగు • సన్న కౌను, అలరు సంపెగవంటి నా • సలును కారు
మొగులు నాఁదగు కచభార • ములును వెలయు, చెలులతోఁదార శుద్ధాంత • సీమకరిగె.

ఉ॥ అత్తఱి వాలిసూనుఁడు న • యంబున మంత్రులతోడ వచ్చి యా
సత్తము పాదపద్మములఁ • జాఁగిలి మ్రొక్కఁగ లక్ష్మణుండు వీ
రోత్తమ! నీవు మున్నరిగి • యోజను దెల్పుమ యన్న నాతఁడున్
జిత్తము భాగ్యమంచు వడిఁ • జేరఁగఁ బోయెను పిన్నతండిరిన్.

ఉ॥ అంగదుఁ డేగి యంతిపురి నర్కజు పాదములొత్తి నిద్దురన్
దొంగలపాలు సేసి వడి • దోర్బల యుక్తుఁడు లక్ష్మణుండు లో
నంగడ ముమ్మరింపఁ జల • మంబుధికంటెను దొడ్డగాఁగ నీ
ముంగలి వాకిట న్నిలిచె • మ్రొక్కెద వైశమ లేచి రమ్మనన్

ఉ॥ మత్తునఁ దెప్పిజిల్లని సు • మాళము నొందిన భానుజుండు పై
మత్త సుకాశిపిమఱు ల • మాంతముగా న్వినరించు కేకలన్

జిత్తముదేఱి రాఘవుల • సేగి దలంపమ యట్టులుండ రే
కెత్తిన కిన్కతోడ నతఁ డేమి కతంబున వచ్చెఁ దెల్పుమా

చ॥ అనెవుడు నంగదుం డనున • యమ్మన నిట్లనుఁ దొల్లి బాసచే
సిన గడువుం గతించె రఘు • శేఖరు సన్నిధి కేగలేదు మే
లును తలఁపంగలేదు సుఖ • లోలత సత్యము నెంచలేదు ల
క్ష్మణునకుఁ గిన్కపుట్టె హను • మంతుని సాంత్వము ప్రోచెనెల్లరన్

తే॥ లక్ష్మణుఁడు వచ్చు వేగబ • లంబు గాంచి కోట వాకిలి బిగియించి కోఁతిమూఁక
తాలు అప్పలు పేర్చి • రములఁ బూని నిలిచి యతని కోపాగ్ని ని • నిగుడఁజేయ.

తే॥ వారిచేష్టలఁ గని యల్గి • పాదమునఁ గ, వాటముందన్న నదియును • ప్రహరితోడఁ
జేర్చు తాలుఅప్పలతోడఁ • బిండిపిండి యగుచుఁగూలి చెదరిపోయె • నన్ని దెసల

తే॥ దానిఁ గాంచిన వానర • సేనగతి యేమియయ్యె నెవ్వటికేగి • యిఱుమకొనియెఁ
దెలుపనేటికి! మాతల్లి • తెలిసి చెలుల తోడ సౌమిత్రి వచ్చెడు • క్రోధనిలిచె

ఉ॥ దారికి నడ్డమైన వని • తాజనతా పరివీక్ష సేయఁగా
నేరక లోనఁ ద్రోచికొని నెట్టు చిరాకున మౌనమూనఁగాఁ
దార మృదూక్తి మావలనఁ • దప్పేది వర్తిలె? రామువీడి యీ
తీరున రాఁగతంబు గల • దే? యని నాతఁడు విన్నె సర్వమున్

ఉ॥ వచ్చినకార్యముం దెలుప • వారక తారయు సూర్యసూతి తా
నిచ్చట నూరకుండఁడు మ • హింగల వానరసేనఁ దేరఁగా
నచ్చిగ మాతలన్ దెసల • కంపెను వారల రాకవేచినాఁ
దొచ్చెము లేదటంచుఁ దన • యోపిన యంతకు మాన్చెఁ గోపమున్

చ॥ తగ విని సూర్యసూనుఁ డను • దాశరథుల్ కనయానిరేని యీ
జగముల కేరెదుర్కొనఁగఁ • జాలినవారలు? లక్ష్మణుండు కో
పగతిని తీవ్ర వేగమున • వచ్చుచునుండఁగ నాకుఁ జెప్పకీ
పగిది యొనర్చుటేల? యన • వాలితనూజుఁడు తండ్రి కిట్లనున్

ఉ॥ అతఁడు వచ్చుతీరరసి యప్పుడె తెల్పితిఁగాని నీవు నీ
చేతములోన లెవు మఱి చెపెడి దేమని వాయుసూతియే
యీతఱిఁ ద్రోవ దెల్పునని • యేగితి నిప్పుడు మీరు లక్ష్మణున్
బ్రీతిగఁ జూడనేగుటయె • భావ్యము చెప్పర లెండు నావుడున్

## సుగ్రీవుఁడు సురాపానమును దూషించుట.

ఉ॥ శ్రీవరుతోడ బాధమగు • వెల్మివహించు కపీంద్రుఁ డిట్లనున్
పావనమూర్తిచె మహిత • భాగ్యము నావలె బొందరెవ్వరున్

నావలనన్ సవంతల న • జంచుకొనం దలపోయుచో సుకం
ద్రావి సమస్తమున్ మఱచి • తప్పితి నాతవిఁజూడ సిగ్గగున్.

ఉ॥ కల్లును ద్రావు క్త్రీపొకఁడు • గాక మహాక్రూటిలేదు; దీనిచే
దల్లిఁ గళత్రముం దెలియ • తద్‌జ్ఞతయే నశియించు నన్నచోఁ
గొల్లగఁ గోటిధర్మములు • గూరిన నేమగు? మాయ పైకొనన్
దల్లడమంది దానిపయిఁ • దార్చితి హాఁను వెట్టిపోలికన్

శా॥ మాయాబద్ధులుగాక కర్మముల స • మ్మార్జించు నిష్ఠాత్ములే
మాయందాఁటి విముక్తి నొందుదురు; పై • మల్లాడు కీటంబులం
బాయంద్రోచి సురన్ భజించు జనముల్ • జ్వాలాకరాళాగ్నిలో
నేయిం బోయుచు నార్పఁగాఁ గడఁగు చి • న్నెం బొల్చువారే చుమీ?

మ॥ తను దాఁ గాంచిన జన్మదుఃఖములు ని • ర్గామంబులై తూలెడిన్
దను దాఁ గానక రోగదుఃఖముల స • ద్మంబైన దేహంబు నీ
మనుజుం డొందెడు నొందియొందు పిదపన్ • మైరేయ పానంబుచే
జనుఁ డందుందయి నూతిలోఁబడెడిఁ ద • త్సంగత్వముల్ కూడునే?

సీ॥ శరణాగతార్తిర • క్షణధురీణులు తత్త్వ, నిష్ఠాతులింద్రియ • నిగ్రహులను
సుఖదుఃఖసమచిత్త • శుద్ధిగలారు గా, కొరులను వంచించి • సురను ద్రావి
మత్తునఁ బడరాని • మల్లాటపడి దూఱు, గనువార లొందుస • ద్గతియుఁగలదె?
వంచన చౌర్య మ • బద్ధోక్తి యున్మాద, మజ్ఞాన మవలేప • మవినయంబు

తే॥ ప్రాక్తనాన్వయాచారగ • ర్హణము శరణు, చొచ్చువారిఁ జేపీడుట • చుట్టిచెఱచు;
విసము ద్రాగువారిని చంపి • విడుచుఁగాని, కల్లుపలె నెవ్వలను నర • కంబునీదు

ఉ॥ మిత్రమహోపకారము స • మిత్రులకూర్చు మహోపకారమున్
నేత్రముతోడఁ జూచినది • నేర్చిన విద్యయు వృద్ధవాక్యమున్
బాత్రతనిచ్చుమార్గమును • బన్నము వచ్చువిధంబు చక్క నీ
మాత్ర మెఱింగనేని జన • మాన్యత నొందుట యబ్బురంబొకో?

మ॥ మదిరాపాయికిఁ గీడెవచ్చునని స • మ్యంబక్కా సద్వాక్య మ
య్యది నాచే ననుభుక్తమయ్యె నిక వా • దాదన్ ఫలంబుండునే?
తుదకీయాపద మాడుదాత్మజునిచేఁ • ద్రోవంబడం దప్పి యీ
బ్రతుకుం గంటిని గాక లక్ష్మణుని కో • ప జ్వాలఁ నే • మాఁడనే?

మ॥ సుర సేవింపఁగఁ గల్గు దోషములు నన్ • గ్రుక్కించె నిక్కంబుగా
సుర చేఁదాఁకు టటుండఁ జింతనమె తె • చ్చుం బ్రాణగొడ్డంబిఁకన్

సురజిత్తంబున నెంతునేనియు • రఘు శ్రే ష్ఠు పాదాబ్జముల్
తొలఁగం ద్రోచి నలంచుఁగాక పయి నెం • దుంగాని చందంబునన్

మ॥ అని సుగ్రీవుఁడు తెల్విదెచ్చుకొని తా • నత్యంత మోదంబుతో
నినవంశీయుని స్వాగతంబుకయి యా • యత్తంబుచేయించుచున్
దనయాః మున్నుగ నేగుమంచుఁ బొలుపొం • దం బంపి చుట్టాలతో
వనితాజాతముతోడ వచ్చి భవన • ద్వారంబున న్నిల్వఁగన్.

సీ॥ అయ్యెడ శ్రీచంద • నాగురు మృగనాభి, కాదులు వికచ ల • తాంతదామ
ములును మంగళకుంభ • ములును దీపశ్రేణు, లును ముత్తెముల సరు • లును ధ్వజములు
పీలికుచ్చులు శంఖ • భేరీరవంబులు, వీధులయందెల్ల • వెలసినిండె
శుద్ధ స్ఫటిక శిలా సుందర కుడ్య భా, గములను నవరత్న • ఖచితములగు

తే॥ స్తంభములయందు లక్ష్మణ • స్వామి ప్రతిఫ, లింపఁజూచువారలకు భా • వింప శత స
హస్ర కార్ముక ధరులట • కలవి మీఱి, వచ్చి రను సందియము దోఁప • బ్రజ్వలించె.

ఉ॥ వాలిసుతుండు రాఁ గనిన • పార్థివపుత్రుఁడు వానరేంద్రుఁ డెం
దేలలి నున్నవాఁడనిన • నిద్ధపరాక్రమః తొల్లి బామునన్
జాలఁగఁ బున్నెముల్ సలుపు • సౌరి భవచ్ఛుభదాగమంబుకై
పోలఁగ వేచుచున్ మొగిలు • ముద్దిడు నా మొగసాల నుండెనాన్.

ఉ॥ మేలి కడానిసొమ్ములను • మించుగఁ దాల్చి రహించు వానర
స్త్రీలు కలాపముల్ విరులు • తీరుగఁ జల్లుచు వెల్లచామరాల్
లీలగ వైవఁగా విధుని • లీల వెలింగెడి యెల్లిసీడఁ గీ
శాలి భజింప భానుసుతుఁ • డాదట లక్ష్మణుఁ గాంచె నమ్రతన్.

సీ॥ బింబాధరలు రఘు • వీరుని సేవింప, నర్ఘ్యాదులను గొని • యరుగుదేర
భేరీ పటహ ఝల్ల • రీ రావములు మేఘ, నిస్వనంబులలీల • నెరవుకొనఁగ
సంగీతవాద్యముల్ • సకలదిక్కులనిండ, వేలుపుల్గని చాల • విభ్రమింప
యౌవతంబు నడుమ • నలరారు కపిరాజు, రిక్కలలోఁ జంద్రు • రీతి వెలుఁగు

తే॥ శ్రీయుతుఁడు సుందరుండు సు • గ్రీవుఁ డుదిత, భాను పగిది రాజిల్లుచు • భక్తి వినయ
సంభ్రమంబులు మునుకొని • సందడింప, నియతి రామావరజుని స • న్నిధిని నిలిచె

ఉ॥ వానరనాయకుం డెదుట • వైభవ లీలల నట్లు గన్పడన్
మానితమూర్తి లక్ష్మణుఁడు • మానసమం దుదయించు కోపమున్
మానుగ ధర్మసూక్ష్మమును • మన్ననసేయు మహాత్ముఁడౌటఁ దా
మానిచె నుత్తరక్షణమె; • మాన్యుల కిన్క నిమేషమేకదా?

క॥ ఇరువురు తమ భుజముల నొ, క్కొరు నొక్కరు కౌఁగిలించి • కొని గాటముగాఁ
దరుణులు కపులును తమతో, నరుదేరఁగ బసిఁడిమేడ • కరిగిరి బ్రాఁతిన్.

చ॥ ప్లవగకులాధిపుం డచట • వైచిన సింగపు గద్దెఁ జూపి మా
నవవర! కూరుచుండు మన నవ్వుచు నాతఁడు నాదువేల్పు రా
ఘవుఁడు వనంబునందు కడు • కర్కశ భూమి వసించుచుండ నే
నవిడిఁ బసిండి గద్దెపయి • భాసిలువాఁడను నీవ తెల్పుమా!

ఉ॥ కైకవరంబునన్ మణి వి • కాసి కిరీటము వీడి కానలన్
నాకనుదోయి మాఁడఁగ దృ • ఢ ప్రసరంబగు సెజ్జ రాఘవుం
డాకరణిన్ దపింప నక • టా! విరులొల్కిన పైఁడి గద్దెపై
నేకరణిన్ వసింతు నది • యించునె నామదికిన్ సుహృత్తమా!

తే॥ అనుచు సౌమిత్రి వచియింప • నర్కసుతుఁడు, కనుల జలజలమనియశ్రు • కణములురల
నేమియును పల్కలేఁడయ్యె • రామవిభుని, తమ్ముఁడును కదలక యట్లె • ధరణినిలిచె.

తే॥ బాలురును వృద్ధులును స్త్రీలు • బావురుమని, కొంద ఱేడ్చిర కొందఱు • కుందినారు
కొందఱేమియుఁ బలుకక • క్రుంగిలోన, నొగిలి సోలి మహర్షుల • పగిదినుండ్రి.

ఉ॥ అంతట వానరేంద్రుఁడు మ • హాత్ముని లక్ష్మణుఁగాంచి తండ్రి! యీ
చింత నడంచి స్నానవిధి • చేసి రసోచితమైన యోరె మొ
క్కింత భుజింప మేము కృత • కృత్యుల మౌదుము మా గృహంబు
మాంత పవిత్రతం జెనయు • నన్న నరేంద్రుని తమ్ముఁ డిట్లనున్.

ఉ॥ నిందయు దుఃఖమున్ గడుపు • నిండుగ నుండఁ గృశించి జీవముల్
కందఁగనున్న మాకు నెది • గారము నింపును గూర్చి? నాఁకటన్
గుందినయేని దుఃఖములు • గూరినవేళ సుధారసంబయే
నొందఁగ నింపితంబగునె? • యోచన సేయుము వానరేశ్వరా!

ఉ॥ తామరసాయతాక్షి సహ • ధర్మిణి యెచ్చటనుండెఁ జూపినన్
బ్రామిన యారటంబనెడి • పావకు నాఱిపి మమ్ము స్వర్నదిన్
బ్రేమను ముంచినాఁడవును • వీడక దుగ్ధపయోధిఁ బుట్టు దే
వామృత మిచ్చినాఁడవును • ప్రాణము లిచ్చిన వాఁడవుం జుమీ!

ఉ॥ ఆకులు దుంపలున్ ఫలము • లాయన మెక్కి మిగుల్చు వానినే
కైకొనువాఁడ వేఱొకటి • గ్రాహ్యముకా దటుమీఁటి కోరుచో
శ్రీకరమూర్తి కర్పణము • సేయమి శ్వానము ముట్టు నెంగిలే
నాకగు నిశ్చయంబుగను • నమ్ముము ముట్టను వానరేశ్వరా!

చ॥ మఱియొకమాట యేను క్షణ • మాత్రములోఁ జని కాయలాకులన్
ద్వరపడి తెచ్చి యిచ్చిన భ , వత్ప్రహృదుండు భుజించుఁ గావునన్
నెఱవడి సేగఁగావలయు • నీకును నిల్పుట-పాడిగాదు నె
య్యరి గొదఁదీర్ప నీకును స • మర్థమె కాదొకొ? వానరేశ్వరా!

చ॥ అన విని భానుసూతి జన • కాత్మజనాథుఁ దలంచి లక్ష్మణుం
గని మనువంశవర్ధనుఁడు కష్టము లొందఁగ సంతసంబుతో
మనుట యనం బ్లవంగులకు • మాత్రమె చెల్లునెయంచు నిశ్వసిం
చెను వడిలేచె భోగములఁ • జీఁదఱ నొందెను రాల్చె నశ్రువుల్.

తే॥ అలఁతవొంఁ మదితోడ నర్కసుతుఁడు, నీరజాక్షునికడకుఁ బో • నిశ్చయించి
భీత్యసుఖముఁ ల్లఁ బ • రిత్యజించి, నెనరు వహియించి మఱి యాంజ • నేయుఁగాంచి.

తే॥ విఖిల శాస్త్రార్థకోవిద! నీవు దూత, లేగుదెంచెడు సందాఁక • వింఁదెయుండి
రాణువలఁ గూర్చుకొని రమ్ము • రాముకడకు, ననుచు లక్ష్మణుతో వడి • నరుగుదేరె

ఉ॥ నిండుమనంబుతో నట వ • నేచరనాథుఁడు నిష్కలంకుఁడై
దండ ఘటించి యంగదుఁడు • దాపునరాఁ దనమూఁక ముందు చ
న్పుండఁగఁ గామినీజనుల • యుల్లములెల్లను వెంబడింపఁ గో
దండము కేలఁదాల్చిన యు • దారుని సన్నిధిఁ జేరఁగాఁ జనెన్.

ఉ॥ తొమ్మిదివేలకోట్ల కపి , తోయము వెన్కయు ముందు క్రేవ లం
దమ్ముగఁ జుట్టిరా హితులు • దగ్గఱి బంధులు దాసిరాఁగ ర
త్నమ్ముల సొమ్ము లెందలను • తన్పగు వెన్నెలలఁ దటిత్తులన్
జిమ్ముచునుండ భానుఁజుఁడు • చేరఁగఁబోవుచునుండె రాఘవున్.

ఆ॥ ధ్వజము లతిశయించె • వాద్యధ్వనులు చెల, రేఁగెఁ జిందములును • మ్రోఁగె నగల
జిగులు మెఱుఁగు గముల • పగిదిని నెగడారె. ధూళియెగసి మిన్ను • తొడరికప్పె.

తే॥ బంగరును వెండిము త్తెముల్ • స్ఫటికములును, మణులవలువలుకూర్చియ • మర్పఁబడిన
పల్లకులు దట్టమై కాన • వచ్చె నెల్ల, గొడుగులు మనోహరంబుగఁ • గూడివచ్చె.

తే॥ లక్ష్మణుని మృదుపదము లి • లాతలమున, నానుచుండుటచేనర్క • సూనుఁడంద
మైన వీరఘంటల మ్రోఁగ • నతనివెంట, భూరథమున శిబిక వెంటఁ బోవుచుండె.

ఉ॥ వీరగుణోత్తరుండు రణ • భీకరుఁ డార్యుఁడు లక్ష్మణుండు పం
కేరుహమిత్ర సూనుఁడును • క్రేవల వచ్చెడు మూఁక వెన్కకుం
మాఱఁగ రామదర్శన కు • తూహల మయ్యది ముందువోవఁగా
శ్రీరఘువీరసింహుఁడు వ , సించు గిరీంద్రముఁ, జేరి రయ్యెడన్

ఉ॥ అందఱచేతఁ గోరఁబడు • నట్టి మహోత్కట భోగభాగ్య రా
జ్యేందిర మీఁది భ్రాంతిఁ ద్యజి • యించి రమేశు పదద్వయంబు ని
ష్పంద మనంబుతోఁ గొలువ • వచ్చిన భక్తుఁడు భానుసూతి ము
న్నొంద భజింపవచ్చు సన • యుఙ్ భరతుం దలపించె నత్తఱిన్.

ఉ॥ ఎప్పుడుఁ దోడునీడవలె • నిమ్మగనుండెడు లక్ష్మణుండు త
న్నప్పుడు పాసిపోవ విల • యాంతమునన్ భువనంబు లాఱఁగాఁ
దప్పక యొంటినిల్చు పర • తత్త్వము కైవడి నున్న రాఘవుఙ్
జప్పునఁ గాంచి నేలఁబడి • సాఁగిలి మ్రొక్కెను భక్తి పెంపునన్.

శా॥ సుగ్రీవుండు సమస్కరింపఁ గని ర • క్షోవైరి ప్రేమంబుచే
వ్యగ్రుండై యురమందు లక్ష్మియును నో • ప్పన్ దీర్ఘ బాహార్గళిన్
బ్రగ్రీవంబున కర్యమాత్మజుని_శ్లే • షంబాన గాఢానురా
గ గ్రైవేయక మోయనంగ నలమెన్ • గారుణ్య భావంబునన్.

శా॥ కూర్చుండన్ సెలవిచ్చి ప్రేమమునఁ గా • కుత్స్థుండు బ్రహ్మాండమం
దర్పారూపుఁడు కాంచి నీప్రభుత సౌం • పారంగ నిర్విఘ్నమై
పేర్చుంగాదె? జనంబులెల్లరును ని • ర్భీతిన్ సుఖంబుండిరే?
చర్చింపన్ జలదంబుఁబోలెఁ గపిరా • జ్యం బెల్ల రక్షించెదే?

మ॥ అని సంప్రశ్నము సేయు రామునకుఁ గీ • శాధ్యక్షుఁ డో దేవ! నీ
యనుకంపార్ద్ర కటాక్ష దృష్టిగల మా • కబ్రంబె సౌఖ్యాలికిన్?
ఘన తామిస్ర చయంబు లెన్నియయినన్ • గంజాప్త సాన్నిధ్యమం
దున నిల్వంగలవే? భవాబ్ధి తరణ • ద్రోణీ దయాంభోనిధీ!

తే॥ నీయకారణ సత్కృపా • నియత సంప, దంధతను మీఱితిని భవ • దాజ్ఞనేను
నైజమైన కాపేయంబు • నన్ మహాత్మ!, బుద్ధివచ్చె మన్నింపవే • పూతచరిత!

మ॥ కకుబంతంబుల దాఁక నీజగములన్ • గాలించి యెందున్న జా
నకి నేపారగఁ దెచ్చియిచ్చు బలస • న్నాహంబు నేఁ గల్గియున్
వికలాత్మన్ మఱి నీవు దుఃఖపడఁగా • విస్తారభోగమ్ములం
దకటా! మగ్నుఁడనై పరాకునను కా • లాతీతముం జేసితిన్.

తే॥ నా స్వభావంబు నాసీతి • నాతలంపు, లిట్టివయ్యె సిగ్గయ్యెడి • నెదుటనిలువ
నింక నను గూర్చి పలుమాట • లేల రామ, భద్ర! రణవీర! విలసత్కృ • పాసముద్ర!

మ॥ కమలావక్షుఁడు రాఘవుండనుఁ బ్లవం • గ గ్రామణీ! వర్షకా
లము వేవన్నను వత్సలత్వమున నా • లాపించు నీవాక్యముల్

ప్రమదారత్నము రోయుకార్యమును సం • భావించుటంజేసి య
ల్పములై తోఁపవు న్యూనతందెలుప నే • లా ప్రేమ నిండారఁగన్.

మ॥ భరతుం బోలిన భక్తియుక్తుఁడవు ర్త • వ్యంబోకు మీ చన్నయ
న్నెరసుల్ మూఁడవకన్ను డాఁచిన మృడా • నీభర్త సర్వజ్ఞుఁడ
ప్పరమోదారుఁడు మారుతాత్మజుఁడు • నీ పజ్ఞం బ్రకాశింపఁడ
చ్చెరువయ్యెం గతమేమి యున్నఁ బ్లవగ • శ్రేష్ఠుండు తా నిట్లనున్.

ఉ॥ దూతలు కోఁతి మూఁకలను • తోడ్కొని రాఁజనియున్నవారు వా
రీతటిదాఁకి రారు గడు • వింకిఘ జేపటిదాఁక నుండె ని
ర్ణీతిని వచ్చిచేరిన వ • నేచరవర్గము దోడితే మరు
త్సూతిని నిల్పివచ్చితిని • తొందరవచ్చును నేఁట రేపటన్.

తే॥ వెంటవచ్చెను తొమ్మిది • వేల కోట్లు, రావలయు సైన్యములును ని • ర్ణయము చెడక
రాఁగలవు రేపెవచ్చు త • ర్వాత మిగత, కార్యమును నిశ్చయింత మ • క్కఱగననుడు.

చ॥ తలఁచిన కార్యమున్ బలయు • తంబుగఁ జక్క యొనర్చు టన్నచోఁ
జలుకన గాక దొడ్డగునె • సూర్యకుమారక నీకు? శ్లాఘ్యమీ
యలఘు వినీత భావమది • యందఱ కబ్బునె? నేఁడుపోయి రే
పెలమిని రమ్మటంచు సెల • విచ్చి ప్రియంబునఁబంపె భానుజున్.

ఉ॥ వాలితనూజుఁ గాంచిప్రియ • వాక్యములాడి కుమార నేఁడు నీ
ప్రోలికి నేగి తండిరికిఁ • బూర్తిగఁ దోడ్పడుమంచుఁ బంపి శ్రీ
లోలుఁడు తమ్ముతోడఁ దన • లోపలి జానకి తోడఁ దన్ని శా
కాలము ద్రోచివైచెఁ గడఁ కన్· భువి నిల్చినఁ గాల మాఁగునే?

ఉ॥ రాతిరి కీర్తికాముఁడగు • రాముఁడు తమ్మునిగాంచి నాయనా!
కోఁతులతేని నెట్లుగనుఁ • గొంటివి! తత్సలి నేమికూరెఁ నా
కాఁతరీతిఁ దెల్పుమన • నాతఁడు దెల్పుచునుండె నన్నయున్
బ్రీతిని విన్చునుండెఁ జనె • రేయియుఁ బ్రొద్దును వచ్చెఁ గ్రమ్మఱన్.

## 9. కపిసేనా సందర్శన పటలము. (40)

ఉ॥ సూర్యుఁడు పూర్వదిక్తటివి • శోభిలు మున్నుగ లేచి సూర్యవం
శార్యుడు నిత్యకృత్యముల • నాదరమొప్పఁగఁ దీర్చె; ధాత్రి యీ
ధుర్యత నోర్వదన్ దిగులు • దోఁపఁగ వానరసేన నైజమౌ
చర్యలు సేయుచున్ జనక • జాపతిఁ జేరఁగవచ్చె నత్తఱిన్,

తే॥ శతసహస్ర నాగబలులు • సైన్యపతులు, వేవురాగి వెంటరాఁబడి • వేలకోట్ల
చిందముంబోలు నచ్చంపు • చందమొప్పు, సేనతో శతబలి వచ్చి • చేరెనటకు.

తే॥ మధువు నెక్కువ గ్రోలియు • మత్తుగొనక, మేడవును గూడఁ బెకలింప • మీఱుమేటి
శిక్షణులు వానరులు పది • లక్షకోట్లు, వెంబడింప సుషేణుండు • వేగవచ్చె

తే॥ సరసవాక్య రుమాదేవి • జనకుఁడైన తారుఁడు పయోధి క్షణములో • దమ్మసేయఁ
జాలు పలువది యెనిమిది • వేలకోట్ల, కపిచయంబుతో రవిసూతి • కడకువచ్చె.

తే॥ దివిని భువిని శాశ్వతకీర్తి • నివుడఁజేయు, హనుమతండ్రి కేసరియను • నగచరుండు
కోఁతు లేఁబది లక్షల • కొట్లు గొలువ, వెలసి దినరాజసూనుని • గొలువవచ్చె

తే॥ అలుక గొలుప భాస్కరునేని • నలఁచివైచు, క్రోధమునవసుంధరనేని • గ్రొచ్చిత్రోచు
కొండముచ్చులు నలువేల • కోట్లు బలయ, నక్షయబలుండు వచ్చె గ • వాక్షుఁడటకు

ఉ॥ ఆది వరాహమూర్తి బల • మందిన వారలు రోమరాజి శై
లాదులఁగట్టి యీడ్వఁగల • యట్టి యెలుఁగులు రెండువేల కో
ట్లాదటఁ గొల్వ వానర వ • రాధిపుఁ జేరఁగ వచ్చె జాంబవ
త్సోదరుఁ డాజిభీకరుఁడు • ధూమ్రుఁడు మిక్కిలి కౌతుకంబునన్

తే॥ పిడుగు హాలాహలముఁ బోలు • భీకరుండు, పనసుఁడనువాఁడునడగొండ • యనఁగవచె
వినుత బలయుతుల్ పండ్రెండు • వేలకోట్లు, కీశవరు లోలిఁ గొల్వసు • గ్రీవుకడకు.

తే॥ అగ్నికొడుకు నీలుండను • నగచరుండు, కంధి కంధర సన్నిభ • కంఠ రవుఁడు
యమసమాను లేఁబదికోట్ల • యగచరాలిఁ. దోడుకొనివచ్చె రవిసుతు • తోయమలర

తే॥ గురుభుజుండు విశాల వ • క్షుండునైన, దధిముఖుఁడు స్థిరకార్యు లు • దగ్రమూర్తు
లుగ్రులైన ముప్పదికోట్ల • యువక వనచ, రావళులతోడ వచ్చి సు • గ్రీవుఁ గలిసె.

తే॥ తాము వసియింప వేఱొక • ధాత్రియున్నఁ, జాలదననొప్పు ముప్పది • వేలకోట్లు
సింహభీకరులగు కపి • సేనతోడ, వచ్చి దిగియెను విఖ్యాత • బలుఁడు గజుఁడు

తే॥ అంబుధి తరంగములఁబోలె • నంటియంటి, వచ్చు. వేయు నేఁబదికోట్ల • భల్లుకేంద్ర
వితతితో బ్రహ్మపుత్త్రుఁడు • వీరవృద్ధు, జాంబవంతుఁ దేతెంచె ను • త్సాహ మెదర.

తే॥ అజుని యాజ్ఞచే దనుజుల • యాయువడఁప, వచ్చెననఁ బదిలక్షల • పంక్తి[illegible]
దైన సేనలతో సాటి • లేని కడిమి, నొప్పు దుర్ముఖ ప్లవఁగ వ • ర్యుఁడు వచ్చె

తే॥ అశ్వినీదేవతల యంశ • మందు పుట్టు, విక్రమోన్నతుల్ మైందుండు • ద్వివిదు డనెడి
ప్లవగు లొక లక్ష కోటి బ • లంబు తోడ, ధూళి మిన్ను గప్పఁగ వచ్చి • డూ కినారు

తే॥ మల్ల యుద్ధకోవిదుఁడు స • న్మహితగుణుఁడు, విజయశీలి కోటికిఁ గోటి • వెఁయుదళము
వెంటరా గోముఖుండను • వీరవరుఁడు, భుజయుగము పొంగ రవిపుత్త్రు • పొంతఁజేరె

తే॥ గాలియన గాలిపట మనఁ • గ్రాలి యలల, తోడి కడలినా • నుపొంగి • తో[illegible]డియగు
కో[illegible] రాణువతో వచ్చెఁ • గుముదుఁ డటకు, విజయమే రూపమందిన • విధముఁదోఁప

తే॥ ప్రళయకాలమందేని న • శ్వరములేని, ప్రోద పద్మముఖుం దేడు • నేడువేల
కోట్లసంఖ్య యొప్పారెడు • కోఁతిమూఁక, తోడవచ్చె భూతలమెల్ల • ధూళిగ్రమ్మ.

తే॥ విలయమున జగములు చెడ • వీఁకచెడని, కులమహీధ్రములన లావు • కొమరువెరవు
గలుగు తొంబదికోట్ల సం • ఖ్యకుమతించు దళముతో ఋషభుఁడు రవి • తనయుఁజేరె

తే॥ కదలికంటె విస్తరమైన • కట్టికోఁతి, మూఁకలను లెక్కకందని • మొత్తములను
పిలిచికొని దీర్ఘపాదుండు • వినత శరభు, లొక్కరొక్కరుగా వచ్చి • రుల్లసిల్లి

తే॥ రవికిఁగూడ భీతిల్లని • పవనసుతుఁడు, దెసలుచిన్నవియన నొప్పి • ముసురు కవిసి
యున్న యిదైదువేల కో • ట్లొలయు బలము, లొప్పనడతెంచె ధాత్రియు • నొడ్డగిలఁగ.

తే॥ వేలుపులకును లెక్కింప • వీలుకామి, యముఁడు కాంచి దిగ్భ్రమమొంద • నరిదియైన
లక్షకోట్ల యెన్నికగల • పక్షబలము, లొలయ విశ్వకర్మసుతుఁడు • నలుఁడు వచ్చె

తే॥ రాము నమ్ములపొదలోని • ప్రదర సంఖ్య, తోడఁ బోల్పంగఁదగినది • తొడరి తెచ్చు
శంఖ కుంభుల విస్తార • సైన్యచయము, లోకులకు లెక్కవెట్టంగ • లోనుగాదు

సీ॥ ఇట్లు కూడిన వాన • రేశ్వరసైన్యంబు, మునుఁగంగ జాలదు • వనధిజలము
త్రొక్కిన దిక్కు మే • దవును ధరాస్థలి, యొద్దగెడవుగాఁగ • నోరగిల్లఁ
జరియింపఁ దొడఁగిన • జగమందు నవుగింజ, విడుటకేని యెడమ్ము • నెనయకుండుఁ
గివిసిన రవియును • కీలియుఁ గాలి బొ, గ్గగుసరు భుజియింప • నండచయము

తే॥ పిడికెఁడేసియేనియు నాఁటి • యిడఁగరాదు, వెరసి లెక్కింప డెబ్బది వేల బ్రహ్మ
లంగవించియు వ్యర్థప్ర • యత్నమగును, కెరలిచూచి చిచ్చుకంటి • గెలువఁజాలు.

తే॥ విఱువఁదలఁచిన మేరువు • విఱువఁగలదు, పొడువఁదలచిన మింటిని • పొడువఁగలదు
పట్టఁదలఁచిన యమునైనఁ • బట్టఁగలదు, త్రావఁదలఁచిన జలధులఁ • ద్రావఁగలదు

తే॥ కదలదాఁటి యవ్వల దూఁకఁ • గడఁగువారు, విభునిపనికిఁ బ్రాణములేని • విడుచువార
లుఱువదేడుకోటుల పది • కాధిపతులు, గొప్పసేనతో సుగ్రీవుఁ • గూడినారు

తే॥ వనిధికంటె విస్తృతిని మిం • చిన దళమ్ము, లెలమి నలమఁగ దళపతు • లెల్లవచ్చి
సప్తహరిదశ్వసుతుపాద • జలజములకు, సరగ నెఱఁగి క్రొవ్విరులను • చల్లినారు.

తే॥ ఇట్లు వచ్చిసేనలు నిండ . వినసుతుండు, దాశరథికడ కరుదెంచి • త్వరితగతిని
అఘవిదారు తలంచుచు • న్నంతలోన, దడము లేతెంచెఁ జిత్తగిం • పుఁడి యటన్న.

ఉ॥ మోహనమూర్తి కాంచి పరి • మోద భరంబున మోమెలర్పవై
దేహిని యప్పుడే కవిన • తీరున నంగద వీడి సైన్య సం
దోహమునెల్లఁ గాంచెదు కు • తూహలమంది నగేంద్ర శీర్ష మా
రోహణసేసెః భానుజుఁడు • కోఁతులమూఁకను చేరి యవ్వలన్,

తే॥ పదియునైదు యోజనముల • పరపుగలిగి, యిచటినుండి దక్షిణమున • కేగుఁదనుచు
నాజ్ఞయిడి సైన్యములకుఁ సై • న్యాధిపతులఁ. బిలుచుకొని వచ్చె శ్రీరామ • విభువికడకు

తే॥ వచ్చి సేనలఁ జూపుచుఁ • బార్థివేంద్రు, కడన యుండఁ బాలకడలి • కడలతోడఁ
దెరలి ప్రవహించుచందానఁ దివిరి సేన, బహుళ కోలాహలంబుతో • బయలువెడలె.

ఆ॥ అష్టదిశలు భూమి • యనిమిషలోకంబు, వనధివయము మఱుఁగు • పడఁగ సైన్య
ఘట్టనలను దుమ్ము • కడురేఁగ బ్రహ్మాండ, ఘటమువెలసె మట్టి • కడవయనఁగ.

చ॥ మొనలకు గొప్ప వారినిధిఁ బోల్తమ యన్న • సముద్ర విస్తృతిం
గనిన జనంబులుం గలరు • గావునఁ బోలిక కేదియుండుః నా
యినకులు లట్టులే దినము • లిర్వది చూచియుఁ జక్రమధ్యమున్
గనరనఁ బూర్తిగాఁ దెలియఁ • గాంచుసమర్థులు గల్గనేర్తురే?

చ॥ జయమునఁ బ్రౌఢిమంబునఁబ్ర • శస్తబలంబున సాటిలేని శ్రీ
దయితుఁడు కన్నులన్ మదిని • తర్కవిధంబున నింగిలజ్ఞతఁ
బయిపయిఁ గాంచి కాంచి మతి • పట్టుగ నూహమొనర్చి సైన్యసం
చయములఁ గూర్చి ప్రేమ నను • జన్మనిగాంచి వచించె నివ్విధిన్.

మ॥ మనబుద్ధింగొని చూచినారము చమూ • మధ్యంబు నీక్షై వడిం
జన సంపూర్తిగఁ గాంచు నోపికయు నెం • చఁ లేద యంభోనిధిఁ
గనినట్లందురెకాని యెవ్వరు తదా • కారంబు పూర్ణంబుగా
గనినారో యని.సంశయంబు గలుగున్ • గాకుత్స్థ చూడామణీ!

మ॥ ప్రమితిన్ సర్వజగన్నియామకుని స • ర్వవ్యాప్త దేహంబుఁ. బం
చ మహాభూతములన్ దిశాంతముల, సూ • క్ష్మజ్ఞానమున్ బల్కులఁ,
భ్రమలంగొల్పు మతప్రవక్తల యభి • ప్రాయంబులన్, గీశసై
న్యములన్, సాంతముగాఁ గనుంగొనిన పు • ణ్యాత్ముల్ కనన్ వత్తురే?

శా॥ ఈసైన్యంబుల నిందయుండి రహిమై • నీక్షింప యత్నించుచో
గాసింబొందుట కాలముం జనుటయుం • గాకొందు గానేర్చునే?
యా సుగ్రీవునితోడఁ గ్రచ్చఱఁగఁ గా • ర్యాలోచనల్ చేసి సీ
తా సౌగంధి కగంధి నారసెదు చేఁ • తల్ చూడ మేలౌఁగదా!

చ॥ అన విని లక్ష్మణుండను మ • హాశయ యీకపిసేన యెందు నే
ఘనమగు కార్యమైన క్షణ • కాలములో నవలీల నేర్పుమై
నొనరుపఁజాలు; జానకి న • యోనిజ రోయుట దొడ్డకార్యమే?
పనిగొని ధర్మమే గెలిచెఁ • బాపములెల్ల నశించె రాఘవా!

చ॥ నలినభవుండు గొప్పజత • నంబునఁ జేసిన సృష్టియందు జీ
వుల గములన్నియున్ జలధి • భూధర సన్నిభమై చెలంగు నీ
బలిముఖ సైన్యసంతతులఁ • బట్టుగ లెక్కిడఁ బూని యుంచు నా
నలుగలు గాఁగ దోఁచె ముని • సన్నుత నిర్మల సద్గుణాకరా!

శా॥ ఆలస్యం బిఁకనేల మైథిలిని యో • గ్యప్రాధి రోయంగఁ గీ
శాలిన్ దిక్తతి కంపుటే తగిన కా • ర్యంబంచు వాక్రువ్వఁగా
శ్రీలక్ష్మీ హృదయేశుఁ డాప్తవరు సు • గ్రీవుం బ్రబోధించుచున్
గాలాతీతములేని పద్ధతిని ప • ల్కంబూనె మోదాత్ముఁడై.

## 10 అన్వేషణ ప్రేషణ పటలము. (74)

మ॥ జనతా నైజ మహాభిమానము మన • స్తాపంబు నన్యోన్య భ
ర్జన విద్వేషము లేమిలేక విపులో • త్సాహంబుతో నొప్పు నీ
మన సైన్యంబుల లెక్కవెట్టఁ దలఁపన్ • మానం బొకండున్నె ధా
త్రిని? మోదంబునఁ దెల్పుమా యనుడు సు • గ్రీవ ప్రభుం డిట్లనున్.

సీ॥ ఎనిమి దక్షౌహిణు • లేకంబు నాఁబడు, నెనిమి దేకములైన • నేకకోటి
కోటు లొకెన్మిది • గూడిశంఖంబగు, నవి యెనిమిది కుము • దాఖ్య నొప్పుఁ
గుముదంబు లెనిమిది • యమరఁ బద్మంబగుఁ, బద్మంబు లెనిమిది • పరఁగు నాడి
నాడు లెన్మిది చేరి • నన్ సముద్రంబగు, సంద్రంబు లెనిమిదై • చనును వెల్వ

తే॥ అట్టి వెల్వలు డెబ్బది • యమరు సేన, యిందు సేనాను*లిరువది • యేడుకోట్లు
వీరలకు నెల్ల మొనగాఁడు • క్రూర కాలు, నైన నలఁపఁజాలిన నీలుఁ • డనెడివాఁడు.

తే॥ అనిన రవిసుతుఁ బ్రేమమైఁ • గని నృపాలుఁ, డింక వ్యర్థ ప్రసంగంబు • లేల మనకు
నక్రమముగాఁగఁ గర్తవ్య • సరణి చూడ, నగుఁగదా యన్న సుగ్రీవుఁ • డనుమఁగాంచి

ఆ॥ జనకునివలె జవము బలం, బును గలిగిన నీవు కార్య • మున మునుకొనకీ
యనువున నితరుల బలమును, గను వేడుక నుంట తగునె • కరువలిపట్టీ!

ఆ॥ ఈవ బయలుదేటి • యిలయెల్ల గాలించి, భోగ భూమి వెదకి • భోగిలోక
మరసి తరణి కులజు • తరుణి యునికిఁ గాంచి, తెలివితోడ బలముఁ దెలుపఁ దగవె?

చ॥ దనుజుని పట్టనం బిటకు • దక్షిణ దిక్కున నుండుఁ గావునన్
ఘన జవ మొప్పఁగా నరిగి • కర్బురవర్యుల గెల్చి శ్రేయమున్
జనక కుమారికిన్ ధరణి • జాపతికిన్ మఱి మాకుఁ గూర్చి కీ
ర్తిని వహియింపఁగా? దగిన • తేఁకువ నీక యొసంగు మారుతీ!

* 3669177139200 ఒక వెల్లువ; 256842 299744000 డెబ్బది వెల్లువల సంఖ్య

ఆ॥ వాలిసుతుఁడు జాంబ • వంతుఁడు తక్కిన బలము రెండు వెల్లు • వలనుమీకుఁ
దోడుగాఁగ వచ్చుఁ • దోయజాక్షిని రోసి, త్వరగ రండు క్షేమ • వార్తతోడ,

తే॥ వరుణ దిశకు బుషభుఁ దేగి • యరయువాఁడు, వినతుఁ డింద్రుని దిక్కున • వెదకువాఁడు
ధనదు దెస శతబలి రోయ • మొనయువాఁడు, రెండు రెండేసి వెల్లుల • దండుతోడ.

తే॥ శ్రమమునకు నోర్చి పలు ప్రదే • శములఁ జొచ్చి, రాముదేవి నన్వేషించి • రావణయును
గడువు నెల గల్గు నంతలోఁ • గడఁకతోడ, వచ్చి తెలుపుఁడు మీర ల • వ్వార్తలెల్ల.

తే॥ * దక్షిణంబున కేగ య • త్నంబుసేయు, వారిఁగని వెండి మీరలు • భవ్యమైన
విష్ణు విశ్వరూపంబన • వెలయుచున్న, వింజమును దొల్తఁ గాంచుఁడీ • వేడ్కతోడ

తే॥ వింధ్యగిరియందు దేవిని • వెదకిచూచి, యవల వేల్పు డిగ్గియ యన • నలరి షట్ప
దముల ఝంకృతిచే శ్రవ • ణముల కింపు, గూర్చు నర్మదఁ జేరుఁడు • కూర్మిమీఱ.

తే॥ అమరకాంతలు దోలిక • లందు తూఁగి, సేయు గానామృతము గ్రోలి • చేష్టలుడిగి
యలరి తూలి నిద్రించెడి • యళునపక్షి, కూటముల కిరవగు హేమ • కూటము గని

తే॥ అచటఁ గలుగు పూఁబొదరిండ్ల • నరసి కడచి, యుత్తర పినాకినీ నది • నుత్తరించి
సుందరంబులై యలరారు • చోటులెల్ల, వెమకి యవ్వలఁ జనుఁడు ని • ర్జిద్రులగుచు

తే॥ తావి యగురు వృక్షములు చం • దన వనంబు, లేపు మీఱి భాసిలు విద • ర్భాపురంబు
నరసి నానాపురంబుల • నధిగమించి, దండకాటవిఁ జేరుఁడు • త్వరితగతిని.

తే॥ పిదపఁ గమలాకరములచే • వృక్షసాంద్ర, మగు తలంబులచే రమ్య • మై యగస్త్య
మౌని వసియించు పుణ్యాశ్ర • మంబు గనుఁడు, పావనస్థలుల్ దర్శింపఁ • బాప మీఁగు

తే॥ ప్రసవజాల సంభృతమైన • వన ముదారు, సంపదంబోలె స్థిర వికా • సంబు నొందుఁ
బూవుఁబోండ్ల తీయని మోవిఁ • బోలు ఫలము, లెల్ల ఋతువులలో ఫలి • యించుచుండ

తే॥ అచటివారలు కనుఱెప్ప • లార్పకుండ్రు, గాఢనిద్ర సేయరు మోవ • కర సుఖంబు
లచట సుస్థిరమై యుండు • నర్కుఁడేని, చొరఁగలేఁడు తగ్గనివగు • ఝరములందు.

తే॥ దాని దాఁట నిశాకరు • దాఁకి యొరయు, నదియు భానుండు విశ్రాంతి • ననుభవించు
పట్టునాఁ దోఁచునదియు నౌ • పాండుశైల, మొందు కన్పట్టు నచటికిఁ • బొందుమీరు.

సీ॥ సతతంబు జీవన • సంధాత్రియై ప్రవ, హించుచుండుటచే ర • హించునదియుఁ
గనక రేణువుల ము • క్తాఫలంబుల రత్న, సంచయముల దొర • లించుకొనుచు
గొల్లల కవ్వముల్ • కొల్లలాడుచు ఘన, ద్రుమ నికరంబులఁ • ద్రోచికొనుచు
జీవజాలముల నీ • డ్చికొనుచు మునిఁగిన, వారి పాపము నోట • వైచుకొనుచు

* ఇట నుండి గల పద్యములలోని వింధ్య నర్మద దండక అగస్త్యాశ్రమము గోదావరి యమునకి కిష్కింధప త్తరమున నుండునని, వింధ్యమును మధ్యప్రదేశము గా నుంచుకొని నాఁగుదిక్కులకు కపులను పంపెనని వ్యాఖ్యకారులు వ్రాసియున్నారు, అట్లు చూచినను తక్కినవియు స్థలక్రమ విరుద్ధములై యున్నవి

తే॥ వచ్చు పావన నది యొండు • వఱలుచుండు, ధర్మమార్గంబుకరణి నౌ • దార్యమట్లు
పరఁగు గోదావరిం దాఁట • శరవణాఖ్య, నమరు నదియుండు షణ్ముఖుఁ • డందు వెలుఁగు

సీ॥ ఆవలఁ బోవ భీ • ల్లాంగనల్ మంచెల, పైనుండి పక్షులఁ • బాఱఁదోల
నుడియంగ నొడిసెల • సూర్యకాంతంబుల్కఁ, జుట్టి వైవఁగ నెండ • మిట్టికాచు
కొట్టుచేల్గలకొండ • కోనలఁ గాంతురు, కడచి చనఁగఁ జంద్ర • కాంతగిరియుఁ
గనవచ్చు నదియును • కడచనఁ బెక్కువి, శాల ప్రదేశముల్ • సౌరుమీఱు

తే॥ నవల నాచి శేషుండు ఖ • గాధిపతికి, నలికి డాఁగిన కొంకణ • మను విలాతిఁ
బొందవచ్చు నవ్వలను కు • శిందపురము, చేరఁగలరు మీరలు దాని • మీఱి చనుఁడు.

సీ॥ హరుఁడు ఘనుండని • హరియె ఘనుండని, వాదించు మూఢులు • పడయలేని
సద్గతి కైవడిఁ • జనరానిదియు సుర, నది పరిసరమునఁ • బొదలునదియు
నభ్రంకషంబయి • శుభ్రాంశుఁడు గ్రాంశు, డను దీపకళికలఁ • దనరు నదియుఁ
బ్రణతుల కభిమతా •ర్థము లొసంగునదియు, నగు నరుంధతి గిరి • మొగిని గనుఁడు

తే॥ కాంచి మ్రొక్కుఁడుదానిని • గాంచి నదులు, గిరులు కొన్నిదాటిన ఖగ • వరుఁడు సుధను
సర్పముల కిచ్చి తల్లిదా • స్యంబు దీర్చు, తలము మరకతగిరి దానిఁ • గలయఁగనుఁడు

సీ॥ ఉత్తర భాషయౌ • నురు సంస్కృతమునకు, దక్షిణ భాషయౌ • ద్రావిడమున
కెల్లగాఁ గలదియు • నెల్ల వేదాంతముల్, వివరించు తత్త్వంబు • వెలయునదియు
మేటి ధర్మములకు • మేరయౌ నదియు న, సామాన్యమగుట య • శశ్శరీర
మట్లు ప్రకాశించు • నది మహర్షులకు మ, హత్త్వములకు స్థాన • మైన నగము

తే॥ వేంకటాచల మనుపేర • వెలయుచుండు, దొందములఁ ద్రోచి సమ సుఖ • దుఃఖులైన
తత్త్వవేత్తలు జ్ఞానాగ్ని • దగ్ధకర్మ, లైన తపసు లా శైలంబు • నందఁగలరు.

సీ॥ సర్వపాపఘ్నముల్ • స్నాన తీర్థంబులు, మౌని ప్రశాంతాశ్ర • మస్థలములు
రత్న పుంజములతో • రాజిల్లు చఱియలు, వేల్పుబోటుల గాన • విధము వినుచు
సారంగ పోతముల్ • శార్దూల శాబముల్, ద్వేషంబు మాని ని • ద్రించు చోట్లు
కాంచువారలకు నాఁ • కలియుఁ గన్పింపదు, విపుగు పుట్టము మోవ • మెఱుగుచుండు

తే॥ గిరిని దర్శింపఁ గల్మష • గిరు లడంగు, డాసినన్ ముక్తి తప్పక • డక్కుచుంట
మనకుఁ గార్య భంగంబగుఁ • గనుక నచట, దూరమునుండి ప్రణుతించి • తొలఁగుఁడీరు

సీ॥ విమల ప్రభావ ని • వేశ మయ్యదిగాన, రాపణుం డవటికి • రాముదేవిఁ
గొనిపోవఁ డవలికిఁ • జని తొండమండల, మునఁగాంచి విఖ్యాతి • నెనసి స్వచ్ఛ
శీతలవారిచేఁ • జెన్నారి సజ్జన చిత్తంబుపోలెను • దాత్త మగుచుఁ
బ్రవహించు కావేరి • వఱలు చోళుల దేశ, మును దాఁటి యవ్వల • మునుల వసతు

తే॥ లగు ప్రదేశంబులం గాంచఁ • దలఁత లేక, యలసు లెన్నండు సఫలత • నందలేరు
కడచి ద్రవిడభాషను పేరు • గాంచినట్టి, పాండ్య దేశంబునకుఁ బొందు • ప్లవగులార॥

మ॥ మలయాద్రిం గల యా యగస్త్యముని ని • ర్మాణించు భాషాస్ఫుర
త్కలనా ద్రావిడ సంఘముం గనినఁ ద • ద్భాషా సుధా మాధురీ
కిల నాదం బది క్రమ్మఱిల్లుటకు నాఁ • కం గూర్చుఁగాఁబట్టి మీ
రల శైలంబున కర్థి మ్రొక్కి చనుఁడీ • యంభోనిధిం దాఁటఁగన్.

సీ॥ దారిలోఁ బ్రకృతి సౌం • దర్య పూర్ణంబగు, దరులతో విలసిల్లు • తామ్రపర్ణి
ద్విరద పోతంబులు • విచ్చలవిడిఁ జరి, యించు సానువుల మ • హేంద్రనగము
కలవు వానిని గాంచి • కడచి యవ్వలఁ జూచి, నెలలోన మరలి రా • వలయు ననుచు
సుగ్రీవుఁ డాజ్ఞ యి • చ్చుట గాంచి రాఘవ, ప్రవరుండు కపివీరుఁ • బవనసూను

తే॥ నక్షయ కటాక్ష వీక్షణ • మాన్చి యరసి, యతనిచేఁ గార్యసిద్ధి యౌ • నని గ్రహించి
యేకతమునకుఁ గొనిపోయి • యెలమితోడఁ, గొని యంగమచ్చముల వా • క్రువ్వఁదొడఁగె

## సీతా సౌందర్య వర్ణనము.

శా॥ క్షీరాంభోనిధిఁ బుట్టు విద్రుమ లతా • చ్ఛేదంబులం దెచ్చి సొం
పారన్ లత్తుక పూసి చంద్ర దళకం • బాపైనఁ బొందింప నే
తీరౌ నవ్విధిఁ గాలి వ్రేళ్ళమరు ధా • త్రీపుత్త్రికిం గావునన్
నీ రేజాదులు సాటిగావు వినుమా • నిక్కంబుగా మారుతీ॥

మ॥ మెఱుఁగుంబోఁడుల నింపు సొంపెసఁగు న • మ్మీఁగాళ్లకున్ సత్కవుల్
తెలుఁ గొప్పం గమఠంబులన్ సదృశరీ • తిం బోల్చి వర్ణింత్రు చ
క్కెరకంటెన్ మధురంబులౌ పలుకులం • గీలించు చంద్రాస్య కా
యుఱవౌ సామ్యము దెల్పుటజ్ఞతి యగున్ • న్యూనోపమం బౌటచేన్.

మ॥ విలిఖింపంగ నశక్యమై తనరు పూ • విల్కాని చేయమ్ము లీ
లల నొప్పారెడి సీత జంఘలకుఁ బో • లం జూచి విద్వాంసు లా
కలనం దెల్పెడి శాలిగర్భము విషం • గంబున్ మహోగ్రాహమున్
దెలుపం గల్గెడు మోదమేది? త్రిజగ • ద్విఖ్యాత వీరోత్తమా॥

తే॥ కలికి సొబగు నీరోమోరు • వులకుఁగవులు, సహజముగఁ దెల్పు కదళికా • స్తంభములను
తొలుతనె జయించె నన వేఱు • తొడరి తెలుప, నుపమ లేదయ్యోజగమున • నూహసేయ

తే॥ కంచుకము దాల్చు చక్రవా • కముల సౌరు, పసిఁడిగిండ్ల మెఱుంగును • పరఁగఁగల్గు
కుచభరంబున నసియాడి • కునియు కౌను, కలదు లేదను తత్త్వంబు • కరణి నొప్పు.

ఉ॥ సౌష్ఠవజాలమున్ జగతి • సాదనచేసి గడించి బ్రహ్మయున్
నిష్ఠను మెచ్చులాఁడులను నేర్పున సృష్టి యొనర్చుచుం దె బిం

బోష్టి తను ప్రకాశమున • నొప్పఁగఁ గానఁగరాదు కాను నే
సుష్ఠగ నంటియే కలుగు • చొప్పు గ్రహింతు నిజంబు పావనీ!

మ॥ పటపత్త్రింబును వెండిపళ్ళియరమన్ • వర్ణాటుఁ దంకించిరా
యటకుం గూర్చు పటంబు నద్దమ కవి • ప్రోక్తంబులై యుందు ని
చ్చోట నవ్వానిని పోల్చి పల్కు నుపమా • స్తోత్రంబులౌ మైథిలీ
పటు భవ్యోదర పద్ధతిం గనినచోఁ • బ్రజ్ఞాధనీ! పావనీ!

శా॥ సంధ్యావర్తపు మధ్యరంధ్ర మద గాం • చన్ సౌరుగా నుండినన్
నింద్యంబౌ నుపమానమౌ గుణవతీ • నిమ్న స్ఫుర న్నాభికిన్
సంద్యోతంబగు ద్యో నదీ ఎముం వా • స్సంఘాత జావర్త మా
నంద్య ప్రక్రియఁ గాంచినాఁడ నది యె • న్నన్ వచ్చుఁ దత్సామ్యమున్.

తే॥ తరుణి నూఁగారు నాప్రాణ • ధర యనియె, తలఁపు మది కౌనులతయెగు • దలకుఁబ్రాఁ
యలమ నొఱగనీకుంమ మా , టాకుఁబోలు, ననుచుఁ దెలుపంగఁదగునాళు • గాత్మజాత!

చ॥ దళము౦ రాపిడిం దనుపు • దద్దురు వోవున యన్న శంకతో
జలజము నుండి వెల్వడిన • సాగరకన్యకకున్ వళిత్రయం
బిలఁ గల ముద్దరాంధ్ర నసి • నింపును సొంపు హరించు కీరిటిన్
సులలిత రీతి వ్రాయు జయ • సూచక రేఖలొ నాఁగఁ బొల్చెడిన్

చ॥ కనకపుగిండ్లు పోల్పదవు • కందుకముల్ సరిరావు చక్రవా
కిని జత పొందియుండదు చి • గిర్చిన పూవుల కుచ్చు లారహిం
గానవెడనీరు కాయలును • కూడవు పో చదరంగకాయలుం
బొనరవు కల్కిచన్నులకుఁ • బోలిక కన్పడదయ్యె నింతికున్

ఉ॥ లేవెదు రిక్షుదండములు • లేమ భుజంబు౦ సాటి యెంచి సె
నావిలచి త్తతన్ గనుల • నశ్రులు రాల్చుచు నుండుఁ గాని యా
దేవి భుజంబు సాటియగు • తీరు గనుంగొన నేరనైతి వా
పోవక యుక్కుగుండియును • పొందినఁ గాదె వచింప నిమ్మగున్

తే॥ అతివ ముంజేతికిని సామ్య • మరయలేదు, దిరిసెనయును కాఠిన్యమై • పరఁగు మకర
పీఁజియయు సరికాదిఁకఁ • బృథివియందు సౌష్ఠవము మించి యొకఁడున్నె • సౌష్ఠవంబు

తే॥ ఎఱ్ఱకంకేలి చివుళుల • నెన్ననేల? కల్ప కిసలయములు నవ్య కపుంజములు
నందెలు ధ్వనింప నందమౌ • నడుగు జతకె సాటిరావనఁ గేంకుఁ • జాటఁదగునె?

చ॥ చిలుకల ముక్కులన్ గెలువ • పేత నఖద్యుతిఁ బోలలేవ యం
చలికులవేణి లాలిగొన • నమ్ముఖవైరము నూని కిస్కమైఁ

జిలుకలు నేఁటికిన్ విడక • స్త్రీల ముఖంబులె యంచు దొండలం
దొలుచుచుఁ దృప్తినొందుననఁ • దూకొని సామ్యమికెందు దెత్తునో?

చ॥ కర చరణంబులం దనియఁ • గాంచెదుచో మదిఁ దట్టుచుండుఁ దా
మరసము లట్టులే చెలువ • మంగళకంఠము గాంచువేళ నె
చ్చరముగఁ బోఁక వృక్షమును • శంఖము జ్ఞప్తికి వచ్చుచుండు నా
సరసిజనేత్ర యందమును • సాటి గనుంగొని నిశ్చయింపుమా.

తే॥ వెలఁది నోటికిఁ బగడంబు • బింబ ఫలము, నెఱ్ఱగలువ బూరుగుపువ్వు • నింద్రగోప
మును పలాశసుమంబుఁ దె • ల్లనివెయగుట, నుపమకాలేవు తననోరె • యుపమయగును

తే॥ ఎఱ్ఱ యమృత మెఱ్ఱని కెనె • యిలను లేవు, తలఁచు మాత్రాన నవ్వి మో • దంబు నిడవు
తెలువ యధరంబునకు సాటి • ధరణి లేద, యేది చెప్పిన గౌరవ • హీనమ చుమి.

ఉ॥ జానకి దంతపాళికిని • జాజులు ముత్తెసరుల్ స్ఫుటంబులై
జానగు నెమ్మి యీఁకల పి • సాళి బుదంబులు సాటి యన్నచోఁ
దేవియతోడ వారిధి మ • థించి గ్రహించిన వెన్నతోడ నా
మానిని వాక్యజాలము స • మానము చేసి వచించుచేయగున్.

ఉ॥ ఊసరవెల్లియున్ దిల సు • మోన్నతియున్ మఱి సీరు గుబ్బియున్
వాసికతో సమాన మన • నాణెముగా జిగి లేదు వానికిన్
వాసవు చిత్రకారుఁడును • వ్రాయఁగలేఁడటు గాన జానకీ
నాసను గాంచియే నునుపు • నౌరు నెఱుంగ నగున్ మరుత్సుతా!

ఉ॥ వంగిన వంగ చిక్కుఁడును • వ్రాలను శ్రీయును ముంతమామిడిన్
బొంగుచుఁ జాటి బాలకులు • పోలికగాఁ గొనువారు పండితో
త్తుంగులు పల్కు వెఱ్ఱులని • త్రోవఁగవచ్చును కుండలంబులే
యంగన వీనులై జనన • మందెఁ బురాత్త తపః ఫలంబుచే.

ఉ॥ శ్రీపతివోలె నల్లనయి • క్షీరపయోనిధిఁ బోలెఁ దెల్లనై
యేపగు వాలు వాఁడిమి జ • యించిన కన్నుల మేల్గభీరిమన్
దేపకుఁ దేప గాఁగ వెయి • కేపలు చూచినఁ దృప్తి లేదు నీ
చోపమమౌ సముద్రమితి • యూహకు నందదు పోల్చి తెల్పఁగన్.

ఉ॥ సామ్య మొకింత యుండినను • చాటి పచింపఁగవచ్చు సాజమై
రమ్యములైన పోలికల • రాజ రహింపదు పూవు టమ్ములన్
గామ్యముగా రహిందొడుగు • కాముని చాపము రెండుకొమ్ములుగా
సమ్య గుదారతం గొనవు • జానకి బొమ్మల పోల్కిఁ దెల్పఁగన్.

చ॥ చెలువము గల్గు తామరల • సిగ్గిలఁజేయు పదంబులొప్పు నా
చెలువ లలాట లావణిక • సీమ ద్వితీయవిధుండు కాంచి సి
గ్గిలి నెల పున్నమందునను • గీడ్పడి యెల్లదినంబు లెచ్చు త
గ్గులు గొనఁదేని వానినొక • కోపునఁ బోల్పఁగవచ్చు మారుతీ!

ఉ॥ వారక కానఁజేరు పిద • పన్ వనజాక్షికి దువ్వి పేరలం
కారము సేయుచుండు చెలి • కత్తెలు లేరుగదా? యటుండ నా
వారిజనేత్ర నైజమగు • వక్రత నొందిన ముంగురుల్ మనో
హారిత నొప్పు; నీలమణి • యందము నొల్లవు సాటిగాఁ గొనన్.

నమబ్బుచిగురు • వంగిన విండ్లు ము. నైన వస్తువుల ని • శాధిపతిని
గార్చి బ్రహ్మచేసెఁ • గొమ్మ నెమ్మోము నీ. వచటఁ గాంచు నప్పు • డరయఁగలవు

ఉ॥ సన్నని వస్తుజాలమును • సాంద్రముగా నొనరించినట్లు మ
బ్బు న్నెఱిఁగట్టి తావియుసు • పొందఁగ ధూపమువెట్టి క్రమ్మఱన్
జెన్నుగఁ గప్పునీట జిగి • చేసి రుటంబుగ మోపు గట్టి సం
పన్నత వ్రేల వైచిన క్ర • మంబున నొప్పుఁ గురుల్ వెలందికిన్.

చ॥ కమలము ముండ్లు గల్గినది • కంజవిరోధికి మచ్చయుండు నీ
క్రమమునఁ జూడఁ జూడఁగ జ • గమ్మున మేలగు వస్తుకోటి యం
కము నొకటేని పొందినవి • కాని విదేహతనూజ యెట్టి లో
పము వహియింపకుండునది • పావని! కాంచియె నిశ్చయింపుమా.

ఉ॥ అద్రిజలోనుగాఁ గలుగు • నంగన జాతికి నుండఁదగ్గ సా
ముద్రిక లక్షణంబు లవి • పూర్తిగ లక్ష్మికి నుండఁబోవు త
ద్భద్ర గుణంబులెల్లఁ బరి • పక్వ దశన్ గడియించి చెందె నా
భద్ర గజేంద్రయాన నవి • పావని! నీకట నానవాళ్లగున్.

ఉ॥ పిల్లనగ్రోవి కోకిలము • వీణియ కీరము గోరువంక నా
నెల్లెడఁ గమ్రవాక్కులకు • నేర్పడఁ బోలిక గూర్చువస్తువుల్
కొల్లగఁజేసి యానలువ • కోమలి వాక్కులఁ గూర్చెఁ బోలికన్
జెల్లరే! యింతదాఁక మఱి • చేయఁడు చేయునొ యేమొ మీఁదటన్?

మ॥ పరఁగన్ జానకి కమ్రవాక్కులకు నౌ • పమ్యంబు లార్జించుచో
దొరకుం దేనియ పాలు మున్నగునవా • త్రోవన్ విచారింపఁ దే
వరలాహారము గల్గుఁగాని యవి జి • హ్వాం దృప్తి గావించు నా
హరువౌ వాక్కులఁబోలె నించునొకొ స • ర్వాంగీణ సౌహిత్యమున్.

సీ॥ సారసాకరముల • సంచరించుటయందె 'యలవాటుపడిన రా • యంచగములు
నౌరైన లేజవ్వ • నంబున విలసిల్లి, వనములఁ దిరుగు హ • స్తినిచయమ్ము
లీరైన నడకలఁ • దీరినవని సీత, నెమ్మినడకఁ బోల్ప పమ్మతింప
ధారావిశుద్ధిచే, • సొరుగాఁ జదువంగ? విన నింపుగూర్చు క • విత్వమల్లి

తే॥ పండితవరేణ్యులు రచించు • పద్యగతులఁ, బోలియొయ్యారమును సొంపు • పొంపుగలిగి
యుల్లసిల్లును జానకీ • యువతి నడలు, పరమ పావన చారిత్ర! • పవనపుత్త్ర!

సీ॥ మావి చిగుళ్ళు ని • మ్మళముగ నెల్లప్డు, దొక్కఁజేతీరున • నుండలేవు
బంగారు వెతఁజెంది • వన్నియ చెడిపోవు, రత్నకాంతులు మగ్గి • రాపునొందు
సౌదామినియు విని • శ్చలత నుండఁగ జంకి, మొగుళుల డాఁగురు • మూఁతలాడు
వనజముల్ వెనుకంజ • వైచినీటను డాఁగు, సీత మైచాయకు • స్థిరముగాఁగ

తే॥ నొక్కఁటేనియు నుపమాన • మొత్తిపలుకఁ, దగినయదిలేదు తెలుపంగఁ • దలఁపుగొన్నఁ
దన శరీర వర్ణమె షమీ • తనకు సాటి, యనఁగవచ్చు జగద్ధ్యేయ! యాంజనేయ!

శా॥ ఈలోకంబున జానకిం దొరయు స్త్రీ • లే లేరు లేరంచు నీ
వాలోచించి దృఢాత్మకుండవయి స • మ్యగ్రీతి నన్వేషణా
లోలత్వంబున నేగి ధాత్రిసుత నా • లోకించి యా చాయగా
నీలో నమ్ముక దోఁచుచోఁ గదిసి మ • న్నింపంగ మాటాడుమీ.

ఉ॥ జనకుని యాగముం గనెడి • చక్కటిఁ గౌశికుతోడ వచ్చు నాఁ
డనువుగ మేడమీఁద నడ • యాడుచు నుండిన యామెఁ గాంచి నే
మనమున నారటంపడితి • మానిని మిన్నయు నన్నుగాంచి కం
తుని పరి కోర్వలేక • విసి • దూపిలు చుండెను దానిఁ దెల్పుమా.

మ॥ శివకోదండ విఖండన క్రియను ని • ర్వర్తించు టాలించి యా
నవ కందర్పుఁడె యౌనొ కాఁడొ యనుమా • నంబయ్యెఁ గాకున్న నూఁ
కువ జీవంబుల వీడనుంటి నని నా • కుం డెల్పెఁ • దర్వాతఁ దేఁ
కువ నీవార్తను నమ్మకంబొదవ వా • క్రువ్వందగున్ మారుతీ!

మ॥ ఘన మత్త ద్విప కుంభయుగ్మము క్రియన్ • గర్వంబుతో నొప్పు స్వ
స్తన దుర్గంబుల మోవలేక యసదై • జవ్వాడు మధ్యంబుతో
జనకాస్థానముఁ జేరవచ్చు తరుణిన్ • సౌదామినీ వల్లికన్
గను విన్నాణము గూడ నాయమకు వే • డ్కం దెల్పుమా మారుతీ!

ఉ॥ కానకు నేగుదెంచు తఱిఁ • గాంతయు వెల్వడ నింతదాఁక స
న్మానముతోడ నాకుఁ బరి • ణామ సుఖంబులఁ గూర్చుచుంటి వీ

పై నధికార్తి గూర్పఁ జల • పట్టితివా? యన నాథుజంబులన్
మానుగఁ గూర్చుకొంచు వ్యస • నమ్మున పూనుట జ్ఞప్తి సేయుమా.

ఉ॥ రాజ్యరమం ద్యజించుచు న • రణ్యము చేరఁగనున్న నాథః నీ
ప్రాజ్య సుఖంబు లన్నిటికి • భంగము నేఁ గలిగింతునేమొ? నన్
ద్యాజ్యముసేయ సర్వము ను , ఖాస్పదమై చనునేమొ? యంచు సా
యుజ్యముకై తలంకి నెగు • లొందిన చందము దెల్పుమారుతీ!

చ॥ పురమును వీడి కానలకుఁ • బోయెడివేళ సుధాంశు మండలం
బొరసెడు కోట వాకిలికి • నొప్పుగ వచ్చెడు మున్నె పాదముల్
విరనిరవోవ నిల్చి 'యట • వీస్థలి యెంతగ దవ్వొ' యన్న భూ
వర తనుజాతకిద్ది విను • వానము పుట్టఁగఁ బల్కు మారుతీ!

మ॥ అని యీరీతిగ నానవాళ్ళు గల వా • క్యంబుల్ నిరూపించి పా
వనికిన్ ముద్రిక నిచ్చి కార్యమెదియుం • బ్రత్యూహము ల్లేక గ్ర
మ్మన గావించి ప్రమోదదాయివయి ర • మ్మా యంచుఁ బల్కఁగా మరు
త్తనయుం డాదట మ్రొక్కి రామ కరుణా • దరోప్తద్ధతిన్ వెల్వడెన్

మ॥ పర దేహ క్షితి వాహినీ హఠమునన్ • భంగించి భాస్వద్యశ
స్కర సస్యంబులఁ బంటవెట్టుటకు ను • త్సాహంబుతో నంగదా
ద్యరి దుర్వారులు కీశరాడ్వరుని • స ప్తార్వాన్వయాబ్ధిక్షపా
కరులన్ వీడ్కొని మ్రొక్కి వెల్వడిరి వ్య • గ్రస్ఫూర్తిఁ గుప్పించుచున్.

## 11 బిలనిర్గమన పటలము (74)

తే॥ తరణిసుతుని యాదేశమౌఁ దలను దాల్చి • యంగదాదులు వెదలు న • నంతరంబు
తక్కిదిశలకు వినతాది • తరుచరులును. పరవు నుత్సాహగరిమతోఁ • బయనమైరి.

తే॥ తక్కిదిశల కేగినవారిఁ • దదవనేల?, పట్టుదలతోడ దక్షిణా • పథముఁ జేరు
నంగదాదులు చనిచని • యవనిజాత, వెదకు తమితోడఁ జేరిరి • వింధ్యగిరిని.

ఉ॥ * చెందిరవన్నెతో మణుల • చెన్నగు కాంతులతోడ సాంద్రమై
సందియ వన్నియం బిలుకు • చక్కని యంబరమట్లు వెల్గుచున్
జందురు నిర్ఝరంబులను • సర్పచయంబులఁ బొందియుంటచే
నిందు ధరాగ్రచూడమను • నేత్రైల నొప్పిన వింధ్యఁ జేరుచున్.

చ॥ గిరి కుహరంబులన్ మణి వి • కీర్ణ విభాసిత సానుదేశముల్
గురు శిఖరంబులన్ వెదకె. • గోఁతుల మూఁకలు పెక్కునాళ్ కే

---

* పూర్వపటలములోని స్థలవిరుద్ధవర్ణనములే యిటమంది కలవు

నరయఁగరాని యా కుధర • మంతయు నొక్క దినంబులోననే
పరువుచు నెందు చూచినను • వానర సేనయె తోఁచునట్లుగాన్.

చ॥ పుడమికిఁ జేలయౌ నుదధి • పొంకము నొందిన కీశరాజి యా
పుడమికుమారి మించులను • భూషలఁ దాల్చిన కారుమబ్బు నా
నడరు కురుల్ ప్రకాశిలు వ • రాంగిని రాముని రాణి రోయుచున్
విడువక వేసటం గొనక వింధ్య గిరీంద్రముఁ జుట్టి రత్తఱిన్.

ఉ॥ కొండలు వ్యోమమందెగసి • కొండలు డిగ్గుచుఁ గొండ తెక్కుచున్
గొండలు కుంజముల్ గుహలు • కొండలు శుద్ధ జలాశయంబులన్
గొండలు నిర్ఝరీ దరులఁ • గోరిక రోసిరి చూడకుండు తా
వందునఁ గల్గనేని యది • యంబుజ సంభవు సృష్టి కానిదే.

చ॥ పృథివికి మేల్కొఁగూర్చి ఫల • విస్తృతిచేఁ బొగడొందు దక్షిణా
పథమున మైథిలిన్ వెదకు • వానర వీరులు, కారు మబ్బులన్
బ్రథితముగా లలాయములు • భాసిల గుర్తెఱుఁగంగరాని య
వ్విధమున నొప్పు నర్మదను • వేగమ డాసిరి ప్రీత చిత్తులై

క॥ అంచలు క్రీడించెడి ప, ట్లంచితముగ దేవకాంత • లాడెదు చోట్లన్
గాంచిరి మధువానిన యళి, సంచయములు రొదలు సేయు • సముచిత తలముల్

సీ॥ ధరణిజాన్వేషణ • తత్పరులగు కపుల్, నల్లసైకతమును • నౌరు కురులు
నీలాలకములను • రోలంబ సంతతుల్, ముసరిన ముఖ తామ • రసచయములఁ
దరఁగలు త్రోవఁగా • దరుల సరులుగాఁగఁ, గొదరు ముత్తెములను • రదనములను
హంసయానంబుల • హరిణ నేత్రంబులఁ, గనిన వారలె కాని • కలికిమిన్న

తే॥ గాత్రమును పూర్ణముగ నెందుఁ గానరైరి. తవిలి మదకరులను కరే • ణువులు గలిసి
మదము తోడఁ గ్రీడించు న • ర్మదను దాఁటి యవలికిం బోయి రెల్లెడ • నరయు నాన.

ఉ॥ రత్న మయూఖరాజి జిగి • రాజిలు శృంగములందు పుట్టుచున్
బ్రత్న పథంబులన్ వఱలు • పావనులంబలెఁ బాఱు నిర్ఝరుల్
నూత్నరుచుల్ తొలంకు సుమ • నో • వర ఖేటము హేమకూటమున్
యత్నముతోడఁ గీశుల ధ • రాత్మజ రోయఁగఁ జేరి రాదటన్.

తే॥ పరిసరంబుల యందున్న • తరుల గిరులు, తక్కు వస్తు జాలంబులు • తమ నిసర్గ
వర్ణముల వీడి యపరంజి • పగిది వెలుఁగు, చుండుఁ గాన స్వర్గంబుతో • నొప్పుమీఱు

తే॥ అచట వసియించు మృగపక్షి • నిచయములకు, నందుగల హేమరజముపై • నంటికొనఁగ
మేరువందలి వస్తువుల్ • మెఱయు లీలఁ, గాంచనమయంబులై ప్రభా • కరములయ్యె.

క॥ బంగారు రేణువులతో, రంగారు జలంబు పద్మ • రాగ మణులతో
దం గూడి పాఱ నగ్నిం గ, రంగిన బంగరువువోలె • రాజిలు గిరియున్

తే॥ క్రమ విద్యాధరాంగనా • గానరవము నిర్ఝరీ నటచ్ఛరణ స • న్ని యతరవము
ఘీంకృతులు గర్జనముఁ బ్ర • కీర్ణమగుచు హేమకూటంబు గౌరవ • హృద్యమయ్యె

తే॥ దనుజు వాసస్థలం బిందు • తనరు ననుచు ధరజ గన్పడునంచు మో • దమున నుబ్బి
కొంద రాడిరి నెగురి • కొంద ఱసుర పైని కోపానఁ గనులెఱ్ఱ • పఱచినారు

తే॥ ఈమహీధరమున గోల • నేణనేత్రఁ దెలియఁగలము రాముని చింత • దీర్పగలము
పొదఁ డనుచు నుల్లముప్పొంగ • వెసకఁ గోరి గిరివరం బధిరోహించి • కీశవరులు

తే॥ జరగు చుండఁగఁ గని కరి • శరభ సింహ, భల్ల శార్దూల నికరముల్ • భయము నెంది
పొదలఁ దూఱుచు నుండఁగఁ • బూవుఁబోఁడి వెదకి కానఁగ నేరక • విసువు పుట్ట

ఉ॥ అంబర చుంబితం బయిన • యగ్గిరి యంతట రోసి క్రూర స
త్త్వంబుల కాకరంబయిన • పర్వత మియ్యది దైత్యనాథు వా
సం బిట లేదటంచుఁ గపి • సత్తము లయ్యెడనుండి క్రిందికిం
బంబిన చండ వేగమున • వచ్చిరి క్రమ్మఱ దేవిఁగానమిన్

తే॥ అంత నంగదాదులు సైన్య • సంతతిఁగని మీరు పడమటి తీరంపు • మేదినీ ధ
రముల వెదకి మహేంద్ర ప • ర్వతమునందు మమ్ము గలిసి కొనుం డని • నెమ్మినంపి

ఉ॥ పావని జాంబవంతుఁడును • వాలిసుత ప్రభృతుల్ జిగీషువుల్
ధీవరు లొక్కటొక్కెుఁ దొలి • దిక్కుగఁ బాయ వహించి పోవుచున్
ద్రోవను వారి శూన్యమయి • దుస్తరమై హరిదశ్వుఁడేనియుం
బోవఁగ జంకు కొంకు గొను • పోట యెడారిని గాంచి రొక్కెడన్

చ॥ మృగములు లేవు పక్షులును • వృక్ష లతాదులు లేవు రాలు నీ
ఱుగఁ బయికేగుచుండు నట • రోసిన వెల్పలినుండి వచ్చునే
తెగ యగు వస్తువైనఁ బడి • త్రెళ్ళి పదంపడి బూది యౌచు నా
శుగమునఁ జేరి పై కెగయు • సూక్ష్మ రజంబగు వేఱు లేదటన్

చ॥ తెలియక యేగినట్టి కపి • ధీరుల యింద్రియ రాజి బెగ్గిలన్
దెలివియు నామమాత్ర మగు • దేరఁగ గాత్రము లుక్కి దూపిలన్
బొలుపఱ తప్తకుంభమున • బ్రుంగి తపించెడు పాపులంబలెకా
వెల వెల పోయి తాపమున వెక్కసపాటు వహించి రయ్యెడన్

ఉ॥ నాల్కలు వెళ్ళఁబెట్టి చర • ణంబుల బొబ్బలు వోవ స్రుక్కుచున్
బల్కఁగ లేక కాలిడఁగ • బాధల నొందుచుఁ దూలిసోలుచున్

విల్కాడ దప్పి బాణలిని • నివ్వెరి పేలల • మాడ్కి మాఁడుచున్
బెల్కుటి జీవితాశలను • వీడిరి తప్పెదు త్రోవ లేమిచేన్

ఉ॥ ఆశ్రయమంద నీడ యిసు • మంతయు లే దసువుల్ తొలంగుచే
ప్రశ్రయమందఁగాఁ దగిన • పద్ధతి యంచుఁ దలంచి లేచుచే
నేశ్రమ మందియైన వెలి • కేగఁ దలంచి కడంక సేయఁగా
నాశ్రమరీతిఁ గన్పడె గు • హాముఖ మొక్కటి యంత వారికిన్

చ॥ ఎదరునఁ గల్గు నీమెదరు • నేక్రియ దాఁటఁగ జాల వారమో
పుడమికుమారి నేపగిదిఁ • బోయి కనుంగొను వారమో కటా
యెదవు నెపెట్టులో కడచి • యేగి గుహాముఖమందు చొచ్చినన్
బదలిక వోవు భూసుతను • బాలిశుఁ డచ్చట దాఁచెనే మొకో?

చ॥ అని పలువంతలం బడుచు • నా కపిముఖ్యులు తమ్ము భాస్కరుం
డనువుగఁ బట్టి దప్పికయు • నాఁకలి దీఱఁగ మ్రింగు నన్ని భీ
తిని గొని సేమమందు పగి • దిం గని చీఁకటి గుంపు లిచ్చటన్
దనుకఁగ డాఁగె నన్న క్రియఁ • దారు గుహాంగని చొచ్చి రత్తఱిన్

ఉ॥ పోయిరి కొంతదవ్వు మఱి • పోవఁగలే కడుగ్గైనఁ బెట్టఁగాఁ
బోయిన మార్గమున్ మఱియుఁ • బోవఁగ మార్గము తోఁపలేదు వ్రేఁ
గై యిరవొంది పేరి విల • యంబు గడింపని చిమ్మచీఁకటిన్
దాయము నొంది యొందొరుల • దాయఁగఁ జూడఁగలేక యూర్పుచున్

శా॥ కర్తవ్యంబును విస్మరించి తత ది • గ్భ్రాంతాత్ములై భీతిమై
నార్తత్రాణపరాయణాత్మక! జగ • త్త్రాణప్రియా! కావవే
మూర్తంబై తగు కాళరాత్రి పగిదిన్ • మ్రొగ్గించి బాధించు నీ
యార్తిన్ మాన్పఁగ నీవ దిక్కని కపుల్ • ప్రార్థింపఁగా నాతఁడున్

శా॥ మీకున్ జీవము లిచ్చెదన్ దిటవుమై • మీరెల్లరుం గూడి నా
తోఁకం గట్టిగఁ బట్టికొంచు వెనుకన్ • దోయంబుగా రండు శో
కాకంపంబులు మానుఁడం చతఁడు హ • స్తాంభోజముల్ చాఁచి ఘో
రాకారాంధక మార్గముం దడవె సం • ప్రార్థించి సీతాపతిన్

తే॥ ఆఱుగ సుతుండు దొడ్డ దే • హంబుతోడ మెఱుపుఁ బోలిన వోగుల • మిసిమి తనకుఁ
త్రోవఁ జూపుచుఁ జీఁకటిఁ • దొలఁగఁజేయ వేగ నడచెను ప్లవగులు • వెంబడింప

## కపులు స్వయంప్రభ మేడను కాంచుట

చ॥ కపులు బిలంబులో నడచి • కాంతి జగత్త్రయి కిచ్చుచుండు నా
తపనుఁడె నిల్చి పాలన వి • ధమ్ము నొనర్చు పురంబొ? స్వర్గముం

మ॥ ఋజుమార్గప్రవణుల్ కపీంద్రులు మహో • త్కృష్టప్రభాపుణ్య పాం
ద్యజగంబందు మెలంకువం దిరిగి సీ • తాన్వేషణ స్ఫూర్తిచే
భుజముల్ పాదములున్ జలించుచును నొ • ప్పుల్వొంద నిర్విణ్ణులై
నిజ జీవంబులు పీడువారివలె గా • నిం బొంది రప్పట్టునన్

ఉ॥ దక్షిణ వార్ధి తోయ కణ • తర్పిత శీతల వాత పోతముల్
శిక్షణమొందినట్టి వహిఁ • జెంది సతంబును వీచుచుండ పాం
డ్య క్షితి దాఁటి కీశులు క • డంకను చేరి మహేంద్రశైలమున్
లక్షణ లక్షితాంగి మహి • శామణి రోసిరి యెల్లచోటులన్

## 13 సంపాతి పటలము (66)

ఉ॥ కాంచిరి వానరుల్ కడఁక • గర్జన సేయుచు నింగిదాఁక ని
క్కించిన దీర్ఘ పీచలను • కేలను చాఁచి కురంగనేత్ర పూ
ఞాంచితగాత్ర జానకి ధ • రాత్మజ యున్నది లంకయందు వీ
క్షించఁగ రండు రండనుచుఁ • జీరెడి కైవడి నొప్పునంబుధిన్

తే॥ కలిసికొనఁ బల్కి పంపిన • కపిచయంబు లన్ని దెసలను వెదకుచు • నవనిజాతఁ
గాంచనేరక వచ్చి యా • గ్రావమందు, కడకు నంగదాదులతోడఁ • గలిసికొనియె

తే॥ కలిసికొని యందఱుంగూడి • కమలనేత్రఁ గుటిలకుంతల నెందుఁ గ • న్గొనఁగలేమిఁ
గర్జమియ్యది యని మదిఁ • గాంచలేమి, దూపటిల్లుచు నాల్కలు • తొట్రుపడఁగ

తే॥ తేఁడొసంగిన గడువు మీ • తినది కాని కార్యమో వట్టిదయ్యె రా • ఘవుఁడు విన్న
నసువులను పీడు మనచేత • నగునదేది?, చెడితి మెల్లవిధంబులఁ • జిటవివర

తే॥ పొసఁగ నిందె తపింతమా? విసముమ్రింగి చత్తమా? యేదియుచితంబు? వావెమేలు
పోయి చచ్చుటకంటె నీ • భూధరమున విలుగుటేయుఱవని వారు • తలఁచుచుండ

తే॥ అపుడు యువక పంచాస్యమౌ • నంగదుండు గిటులు పరుసలై యపరిగ • కరణినున్న
వనచరులఁగని తనకుఁ దోఁ • చిన విధంబు నిట్లువాక్రుచ్చెఁ జింతాకు • లేక్షణుఁడయి

మ॥ దివియున్ భూమియు నెల్లెడన్ వెదకి సీ • దేవిన్ సమీక్షించి వా
చవు లూరంగ వచింతుమ య్యవనిజా • సందేశము నీకు రా
ఘవ! యంచుం గడు జాణలంబలె నన • ర్ఘ ప్రజ్ఞలం బల్కి యా
పవిదిం జేయఁగలేక మాటపడఁగం • బాలైతి మిప్పట్టునన్

ఉ॥ చేసెద మన్న కార్యమును • చేసి ముగింపము మేరమీఱు ము
న్నే సతి గానరాదనుచు • నేగి వచింపుము పూనియే సనం

ఆ॥ భోగి భూమి యనుచు • బుద్ధి నూహించుచు, నగును కాదటంచు • నరగలిగొని
తుదకు నిద్ధి శుద్ధ పదము స్వర్గంబని, నిశ్చయించి మఱియు • నిలకలేక

సీ॥ స్వర్గలోకమె యైనఁ • జావు గలుగలేదు, జన్మముల్ సద్విధి • జరుపలేదు
రణరంగమున నన్మ • రణమొందఁగాలేదు, జరిగిన విషయముల్ • మఱవలేదు
సందేహమును నిమి • షత్వంబు నున్నది, స్వేదంబు నున్నది • చిత్రమయ్యె
నని విచ్చపడఁగ బు • ద్ధ్యుఁ డిట్లను రాము, దేవిఁ దెచ్చిన దొంగ • పావి కపటి

తే॥ మనలఁ దగిలింప నుంచిన • మాయ గుహయె, గాక వేఱేది? మన పాప • కర్మవశతఁ
జిక్కితిమి తప్పికొని పోవు • చెన్ను లేదు, చావుదప్ప దనుచు నోరు • చప్పరించె.

సీ॥ పావని యది విని • భల్లుకేంద్రుని గని, మరలి వెల్వడుట దు • స్తరముగాఁగఁ
దోఁచిన సగర పు • త్త్రులఁబోలె ధాత్రిని, త్రవ్వి బిలముచేసి • తలఁగి పోవ
మటు గాదయేని యీ • పటుమాయ లొనరించు, దనుజాల వ్రమందించి • తలఁగి పోద
మంతరిక్షంబున • నన నదిమేలని, యంగదాదులుపొంగి • యంగవింపఁ

తే॥ బట్టణంబు లోపలియెల్ల • భాగములును, వనచరులు పరీక్షించుచుఁ • జనుచునుండ
వినుత తపమె స్త్రీరూపంబు • గొనియెననఁగ, నొప్పుజటిలస్వయంప్రభ • నొకతెఁగనిరి.

సీ॥ తరుణి వల్కలములఁ • దాల్చి చక్రంబుల, పగిది బంగరు గిండ్ల • భాతి నమరు
పాలిండ్లపైఁ బైఁట • వన్నెతొఱఁగి ధూళి, పటలి గప్పఁగ నొప్పు • వాసియుండ
రక్తాంచలంబులై • రాజిల్లునేత్ర ద్వ, యంబు నాసికాగ్రంబుఁ • జూచుచుండఁ
బద్మాసనంబున • భాసిల్లి శ్వాసంబు, నణఁచి మధ్యం బెగ • యంగ నిలిపి

తే॥ కేలుదమ్ములఁ దొడలపైఁ • గీలుకొలిపి, శత్రుషట్కంబుఁ గూల్చియు • క్షమలఁగెల్చి
పాంద్ర దీర్ఘకోమల శిరో • జములు జడలు, కట్టివ్రేల నిశ్చల రీతిఁ • గ్రాలుచుండె.

మ॥ కపు లామెం గని భక్తి భావన నమ • స్కారంబు గావించి మేల్
తపముం బూనిన యీమెయే నిజము సీ • తాదేవి యంచుబ్బి మో
ద పరీతాత్మకులై సమీరసుతు చెం • తన్నిల్చి వీక్షించి యీ
యపయే జానకి యౌనొకో తెలుపవే • యన్నంత నాతం డనున్.

ఉ॥ జానకి యంగ చిహ్నముల • జానుగ రాముఁడు తెల్పెవాన నొం
డేనియు నీమెయందు రహి • యింపవు పెక్కులిఁకేల? యెమ్ములం
బూనుచు దండ ము త్తెములు • పోహణ చేసిన దండతో సమం
బేని విదేహరాట్పుత్రకు • నీయమ సాటి యనంగఁ బోల్పదున్

క॥ అని వచియించుచుండఁగ స్వ • యంప్రభ యోగ సమాధినుండి మే
ల్కని యెదురం గంట్టి కపి • కాంతులఁ గిన్కవహించి చూచి కాం

చన మయ పట్టనంబునకుఁ • జక్కఁగ వచ్చిన మీర లెవ్వరె
ప్పనికయి యిందు వచ్చితిరి • పల్కుఁడి యన్న వచించి రివ్విధిన్.

ఉ॥ రావణుఁడన్ దురాత్ముకుఁడు • రామునతిన్ హరియించె మాయచే
దేవిని రోయఁబంపె జగ • తీధవుఁ డాతని దూత లేము ధ
ర్మావన దక్షు నాజ్ఞగొని • యద్రులు కానలు పట్టనంబులున్
భూ వివరంబులు న్నెమకఁ • బోయెదు వారము సత్తపస్వినీ!

తే॥ అనుడు నామెయు లేచిప్రి • యంబుమీఱఁ గాంచి మీరాకశుభమగుఁ • గాక యనుచుఁ
గనులనుండి ముదశ్రువుల్ • గాఱుచుండ, నొక్క యుత్కంఠ జనియింప • నుత్సహించి

క॥ పలుకుఁడి రాఘవుఁ డెచ్చటఁ, గలఁడని ప్రశ్నించునంత • గాడుపుకొడుకా
జలజాక్షికి రాముని కత, దెలిపె సమస్తంబు మిగులఁ • దేటపడంగన్.

తే॥ విని స్వయంప్రభ నాతప • మినకులేశు, చరిత వినుటచే ఫలియించె • శాప మీఁగె
ననుచు స్నాన పానముల మృ • ష్టాన్నములను, తనియ నిడె మృదువాక్కుల • వనచరులకు

తే॥ అంత మారుతి యామెకు • నర్థిమ్రొక్కి, నీదు పేరేది? యీపురి • నేత యెవఁడు?
తపము సేయఁ గారణమేమి? తల్లి • తెలుపు, మనుడు నయ్యామ యిట్లను • హనుమఁగాంచి

ఉ॥ ఏణ ముఖుండు దొడ్డదను • జేంద్రుల శిల్పి మయుండు గేహ ని
ర్మాణ విశారదుండు జల • మారుత భోజనుఁడై తపించి సం
త్రాణ పరాయణుం డయిన • బ్రహ్మవరంబున నీ పురంబు గీ
ర్వాణులు మెచ్చఁగాఁ గొని ప్ర • వాసము మాని వసించె నియ్యెడన్

ఉ॥ దానవుఁ డంత హేమ యను • దాని సురాంగనఁ బొందఁ గోరినే
దానికిఁ బ్రాణమిత్ర నగు • దానను కావున నన్ను మిక్కిలిన్
దీనత వేఁడ నాయమను • దేవజగంబుననుండి తెచ్చి యీ
మానిత కందరాని గుణ • మానితుఁ జేర్చితిఁజేర్మిగూర్చితిన్.

ఉ॥ కూరిచినంత హేమఁ గవ • గూడి సురారుల శిల్పి ప్రేమ దై
వారు జలాశయంబులను • పర్వత కందర సీమలన్ మనో
హారి హిరణ్మయంబులగు • హర్మ్య తలంబులఁ జాలకొలు మి
చ్చారతిఁ దేలుచుండఁ జెలి • సంగడి పాయక యింద నిల్చితిన్.

చ॥ నిలిచిన యంత దేవగణ • నేత యొకానొకనాఁడు నాదు నె
చ్చెలి వసియించు చోటెటిఁగి • చిందఱతో నరుదెంచి యంతటన్
బలియుని దైత్యకారువును • వజ్రముతోఁ దెగటార్చి హేమపైఁ
దలకొని సీవొనర్చినది • తప్పని కోపము చేసె మారుతీ!

ఉ॥ కోపముచేసి హేమఁగని • కూడని యీపని యెట్లు కూరెనో
దాఁపక తెల్పుమన్నఁ గను • వమ్ముల సంజ్ఞను విద్రుమోష్ఠి నన్
జూపుచు దీనిచే నయిన • చొప్పని చెప్పిన నన్ను గాంచి యా
గోపతి యింద యొంటిమెయి • గొందలమందఁగఁ జేసె నానతిన్.

ఉ॥ ఆనతిసేయ నాతని ప • దాంబుజ యుగ్మము మీఁద వ్రాలి నా
పై ననుకంప యుంచి చెడు • బంధ విముక్తి యనుగ్రహింపనే
నా నతఁ డక్కసున్ విడిచి • నాతిరొ। రాముని యాజ్ఞ వానరుల్
జానకి రోయ రాఁ దొడరు • సద్గతియంచు వచించె నాయనా।

చ॥ ఇచట భుజింపఁగా ఫలము • లిచ్చ కొలందిని గల్గుఁ బూయఁగాఁ
బ్రచుర పరీమళంబులగు • బంధుర గంధ కలాప మబ్బుఁ బు
ష్పచయము భూషణంబులను • వన్నియ వల్వ లవెన్నియున్న రో
యుచు భవ దాగమంబు పొలు • పొందఁగఁ గోరి తపించుచుండితిన్.

చ॥ అధిక విశాలమైనది గు • హాంతర మంబర వీధి కేగు చే
విధమొ యెఱుఁగలేను దయ • వేఁడెద మీర లనుగ్రహించినన్
బధము లభించు నేఁ దనఁబ్ర • భంజన సూనుఁడు లేమఁ గాంచి నేఁ
బ్రథిత హితంబు చేసెద న • పార గుణాలయ: చూచుచుండుమా।

చ॥ అనవుడు నంధతామసము • నందు మునింగి మనుంగ నున్న మ
మ్మనువున నీబిలంబున ద • యామతిఁ గాచితి వట్ల యిప్పుడున్
వనితను మమ్ముఁ గావ నొక • పద్ధతి చూడుమ యంచు వానరుల్
పనివడి వేఁడ మారుతి య • పార కృపారసమూర్తి యంతటన్.

చ॥ భయపడనేల యంచు మృగ • వల్లభుఁబోలెఁ బరాక్రమించి య
మ్మయ ఘనమండలంబు నడు • మానము బిట్టవియంగ పర్ధిలన్
మయిమయి కందరంబు పయి • మాడుగు పట్టని వ్రీలి దిక్తటుల్
పయికొని నింద గ్రావముల • బ్రద్దలు వోయెను జివ్వు జివ్వునన్.

చ॥ పడిగొనఁ జాఁచు కేలు నిజ • వక్త్రగుహా విశితోగ్ర దంష్ట్రలన్
వడువునఁ గ్రాలఁ బైకి వెలు • వడ్డ మరుత్సుతుఁ డప్పు డొప్పె మున్
పుడమి సముద్ధరించు తఱిఁ • బొల్చిన యాది వరాహమూర్తికై
వడిఁ గనుఁగొన్న చిత్తములు • భ్రాంతియు నబ్రము జివ్వ యొందఁగన్.

మ॥ అరవిందా సనసృష్టియం దమరు ర • వ్యాది గ్రహాధిష్ఠిత
స్ఫుర దాకాశ శిరోగ్రముం బొడిచి నం • శోభిల్లు సామీరి, యు

ర్వర పాదత్రయి వేఁడి యంత జగదా • క్రాంతంబుగాఁ బెంచు శ్రీ
హరి పాదాంబుజముం బలెన్ వెలిఁగె న • త్యాశ్చర్య సంధాయియై

తే॥ ఇట్లు బిలము భంజించి పై • కెగసి దానిఁ బడమటి సముద్రమునఁ బాఱ • వైచి ప్రళయ
జలద నినదంబు పగిది గ • ర్జనము చేసె నమర నిచయంబు భయ విస్మ • యంబులొంద

చ॥ బిల నగరంబు పశ్చిమ కృ • పీటనిధిం బడి యుండు నేఁటికిన్
బిలమను పేరి దీవియయి, వేడ్క స్వయంప్రభ కీశవర్యులన్
బిలముననుండి భూస్థలికి • వెల్వడఁ గల్గిరి హేమ యున్న వే
ల్పుల నగరంబు చేరఁ దల • పోసి పరాంగన కాంచి మారుతిన్

తే॥ గురు గుణంబులఁ బెక్కుభం • గులను మధుర, వాక్కులం నుతించి మేరుసా • వర్ణిపుత్రి
యగు స్వయంప్రభమేలు మీ • కగుతమనుచుఁ, బలికి దేవలోకమునకుఁ • బయనమయ్యె

తే॥ వీరులగు కపుల్ హనుమంతు • వివిధగతులఁ బొగడుచుం బాదచారులై • పోయిపోయి
యమల జలపూర్ణమైన ప • ద్మాకరంబు నరసి చేరంగ భానుఁ డ • స్తాద్రిఁ జేరె

## 12 మార్గాన్వేషణ పటలము (55)

తే॥ చేరి వానర పుంగవుల్ • చేర లొడిసి జలములం ద్రావి తటములఁ • గలుగు తేనె
పండ్లు మెసవి విశ్రాంతికై • యెండి నిదుర సేయు నచటికి వచ్చె దై • తేయుఁ డొకఁడు

తే॥ పొడవునం బర్వతంబు రూ • పునఁ బయోధి, హింసను సమవర్తియు • నీడుకారు
క్రౌర్యములకుఁ గాణాచి రా • క్షసుఁడు చండ, కోపుఁడై కాలకూటంబు • కోపుగలిగి

తే॥ వారివాహములను వాని • బాహుయుగ్మ మొరయుచు తమున జాఱుతుం • పురులుమేన
ధారగాఁ గాఱ నుదకి పా • తంబుతోడఁ జెలఁగు నడగొండయన వచ్చెఁ • బొలనుదిండి

ఆ॥ వేల్పులకును మొదటి • వేల్పులకును గెల్వ రానివాఁడు దురభి • మాని యెదురు
వారు లేమి మత్త • వారణ లీలను తిరుగుచుండు వాఁడు • దిమ్మరీఁడు

తే॥ పుష్కల సుతుండు ధూమ్రుండు • పూర్ణ గర్వి ధర్మచింతనపరులు ప • థిశ్రమంబు
వలన నిద్రించు వారలౌ • వానరాలిఁ, గాంచి విధివశమున వారి • కడకు వచ్చె

తే॥ ఈ తటాకంబు నాదని • యెఱిఁగియుండి వచ్చి నిర్భీతి నిట్లున్న • వారలెవరు?
చావఁదలఁచిరేయని యుగ్ర • చంచలుఁడయి గాఢముష్టినంగదుని వ • క్షంబుఁబొడిచె

తే॥ అంగదుఁడు నిద్రమేల్కని • యసురఁగాంచి, పంక్తిముఖుఁడని శంకించి • పట్టి యొడ్చి
మాఱు దెబ్బ యొకండీయ • మడిసెవాఁడు విలవిలం దన్నికొని నాల్క • వెడలఁబెట్టి

తే॥ వజ్రహతిఁ గూలు పెనుగొండ • పగిది నసుర చావుకేకతో మేదిని • సంచలింపఁ
బడఁగ నిద్రలో నుండిన • ప్లవగులెల్ల, లేచి పొలసుదిండి శవంబుఁ • జూచినారు

క॥ మారుతి తారాసుతుఁ గని, యారక్కసుఁ దెప్పఁ డిచటి • కేలా వచ్చెన్
ఘోరం గారణ మేమన, నారఁగ నేనెఱుఁగ ననుచు • నంగదుఁ డనియెన్.

చ॥ అది విని జాంబవంతుఁడు మ • హాబల నందనుఁ గాంచి యిట్లనున్
మదయుతుఁడైన వీఁడు బలు • మానిసిదిండి దురాత్ముఁ డీ జలా
స్పదమునఁ గాచియుండి యిట • వచ్చిన ప్రాణులఁబట్టి మ్రింగుచున్
గొద వదలించుకోఁ దొడఁగు • క్రూరుఁడు ధూమ్రుఁడు నాఁగ నందఱున్

చ॥ ఇతనిని పోలు రక్కసు లి • కెందఱు గల్గుదురో• దురాత్మకుల్
మతకరులాట నేమఱిన • మాఁదుత్తురు మేల్కనియుంట భావ్యమౌ
నితమని మెచ్చటాడుచును • వేడుక నుండఁగఁ దోల్తెసం ద్విషాం
పతి యుదయించె రాఘవుని • పత్నిని రోయఁగఁ బోయిరాకపుల్.

ఉ॥ ఉన్నత సైకతస్థలప • యోధరముల్ వికచాంబుజాస్యముల్
తిన్ననియుత్పలాక్షములు • తేటగు మౌక్తిక దంతపాళి యా
పెన్నది కుంటఁ బెన్నది • బిత్తరి నాఁ గనుపట్ట రాము నా
పెన్నది తీరమందు కపి • వీరులు రోయుచుఁ జేరి రిమ్మగన్.

ఉ॥ రేవులలో మయూరములు • రెచ్చి నటించుచునుండు చోటులన్
దీవులలోఁ బరీమళము • తేనెయుఁ జిందు వనంబులందు నా
ఠావులలో వినిర్మల త • టాకములన్ స్ఫటిక స్థలంబులన్
దేవులలో వినూత్నమణి • దీపిక రోసిరి వానరోత్తముల్.

చ॥ లలిత సమీర పోతకము • లం జనియింపఁగఁ జేయు నంచ దో
లలఁ బొలుపారు నిర్మల జ • లంబుల మజ్జన మాచరింపఁగాఁ
దొలఁగని జన్మ దుఃఖములఁ • దోర్చి సుఖంబులఁ గూర్చు పెన్నన
ద్బలిముఖు లొయ్యనం గడచి • వచ్చిరి దక్షిణ తీర భూమికిన్.

ఆ॥ నదులు గిరులు యురులు • పొదలును దరులును, దెరువులును మఱువులు • నరసికదళి
ముగిరి కేగునట్టి • పురుషులకరణి ద • శార్ణ దేశమునకు • జరిగినారు.

తే॥ చంపక ద్రుమములచేఁ బ్ర • శస్తి గాంచి. వివిధ ఫలవృక్షములచేత • వినుతిగన్న
యా దశార్ణ దేశంబెల్ల • నరసి శుక్రుఁ. డుదితుఁడైన విదర్భకుఁ • గదలినారు

తే॥ పల్లెపల్లె యూరూరును • ప్లవగవరులు, పక్షమున జన్నిదంబులు • వఱలుచుండ
గేల దర్భలఁ గొని ముని • వాలకమ్మ. లూని వెదకిరి రాఘవ ధ్యానమొప్ప.

తే॥ శాలి పండు విదర్భ దే • శమును దాటి, యాత్మరూప జిజ్ఞాసా మ • హాత్ములైన
తపసి వరులు మిక్కిలి యున్న • దండకాఖ్య. వనమునం బ్రవేశించెను • వనచరాళి.

తే॥ బయలి యింద్రియ జ్ఞానంబు • పరవుచున్న, నంతరింద్రియ శక్తుల • నణఁచుకొన్న
ఋషులు గల దండకాటవి • యెల్ల వెదకి, ముండకాటవి చేరిరి • ముదిత వెదక.

ఉ॥ అందలి సారసాకరము • లందమరాంగన లెల్ల నిత్యమున్
జందన లేపముల్ తొలఁగ • స్నానము చేయుటచే జలంబులున్
గందము నొంద మీలు తమ • కంపును వీడుటఁబట్టి పక్షులున్
జెందపు వానిఁ గైకొని భు • జించెడు కోరిక మానసంబులన్.

చ॥ హితముగఁ గోదెకొంద్రురకు • నింపును గూర్పఁగ నెంచి కిన్నరీ
వితతులు వీణమీటుచును • వేడుకఁబాడ వియోగినీ సతుల్
పతులఁ దలంచి కుంది మది • వాడఁగ నశ్రులు రాల్పఁ దజ్జలం
బతితరమై మతంగజము • లాడు మడుంగులు గల్గు తావులున్.

చ॥ కలువలఁబోలు మోములు పి • కంబుల గేరు మనోజ్ఞ కంఠముల్
చిలుక పజీరు తూపులనఁ • జెల్లిన చూపులు మారు చాపమున్
గెలిచిన భ్రూలతల్ మధుర • గీతములుం గల సుందరాంగనల్
చెలువుగఁ బోఁక భ్రూఁకులకుఁ • జేర్చిన డోలల నూఁగు తావులున్.

తే॥ అరసి * పంచ సంస్కరణాఢ్య • మైన దీర్ఘ, కుంతలంబు లొప్పారు కా • కుత్స్థు దేవిఁ
గనఁగలేక యమ్మండక • వనము గడచి, పాండుగిరికి వేగమ చేరె. • బ్లవగచయము.

తే॥ అల త్రివిక్రమపాదాబ్జ • మందునుండి, గంగ్గయం దేదునుకుచున్న • కరణిఁ దోఁప
వెలయు నగ్గిరిగగనచుం • బిత మహోన్న, తంపు శిఖరంబుఁ జేరెను • తరుచరాళి.

తే॥ చంద్రచంద్రికలను గేలి • సలుపునట్టి, ప్రబల కాంతులతో నొప్పు • పాండు శిఖరి
పంక్తికంఠుని త్రొక్కిన • పరమశివుని, పర్వతమువోలెఁ దెల్లనై • పరిఢవిల్లె.

తే॥ అమృతవాణి సరోజాక్షి • యనఘు దేవి, నెచ్చటెచటఁ జూడఁగ సంశ • యించువారా
యచ్చటచ్చట గాలించి • యరసి కానఁ, జాల కగ్గిరింద్రము వీడి • చనిరి కపులు.

తే॥ భువనకంటకుఁడైన దా • నవవిభుండు, జానకిం గొనిపోవుచో • జాఱిపడిన
పుష్పహారమో యననొప్పి • పొలుపు మీఱు • గౌతమీనదిఁ గీశులు • గాంచినారు.

చ॥ పొలుపగు వీచికాచయము • ముత్తెమువంటి విశుద్ధ నీరముం
గలిగిన గౌతమీనది ర • కంబుగ జన్నపుసాల దున్ను నాఁ
గలి మొనఁ జిక్కివెల్వడిన • కన్యను రక్కసిముచ్చిలింపఁగా
నలఁగివ భూమిదేవి నయ • నాశ్రుల ధారయొ నాఁగ రాజిలెన్

---

* కొండెవేయుట, చొల్లెము పెటుట, కీలుగంటు వేయుట, కొప్పు పెటుట, వ్రేలుజడ శ్రీకేశపంచ సంస్కరణములు.

ఉ॥ కాంచన రత్న జాలములు • కన్నులు పండువుగాఁగ వీచికా
సంచయ మూడ్చిలేరఁ బెలు • చన్ గమకంబుల వచ్చు గౌతమిన్
గొంకక చూడనొప్పె ధరఁ • గొల్చెదు దారమొ గృధ్రరాజు రా
త్రించర రాజుతోఁ బెనఁగి • త్రెంచిన మౌక్తికహారమో యనన్.

శా॥ న్యాయాన్యాయవిచక్షణుల్ ప్లవగు లా • నందించి గోదావరీ
తోయంబుల్ దగఁ ద్రావి తత్పరిసరో • త్తుంగ ప్రదేశంబులన్
దోయం బొప్పఁగ జానకిన్ వెదకి యెం • దుం గానఁగాలేక మా
ర్గాయాసంబును లేక స్వర్ణనది దా • యంబోయి రుగ్ర త్వరన్.

చ॥ పసుపును నల్పు వన్నెగల • బంభరముల్ బకముల్ మరాళముల్
పసి నడయాడు క్షేత్రములు • చల్లని తావులు నీటిపట్టులున్
విసవిస నేగి చూచి మఱి • వేడ్కఁ దరించుచు నారికేల వృ
క్ష సమితి నిండు ధాత్రి తిల • కంబు కుళించము దాఁటి యంతటన్.

ఉ॥ కొంకణ దేశమున్ గడచి • కోరికఁ బశ్చిమవార్ధి చేరువన్
వంకలు డొంకలున్ వెదకి • వారక యంబరమంటి యేగి యే
ణాంకుని త్రోవ నడ్డు శిఖ • రాగ్రము లొప్పఁగ దేవపూజ్యమై
క్రుంకుడుగట్టు నాఁ జను న • రుంధతి శైలము జేరి రవ్వలన్

ఉ॥ అచ్చటఁ గాంచి యందమున • కందము గూర్చెడు సీత లేమికిన్
నొచ్చి తరించి భిల్లతరు • ణుల్ తమ తేనియ నిచ్చి గొల్లతల్
తెచ్చిన చల్ల మార్చికొను • తేటగు పచ్చల కొండ సానువుల్
చొచ్చి ధరాత్మజన్ వెదకి • గాచిరి మళ్ళిరి వేంకటాద్రికిన్.

శా॥ జ్ఞానుల్ మౌనులు జాసవాలులు మరు • న్నారీమణుల్ సాధు ల
జ్ఞానుల్ పాపులు సర్వమానవులు త • చ్ఛైలేశు నారాయణున్
జ్ఞానాతీతుని గొల్చువారు విలస • చ్చారిత్రులై వేడ్కఁ స
జ్ఞానం బూడ్చెడు పుణ్యతీర్థములలో • స్నానంబు గావించుచున్

శా॥ కామాదుల్ తెగ గోసి యింద్రియకృతుల్ • ఖండించి నిందాస్తుతుల్
సామాన్యంబుగఁ జేసి కాంతల కటా • క్షప్రక్రియల్ రోసి యు
ద్దామంబైన తపంబుసేసి మునిసం • తానంబు గోవింద రా
ణ్ణామధ్యాన పరాయణుల్ సతత మా • నందించు నాకొండపై.

శా॥ కేలన్ లీల సుదర్శనాదికములన్ • గీలించ భక్తాలికై
నీలాంభోద శరీరుఁడై వెలయు త • న్నిత్యాంఘ్రి కంజాతముల్

పోలం దాల్చిన యగ్గిరిం గల మృగం • బుల్ చెందు మోక్షంబనన్
శ్రీలక్ష్మీశు పదంబు చేరు టరుదే • సేవించు పుణ్యాత్మకుల్?

ఉ॥ ఆగిరిరాజమును దఱిసి • యంగదముఖ్యులు చుట్టి వచ్చుచున్
యోగసమాధినుండి విని • యోజిత మాధవ పాదచిత్తులై
ప్రాగఘభారముల్ తొలఁగఁ • బావనులైన తపోధనాఢ్యులన్
బాగుగఁ గాంచి తచ్చరణ • వారిజముల్ తలసోఁక మ్రొక్కుచున్.

తే॥ కుటిల కుంతల యైన కా • కుత్స్థు దేవి, నెందుఁ గనక ద్రావిడమున • కెల్లయైన
వేంకటాద్రి వదలి విప్ర • వేషములను, వెలలినారలు తొండ మం • డలము చేర.

తే॥ దేశమంతయు నటవీ ప్ర • దేశమగుట. వ్రేల యిండ్ల ముంగిటఁ బంట • చేలు పొనఁగు
నీర పూర్ణ తటాక కేదార వనము. లచ్చటచ్చట మిక్కిలి • యలరుచుండు

మ॥ పొలముల్ దున్నెడి కర్షకుల్ వృషములన్ • బోఁ గోలతోఁ గొట్టఁగాఁ
గలఁగం బాఱిన హంసముల్ పనస వృ • క్షంబుల్ తెగంబండి ఛే
దిలి యందుండి స్రవించు ద్రవ్యములు ప్రో • దింగూర్పఁ బెంపారు పై
రుల దొమ్మాడుగఁ ద్రొక్కుచుండు నవి యా • రూఢంబుగా నచ్చటన్.

తే॥ తరుణుల విశాల సుషిమ నే • త్రములఁ బోలు, నుత్పలములట శోభిల్లు • చుండుఁ; జెలుఁ
యూరువులవంటి కదళీ త • రూత్కరముల, నిద్ర సేయును పరభృత • నీడజములు.

ఉ॥ వీధుల మ్రోఁగుచుండు బహు • విశ్రుత వాద్య విరావ మేదురో
ద్బోధము నిత్యమున్ వినుటఁ • దోయద గర్జనమంచుఁ గేకులు
త్సేధము నొంద పంచలను • ధింధిమి నాదము విన్నఁ నాటపున్
బాధ భ్రమంబు గల్గునొకొ • వాడుక యౌనెడఁ బ్రాణికోటికిన్?

శా॥ శృంగారించిన కేరులం జెరయు కేఁ • కెట్లందు పూఁబాళలన్
రంగారంగని గండు చేఁపలు బక • వ్రాతంబుగా నెంచి ధీ
ఱం గాంచుం దొచ మొగ్గలం గని మహా • ర్తిన్ భేక సంఘాతముల్
క్రుంగన్ వచ్చిన జెట్టిపోతులని ని • ర్వేదించుఁ బెల్లార్చుచున్.

క॥ పీతలను పట్టుకొను కడ, జాతి చెలులు ముత్తెములవ • సం గని బక సం
జాతాండములని పగులఁగ, వైతురు తాఁబేటి చిప్ప • పై నక్షతచే.

క॥ లేఁత వయసు గల కోఁతుల, చేతులఁ గల పనస తొనలఁ • జిట్టేఁగలు పైఁ
దోతెంచి మునరుఁ బుష్ప, వ్రాతమునకు మునరు బంభ • రవ్రజముక్రియన్.

చ॥ ధనికులతో గృహస్థులగు • ద్రావిడపండితపాళితోడ ని
ర్ధనులకుఁ గామితార్థముల • దండిగ నిచ్చు వదాన్యరాజితోఁ

గొనకావి ధుష్టనిగ్రహము • గోరికి ష్టేయు నృపాలితోడ దీ
కొని పులుమేయఁగాఁ దొడఁగెఁ • గోరిన దిచ్చెడి యావు వెల్లనై

ఉ॥ మిఱిసి వైభవంబు లుప • మింపఁగరాని విలాతి యందు పం
కేరుహవాసినిన్ వెదకి • కీశులు దాఁటి గమించి గొప్ప కా
వేరి పరంగు చోళ పృథి • వీస్థలిఁ జొచ్చి వనంబు లొత్తుగాఁ
బైరులు గల్గి తూఱ నెడ • పాఱని భూములఁ జేరి గడ్టుగన్

ఉ॥ వంకర టింకరై పెరిఁగి ప్రాలిన మ్రాఁకులనుండి రాలు తేఁ
దెంకలు కాళ్ళకుం దగుల • దెందము తల్లడమంద దుల్లుచున్
వంకలు పాఱు తేనియల • పల్లములంబడి లేచి తుడ్పు కొం
చంకిలి సంకటం పడుచు • నాఁగక యేగిరి యూఁకి జోకచేన్

మ॥ శ్రుతిగూర్పన్ బొనరించు నాదుక్రియ • హె • చ్చుందగ్గుగా మ్రోఁగ ని
శ్చితతుల్ నించిన గానుఁగుల్ విడుమ నిం • చుందాలు నిండారి సం
గతమై యుండఁగఁ గాంచి యాపెనములం • గాంక్షించి యుల్లంబు ల
ద్భుతరీతిం జొరఁబాఱి చేఁపలట నెం • దున్ లేమి వేక్రమ్మఱున్

చ॥ వికసిత పుష్ప గుచ్ఛములఁ • బెల్లుగ ప్రాలిన షట్పదాళిచేఁ
బ్రకటిత గాన మాధురి వి • రాజిలు తోఁటలయందు తేనియల్
చికిచికి కాఱి వెల్లువయి • శీఘ్రగతిం జనుచుండఁ గీశ శా
బకములు గాంచి యేఱెయను • భ్రాంతి డిగంబడకుండు శాఖలన్

ఉ॥ కేతకి పూల దుమ్మచటి • కేళివనంబులఁ బండి ప్రేలు నా
చూత ఫలంబులం దవులఁ • జొప్పడు బూవుల తావి పండ్లకుఁ
రీతిగఁ గేదరంబులను • రేగటి పంకములందు కల్వ పూ
లాతతమౌటఁ బంకిలము • నందలి బ్రీహులఁ బొందు గందమున్

ఉ॥ స్రుక్కక వానరుల్ వెదకి • చోళులదేశము దేవిఁ గానమిన్
మిక్కిలి కుంది ధర్మపథి • మేటి గృహస్థులు కల్గ చేరలోఁ
దక్కక చూచి యింపయిన • ద్రావిడభాషకుఁ దెంకి యుంచుఁ బే
రెక్కిన పాండ్యదేశమున • కేగిరి వేగ దిటంపుఁ బూన్కిమై

చ॥ సకలజగంబులన్ విమల • సన్నుతిగాంచిన గద్య పద్య నా
టకముల ఖ్యాతి నొందు ద్రవి • డ ప్రకటామృతమున్ జనాలికి
చ్చఁటముగ నిచ్చి గౌరవ వి • శాలత నొందిన పాండ్య దేశమున్
లుకలుకలాడు నవ్విబుధ • లోకము పోలు ననంగఁ జెల్లునే?

ద్రవగొను చందమొంది జిగి • రాజిలు లచ్చి మొగంబొ? నా న సం
తపనము గూర్చు పట్టణము • దాపునఁ గాంచిరి మోదితాత్ములై.

ఉ॥ కల్ప కుజంబులం జెనయు • కాంచన వృక్షములున్ మనోహరా
నల్ప జలాశయంబులు మ • హా రజత స్ఫుట గోపురంబులున్
వేల్పులు విస్మయంబుగొను • వేశ్మములున్ దనరారఁ గ్రవ్య భు
క్శిల్పి మయుండు స్వేచ్ఛగొని • చేసిన యప్పుర మెన్న శక్యమే

తే॥ ఇంద్రు నమరావతియు దాని • కీడు గాదు, సూర్య చంద్రుల కాంతులు • చొరకయున్న
సౌధ శిఖర ఖచిత మణి • జాలకాంతి, చీఁకటులఁ దోలుచుండు ని • శ్శేషముగను.

చ॥ తగ భువి సంస్తుతించు బహు • దాన విహర్తల భూమి భర్తలం
బొగడిన సత్కవీంద్రుల స • మున్నత గేహములందు పచ్చపొ
న్నగలును కీలు మంచములు • నాణెపు వస్త్రములున్ సుగంధముల్
జిగిబిగి నుండు పోల్కి విల • సిల్లెను తత్పుర వైభవ క్రియల్.

చ॥ పసగొన గల్లుగల్లను ర • వంబుల వించెడు గజ్జె లందియల్
మిసిమిగలట్టి పాదముల • మించి చరించు వరాంగనామణుల్
రసికత గల్గు పూరుషులు • రాజిలకుండుటచేత నప్పురం
బసువులు లేక ముద్దయిన • హాటకపుత్త్రిక నాఁగ భాసిలెన్.

చ॥ అమృతముకంటె నింపయిన • యన్నము ద్రావిడ భాషఁబోలు రు
చ్యములగు కీనెలుఁగల్ సురయు • స్వాదుఫలంబులు తావివింధుచున్
దుమదుమ లాడు జిహ్వలకుఁ • ద్రుప్పును దుల్చు విధాన నొప్పుచున్
శ్రమగొని వచ్చు వారలకు • స్వాగత మిచ్చుచు నుండె నయ్యెడన్.

మ॥ హనుమ జ్జాంబవ దంగదాదులు ముదా • యత్తాత్ములై యీపురిన్
మన శత్రుండగు రావణాసురుని స • ద్మంబుండఁగా నోపు సీ
తను కాంచంగలమంచుఁ గౌతుకముతోఁ • దద్ద్వార సీమన్ సుఖం
బునఁ జొత్తెంచిరి వీధులం దిరిగి రా • మోదంబు క్రుంగంబడన్.

తే॥ నరులు సురలును లేరు దా • నవులు లేరు. ప్రాణులను లేవు రూప చి • త్రములు లేవు
మఱియు యాథార్థ్య వస్తువు • తెలుఁగు లేదు. పట్టపురమునఁ దిరుగాడె • వానరాళి.

సీ॥ నడబావు లుండెను • నలినాకరములుండెఁ. దావులు వెదజల్లు • తావు లుండె
మత్స్యలాఞ్ఛల మంజు • లోక్తులఁ దెలిపెడి, శుక పిక శారికా • నికరముండెఁ
గలహంసలుండెఁ ద • త్కలిత సుఖంబుల, ననుభవింపంగఁ దొ • య్యలులు లేరు
వానరు లాపుర • వైఖరి యంతయు, నరసి మాయాదృశ్య • మనుచుఁ దలఁచి

తాసుత( గానవచ్చు నను • ధైర్యము లేదు మరించుచే యిఁకన్
మోసములేనిత్రోవ యగుఁ • బోవుట సిగ్గిలు చెన్న యుక్తమే?

మ॥ గరువున్ మీఱఁగఁ గార్యమున్ సమకుఱం • గై కోక కిష్కింధ కూ
ఱదగా నేఁగిన, దంద్రికోపపడు శ్రీ • రాముండు చింతాంబుధిం
బడు నాఘోరము గాంచఁజాల నగుటన్ • బ్రాణంబులన్ వీడెదన్
గదు ధర్మజ్ఞులు మీరు నిశ్చయముతోఁ • గర్తవ్యముం దెల్పుఁడీ.

చ॥ అన విని జాంబవంతుఁ డిటు • లాడుఁ బ్రభుండవు నీవు సన్నత్రో
వన చనువార మీవు కద • వం గని యిచ్చట నేడ్చుచుందుమే?
మనమున దార్ఢ్యమూని యను • మానము మాని వినాశవార్త నీ
జనకునకున్ వచింపఁ జనఁ • జాలదుమే? పలుమాట లేటికిన్?

తే॥ వినుత విక్రమ! యువరాజ! వెనుక కేగి, తెలుపఁగానేమిగలదు చిం • తింపు మయ్య
యేము చావంగఁ దగుఁగాని • యింగితజ్ఞ!, నీవు చావంగఁ దగవు మ • న్నింపఁదగుదు

చ॥ అదివిని జాంబవంతుని త • దన్యులఁ గాంచి వచించు విట్టు లం
గదుఁడు మహాత్ములార! దరి • గానక మీరు విపన్మహాంబుధిన్
బ్రిదిలి మునుంగుచుండ నొక • పీరునికై వడి నేను మాత్రమే
మదిమది నేగినను జనము • మన్నన సేయునె? యద్ది యుక్తమే?

తే॥ పెద్ద లేమందురో యను • భీతిలేక, వెంట వచ్చిన మిత్రులు • మంటఁ గలియ
వీఁడు చావక యిటు వచ్చి • నాఁడొ! యనెడి, లోకనిందకై యరిగెద • నాకమునకు

సీ॥ మనమిందఱము నిందు • మరణింతుమేని నా. తలిదండ్రు లెఱిఁగినఁ • బొలియువారు
ఆదివిని రాఘవుఁ • డతని • తమ్ముండు త్రె. య్యమరు తద్వార్త య • యోధ్యఁబ్రాఁక
భరతాదులును తమ • ప్రాణముల్ విడుతురు, వారి తల్లులు వెండి • పౌరవరులు
చచ్చెదువారిది • సత్యంబు సత్యంబు, చెడితిఁ జెడితిఁ జెడఁ • బొడమినాఁడ

ఆ॥ పుట్టి విల్లు తాను • మెట్టిన యిల్లును, వెలుఁగఁ జేసినట్టి • విమల చరిత
లోకమాత సీత • కాకుత్స్థ కులపత్ని, కానరాకయున్న • కారణమున.

తే॥ అంగదుం డోర్వలే కిట్టు • లాడువంత, నివ్వు కడుపునఁ బుట్టిన • చొప్పుగాఁగ
నెల్లవారల యుల్లముల్ • తల్లడిల్లె, ఋక్షనాథుఁ డంగదుఁ గని • యిట్టులనియె

ఉ॥ ఏవగ నెంచిచూడ మఱి • యీవునునీజనకుండు రాజు సు
గ్రీవుఁడు దక్కఁ గీశకుల • కీర్తిని నిల్పెడు వాఁడు లేఁడటుల్
గావున నీవు నీలుగుట • గాఁదగదంచు వచించినాఁడ నా
శ్రీవరు చావుఁ గూర్చి యిటఁ • జింతన సేయుటయేని యుక్తమే?

ఉ॥ ప్రాణముతోడఁ బోవఁదగు • వాఁడవు నీవొకరుండవే చుమీ
యేణవిలోచనన్ వెదకి • యే త్రెఱ వానరవర్యులెల్ల ని
ప్రాణ భజించి క్రమ్మఱిలఁ • జాలక చచ్చిర యంచు నాజగ
త్త్రాణునకుం గపీంద్రునకు • రాఁ వచింపుము మాకు మాఱుగన్

చ॥ అనవుడు నాంజనేయుఁ డను • నర్యమ శీఘ్రగులార! లోకమం
దున నొక భాగమేని వగ • తోఁ బరికింపఁగ లేదు రాముదే
విని; మఱియింతలో గమన • వేగము మాలినవారిమాడ్కి శ్ర
ద్ధను విడువారి పోల్కిని వి • తాకును వేసట నొందఁ జెల్లునే?

శా॥ పాతాళంబున నూర్ధ్వలోకములలో • స్వర్ణాద్రిపైఁ బద్మసం
జాతాండ వ్రజమందు నిబ్బరపు దీ • క్షంబూని వీక్షించుచున్
సీతా దేవిని కాంతుమేని మఱి యా • క్షేపింతురే? తప్పుగాఁ
జేతంబందు దలంతురే? యొడయఁడున్ • శ్రీరామ సౌమిత్రులున్

ఉ॥ కావున జానకిన్ వెదకు • కర్జమె న్యాయము లోకమెల్లెడన్
దీవరమంది రోయుదము • కిఁకువ నంతటఁ గానమేని యా
ధీవరుఁడౌ జటాయువు గ • తించిన దారిని పోద మిప్పుడీ
త్రోవఁ జరింతుమేని యప • దూఱు గడింతుము మూర్ఖ పద్ధతిన్

ఉ॥ నీతుల నిట్లు మారుతి గ • ణించి వచింపఁగ గృధ్రరాజు సం
పాతి యనుంగుఁదమ్ముఁడు న • పార కృపాళుఁడు నిత్య విక్రమో
పేతుఁడు నీతిమంతుఁడు వి • వేకి జటాయువుచావు వింటచేఁ
జేతము తల్లడిల్ల వడిఁ • జేరెఁ గపీశ్వరు లున్నచోటికిన్.

సీ॥ ఆయతకీర్తి జ • టాయు వెటులఁ గూలె, నని కొట్టుకొను గుండె • యొనరువాఁడు
గడగడ వడఁకు మే • నలవాఁడు పవి భిన్న, పక్షమౌ శైలంబు • పగిదివాఁడు
తమ్ముని చంపిన • తత బలుఁ డెవఁడని, కన్నుల బాష్పముల్ • గార్చువాఁడు
భూమిపై గర్జించు • భూరి మేఘముమాడ్కి, వేదనచేఁ బల • వించువాఁడు

తే॥ గుల్మతరు లతాదులు మిట్ట • గుట్టలెల్ల, సమము లగునట్లు త్రొక్కుచు • జరగువాఁడు
వాయుదేవుండు బలముతో • వైవదొంలు, వెండికొండ విధంబున • వెలయువాఁడు

తే॥ వచ్చి చేరఁగ బ్లవగులు • భయమునొంది, పరుగులిడిరి కకావికఁ • • బవనసూనుఁ
డుగ్రుఁడై నిల్చి పక్షీ రూ పొంది వచ్చు, మాయలాఁడవు నిలుమని • మాఱుకొనియె.

ఉ॥ మార్కొని నిష్కలంకుఁడును • మాన్యుఁడు దుఃఖితుఁ డార్తిఁ దమ్మునే
పేర్కొనువాఁడు కన్నులను • వృష్టిగ నశ్రులు రాల్చునాతఁడే

కోర్కియు లేనివాఁడగుటఁ • గొంచక యింగితవేది తత్త్వమ
త్యర్కుఁడు వాయుసూతి ముఖ • మందలి చిన్నె లెఱింగె బాగుగన్.

తే॥ ఎఱిఁగి యాతఁడు డాయంగ • నెదుర నిలిచి, వాయి తెఱవక మున్నె సం • పాతి నాయ
నుంగుఁదమ్ముఁ జటాయువు • నొంచి కూల్చి, శూరుఁ దెవఁడనియడిగె సా • మీరిఁగాంచి

తే॥ అంత మారుతి నీదు వృ • త్తాంత మిపుడు, నిజము దాఁపక తెల్పుదే • నియును పిదప
జరిగిన యుదంత మెల్ల ని • శ్చయముగాఁగఁ, దెలుపఁగలనన సంపాతి • పలికె నిట్లు

ఆ॥ నాకు వెనుకఁ బుట్టి • నాకన్న ముందుగా, మరణమొంది యశము • ధరణి నిలుపు
నాజటాయువునకు • నన్నను భ్రాతృ వి,ఁరహితవృత్తినిట్లు • బ్రదికినాఁడ.

తే॥ అనిన సంపాతి పల్కుల • నాలకించి, యదలి యో పక్షిరాజ! ద • శాస్యుతోడ
నాల మొనరించి యతని చం • ద్రాయుధమునఁ, గాలగతి నొందెనని పల్కె • గాలిపట్టి

తే॥ విన్న సంపాతి వజ్ర ని • ర్భిన్న కుధర, భాతి భువిఁబడి వేఁడి ని • శ్వాసములను
వదలి ప్రాణముల్ తత్తఱ • పాటు నెంద, హనుమ పల్కులట్లే పల్కి • యదలిబడలె

మ॥ అసుఁగా! భానుఁడు కాల్పఁ బక్షములు పా • డైపోవ నిచ్చానువృ
త్తినిఁ గెందుం జనలేక దుర్భర మహా • ర్తిం బొంది చాకుండఁగా
వినుచే సుంతయు నొవ్వి చెందవును నీ • వేముందుగాఁ బోవు టెం
దనువౌ ధర్మము? చిత్రమయ్యె నిది మా • యాలోకమంచెంచెదన్.

మ॥ సరసీజాసనుఁ డట్లెయుండ భువియున్ • స్వర్గంబు నిల్పొందఁగా
వర ధర్మంబును నిల్చియుండ దివిఁ గ • ల్పంబట్టులే యుండ నం
బర వాయు జ్వలనాంబు మేదినులు స • ర్వంబట్లె యుండంగ సో
దర! నీవొక్కఁడ వెట్లు కూలితివొ? చి • త్రంబయ్యె నాకియ్యెడన్.

ఉ॥ రంభ కనూరుచేఁ బొదమి • రాగము మీఱఁగ నిన్నినాళ్ళు సం
రంభముతోఁ జరించితిమి • క్రందగు లోకములెల్ల వెండిఁ బ్రా
రంభము దోఁచె నిర్వురకుఁ • బ్రాయిడియైన వియోగ మిప్పుడా
రంభయె తల్లిప్రేమగొని • రమ్మన నేగితె నన్ను వీడుచున్.

ఉ॥ వీరవరాగ్రణీ! గరుడ • వేగ! దశాస్యుఁడు మూఁడులోకముల్
వారక గెల్చుఁగా కదలి • పాఱక నిల్చెనె? నిల్చి ధీరుఁడై
పోరెనె? పోరుఁగాక! పోరి • పుచ్చుఁగఁ జాలెనె? చిత్రమయ్యె నా
గారిని పాము మార్కొని జ • యంబు గడించెను ధాత్రి నేఁటికిన్.

తే॥ అనుచు సంపాతి పలవించి • యవశుఁడైనఁ, దలరి మారుతి సమయోచి • తంబులైన
పలుకులాడి యోదార్ప నా • పక్షివిభుఁడు, మరల నిట్లనియె మరుత్కు • మారుఁగాంచి.

ఆ॥ క్రౌర్యశీలి బహుళ • కపటి దశాస్యుతోఁ, బోరఁగా జటాయు • వునకు నేమి
హేతు వౌనరెఁ దెల్పు • వే మహాత్మక! యన, వాయుపుత్త్రుఁ డిట్లు పలుకఁదొడఁగె.

శా॥ మారామప్రభు ధర్మపత్ని మిథిలా • క్ష్మానాథు సత్పుత్త్రి సీ
తా రామామణి దుష్టరక్షకుఁడు దై • త్యస్వామి కావించు మా
యారంభంబునఁ జిక్కి నాథు నెడఁబా • యం గల్గె నవ్వేళ లం
కారాజన్యు డు ద్రుచ్చిలించికొని యే • గంబూనె భూమీసుతన్.

శా॥ ధర్మాత్ముండగు నీదు తమ్ముఁ డట దై • త్య క్రౌర్యముం గాంచి దు
ష్కర్మ న్నీతులఁ దెల్పఁ జూచి యెటులుం • గాకున్కిఁ గోపంబునన్
మర్మం బంట నఘాలి దూఁటి దనుజున్ • మార్కొంచు ధాత్రీసుతా
విర్ముక్తిం దలపోసి సంగరము పూ • నెం బల్మి లంకేశుతోన్.

ఉత్సాహ॥ పూని వాని యరదముఁ బొడి • పొడిగః జేసి చేతులన్
మేను వాఁడిగోళ్లఁ జీల్చి • మిగిలి ధిటవు గ్రుంచఁగా
దానవుండు శంభుఁ డీయఁ • దాల్చిన కరవాలుచే
నూని నీదు తమ్మ నుసులు • లూడ్చి పోయె నావుడున్

ఉ॥ తమ్ముని చావుకై మిగులఁ • దాపము నొందితిఁగాని రామ కా
ర్యమ్మున నశ్వరంబయిన • ప్రాణములం ద్యజియించి నిత్యమో
క్షమ్ము గడించె నంచు మది • సంతసమందెద నట్టిజన్మమే
యిమ్మగ సార్థకం బయిన • దెన్న మహీస్థలి భక్తసత్తమా!

ఉ॥ రామునిదేవిఁ గావ సమ • రం బొనరించి రణంబునంద యా
స్వామినికై ప్రియంబుమెయిఁ • బ్రాణము అర్పణ చేసినట్టి గా
రా మనుజుండు విక్రము స్థి • రంబగు నిర్మల కీర్తి దేహుఁడై
భూమిని గల్గువాఁ డనఁగఁ • బోలు మఱొక్కటి చెప్ప నొప్పునే?

ఉ॥ శ్రీరఘువీరు నెయ్య మొన • రించిన తమ్ముఁడు రామసేవకై
జాఱిచి జీవముల్ విమల • శాశ్వతకీర్తి గడించె దానిచేఁ
గూరిన నష్టమేది? మఱి • కోరికఁ బొందఁగదగ్గ యర్థమున్
గౌరవ మున్నె? సంతసము • గాంచఁగ నింతకు మించి కల్గునే?

చ॥ అని వినుతించి నిర్మల జ • లాశయ మందున మజ్జనాదికం
బొనరిచి వెండివచ్చి ప్లవ • గోత్తములార! వడిన్ ధరాత్మజా
తను వెదకంగ వచ్చితిరి • తమ్ముని వార్తను దెల్పి నన్నుపా
వనునిగఁ జేసినార లొక • వంతను గూర్చిన వారె మీరలున్?

చ॥ మృదు మధురోక్తుల న్నిజము • మేకొని పక్కొడు వీరులార! యొ
ప్పిదముగ నేకకంఠులయి • ప్రేమను తారక మంత్ర రాజమున్
బదరక యుచ్చరింపుఁ డటు • పావన నామము విన్న నాకు మే
లొదవును రాము సత్కరుణ నొప్పును కాలిన పక్ష యుగ్మమున్.

మ॥ అని సంపాతి రహించి వేఁడుకొనఁ బ్ర • త్యక్షంబుగాఁ జూచు వే
డ్కను శ్రీరాముని దివ్యనామము తదే • కస్వాంతులై భక్తిభా
వనతోఁ గీతులు పాడుచుండఁగనె త • త్పక్షంబు లందంబుగా
దనరెన్ విస్మయమంది రెల్లరును త • ద్గాన ప్రభావంబుకై.

చ॥ సురుచిర దేహకాంతి గల సూనృత భాషుఁడు గృధ్రరాజు, శ్రీ
వరుని కృపా కటాక్షము న • పారముగాఁ గొని ఱెక్కలొప్పఁ దీ
వరమగువహ్నిఁ గ్రక్కు కర • వాల మొఱంగొనుపోల్కిఁ బక్షికాం
తర గత దీర్ఘ దేహుఁడయి తద్ద వెలింగెఁ బ్లవంగు లుబ్బఁగన్

ఉ॥ ఱెక్కలులేని యండజము • ఱెక్కలు గొన్న విధంబు గాంచఁగా
నక్కజమంది సందియము • నంది భయంబును పొంది రాఘవుఁ
నిక్కపు భక్తిచేఁ గొలువ • నేర్చిన వారికిఁ గల్గు లాభమున్
జక్కని కన్నులారఁగని • సల్పిరి పాడుచు మోద నృత్యమున్.

క॥ శ్రీరామ నామ మహిమము, నారూఢిగఁ దెలిపినట్టి • యండజ రాజున్
గౌరవమున మ్రొక్కి యతని, చారిత్రము దెలుప వేఁడ • సంతుష్టుండై

క॥ పలుకు నిటు మిత్రులారా!, యిలఁ జీఁకటిగొంగ రథము • నేత్తెఱ నడపం
గల యరుణుని సుతులము గ్ర, ద్ధల కులమున కేలికలము • తరుణ వయసునన్.

క॥ సురపురిని చూచు వేడుక, నిరువురమును నెగసి యెగసి • యేగుచునుండన్
ఖరకరుని చేరువకుఁ జను, తరుణంబున నతఁడు కాంచి • తద్దయుఁ గినిసెన్

శా॥ నాకన్నం గడు నూర్ధ్వమం దరుగుటన్ నాతమ్ముఁడల్లాడి య
న్నా! కాపాడుమ యన్న నేను తనక • న్నం బైకి వే పోయి యా
కాఁకం దాఁకఁగనీక కాచితిని ఱె • క్కల్విప్పి. నా మేనికిన్
సోఁకెన్ వేఁడిమి ఱెక్కలుం గమరె నీ • క్షోణీస్థలిం గూలితిన్

మ॥ పుడమిం గూలిన నన్నుగాంచి రవియుం • బూర్ణానుకంపామతిన్
బెడ ఖాయంగల రాముధర్మసతి న • న్వేషింపఁగా వానరుల్
కడఁకన్ వచ్చుచు నిన్నుగాంచి యెలమిం • గాకుత్స్థ సంకీర్తనల్
నొడువన్ ఱెక్కలు వచ్చుఁగాకని విప • న్మోక్షంబు వాక్రువ్వఁగన్.

శా॥ నాపక్షంబులు భస్మమౌ కతన సం • తాపించి నిట్టూర్పుతో
నీ పృథ్వీధరమందు గూలి మరణం • బే మేలుగా నెంచుచో
శాపానుగ్రహశక్తుఁ డార్తజన ర • క్షన్ లోక సారంగుఁ డా
నాపూన్కిన్ వదలించి యూఱడిల వి • న్నాణంబుగాఁ బల్కుచున్.

చ॥ చదువని మూఢులంబలెనె • స్వాంతమునందున నుత్సహించి స్వః
పదమున కేగనెంచి యిటు • భంగము నొందుట నీదు తప్పుకా
కిది మఱియొక్కఁటే? యినకు • లేశుని దూతలు వచ్చునంతకుం
బదరక యుండు మాత్మవధ • పాతక హేతువు శీలధర్మమే?

ఉ॥ గర్వ మదెట్టివారికిని • కాని గుణంబది కల్గియేమి మీ
సర్వముఁ గోలుపోయితివి • సత్యము వానరరాజి పూన్కి మై
నుర్వర కన్యకై ప్రభు ని • యుక్తిని వచ్చును మేలుగల్గు నీ
కోర్వని యిట్టితీరు తగు • నో? యని యమ్మని మందలింపఁగన్.

చ॥ తుదకిటు జీవముల్ నిలిపి • దుఃఖము లోర్చుచునుంటి నామహా
పదగని దిక్కుదోఁపక య • పార మనోవ్యథ నొందు తమ్ము ద
య్యదనున నాయనుజ్ఞ విన • యంబున మీఱఁగలేక గృధ్రరా
ట్పదమును బొందె మాచరిత • పావనులార! గ్రహించినారలే?

ఉ॥ మీరలు వచ్చినారలను • మేలిమి తెక్కలు వచ్చెనాకు మీ
చే రహి నొందితిం బుడమి • శ్రీరఘురాముని సేవ సేఁత మీ
కాఱియ నెట్లు ధర్మమగు • నట్టులెనాకును ధర్మమౌట నే
నారసినంతవట్టు తెలి • యం దెలుపంగలవాఁడ నమ్ముఁడీ

ఉ॥ దేవిని దొంగిలించికొని • దిట్టరి నీచుఁడు పాపి క్రూరుఁడీ
త్రోవనె యేగఁ గాంచితిని • దుష్టుఁడు లంకను చేరినాఁడు తాఁ
గావలినుంచినాఁడు జన • కప్రభు నందిని యందయున్న దీ
రే వగనైన నబ్ధి దరి • యింపుఁడు కాంచుఁడు రామగేహినిన్

చ॥ ఏగుట కెట్లు శక్యమగు • నిచ్చటి కున్నది నూఱు యోజనాల్
సాగరవేష్టితం బయిన • లంక యముండను చూడ్కి నిల్పఁగా
నీగుసు దెగ్గడిల్లి దను • జేంద్రుని కోప దవాగ్ని పావకున్
జాఁగటలాడఁజేయు ననఁ • జాలుదురే యెవరేని చేరఁగన్?

చ॥ నలువయు శంకరుండును చ • నంగ నశక్య మనంగనేల? క
ర్వలియును కాలుఁడున్ జొరఁగ • రాదు చరాచరకోటి లోపలన్

వెలుపలనున్న వెన్నుఁడు ప్ర • వేశ మొనర్పఁగలేఁడు మీరలీ
పొలుపు నెఱింగి పెల్లు దల • పోసి చనుండు మెలంకువం దగన్.

ఉ॥ ఇందఱుఁ జేరి పోదమని • యెంచుట గూడని కార్యమౌను మీ
యందు సమర్థుఁడై మెలపు • నందిన యొక్కరుఁ డేగి డాఁగి యం
దందు చరించి రాముసతి • నారసి తెల్పుఁడు తన్నిదేశమ
ట్లొందిక గానిచో మరలి • యోపికఁ దెల్పుఁడు నా వచస్సులన్.

మ॥ పరిపాలించెడు వారు లేమిని ప్రభు • భ్రంశంబుచేఁ బాడి వీ
సరవోవం జెడు గృధ్ర సంఘములు ర • క్షిస్ఫూర్తి కేఁ బోవుచే
యురవౌ మీరలు రెంట నొక్కటి తగన్ • యోచించి చేయుండు సు
స్థిరకీర్తిన్ వహియింపుఁ డంచుఁ జనియెన్ • దీవించి సంపాతి తాన్.

## 14. మహేంద్ర శైల పటలము (29)

ఉ॥ తప్పులు పల్కనే యతఁడు • తద్జ్ఞుఁడు గ్రద్దలఱేఁడు తెల్పినా
చొప్పునఁ బోవ జానకిని • చూడఁగవచ్చును రెంట నొక్కటిన్
దప్పక చేయఁగా వలయు • దాఁటుటయా జలరాశిః రాముతో
నిప్పని దెల్పుటాః యుచిత • మెయ్యది యేర్పడ నిశ్చయింపుఁడీ.

మ॥ త్రిజగన్మోహనుఁడైన రాఘవుని సు • గ్రీవున్ వెసంజేరి భూ
మిజ వృత్తాంత మెఱింగినంత తెలుపన్ • మేలొందుఁ గర్తవ్య మ
క్కజమౌ రేవఁ బయోధి దాఁటి యచటన్ • క్ష్మాపుత్రి వీక్షించి నీ
రజ పత్త్రేక్షణ తెల్పు వాక్యముల నా • రం దెల్పు టుత్కృష్టమౌ.

సీ॥ గడువు కడవఁజావఁ • గడఁగినారము సిగ్గు, చెడఁ గ్రమ్మఱిల సాహ • సించినార
మివి రెండు తొలఁగు వ • డువు విన్నవారము సంపాతివలన ని • శ్శంకముగను
కడలిని దాఁటి లం • కకునేగి • జానకిఁ, బొడగాంచి రాఁగల • పుణ్యుఁ డెవఁడుః
మా ప్రాణ మాన సం • రక్షణ భారంబు, నతనిపై నుంచితి • మనిరి కొంద

తే॥ ఱ సముసూరులు నీలాదు • లంబురాశి, దాఁటు శక్తి లేదనిరి • సంద్రంబు దాఁటఁ
గలను వెదకుదు మరలి రాఁ • గలనొ లేనొః, యనుచు శంకింతు ననియెఁ దా • రాత్మజ

చ॥ నలువ కుమారుఁ డిట్టులను • నాయనలార! త్రివిక్రముండు భూ
స్థలి నొక కాలితోఁ గొలువఁ • దక్కనుచో జయభేరి వ్రేసి ది
క్కులను ప్రదక్షిణించు తఱిఁ • గ్రుచ్చుకొనెం గనకాద్రి కొమ్ము నా
బలము చెడెన్ బదం బిబుకు • పట్టెను నొచ్చుచునుండు నిప్పుడున్

ఉ॥ కావున నబ్ధి జంగఁగొని • కావలికోటను దాఁటి లంకలోఁ
జేవను చొచ్చి రాక్షసులు • చేర్పడు చేఁతలు చేసి జానకి

దేవిని గాంచి వచ్చుటకు • దీర్ఘ బలంబుజవంబు లేదు నే
నేవిధిఁ బోవనేర్తు నని • యిమ్మగ నంగదుఁ గాంచి యిట్లనున్.

ఉ॥ రాజవు నీవు కానఁ జన • రాదిఁక నెవ్వరి వేఁడువారమీ
యోజఁ దలంచుచుండుటయు • నొప్పదు తొల్త దినేశసూతికిన్
రాజిత కీర్తిశాలి యగు • రాముని చెల్మి ఘటించి యున్న యు
త్తేజిత మూర్తి యుండఁ దెక • తేరకుఁ జింత వహింపనేటికిన్?

ఉ॥ నెయ్యము గూర్చినాఁడు రఘు • నేతృ పదంబులఁ గొల్చినాఁడు తాఁ
దియ్యము మీఱ నుంగరముఁ • దెచ్చినవాఁడు యశంబు గూర్చు వాఁ
డెయ్యెడనేని హెచ్చరిక • నేర్పెఱఁ గార్యమొనర్చువాఁడు జో
డియ్యల లేనివాఁడు కలఁ • డియ్యెడ మారుతి చింత యేటికిన్?

సీ॥ పవననందన? నీవు • పరమేష్ఠి పొందని, చిర జీవితమ్మును • చెందియుంటి
సకల శాస్త్రంబులు • శ్రద్ధమైఁ జరియించి, యంచితార్థమ్ముగ్ర • హించియుంటి
వివరింప వలసిన • విషయమ్మ లనువొందఁ, దెలుపు వక్తృత్వానఁ • దేఱియుంటి
కర్తవ్యములఁ బూర్తి • గావించు సుస్థిర, సంకల్పుఁ డంచుఁ బ్ర • శస్తిగంటి

తే॥ జముఁడు శంకించునంతటి • శక్తిగంటి, బుద్ధి నపర విధాత యన్ • పొలుపుగంటి
రణమునందు రుద్రుఁడె యను • గణుతిగంటి, మేమెఱుంగమె నిన్ను స • మీరతనయ!

చ॥ అనిలమునందుగాని మఱి • యంబువులందునఁగాని యుగ్రమౌ
ననలమునందుగాని మృతి • నందవు దివ్యశరాళి లేవియున్
జెనకి వధింపఁజాలవు వి • శిష్ట గుణుండవు నీకు నీవ కా
కెన మఱి లేరు దాఁట రహి • యించిన సంద్రము దాఁటఁజాలెదున్.

చ॥ సులువుగ మంచి చెడ్డలను శోధనచేసి వచింపనేర్తు వి
య్యల నసహాయశూరుఁడవు • నేర్పెఱ శత్రుల గెల్వనేర్తు వ
గ్గలికను లంక కేగి మఱి • క్రమ్మఱనేర్తు దురంబునందు దో
ర్బలము నశింపకుండెడు స్వ • భావము గల్గినవాఁడ వయ్యరో!

ఉ॥ మేరువుఁబోలె పొడ్డదగుఁ • మేను ధరింతువు కార్య మేర్పడన్
వారిధరంబునుండి పడు • వర్షకణంబులలోనఁ జిన్న యా
కారము నూని తూఱుదువు • గ్రక్కున లీలగ నెత్తనేర్తు నీ
ధారణి నష్టముం గదిసి • తాఁకఁగ నోపుదు చిన్ని చేతులన్

మ॥ మఱియుం జెక్కు పరంబులందియును సం • భావింతు శీలంబ యే
ర్పెఱ బాగోగు లెఱింగి యేర్పఱతు వృ • ద్ధీపాల ధర్మంబులన్

హరిచేనేర్చి దినేంద్రవంశజునిచే • నవ్వాలిఁ జంపింపవే
పురుహూతాశని బాల్య రోమమొకఁడేఁ • బోఁగొట్ట మున్నోపెనే?

మ॥ రణరంగమ్మునఁ దాఁకునేనియు జగ • ద్వ్రాతమ్ము లొక్కుమ్మడిన్
దృణకల్పమ్ముగఁ జూచువాఁడ వౌరు లూ • హింపంగరానట్టి భీ
షణ నిస్తుల్య బలుండ వర్కుని రథ • స్ఫారోగ్ర వేగంబుతోఁ
గణఁకం బోవుచు నేర్చినాఁడవుకదా • గాంక్షించి సద్విద్యలన్

ఉ॥ నీతిపథంబునన్ దిటగ • నిల్చినవాఁడవు సత్యశీలివిన్
నాతిసుఖంబు చిత్తమున • నాటని ధీర జితేంద్రియుండవున్
ఖ్యాతిగ వేదముల్ చదివి • యందలి మర్మ మెఱింగినాఁడవున్
ధాతవు కాఁగలాఁడవని • ధారణిఁ బేరు వహించినాఁడవు॥

శా॥ సీతాన్వేషణ కీవ యర్హుఁడని రా • జీవాక్షు సుగ్రీవులే
ప్రీతిం బ్రేరణసేయ మేలనుచు నూ • రీకారముం దెల్పుటల్
చేతంబందున నుంచినాఁడ వది నీ • చేఁ దీరు నిక్కంబు నీ
చేఁతల్ ధాత్రిని సుస్థిరంబు లయి భా • సిల్లున్ మరు న్నందనా!

ఉ॥ కాలముకానిచో నణఁగి • కాలము వచ్చఁగ నేర్తువయ్య! పే
రాలము కూరెనేని కడు • నాగ్రహ మందిన సింగముంబలెన్
వాలుదు వెల్ల కార్యములఁ • బట్టి సమగ్రముగా నొనర్తు వి
ఘ్నాలి నెదిర్చి త్రోచుచు మ ( హా ఫలసిద్ధిని గాంచు టబ్రమే?

మ॥ అమరేంద్రాదులకైన నాదరణమై • యావర్ష్యమై యొప్పు శీ
లముచే సుక్షమచేతఁ గామిత విధుల్ • సాధించు ధీశక్తిచే
విమలాత్మయ! నీకుఁ గానిపనులీ • పృథ్వీస్థలిం గల్గునే?
యమరం దెల్పఁగఁదగ్గ దొండుగలదే • యర్థంబు? వాతాత్మజా!

శా॥ నీవే వారిధి దాఁటి మైథిలిని స • న్నీతిం బరీక్షించి దే
వీ వృత్తాంతము దెల్పఁగాఁగల మహా • వీరుండవై యుంటి మా
జీవంబుల్ భవదీయ హస్తగతమై • చెల్వారు మాకింక నే
త్రోవం జూపెదొ యంచు విశ్వసృజు పు • త్త్రుం దర్థి వాక్రువ్వఁగన్.

తే॥ అవనత ముఖాబ్జమం దొక్కయంబుజంబు, మొలచుపోలికనవ్వి కే • ల్మోగిచి హనుమ
వానరావలి యుల్లముల్ • పల్లవింప దెలిపె నీరీతిఁ దనమది • తేటపడఁగ.

మ॥ త్రుటిలో సప్త సముద్రముల్ కదచి యు • ద్యోగించి లోకంబులన్
జటుల ప్రీతినడంచి గెల్చు చతురుల్ • చర్చింప మీరిట్లు వి

## కిష్కింధా కాండము

స్ఫుట భావంబున నాజ్ఞ యిచ్చుటలు మ • త్పూర్వార్జితంబైన య
ప్పటు భాగ్యంబుగ నెంచెదన్ దృఢమతిన్ • భావింప నల్పజ్ఞుఁడన్.

శా॥ లంకాపట్టణ మగ్గుతోఁ బెఱికి లీ • లం దెత్తునా? దైత్యులన్
బింకంబుల్ చెడఁగూల్చి రాఘవుని దే • విం దెత్తునా? వాలితో
లంకాధీశుని గట్టి యీడ్చికొని పో • లన్ వత్తునా? యేది మీ
పొంకంబైన మనోరథంబు వడిఁ దె • ల్పం డిప్డె కావించెదన్.

శా॥ వెన్నుం దేపున నొక్క పాదమునఁ బృ • థ్విం గొల్చు చందంబునన్
గ్రన్నం గొల్చెద నీసముద్రమును ర • క్ష శ్శ్రేణికిం దోడుగా
నెన్నంగా వేల్పులు వచ్చినన్ నలఁచి మీ • యిష్టంబు గావింతు ని
ష్ఖిన్నత్వంబున నుండుఁడీ సమద సం • శ్లిష్టాత్ములై వానరుల్!

శా॥ భూభాగంబును ముంపఁగాఁ దొడరి యం • భోధుల్ విజృంభించినన్
భూభాగంబె పటాలునం బగిలి పై • వ్యోమంబుతోఁ గూడినన్
శ్రీ భూ నాయకు నాజ్ఞ పక్షములుగాఁ • జెన్నార సేవాబల
శ్రీ భాసిల్లఁ దరింతుఁ దార్ఢ్యనిక్రియన్ • గ్రీడావిధిన్ వారిధిన్.

మ॥ త్వరగా నుత్తరు వింధు క్రమ్మఱిలు నం • దాఁకన్ సుఖంబుండుఁడీ
ధరణీపుత్త్రికఁ గాంచి వచ్చెదను వ్య • ర్థప్రక్రియంగా రాసటం
చుటిదిన్ మారుతి యెక్కెఁ దచ్ఛిఖర ము • ద్యోగంబునన్ లేచి వా
నరు లాశీస్సులు సేయ వేల్పులు ప్రసూ • న వ్రాతముల్ సల్లఁగన్.

మ॥ జలధిన్ దాఁటఁ గుతూహలం బయిన యా • సామీరి దైవాఱ స్వ
స్థలముం గొల్వఁగ నెత్తినట్టి హరి పా • దంబట్లు తద్గాత్రమున్
గలయం బెంచెను శ్రీపదుండను సమా • ఖ్యా స్ఫూర్తి సార్థంబుగా
నల శ్రీపాదమె సాటియౌ ననుచు బ్ర • హ్మాదుల్ ప్రశంసింపఁగన్

మ॥ రణ తేజోధిక విక్రమంబు దిశలం • భ్రాజిల్లుచున్న ట్లవా
రణ తేజోధిక విక్రమంబు దిశలన్ • రాజిల్ల నాకాశ చా
రణ తేజోధికుఁ డస్తమించు మనుపే • రక్షోగణాధీశ రా
వణ తేజోధిక పట్టణంబు వడిఁ బో • వంగన్ సముద్యుక్తుఁడై

శా॥ వంచాస్యంబు లనేకపంబులను కం • పం బొందఁ బంచాస్య నం
శాంచత్పుణ్యుని భారమోర్వక గిరీం • ద్రాగ్రంబు క్రుంగార ని
ష్కృంచద్వాలము మేనఁ జుట్టికొని య • చ్చో నాది కూర్మంబుపై
సంచై నిల్చిన మందరంబుకరణిన్ • సామీరి విభ్రాజిలెన్.

శా॥ పంపా యుక్త పయోదముల్ చరణ శిం • జా నాదముల్ సేయ వ
ర్ణింపన్ లేక నిలింపు లాతనువు ని • ర్ణిద్రాత్ములై కాంచ గో
శంపుం గంబము క్రింది తాయి యన శై • లం బొప్పఁగా నందుపైఁ
జాంపేయాద్రి విధమ్మున న్నిలిచె నా • సామీరి గంభీరుఁడై.

కిష్కింధా కాండము సంపూర్ణము.

శ్రీరామ చంద్రార్పణ మస్తు.



# శ్రీ రెడ్డిగారి పద్య కుసుమాలు

మోచి తొమ్మిది మాసముల్ కాచి కాంచి
వలయునవి యెల్ల సమకూర్చి యెలమినించి
పెంచి పెద్ద జేసిన తొలివేల్పు తల్లి
పాదములకు నొనర్చెద వందనములు

చిన్న తనమున విద్య నేర్చికొనవలయు
పెద్దయై బుద్ధి కలిగిన విద్దెరాదు
క్రొత్త బట్టకు రంగులు హత్తినట్లు
మురికి బట్టకు బట్టునే యెఱగు వత్స
(నీతి గుచ్ఛము)

అరయ దెనుగు తేట యఱవ మమృతదార
కన్నడంబు మేటి కస్తురి యగు
ననెడి యార్యవాక్య మది పొల్ల యగునేమి?
తెలియ జెప్పవమ్మ తెలుగు తల్లి!
(తెనుగు సందేశము)